# అమెరికన్ సాహిత్యం

మూలం: మార్కస్ కన్లిఫ్



అనువాదం: యస్. వి. జోగారావు

-యం. శేషాచలం & కో

# అమెరికన్ సాహిత్యం



ఇంగ్లీషు మూలం :
మార్కస్ కన్‌లిఫ్

అనువాదకుడు :
యస్వీ జోగారావు,
యం. ఏ., పిహెచ్. డి.
రీడర్, ఆంధ్రభాషాశాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.

MSCo
69

యం. శేషాచలం అండ్ కంపెనీ
మద్రాసు : మచిలీపట్నం : సికింద్రాబాదు

**AMERICAN SAHITYAM:** Telugu Translation of *The Literature of the United States* by Marcus Cunliffe. Translated by Dr. S. V. Jogarao, M.A., Ph. D. Published by M. Seshachalam & Co., Madras, Machilipatnam & Secunderabad. Price: Rs. 6-50.

First Edition:
December, 1964.

Cover Design: Gangadhar



Title: *The Literature of the United States*

Author: Marcus Cunliffe

Publishers: Penguin Books

ప్రథమ ముద్రణ : డిసెంబరు, 1964

ప్రకాశకులు :

యం. శేషాచలం అండ్ కంపెనీ

మద్రాసు : మచిలీపట్నం : సికింద్రాబాదు

వెల : రూ. 6-50

ముద్రణ :

క్రాంతి ప్రెస్

12, ఫ్రాన్సిస్ జోసఫ్ వీధి, మద్రాసు-1.



Regd. 212864

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు వారి
'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక
చందాదారులకు ప్రత్యేక ప్రచురణ.

ప్రాప్తిస్థానం :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు : : సికింద్రాబాదు

# పరిచయము

డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి
అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ.

అమెరికా సంయుక్త రాష్ట్రములు నాగరికతదృష్ట్యా నేడు అగ్రస్థానమును వహించి అనేకరంగాలలో ప్రపంచనాయకత్వమును వహించినవని చెప్పిన అతిశయోక్తి కాదు. పారిశ్రామికాభివృద్ధి, వ్యవసాయాభివృద్ధి వల్ల అపార ఐశ్వర్యమును గడించి అభివృద్ధిపొందుచున్న ప్రజాస్వామిక రాజ్యములకు ఎన్నో విధములైన సహాయ మొనర్చుచు మానవ కల్యాణమునకు సృషి సల్పుచున్నది. 400 సంవత్సరములనాడు సభ్యత ఎరుగని ఆదిమ మానవులచే నిండియుండిన అమెరికా ఇంతలో ఇంత శక్తిమంతమైన, సంపన్నమైన దేశము అగుట ఇతిహాసములో ఆశ్చర్యమును కలిగించు విషయమైనది. సహస్రాబ్దములుగా నాగరికతను అనుభవించుచున్న దేశములు వెనుకబడియుండుటయు, కొలదికాలము క్రిందట కనిపెట్టబడిన అమెరికా ఇంతటి ఉన్నతస్థితికి వచ్చుటయు గమనింపదగిన విషయమే.

కాని అమెరికన్ సాహిత్యము విషయము మనకు అజ్ఞాతముగా ఉన్నది. వారు ఇంగ్లీషు మాట్లాడేవారయ్యు ఇంగ్లీషు సాహిత్యము అన్నప్పుడు ఇంగ్లండులో జరిగిన కృషే మనకు జ్ఞాపకమునకు వచ్చుచున్నది. క్రమేణా ఇంగ్లీషు ప్రపంచ

ములో వ్యాప్తినంది, ఇంగ్లండులోనే కాక అమెరికా మొదలు ఆస్ట్రేలియావరకు ఇంగ్లీషునే మాతృభాషగా ఉపయోగించు కొని సాహిత్యాభివృద్ధికి కృషి చేయుచున్నారు. ఇతర దేశము లలో ఇంగ్లీషుసాహిత్యాభివృద్ధి ఎటుల జరుగుచున్నది మనము తెలిసికొనుట చాల అవసరము. ఆధునిక సాహిత్య వికాసములు ఏయే దేశములలో, ఏయే విషయములలో, ఎట్టి పరిణామ మును చెందుచున్నది తెలిసికొనుట అవసరమగుచున్నది. ఇంత ఐశ్వర్యమును అనుభవించుచున్న అమెరికాలో సాహిత్య కృషి యేమి? శ్రేష్ఠమైన రచయిత లెవరు? వారి కథావస్తువు ఎట్టివి? ఎట్టి సమస్యలు వారిని ప్రోత్సహించినవి? అను విషయ ములు స్థూలముగనైన మనము తెలిసికొనవలయును.

యూరప్‌లోని అన్ని దేశముల నుండియు కొన్ని వేల మంది, కొన్ని లక్షలమంది అమెరికాకు వలసపోయిరి. ఏ భాషకు చెందినవారైనను ఒకటి రెండు తరములలో స్వభాషను విస్మరించి ఇంగ్లీషుభాషనే తమ స్వభాషగా స్వీకరించిరి. నేటి అమెరికాసాహిత్యములో వెనుక యూరప్‌లోని ఎన్నో భాషల సంప్రదాయములు గర్భితములై యున్నవని చెప్పవచ్చును. అచ్చటి నాగరికతలో ఆఫ్రికానుండివచ్చిన నీగ్రోలును సమ్మి ళితమై కొన్ని క్లిష్టమైన సమస్యలకు కారణభూతులైరి. ఇట్టి సర్వసమ్మిళిత సభ్యతే అమెరికాది. ఒక అదృష్టము. సకల భాషాధారలు ఇంగ్లీషుభాషాకాసారములో కలిసిపోయి ఈషద్భిన్నమైన ఇంగ్లీషే అచటి భాషయైనది.

మనకు ఇంగ్లీషు రచయితలు తెలిసినంతగా అమెరికన్

రచయితలు తెలియరు. ఎమర్సన్, వాల్ట్ విట్‌మన్ మున్నగు రచయితల పేర్లు విన్నను వారి సమగ్ర వివరములు మనకు విదితములు కావు. 'అమెరికన్ సాహిత్యము' అను పేరుతో డాక్టరు జోగారావుగారు అనువదించి ఈ పుస్తకమును ప్రచు రించుచున్నందులకు మనము సంతసించవలసి యున్నది. అను వాదము చక్కగా, సరళముగా నడచినది. డాక్టరు జోగారావు గారి శైలి మూలములోని క్లిష్ట అన్వయములను తప్పించి తెలుగువారికి సులభముగ గ్రాహ్యమగునట్లు నడచినది. డాక్టరు జోగారావు ఆంధ్ర విశ్వవిద్యాలయము తెలుగు శాఖలో రీడర్‌గా పని చేయుచున్నారు. వారి గ్రంథములవల్ల ఇప్పటికే జోగారావుగారు ఆంధ్రులకు పరిచయస్థులు. వారు సాధించిన 'అమెరికన్ సాహిత్యము'నకు వారిని హృదయ పూర్వకముగ అభినందించు చున్నాను. ఈ గ్రంథము అమెరి కన్ సాహిత్యము యెడల శ్రద్ధాభిరుచులు కల్పించుటకు తోడ్పడగలదని విశ్వసించుచున్నాను.

ఇంకను ఇట్టి అనేక గ్రంథములు ఆంధ్రలో లభ్యమై మన మనోదిగంతములను విశాలమొనర్పగలవనియు నమ్ము చున్నాను. ఈ పరిచయ వాక్యములు వ్రాయుమని కోరి గౌర వించిన డాక్టరు జోగారావుగారికి నేను కృతజ్ఞుడను.

న్యూ ఢిల్లీ

బెజవాడ గోపాలరెడ్డి.

# అభినందనలు

—:०:—

డా॥ వి. వి. రాజమన్నారు

ఆంగ్లేయసాహిత్యానికీ, అమెరికన్‌సాహిత్యానికీ భాష ఇంచు మించు ఒకటే అయినప్పటికీ, ఐరోపాసాహిత్యంతో సన్నిహితసంబంధం ఉన్నప్పటికీ ప్రపంచసాహిత్యంలో అమెరికన్‌సాహిత్యానికి ప్రత్యేకస్థానం కలదు. దాని వయసు మూడువందల సంవత్సరాలే ఐనా పేరొకానతగిన రచయితలు అనేకు లున్నారు. వారిలో ఒక స్వతంత్రసరణి గోచర మవుతుంది—భాషలో, శైలిలో, వస్తువులో, దృక్పథంలో.

ప్రప్రథమంగా వలసవచ్చినవారు ఆంగ్లేయులే అయి నప్పటికీ తర్వాత ఇతరదేశాల్నించికూడా ప్రజలు వచ్చి అమెరికాను తమ స్వంత దేశంగా చేసుకున్నారు. వివిధ దేశీయుల సంస్కృతిసమ్మేళనమే అమెరికన్‌సంస్కృతిగా పరిణమించింది. అమెరికన్‌సాహిత్యం అమెరికన్‌సంస్కృతికి ప్రతిబింబం.

బ్రిటిష్‌పరిపాలనమూలంగా మన దేశంలో ఉన్నత విద్యాభ్యాసం చేసినవారికి ఆంగ్లభాషాజ్ఞానం, ఆంగ్లసాహిత్య పరిచయం కలిగినవి. కాని అమెరికన్ రచయితలలో ఏ కొందరి రచనలోతప్ప అమెరికన్‌సాహిత్య సంపద పూర్తిగా తెలియక

పోయింది. ఇక ఆంగ్లభాష ఎక్కువగా తెలియనివారి సంగతి చెప్పనక్కరలేదు. తెలుగు వారికి ఈ కొరత తీర్చడానికి కన్లిఫ్ వ్రాసిన అమెరికన్ సాహిత్య చరిత్రకు ఈ అనువాదాన్ని ప్రచురించడమైంది. ఇది ప్రశంసనీయమైన యత్నం.

సాహిత్యచరిత్ర రెండువిధాలుగా వ్రాయవచ్చు. రచయితల పేర్లు, వారి గ్రంథాలు, వాళ్ళనుగురించి ఏవో రెండుముక్కలు వ్రాయడం ఒక పద్ధతి—పట్టిక తయారుచేసి నట్లు. రెండో పద్ధతి ఏమిటంటే, వివిధసంప్రదాయాలకు ప్రతినిధులైన కొద్దిమంది ముఖ్యరచయితల మీదనే దృష్టి నిల్పి సాహిత్యపరిణామంలో వారి స్థానాల్ని విశదంచెయ్యడం. కన్లిఫ్ ఈ రెండోపద్ధతిని అనుసరించాడు. అదే ప్రశస్తమైన పద్ధతి.

స్వతంత్రంగా మాతృభాషలో వ్రాయడంకన్నా అన్య భాషలో వ్రాసిన గ్రంథాన్ని అనువాదంచెయ్యడం ఎక్కువ కష్టం. అయినా డాక్టర్ యస్. వి. జోగారావు ఈ కష్టమైన కార్యం జయప్రదంగా సాధించారు. వారు తెలుగులో పాండిత్యమేగాక ఇంగ్లీషుభాషాజ్ఞానంకూడా కలవారుగనుకనే అనువాదం తృప్తికరంగా ఉంది. మూలంలోని భావాలు చెడకుండా తర్జుమాచేశారు. వారిని అభినందిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని ప్రకటించడానికి పూనుకున్న యం. శేషాచలం కంపెనీవారు స్తుతిపాత్రులు.

2

## ఆచార్య డాక్టర్ శ్రీ కె. వి. ఆర్. నరసింహము

ఎమ్. ఏ., పిహెచ్. డి.

ఆంధ్రభాషాశాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.

మా జోగారావుగారి అనువాద పద్ధతి పద్ధతిగా నున్నది. ఉదాహరణ పరిభాషానువాద ఫక్కీ-గూడ నిక్కచ్చిగా, నిపుణముగా, నిసర్గమనోజ్ఞముగా నిర్వహింపబడినది. రచన చతురముగా సాగినది. సాహిత్యగ్రంథపు హుందాకు తగినట్లు పకడ్ బంద్‌గా పసందుగా నున్నది.

అతనికి నా మంగళాశాసనములు.

# నివేదన

అమెరికన్ సాహితీప్రస్థానమును చక్కగా చిత్రించిన గ్రంథా లలో శ్రీ మార్కస్ కన్‌లిఫ్‌గారి యీ గ్రంథం రచనలో, ప్రణాళికలో, విమర్శనవిధానంలో పరమరమణీయమైనది. ఈ గ్రంథరాజాన్ని అనువదించే అవకాశం నాకు కలిగించిన మిత్రులకు, అమూల్యములైన పరిచయ వాక్యములను, అభిప్రాయములను ప్రసాదించిన ప్రౌఢసాహిత్య ప్రాడ్వివాక ప్రవరులు డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి, డాక్టర్ శ్రీ పి. వి. రాజమన్నారుగారికి, ఆచార్య డాక్టర్ శ్రీ కె. వి. ఆర్. నరసింహముగారికి నా కృతజ్ఞతా సహకృతానేక సాధువాదములు.

ఈ గ్రంథాని కింత యందము నచ్చుబోసిన ప్రసిద్ధ గ్రంథ ప్రకాశక సంస్థానులు శ్రీ యం. శేషాచలం అండు కంపెనీ వారికి నా అభినందనవందనములు.

ఈ నా అనువాదము ఆ సంస్థవారు కోరినట్లు 'స్వచ్ఛంద శైలి' (Free Style) గలది. అయితే మూలము మీదు కట్టిన మూదలగా అభిప్రాయవిధేయుడనై అనువాద సంప్రదాయపు ముడుపు చెల్లించుకోగలిగాననే అనుకొంటున్నాను. పరిశీలనపై సహృదయులు గూడ ఇలా భావించ గలిగితే నా కృషి కది కృతార్థత. వారికి నే కృతజ్ఞుడను.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు,
వాల్తేరు,

యస్వీ జోగారావు.

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

ఒక పెద్ద విషయం గురించి చిన్న పుస్తకంగా ఇందులో కొన్ని సాధకబాధకా లున్నాయి. పేర్కొనడానికి తగిన అమెరికన్ రచయితలు చాలామందే వున్నారు. కాని వాళ్ళందరి గురించీ ఊరికే ఒక పట్టిక తయారుచేసి ఏవో రెండు ముడిముక్కలు చెప్పి వూరుకోవడ మన్నది సరి కాదు. 'ఆక్స్‌ఫర్డ్ కంపేనియన్ ఇన్ అమెరికన్ లిటరేచర్' అన్న పుస్తకం అలాంటి దానికి మరీ బాగా పనికివస్తుంది. నేను ముఖ్యంగా కొద్దిమంది రచయితలమీదే నా చూపు కేంద్రీకరించాను. అయితే వీళ్ళు మాత్రమే ఘనులు, తక్కినవాళ్లు కారు—అనికాదు నా వుద్దేశం. వీళ్ళు విశిష్టులు, కొన్ని తరహాలకు తగిన ప్రాతినిధ్యం వహించగలరు అనిమాత్రమే. అంచాత థామస్ జెఫర్సన్, ఫిలిప్ ఫ్రెనేవ్, విలియమ్ కల్లెన్ బ్రయంట్, బయర్డ్ టైలర్, జాన్ జి. విట్టియర్, అప్టన్ సింక్లెయిర్, ఎడ్నా సెంట్ విన్సెంట్ మిల్లే, ఎల్లెన్ గ్లాస్గో, కోన్రాడ్ ఐకెన్ మొదలైనవా రెందరో ఉపేక్షింపబడ్డారు. ఏమైతేనేం, ఈనాటి అమెరికన్ సాహిత్య చరిత్రల సంప్రదాయం ప్రకారం రచయితల నెన్నుకోవడంలో నే నొక సమయం చేసుకున్నాను. అందుకు తగినట్టే వారివారికి స్థలనిర్ణయం చెయ్యడం జరిగింది.

ఇక్కడ మరో చిక్కు వుంది. అమెరికనయితే నా పథకాన్నీ, నా మాటల్నీ ఒక సిద్ధమైన మంచి పద్ధతికి చెందినవిగా గ్రహిస్తాడు. కాని అదే నా ఆంతరంగికమైన ఉద్దేశాలను ఆమోదించడానికి సిద్ధంగా లేని ఆంగ్లేయ

పాఠకుడికైతే అవి కాస్త విడ్డూరంగా కనిపించవచ్చు. ఈ ఉద్దేశాల్లో మొట్టమొదటిది ఇంగ్లీషు, అమెరికన్ సాహిత్యాలు—ఈరెండింటియెడలా తగిన విచక్షణ చూపగలిగివుండడం. కాని ఒకసారి మేథ్యూ ఆర్నాల్డు ఏమనుకున్నాడంటే, "నేనోసారి 'అమెరికాసాహిత్యపరిచయపుస్తకం' అని ఒక పుస్తకంగురించి ప్రకటన చూశాను. నాకేమనిపించిందంటే—మేసిడోనియా సాహిత్యం అనే పేరుతో అలాంటి ఒక చిన్నపుస్తకం గురించి అలెగ్జాండరో, ఫిలిప్పో వింటే ఏమనుకుంటారో వూహించండి... మనమంతా ఒకే ఒక మహావాఙ్మయానికి ఋత్విక్కులం. అదే ఇంగ్లీషు వాఙ్మయం."

ఇది డెబ్భైయేళ్ళనాటి మాట. అప్పుడూ ఆర్నాల్డు తెచ్చిన సామ్యం సమంజసంగా లేదు. ఆమాటకు వస్తే అసలు సాహిత్యమంతా ఒక్కటే. ఎవరికీ తప్పనిసరియైనభాషాసాధనంద్వారా రచయితలు పరిశ్రమించే విశ్వజనీనక్షేత్ర మది. కాని ఇంగ్లీషుసాహిత్యంగురించి మాట్లాడుతూ ఆర్నాల్డు అన్నట్లుగా భాషఅన్నది కొన్నిభాషల సంపుటి. వాటికీ, జాతులకూ లంకె. ప్రత్యేకం తమ దనిపించుకొనే భాష లేని జాతులు ఏదో ఒక భాషకి పునర్భవమేనా ఇస్తాయి, లేక సరిక్రొత్తగా సృష్టియినా చేసుకొంటాయి. వాటి ప్రయత్నానికీ, కేవలసాహిత్యానికీ (అలా అనిపించుకునేదంటూ ఒకటి వుంటే) సంబంధం లేదు.

అయితే ఆ ప్రయత్నం ఎలాంటిదంటే ఒకడు పాత సూటుకేసును పారేసి అందులోని చిల్లరవస్తువుల్ని చేతపుచ్చుకొని చాలా దుకాణాలు మూసేసిన తరువాత కొత్త సూటుకేసు కొనాలని వీధులంట తిరగడంలా నిష్ప్రయోజనమూ, హాస్యభాజనమూ అయింది. తక్కిన యూరపువాసులందరికన్నా ఆంగ్లేయులు మాత్రం తామెంత సామగ్రి పోగుచేసుకొని పొదుపు చేసుకొన్నా అమెరికనుల భాషాస్థితియెడల ఎక్కువగా నిర్దాక్షిణ్యం ప్రకటిస్తూవచ్చారు. దగ్గరివారియెడలమాత్రం అలా వుండదు. (ఆర్నాల్డే మనకు తార్కాణం. అచ్చమైన ఇంగ్లీషుకన్నా మాండలికమే బాగా కైవసమైన బర్న్సుకవియొక్క భాషాసమస్యలగురించి, పాపం, చాలా సానుభూతి చూపిస్తాడాయన). అమెరికనులకు తగిన సాహిత్య

వాహిక నేర్పరచుకోవడం క్లిష్టమైపోయింది. ఈ విషయాన్ని ముందుగా గుర్తిస్తేకాని అమెరికన్ సాహిత్యాన్ని అవగాహనచేసుకోవడం దుర్ఘటం అవుతుంది. ఐరిష్‌వారుమాత్రం అమెరికనులతో మంచి పొత్తు కలిసిన వారిలా వుంటారు. కారణం ఐర్లండులో సగంమంది సంయుక్తరాష్ట్రాలకు వలసపోయినవాళ్ళు అన్న మాట అలా వుండగా, ఆ రెండు జాతులకీ రాజకీయంగా నైతేనేమి, సాంస్కృతికంగా నైతేనేమి లండను పెత్తనమంటే యేమిటో బాగా తెలుసు.

ఈనాడు ఆంగ్లేయపాఠకుడు అమెరికన్ సాహిత్యం అంటూ ఒకటి ఉన్నదనే నా ఊహను అంగీకరించవచ్చు. ఐరిష్ రచయితల లాగే అమెరికన్ రచయితలుగూడ తమ కలగలుపు వారసత్వంతో చక్కగా నిర్వహించుకు వచ్చారని ఆమోదించనూవచ్చు. అయితే ఇంకా అతడు పరిశుద్ధమైన సాహిత్యపు విలువలగురించి (అంటే తమవారినే నన్నమాట) వాటికేదో ముప్పు మూడినట్లు ఆరాటపాడుతూ, అమెరికన్ సాహిత్యంలో అమెరికన్ గుణవైశిష్ట్యం ఉద్ఘాటింపబడినకొద్దీ ఒక సాంస్కృతిక పక్షపాత ప్రత్యవాయం ప్రబలిపోయేప్రమాదం వుందని ఒక ఆరోపణ కూడా చేయవచ్చు. అమెరికనులు 'అమెరికన్ హాస్యం,' 'అమెరికన్ ప్రజాతంత్రం' అంటూ ఇలాగ అవేవో తామే కనిపెట్టినట్లూ, అదేదో తమ ప్రత్యేకత అయినట్లూ బాకా వూదుకుంటూవుంటారనికూడా అతడు వాదనకు తలపడవచ్చు. తమ దోషాలు అంటే హేతువాద విప్రతిపత్తి, వ్యాపారదృష్టి మొదలైనవాటిగురించికూడా (ఇవి ఆంగ్లేయులకూ స్వాభావికాలే) అమెరికను లలాగే చేస్తారని అత డనుకోవచ్చు. ఈ సందర్భంలో నేను నా ఊహలోని ఆంగ్లపాఠకుడితో కొంతవరకు ఏకీభవిస్తాను. అమెరికా సాహిత్యచరిత్రకారులు ప్రాముఖ్యాన్ని అసాధారణత్వం అనుకొని అపోహపడి, బహుశా సజాతీయ విషయాల్లో చాలా సంకుచితభావనకి పాల్పడతారనుకొంటాను. వారు తమ సాహిత్యంగురించి ఊరికే అతిశయంగా పొగుడుకొంటారు. గోరంతలు కొండంతలు చేస్తారు. (అస లందుకు వాళ్ళ పట్టపరీక్షాపాఠశాలపద్ధతి కొంత అధిక్షేపణీయంగా వుంది. దానికి కావలసిన ముడిసరుకు ఇంతా అంతా కాదు. దాని డిమాండుకు ఎంత సరఫరా

చేసినా చాలటం లేదు. పట్టి చచ్చువ్యాసకర్తలూ, ఉప్పూ పత్రీ లేని కవులూ డాక్టరేటు థీసిస్సులకు విషయప్రదాతలుగా చలామణీ అయిపోతున్నారు. పరాసు - ప్రష్యాయుద్ధంలో పేరిస్ ముట్టడి సందర్భంలో ఎలకలూ, పిచ్చికలూ ఆహారపదార్థాలుగా పరిగణింపబడినట్లు) ఆత్మీయసాహిత్యశ్లాఘాడంబరం నుంచి అమెరికను లంతశోచనీయంగాను, అనుకరణపూర్వకంగాను పరప్రత్యయానేయ బుద్ధిత్వం వేపు మొగ్గిపోతారు, పాపం. కాని ఆంగ్లేయులు మాత్రం తమ సాహిత్యప్రశంసలతో కొంత మడికట్టుకున్నట్లు వుంటారు. అయితే, తమ కేమంత పెద్ద షరపతిలేతి ఏసంగీతమో, చిత్రలేఖనమో లాంటివిషయాల్లో మాత్రం ఉన్నంతమట్టుకు తమ సరుకు గురించి డాబులు కొట్టడమో, ఖండాంతర రాష్ట్రీయులవి అనుకరించడమో చేస్తారు. పేరిస్‌లోనే పురుడుపోసుకున్నట్లున్న ఎన్ని ఆంగ్ల చిత్రలేఖనాలను చూశాము కాదు! అయితే అవన్నీ ఆంగ్లసంప్రదాయానికి చెందినవే అని ఎన్ని వ్రాతలు చదివాము కాదు!

కాగా, అమెరికన్ సాహిత్యం గురించి చెప్పడమంటే అదేదో సనేమిరా యూరపుసాహిత్యస్వరూపంతో పోలికలేమీ లేనిదని ఉద్ఘాటించడం కాదు. స్థూలంగా చూస్తే అమెరికా, యూరపూ ఒక్క త్రాటిమీద నడుస్తాయి. ఎప్పుడన్నా సరే దారినపోయే దానయ్యకూడా రెండు చోట్ల శిల్పరీతుల్లో పరిధాన విధానంలో, అలమరాల్లోని పుస్తకాల్లోనూ అంతా సమానత్వమే చూడగలడు. ఒకప్పుడు కాస్త ఆలస్యంగా నైతేనేంగాక, భావాలు మనుష్యుల్లా, వ్యాపారంలా అలవోకగా అట్లాంటిక్ సముద్రాన్ని దాటివేశాయి. అమెరికన్ అలవాట్లు, అమెరికన్ భావాలు అని అనడం ఎందుకంటే అమెరికాకూ, యూరపుకీ-ముఖ్యంగా ఇంగ్లండుకూ ఏ కొంతో భేదం వుందని చూపించడానికే. ఆ భేదమన్నది చాలా సున్నితమైనదే; కాని అమెరికా వేపు నిదానించే ఆంగ్లేయుడిని ఆశ్చర్య చకితుణ్ణి చేస్తుంది. ఆ నిదానించడం అనేక ముఖ్య విషయాల్లో తన దేశంతో సాజాత్యం కలిగి వుంటూనే విజాతీయంగా కనిపించే మరో దేశాన్ని చూడటమే అనిపించుకుంటుంది. అందులో ఉభయత్ర కొన్ని మరీ వింత వింత కలగలుపు పొత్తులూ

వున్నాయి. కొన్ని ఎందుకూ పొందని విడ్డూరాలూ వున్నాయి. చూస్తూ వుండగానే చుట్టరికం పాత్తర్లుచ్చుకున్నట్టుంటాయి. వీథిలో ఒకాయన పోతూ వుంటాడు. పరాకున మనవాడేమో అని కేక వేస్తాము. వాడు నిర్ఘాంత పోతాడు. వెంటనే గ్రహిస్తాము-మనం పొరపాటున ఒక అపరిచితుణ్ణి మిత్రుడిగా భ్రాంతిపడి పలకరించామని. అదిగో అలాగే ఇదీను. అంటే ఆంగ్లేయామెరికనుల భావబాంధవ్యం.

అమెరికన్ సాహిత్యం చదివేటప్పుడు ఆంగ్లేయ పాఠకుడికి రెండు మార్గాలు అవలంబనీయాలు. ఆంగ్లేయుడిని అన్న అతిశయం తగ్గించుకొని, సాంప్రదాయికమైన నిర్లక్ష్య భావాన్ని ప్రక్కకు నెట్టి తన అనుభూతిలోనూ, అమెరికన్ అనుభూతిలోనూ సామ్యదర్శనం చెయ్యాలి. నా లాగ పారిశ్రామికమైన ఇంగ్లండు దేశంలో వున్నవాళ్ళకది సుసాధ్యం. పొగ చూరిన ఉత్తరప్రదేశంలో కర్మాగారాల మరుభూముల్లో కొటికొంపల్లో గతచరిత్ర జ్ఞప్తిలేక అనతికాలంలో మరో యింటికీ, మరో ఊరికీ మారుతూ, క్రొత్తగా కనిపించినా ప్రాచీన చరిత్ర గలిగి ఒక పట్టణమనిగాని, పల్లెఅనిగాని అనిపించుకోని గనులూ కార్ఖానాలూ కొలువు దీర్చిన వట్టి చిత్తడి వీళ్ళలో కనుచూపుమేర ఆవులించిన చలిప్రదేశాల్లో నివసిస్తున్న లక్షలాది జనానికి వున్న కాలమాన నిబద్ధత, ప్రేమానుబంధాలు లేని అందమంటే తెలియని వట్టి చప్పిడి బ్రతుకుల్లోని భావచైతన్యమూ క్రిస్మస్ పత్రికల్లోంచి ఊహకు తగిలే ఇంగ్లీషు వారి అనుభవానికి కన్న అమెరికన్ అనుభవానికి సన్నిహితమైనవి. ఇది గుర్తించిన ఇంగ్లీషు చదువరి ఒక ఆర్నాల్డు బెన్నెట్టు సాహిత్యాన్ని ఎంత అనుభవించి ఆనందించగలడో థియోడర్ డ్రెయ్‌జర్ నవలల్లోని పరమార్థాన్ని అంతగానూ అనుభవించి ఆనందించగలడు.

కాని ఆ అనుభవం బాగా ఒంటబట్టాలంటే అతడు వాళ్ళ విజాతీయతను గ్రహించాలి. అదీ ఒక గుణమే అని గుర్తించాలి. అప్పుడూ అమెరికన్ రచనలను బాగా అభినందించ గలుగుతాడు. డ్రెయిజర్ కంటె అమెరికన్ తనం బాగా తక్కువైన హెన్రీ జేమ్సు, టి.యస్. ఇలియట్‌ల విషయంలోనూ ఈ సూత్రమే వర్తిస్తుంది. వాళ్ళ స్వస్థానాదుల

గురించి అట్టే తెలుసుకో నక్కరలేకుండానే వాళ్ళను అర్థం చేసుకో వచ్చు. అలాంటి రచయితల విషయంలో వాళ్ళ జాతీయత గురించి నా కేమీ పట్టింపులు లేవు. నా పరిగణన స్వచ్ఛందమైనది. అందుకే ఇలియట్ కీ పుస్తకంలో అట్టే చోటు చెయ్యలేదు. ఇప్పటికే ఆయన అట్లాం టిక్ పూర్వభాగంలో సుప్రసిద్ధుడు. అమెరికానుంచి పరసీమలకు వచ్చి వేసిన రచయితల అమెరికన్ వారసత్వం గురించి తెలుసుకుంటే వాళ్ళొ క్కొక్కరే బాగా అర్థం అవుతారనీ, కాగా అమెరికా సాహిత్య స్వరూపం సమగ్రంగా బాగా గోచరిస్తుందనీ మాత్రమే నా ఆశయం.

అదే భంగ్యంతరంగా చెప్పాలంటే అమెరికన్ సాహిత్యం పరిచితా పరిచితాల సమ్మేళనం అనాలి. అమెరికా అంటే యూరపుయొక్క విస్తృతియే అన్నమాట. అక్కడి ప్రజ లెక్కువగా ఐరోపీయ సంతతి వారే. బలవంతంగా ఆఫ్రికానుంచి వలసవెళ్ళిన నీగ్రో బానిసల సంగతి వేరు. అయితే వాళ్ళ వల్ల అమెరికన్ సంఘంలో పరిణామాలు మాత్రం కలిగాయి. కాని సంయుక్తరాష్ట్రాలు ఏర్పడ్డానికి ఐరోపీయమైన, ముఖ్యంగా ఆంగ్లేయమైన సంస్కారమే పునాది. సంస్కృతి దృష్ట్యా అమెరికా అంటే ఒక యూరోపియన్ వలసయే అనాలి. అంటే అమెరికాయొక్క వైవిధ్యాన్ని గుర్తించినట్టే. మరేవలసలోనూ, ప్రజల్లో ఇంత సాంకర్యం ఏర్పడలేదు. మరేవలసా యూరపునుంచి ఇంతకాలంగా రాజకీయ స్వాతంత్ర్యం కలిగి వుండలేదు. యూరపు సంస్కృతి పాదునుండి రూపుగై కొన్న మరేదేశమూ ఇంతగా తన భిన్నత్వం గురించి, తన ఘనత గురించి తగిన యెఱుక కలిగి వుండలేదు. అంచేత అమెరికన్ చరిత్రను, అమెరికన్ సాహిత్యాన్ని తెలుసుకోవడమంటే అటు ప్రాచీన ప్రపంచపు రీతులూ, ఇటు నవ్య ప్రపంచపు టవకాశాలూ రెండిటిని తెలుసుకోవడమే. గతం గురించి తృణీకార భావం, బెంగా కలిగాయి. భవిష్యత్తుకి స్వాగత మివ్వడం జరిగింది. కాని భయం రేకెత్తింది. సాహిత్యోత్పత్తి కది తగిన పరిస్థితి కాదు. అమెరికన్ రచయిత అమెరికన్‌గా యూరపుపై అవి శ్వాసం ప్రకటించాడు; రచయితగా ఐరోపియన్ రచయితల కున్న అవ కాశాల కసూయపడ్డాడు. అయితే ఇది సర్జనాత్మకమైన సాహిత్యం

విషయం. చాలా కాలంగా సంయుక్త రాష్ట్రాల్లో నవల, పద్యకావ్యం, నాటకమూ-ఇవే ఉట్టి గట్టుకొని వుంటూ వచ్చాయి. క్రమంగా అమెరికన్ లేఖినులనుంచి విమర్శ, చరిత్ర, తత్త్వ విచారణలకు సంబంధించిన రచనావాహిని బాహాటంగా ప్రవహించసాగింది. దీనికి కారణ మేమిటో బహుశా క్రమంగా నా రచనాధోరణిలో బాహిరిల్లుతుం దనుకుంటాను. 'న్యూ ఇంగ్లండు' వలసయొక్క 'కాల్వినిజమ్‌కీ', దీనికీ కొంత సంబంధం వుంది. మరికొస్త పెద్ద సందర్భాల్లో అసలు వలస వలసంతతికీ సంబంధం వుంది. అమెరికాకు వలస వెళ్ళిన వాళ్ళంతా ఏవో ఉదాత్తములైన నిమిత్తాలు వుండి వెళ్ళినవారు కారు. ఆ మొదటి రోజుల్లో మతంకన్నా వ్యాపారానికి వున్న ఆకర్షణవల్ల కొంద రక్కడ స్థిరపడి పోయారు. 19-వ శతాబ్దిలో కొందరు తమ మాతృదేశంలో వుంటే యుద్ధాల్లో పాల్గొనవలసిన అక్కర వచ్చిందని అది తప్పించుకోడానికి వలసలు తీశారు. ఏమైతేనేం, మొత్తం మీద అదంతా అమెరికావాసుల పాలిటి కొక గొప్ప పౌరాణిక ప్రాముఖ్యంలా పరిణమించింది. వాళ్ళు తాత్కాలికంగా వలస వెళ్ళిన వా రనిపించుకుంటేనేం, స్థిరనివాసకాంక్ష గలవా రనిపించుకుంటేనేం, పాపం, కఠిన ప్రస్థాన ప్రారంభకులు వారు అని అన్నారు థియోడర్ రూజ్‌వెల్టు. ఆ రోజుల్లో ఒకడు తానూ, తన కుటుంబమూ సముద్రం మీద శాశ్వతంగా మరోచోటికి తరలి వెళ్ళిపోవడ మంటే అది సామాన్యపు పని కాదు. అది యేదో ఒక ఆశకోసం చేసే సాహసం. ఒక పురాణ ప్రారంభంవంటిది. వెనకటిగాథల్లో చూసుకుంటే యూరపుఖండానికి సంగీతంలో కవాతుచేసే ఆంగ్లసైనికులతో పొలం ఎటుందో తెలీని భూమిఖామందులతో, ఆభిజాత్యగర్వము, ఆకలి, దారిద్ర్యము, హింస— వీటితో కూడిన గతంతోనే ఎక్కువ అనుబంధం. మరి అమెరికాకో— భవిష్యత్తుతో, సమృద్ధితో, శ్రేయస్సుతో, స్వేచ్ఛతో. నేడుకూడా భవిష్యత్తంటేనే అమెరికాకు నచ్చిన కాలం. 27-7-1952 'న్యూయార్కు టైమ్సు' మేగజైన్‌లో ఒక రచయిత అమెరికనుల నుద్దేశించి 'ఎంత వున్నా మన మింకా వసంతం ప్రారంభంలోనే వున్నాం, ప్రాతఃకాలపు ప్రాంగణంలోనే వున్నాం' అన్నాడు. అదే యూరోపియన్ రచయిత

అయితే అలాంటి ఉపస్స్వరాన్ని ఆలపించ లేదని నా అనుమానం. ఇంగ్లండులో గతించిన ఎలిజబెతెన్ యుగం లాంటిదే మరో ఎలిజబెతెన్ యుగం అవతరించడమే గొప్పగా భావింపబడుతుంది. చరిత్రనుబట్టి అమెరికా ఎప్పుడూ ఎడతెగని కృషి చేసే దేశమనీ, అది ప్రాతను సంరక్షించుకోవడంలో కన్న క్రొత్తదానిని కనిపెట్టడంలో ఆసక్తి చూపుతుందనీ తెలుస్తుంది. అక్కడి జను లెప్పుడూ మంచి ఆశావాదులు. ఆటంకాల నధిగమించగల వ్యక్తి శక్తిమీద ప్రధానంగా ఆధార పడతారు.1

ప్రతివ్యక్తికీ కృతార్థతను ప్రతీక్షించే హక్కు వున్నది. 'ఆత్మ విశ్వాసం' అనే తన వ్యాసంలో ఎమర్సన్ ఒక అద్భుతమైన మాట అన్నాడు: "తమకు ఒక విందుభోజనం తప్పక లభించే అవకాశం గల కుర్రవాళ్ళు ఎంత నిశ్చింతగా వుంటారో అలాంటి నిశ్చింత ఏర్పడగలిగితే అదీ మానవస్వభావానికి ఆరోగ్యకరమైన భావస్థితి." మెల్విల్లీ అంటాడు - ప్రజాయుద్ధంలో పడి చెడిపోయిన అమెరికన్ గూడా తనగురించి "స్వభావసిద్ధంగా రోమన్ అయినవాడు శిక్షార్హుడు కాడు." అనుకొంటాడని. అయితే మెల్విల్లీ అభిప్రాయం కంటె ఎమర్సన్ అభిప్రాయమే అమెరికాలో బహుజనామోదం పొందింది. ఆ 'ఆరోగ్యకరమైన భావం' యొక్క రకరకాలైన పరిణామా లేమిటో చూద్దాం. పెద్దపెద్ద ఆశలు పెట్టుకుని అన్నిటికీ ఏవో విఘాతాలు కలిగి నప్పుడు ఎంత గుండెనిబ్బరం గల మనిషినీ అవి కరాళనైరాశ్యంలోకి కూలదోస్తాయి. ఆశావాదం, నైరాశ్యం—రెండూ చిత్రంగా పెనవేసుకు

---

1 F.O. Matthiessen—'Amerian Renaissance', New York and Oxford, 1941, 5-6 లో ఇలా అన్నారు:

'Individualism' అన్న మాటకు ఉపయోగం మొట్టమొద టగా Alexis de Tocqueville's Democracy in America అనే పుస్తకంయొక్క ఆంగ్లానువాదంలో కనబడుతుంది. అదో సరిక్రొత్త పరిస్థితిని సూచించడానికి తయారుచేయబడింది.

పోతాయి, అమెరికన్ రచనలలో. మార్క్‌ట్వెయినే తగిన దృష్టాంతం. ఒకప్పుడలా దెబ్బతిన్న ఆశావాది తానొక ప్రభుత్వవిరోధిగా, శూన్యవాదిగా ఒక ప్రొమిథ్యూస్ (స్వర్గంనుండి అగ్నిని దొంగిలించినవాడు)గా మారిపోతాడు. ఇక్కడ మనకు థోరో ('I am not the son of the engineer'), రాబిన్సన్ జెఫర్స్ ('Shine, Perishing Republic'), ఎర్నెస్ట్ హెమింగ్‌వే ('There was a war but we did not go to it any more'), విట్‌మన్, థామస్ వుల్ఫ్, హెన్రీ మిల్లర్ మొదలైన రచయితలు కొందరు జ్ఞప్తికి తగులుతారు. అంతే కాదు. హేతువాదవాతావరణంలో ఏమాత్రం మార్పు వచ్చినా అమెరికన్ రచయిత దెబ్బతినడంకూడా చూడగలం. గడచిన అర్థశతాబ్ది లోను ప్రతిదశాబ్దానికీ అతడు తన మనస్సు మార్చేసుకుంటూ వుండడం జరిగింది.

ఈ విధంగా అమెరికన్ రచయిత సంఘానికి బైట నిలబడగలుగుతున్నాడు. అసలా సంఘమే ఒక అతుకులబొంతలా వుండటంచేతను, దాని పరిణామమే నీరుగారుతూవుండడం వల్లనూ అదే అతనిని అంటిపెట్టుకునివుండలేక పోతోంది. అతనికి సమాజ మంటే ఒక సామాన్యమైన, ప్రత్యేకమైన భక్తివుండాలని భావింపబడేదికాని సన్నిహితమైన అనుబంధాలెప్పుడూ మృగ్యమే. హాథార్న్ విషయంలో లాగ నవలారచయితకు సమాజంయొక్క నిస్సారవత్వంవల్ల తీవ్రసమస్యలు కలుగుతూవుండేవి. అంటే అతనికి వ్రాయడానికి తగిన నిర్మాణసౌష్ఠవం గల సమాజం లేకుండాపోయింది. ప్రాయశః అంతకంటె ప్రముఖమైనది - తన రచనకి తగిన పాఠకవర్గాన్నిగురించిన తాత్పర్యంకూడా వుండేది కాదు. అమెరికన్ రచయితలకు తమ జాతీయతావైఖరిని నిరూపించుకోవడం కష్టసాధ్యంగా వుండేది. అయితే చాలామందికి మాత్రం మనస్సులో అమెరికాగురించి ఏమేమి ఊహ లుండేవో గాని అన్నిదేశాలకంటెగూడ అదే ఒక గొప్ప పుణ్యభూమి అని నమ్మేవారు; నమ్ముతున్నారుకూడ. అక్కడ పౌరు లొక గొప్ప సమతను సాధించారు. ఒక్క నీగ్రోవారు తప్పితే, అందరూ ఒక్క త్రాటిమీద నడిచేవారు. అయితే రచయితకు కావాలనిపించే ఆదరణతో,

అభిరుచియొక్క ఆధిపత్యంతో సాంఘికమైన సమత్వాన్ని ముడిపెట్టడమెలాగు? ఇది అమెరికాకుమాత్రమే పరిమితమైన సమస్య కాదు. అయితే ఒకవంక తమ రచనలు జనసామాన్యంయొక్క పరిహాసానికి గురిఅవుతున్నా ఒకవంక ప్రజాప్రభుత్వ మంటే మక్కువపడే అమెరికన్ రచయితలకు మాత్రం ఆ సమస్య చాలా గడ్డుగానే వుండేది. హెర్మన్ మెల్విల్లీ తన 'వైట్ జాకెట్'అన్న నవలలో " 'పబ్లిక్' వేరు, 'పీపుల్' వేరు; పబ్లిక్‌ను మనం అసహ్యించుకోవచ్చు, ప్రజలతో కలియొచ్చు" అని ఒక పరిష్కారం సూచించాడుగాని అది పాఠకుడిని సంతృప్తిపరచినపాటిగూడా అతనినే సంతృప్తిపరచలేకపోయింది. మెల్విల్లీలాంటి మనుష్యులు తామేదో లోకం పీడకు గురిఅయ్యామని అనుకోవడమే కాదు, సామాన్యప్రజల్లో తమ సౌమనస్య భాగస్వామిత్వాన్నిగూడా గుర్తించారు.

19వ శతాబ్ది బ్రిటనులోనూ, అమెరికాలోనూ ఒక ఔపదేశికమైన శకము. అమెరికాలో నవలారచన ఆ దారిన పడటానికి తగివుండడమే కాదు, బానిసతనాన్నీ, త్రాగుడునూ కాదనడాన్ని మించిపోయిన ఒక నీతిప్రవచన పద్ధతి ప్రబలింది. ఈనాడావిషయంలో సంయుక్తరాష్ట్రాలకూ సోవియట్ రష్యాకూ మధ్య సామ్యాలు చూపించే తెలివితక్కువ ఆచారంగూడా ఒకటి ఏర్పడింది. అయితే ఒక శతాబ్దిక్రిందటి అమెరికాపరిస్థితికీ, ఆధునికమైన—అంటే 1920 ప్రాంతపు రష్యాపరిస్థితికీ పాక్షికమైన సామ్యం మాత్రం లేకపోలేదు. ఆ పరిస్థితులు రెండూ సరిక్రొత్త మౌలికప్రయోగ ఫలితాలు. అవి వినాశకరాలనీ, కనీసం వాటి పిడివాదపు ధోరణులను బట్టి అసహ్యకరాలనీ ఇతరదేశాలవారు భావిస్తూవచ్చారు. ఆ దేశాలవారంటే వీరికి పడదు. వారి పద్ధతులను వీరు నిరాకరిస్తూవచ్చారు. మూల సంస్కార సిద్ధాంతవాదులకు తమ ఘనతను చాటి చెప్పుకోవడానికి పోటీగా ఎదుటివారి పద్ధతులలోని చెడును ఎత్తిచూపడం అవసరమవుతుంది. రష్యాదృష్టిలో పెట్టుబడిదారీవిధాన మొక గొప్ప దుర్మార్గము. అమెరికాదృష్టిలో యూరపు అంతే. అయితే రష్యా అమెరికాలు తమ చిరవాంఛాసిద్ధికోసం భవిష్యత్తువేపు ఆశగా చూశాయి. రెండుచోట్లా రచయితలకు తమ దేశంయొక్క, లేక అసలు మానవస్వభావంయొక్క

లోపాలగురించి లాభంలేని దేవులాట దేవులాడక తమ తమ ఆదర్శవాదాలు, సత్వరవిజయం సాధించేటట్లు చెయ్యడమన్న దొక నైతికమైన బాధ్యత అయింది.

ఈ దృక్పథమే అమెరికాసాహిత్యాన్ని ప్రభావితం చేసింది. "పడగొట్టకు, పైకెత్తు" అన్న దొక గొప్ప వ్యాపారనినాదంవంటిదే అయినా అది ప్రభుత్వదృక్పథం. బలవంతం కాదుగాని, దాని ననుసరించడం రచయితకు తప్పనిసరి బాధ్యత అయింది. 'అమెరికన్' అన్న మాట, కాస్తో కూస్తో 'నీగ్రో' అన్న మాటలాగే దానికున్న అర్థాలన్నిటితో ఒకదారిన పడింది. అయితే అమెరికా అంటే ఏమిటో అర్థంకాని యూరోపియనులకేగాక అసలు అమెరికనులకే కొందరి కింకా తెలియజెప్పవలసివున్నది. ఆదర్శాలతో బయల్దేరిన సంఘ మది. అయితే ఆదర్శాని కొకప్పుడు వాస్తవికతవల్ల వ్యాఘాత మేర్పడేది. ఆదర్శమూ, వాస్తవికతా ఒకదానితో ఒకటి ముడిపడడం తప్పనిసరి అయింది. సాహిత్యపరంగా చూస్తే అమెరికన్ నైతికదృక్పథ మన్నది విధిగా జరగదగినదానికీ అసలు జరిగేదానికీ అతికితే కతకని, కతికితే అతకని అనుబంధంగా తయారయింది. తత్ఫలితంగా, అమెరికన్ రచయిత ఏకాంతత కలవాటుపడినవాడైనా, అమెరికన్ సాహిత్యంలోమాత్రం గోప్యత, మార్మికత అనిపించుకునే పదార్థం చాలా తక్కువైపోయింది. (ఆధ్యాత్మికత లేనిదైనాసరే; అమెరికన్ కల్పనతో పాటు మతాని కొక గొప్ప ప్రాముఖ్యం వుంటూ వచ్చింది) ఊహాగతమైన దెంత ఉత్కృష్టమైనదైనా కార్యశూరులచేత అది నిరాకరింపబడుతుంది. అమెరికా అధ్యక్షునివంటి అమెరికన్ భవిష్యద్ద్రష్టకు అధ్యయనసమయాల్లో కార్యార్థుల రాకలవల్లను, ఎడతెగని టెలిఫోను మ్రోతలవల్లను అంతరాయం కలుగుతుంది. అప్పుడప్పు డిలాంటి సన్నివేశం ఆర్జవాన్ని కప్పిపుచ్చే మాటల్లో తేలికగా, అనాలోచితంగా చెప్పబడటం కద్దు. ఎమిలీ డికిన్సన్, థోరో మొదలైనవారి రచనలతో ఈ ధోరణి కనిపిస్తుంది. ఒకచోట థోరో ఏమంటాడో చూడండి:

"ఓ మహాదేవ! నాకు నావల్లనే ఆశాభంగం కలిగించేదానికన్నా హీనమైన తుచ్ఛధనాన్నిమ్మని యాచించను నిన్ను. ఒక మెట్టు దిగితే, నువ్వయితే కటాక్షిస్తావు కాని నా మిత్రులకు నావల్ల ఆశాభంగం కలిగే దానిగురించి అంతకన్నా అడగను."

ఇదేమీ హాస్యంకోసం వ్రాసిన పద్యం కాదు. ప్రార్థనపద్యంగా వ్యవహృతమైనది. థోరో యథార్థంగా ఏమనుకుంటాడో లోపల, అదే పైకి చెబుతాడు.

అయితే అమెరికన్ హాస్యం, దాని అర్థచ్ఛాయ లన్నిటినీ పరిశీలిస్తే, అమెరికన్ నైతికబోధ కొకవిధమైన సమాధాన మనిపిస్తుంది. అది అసలు వస్తుస్థితికీ, దానిగురించిన ఊహకీ మధ్యనున్న వైరస్యాన్ని చూపేదిగా వుంటుంది. అమెరికాలో అధికారపు హుందాతో కూడిన మాటప్రక్కనే మర్యాద లేనిమాట కూడా వుండగలదు. శైలీప్రాగల్భ్యం గల కాంగ్రెసు రికార్డు వుందంటే కాంగ్రెసు అధికారులనుగాని, తక్కిన రాజకీయవాదులనుగాని పరిహసించగల డూలీవో, రోజర్సో ఆ ప్రక్కనే వుంటారు. ఒకవంక 'పబ్లిక్'ను దూషిస్తూనే అమెరికన్ రచయిత హాస్యంద్వారా ప్రజామోదం పొందగలడు. అదికూడా సాహిత్యపు ముడిసరుకైన మాండలికభాషావాదుల ద్వారా చలామణీ కాగలదు. అయితే ఆ సాహిత్యాన్ని ఎవరూ అంత పట్టించుకోరు. అమెరికన్ ప్రవర్తనలో అక్రమమనిపించుకొనే ఆ హాస్యధోరణి ఒకవిధమైన గద్యశైలీప్రాదుర్భావానికి దోహదం చేసింది. ఆ శైలికి చెందినవారిలో మార్క్‌ట్వెయిన్ అగ్రగణ్యుడు. ఆ శైలీసౌలభ్యానికి సాటిరావడ మన్నది ఎంతోమంది బ్రిటిషురచయితలకే సాధ్యం గాకుండా పోయింది. ఆ ధోరణిలో గద్యశైలికేగాదు ఉపకారం జరిగింది; ఒకవిధమైన జనరంజకమైన గేయకవిత్వంకూడా పెంపొందింది. దానికి శక్తిమంతుడైన నీగ్రోకూడా చాలావరకు కారణం.

సరి, ఆ సంగతి అలా వుండనీండి. అసలుసంగతి అమెరికాకు

యూరపుతో అనుబంధం నిరంతరం కొనసాగుతూవుంది. యూరపు ఆదర్శవాదాల పాలిటి కొక దిక్కుమాలిన చోటు. అక్కడ ఆదర్శాలు కార్యరూపం ధరించడం కష్టమే గాని బాహిరిల్లడాని కదొక తరగని గని. యూరపు ప్రభావం, ప్రజ్ఞాధిక్యమూ అమెరికాలో అనాదరణకు గురి అయ్యాయి; ఆదరమూ పొందాయి. అమెరికా యొక్క సమానాధిక్య ప్రతిపత్తి గురించి ఎడతెగని ఉపశ్రుతులు వినిపించాయి. అమెరికన్ రచయితలు నిజాయితీ గల జాతీయ రచయిత లని అనిపించుకోవా లంటే యూరపును విస్మరించాలని హెచ్చరికలు వినిపించాయి. అయితే యూరపు అమెరికనుల ఆలోచనలను వెన్నాడుతూనే వుంది. వాస్తవానికి కొందరు అమెరికనులే యూరపియనుల మనిపించుకొన్నారు. బెంజమిన్ ఫ్రాంక్లిన్, కౌంట్ రమ్ ఫర్డులు మొదలు టి.యస్. ఇలియట్, ఎజ్రాపౌండులదాక ఎందరో అమెరికనులు చెప్పుకోదగిన సర్వసమభావము సాధించినవా రున్నారు. సంయుక్తరాష్ట్రాల సంస్కృతికి మేమే స్వాముల మనుకొని విఱ్ఱవీగే ఆంగ్లేయ సోదరు లింకా అమెరికాకు ఇంగ్లీషు ఛానలు అవతలగల యూరపు ఖండంతో ఎన్ని అనుబంధాలున్నాయో, ఎందరు అమెరికనులు జర్మను విశ్వవిద్యాలయాల్లో చదువుకొన్నారో పూర్తిగా గ్రహించనట్టు లేదు.1

యూరపుతో నిమిత్తం అమెరికాకూ, అమెరికాతో నిమిత్తం యూరపుకూ వుంది. యూరపు అమెరికాచరిత్ర కొక పౌరాణికమైన పూర్వరంగం అయితే, అమెరికా తన నూత్నత, కర్కశత, సంపన్నత,

---

1. **Everett, Ticknor, Bancroft, Longfellow** మొ॥ మొదటితరంవారి గురించి చూ: **Literary Pioneers: Early American Explorers of European Culture by Orie W. Long (Cambridge, Mass., 1935.)**

ఉపద్రవము, అసంభావ్యతలతో యూరపున కొక సుగమమైన ఫల రూపంగా వెలసింది. ఇలా పరిణతమైన తమ శీలానికి తామే ముగ్ధులయ్యారు అమెరికనులు. అయితే వారికి దానివల్ల కాస్త అహంతకూడా కలిగింది. అమెరికనుల వ్రాతల్లోనే సంస్కారసారవంతమైన యూరపియన్ సారస్వతదృక్పథానికీ, సజాతీయ సాహిత్యదృక్పథానికీ మధ్య ఒక పొరుపు ఉన్నదనే విషయం చాలామంది విమర్శకులే గుర్తించారు. ఆ రెండు మార్గాలకూ చెందిన రచయితలకు వరసగా **'Palefaces'** అనీ, **'Redskins'** అనీ పేరు పెట్టాడొక విమర్శకుడు. హెన్రీజేమ్సుని మొదటితరగతికీ, వాల్ట్ విట్‌మన్‌ను రెండవతరగతికీ ప్రతినిధులుగా కూడ పేర్కొన్నాడు.1

అసలీ తేడాలు మరీ సాగదీస్తే వట్టి సిద్ధాంతరూపంగా నిలిచేవే కాని, నిజానికి అమెరికాలో ఏ ఒక్క రచయితా పూర్తిగా ఏ పక్షానికీ లక్ష్యభూతుడు కాడు.

అమెరికన్ సాహిత్యంలో స్థిరప్రకృతిగల ధోరణులు కొన్ని వున్నా అది ప్రగతి లేనిది మాత్రం కాదు. ప్రతి దశాబ్దానికీ దశాబ్దానికీ దాని ధోరణిలో మార్పు కనిపిస్తుంది. 19-వ శతాబ్ది ఆద్యంతాల సాహిత్యంలో అయితే ఈ మార్పు మరీ విపరీతంగా గోచరిస్తుంది. భవిష్యత్తులో విశ్వాసం ఒకవంక ఇంకా దృఢంగానే వున్నా, వరసగా ఎన్నో ఆఘాతాలు సంభవించాయి. దానికి అధికారికదృక్పథం **(Official View)** తీవ్రమైన ఆక్షేపణలకు గురియైనది. "పబ్లిక్"కు నింద, ఉపేక్ష (ముఖ్యంగా నవ్య కవులనుండి) తప్పలేదు. ఒక్కొక్కప్పుడు ప్రజల స్థితియే ఒక వట్టి ఊహా

---

**1. Philip Rahv, 'Paleface and Redskin', reprinted in Image and Idea. (Norfolk, Connecticut, 1948)**

గానంగా, కల్పనగా పరిగణింపబడేది. దక్షిణప్రాంతసాహిత్యంలోనూ మార్పుల ఫలితం బాగా కనిపించింది. అమెరికనులలో సాధారణంగా వుండే సాంప్రదాయికవిశ్వాసధోరణులకు విపరీతమైన చాదస్తంతో ఎదు రొడ్డి నిలిచింది దక్షిణప్రాంతం. అది నూత్నప్రయత్నాలను నిరోధించింది. అందుకే జె. గార్డన్ కూగ్లర్ "కటకటా! దక్షిణప్రాంతంలో కవు లంత కంతకు కలువై పోతున్నారు. అక్కడ సాహిత్యాని కెప్పుడూ గతులులేవు" అన్నాడు. బాగా అన్నాడు. కాని 1920 ప్రాంతానికల్లా దాక్షిణాత్య రచయిత తన ప్రాంతీయసంప్రదాయాన్ని కొంతకు కొంత చిత్తశుద్ధితో నిలువరించుకుంటూనే తగిన మమతారాహిత్యంతో అందులోని కష్టనష్టా లను గుర్తించగలిగేడు. అక్కడ లభ్యమైన సత్సామగ్రిని చక్కగా ఉప యోగించుకొన్నాడు. ఇక మరి అమెరికాకు గతమంటే అదెక్కడో యూరపులోనే వున్నట్లు వెదుకులాడవలసిన అవసరం లేకపోయింది. ఏ మూల చూసినా ఎదురవుతూనేవుంది.

ఇలాంటి విషయాలు కొన్ని తరువాతి అధ్యాయాల్లో వివరింప బడ్డాయి. అవి సంగతంగా వున్నాయనుకునే నాతో పాఠకులు ఏకీ భవిస్తారనుకొంటాను. అమెరికన్ సాహిత్యం చదివి నేను పొందిన ఆనం దాన్ని కూడా కొంతవరకు ఆనందించగలిగానను కొంటాను.

అమెరికనుల ఆశలూ, ఆశయాల గురించి ఎంతైనా చెప్పవచ్చు. అది మా జాతీయకాలక్షేపాల్లో ఒకటి. అలాగే అమెరికన్ రచయిత నొక పీడితవ్యక్తిగా ఏడాది కొరుకెలలు యూరోపియను లోగిళ్ళలో పనిచేసే దక్షిణాఫ్రికా అలగాజాతిమనిషివలె, సాంస్కృతిక స్థానభ్రంశం పొందిన వాడిగా చిత్రించవచ్చు. ఒకవేళ చివరికి పాఠకుల కలాంటి అభిప్రాయమే కలిగితే అది నే నుద్దేశించిందిమాత్రం కాదు.

ప్రతిదేశానికీ దాని సాహిత్యసమస్యలు దాని కున్నాయి. ప్రతి రచయితా వాటిని గుర్తించడం లేదు. కొందరికి వారి రచనాప్రవృత్తిలో అవి ఆటంకాలుగాకంటె దోహదకారులుగానే వున్నాయి. ఎవడు చెయ్య గలిగింది వాడు చేస్తాడు. అది సరేగాని, జాతీయసాహిత్యా లని పించుకొనేవి ఉన్నట్లుగానే ఆ జాతీయత కావల వుందొక అసలైన రచయితల ప్రపంచం. అక్కడ ప్రతివ్యక్తీ, హెర్మన్ మెల్విల్లీ అన్నట్లు, "ఆ రచయితలు పర్షియన్ చక్రవర్తుల్లా రత్నాలూ, ఆభరణాలూ రాసులుపోస్తుంటే ఆ కళానిలయంనుండీ విజయకలశం గ్రహిస్తాను" అని ఆశించవచ్చు.

# 1

## వలసకాలపు అమెరికా

**1607** సం. లో ఉత్తరఅమెరికాలో జేమ్సుటౌన్‌లో మొట్టమొదటగా జెండా పాతేరు ఆంగ్లేయులు. అప్పటితో వారక్కడ హాయిగా స్థిరపడినట్టే. పావుతక్కువ రెండు శతాబ్దులపాటు కాలం బాగానే గడిచిపోయింది. కాని అక్కడికి పదికోసుల దూరంలో వున్న యార్క్‌టౌన్‌లో 1781 లో ఒకనాడు "ప్రపంచం తల్లక్రిందులైంది" అనే నినాదమేదురమైన సంగీతం ఒకటి ఆంగ్లేయులకు కర్ణతాడితమైంది. జనరల్ వాషింగ్టన్ యార్కుటౌనును చుట్టుముట్టినాడు. ఆంగ్ల సేనాని కారన్‌వాలిస్ సేనలతోసహా వచ్చి లొంగిపోయాడు. అయితే అంతటితో అమెరికాలో బ్రిటిషువారి పలుకుబడి అంతం కాలేదు. మరింకేదీ మార్చలేనంతగా దాని ముద్ర గాఢంగా పడిపోయింది. భాషలో, భావనా మార్గాల్లో వివిధసంస్థల్లో అట్లాంటిక్ తీరస్థంగా వున్న ఇంగ్లీషువలసలు పదమూడింటా ఆంగ్లదేశపు పోలికలు చెరిగిపోలేదు. అందుకే అమెరికాకు స్వాతంత్ర్యం వచ్చి డెబ్భయ్యేళ్ళయాకగూడా "అది మా కాణాచి" అన్నాడు నెథేనియల్ హాథార్న్.

ఐనప్పటికీ, వలసప్రజలు ఇంగ్లండునుండి, యూరపునుండి వేఱు చేసే అనుభవాలకు లోనుగావలసివచ్చింది. అపరిచితాలైన శీతోష్ణస్థితులకు, పంటలకు అలవాటుపడవలసివచ్చింది. ఎర్రఇండియనులతో నిర్వహించుకో వలసివచ్చింది. దేశంయొక్క అనుపానులు తెలుసుకొని తెన్ను లేర్పరచు కొని కొట్టడం, కట్టడం, నాటడం, పాపం, ఇలా ఎన్నో తాపత్రయాలకు గురిఅయ్యారు. వలసకాలం చివరికి పరిస్థితులు కొంత చక్కబడ్డాయి. ఒక నాడు వలసదారుల కునికిపట్లయిన కఱకు నేల లప్పుడు గచ్చులై తివాచీ లతోకూడా రాణించాయి. కాని ప్రతివిషయమూ అనిశ్చితంగా వున్న ప్రారంభదశలో అక్కడ మానవజీవితాలే అతిక్షుద్రంగా వుండేవి. 1620 లో ప్లిమత్ కొండకడ తీరం చేరుకొన్న యాత్రిక పితరుల (**Pilgrim Fathers**) స్థితి నిలా వర్ణించాడు విలియమ్ బ్రేడ్ఫర్డ్ :

“అలాగు మహాసాగరాన్నీ, తమ కష్టసాగరాన్నీ తరించినవారికి తీరం చేరగానే స్వాగతం చెప్పేటందుకు మిత్రులు లేరు. శీతలవాతా హతాలైన కళేబరాలకు కాస్త ఉపశాంతి కలిగించుకుందా మంటే విశ్రాంతిగృహాలు లేవు. వినోదానికి ప్రసక్తియే లేదు. తలదాచుకొనడా నికి మరామత్తు చేసుకుందామన్నా ఇళ్ళు లేవు. స్థలజ్ఞుల నెవరినైనా సాహాయ్య మర్థించాలంటే అక్కడ ఊళ్ళే లేవు. పాపం, ఆ భయంకర వికార వివిక్తప్రదేశంలో, విశృంఖలమృగసంకులసీమల్లో, మృగాలవంటి మనుష్యులు మసలే చోట వాళ్లేమి చూస్తారు? ఆ మనుష్యమృగా లక్కడ ఎన్ని వందలూ మందలూ ఉన్నారో వారి కేమి తెలుసు? పోనీ, పిస్ఘా కొండకొ త్తెమునకెక్కి తమ ఆశల కెరజూపే మంచి దేశ మేమైనా వుంటుందేమో చూదా మనుకొంటే అందుకూ వీలులేకుండాపోయింది. ఆకాశం వేపు తప్ప ఆశావకాశాల మేరకు ఎటు చూసినా తమ ఆశల కవకాశాలు కనిపించడంలేదు. కనిపించే వస్తువు లేవీ సంతృప్తికరంగా లేవు. వేసవికూడా దాటిపోయింది. పరిస్థితులు బిక్కమొహం వేసుకొని కూచున్నాయి...”

అలాంటి పరిస్థితులలో ఆ తొలినాటి వలసదారులు సాహిత్యా లేం చదువుతారు? ఏం రాస్తారు? అసలు వాళ్ళకు తీరి కెక్కడిది? 1685 లో

ఇక రాబోయే వలసదారుల కొక చక్కని సలహా చెప్పేడు విలియమ్ పెన్న్-"ఆశలు పెట్టుకోవడంలో పొదుపుగా వుంటే మంచిది. పంటకు ముందు పరిశ్రమ గురించీ, లాభానికి ముందు మదుపు గురించీ ఆలోచించు కోండి" అని. ఆ మాట లా వలస కాలపు సాహిత్యానికికూడా చాలా వరకు సరిపోతాయి. ఆ కాలంలో అమెరికా మిల్టను, డ్రైడను, పోప్, స్విఫ్ట్, స్టెర్న్, ఫీల్డింగ్ లతో సరితూగగల ఒక రచయితను సృష్టిచేసుకో లేక పోయింది.మతవ్యాసక్తులైన బన్యన్ జెరిమీ టెయ్లర్ లకు సాటి అయిన వాడూ లేకపోయాడు. అమెరికాకు ఆ రోజు లలాంటివి.

విట్ మన్ తన **"The United States to Old World Critics"** అనే గ్రంథంలో ఇలా అన్నాడు: "సంపద, వ్యవస్థ, దేశాటనం, రక్షణ, ఉత్పత్తి, సమృద్ధి-ఇవే ఇక్కడ మా కీనాడు ప్రముఖ విధులూ, గట్టి పాఠాలూనూ." అమెరికన్ విప్లవానికి ముందు పాత ప్రపంచపు (యూరపు) విమర్శకులనుంచి ఆక్షేపణలు లేవు. అప్పుడు సంయుక్త రాష్ట్రాలన్నవీ లేవు. ఉన్నవల్లా అక్కడొక్కటీ ఇక్కడొక్క టీగా కొన్ని దిక్కుమాలిన వలసలు; ఎవరికి దొరికింది వారు గట్టిపరుచు కుందా మనీ, ఆపిమ్మట కాస్త విస్తరిద్దామనీ అనుకుంటూవుండే ప్రజ లున్నూ. అయితే వాళ్ళంతా బొత్తిగా విద్యా వ్యాసంగం లేనివారు కారు. ముఖ్యంగా న్యూ ఇంగ్లండు వలసలో. అక్కడ 1636 నాటికే హార్వర్డు కళాశాల 1 స్థాపితమైంది. 1639 నాటి కక్కడ ముద్రాక్షరశాల కూడా నెలకొన్నది. 2 కాని మొత్తం మీద నాడీ నవ్యప్రపంచం (అమెరికా)

---

1. అమెరికాలో మిగతా కళాశాలల స్థాపన: 1639, విలియమ్ అండ్ మేరీ (విలియమ్సు బర్గ్, వర్జీనియా); 1701, యేల్ (న్యూహేవెన్, కన్నెక్టి కట్); 1746, ప్రిన్స్టన్ (న్యూజెర్సీ); 1751, పెన్సిల్వేనియా (ఫిల డెల్ఫియా); 1754, కొలంబియా (న్యూయార్క్), డార్ట్ మాత్ (హనోవర్, న్యూహేంప్ షైర్); 1764, బ్రౌన్ (ప్రొవిడెన్స్, రోడ్ ఐలెండు)

2. 1690 దాక మరి ప్రెస్సులు నెలకొల్పబడలేదు. ఆ యేడే ఫిలడెల్ఫి ఒకటి, న్యూయార్కులో ఒకటి నెలకొన్నవి. 1715 నాటికి బోస్టన్లో అయిదు ప్రెస్సు లున్నవి.

తీరిక వున్నప్పుడు నచ్చినంత మేరకు పాత ప్రపంచపు (యూరపు) సాహిత్య ఫలాలనే ఆస్వాదించి సంతృప్తిపడింది. యూరపునుంచి వెళ్ళే ప్రతినౌకలోనూ పుస్తకాలుకూడా ఒక సరకుగా ఎగుమతి అయ్యేవి కాని వలసలవారి అభిరుచి ప్రమాణాలు మొదట్లో కఠినంగా వుండేవి. అలాంటివి న్యూ ఇంగ్లండులో "ప్యూరిటానిజమ్" (కొందరు పవిత్రాశయులు క్రైస్తవ మతంలో ఏర్పరచిన ఒక శాఖ) పేరిట వ్యవహృత మయ్యేవి. ప్యూరిటన్ న్యూ ఇంగ్లండువల్లనే సాహిత్యానికీ, కళలకూ శపించినట్లు తగిన అభివృద్ధి లేకుండా పోయిందనీ, ఆ చీడవల్ల నేటికీ అమెరికా పీడింపబడుతూనే వుందనీ ఒక అభిప్రాయం కద్దు. ప్రచురంగానే వుంది. ఈ 'పవిత్రులు' 1920 ప్రాంతంలో అయితే సుఖమెరుగని సన్నాసులనీ, వంచకులనీ అపహాసింపబడేవారు. హెచ్. ఎల్. మెన్కన్ మొ॥ విమర్శకులు—"యాత్రిక పితరులు అమెరికా చేరకోగానే మొదట తమ మోకాళ్ళపై మోకరిల్లేరు. పిదప ఆదివాసులమీద దూకేరు" అని ఇలా కోరి పరియాచకా లాడేవారు.1 దేవుడి ఉద్దేశాలను గురించి ఈ 'పవిత్రులు' చేసే ఊహాగానాల గురించి చెప్పుకోవడం అదో ముచ్చట. ఆ విమర్శకులకు ఒక చిన్న సన్నివేశం చెబుతాను-జాన్ విన్‌త్రోప్ (1588-1649) అనే ఆయన కొక కొడు కున్నాడు. అతని కో చిన్న గ్రంథాగారం వుంది. అందులో పుస్తకా లున్నాయి. ఎలుక లున్నాయి. అవి ఆంగ్లికన్ ప్రార్థన గ్రంథాన్ని మాత్రం ఎత్తుకుపోయాయి. మరే పుస్తకాన్నీ ముట్టుకోలేదు. అలా మరే పుస్తకాన్నీ ముట్టక సరిగా ఆ ప్రార్థన గ్రంథాన్నే ఎలుక లెత్తుకుపోయాయంటే అందులో ఏదో విశేష ముండి తీరాలని, దేవుడి ఆంతర్యం తెలుసుకోడానికి పథకం వెయ్యడం మొదలు పెట్టేడా వెర్రి బాగుల విన్‌త్రోప్. ఇలాంటివి చూసే వెటకారానికి దిగుతారా విమర్శకులు. వలస వారికి సంబంధించిన సముద్రపు చట్టాలన్నా వెక్కిరిస్తారు

---

1. 1925 లో **American Mercury** అనే తమ పత్రికలో మెన్‌కెన్, అతని మిత్రుడు జార్జ్ జీన్ నాథన్ 'ప్యూరిటనిజమ్'ను "ఎక్కడో ఎవరో సుఖపడిపోతా రని ఒకటే బెంగ పెట్టుకోవడం" అని నిర్వచించారు.

వారు. (అయితే అవి చాలా మట్టుకు అమెరికనులంటే కిట్టని ఆంగ్లేయ మంత్రి శామ్యూల్ పీటర్స్ 1781 లో తయారుచేసిన వాటి మీద జరిగిన కల్పనలే అని వారు గుర్తించలేదు) న్యూ ఇంగ్లండువలసలో నవలకుగాని, నాటకానికిగాని పరపతి లేకపోవడం, కనీసం 'ప్యూరిటన్' కవిత్వానికైనా అసలే పుట్టుగతులు లేకపోవడం చూసి అమెరికన్ సాహిత్యానికి పురిటిలోనే సంధి కొట్టిందనే ఒక నిశ్చయానికి వచ్చేశారు.

1920 ప్రాంతంనుంచి శామ్యూల్ ఎలియట్ మారిసన్ పెర్రీ మిల్లర్, కెన్నెత్ మర్‌డాక్ అనే హార్వర్డు పండితుల ఆధ్వర్యం క్రింద ప్యూరిటన్ భావన, జీవన విధానాల గురించి సశితంగా, సానుభూతితో కూడిన పరిశీలన జరుగుతూ వచ్చింది. న్యూ ఇంగ్లండు వలసల క్లిష్ట ప్రారంభాలు గుర్తింపబడి అవి ఆశ్చర్యకరమైన పరిమాణంలో సాహిత్యాన్ని ఉత్పత్తి చేశాయని నిరూపింపబడింది. (తత్త్వము, చరిత్ర, పత్రికలు మొ॥ వాటినన్నిటినీ సాహిత్యంగా జమకడితే) జోనాథన్ ఎడ్వర్డ్స్ (1703-58) అనే ఆయనకు గొప్ప ప్రజ్ఞావైశిష్ట్యం గల రచయితగా ప్రత్యేకమైన పరిగణన జరిగింది. ప్యూరిటన్ విరుద్ధమైన వాదం గురించి అవిచారితంగా, అనవసరంగా ఎక్కువ చెప్పబడింది. ఇప్పుడు దానిని పూర్వపక్షం చేయడంలో పాండిత్యం పప్పులో కాలు వేసే ప్రమాదం వుంది 1. (ఇప్పటి కలాటి దేమీ జరగలేదు. అంత బాధ్యతా రహితంగా జరగలేదు) ప్యూరిటన్‌లమీద మొదట జరిగిన దాడిలో తాతముత్తాతలను తాతముత్తాత లనుకోవడమే ఒక వేళాకోళమై పోయింది. మరి యిటీవల వలస సాహిత్యానికి, ముఖ్యంగా ఇంగ్లండు సాహిత్యానికి వచ్చిన ప్రశస్తిలో ప్రాచీన సమారాధన యొక్క అంశంటూ లేదూ? అమెరికన్ సాహిత్య చరిత్రకారులు "పనికొచ్చే ప్రాచీనత'

---

1. ఈ చర్చంతా ఈ రెండు గ్రంథాల్లోనూ సంగ్రహింపబడింది. **George M. Waller (ed), 'Puritanism in Early America' (Boston, 1950); Amherst Series, 'Problems in American Civilization.'**

(**"Usable Past"**—ఇది వాన్‌విక్ బ్రూక్స్ యొక్క సుప్రసిద్ధమైన పదబంధం) కోసం తమ వాఙ్మయ చరిత్రాన్ని వీలైనంత వెనుకకు నెట్టివేసి అదంతా యథార్థ మనిపింపజెయ్యాలని పట్టుదలగా వున్నారు. 'ప్యూరిటన్' సంప్రదాయమంటూ ఒకటి వున్నదని స్థాపించే పూనికతో వున్నారు. చాలా సందర్భాల్లో వలస సాహిత్యానికి వారు నూత్న వ్యాఖ్యానం చెయ్యవలసిన అవసర మేర్పడింది. పెద్దపెద్ద పండితులంతా అనవసరంగా దానిగురించి గొప్పలు చెప్పకుండా తగిన నిదానం చూపేరు. చారిత్రక దృష్టితో చూస్తే వలస రచనలకు మంచి విలువ వుంది. సాహిత్యదృష్టితో మాత్రం దాని సత్త తక్కువనే చెప్పాలి. ఇలా అనడం ప్యూరిటనుల చిత్త శుద్ధి, ధైర్యము, కార్యశూరత మొదలైన శ్లాఘ్య గుణాలయెడ అనాదరం చూపడం కాదు. (తాత్కాలికంగా ఇది న్యూ ఇంగ్లండుకే పరిమితమైన మాట. దాని దక్షిణపు వలసలకు సంబంధించినది కాదు) ప్యూరిటన్ సంప్రదాయ మంటూ లేనేలేదని చెప్పడం కాదు. న్యూ ఇంగ్లండును సంయుక్త రాష్ట్రాలను చాలా ప్రభావితం చేసిన విశిష్టమైన నైతిక సామాజికమైన వ్యవస్థ ఒకటి వున్నది. 'విప్లవం' గడిచాక నేటిదాకా ఆ సంప్రదాయం రచయితలకుమాత్రం తగినప్రోత్సాహం ఇవ్వలేకపోయింది. హాథార్న్, కొంత వరకు హేరియట్ బీచర్ స్టోవె, జె.జి. విట్టియర్, అయితేగియితే జె.ఆర్. లోవెల్—వీళ్ళని తప్పిస్తే 19 వ శతాబ్దిలో మ రే రచయిత నది బాగా కదిలించగలిగింది? లాంగ్ ఫెలో బద్ధకస్థుడై తేనేంగాక, బాగా చదువుకొన్న వాడు. జోనాథన్ ఎడ్వర్డ్ రచనలను చదువుదా మనుకొన్నాడట కాని చదవలేదట. ఇది షష్టిపూర్తయాక ఆయన చెప్పిన మాట. చాలామంది సమకాలిక రచయితలలాగే ఆయనకు వెనుకటి యూరపు సాహిత్యం మీద వున్న మోజు స్వీయ ప్రాంతీయసాహిత్యంమీద లేదు. బహుశా అదే సంప్రదాయ ప్రచారం ఆగిపోవడానికి కారణమూ, ఫలితమూ కూడా అయి వుంటుంది. వలసరచనలు కొన్ని చాలా కాలంగా అచ్చుమొగం చూడ కుండా పడివుండవలసివచ్చింది. జాన్ విన్‌త్రోప్ (పెద్ద) గారి 'జర్నల్' 1790 లో గాని ప్రచురింపబడలేదు. న్యూ ఇంగ్లండు చరిత్రలాగే 1825-26 నాటికిగాని సమగ్రం కాలేదు. విలియమ్ బ్రేడ్‌ఫర్డు (1590-1657) వ్రాసిన

**The History of Plymouth Plantation** 1856 నాటికిగాని పూర్తిగా ప్రచురింపబడలేదు. ఆమధ్య విప్లవకాలంలో దాని వ్రాత ప్రతి మాయమైపోయింది. మళ్ళా **Fulham Palace Library** లో కనిపించింది. **Sarah Kemble Knight**(1666-1727) పెట్టిన పత్రిక 1829 నాటికిగాని వ్యాప్తిపొందలేదు. **Samuel Sewall** (1652-1730) డైరీ 1878-82 వరకూ అలాగే పడివున్నది. 1644-1729 నాటి ఎడ్వర్డు టెయ్లర్ పద్యాలకు అదే గతి పట్టింది.1937 లో కొన్ని ముద్రింపబడ్డాయి.

న్యూ ఇంగ్లండు రచనల లక్షణాలు చూస్తే 'ప్యూరిటన్' వాతావరణం కాల్పనిక సాహిత్యానికి ప్రోద్బలకంగా లేదని ఒప్పుకోవచ్చు. అయితే ఆమాట అంతగట్టిగా అనడానికి వీల్లేదు. ఎందుచేతనంటే అక్కడ వలస లేర్పడిన ఒక శతాబ్దిలోపునే ప్యూరిటన్ నియమాలు బాగానే సడలిపోయాయి. అదిగాక ఏ నియమాలూ, నిబంధనలూ అసలే లేని తక్కిన వలసల్లో 17-వ శతాబ్ది చివరిదాకా స్వచ్ఛందమైన సాహిత్యప్రవృత్తి జరిగిందని చెప్పడానికి తగిన ఆధారాలు లేవు. అసలు కొన్నిచోట్ల ఏవిధమైన సాహిత్యమూ లేదు. న్యూ ఇంగ్లండులోనూ మెసాచుసెట్స్,కనెక్టికట్ల కాల్వినిస్టు పట్టణప్రాంతాలలో మొదటి తరాలవారు కేవలం వినోదం కోసంగా ఏమీ వ్రాయలేదు. వాళ్ళు తాము దేవదూతల మనీ, దేవుడికి కావలసిన వాళ్ళకు ఆశ్రయం కలిపించడానికీ, దైవోపహతులైన దౌర్భాగ్యులు ఇండియనులను మార్చడానికీ, లేక హతమార్చడానికీ అద్భుతమైన ఈశ్వర సంకల్పంవల్ల వచ్చినవారమనీ అనుకొనే వాళ్లు.1 వాళ్ళకు ప్రమాణాలు బైబిలు, ఆటుపై వాళ్ళ చిత్తము.

అలాంటి దేవుడిదేశంలో బాహిరిల్లిన సాహిత్యం ప్రాథమికదశలో విషయంలోను, శైలిలోను మతాశయ నిర్భరంగా వుండేది. సామాన్యపు

---

1. కాటన్ మేథర్ ఆ ఇండియన్లను దైవోపహతులని కాదు,పిశాచ వంచితులని నిర్ణయించాడు. పైనున్న తన కైవల్యసామ్రాజ్యం పాడైపోతుందేమోనని క్రీస్తు ప్రభువు వాళ్ళకడకు రానేరాడట; తన సందేశ మంపజేయడట.

చర్చి సభ్యుడికి ఈ భూలోకంలో అపాయకరమైన, పరీక్షాప్రాయమైన అతని స్థితిగురించి సమగ్రమైన జ్ఞానం కలిగించేది ఉత్తమరచనగా పరిగణింపబడేది. ప్యూరిటనులను రోమన్ చర్చియొక్క విగ్రహారాధనాదిక సంప్రదాయమంటే పడదు అందుచేత సాహిత్యంలోనూ వాళ్ళు ఆలంకారికతనామోదించేవారు కాదు. నిరక్షరాస్యుల కర్థంకాని ఐతిహ్యాదులు లేని నిరాడంబరమైన, సరళమైన శైలి వారి కుపాదేయమైంది. అయితే న్యూ ఇంగ్లండు రచయితలు సర్వదా తమ సిద్ధాంతాలకు కట్టుబడివుండలేదు. ఉదాహరణకు **Nathaniel Ward** ఆడవాళ్ళ ఫాషన్లను గురించి వ్రాసిన **The Simple Cobbler Of Aggavwam** (1647) నుంచి ఉల్లాసం గొలిపే ఈ పంక్తులు చూడండి:

"నే నోసారి ఒక చిన్నారి వన్నెలవిసనకర్ర ఆ వారం రాణీగా రేమి గుడ్డలు వేసుకుందో, రాచనగరులో విలాసినుల ముస్తా బెలాంటిదో తెలుపుమని ఎవరినో అడుగుతుండగా విన్నాను. అయింతా నా కా అమ్మాయి ఒక పికిలిపిట్ట యీకలా, సున్నకడుపున చుక్కలా, పాదతాడన యోగ్యురాలిగా కనిపించింది..."

ఇంకా కావలిస్తే అనేక ప్రసిద్ధ నిదర్శనాలకు కాటన్ మేథర్ (1663-1728) వ్రాసిన క్రైస్తవమతగురువుల చరిత్ర సంగ్రహం— **Magnalia Christi Americana** (1702) చూడండి. అయితే యివన్నీ అసాధారణాలైన సందర్భాలు. నెథేనియల్ వార్డ్ (1578-1652) ఏభైయేళ్ళు పైబడ్డాక గాని మెసాచుసెట్స్‌కి జరగలేదు. ప్యూరిటన్ పండితులలా ప్రసిద్ధనిదర్శనాలకు, అనుప్రాసలకు మోజుపడుతూవుండగా కాటన్ మేథర్ ఒక ప్రత్యేకమైన ఆడంబరం ప్రదర్శించాడు. "గర్వోహాలు నా ఘనకార్యాలను కళంకితం చేస్తున్నాయి"—ఇలా వెళుతుంది అతని ధోరణి (చూ. అతని డైరీ ప్రథమ ప్రచురణ 1911-12). ఆ వొడుపు వలస రచయితల్లో మరెవరికీ వచ్చింది కాదు. అంత పండితుడు వాళ్ళ నాన్నకే (**Increase Mather,** 1639-1723) పట్టుబడలేదు.

సర్వసాధారణంగా న్యూ ఇంగ్లండు రచయితలు బైబిలునే నమ్ముకుని వుంటారు. బైబిలు పంక్తుల నాధారంచేసుకునే పిడివాదాలకు దిగే

వారు వాళ్ళు. అంతేకాదు. బైబిలులో దొరికే సాదృశ్యాల్లోనే తమ స్థితి గతుల ప్రతిబింబాలు చూసుకొనేవారు. అందులోని యూదులను తమతో, తమ శత్రువులను యూదుల శత్రువులతో సరిపోల్చుకొనేవారు. చూడండి:

"ఒక మహాపురుషుడు ఇష్టజనాన్ని వెంటవేసుకొని అమెరికా మరుభూములలో ప్రవేశించడానికొక మహాప్రస్థానం సంకల్పించాడు. ఆ మహానాయకుడు అందరిచేతను 'మోసెస్'గా పరిగణింపబడ్డాడు..." జాన్ విన్ త్రోపును గురించి కాటన్ మేథర్ ఇలా అనడం సహజంగానే వుంది. అతనికీ, అతని సమకాలికులకూ సర్వసందర్భానుకూలాలైన భావస్వరూపాలూ, నిదర్శనాలూ, అన్నీ బైబిలులో కనిపించేవి. వలసరాష్ట్రాల వడ్రంగులకు నమూనాలు ప్రదర్శించిన ఆంగ్లేయ దారుశిల్పి చిప్పెండేల్ కేటలాగులాగు బైబిలంటే వాళ్ళ కొక మూలాధార గ్రంథం.

కొన్నింట దీని ప్రభావం ఉదాత్తతను చేకూర్చింది వారికి. వాళ్ళ చెప్పిడిమాటలకు కూడా దీనివల్ల ఒక పొంకమూ, బింకమూ కలిగాయి. వలసగ్రంథాల్లో చెప్పుకోదగిన వాటిలో ఒకటిగదా విలియమ్ బ్రేడ్‌ఫర్డ్ వ్రాసిన **History Of Plymouth Plantation!** ప్రౌఢమైన దాని గద్యశైలిపై బైబిలు ముద్ర పడింది. అయితే ప్యూరిటన్ రచన దానివల్ల కొంత కుంటుపడిందికూడా. పకడ్‌బంద్‌గా వుండే దాని పదబంధాలు ప్రతి రచయితకూ ఇట్టే పట్టువడిపోయేవి. వాటిలో వున్న గంభీరమైన గౌరవం వల్లనే అవి వాడుకలో నలిగి నలిగి, చివరి కాస్ఫూర్తి అంతా పోయి వట్టి మాటవరుస లైపోయేయి.

బహుశా ఈ బైబిలుయొక్క ప్రాబల్యంకూడా కొంత కారణమై వుంటుంది—చారిత్రకంగా వలససాహిత్యానికీ, ఆంగ్ల సాహిత్యానికీ ఏర్పడి వున్న అంతరం మరింత ఎక్కువ కావటానికి. 1611 లో ఈ బైబిలు ప్రచురింపబడిన నాటికే దాని సాధికార భాషాంతరీకరణంలోని భాష వాడుక తప్పి ఒక శతాబ్ది అయిపోయిందని సూచించాడు సి. వి. వెడ్జివుడ్ తన '17 వ శతాబ్ది ఆంగ్లసాహిత్యం' అనే గ్రంథంలో (ఆక్స్‌ఫర్డు, 1950, పుట 16). ఐతే (ఆ సాధికార భాషాంతరీకరణం జెనీవా బైబిలుస్థానం తా

నాక్రమించుకోవడం, ఇంగ్లండులోకంటె ఇక్కడే దాని కెక్కువ ప్రచార మేర్పడిం దనుకోవడమూకూడా యథార్థమే అయితే) ఈవలసల్లో రచనా వ్యాసంగ ప్రారంభం ఆలస్యం కావడాని కదే కారణం కావచ్చు. న్యూఇంగ్లండురచయితలు మంచి విద్వాంసులే అయినా తరచు తమ సమ కాలికులైన ఆంగ్లరచయితల గ్రంథాలతో వారి కంత పరిచయం వుండేది కాదు. అందుచేత వారి అభిరుచి, శైలి, ప్రాచీనవాసన వేస్తూ నేవున్నాయి. అమెరికన్ వలసకవుల్లో అగ్రగణ్యుడైన ఎడ్వర్డ్ టెయ్లర్ ఆధ్యాత్మిక కవిత్వం వ్రాశాడు—ఇంగ్లండులో దాని ప్రచారం తగ్గిపోయాక. న్యూ ఇంగ్లండురచయితలలో కొద్దిమందికి మాత్రమే వాళ్ళ జీవిత కాలంలో అందుబాటులోకి వచ్చాయి మిల్టన్, మార్వెల్ ల కృతులు. 1699 నాటికి గాని ఎడ్మండ్ వాలర్ కావ్యా లమెరికాలో ప్రవేశించలేదు (బోస్టను వాసి డా. బెంజమిన్ కోల్మన్ తీసుకువచ్చాడు వాటిని). అప్పటికి వాలర్ చనిపోయి పన్నెండేళ్ళయింది. హార్వర్డుకళాశాలాధ్యక్షుడైన ఇన్ క్రీజ్ మేథర్ కి షేక్స్పియర్ బెన్ జాన్ సన్ లనుగురించి తెలిసినట్లే లేదు. అంత కంటే ఆశ్చర్యకరమైన విషయం బన్యన్ గురించికూడ తెలియకపోవడం.1 ఇంగ్లండులో ఒక వెలుగు వెలిగిన ఎన్నో ఏండ్లకు అమెరికాలో ఎడిసన్, స్టీల్ రచనలు ఆస్థతో అనుకరింపబడుతూవచ్చాయి. 18 వ శతాబ్ది ఉత్త రార్థంలో అమెరికనులు రాజకీయ వివాదాల్లో పడ్డారు. అప్పుడు వారు 17 వ శతాబ్దినాటి లాకే (Locke) మొదలైన ద్రష్టల (ఆంగ్లేయ) రచ నలు చదువుతూవుండేవారు. వారి శైలియొక్క ప్రాతవాసన కదికూడ కారణం కావచ్చు.

ప్యూరిటన్ సాహిత్యంయొక్క అభివృద్ధిని అరికట్టిన మరొక విషయ

---

1. చూ. **Thomas J. Wertenbaker, the First American, 1607-90 (New York, 1927) 240-1.** బెంజమిన్ ఫ్రాంక్లిన్ (1706—90, అతని బాల్యం బోస్టన్ లో గడిచింది) మాత్రం స్వీయ చరి త్రలో బన్యన్ కృతులంటే తనకు చిన్నప్పటినుంచి మంచి మోజుగా వుండే దనీ, అవి చిన్నప్రతులుగా, చవుకగా దొరికేవనీ వ్రాశాడు.

మేమంటే లోకంలో సర్వవిషయాలూ, ఎంత స్వల్పమైనవికూడా, దేవుడు తప్పితే దెయ్యం కల్పించినవే అనే ఒక విశ్వాసం. అయితే ఒక్కొక్కప్పుడు మానవశక్తి విధివైపరీత్యాల్లో చిక్కుకున్నప్పటి దృశ్యాల్లోంచి, ధర్మోదారహృదయుల భావప్రశాంతిలోంచి చైతన్యచకచ్చకితమై ఒక్కొక్క రచన ఆవిర్భవిస్తుంది. ఈ మచ్చుతునక చూడండి. ఇది శామ్యూల్ సెవాల్ **(Samuel Sewall)** అనే ఆయన "ఆవిష్కారస్మృతి" **(Book of Revelation)** గురించి న్యూబరీపోర్టు నుద్దేశించి చేసిన తలపోత:

"ఎంతదాకా సవడలూ చేడిసలూ 'మెర్రిమేక్' వాగుల్లో ఈదులాడుతూవుంటాయో, ఎంతదాకా సముద్రపుకోడి అవి వచ్చే వేళ తెలుసుకొని, ఆయాకాలాల్లో వాటి ఉనికి పట్టులకు వెళ్ళడం మానదో, ఎంతదాకా కోడికొండ **(Turkey-Hill)** ముందు మోకరిల్లిన మైదానాల్లో మొలచిన గడ్డి తిని ఏ పశువులైనా బ్రతుకుతాయో, ఎంతదాకా హాయిగా తిరిగే సాధువైన పావురాయికి కాలూనడానికో, కడుపు నిమురుకోవడానికో, గూడు కట్టుకోవడానికో పట్టణపరిసరాల్లోని ఒక శ్వేతసిందూరంగాని, మరే వృక్షంగాని ఆశ్రయ మిస్తుందో, ఎంతదాకా ప్రకృతిమాత ముదిసి మతిచెడక నిరంతరం మొక్కజొన్నల పంక్తులకు జంటగా బుద్ధిగఱపా లనుకుంటుందో అంతవరకూ క్రైస్తవు లక్కడ ప్రభవిస్తారు. ఒకరినొకరు కలుసుకొని మహాయోగుల విజ్ఞాన సంపత్తికి భాగస్వాములు కావడానికి స్థలాంతరాలకు పోతారు."

సెవాల్ వ్రాసిన "డైరీ" ప్యూరిటన్‌వాఙ్మయంలో ఒక సమ్మోహనాస్త్రంవంటి రచన. పైమాటల్లో ఆ ప్రదేశంమీదా, పెరిగే వస్తువులమీదా అతని కున్న మమకారం ప్రస్ఫుటమవుతుంది. న్యూబరీపోర్టు ఇక సగందూరంలో వుందన్న సూచన సామయికమైనదిగా తోస్తుంది. ఇకపోతే, న్యూఇంగ్లండులోని మిగతా రచనల్లో ఎక్కువపాలు, ముఖ్యంగా 17 వ శతాబ్దినాటివి మనకు విన్‌త్రోపుగారి ఎలకలనో, లేక తన ఉపన్యాసాల వ్రాతప్రతిని పోగొట్టుకొని "దయ్యాలు లేక అదృశ్యప్రపంచవ్యవహర్తలే దోపిడిగాళ్లు" అని కాటన్ మేథర్ చేసుకొన్న నిర్ణయాన్నో మనకు అస్తమానం జ్ఞాపకంతెస్తాయి. ఆ సాహిత్యంలో ఎప్పుడో ఏదో

ముడిముక్కల్లో తప్ప మానవహృదయం ఆగినట్లు ఆవిష్కృతం కాలేదనే చెప్పాలి. ఒక్కొక్కప్పుడు నిజమైన ఆవేశం తొంగిచూస్తుంది కాని మళ్లా వెంటనే ప్రాతసంస్కారం దిగలాగుతుంది. ఇందుకు నిదర్శనంగా ఆనీ బ్రేడ్‌స్ట్రీట్ (**Anre Bradstreet, 1612--72**) చనిపోయిన తన పాపగురించి ఎలా శోకించిందో చూడండి:

"ప్రకృతిసిద్ధంగా చెట్లు పెరిగిన వెనుక పుచ్చిపోతాయి.
ప్లమ్సు- ఏపిల్సు పండబారి రాలిపోతాయి.
ధాన్యము, గడ్డి అదనుబట్టి కోతపడతాయి.
ఎంత గట్టివీ, ఎత్తైనవీ కాలానికి లొంగిపోతాయి.
కాని నవోద్భిదములు సమూలంగా నాశంకావడము
క్రొత్తగా వికసించిన కోరకాలు అల్పాయువులై పోవడము
అన్నీ గతినీ, ప్రకృతినీ నడిపించే అతని చేతిమీదనే జరుగుతాయి"

ఆఖరి పంక్తి దుర్భరంగావుంది. అనుభవలోనుంచి దూసుకొనివచ్చిన ఆ ముందటి రెండుపంక్తుల తరువాత మరీ ఘోరంగా కనిపిస్తోంది. ఇలాగే యురియన్ ఓక్సు (**Urian Oakes, 1631--81**) అనే కవి కష్టపడి వ్రాసిన **"Elegy upon the Death of the Reverend Mr. Thomas" (1677)**లో—

"నాఎద హత్తిన ప్రియసఖుడు మరి లేడు
లేడు మరి నా అంతరంగపు సంతోషదీపం
ఈ గందరగోళపు జనసందోహంలో నే నొంటరిని
ఈ లోకాని కీరాత్రి సెలవు చెబుతాను"
అని విషాదశ్రుతి నాలపించినవాడా వెంటనే
"నాతావు బావుంది దేవు డున్నాడు: వుండనీ
అత డుంటే నాకందరు వున్నట్లే"

అని పేలవంగా ప్రలపించాడు.

అలాగే, మేరీ రౌలండ్‌సన్ (**Mary Rowlandson, 1635-78**) అనే ఒకమంత్రిగారి సతీమణి 1676 లో ఇండియన్లు తన్ను ఎత్తుకొని పోగా ఆ అనుభవాలను పురస్కరించుకొని చేసిన రచనలో మొదట సర

శంగా, హుందాగా తన అనుభవాలను చెప్పిందికాని తరువాత దేవుడు వాళ్ళనందరినీ వరసపెట్టి చిత్రవధ చెయ్యాలని ఒక ఆశయం ప్రకటించింది.

న్యూఇంగ్లండులో, కనీసం అభ్యంతర ప్రక్రియ రూపంలో (Allegory) నైనా ఉత్పాద్యకథాకావ్యానికి (Fiction) - అంటే నవలకు తావు లేదు. కీర్తనలూ పదాలూ తప్ప అక్కడ కవిత్వంకూడా ఏమంత ఎక్కువ లేదు. గట్టిగా చెప్పుకోదగినవారు ముగ్గురే ప్యూరిటన్ కవు లున్నారు. **Anne Bradstreet, Edward Taylor, Michael Wigglesworth** (1631—1705). విగిల్స్వర్త్ తన **Day of Doom** (1662) అనే బృహద్గ్రంథంలో కాల్వినిస్ట్ సిద్ధాంతాన్ని ఊచముట్టుగా ప్రదర్శించాడు. అయితే ఇదికాని, పద్యబద్ధములైన అతని ఇతర తత్త్వ దర్శన గ్రంథాలుకాని ఛందోబద్ధం కూడా కాని కావ్యాల నతిశయించిన దేమీ లేదు. (అంటే వాటిలో కవిత్వపదార్థాన్వేషణ కాకదంతపరీక్ష అన్న మాట) ఆ 'శిక్షాదివస' మనే కావ్యంలో అభమూ శుభమూ తామై ఎరక్కుండానే శైశవంలో చనిపోయిన వారి అదృష్టఫలితాన్ని దేవు డిలా నిర్ణయించాడట:

"నాకంలో కాలక్షేప మది అపరాధపు రస్తా
నరకంలో మీకోసం చక్కనిగది అనుగ్రహిస్తా
అని దేవుడు సెల విస్తే ఊరుకొందురు, లేదు మరో ఉబుసు
అతని నిమిత్తాలు ఘనతరములని వారి ఆత్మలకు తెలుసు"

ఇదీ ఆమహాపద్యంలోని ప్రవచనం! ఆనీ బ్రేడ్ స్ట్రీట్ గద్యమూ, పద్యమూ కూడ (**Meditations, The Tenth Muse Lately Sprung up in America, Pub. London,** 1650) మరికొంత రంజకంగా వుంటాయి. ఆమె **"Tenth Muse..."** అన్నదాన్నిబట్టి **"Mathless Orinda"** అని పేర్వడసిన కేథలీన్ ఫిలిప్స్ (**Kathleen Philips**) అనే ప్రథమాంధ్రకవయిత్రినిగురించి ఒక యేడు ముందే తెలుసుకుం దనిపిస్తుంది. అయితే ఒరిండాకంటె అమెరికావలసలో ఒక తల్లిగా, ఒక ఇల్లాలుగా ఆమె సాధించినదే ఎక్కువ మెచ్చుకోదగిన దనిపిస్తుంది.

ఒక ప్యూరిటన్ పెద్దయొక్క పడుచుపెళ్లాంగురించి 1645 లో జాన్ విన్ త్రోప్ చెప్పిన కథ చూస్తే అది మరీ యథార్థ మనిపిస్తుంది:

"ఆమె కొక శోచనీయమైన దౌర్బల్యం వచ్చిపడింది. అర్థగ్రహణ శక్తి, హేతుజ్ఞానం క్షీణించడం మొదలు పెట్టేయి. అప్పుడప్పుడదేపనిగా చదవడం, వ్రాయడం చేసేది. అది మరీ అధికమైపోయింది. ఆవిడ చాలా పుస్తకాలే వ్రాసింది. అయితే నేం, ఆవిడగృహానికీ, స్త్రీలకూ సంబంధించిన విషయాలేగాని సరిగాపట్టించుకుని చక్కబెట్టుకునివుంటే ఆమెస్థితి కొంత మెఱుగుగా వుండేది. ఇలా బలిమాలవలసిన అవసరం వుండేది కాదు."

ఆనీ **Du Bartas,** బైబిలు రెంటినీ బాగా నేచదువుకొన్నది. నెథేనియల్ వార్డ్ఆమెను **"a right Du Bartas Girle."** అని పేర్కొన్నాడు. పద్యకావ్యాలు వ్రాసినవారిలోసామాన్యుల్లోచెప్పుకోదగినదే కాని ఎడ్వర్డ్ టెయ్లర్ యొక్క గొప్పపంక్తుల పజ్జ నిలువదగినదేమీ ఆమె వ్రాసివుండలేదు. సుమారు తన కిరవైయేళ్ళప్పుడు అమెరికా వచ్చిన టెయ్లర్ జీవితంలో చాలాభాగం ఒక మెసాచుసెట్స్ సరిహద్దు సమితిలో అమాత్యుడుగా పనిచేశాడు. ఇటీవలే వెలుగులోకి వచ్చాయి అతని కృతులు. అవి రూపకాలంకార శిల్పాధిక్యంలో **Quarles, Crashaw** లకు స్మృతి చిహ్నాల్లా వుంటాయి.

"దైవనిర్ణయశకటంలో వాళ్ళు దొర్లుకుంటూపోతారు
మాయకు లోబడకుంటే మహావైభవంచూస్తారు"

అక్కడక్కడ ఎమిలీ డికిన్సన్ (న్యూఇంగ్లండు వాస్తవ్యుడేకాని అర్వాచీనుడు) తో కొంతసామ్యం కనిపిస్తుంది:

"ఎవడు తన రక్తంతో నా కళంకాలను
క్షాళితం చెయ్యగలడు?
ఎవ డలాంటి సామగ్రితో తన గూటి
నలంకరింపగలడు?"

ఎందుచేతనోగాని టెయ్లర్ పరిసరాని కంత లోబడిపోలేదు. అక్రమచమ

తాకారా అంటూనే అత డొక అద్భుతాల జాపితా తయారుచేశాడు. అందులో అతడు తొక్కిన తందనాలు:1

"స్టేనిస్‌బర్గ గడియారం, డ్రెస్‌డెన్ మేజాదృశ్యం
రెగ్నమంట్ ఉక్కుటీగ ఆపై నెగిరింది.
టర్రియన్ కర్రపిచుక లెగురుతున్నవి.
కృతకనరుడు ఆక్వినస్‌ను హతమార్చెను.
చూడు, మన 'బెట్టీ' మహారాణి పాలన కాలంలో
స్కేలిమోటా తాళం కప్పను, చెవినీ, గొలుసును
ఒక మిణ్ణలి లాక్కొస్తోంది."

ఇట్టిది వట్టి చప్పనాతి కవిత్వం. అయితే అతడు మనోజ్ఞ కల్పనలు చేసిన సందర్భాలు లేకపోలేదు. చూడండి:

"ఎవ రీ మహీతలము నింత మనోహరనదీనద
మరకత పట్టాంచిత కంచుకితముగా నొనర్చినవారు?
ఎవరు కడలిని పుడమి పడతి పావడ యంచుగ చేసినారు?
దీనికి తెరలూ మేలుకట్లు సవరించిం దెవరు1...?"2

అమెరికాలో మరే ప్యూరిటన్ రచయితా టెయ్లర్ ప్రదర్శించినంత శాబ్దిక సౌభాగ్యాన్ని ప్రదర్శించలేదు.

కాటన్ మేథ రొక డీ విషయంలో టెయ్లర్‌కి దగ్గరివాడే. అతడూ అప్పుడప్పుడు పద్యాలు వ్రాశాడు. న్యూ ఇంగ్లండు రచనలు సర్వసాధారణంగా సారవంతాలైనవి. ఎప్పుడో గాని తేలికదనం పొడసూపదు. ఆ రచయిత లొకప్పుడొక మతోపన్యాస నిబంధనానికో, గ్రంథానికో

---

1. Meditation Fifty Six, Second Series (1703)

2. 'God's Determinations touching His Elect' యొక్క పీఠిక నుండి.

సంబంధించిన చిక్కులు విడదీసుకోవడంలో నిమగ్నులై వున్నా మరీ మైమరచిపోరు. విలియమ్ స్టౌటన్ (**William Stoughton of Massachusetts,** 1631-1701) ఒక అభిప్రాయం ప్రకటించాడు— "ఈ అడవిలోనికి మంచి విత్తు లేరి పంపడానికి దేవు డొక దేశాన్ని జల్లెడ పట్టినాడు" అని. 17 శతాబ్ది, 18 శతాబ్ది ప్రారంభంలో సాహిత్య మంతటా ఈ ప్రత్యయమే కానవస్తుంది. శామ్యూల్ సెవాల్ తన **Phaenomena Quaedam Apocalyptica** (1697) లో న్యూ ఇంగ్లండు 'న్యూ జెరూసలెమ్' గా పరిణమిస్తుం దని జోస్యం చెప్పేడు. అక్కడ మతప్రచారకుడు తన పుస్తకంతో కుస్తీ పట్టుకోవడం తప్ప శ్రోతల నాకర్షించడానికి ప్రయత్నం చెయ్యడు. చరిత్రకారుడు ప్రతి విషయానికీ చివరి కేదో వొక ప్రాముఖ్యం వుండకపో దనే విశ్వాసంతో వివరాలు వ్రాసుకుంటూ పోతాడు. ఇలా వుండే దక్కడి వ్యాసంగం. అందుచేతనే ప్యూరిటన్ రచనలలో ఒక గొప్ప శక్తీ, చైతన్యమూ కని పిస్తాయి. కాటన్ మేథర్ వ్రాసిన మెగ్నేలియావంటి గ్రంథాల్లో కొంత ఊక, చెత్త వున్నా నూకనూకూడా చూపి ఆ గ్రంథాలు ఆధునిక పాఠకు డికి పరిహారం చెల్లించగలవు.

"యూరపు పొందిన పతనావస్థలనుండి అమెరికా తీరాని కెగసి పోయి క్రైస్తవమత ఘనతల గూర్చి రచన కావిస్తాను..."

ఈ పంక్తులు మెగ్నేలియాలోనివే. ఒక సమరం ముమ్మరంగా సాగి పోతోంది. ఫలితం గురించి దేవుడు నిరీక్షిస్తున్నాడు. భవిష్యత్తే అందుకు నిదర్శనంగా నిలుస్తుంది. చూడండి: 1688 నుంచి పదేళ్ళపాటు అమెరి కనులకు, ఇండియనులకు జరిగిన పోరాటం గురించి, సరసమైన పరిహాసం మేళవించి, మేథర్ మహాశయు డేమంటాడో:

"మా ఇండియన్ సమరచరిత్ర ముందు ప్రసిద్ధ ట్రోజన్ సంగ్రామ చరిత్ర బలాదూరంటా డీ గ్రంథకర్త. పురాతనచరిత్ర పరిశోధకు లీనాడు హోమరు చెప్పిన దానిని తప్పని ఖండించేశారు. ట్రోయి నగర ప్రాకా

రాలు తాళపత్రాల (**Poet's Paper**) తో తయారైనట్లుంది (కల్పితా లని తాత్పర్యం). ఆ నగరపు ముట్టడి, కర్ర గుర్రపు సంఘటన అన్నీ వట్టి కవిత్వాలే. ఒకవేళ ఈ కొద్దిమంది ఇండియన్లతోటీ మేము చేసే యుద్ధం బైటిప్రపంచంవారికి **"Batrachomyomachia"** ("భేకమూషక సంగ్రామం" - హోమరు రచన) కంటె ఏమీ ఘనమైనది కాకపోవచ్చు గాని మా మట్టుకు మా కదే గొప్ప—అది చాలోక చరిత్ర నిర్మించ డానికి."

ప్యూరిటన్ దృష్టి క్రమంగా లౌకికోపయోగిగా పరిణతమై ఈ నూతన ప్రపంచానికి భవిష్యత్తులో విశ్వాసం కలిగించింది. అయితే దానికి ప్రతిగా వారిలో మరో నమ్మకం వుంది—"పాపం అన్నది చాలా ఘోర మైన స్వభావం గలది. దాని గూఢసంచితస్థితి మన ఊహ కందదు" (ఇది **Thomas Hooker of Connecticut,** 1586-1647 యొక్క మాట). ఈ నమ్మకానికి అమెరికన్ మనఃస్థితిమీద పట్టు తక్కువ. హాథార్న్ రచనలలో మాత్రం దీని అనంతర ఫలితాలు గోచరిస్తాయి. నిజానికి 18 శతాబ్ది మొదట్లోనే న్యూ ఇంగ్లండులో దీని పట్టు తగ్గి పోయింది. గోరీలమీద పుర్రె - అడ్డ ఎముకలూ బొమ్మ చెక్కే సంప్ర దాయం అంతరించింది. అక్కడ రెక్కలతో ఒక బాలగంధర్వుడి బొమ్మ అవతరించింది. చిత్తరువులు వ్రాసే ప్రయత్నాలుగూడా జరిగేయి. కాటన్ మేథర్‌కి కాస్త యిటీవలి తరంవాడైన జోనాథన్ ఎడ్వర్డ్స్ ఆశానిరాశలకు మధ్యస్థంగా వుండే ప్రాచీనుల దృక్పథం సజీవంగా వుండాలని తానూ మథనపడ్డాడు. నార్తేంప్టన్ సమితితో కసాలా పడ్డాడు గాని లాభం లేకపోయింది. జనామోదం తగినట్లు లభించింది అయినా. అయితే గొప్ప పునరుద్ధరణవ్రతదీక్ష గలవా డాయన. అతని రచనలలోకల్లా మిక్కిలి వాసికెక్కినది—"రుద్రుడి చేతిలో పడ్డ పాపా త్ములు" (**"Sinners in the hands of an Angry God",** **1741**). పాఠకులను భయభ్రాంతులను చేసే ఒక మతధర్మోపన్యాస మది.

అత డంతో యింతో శాస్త్రీవేకుడుకూడ (18 శతాబ్ది 'మోడల్'). అతని ప్రకృతిప్రియత్వంలో అద్వైతవాసన లున్నాయి:

"ఈశ్వర విలాసం విశ్వంలో—సూర్యచంద్రుల్లో, చుక్కల్లో, నీరదాలలో, నీలాకాశంలో, పచ్చికలో, పువ్వుల్లో, చెట్లలో, నీళ్ళలో —ఒక టేమిటి, సర్వే సర్వత్ర గోచరిస్తోంది... నే నదేపనిగా చంద్రుడివేపు చూస్తూ కూచునేవాడిని. పగటివేళ మేఘాలనూ, ఆకాశాన్నీ చూస్తూ చాలాకాలం గడిపేను. ఎందుకని? ఆయా వస్తువుల్లో జగదీశ్వరుని వైభవాన్ని దర్శించాలని." (**Personal Narrative**, 1740 నుండి. ఆత్మకథ అని అర్థం వచ్చేటట్లు ఆ పేరు పెట్టుకొన్నందు కా విషయం చిత్తగించారా ఎంత బాగుందో!) అతని **"Freedom of Will"** (1754) అనే దొకటి కటువైన రచన అనిపించుకుంటుంది. 1 కాని చివరి రోజుల్లో వ్రాసిన **'Two Dissertations'** లో (1765) మాత్రం అనుకంపా, మార్దవమూ కనిపిస్తాయి.

మేథర్, ఎడ్వర్డ్స్—ఇద్దరూ అకాలపరిపక్వమైన బాల్యంనుండి ఆఖరుదినాలవరకు బహుగ్రంథకర్తలు. ఇద్దరూ రాజకీయాదిక బహుగ్రంథకర్తలు. ఇద్దరూ రాజకీయాదిక బహుకార్యవ్యగ్రమైన జీవితాలు గడపినవారే. కాని ఆ జీవితాలు ప్రగాఢమైన అంతర్ముఖత్వఫలితాలు. అంతశ్చింతన, డైరీ వ్రాసే అలవాటు అన్నవి ప్యూరిటనుల సామాన్య లక్షణాలు. జాన్ విన్త్రోపు 'జర్నల్' (1630 నుంచి 1649 దాక

---

1 ఈ పుస్తకమే బాస్వెల్‌ను ప్రేరేపించిం దిలా అనడానికి- "నాకు కలిగిన ఒక్క ఉపశాంతి దాన్ని మరచిపోవడమే". దానిని గురించి డాక్టర్ జాన్సన్ ఇలా ఉద్ఘాటించాడు—"వాదమంతా సంకల్ప స్వాతంత్ర్యానికి ప్రతికూలంగా వుంది; అనుభవం మాత్రం అనుకూలంగా వుంది." చూ. **Paul E. More, "Selected Shelburne Essays"** (**Oxford, World's Classics**, 1935), 250-1.

పొగింది) మొదలు "The Education of Henry Adams (1907) వరకు అలాంటి డైరీలూ అవీ (ప్రకటనోద్దిష్టాలైనా కాకపోయినా) న్యూ ఇంగ్లండు సాహిత్యంలో ప్రముఖంగా పరిగణింపబడేవి. శామ్యూల్ సెవాల్ పత్రిక సంగతి పూర్వోక్తము. వీటికంటె విషయంలోనూ, రచనా ధోరణిలోనూ విలక్షణమైనది సరాకెంబిల్ నైట్—సంచిక. ఆమె ఒక నలభైయేళ్ళ వితంతువు. 1704-5 లో బోస్టనునుండి న్యూయార్కుకి, మళ్ళా తిరుగుదలగా ఒక యాత్ర చేసింది. ఆ అనుభవాలే వ్రాసిం దా సంచికలో. అది చదవడమంటే వింత్రోపులూ, మేథర్లూ లేని మరో ప్రపంచంలో ప్రవేశించడమే :

"నే నోసారి ఒక వ్యాపారి ఇంట్లో వుండగా అక్కడికో పల్లెటూరి వాడు వచ్చాడు. మనిషి పొడుగరి. గది మధ్యకు వచ్చాడు. ఎందుకో వికారంగా తలవూపేడు. వీదో సుగంధ సారాయాన్ని ఎక్కువగా ఉమ్మేసి, పారలాంటి జోడుతో తుడిచేశాడు. మురికితో వున్న ఒక చిన్న గరిటలాంటిది నేలమీద పడేశాడు. కదలకుండా మెదలకుండా, చేతులు కట్టుకొని బుట్టలోంచి బైటపడిన పిల్లిలా తన చుట్టూ తేరిపార చూసు కుంటూ నిలుచున్నాడు."

కొంత భావస్వాతంత్ర్యం కలిగిన లౌకిక వాసనలు తగిలిన న్యూ ఇంగ్లండులో 18 వ శతాబ్ది ధోరణి యిది. అది మళ్ళా కాటన్ మేథర్ మేనల్లుడూ, టోరీ మినిస్టరూ అయిన మేథర్ బైల్స్ (Mather Byles, 1707-88) వ్రాసిన ఉల్లాసపు వాక్యాల్లో మరింత సంస్కారంతో కనిపిస్తుంది. ఆ మాట లతని మామయ్య తరానికి శాసన పంక్తుల్లా వుంటాయి.

"నాటి ప్రథమ నౌక మెలుగెలుగని పండితులతో సాగరగర్భంలో పడి అనాగరికతీరం చేరుకున్నాక నేటికి కేంద్రగతుడైన సూర్యుని చుట్టూ

వార్షిక ప్రదక్షిణాలతో శతయాత్రలు చేసింది భూమి; ఘనంగా శుభోదర్కంగా నిలచింది మా దేశం"1

న్యూ ఇంగ్లండుకు వెలుపల కూడ తగిన నాగరికత గోచరిస్తుంది. పెన్సిల్వేనియాలో విలియమ్ పెన్ (1644-1718) వ్రాతల్లో 'క్వేకర్' (**Quaker-a religious sect found by George Fox,**1624-90) విశ్వాసం యొక్క స్తిమితత, ఉదారత కనిపిస్తాయి. దక్షిణ దేశపు వలసల్లో కూడ మత ప్రావీణ్య బుద్ధి పోలేదు. 18 శతాబ్ది నడుమ ఫిలడెల్ఫియా రాష్ట్రంలోని క్వేకర్ పట్టణంలో కళలకూ, వాణిజ్యానికీ ప్రచారం కొంత చురుకుగా సాగింది. న్యూ ఇంగ్లండులో వున్నట్టు చెర్చి, బడి, పౌరసమావేశవేదికా కలిసి వుండే పద్ధతి వంటి పద్ధతి మాత్రం మరెక్కడా వుండేది కాదు. వర్జీనియా రాష్ట్రంలోని ఆంగ్ల వసతి ప్రాంతంలో ఐహిక చింతన లెక్కవవుతున్నాయి. రాబర్ట్ బెవెర్లే వ్రాసిన **History and Present State of Virginia** (1705) లోనూ, విలియమ్ బర్డ్ (**William Byrd of Westover,** 1674-1744) వ్రాతల్లోనూ ఈ విషయం స్పష్టపడుతుంది. బర్డ్ మంచి సంపన్నుడు. చాలా కాలం ఇంగ్లండులో వుండి చదువుకొని వచ్చిన వాడు. అతని నివాసం లోపల ఒక గ్రంథ భాండారం. అందులో నాలుగువేల పుస్తకాలు (కాటన్ మేథర్ పుస్తకాలకు రెట్టింపు). గోడలకు వ్రేలాడుతూ ఇంగ్లీషు పెద్దల వర్ణ చిత్రాలు—వలస వారి లెక్కల్లో అదో మహాసాధమే. ఆయన వర్జీనియా గురించి రక్తిగల రచనలు చేశాడు (ముద్రణ 1841). హస్తలాఘవంతో ఒక డైరీ (**Short hand diary**) కూడ వ్రాసేవాడు. అందులో ఒక భాగం ఇటీవలే ప్రకటితమైంది. బర్డ్‌ని "**American Pepys**" అనే వారు. (ఆ రోజుల్లో అమెరికన్ రచయితలందరకూ ఇలాగే ఏవో పేర్లు పెట్టేవారు. వాళ్ళు పరుముకుంటూ వుండేవారు) బర్డ్

---

1. **'To Pict orio, On the Sight of his Pictures'** (1744.)

బాస్వెల్‌ను కొంత గుర్తుకు తెస్తాడు. బాస్వెల్ వ్రాసిన "లండన్ జర్నల్" లాగే బిర్డ్ వ్రాసిన సీక్రెట్ డైరీని చూస్తే అతడు చతురుడూ, ఉదాత్త చిత్తుడూ అని తెలుస్తుంది. అతన్ని ప్యూరిటన్ అనడానికి వీల్లేదు. తన **History of the Dividing Line** లో వర్జీనియా స్థావరాలను గురించి ఆయన ధోరణి ఎలా వుంటుందో చూడండి:

"కిక్వోటన్ నుండి జేమ్సు టౌనుదాకా నరసాగేరు వాళ్ళు. అక్కడ నిజమైన ఆంగ్లేయుల్లాగ ఏభై పౌనులలోపున ఒక చెర్చి కట్టేరు. ఐదువందలు పెట్టి ఒక పానశాల కట్టుకున్నారు."

1732 లో ఒకసారి బిర్డ్ ఎవరో పొరుగు వాళ్ళ యింటికి వెళ్ళిన సంగతి యిలా వర్ణించాడు:

"అద్దా లమర్చబడిన స్తంభాలతో అందంగా వున్న ఒక గదిలోకి తీసుకెళ్ళేరు నన్ను. అక్కడో రెండు లేళ్ళు ఇల్లంతా మచ్చికగా తిరుగుతూ వున్నాయి. అందులో ఒకటి నన్ను కొత్తవాడిని చూసినట్లు చూడసాగింది. కాని, పాపం అద్దంలో తన ప్రతిబింబాన్నే చూసుకొని అద్దం క్రిందవున్న టీ బల్లమీదికి చెంగున దూకింది. కాని వెనక్కి ఒరిగి పోయి ప్రక్కనున్న పింగాణి సామానుమీద పడింది. అదంతా పెద్ద గందరగోళం అయి పోయింది. 'ఇదేమిట్రా' అనుకుంటున్నాను నేను. ఏం కొంప మునిగిందో అనుకుంది శ్రీమతి స్పాట్స్ వుడ్ (1710-22 లో వర్జీనియా గవర్నరైన అలెగ్జాండరు స్పాట్స్ వుడ్ భార్య). ఆ గొడవ నంతటినీ భరించిన ఆమె నెమ్మది చూస్తే ఆ పాటి నష్టం జరిగితే నేమిలే అనిపిస్తుంది."

దీనికి ప్రతిగా మరో గృహచ్ఛిద్రం, అంతకు తొంభై యేళ్ళ ముందు బోస్టన్‌లో జరిగింది. జాన్ విన్‌త్రోప్ 'జర్నల్' నుండి దాని వర్ణన చూద్దాం:

"ఒక ధర్మాత్మురాలు—కొంత కాలంగా లండనులో వుండేది. వచ్చేటప్పుడు అక్కడి నుంచి మంచి విలువైన మేలిరకం 'లినెన్' తెచ్చు కుంది. అదంటే ఆమెకు వల్లమాలిన మోజు. ఒకనాడు స్వయంగా ఉతుక్కుని, మడుచుకుని ఆ రాత్రికి చావడిలో వదిలేసింది. ఆవిడ కో నీగ్రోదాసి వుంది. అది ఆలస్యంగా ఆ గదిలోకి వెళ్ళింది. క్రొవ్వొత్తి నుసి

కొస్త ఆ బట్టమీద రాల్చేసింది. ఆ యింతా తెల్లారేసరికి బట్ట బట్టంతా కాలి పూరుకుంది...కాని ఆవిడ కది ఉపకారకమే అని దేవుడు సంతోషించాడు. అంతటితో ఆమె నది ప్రాపంచిక సుఖవిముఖురాలినిగా చేసిందనిన్నీ, కొద్ది రోజుల్లో ప్రోవిడెన్సు దీవిలో ఆమె భర్త అకాల జలవన్మరణానికి గురి కావడంవల్ల సంభవించిన ఘోరతరమైన బాధకు ముందే ఆమెకు కొంత తర్ఫీదు ఇచ్చిందనిన్నీ."

పై రెండు వ్రాతల్లో మనకు భేదం స్పష్టంగా కనబడుతోంది. ఎక్కువగా కనబడుతోంది. దానికి ప్యూరిటన్ మెసాచుసెట్స్‌కీ, వర్జినియా స్థావరానికీ వున్న దూరం కొంత కారణం కావచ్చు. అంతే కాక ఒక శతాబ్దికీ, మరో శతాబ్దికీ వున్న ఎడం కూడా కారణమే. 'విప్లవ' కాలం నాటికి వలసలన్నీ అవినాశావకాశంగా స్థిరపడ్డాయి. డేనియల్ బూన్ **(Daniel Boone)** అపలేచియన్ **(Appalachian)** కొండల్లో పిస్‌ఘా **(Pisgah)** శిఖరం ఎక్కి అక్కడి నుంచి 'కెంటకీ' **(Kentucky)** రాష్ట్రం వేపు దుర్భిణీ వేశాడు. 1785 లో చనిపోయిన శామ్యూల్ మేథర్ 'మేథర్' వంశంలో చివరివాడు. అమెరికన్లలో నాల్గవతరంవాడు. అప్పటి కక్కడ అంతఎక్కువ కాకపోయినా మంచిమంచి యిళ్ళు లేచాయి. పెద్దమనుష్యు లుండేవారు. వ్యాజ్యము, బానిసతనం వుండేవి. పెద్దపెద్ద కళాశాలలు కొన్ని, పాఠశాలలనేకం వుండేవి. బోస్టన్‌లో, ఫిలడెల్ఫియాలో, న్యూయార్కులో, ఛార్లెస్‌టన్‌లో (1803 దాకా సం. రాష్ట్రాల్లో చేరకుండా, ఒకప్పుడు ఫ్రెంచి, ఇప్పుడు స్పేనిషుపట్టణంగావున్న న్యూ ఆర్లియన్సులో కూడ) నాగరికజీవితం, సంస్కారం ఏర్పడ్డాయి. వార్తా పత్రికలు, గ్రంథాలయాలు, సమితులు, సమాజాలు, గోష్ఠులు, నాటక ప్రదర్శనలు1—ఓ! ఒకటేమిటి, నాగరక లక్షణా లనేకం పట్టేయి.

1. బోస్టన్‌లో మాత్రం 18 శతాబ్ది చివరకూడ నాటక ప్రదర్శనాలకు ధర్మోపన్యాసాల వాలకం కట్టించవలసి వచ్చేది.

వలస సాహిత్యం ఇక 'మాతృభూమి' (అంటే ఇంగ్లండు, తత్రాపి యూరపు) యొక్క సాహిత్యానికి కొస్త ఇరుగు పొరుగుగా అభ్యుదయం పొందడాని కవకాశం వచ్చింది. స్థూలంగా చూస్తే ఆంగ్ల సాహిత్యంకంటే దాని వైలక్షణ్య మాత్రే కనిపించదు. అంతకంటే కూడ వికారంగా తయారైంది. ఒక ప్రముఖ నగరంనుండి రాదగిన స్ఫూర్తి లేదందులో. కొద్ది మాటల్లో తప్ప కొత్తనిపించుకు నేది లేదు. ఏవో కొన్ని ఇండియన్ పేర్లు బైబిలు మొ॥ ప్రసిద్ధ విషయాలకు సంబంధించిన ఉదాహరణ ప్రసంగాల్లో కూడ అసంగతంగా ప్రవేశించాయి. దాని ఆదర్శాలన్నీ ఆంగ్ల మానస పుత్రికలే—దేవుడిలాంటి ఎడిసనట! మహా భాగ్యశాలి డ్రైడెనట! దివ్యుడు పోపట! (ఇలా వుండేది ఆనాటి వాళ్ళ వేలం వెర్రి). 1 ఇక వలస సాహిత్యం రాష్ట్రీయ సాహిత్యం అయిందనవచ్చు. విలియమ్ బిర్డ్, మేథర్ బైల్స్ మొదలైన పెద్దలకు లండనన్నా, దాని గొప్పలన్నా ప్రత్యేకమొక రకమైన మోజు వుంది. అయితే వాళ్లు మరి ఇంగ్లీషు వాళ్ళేనాయె. అందుకోసమొక క్షమాపణ చెప్పుకోవలసిన అవసరం లేదు. 'విప్లవం' వచ్చి వాళ్ళందరినీ అమెరికను లనిపించి ఒక నవీన ధ్వజం క్రింద ప్రతిష్ఠించే వఱకూ ఆపాటి మోజులు తప్పవు.

---

1. చూ. **Stanley T. "Williams, The Beginnings of American Poetry"** (1620-1855) (**Uppsala** 1951), 43-4.

# 2

## అమెరికా - యూరప్ స్వాతంత్ర్య సమస్యలు

'విప్లవం' యొక్క రాజకీయాలైన సంగతి సందర్భాలలో మన ప్రమేయం ఎంతవరకంటే ఆనాటిసాహిత్యం చాలామట్టుకు రాజకీయ ప్రభావితమైన దన్నంతవరకే. అది కొంత సుపరిచితమైనదే. అట్టే చర్చించ నవసరం లేదు. **'Declaration of Independence'**('స్వాతంత్ర్య ప్రకటన - 1776) అనేది సార్థకమైన గద్యరచన అని ఎవ్వరికీ చెప్పనవసరంలేదు. టామ్‌పెయిన్ (**Tom Paine**) వాక్చాతుర్యము ప్రతి రచయితా ప్రదర్శించలేదు.

"ఇదే అదను మన ఖండాంతర సమైక్యాన్ని, విశ్వాసాన్ని,మరియాదను పరిరక్షించుకోవడానికి. ఇప్పుడు మనం చేసే ఎంత చిన్న తప్పిదమూ భావితరాల్లో చాలా పెద్దదిగా భావింపబడుతుంది. ఓకు మొక్క లేత తొక్క మీద సూదిమొనతో గీసిన అక్షరాలు చెట్టుతో పాటే పెద్దవైపోతాయి."

ఆ పోరాటం అతిప్రముఖమైనదన్న పెయిన్ అభిప్రాయంతో ఇంచు

మిం చంతా ఏకీభవించారు. అక్రమాన్నీ, అన్యాయాన్నీ వెల్లడించి పాఠకులను తమవంక త్రిప్పుకోడానికి రాజభక్తులూ, అమెరికన్ దేశభక్తులూ ఒక్కలాగే పూనుకున్నారు. రచయితల పూనిక అది జనంలో ఆవేశం రేకెత్తించడానికై తేనేమి (పెయిన్ రచనలు, ఫిలిప్ ఫ్రెనో పద్యాల్లోవలె), ఎదిరిపక్షాన్ని ఎగతాళిచెయ్యడానికై తేనేమి (జాన్ ట్రమ్‌బుల్ వ్రాసిన **M' Fingal** 1782లో వలె), హేతువాదంతో ఆకట్టుకోడాని కై తేనేమి (అలెగ్జాండర్ హేమిల్టన్, జేమ్సు మేడిసన్, జాన్ జే వ్రాసిన 'ఫెడరలిస్టు' వ్యాసాల్లో వలె) పాఠకుల కంటులో సార్వత్రికమైన ఒక ఆవేగం గోచరించేది. వాద మన్నది దానంతట అది మంచిరచనలకు దారితీయదు. అయితే సాధారణంగా అది రచనకు మంచి శక్తినిచ్చే సాధనం అవును.

ఆ సమరంలో లభించిన విజయం ప్రజాస్వామిక సిద్ధాంత విజయం. అది శైశవావస్థలో ఉన్న దేశానికొక ఉత్సాహమంత్రం అయింది. సంయుక్తరాష్ట్రం సరిక్రొత్తగా ఆవిర్భవించింది. ప్రాతతప్పులూ, ప్రలోభాలూ అంతరించాయి. చరిత్ర క్రొత్తపుటలు తెరుచుకుంది. ముందునాటి ప్యూరిటను భవితవ్యవిశ్వాసం నిలద్రొక్కుకునేవుంది. అందుకు పెయిన్ వాక్యాలే తార్కాణలు. కాని దానికి మానవస్వభావ సర్వాంగీణపరిష్వంగం చేయడానికి తాహతు చాలదు. శ్రుతులపై నమ్మకం దిగజారిన యీ శుభ తరుణంలో ప్రజల అభినివేశం విధులనుండి హక్కులకూ, అవినీతినుండి ధార్మికతకూ మొగ్గుచూపింది. అవినీతినంతా యూరపుకి రవాణాచేశారు. చెడిపోయినవాళ్ళ చరిత్రలు మానేసి కాస్త పనికొచ్చే రచనలు చదవడం మొదలుపెట్టేరు. ఇక త్వరలో పరిపూర్ణవికాసం పొందే స్థితికి వచ్చేసింది అమెరికా. అప్పటికే అమెరికన్ కళాకారుల్లో ప్రథమశ్రేణికి చెందినవారున్నారు. బెంజమిన్ వెస్టు రేనాల్డుకి పిమ్మట 'రాయల్ అకాడమీ' అధ్యక్షుడైనాడు. జాన్ సింగిల్టన్ కోప్లే, గిల్బర్ట్ స్టువర్టులు ప్రజామోదానికి పాత్రులైన చిత్రకారులు. ఇతరకళారంగాల్లోనూ, వివిధవిద్యాశాఖల్లోనూ క్రమంగా అమెరికనుల పేర్లు వినిపించసాగేయి.

వారిలో బెంజమిన్ ఫ్రాంక్లిన్ ప్రముఖు డనవచ్చు. అత డొకచోటివాడు కాదు. బోస్టన్, ఫిలడెల్ఫియా, లండన్, పేరిస్ తిరిగివచ్చినవాడు.

ధార్మికమ్మన్యుడని అతని నాక్షేపించారు డి. హెచ్. లారెన్సూ, మరి కొందరు విమర్శకులూ. అతని రచనలు 'వే టు వెల్త్' (1758) అనేదీ, 'పూర్ రిచర్డ్' పంచాంగ సూత్రాలూ హొరేషియో ఆల్జిర్ వ్రాసిన నవలికల కోవకూ, డేల్ కార్నిగీ వ్రాసిన **"How to Win Friends and Influence People"** అనే ఆవేశపూరితమైన గద్యంకోవకూ చెందినవిగా గణనకెక్కాయి. అయితే అతని అభిమానులు కొందరలా అతిశయంగా ఊహించుకున్నా రనవచ్చు. అతని ధర్మసూత్రాలు అన్నీ సొంతం కావు. వాటి కక్కడా అక్కడా మాతృక లున్నాయి. (లేవని ఆయన ఎప్పుడూ అనలేదులెండి) అపరిసమాప్తమైన ఆయన స్వీయచరిత్ర1 ప్రసిద్ధమైనదే. ఆ వచనరచన నిరాడంబరము, నిశితము, తత్రతత్ర హాస్యనిర్భరమూ అయినదేకాని కొందరమెరికను లుద్ఘాటించినంత స్ఫూర్తిమంతమైనది కాదు. స్విఫ్ట్ రచనకూడా ఇలాగే నిరాడంబరంగా వుంటూనే అధిక్షేపాత్మకంగా వుంటూవుంటుంది. నిజానికి ఫ్రాంక్లిన్ తానో పెద్ద పండితుడైనట్టు ఎప్పుడూ అభినయం చెయ్యలేదు. అతడెప్పుడూ బహుకార్యవ్యగ్రుడు. అయినా అమెరికాయొక్క సాంస్కృతికప్రతిష్ఠ కంతదోహదం చేశాడంటే అది ఆశ్చర్యకరమైన సంగతే. ముద్రణం, సంపాదకత్వం, అన్వేషణ, విజ్ఞానశాస్త్రం, రాజకీయాలు-ఎందులోపడితే అందులోనే సులభంగా నిర్వహించుకు వచ్చేవా డతడు. బ్రిటనులో కొన్నేళ్ళపా టతడు వలసవారి ప్రతినిధిగా వుండేవాడు. అప్పట్లో బర్క్, లార్డ్ కేమ్స్, హ్యూమ్, ఏడమ్ స్మిత్ మొ॥ హేమాహేమీలతో చెలిమిచేశాడు. పేరిస్‌లో అమెరికన్ మినిస్టరుగా వున్నప్పుడెంతో ఘనంగా ప్రజాభిమానం చూరగొన్నాడు. పేరుపడ్డాడు. ఆ వినీతవేషము, ఆ ప్రసన్నత, ఆ నిరాడంబరగంభీరత చూస్తే స్వాభావికమైన మానవత్వం మూర్తీభవించిన ట్లుంటాడని అనుకునేవారు. అంటే ప్రపంచానికి మోక్షం అడవిమనుషులవల్ల రావచ్చు అనే అభిప్రాయానికి ప్రతీకలా కనిపించేవాడు. (అయితే ఫ్రాంక్లిన్ ఇంచుమించు తన జీవితమంతా పెద్దపెద్ద పట్టణాలలోనే గడిపారు). అసలు క్రైస్తవకులపతి జాకబ్‌కీ, అతనికీ మధ్య

1. రచన ప్రారంభం 1771లో. 1867లో ముద్రితము.

కొంత సామ్యం వుందట. మెల్విల్లీ అన్నట్లు (In Israel Potter, 1855) అతనిలో ఒక జానపదజనోచితమైన అమాయికత మట్టున గొప్ప లౌకికప్రజ్ఞ, నాజూకైన ఇటాలియన్ వైదగ్ధ్యమూ వున్నాయి. అవి దాచి పెట్టుకోవడ మతనికి సరదా అనడంలో సందేహ మక్కరలేదు. ఈ సందర్భాల్లో ఫ్రాంక్లిన్ 'అమెరికన్ హాస్య'మంటే యేమిటో చవిచూపిన వారిలో మొదటితరంవా డనవచ్చు. ఏమంటే—అమెరికన్ జీవితంలో చిత్రంగా పెనవేసుకుపోయిన కలగాపులగపుతనం, పుష్కరత్వాల ఫలితంగా వక్రత్వపుచమత్కారత్వంతో తయారైన 'అమెరికన్ పరిహాసం' అన్న దొక టున్నది. అమెరికాయొక్క ప్రాథమికావస్థను సంబంధించిన విషయా లంటే యూరపియనులు మిక్కిలి సరదాపడతారు. అమెరికన్ పురాణవాఙ్మయంలో చాలా కటువుదనమూ, కాఠిన్యమూ వున్నాయంటే అవి అక్కడ యూరపియనులచేతనే ప్రతిష్ఠింపబడ్డా యనవచ్చు.1

---

1. ఒకసారి **Mrs. Gaskell** అనే ఇంగ్లీషు నవలారచయిత్రి (1860)కామెయొక్క అమెరికనుమిత్రుడు **Charles Eliot Norton** అమెరికన్ దృశ్యాల ఛాయాచిత్రాలు కొన్ని పంపించాడు. అవి చూచి ఆమె తెల్లబోయి "నేను అమెరికా అంటే చాలా వింతగా, విడ్డూరంగా వుంటుం దనుకున్నానే! ఇదేమిటి, ఈ చిట్టడవీ పొదలూ అవీ అచ్చం ఇంగ్లండులాగానే వున్నాయే!" అని అన్నది. ఆమె మరో ఆంగ్లస్త్రీ వేసిన చిత్తరువు చూసింది. అందులో అది వర్జీనియాలోని ఒక భీకరకీకారణ్యపు దృశ్యం: ఒక లోవపుంత. అటూ ఇటూ చెట్లు పెచ్చుపెరిగి వున్నాయి. ఆమెప్రక్కన భర్త అక్కడున్న వాగునిండా మొసళ్ళున్నాయని బారుచేసిన పిస్తోళ్ళు పుచ్చుకొని ఆమెను కాపలాకాస్తున్నాడు. ఇది చూచి "బాగుంది ఈ బొమ్మ. అమెరికాఅంటే నా ఉద్దేశానికి తగినట్టు వుంది" అనుకొని సంతృప్తిపడింది. (**"Letters of Mrs. Gaskell and Charles Eliot Norton, Oxford,** 1932), 51-2. అమెరికాలో ఒక ఇండియన్ తెగకు పేరైన 'అపచే' (**Apache**) అనే మాట పేరిస్‌లో రౌడీలకు వాడుతారు. అమెరికా యెడల యూరపియనుల ధోరణి కిది మరో నిదర్శనం.

అమెరికన్ పరిహాస మంటే యూరపియనుల ఊహలను, కల్పనలను వారిది వారి కప్పజెప్పినట్లుగా చెప్పడమే. అందుచేతనే కృషీవలుని గురించి రూసో కన్న కలను లక్ష్యీకరించి సరిహద్దును తనగురించి "ఈ బిడ్డ" అంటాడు. అందుకే బఫెలో బిల్ అనే ఆయన తన సాహసయాత్రల గురించి తానే వ్రాసుకున్నాడు. చవకబారు నవలలు కొన్ని. అందుకే కాబోలు చికాగో రాడీలు రాడీ వినోదాలనే హర్షించేవారు. ఇక నీతులు బోధిస్తూనే పరిహాసం చేసే ఫ్రాంక్లిన్ గారి సంగతి చెప్పేదేముంది! నయాగరాజలపాతంలో తిమింగిలాలు మిట్టపిల్లల్లా ఎగిరిపడుతూ వుంటే చూడటానికి మహాపసందుగా వుంటుందని ఆంగ్లపాఠకులకు నమ్మజెప్పాతాడాయన. క్రెవెకొయర్ (Crevecoeur) వ్రాసిన **"Letters from an American Farmer"** (1782) లో, ముఖ్యంగా దాని ఫ్రెంచి పాఠంలో—"సామాన్యపు టమెరిక న్నంటే ఒక చదువుకొన్న రైతు" అనే భ్రాంతి ఇతరులకు కలిగేలా ప్రపంచింపబడింది. 1784 లో పేరిస్‌లో ఫ్రాంక్లిన్‌కి ఉత్తరాధికారి (**Successor**) గా వచ్చిన థామస్ జెఫర్సన్ అక్కడ ఫ్రాంక్లిన్ కలిగించిన అభిప్రాయం బలపడేటట్లు చేశాడు.

ఫిలడెల్ఫియా క్వేకరూ, వృక్షశాస్త్రజ్ఞుడూ అయిన విలియమ్ బర్ట్రిమ్ కూడ అమెరికా గురించి ఎలా చెబితే యూరపియనులు వినడానికిష్టపడతారో అలాగే వ్రాశాడు. ఒక మహాకుతూహలంతో ప్రకృతిలోని క్రొత్త క్రొత్త వస్తువులకోసం, ఇండియనుల ఆచారాలు తెలుసుకోవాలనీ దక్షిణప్రాంతంలో ఒక సుదీర్ఘ పర్యటన చేశాడు బర్ట్రిమ్. 1791 లో అతడు వ్రాసింది ప్రచురింపబడిందీ బృహచ్ఛీర్షికతో—**"Travels through North and South Carolina, Georgia, East and West Florida, the Cherokee Country, the Extensive Territories of the Muscogulges, or Creek Confederacy, and the Country of the Chataws."** అనేక భీకరజంతుజాల సంవలితము, వృక్షజాల శబలితమూ అయిన ఒక అపరిచిత దూర ప్రపంచం గురించిన ఇంద్రజాలంలా వుంది ఆ

పుస్తకం. అందులోని ఆ వింత ప్రపంచపు క్రొత్త మనుష్యులు రూసోగారి ధోరణిలో మాట్లాడుతారు:

"ఒక ఓకు చెట్టు నీడలో పరిచిన ఎలుగు తోలుమీద సాగోరి ధూమపానం చేస్తున్న ఒకాయన నన్ను చూచి లేచి సలాంచేసి స్వాగతం పలుకుతూ ఇలా అన్నాడు: 'దయచేయండి. క్రొత్త వారిలా వున్నారు. నే నిప్పుడే వేట, చేపలు పట్టడం చేసి వచ్చి కాస్త విశ్రాంతి తీసుకుంటు న్నాను. ప్రకృతి బోధలు పాటిస్తూ వున్నాను.' "

ఇలాగే ఆ పుస్తకంలో మొక్కల పట్టికలు, వాటి స్వరూప స్వభావ వర్ణనల మధ్య మధ్య కాస్త మనోజ్ఞమైన పంక్తులు వుంటాయి. మిగతా యాత్రికుల్లాగ తన అసౌకర్యాల నంత పట్టించుకోడు. పాములూ, దోమలూ పరివేష్టించిన ఒక చిత్తడి నేలలో రాత్రంతా ఒంటరిగా గడిపి ప్రొద్దు పొడవగానే "అమ్మయ్య!" అనుకొని లేచి యథాప్రకారం ఉల్లా సంగా తన పరిశోధన కుపక్రమించే వాడు. వట్టి వచనమే అయినా ఎంత గమ్మత్తుగా వుంటుందో చూడండి అతని ప్రసంగం:

"చుట్టూరా వున్న కానలోవలలో నుంచి మెఱుగులీనుతూ సరస్సులు, హ్రదాలూ కనిపిస్తూ వుండబట్టి గాని లేకపోతే అదంతా ఒక స్వాప్నిక దృశ్య మనుకోవలసి వస్తుంది...చుట్టూ సువిశాల శాద్వల తలాలూ, మధ్య గుండ్రంగా, కోలగా ఆ సరోవరాలన్నీ ఒక్క మాదిరిగా కనిపించేసరికి ఆశ్చర్యచకితులమై పోతాము. ఆ సరస్తీరాల్లో ఓకు, మేగ్నోలియా, గార్డోనియా, వాసనారంగాలు నారంగాలు మొ॥ చెట్ల తోపుల నడుమ గైరికచ్ఛాయల క్రింద అతినిర్మలాంభఃపూరాలతో శృంగారమండ పాలవలె ఉన్న కందరాలను చూస్తూ వుంటే కవుల కట్టుకథల అపేక్ష లేకుండానే అది ఆ వనదేవతయొక్క విలాసమందిర మనిపిస్తుంది. కాని నిజాని కది ఒక భయంకరమైన బండమొసలి యొక్క ఏకాంత స్థావరము."

మెరయన్ మూర్ (**Marianne Moore**) అనే అమెరికన్ కవి

కవుల కల్పనలలో గూడ యథార్థవాదులుగా వుండవలసిన అవసరం గురించి చెబుతూ, వాళ్ళ వనాలన్నీ ఊహాకల్పితాలైనా, అందులోని కప్పలైనా నిజమైనవి కావా లంటాడు. (అంటే ఏ కొంతైనా యాథార్థ్యం లేకుండా అంతా వట్టి కల్పన అయితే ఏం బాగుంటుందని.) ఫెళ ఫెళలాడే బర్ట్రమ్‌గారి గద్యరచనకూ ఆ మాట వర్తిస్తుంది. అదొక మహా కాంతార కావ్యం. అమెరికన్ రచయితల కొక వస్తునిక్షేపం. యూరపియన్ రచయితలను గూడా అది బాగానే ఆకర్షించింది. వర్డ్స్‌వర్త్, కాలరిడ్జి, సౌదే, కేంబెల్, చాటూబ్రయండ్ (**Chateaubriand**) మొదలైన వారంతా బర్ట్రమ్ పుస్తకం చదివారు, వినియోగించుకొన్నారు. కేంబెల్ (**Campbell**) తన "**Gertrude of Wyoming** (1809) అనే కావ్యంలోని పాత్రలకు ఒక అందమైన పెన్సిల్వేనియాలోయను రంగస్థలంగా చేశాడు. మరీ దక్షిణ ప్రాంతాన్ని, **Muscogulges** ను కథారంగాలుగా చేసుకున్నాడు **Chateaubriand** తన అమెరికను రొమాన్సులు మూడింట.

హగ్ హెన్రీ బ్రేకన్ రిడ్జి (1748-1816) అనే ఆయన తన **Modern Chivalry** అనే ఒక చక్కని నవలలో (1792-1815 మధ్య ఒక 'సీరియల్'గా ప్రచురింపబడింది) అమెరికా సరిహద్దుప్రాంతంగురించి మరో రకం అభిప్రాయం వ్యక్తంచేశాడు. అతని కావ్యంలో కల్పన స్వల్పం. ఈ ప్రాంతాన్నే విలియమ్ బిర్డ్ 'లబ్బర్ లేండ్' (దేబెల దేశం అని అర్థం) అన్నాడు. ఇక్కడి మనుషులకి పరిసర ప్రకృతిరామణీయకంతో పనిలేదు. తమ ఉత్సాహమంతా గుఱ్ఱపు వేటలోను, కల్లుగీతలోను చూపుకుంటారు. మళ్ళా బర్ట్రిమ్‌ఆశయానికి జేమ్స్ ఫెనిమోర్ కూపర్, బ్రేకన్ రిడ్జి ఆశయానికి మార్క్ ట్వెయినూ పునర్భవం ప్రసాదించారు. ఎలాగైతేనేం, 1790 నాటికి అమెరికన్ తన దేశపు సాహిత్యాన్ని చూసుకుని ఆ రచయితల్లో గల వైవిధ్యానికే సంతృప్తిపడవచ్చు. **Charles Brockden Brown** (1771-1810) అనే రచయిత అమెరికాను కథా

రంగంగా చేసుకుని నాలుగు జానపద నవలలు వ్రాశాడు: **Wieland** (1798), **Arthur Mervyn, Ormond, Edgar Huntly** (ఈ మూడూ 1799 లో ప్రచురింపబడ్డాయి. అప్పటి కతని వయస్సు 28 సం॥లు మాత్రమే). కీట్సూ, మరికొందరు ఆంగ్లరచయితలూ ఈ నవలలను మెచ్చుకొన్నారు. ఇక నాటకరంగం సంగతి చూసుకుంటే—1787 లో **Royall Tyler** అనే ఆయన **The Contrast** అనే ఒక మోదాంత నాటకం (**Comedy**) వ్రాశాడు. దాని ప్రస్తావనలో ఆయన ఉరక లేస్తూ ఉంటాడు:

"దేశాభిమానుల హృదయాలు సంతోషంతో ఉప్పొంగి పోవు గాక! మనదీ అని చెప్పుకోదగినదాన్ని చూడబోతున్నాము నేడు" అని.

అత డలా గొప్ప చెప్పుకోవడానికి తగిన కారణం వుంది. షెరిడన్ పైత్యం కొంత వున్నా నాటకంలో చతురతా, చమత్కారమూ వున్నాయి. 'Lady Teazle' నాటకం ఆడటంతో మొహం మొత్తిన ఈనాటి ఒక పెద్దనాటక కంపెనీకి 'The Contrast'ను ప్రదర్శించడం కంటే చెయ్యడానికి కొఱమాలిన పనులనేకం వున్నాయి. (అంటే అది లెక్కలేనన్ని తడవలు ప్రదర్శింపబడిం దని అభిప్రాయం.)

అమెరికన్ దేశాభిమాని సంతోషించడానికి కారణా లిలాంటివే వుండేవి కొన్ని 18 వ శతాబ్దం చివరి నాటికి. అయితే అన్నీ వెంటనే బయట పడకపోయినా అశాంతికి, అసంతృప్తికి కారణాలైన పరిస్థితులుకూడా వున్నాయి. అమెరికనుల కానాడు రాజకీయస్వాతంత్ర్యం వచ్చిందికాని దానితోపాటు సాంస్కృతిక స్వాతంత్ర్యం రాలేదు గదా - అయితే సాంస్కృతిక స్వాతంత్ర్యం కావాలని గోలపెట్టడానికి పనికొచ్చింది రాజకీయ స్వాతంత్ర్యం. 'ఖండాంతర సమితి' (**Continental Congress**) లో. సభ్యుడైన ఒక ఉన్మత్తదేశభక్తుడు 'ఇకమీదట సంయుక్తరాష్ట్రాల్లో ఇంగ్లీషుభాష వాడకూడదు' అని ఒక ప్రతిపాదన చేశాడట. రోజర్ షెర్మన్ అనే మరొక సభ్యుడు ఇంగ్లీషును ఉంచవలసిందే

కాని సం.రా.లోని ఇంగ్లీషువారు మాత్రం గ్రీకుభాష నేర్చుకోవాలని నిర్బంధంపెడితే సరిఅని ఒక సవరణ ప్రతిపాదించాడు! అమెరికన్ విప్లవానంతరసంఘర్షణలో ఫెడరలిస్టులకూ, జెఫర్సన్ పక్షంవారికీ ఏర్పడిన వివాదం నాటి సాహిత్యంలోనూ సమాంతరంగా కనిపిస్తూ వచ్చింది. జెఫర్సన్ పక్షీయులకు రాజకీయాధికారం హస్తగతమైతే, సాహిత్యంలో సాంప్రదాయికులైన (**Conservative**) ఫెడరలిస్టుల దృక్పథానికి ప్రాబల్యం ఏర్పడింది. ఒకనాడు వలసవారందరికీ మొనగాడనిపించుకొన్న **Tom Paine** ఏళ్ళతరబడి ఉపేక్షితుడై చివరికి 1809 లో చనిపోతే దేవానాంప్రియమైన క్షేత్రంలో అంత శవాని కింత చోటు దొరికింది కాదు. 'రేడికలిజమ్' సాంస్కృతిక మైనదైతేనేమి, రాజకీయ మైనదైతేనేమి, అది రోజర్ షెర్మన్‌తోపాటు **Connecticut** పౌరులైనవారికి, **Hartford wits** అనిపించుకొన్నవారికి ప్రతికూలంగా పరిణమించింది. ఈ జాన్ ట్రంబుల్, జోయల్ బార్లో,[1] టిమోతీడ్వైట్, ఇంకా మరికొందరు తెలివితక్కువ జనసామాన్యంవల్ల ప్రమాణాలు పడిపోతున్నాయి, చెడిపోతున్నాయి అని ఆక్షేపణలు తెలియజేశారు. అయితే తరువాతితరాల ఆక్షేపకులవలెనే వీళ్లూ కలిసిరాగా మూర్ఖులుగా ఆరోపణలకు గురియైనారు. సంయుక్తరాష్ట్రాలలో సాంప్రదాయికుల స్థితి అనుకోడాని కెంత నిక్కచ్చిదైనా వ్యవహారరంగంలో క్లిష్టంగాను అభద్రంగాను పరిణమించింది. అధమర్ణుల గుంపుమధ్య ఒక ఋణదాత వుంటే ఎలా వుంటుందో అలా వుండేది వారి స్థితి. ఇది చాలా శోచనీయమైన పరిస్థితి. ఎంచేతంటే అమెరికా అభ్యుదయానికి పాజ్ఞసాంప్రదాయికుడు చేయగలిగింది ఎంతైనా వుంది. అయితే **'Hartford wits'** తమ ఉత్తరాధికారులైన సాంప్రదాయకులకంటె చాలా ఆత్మవిశ్వాసం గలవారు.

"సంపద, సౌజన్యము, కౌశలము, ప్రభుత్వము అన్నవి ధర్మం

---

1. బార్లో 1788లో యూరపు వెళ్ళేక తన రాజకీయాశయాలను పూర్తిగా మార్చుకొన్నాడు.

యొక్క స్వాభావికమైన శక్తికి దోహదకారులైతే అప్పుడు ధర్మప్రభావం మరీ అధికంగా వుంటుంది" అని వ్రాసిన (1798లో) టిమోతీడ్వైట్ (జోనాథన్ ఎడ్వర్డ్స్ మనుమడు) తాను 'అమెరికన్' భావన ఏమీ చెయ్య లేదు, సరికదా అమెరికన్ ఆత్మను రక్షించడానికే ప్రయత్నించాడు; అలాగే ఫిలడెల్ఫియా 'పోర్టుఫోలియో' (మొదటితరం అమెరికన్ సాహిత్య పత్రికలలో ప్రధానమైనది) సంపాదకుడైన జోసఫ్ డెన్నీ ఫ్రాంక్లిన్నను నిందించడానికి కూడ వెనుదీయలేదు.

"అత డొక కర్కశ గ్రంథకర్తల జాతిని సృష్టించినవాడు. సాహిత్యాన్ని వట్టి అసభ్యస్థితికి పనిగట్టుకొని దిగదీసినవాడు. నాగరకమూ, ప్రచురమూ అయిన గ్రాంథికభాషను అధమమైన ప్రాంతీయ, జాతీయాల పులుముడుతో వ్యాకరణానికి సిగ్గుచేటూ, ఇంగ్లీషుకి తప్ప ఏ ఇతర భాషకేనా సంబంధించినటువంటిదీ అయిన శుద్ధగ్రామ్యమైన అనాగరిక ధోరణిలో పాడుచేసినవాడు."

ఫ్రాంక్లిన్ అంతటివాడిగురించి డెన్నీ ధోరణి ఇలా వున్నందుకు డెన్నీవే హాస్యభాజను డని కొందరనుకోవచ్చు. కాని పూర్తిగా కాదు. అత డది వ్రాసేటప్పటికి ఇంగ్లీషును ససేమిరా వాడకూడదు, వదిలిపెట్టాలి అని కృతనిశ్చయుడైవున్న సభ్యు డతని దృష్టిలో వున్నాడు. ఈ భాజనత్వ బాధ్యత అతనిమీద వున్నది. అయితే స్పష్టతకోసమని చరిత్రకసత్యదోషం అంటకట్టకుండా వుండాలంటే ఫ్రాంక్లిన్ వచనరచన సరళమైన ఒక అమెరికన్ శైలిని సృజించడం కాదు, నిలువరించిందని చెప్పడానికి వీల్లేదు. అలాంటి శైలి ఒకటి అమెరికాలో ప్రాదుర్భవించింది (ముందు స్పష్ట పడుతుంది). అయితే అది అమెరికాలో సిద్ధంగా వున్న ఒక సభ్యమైన శైలి నెన్నడూ త్రోసిపుచ్చలేదు. ఈ సభ్యశైలి అన్నది పూర్తిగా సజాతీయమైనది కాకపోతే పోవచ్చునుగాని విజాతీయమైనదనిమాత్రం కొట్టి పారెయ్యడానికి వీలులేనిది.

భాషాసమస్య అన్నది బృహత్తరమైన అమెరికన్ మీమాంస (American dilemma)లో ఒక భాగంమాత్రమే. ప్రభుత్వరథికులు, సారథులు ఈ ఇద్దరి వ్యావహారికరీతుల మధ్య ఏర్పడిన తగవు ఎక్కచ్చిగా

పరిష్కృత మయ్యేదికాదు. ఈ తరగతుల పరమార్థాన్నిబట్టి చూస్తే ఈ మీమాంస, విపులంగా చెప్పాలంటే, అట్లాంటిక్ సముద్రాని కవతలవున్న దేశాలకు సంబంధించిందికూడా అవుతుంది. డ్వైటూ, డెన్నీకూడా అమెరికనుల మనుకోడానికి వాళ్ళ విరోధు లెంత గర్విస్తారో తామూ అంత గర్విస్తారు.అయితే ఉభయపక్షాల వాదాలూ, మనస్తాపం కలిగించే నిర్ణయాలకు సమంగానే దారితీస్తున్నాయి.అమెరికా సాహిత్యపద్ధతుల్లో బ్రిటనుతోటీ, యూరపుతోటీ పోటీపడినప్పుడు ఫలితాలు విధిగా ప్రాంతీయసంకుచితత్వం గలవిగా అయిపోయినవి. పోనీ, మరోవైపు అది ఒక జాతీయమైన మార్గాన్నేర్పరచుకొని అనుసరిస్తోందీ అంటే ఫలితాలు లాభసాటిగా లేకపోవడం తప్పనిసరియైనది.

సాధారణంగా ఆంగ్లేయులే మిగతా యూరపియనులకంటే అమెరికాయెడలా, అది స్వతంత్రంగా చేసుకొనే ప్రయత్నాలయెడలా ఎక్కువ ఆస్థ, ఆమోదం కనబరుస్తూ వచ్చారు. కాని అమెరికాకు స్వాతంత్ర్యం వచ్చిన తొలిదినాల్లో అమెరికన్ సాహిత్యకృషిని చాలావరకు పక్షపాతరహితంగానే దుయ్యబట్టేరు. ఆంగ్లపత్రికా విమర్శకులు స్వదేశీయులైన రచయితలనుగూడ ఘోరంగా విమర్శించేవారు. అది కొంత అమెరికనుల కుపశాంతికారణమైనా వాళ్ళు తమమీద విరుచుకుపడ్డప్పుడుమాత్రం పట్టించుకొని బాధపడేవారు. ఒక అమెరికను

"అమెరికాలో రచన నొక వృత్తిగా చేసుకోడానికి వ్యాసంగం చెయ్యడం ఎస్కిమోల దేశంలో సౌకుమార్యంగురించి ఒక వ్యాసం ప్రచురించడంకంటేగాని, లేక లేప్‌లాండులో ఒక విజ్ఞానశాస్త్రపరిషత్తు స్థాపించడం1కంటేగాని హీనమైన లబ్ధిగల ప్రయత్నమేమీ కాదు."

అని అన్నప్పుడు అతని ఉద్దేశాన్ని, పాపం, ఏదో అసంతృప్తికి గురియైనవాడిమాటగా గ్రహించారు.

అయితే 'ఎడింబరో రివ్యూ' (డిసెంబరు 1818)లో :

---

1. "మాలపల్లెలో మంగళాష్టకాలు" అనే మన తెలుగు సామెత వంటిది.

"అమెరికనులకు సాహిత్యం లేదు—అంటే జాతీయమైన సాహిత్యమన్నమాట. అదంతా పైనుండి దిగుమతిచేసుకున్న బాపతే. ఆఁ, వాళ్ళకొక ఫ్రాంక్లిన్ వున్నాడు. అతడి పేరుమీద అర్ధశతాబ్దిపాటు కాలక్షేపం చెయ్యవచ్చు. మిస్టర్ డ్వైట్ అని ఒకతను వుండాలి. కొన్ని కావ్యాలు వ్రాశాడు. అతడి క్రైస్తవనామకరణం టిమోతే. వర్జీనియా గురించి జెఫర్సన్ వ్రాసిన ఒక వృత్తాంతంకూడా వుంది.

జోయల్ బార్లో[1] వ్రాసిన ఒక ఇతిహాసము, మిస్టర్ ఇర్వింగ్ వ్రాసిన హాస్యరచనలూ ఏవో వున్నాయి. అసలు ఆరువారాల ప్రయాణం వారికి భాష, జ్ఞానం, విజ్ఞానం, ఉపజ్ఞలతో వెలసిన పుస్తకాలు-కుప్పలు తిప్పలుగా తెచ్చిపెడుతూవుంటే అమెరికనులు మరి పుస్తకాలు వ్రాసుకోవడం దేనికీ?" అని సిడ్నీస్మిత్ అన్నాడంటే ఆ సంగతి వేఱు. ఇలాంటి ప్రశ్నలు బాహాటంగా వ్యాపించాయి. సమాధానం వినడానికి స్మిత్‌గారికవకాశం లేకపోయినా తరతరానా అమెరికన్ రచయితలకు చెప్పాలనిపించింది. ఎమర్సన్ మహాశయుడు 'అమెరికన్ పండితుడు' (American Scholar, 1837) అనే పేరిట చేసిన ప్రసిద్ధప్రసంగంతో "యూరపియన్ సారస్వత భూపాలరాగాలను (Courtly muses) చాలా కాలంగా విన్నాము మనం" అని ఉద్ఘాటించాడు. ఈ మాటనే "మేధోపపన్నమైన అమెరికన్ స్వాతంత్ర్యప్రకటన"గా పేర్కొన్నాడు ఆలివర్ వెండెల్ హోమ్స్ (Oliver Wendell Holmes). ఎమర్సన్ వక్కాణ అలాటివాటన్నింటను ప్రతిష్ఠమైన దనడం యథార్థం. ఇక విప్లవకాలపు విదగ్ధకవిప్రవరుడు ఫిలిఫ్ ఫ్రెనో (Philip Freneau ఎంత నిస్పృహతో ఎలా అన్నాడో చూడండి: "ఆ రుద్రభూమి

---

1. The Columbiad (1807). ఈ గ్రంథం హీరోయిక్ కప్లెట్సు అనే ఛందస్సులో వున్నా మిల్టనుకి చాలా ఋణపడివున్నదనీ, బార్లో దేశంలో కాలుపెట్టియెరగని రాబర్ట్‌సన్ అనే స్కాటిష్ చరిత్రకారుడు వ్రాసిన అమెరికన్ చరిత్రనుండి బార్లో విషయం గ్రహించాడనీ కూడా సిడ్నీ స్మిత్ వ్రాసివుండవలసింది.

('Dammable Place')నుండి ఎరువు తెచ్చుకుంటేగాని ఒక చదువుకీ ఒక చందానికీ మనం నోచుకున్నాము కామా?" అని. ఆ రుద్రభూమి అంటే మరేదో కాదు, బ్రిటన్ అని ఆయన అర్థం. "పరసారస్వత ప్రభావాన్ని నిగ్రహించుకోలేని స్థితిలో వుండడంకంటే అసలు సారస్వతమే లేకుండావుండడమే మంచి"దంటాడు విలియమ్ ఎల్లరీ చానింగ్ తన "Remarks on National Literature" (1830)లో. కొస్త తరువాత—"చాలా కాలానికి ఈనాడు మనం చేరుకున్న స్థితి ఏమంటే- ఇకపై మన సాహిత్యం దాని స్వాతంత్ర్యగుణాలమీద అది ఆధారపడితే పడాలి. లేదా దాని లోపాలవల్లనే అధఃపతనం పొందాలి. మన మప్పుడే పుంజాలుత్రెంచుకొని మన బ్రిటిష్‌హమ్మరు దూరంగా జరిగేము"అని ప్రకటించాడు ఎడ్గార్ ఎల్లెన్‌పో. ఇలాగ ఎమర్సన్‌కి ముందూ వెనకా చాలామంది రచయితలు అభిప్రాయాలు ప్రకటించారు. ఎన్నైనా ఎత్తి చూపవచ్చు గాని ప్రకృతానికివి చాలు.

ఈ దేశాభిమానం, బ్రిటిష్‌దూషణం అలా వుండగా ఆనాటి అమెరికన్‌సాహిత్యం మాత్రం అస్వతంత్రమూ, నికృష్టమైనదీ కావడం శోచనీయం.1789లో నో వెబ్‌స్టర్(Noah Webster)"ఇకపై గ్రేట్ బ్రిటన్ ప్రామాణ్యం మనకు పనికి రాదు. అక్కడి రచయితల అభిరుచులే కలుషితాలై పోయాయి. వాళ్ళ భాష చెడిపోతోంది" అని స్వదేశీయులను హెచ్చరించాడు. వెబ్‌స్టర్ చెప్పిన మాటే కాని నిజమైవుంటే ఆ వ్యవహారమంతా ఎంత తేలికైపోయి వుండేది! కాని ఒక తరం గడిచేక చూసుకున్నా ఆ కల్తీ అన్నది యూరపియను సాహిత్యాన్ని పాడుచేసిన జాడ ఏమీ లేదు మరి. ఆ సాహిత్యం కూడా ముత్యంలాగే మాలిన్యం వల్లనే కలిగిందనడాని కవకాశం వుందా? ఉంటే విట్మన్ మొదలైన వారు అమెరికా సరిక్రొత్త సాహిత్యం సృష్టించుకొంటుందన్న స్థిర నిశ్చయంతో ఆ ప్రశ్ననే తుడిచి పెట్టేవారు.

New Month!y Magazine (London, 1821) లో "అమెరికనులు మిగతా మానవులవలె కాక, భవిష్యత్తుయొక్క దయమీద

ఆధారపడుతారు. వారొక చేత మాల్థాజ్ (Malthus - 'జనాభా' సిద్ధాంత ప్రవర్తకుడు) గ్రంథాన్నీ, ఒకచేత వెనుకబడిన దేశపు పటాన్నీ పట్టుకొని వుండి కూడా ఎవరేనా అమెరికా ప్రస్తుత స్థితినీ, వుండవలసిన స్థితినీ సరిపోలిస్తే ససేమిరా ఒప్పుకోరు. రాబోయే సౌభాగ్యాలను తలుచుకుంటూ వుప్పొంగిపోతారు." అని వ్రాయబడింది. అయితే ఒకవంక వర్తమాన సత్యాలను గణింపక తప్పలేదు వారికి. బ్రిటిషువారి పెద్దరికంమీద నమ్మకం లేకపోయినా ఇంగ్లీషుభాషను వాడుకోక తప్పలేదు. ("మేమేదో కొత్తభాషను తయారుచేస్తున్నామని ఆరోపించడం వట్టి అపవాదు" అని 1821 లో North American Review లో ఘోషించాడు ఎడ్వర్డ్ ఎవరెట్). ప్రతిష్ఠకు తగిన యోగ్యత ప్రకటించి ఆంగ్లరచయితలతోను, ఖండాంతర రచయితలతోను వారు పోటీలో నిలబడవలసివచ్చింది. అదే వ్యాసంలో ఎవరెట్ ఇంకా ఇలా అన్నాడు :

"మా పిల్లల పుస్తకాలు ఇంగ్లీషువి. మా నాటకరంగం ఇంగ్లండు ప్రసాదమే. బైరన్, కేంబెల్, సౌదే, స్కాటులు స్వదేశీయుల కెంత పరిచితులో మాకూ అంత పరిచితులే. క్రొత్తగా ఒక నవల వచ్చిందంటే ఎడింబరోలో దాని చివరి కాగితాలు పారవేయబడే లోపల ముందు కాగితాలు మాకు చేరుతాయి. ఇంగ్లండులో ఇంకా తడి ఆరకుండానే ప్రతీ మంచి ఇంగ్లీషు పుస్తకాన్నీ మేము పునర్ముద్రణ చేస్తాము. మావాళ్ళెక్కువగా ఇంగ్లీషును గ్రహించిననాడు ప్రాచీనమతగ్రంథాలకు ఆంగ్ల పత్రికలే మాకు మాతృకలైనవి. ఈ సంగతులన్నీ అందరికీ తెలిసినవే. అలాంటప్పుడు మంచి ఇంగ్లీషు మాట్లాడకూడదనుకోవడం మాకు చేతనవుతుందా?"

ఆ చివరిప్రశ్నలో ఏదో ఒక చిన్న విషాదశ్రుతికూడా వున్నది. అతని వాదం ఎంత తర్కసహమైనదా అని చర్చించడానికి కాదు గాని ఆ మీద అతడు చేసిన నిమిత్తరూపణం వుందే అది యథార్థం. అమెరికాలో వున్న రచయితకు సమకాలికాంగ్లరచయితల కున్నట్లు గ్రంథవిక్రయావకాశాలు బొత్తిగా తక్కువ. అంతర్జాతీయ ప్రత్యంతర స్వామ్యం

(International Copy Right) కి తగిన అవకాశాలు లేకపోవడమే యీ తేడాకు కారణం.

1891 లో ముద్రణచట్టం వచ్చేవరకూ అమెరికాలో యూరపియను గ్రంథాల దోపిడి ఒకటి కొనసాగుతూ వచ్చింది. మేథ్యూ కేరే అనే ఫిలడెల్ఫియా ప్రచురణకర్త కొన్ని జోరుపడవలను గుత్తకు తీసుకొన్నాడు. పైనుండి ఓడలమీద కొత్త నవలలు వచ్చేయనేసరికల్లా తన పడవలను పంపి వాటిని సంపాదించి తన పోటీదారులకంటే ముందుగానే ఒక ప్రతిని విడుదల చేసేవాడు. దేశంలో ఎక్కడ చూసినా స్కాటు, డికెన్సుల నవలలే! అన్నీ యిలాంటి దొంగప్రతులే! 1842 లో మొదటిసారిగా సంయుక్తరాష్ట్రాలకు వెళ్ళినప్పుడు డికెన్సు తన వ్రాతలకీ, ఈ ప్రతులకీ వున్న తేడా చూసి గోలెత్తాడు కాని లాభం లేకపోయింది. యూరపులో అమెరికన్ గ్రంథకర్తల కిలాంటి గతి అంతగా పట్టలేదు. ఇంగ్లండులో ఉనికివల్లా, పూర్వముద్రణలవల్లనూ కాపీరైటు పొందగలిగేవారు. ఆంగ్లేయుల అభిరుచులకీ, ఆ ప్రచురణకర్తల ఉద్దేశాలకూ అనుగుణంగా వుండడంలో వాళ్ళ కది కొంత ప్రోత్సాహకారణంకూడా అయింది. అదే వాళ్ళ అమెరికా ప్రచురణకర్తల విషయం చూసుకుంటే యూరపియన్ గ్రంథాలను 'రాయల్టీ' ఇవ్వనక్కరలేకుండా వేసుకుని బాగా లాభాలు చేసుకుంటున్నవాళ్ళకి అమెరికన్ గ్రంథకర్తల పుస్తకాలు వెయ్యడం, వాళ్ళ కేదో ముట్టజెప్పడం అంటే, పాపం, చాలా కష్టంగా వుండేది.

పోతే, ఇక అమెరికన్ రచయితలు దేన్నిగురించి వ్రాయడం? అన్నదొక సమస్య. తమ కిష్టం లేకపోయినా ఆ ప్రాతప్రపంచం (యూరపు) యొక్క ఆమోదం పొందాలనే ఆశతో జాతీయవృత్తాలను గ్రహించడానికి వెనుకాడేవారు. అమెరికన్ వలస నుద్దేశించి స్టీఫెన్ విన్సెంట్ బెనెట్ (1898-1943) :—

"నిన్ను ఇంగ్లీషు పాటలో ఇమడ్చడానికీ, నీ మాటను ఇంగ్లీషు కథలో తగల్చడానికీ, వాళ్ళు (అమెరికను రచయితలు) ప్రయత్నించారు. అయితే మొదటినుంచీ అపశ్రుతులే పలికారు. గుడ్లగూబ కోకిలమ్మ

గొంతు పిసికింది." (ఇది "The catbird pecked away the Nightingale" అనే పంక్తికి కేవలం భాషానువాదం మాత్రమే. Catbird విజాతీయతకు, Nightingale సజాతీయతకు సంకేతాలని తోస్తుంది).

నిజమే, కాని శిష్టరచనలో అమెరికన్ కవికి కోకిలకి బదులు గూబతో పొత్తు కుదరడానికి చాలాకాలం పట్టింది. యూరపులో మొదటగా ప్రశంసలందుకొన్న అమెరికన్ కావ్యాలలో ఒకటి ఎక్కడ పడితే అక్కడ కనిపించే నీటికోడి నుద్దేశించినది.

(1815 లో విలియమ్ కల్లెన్ బ్రయంట్ (1794-1878) వ్రాశాడు) తనకు అమెరికన్ పేర్లంటే మహాప్రేమ అని బెనెట్ అంటాడు :

"I have fallen in love with American names, The sharp names that never get fat, The snake-skin titles of mining—claims, The plumed war-bonnet of Medicine Hat, Tucson and Dead-wood and Lost Mule Flat."

అతని అభిప్రాయాన్ని ఆమోదిస్తాం. కాని ఈ పేర్ల కతీతంగా కాలం గడిచిపోయింది. బహుశా ఈ పేర్ల వికారత్వమే ఛాన్సెలర్ విల్లీలోగాని గెట్టీస్‌బర్గ్‌లోకాని విషాదానికి కారణమైవుంటుంది. 1800లో అమెరికా స్థలనామా లంటే విపరీతమైన ఆక్షేపణ బయలుదేరింది.

"Ye plains where sweet Big-muddy rolls along;
And Teapot, one day to be famed in song..."

బ్రయంట్ రచనలాగే అమెరికన్ లోకటిపాట రచన క్రమంగా

స్థలాతీతంగా బహుముఖంగా సర్వాలంకార శోభాయమానంగా ఆశ్చర్యకర పరిణామం పొందింది.

స్కాటిష్ విమర్శకు లన్నట్లు అమెరికన్ రచయిత ఏదో తన కున్నదానితో సంతృప్తిపడవలసిందేనా? అమెరికన్ చిత్రకారుడిలాగానో, శిల్పిలాగానో అతడు కూడా యూరపుకి పోవలసిందేనా? స్వదేశంలో వ్రాసుకోడానికి తగిన సామగ్రి యేమీ లేదా? "ఇవిగో ఇవి మాకు జాతీయాలైనవి" అని అనుకోడానికి తగిన వస్తువులే లేవా? పోనీ, ఈ అడవులూ, కొండలూ, కోనలూ-ఈ ప్రకృతి సౌభాగ్యమంతా అమెరికావి కాదూ? ఇదీ వట్టి అమెరికా తెరగుడ్డమీద యూరపు వేసిన బొమ్మేనా? చూడండి అమెరికా గురించి వచ్చిన మరొక ఆక్షేపణ (Blackwood, 1819):—

"నీరస వస్తువులతో నిండిన యీ సీమ ఊహలను రేకెత్తించలేదు. ప్రాచీన విషయ భావనకు మనస్సుకు ప్రేరణ కలిగించే వేమీ లేవిక్కడ. చారిత్రాత్మకమైన రక్తి నుత్పాదించే శిథిలాలైనా లేవు. లోకోత్తర ఘన కార్యాల స్మృతిచిహ్నాలవల్ల కలిగే ఉత్సాహాని కిట ప్రసక్తిలేదు. కవిత్వానికీ కల్పనకూ దోహదం చేసే కథలూ గాథలూ సంప్రదాయాలూ ఏమీ లేవు."

అమెరికాలోకూడా ఇదేమంత అసాధారణమైన అభిప్రాయంకాదు. హాథార్న్ తన Marble Faun ఉపోద్ఘాతంలో ఈ అభిప్రాయమే వ్యక్తం చేశాడు. హెన్రీ జేమ్సుకూడ హాథార్న్ జీవితం గురించి తాను వ్రాసిన గ్రంథం ప్రారంభంలోనే ఇలా అన్నాడు:

"ఏమి టింకా మిగిలివుందో తెలుసుకోవడమన్న దొక వింత అని పించుకొనేదాకా మిగతాదేశాల్లో వున్నవీ అమెరికాలో లేనివీ అయిన

గొప్పగొప్ప నాగరిక లక్షణా లేమి కేమిటో లెక్కవేసి చూసుకో వచ్చు"1

ఆ ప్రసంగం చివర ఇలా అన్నాడు:

"ఈ ఘోరమైన ఆరోపణ దృష్ట్యా సహజంగా ఎవరైనా అనగలిగే మాట యేమిటంటే ఈ వస్తువులను వదలి వేస్తే అన్నిటినీ వదులుకున్నట్టే-ఇంకా (చెయ్యవలసింది) చాలా మిగిలి వుందని అమెరికన్‌కి తెలుసు. ఏం మిగిలివుందా అంటే అదే అమెరికన్ రహస్యం!అమెరికన్ చమత్కారం."

అమెరికాలో ప్రజా ప్రభుత్వ మేర్పడిన తొలి రోజుల్లో అమెరికన్ సాహిత్యంలో బయలుదేరిన కలవరాలు కొన్ని యిలాంటివే. రచయితకూ భూఫలాపేక్షకునకూ ఆశగొలిపే భవిష్యత్తు నందలి విశ్వాసం ఆ కలవరాల కెదురు నిలవవలసి వచ్చింది. పరిస్థితులు కలిసి రావడం లేదని కాస్త నిరాశ చెందినా కాలం చేజారి పోకుండా ఉపశ్రుతి పలుకుతూ తన పక్షాన వుందనే నమ్మకంతో "వ్యవధి నివ్వండి" అని ఆశగా పలికేవాడురచయిత. కాలం గడుస్తోంది కాని పరిస్థితులలో మంచి ఒక్కటే కాదు, ఆ ప్రక్కన చెడుకూడా పొడసూపుతోంది. మంచి అంటే అమెరికన్ సాహిత్యంలో వైపుల్యమూ, వైశిష్ట్యమూ ఏర్పడ్డాయి. కాని పరిపూర్ణ సాంస్కృతిక

---

1. ఒక శతాబ్ది క్రితం Crevecoeur అనే ఆయన 'అమెరికన్ అంటే ఏమిటి?' ("What is an American") అనే తనప్రఖ్యాత మైన లేఖలో అలాంటి వాటి పట్టిక ఒక్కటి తయారు చేశాడు: "ఇక్కడ (అమెరికాలో) పెద్ద సంపన్న కుటుంబాలు గాని, ఆస్థానాలుగాని, రాజులు గాని, మతగురువులు గాని, క్రైస్తవ పురోహిత క్షేత్రాలు గాని, కొద్ది మందికి స్పష్టంగా గోచరించే శక్తి నిచ్చే అదృశ్య శక్తిగాని, వేల కొద్దీ పనివాళ్ళను నియోగించే గొప్ప గొప్ప ఉత్పత్తి దారులుగాని, గొప్ప నాగరిక భోగ విలాసాలుగాని లేవు." అయితే ఆ 1782 నాటి ప్రశాంత దివసాల్లో చెప్పబడిన యీ మాటలు జేమ్సునాటి మాటలకు విరుద్ధంగా వున్నవి. "ఈ నాడు ప్రపంచంలో వున్న సంఘాల్లో అమెరికన్ సంఘమే ఉత్తమోత్తమమైనది" అంటాడు జేమ్సు.

స్వాతంత్ర్య మన్నది యింకా అందని పండుగానే వున్నది. అమెరికన్ గరుడపక్షిని (ఆశా విహంగం - వారి జాతీయ చిహ్నము) ఆకాశంలో పైపైకెగిరించే వాల్ట్ విట్ మన్ దేశీయ విద్వాంసుల దృష్టిలో ప్రముఖంగా భాసించే ఒక జాతీయ మహా యజ్ఞం చేస్తున్నాడు. హెన్రీజేమ్సు అన్నట్లు (1872 లో ఒక యువకుడికి ఉత్తరం వ్రాస్తూ) "అమెరికన్‌గా పుట్టడమే ఒక కలగలుపు అదృష్టము. యూరపును గురించిన మూఢ విశ్వాసంపై దండెత్తడం అది మనపై పెట్టిన బాధ్యతలలో ఒకటి. "దండెత్తడ మన్నది పెద్ద మాట. బాధ్యత అన్నదీ అలాంటిదే.అయితే ఇక అనేక బహిరంగ ప్రదర్శనాలలో బట్టతల ఆడించిన (అంటే కృతార్థత పొందలేక పోయిందని పలువురు స్పష్టపడిన) అమెరికన్ గరుడ పక్షియా? యూరపును గురించిన మూఢ విశ్వాసమా? ఏది అవలంబనీయం? అనే శంక వచ్చిపడింది. పెద్ద పెద్ద అమెరికన్ రచయితలంతా ఆ శంక కొక ఒడ్డుకు చేరగలిగేరే కాని ఆ శంకవల్ల అంతో యింతో మార్పు కలగకుండా ఒక్కరూ లేరు. అసలు అమెరికా యూరపుల అనుబంధం అప్రతిహతమైనది. మరి వీడదీయరానిది అనే ఆ శంకే ఒక కుశంక అని పరిణతుడైన జేమ్సు గ్రహించగలిగినంత స్పష్టంగా మిగతా రచయితలెవరూ గ్రహించినట్లు లేదు. ఈ కొత్త-పాత ప్రపంచం కోసం కనిపెట్టుకుని వున్న భవిష్యత్తు యొక్క వింతల్లో ఇదొకటి.

# 3

# స్వాతంత్ర్యము-తొలిఫలితములు

## ఇర్వింగ్, కూపర్, పో

### వాషింగ్‌టన్ ఇర్వింగ్ (1783-1859):

జననం న్యూయార్కులో. ఒక ప్రెస్బిటేరియన్ వర్తకుని పుత్రుడు. ఆఖరివాడు. 'లా' చదివాడు, కాని అన్నలైన విలియమ్, పేటర్ల సాహిత్యప్రీతిచే ఆకర్షింపబడ్డాడు. ఒక వార్తాపత్రికకు 'Letters of Jonatham Oldstyle, Gent' పంపేవాడు. తరువాత తానే దానికి సంపాదకుడైనాడు. ఆరోగ్యంకోసమని 1804-6 సం॥ల నడుమ యూరపులో పర్యటించాడు. తన అన్నలతోను, బావగారైన జె. కె. పాల్డింగ్ తోను కలిసి ఫెడరలిస్టు దృక్పథంతో "Salmagundi" వ్యాసాలు వ్రాశాడు. 1809 లో 'నిక్కర్ బోకర్' అనేవాడు వ్రాసినట్లుగా, అంటే మారుపేరుతో History of New York

వ్రాశాడు. అది అతని మొదటి ప్రముఖవిజయం. 1815 లో లివర్‌పూల్‌లో వాళ్ళవాళ్ళ ఇనపసామానువర్తకంలో సాయపడటానికి మళ్ళా యూరపు వెళ్ళేడు. అక్కడే దేశం ద్రిమ్మరుతూ పదిహేడేళ్ళున్నాడు. "The Sketch Book of Geoffrey Crayon, Gent (1819-20) అనే రచనతో బాగా గుర్తింపబడ్డాడు. తదుపరి Bracebridge Hall (1822), Tales of a Traveller (1824), కొలంబసు జీవితచరిత్ర (1828), A Chronicle of the Conquest of Granada (1829), The Alhambra (1832) మొదలైన రచనల ద్వారా మంచి పేరు చేసుకున్నాడు. 1832-42 సం॥ల నడుమ U. S. లో వుండి అమెరికన్ విషయాలను గురించి వ్రాశాడు, A Tour on the Prairie (1832) మొ. 1842-6 లో మళ్ళా యూరపు నివాసం. మొదట స్పెయిన్‌కు మినిస్టర్‌గా. మళ్ళా స్వదేశానికి పోయి నిరంతర రచనావ్యాసంగంలో శేష జీవితం గడిపాడు. గోల్డుస్మిత్, మహుమెట్ మొదలైనవారి జీవితాలను గురించి వ్రాశాడు. ఆ జీవితచరిత్ర లన్నిటిలోకీ ఆఖరిదీ, మరీ బృహద్గ్రంథమూ అయినది వాషింగ్టన్ జీవితచరిత్ర.

### జేమ్సు ఫెనిమోర్ కూపర్ (1789-1851):

న్యూయార్కురాష్ట్రంలో ఓట్సెగో సరస్సమీపమున కూపర్స్‌టౌన్ నిర్మించిన ఒక గొప్ప భూమిఖామందు కొడుకు. 'యేల్'లో విద్యాభ్యాసం. అయితే పట్టభద్రుడు కాకుండానే మానేసి నౌకాదళంలో చేరేడు (1806-11).

అది విరమించి, వాసికెక్కిన డిలేన్సీవంశంలో పిల్లను పెండ్లాడి ఒక గ్రామపెద్దగా వుంటూవచ్చాడు. అయితే అదో వృత్తిగా చేసుకుందామని కాదు. మొదటి నవల **Precaution** (1820). తదుపరి చాలా నవలలూ, చరిత్రలూ వ్రాశాడు. 1826-33 లో యూరపు నివాసం. తదుపరి కూపర్స్టౌన్ లో. ముద్రణాలయాధిపతుల మీద ఒక దండయాత్ర సాగించేడు. అది విజయవంతమైంది. కాని దానివల్ల ప్రచారం తగ్గిపోయింది. అయినా ఆఖరి గడియవరకూ అలా రచనలు చేస్తూనేవున్నాడు. ప్రముఖ కృతులు: The Spy (1821), The Pioneers (1323), The Pilot (1823); The Last of the Mohicans (1826), The Prairie (1827), The Red Rover (1827), Gleanings in Europe (1837-8), Homeward Bound and Home as Found (1838)- Published in England as the Eve Effingham, The Pathfinder (1840), The Deerslayer (1841), Satanstoe (1845).

ఎడ్గార్ అల్లన్ పో (1809-49):

జననం బోస్టన్ లో. ఎవరో దేశద్రిమ్మరి నటులు కనేసి దిక్కులేనివాడినిచేసి వదిలివెళ్ళిపోయారు 1811 లో. వర్జీనియా రాష్ట్రంలోని రిచ్మండ్ వణిక్ప్రవరుడైన జాన్ అల్లన్ ఇంట్లో పెరిగేడు. అల్లన్ కుటుంబంవా

రతన్ని ఇంగ్లండు తీసుకువెళ్ళేరు. అక్కడ బడిలో చేరేడు (1815-20). రిచ్‌మండ్‌కి తిరిగి వచ్చాక అల్లన్‌తో తగువు పడ్డాడు. మరి పూర్తిగా రాజీ కుదరలేదు. 1834 లో అల్లన్ చనిపోయాడు. కాని అతని వీలునామాలో ఉపేక్షింపబడ్డాడు. కొద్దికాలం వర్జినియా యూనివర్సిటీలో వున్నాడు. U. S. సేనలో West Point వద్ద పని చేశాడు; సార్జంటు మేజరయ్యాడు. కోరి డిస్‌మిస్ అయిపోయాడు. తదుపరి బాల్టిమోర్, రిచ్‌మండ్, న్యూయార్కు, ఫిలడెల్ఫియాలలో రచయితగా బ్రతుకు సాగించాడు. Southern Literary Messenger మొదలైన అనేక పత్రికలతో సంబంధం పెట్టుకొన్నాడు. 1836 లో తన కజిన్ వర్జినియా క్లెమ్ అనే పదమూడేళ్ళ అమ్మాయిని పెండ్లిచేసుకున్నాడు. ఆమె 1846 లోనే క్షయవ్యాధితో మరణించింది. చివరికి బాల్టిమోర్‌లో దిక్కుమాలిన చావు చచ్చేడు. మొదట ఒక మూడు కావ్యాలు ప్రకటించాడు: Tamarlane (1827), Al Aaraaf (1829), Poems (1831). తదుపరి అతని కవిత్వము, కథలు, విమర్శవ్యాసాలూ ఎక్కువగా పత్రికల్లో ప్రచురింపబడేవి. అతని కథాసంపుటాలు: Tales of the Grotesque and Arabesque (1840), Tales (1845). మిగతా కృతులు: Eureka, A Prose Poem (ఒక తత్త్వదర్శనకావ్యము 1848), The Narrative of Arthur Gordon Pym (1838).

## వాషింగ్టన్ ఇర్వింగ్

వాషింగ్టన్ ఇర్వింగ్ అంతర్జాతీయ విఖ్యాతి నార్జించిన అమెరికన్ రచయితలలో మొదటివాడు. అతని వెనువెంటనే వచ్చినవాడు జేమ్సు

ఫెనిమోర్ కూపర్. ఎడ్గార్ అల్లన్ పో కూడ అంతర్జాతీయ ప్రఖ్యాతి నందినవాడే కాని అతని జీవితకాలంలో మాత్రం ఇర్వింగ్, కూపర్ల ప్రఖ్యాతి అతని ప్రఖ్యాతిని మించిపోయింది. 'పో' కి ఒక ప్రత్యేకత అయితే వుంది కాని తక్కిన రచయితలలాగ అమెరికన్ అయినందుకు అతని విషయం కొన్ని చిక్కులకు గురియైంది.

ఇర్వింగ్ విషయం తీసుకుంటే: "అతడు పెద్ద విద్వాంసుడు కాడు, కాని విద్యాపాండిత్యసంబంధ విషయాలనుగురించి ఏదో కొద్ది కొద్దిగా చేమార్పు వ్రాతలు వ్రాస్తాడు. అయితే ఉదాహరణ నిమిత్తం ఎలాంటి విషయాన్నయినా లొంగదీసుకుని ఉదాహరిస్తాడు. తాను పట్టినదల్లా బంగారమయ్యే అదృష్టవంతుడైన రచయిత అతడు. గ్రంథాల్లో అడుగడుగునా అతని ప్రజ్ఞ సూర్యరశ్మిలా ప్రకాశిస్తూ వుంటుంది."

ఈ మాటలు ఇర్వింగు గోల్డుస్మిత్‌ను ప్రశంసిస్తూ అన్నవి కాని ఇవి ఇర్వింగుకే సరిపోతాయి. యూరపులోనూ, అమెరికాలోనూ అతనిని 'అమెరికన్ గోల్డుస్మిత్' అనీ, అనంతరకాలపు ఎడిసన్ అనీ, స్టీలనీ వ్యవహరించిన అతని సమకాలికు లెవరేనా ఈ పంక్తు లిర్వింగ్ గురించే చెప్పివుండవలసింది. ఇర్వింగును కలిసినవారంతా అతనంటే యిష్టపడ తారు. స్కాటు, మూరు, ఇంకా అనేకు లతడు చాలా సరసుడనీ, అతని సాహిత్యశైలి అతని వ్యక్తిత్వానికి దీటుగా వుంటుందనీ వక్కాణించారు. అయితే ఛార్లెసు లేంబుకి మల్లేనే ఇతనికీ చనిపోగానే ప్రజల మోకరం కొంత తగ్గిపోయింది. జీవించివున్నప్పుడు కూడా అందరూ ఇతని గురించి గొప్పగా అనుకున్నవారు కారు. ఒక వ్యంగ్యరచయిత ఇతనిని "Dame Irving" అన్నాడు. మరొకాయన "Addison and Water" అన్నాడు. అతని Bracebridge Hall అనే గ్రంథం గురించి—"నిర్మాణనైపుణి గ్రంథంయొక్క తాహతు నతిశయించిపోయింది. పట్టి చిల్లరవిషయాలగురించి అతి శ్రద్ధాసక్తులు ప్రదర్శింపబడినవి" అని మెరియా ఎడ్జివర్త్ విమర్శ. ఈనాటి పాఠకు లెక్కువగా ఇర్వింగు నభి నందించేవారితోకంటే విమర్శించేవారితోనే ఏకీభవిస్తారు. అయితే తన కాలంతో అతని తీరు ఎందు కలా వుందో గమనార్హం.

"ఇర్వింగు అర్హతకు మించిన గణన పొందేడు. అయితే అతని కర్హమైన దెంత? అధికమైన దెంత? ఒక అగ్రేసరుడుగా (Pioneer) అత డెందుకు తగును? రచయితగా అత డెందుకు తగును? అన్నదాని కొక తగిన వేర్పాటు చేయవచ్చును" అని 'పో' మన కొక ఆధారం చూపించాడు. అయితే ఈ 'అగ్రేసరుడు' అన్న మా టేమిటి! ఇర్వింగువంటి మనిషికి 'పో' అన్నట్లే ఏదో సామాన్యమైన ఔచిత్యము, నిర్దుష్టమైన శైలి ప్రదర్శించినవాడికీ అగ్రేసరత్వానికీ సంబంధ మేమిటి? అతని వచనం, కొందరు విమర్శకు లన్నట్లు, అంత చాదస్త మోడుతూ లేకపోయినా అందులో కొత్తదనం మాత్రం లేదు (ముందు నిరూపింపబడును). అయితే మరి దేంట్లో అగ్రేసరుడు? అంటే—ఇర్వింగ్ జీవితచరిత్రకారుడైన స్టేన్లీ టి. విలియమ్స్ "తన ఘనతను తన నెత్తినే కట్టుకోలేక చేతితో పట్టుకుని నిలిచిన అమెరికన్ ఇదుగో ఇక్కడున్నాడు" అంటాడు. అవును, న్యూయార్కులో ఒక వర్తకుల కుటుంబంనుండి, ఒక సామాన్యమైన సాహిత్యపు వాతావరణంనుండి ఈ నూతనప్రపంచంలో ఉత్పన్నుడైన వ్యక్తి నాగరికప్రపంచ సమస్తాన్నీ వినోదింపజేశాడు. దారులు వేరైన స్వదేశీయులనూ, ఆంగ్లేయులనూ కూడా సంతోషపెట్టేడు. అదెలాగంటే, అతనికి పేరు తెచ్చిన పుస్తకం చూస్తే తెలుస్తుంది:

ఇర్వింగు వ్రాసిన "The Sketch Book of Geoffrey Crayon, Gent" అనే పుస్తకంలో ముప్ఫయినాలుగు చిత్రణము లున్నాయి. అందులో గ్రంథకర్త తననుగురించి కూడా వ్రాసుకున్నాడు. ఆ చిత్రణములం దెక్కువ పాలు ఆంగ్లసంబంధులు—'The Inn Kitchen', 'Westminster Abbey' మొదలైనవి. అందులో జాన్ బుల్ వ్యక్తిచిత్రణము, అమెరికాగురించి ఆంగ్లరచయితల వ్రాతలు అన్న రెండు వ్యాసాలు మాత్రం వివాదాస్పదాలు. జాన్ బుల్ లో లోపా లున్నాయని చెబుతూ "అతడు ప్రతి దోషాన్నీ గుణంగా వాదించి నిరూపించా లనుకొంటాడు; ఈ ప్రపంచంలో తనకన్నా నిజాయితీపరుడు మరి లేడంటాడు" అని ఇర్వింగు. అయితే ఇర్వింగు సౌహార్దాన్నికూడా ప్రకటించాడు. "a sterling-hearted old blade" అని కితాబిచ్చాడు.

జాన్ బుల్‌కు. రెండో వ్యాసంలో అమెరికాగురించి అవాకులూ చెవాకులూ వ్రాసిన ఆంగ్లేయులను తమాషాగా మందలిస్తాడు, తన చీవాట్లు వాళ్ళు ఒప్పుకో నేలాగు. నిష్పాక్షికపరిశీలకులైన ఇంగ్లీషు తగుమనుషులు గాక చెడిపోయిన వర్తకుడు, క్రొత్త క్రొత్త పథకాలు పన్నే సాహస యాత్రికుడు, దేశద్రిమ్మరియైన యాత్రికుడు, మాంఛెస్టరు, బర్మింగ్‌హామ్‌ల ఏజెంటు—వీళ్ళూ అమెరికాపాలిటి శాకునికులు అంటాడు ఇర్వింగు. అదే మంత గొప్ప వ్యాసం కాదు గాని గొప్ప నేర్పుతో ఒడుపుగా వ్రాయ బడింది మాత్రం ఔను.

ఆ పుస్తకంలో అమెరికా గురించి వున్న కొద్ది వ్యాసాల్లో "Traits of Indian Character" అన్న దొకటి. పగ లంతా వేటాడివచ్చి రూపతేన ఎలుగులు, చిలుతలు, దున్నల మధ్య, గిరిఝరీపాతాల మ్రోతల మధ్య విశ్రమించి జీవయాత్ర సాగించే ఉదారుడైన ఆ ఇండియన్ అనాగరకుని గురించిన సామయికదర్శనమిది. మరొకటి గ్రంథమంతటిలోనూ మిక్కిలి ప్రశస్తికెక్కినది, ప్రశస్తమైనది Rip Van Winkle అన్న ఖండిక. వింకిల్ ఒక డచ్చివాడు. కేట్‌స్కిల్ కొండల్లో ఒక మాయకు లొంగిపోయి అవశుడై అక్కడే పడిపోతాడు. ఇరవైయేళ్ళు నిద్రలో మునిగిపోతాడు. ఆ తర్వాత లేచి వెళ్తాడు తన గ్రామానికి. అక్కడ వెనుకటి పరిచితులందరూ చనిపోయారు. గమ్మత్తుగా వుంటుంది ఆ కథంతా. అభినందనీయుడు ఇర్వింగ్. క్రొత్త ప్రపంచం తన కట్టుకథలను పాతప్రపంచానికి చేరవేస్తోంది. అతని సమకాలికు లలాగే అనుకునేవారు. ఇర్వింగు గట్టిగా సూచించలేదు గాని నిజాని కీ కథ ఒక జర్మను గాథనుండి గ్రహించాడు. అందులో పేరాలకు పేరాలు గ్రంథచౌర్యానికి పాల్పడ్డా డన్నంతగా అనువదించేశాడు. అలాగే మరికొన్ని తరువాతి కథల్లో స్పెనిషుమాతృకల మౌలికస్వరూపాన్ని అలాగే వుంచినా ఆక్షేపణలు వచ్చేయి. అతడు చేసిందల్లా ఒక భాషలోని వస్తువును మరోభాషలోనికి అక్కడక్కడ చమత్కరిస్తూ జరుపుకోవడమే అని అంటారు కొందరు.

అయితే యీ ఆక్షేపణలవల్ల ప్రజల కతనియెడల ఏర్పడిన గౌరవానికి తఖరారు లేదు. అయితే మరి అలాంటిస్థానం ఎలా లభించిం దతనికి?

'అగ్రేసరు' డన్న మాట ఎలా దక్కించుకోగలిగేడు? అంటే మొదటి సంగతి అదో విధాయకంగా యూరపుకి వెళ్ళడం! రెండవది అమెరికన్‌గా వ్యవహరింపబడే తన హక్కు గోల్పడకుండా యూరపియన్ పాఠకుల ఆమోదం పొందడం. ఇది చాలా గడ్డుసమస్యే. కాని ఇర్వింగ్ దీని పరిష్కారానికి సన్నిహితంగా వచ్చేశాడు. అంతేకాదు: తన తరువాతి అమెరికన్లకు సమస్య నెదుర్కొనే మార్గాలుకూడా సూచించాడు. అవేవంటే-మొదటిది శైలివిషయం. శైలి చాలా నాజూకుగా, నాగరకంగా వుండాలి. ప్రయోజనదృష్ట్యా అమెరికాకు తనదంటూ ఒక శైలి లేదని గ్రహించాడు. అంచాత ఆంగ్లమాతృకలననుకరించక తప్పదు. కాని ఇర్వింగు ధారాళమైనదీ, దర్జా అయినదీ, 18-వ శతాబ్దినుండి 19-వ శతాబ్దిలోనికి దిగ్విజయంగా పురోగమించిన ఒక గద్యశైలి నావిర్భవింపజేసుకొని తన మాతృకలనే అతిశయించేశాడు. ఇక వస్తువిషయం: అతడు కేవలం యూరపును వర్ణించడమే పనిగా పెట్టుకునివుంటే స్వదేశస్థులతనిని అనాదరించివుండేవారు. కాని అమెరికాలో లేని పదిహేడేళ్ళ పొడుగునా వారతన్ని తిరిగి స్వదేశం రావలసిందిగా కోరుతూనేవుండేవారు. అతడు సమకాలికపరిస్థితులను వర్ణించడం మాత్రమే కాదు. అంతకంటే గొప్ప పనులే చేశాడు. తరతరాల జానపదవిజ్ఞానం త్రవ్వడం మొదలుపెట్టేడు. అప్పుడే మరికొంద రాపని చేస్తున్నారు. అతని మిత్రుడు స్కాట్ మహాశయుడు సీమల్లో వున్న పదవాఙ్మయాన్ని బాగా వినియోగించుకొంటున్నాడు. అతడే ఇర్వింగును జర్మన్ జానపదసారస్వతాన్ని పరిశీలించమని ప్రోత్సాహించివుంటాడు. ఇర్వింగు జర్మనుగాథల తరువాత స్పెయిన్ గాథలను చూశాడు. అవి గొప్ప నిధులవలె కనిపించాయి. వెంటనే పరిశోధన ప్రారంభించాడు. తన దేశం అలాంటి సంపదకు నోచుకోలేదు. అందుచేతనే టిక్నర్, ఎవరెట్, లాంగ్‌ఫెలోలవలె తానూ దానికోసం యూరపులో వెదుకులాడవలసి వచ్చింది. తరువాతి తరం అమెరిక న్లైలాగైతే ప్రాచీనచిత్రాలకోసం, లేఖనములకోసం దేవులాడవలసి వచ్చిందో ఈ అగ్రేసరులు ప్రాతప్రపంచంలో ఉపేక్షితమైన జానపద ప్రాచీనస్థితిగతుల నన్వేషించవలసివచ్చింది.

అసలు మరోవిషయం. ఇర్వింగుకు నూత్నవస్తుసృష్టి చేసే శక్తి తక్కువ. అతనికి సిద్ధంగా వున్న వస్తుసామగ్రి కావాలి. హాథార్న్‌వలె స్వభావతః గతకాలపు విషయమంటే సరదా. అతనికంటే తాను పైపై మెఱుగులవాడయినా అక్కడక్కడ మార్పుకోసం, రక్తికోసం కొస్త కచ్చితమైన అందము, ఆకర్షణ, వింత, విడ్డూరము, కొస్త విషాదమూ కావాలని చూసేవాడు. అమెరికా పట్టపగలు ప్రాదుర్భవించినదైతే దానికి యథాశక్తి సాంధ్యరాగశోభాసంపత్తిని సమకూర్చాడన్నమాట ఇర్వింగు. ఇందు కతని Bracebridge Hall లోని 'The Storm Ship' అనుపేర అమెరికన్ రూపాంతరం పొందిన 'Flying Dutchman' గాథే తార్కాణం. అయితే ఇర్వింగు ఎకాయకీ తా నమెరికన్ల కేవో సంప్రదాయాలు కనిపెట్టదలుచుకున్నా డనుకోవడం అపోహ అవుతుంది. అతని ప్రయత్నమంతా అట్లాంటిక్ సముద్రాని కవతల నున్న వారినీ, ఇవతలనున్నవారినీకూడా సంతోషపెట్టడ మన్నదే. అమెరికాలో జాతీ యోద్యమానికి తగినంత ముందుగా పుట్టివుండటంవల్ల అతనికి దాని ఒత్తిడి లేకుండా పోయింది. అమెరికాలో విలువైన విషయం దొరికినప్పుడు దానినే వినియోగించుకున్నాడు. ఇండియన్ల దేశంలో పర్యటించి దానిగురించి A Tour on the Prairie అనే గ్రంథం వ్రాశాడు. పశ్చిమ అమెరికా అభివృద్ధి అంటే అతని కాస్థ కలిగింది. ఆ యింతా దానిగురించి తన Astoria (1836) లో వ్రాశాడు. అతడు సరిహద్దుల మనిషేమీ కాడు. కావటాని కవకాశం లేదు. విశాలదృక్పథం గలవా డతడు. కాని అతనంటే కిట్టనివాళ్ళు మాత్రం ఇర్వింగు Astoria ను లక్షాధికారి ఉన్ని వ్యాపారి అయిన జాన్ జాకబ్ ఏస్టర్ ప్రాపకంలో వ్రాశా డన్నారు.

నిజానికి, ఎమర్సన్ గ్రహించినట్లు ఇర్వింగూ, అతని సమకాలికు లైన అమెరికన్లూ నిండైన మనుషులు, శక్తిమంతులు. ఇర్వింగు అగ్రేసరత్వ మంటే వట్టి అగ్రేసరత్వం కాదు; తరువాతి వాళ్ళ కది మార్గదర్శకమైంది. గ్రంథాలు కొన్ని అనువాదాలుచేశాడు. కొన్ని పరివర్తించాడు. గొప్ప రచయితగా పేరుపొంది జాతికి గర్వకారణంగా నిలిచాడు. చరమదశలో కూడ జార్జ్‌వాషింగ్టన్ జీవితచరిత్రను మహాప్రయాసపడి ఒక బృహ

ద్గ్రంథంగా రూపొందించి గొప్ప రచనాశిల్పి అనిపించుకొన్నాడు. అందలి వస్తూన్మీలనవైఖరి పట్టి సామాన్యపు బాటసారివాటంగా సాగిపోయేదైనా లయసౌలభ్యం గల వాక్యవిన్యాసము, అక్కడక్కడ సున్నితమైన వినోదమూ వున్నాయి. అతని ప్రాభవ మప్పుడే విస్మృతిపా లవుతూవుంది. కాని బ్రయంట్, ఫిట్జ్ గ్రేనె హేలెక్ మొదలైన అతని మిత్రులు చాలా మందికంటె నయమే. వాళ్ళిప్పుడే కొందరు "నామాపి న శ్రూయతే" అన్న స్థితిలోకి వెళ్ళేరు. కొందరు విసుపెత్తిస్తున్నారు. వాళ్ళకంటే ఎక్కువ కాలం ఇర్వింగుప్రభే వెలిగింది.

అయితే మరో ప్రశ్న. ఇర్వింగు మార్గదర్శకుడే కావచ్చును గాని అతడు చూపిన మార్గం మంచిదా? అని. దానికి సమాధానం-అమెరికాకూ యూరపుకూ వున్న సంబంధాన్ని (సాహిత్యసంబంధమైన) ఒక నాటకంగా ఊహిస్తే, అందులోని నాయకుడు (అమెరికన్) మాతృభాషాశబ్దజాలాన్ని చూసుకుంటూ మాతృదేశంలోనే వుండిపోయాడనీ, కుత్సితుడైన ప్రతి నాయకుడు (విలన్) ఆంగ్లోచ్చారణనూ, ఫ్రెంచితిళ్ళనూ నేర్చుకోవటానికి యూరపుకి బయల్దేరిపోయినవాడనీ అనుకుంటే, కాదని (ఆ మార్గం మంచిది కాదని) చెప్పవలసివస్తుంది. ఇర్వింగును కొంత ఈ రెండో కోవకు చెందిన మనిషిగానే మనం పరిగణించవచ్చు. అతనికి మరో ఆశయం వుంది—జాన్ బుల్ సంసారాన్నో, పీటర్ స్టుయ్‌వెసెంట్స్ న్యూయార్కునో తారుమారు చేసెయ్యాలనే విప్లవధోరణి అతని కిష్టం. ఇష్టమేగాని దానికి తగిన ఆవేశం అతని రచనలలో కనిపించదు.

అత డొక సారి తన 'దినసరి' (దినచర్యపుస్తకం-Diary)లో ఇలా వ్రాసుకున్నాడు (1817):

"ఈనాటి రచయితలు కొందరిలో (అదృష్టవశాత్తూ వాళ్ళ కంత పరపతి లేదు లెండి) సామాన్యజనవ్యవహారంలో వున్న పదబంధాలనూ, గ్రామ్యజాతీయాలనూ కవిత్వంలోకి చొప్పించాలనే ఒక పూనిక కనిపిస్తున్నది. అవి ఆడంబరరహితంగానే వుంటాయికాని చాలా మోటుగా, చవకబారుగా వుంటాయి. ఈనాడు మరి కావ్యభాష పరిశుద్ధంగా, ఎన్నికగా వుండటానికి వీల్లేదు" ఈ మాటలు గద్యంగురించి కాదు, పద్యకవిత్వం

గురించే అయినా ఇర్వింగు నొక 'విలన్'గా నిరూపించవా? అంటే ససేమిరా కాదు. అంతకు ఎనిమిదేళ్ళ పూర్వం అతడు వ్రాసిన న్యూయార్కు-చరిత్రయే ఇందుకు సాక్ష్యం. అది సగం సత్యం, సగం ఊహగా ఒడుదుడుకుల రచనయే కావచ్చునుగాని దానిలో ఒక గుణం వుంది. అతని పిదప రచనలన్నీ దీనిముందు నీరసంగా కనిపిస్తాయి. కొంచెం మచ్చు చూదాం. అమెరికాలోకి మనుషు లెలా వచ్చారు? అనే ఒక ప్రశ్న వుంది. దానికి నిక్కర్ బోకర్ పేరుపెట్టుకున్న ఇర్వింగు తమాషాగా సమాధానం చెప్పేడు: "ఒక దేశద్రిమ్మరి నార్వేజియన్ కంపెనీ కారణ మని గ్రోషియస్ ఊహించాడు. ఫ్రైస్‌లండ్ (Friesland) నుంచి వచ్చిన 'స్కేటింగుపార్టీ' కారణ మన్నాడు జుడ్రిఫెడస్ పెట్రీ" అని.

ఈ మాటల్లో మార్కు-ట్వెయిన్ వాటం కనిపిస్తుంది:

"ఉదయసంధ్యారాగము పూర్వదిగ్భిత్తికలకు పూతలు పూయగా ఆ వెనువెంటనే కనత్కనక నీలలోహిత జలధరజాల గర్భమునుండి బయ ల్వెడలుచున్న భానుమంతుడు గూడెము (Communipaw) లో నున్న తగరపు గాలిపిడముల (Weather Cocks) పై తన మనోహర కిరణ ములను పడవైచినాడు."

నిజానికి ట్వెయిన్ చమత్కారపు పోలికలు గల భాగా లెడనెడ మాత్రమే కనిపిస్తాయి. అయితేనేమి, 1809 లోనే, అంటే అమెరికన్ జాతీయవచనవాఙ్మయానికి ధ్వజమెత్తిన ట్వయిన్ రచన Innocents Abroad అనేది (1869) ప్రచురింపబడటాని కరవైయేళ్ళ ముందే ఆ ధోరణి కనిపించడమన్నది విశేషం. నిక్కర్‌బోకర్ హాస్యప్రవృత్తి కూడా ఒక కుర్రతనపు సరదాలాంటిదే కాని జాఫ్రెక్రేయాన్ అనే మారుపేరు కోసం నిక్కర్‌బోకర్, సాల్మగుండి అనే పేర్లెందుకు వదిలేశాడో ఇర్వింగు? తన న్యూయార్కు-చరిత్రయొక్క అర్వాచీనప్రతులలో మోటు ధోరణి అని తా నప్పుడనుకొన్నదానిని తగ్గిస్తూవచ్చాడు. మరి దీని కేమిటి కారణమో తెలీదు. పెద్ద వయస్సూ, ఏవో సొంతగొడవలూ కారణా లైవుంటాయా అంటే అవి చాలవు. యూరపునివాసముకూడా కాదు కారణం. అలా అంటే అది కారణాన్నీ ఫలితాన్నీ తారుమారు చెయ్య

డమే అవుతుంది. మరి? ఏమీ లేదు. 1809 1869 కాదు. అంతే కారణం. ఇర్వింగుకంటే మరీ యిటీవలి రచయితలు చమత్కార చతుర రచనా సముద్దేశమునుండి సునిశితమైన శైలి ఉత్పన్నం కాగల దన్న అభిప్రాయాన్ని ఆమోదించలేకపోయారు. ఈ విషయంలో అతని న్యూయార్కు చరిత్ర నిజాని కొక తప్పుడు ప్రారంభం అయివుండగా అదే అంతిమదశ అనుకోవడం వల్ల ఇర్వింగు నిందార్హుడేనా?

## జేమ్సు ఫెనిమోర్ కూపర్

అమెరికన్ కావడమే కూపర్ అదృష్టానికి సందిగ్ధావస్థ అయిపోయింది. ఇర్వింగులా కాక, ఆభిజాత్యవివాహాద్యనుబంధాలవల్ల అమెరికన్ భూమి కామందుల వంశానికి చెందినవాడు కూపర్. (ఇర్వింగంటే కూపరు కంత గౌరవభావం లేదు.) నిండైన దేశభక్తు డతడు. సం. రా. నౌకాబలంలో తన మూడేళ్ళ ఉద్యోగాన్ని ఘనంగా భావించుకుంటాడు. యూరపులో వున్న తన దేశీయులకు జరుగుతున్న అమర్యాదను ప్రతిఘటించడమే పనిగా పెట్టుకొన్నాడు. వారికోసం రెండు రచనలుకూడా చేశాడు. Notions of the Americans (1828), Letter to General Lafayette (1831). వారిలో కృతఘ్నత కనిపించేసరికి చాలా బాధపడ్డాడు. వారసత్వంగా దఖలుపడే ధనాధికతను గర్హించాడు. రాచరికం కంటే ప్రజాతంత్రము మంచి దన్నాడు. తన దేశపు శక్తిమత్తకు మురిసిపోయాడు. అయితే పెద్దమనిషితరహా అన్నది ఆ స్థిపాస్తులు, ఆభిజాత్యము, అభివర్ధనము, ఇరుగుపొరుగువారిమీద పెత్తనము మొదలైన వాటిమీద ఆధారపడివుంటుందని అతని కో గట్టి నమ్మకం. ఆ ముందటి తరంలో అలాంటి అమెరికను పెద్దమనుషుల్లో ఒకడైన జెఫర్సన్ యూరపు మోజుల విషయమై అమెరికన్ యువకుల నిలా హెచ్చరించాడు:

"అతడు (అమెరికన్ యువకుడు) కాని ఇంగ్లండుకు వెళితే త్రాగుడు, గుఱ్ఱపుపందెములు, ముష్టియుద్ధము (బాక్సింగు) నేర్చుకొంటాడు. ఇవి ఆంగ్లవిద్యయొక్క ప్రత్యేకతలు. ఈ క్రింద పేర్కొనబడే పరిస్థితులు ఇంగ్లండువిద్యాభ్యాసానికీ, ఇతర యూరపుదేశాలలోని విద్యాభ్యాసానికీ

సమానమైనవే. అమెరికన్ యువకుడికి యూరపు భోగవిలాసా లంటే మోజూ, స్వదేశపు సామాన్యస్థితిని చూస్తే ఏవగింపూ కలుగుతాయి. యూరపుసంపన్నుల కున్న హక్కులూ అవకాశాలూ చూస్తే వ్యామోహము, తన దేశంలో పేదవాడుకూడా ధనికుడితోపాటు చక్కని సమతా ప్రతిపత్తి గలిగి వుండడం చూస్తే ఎక్కడ లేని ఏహ్యభావమూ పుట్టుకొస్తాయి. యూరపుస్త్రీల వేషాడంబరాలు, ఆకర్షణలు, వేడబాలు, కలికితనాలూ గుర్తుతెచ్చుకొని స్వదేశస్థుల పవిత్రప్రేమానుబంధాలను, నిరాడంబరతను చూసి జాలిపడతాడు, కంటగించుకుంటాడు...యూరపుకి చదువుకని వచ్చిన అమెరికన్ తన జ్ఞానం, నీతి, ఆరోగ్యం, అలవాట్లు, సౌఖ్యం అన్నిటా నష్టపోతా డనిపిస్తుంది నాకు." 1

కూపర్ చదువుకోసం తన పిల్లలను ఫ్రాన్సుకు తీసుకువెళ్ళడానికేమీ సందేహించలేదు. కాని అతడు తన అమెరికనుతనం ధ్రువంగానే వుందనుకొన్నా, అమెరికాకు తిరిగి వెళ్ళాకమాత్రం అక్కడి జీవితవిధానం యెడల తన కున్న వైముఖ్యాన్ని దాచుకోలేకపోయాడు. అక్కడి మంది పాలన (Mob-rule), బాధ్యతలేకుండా, నింద్యంగా ప్రవర్తించే ముద్రణసంస్థలు, యూరపుకంటే వెనుకబడివుండడం మొదలైన లోపాలన్నీ ఎత్తిపెట్టి కటువుగా దుయ్యబడుతూ 'Home as Found' అనే గ్రంథం వ్రాశాడు. దానికి తగ్గట్టుగా నేవున్న ఒక చిన్న సన్నివేశాన్ని ఉదాహరిస్తాను. ఒకసారి న్యూయార్కుకు ఒక దగాకోరు నావాధిపతి వచ్చాడు. అత డో గొప్ప బ్రిటిషుగ్రంథకర్త అనుకొని అక్కడి సాహితీపరులంతా పొగ్గె అతగాడిని ఆకాశాని కెత్తేశారు. అందులో ఒకడు "ఆహా! జాతంటే ఇంగ్లీషుజాతే జాతి! చూడు ఆయన ఎంతఖుషీగా పొగ పీలుస్తున్నాడో" అన్నాడు. అంటే మరొకరు మిస్ ఏన్యువల్ అనే అమ్మాయి "స్కాట్ తరువాత మళ్ళా ఈయనే ఈపాటిమీద కనిపించిన వారిలో ఘనుడు" అన్నది. ఇలా వుంది ఆనాటి అమెరికాధోరణి. అయితే కూపర్ కది కిట్టదు. అతడిని తరచుగా అందరూ 'అమెరికన్ వాల్టర్

---

1. Letter to J. Bannister, Jr, 15-10-1785

స్కాటు' అంటుంటే, అది స్కాటుకంటే తనను తక్కువచేయడమే అని అత డా కితాబును కంటగించుకొనేవాడు. అయితే స్కాటును 'ఇంగ్లీషు కూపర్' అని ఎవరూ కలలోగూడ వ్యవహరించరని అతడికి తెలుసు. అది సరేగాని, అలా రెండుప్రపంచాల మధ్య కొట్టుమిట్టాడుతూవున్న కూపర్ ఇంగ్లీషువారు వేసిన ముకుద్రాళ్ళు త్రెంచుకొని అమెరికాదేశపు మొదటి గొప్ప నవలారచయిత ఎలా కాగలిగేడు? నవలాసామ్రాజ్యంగా రూపొందించుకోవడానికి తగినట్లుగా విశాలమూ, వివిధవిషయోపేతమూ అయిన ప్రపంచాన్ని ఎలా సృజించుకోవలసివచ్చిం దాయనకు? అమెరికన్ సమాజం గురించి అక్కడ సమాజమే సరిగా ఏర్పడనప్పుడు ఏమని వ్రాయడం?

సమాధానంకోసం మనం విధిగా యూరపువేపు చూపు సారించాలి. ఒకసారి యూరపునుండి అమెరికాకు ఒక నవల దిగుమతి అయింది. దాని కథారంగం ఆంగ్లసమాజం. మొదటి భార్యకు దానిని చదివి వినిపిస్తూవుండేవాడు కూపర్. పిదప 'Precaution' అనే పేరుతో దానికి మెఱుగులు పెట్టి ఒక నవల వెలయించాడు. అదే అతని మొదటినవల. 'The Spy' అనే తన రెండవ నవలలో అధ్యాయాల మొదట కేంబెలు వ్రాసిన 'Gertrude of Wyoming' నుండి సూక్తు లుదాహరించాడు. అతని మూడవ నవల 'The Pilot' అన్నది. సముద్రంగురించి స్కాటు వ్రాసిన 'The Pirate' కంటె మంచి నవల వ్రాయవచ్చును అని నిరూపించడానికి చేసిన యత్నమే. దాని ఉపోద్ఘాతంలో ఎప్పుడో ఎవరో ఒకరు తనతో "ఏమిటయ్యా, నువ్వు వ్రాసింది? ఇదంతా ఎప్పుడో స్మోలెట్ అనే ఆయన నీకన్నా బాగా వ్రాసేశాడు" అని అనవచ్చుననీ, తా నింకా ఆ పోటీ నెదుర్కోవలసి వుందనీ అన్నాడు కూపర్.

అతని సమస్యలకు పరిష్కారమార్గం కొంత అమెరికాయొక్క గతంలో కనిపిస్తుంది. 'The Spy' అనే నవల అమెరికన్ విప్లవ కాలంలో బ్రిటిషువారు న్యూయార్కు నౌకాశ్రయాన్ని ఆక్రమించుకోగా వాషింగ్టన్‌గారి సిబ్బంది పరిసరప్రాంతాన్ని పట్టుకునివున్న సమయానికి

సంబంధించినది. అది గొప్ప నవల కాకపోతే కాకపోవచ్చును గాని, ఉద్రేకపూరిత సన్నివేశాలు, అనువైన సాంఘిక నిబంధమూ వుండటంవల్ల సంతృప్తికరమైన నవల మాత్రం అవును. అందలి బ్రిటిషుపాత్రలు అన్నీ ఒక నాగరికమైన పెద్దమనిషి తరహాకు చెందినవి. యుద్ధానికి ముందు వాళ్ళంతా చక్కగా కలిసిపోయారు. కూపర్ తనకు మాతృదేశాభిమానం వుందని స్పష్టంచేసినా, నవలలో తగిన తాటస్థ్యం చూపగలిగేడు. నాయకులు కాకపోతే వాళ్ళ పెద్దలు రెండువేపులా వున్నారు. ఫలితం ఉభయతారకంగా వుంది. అటు ఆంగ్లేయులూ సంతోషించారు, ఇటు అమెరికనులూ సంతృప్తు లయ్యారు. అప్పటికే, అంటే ఆండ్రూ జాక్సన్ శకానికే నింద్యములుగా పరిగణింపబడుతున్న, సాంఘికంగా తాము చేస్తున్న టక్కు టమారాలను చారిత్రకమైన నవలలో ఒప్పుకోవడానికి సిద్ధపడ్డారు. ఇంచుమించు ఇలాంటి కారణాల మూలంగానే తన 'The Pilot' అనే నవలతో మరో విజయం సాధించాడు కూపర్. అందులో జాన్ పాల్ జోన్సు అనే ఆయన యార్కుషైరు సాగరతీరంలో ఒక స్థలజలమహాసమరం చేస్తాడు. ఈ నవలలోనూ బ్రిటిషు పెద్దలూ, అమెరికను పెద్దలూ కూడా పాల్గొంటారు.

పైలట్ నవలవల్ల కూపర్‌కి మరో ఉపకారం జరిగింది. స్కాటు వ్రాసిన 'పైరేట్' నవలలో అతనికి నావికసంబంధమైన అనుభవం లేదని స్పష్టపడిన విషయాన్ని విమర్శించడానికి పూనుకొన్నప్పుడు కూపర్‌తో సాగరసంబంధమైన జీవితంయొక్క సవిస్తరచిత్రణం సామాన్యపాఠకుడిని గాభరాపెట్టేస్తుందని ఎవరెవరో అన్నారు. ఇది సరికాదని ఋజువుపరచడానికి సాహసరసోపేతమైన మరోవస్తువు నతడు గ్రహించడమే కాదు, సంగ్రహరూపంలో దానికి తగిన ఒక సాంఘికవ్యవస్థ అతనికి సిద్ధంగానే వుంది. నౌకాయాత్ర వున్నదే దాని ఆచారవ్యవహారాలతో, మతాచార్యుల ఆధిపత్యంతో, ఒక్క ఆడంగులు వుండరన్న మాటగాని, తక్కిన అన్నిటితో అక్కడి కదే ఓ పరిపూర్ణప్రపంచంలా వుంటుంది. కేవలం నావికజీవితానికి సంబంధించిన వివరాలు పాఠకుడికి చికాకు కలిగించవచ్చును గాని, తక్కిన విషయాల్లో నౌకాయానం స్వరూపం బాగా నిరూ

పించాడు కూపర్. అది మానవుల నానావస్థలకు ఒక లక్ష్యభూమి అని కూపర్ కంటే మరీ బాగా ఒత్తిచెబుతాడు మెల్విల్లీ :

"సోదరయాత్రికులారా! సమస్తభూజనసోదరులారా! మన మెన్నో అనర్థాలకు గురిఅవుతున్నాం. అదిగో ఆ ఫిరంగిమిద్దెమీద అన్నీ ఫిర్యాదులే. లెఫ్టినెంటులతో చెప్పి లాభంలేక కెప్టెనుతో చెబుతాం. అప్పుడూ లాభం వుండదు. ఈ ప్రపంచయుద్ధనావలోనుండి ఎక్కడో దూరంగా కంటికి కనుపించని, అస లున్నారో లేదో తెలియని ఆ నౌకాధిపతులకు మొఱపెట్టుకుంటాం. అదీ వ్యర్థమే అవుతుంది. మన చెడుగులు మనమే అజ్ఞతతో తెచ్చిపెట్టుకుంటాం. మన అధికారులు ఉద్దేశమున్నా వాటిని తొలగించలేరు".1

కూపర్ ఇంత అర్థగాంభీర్యాన్ని ప్రదర్శించలేకపోయినా, నవలా రచయితగా సాగరసంబంధజీవితవైలక్షణ్యంవల్ల ఉపయోగం మాత్రం పొందేడు. కూపర్స్టవున్ లోని సంఘస్థితికీ, మెల్విల్లీ యొక్క Pierre (పుట 115-116) లోని సంఘస్థితికీ ఎంత వ్యత్యాసం వుంది! అందులో అస్పష్టంగా వుంది; ఇందులో అవాస్తవికంగా వుంది. నాయికపాత్ర ఉనికివల్ల కూపర్ వ్రాసిన సముద్రపుకథలు అప్పుడప్పుడు పట్టుతప్పడం కద్దు. ఆస్త్రీ, అందమూ గల పడుచులు, అలిండా డి బార్బరీవంటి పేర్లు గలవాళ్ళు సామాన్యంగా ఓడలమీద కనిపించరు, రచయిత పనిగట్టుకొని కథ నా విధంగా బనాయిస్తే తప్ప. అయితే కూపర్ కథల్లో అలాంటి పడుచుల ఉనికి కొంత అసహజంగావున్నా, అతిమాత్రవైదగ్ధ్యంతో ఆయన చేసిన తుపాను వర్ణనల్లోగాని, తుపాకి పోరాటం వర్ణనల్లోగాని చమత్కారానికి లోపం రాలేదు.

'పైలెట్' ప్రకటింపబడిన యేడే ప్రకటితమైన 'The Pioneers' అనే నవలలో కూపర్ అంతకంటె ప్రసిద్ధమైన మరో విషయాన్ని 'అమెరికన్ మరుభూమి' (American Wilderness) ని వస్తువుగా ప్రతిపాదించాడు. ఇందులో క్రొత్తగా ఇండియనుల సాంఘికవ్యవస్థను ప్రవేశ

---

1. White-jacket.

పెట్టేడు. ఇండియనులలో అనాగరకత ఎంత వున్నా తెల్లజాతి పెద్ద మనుషుల లక్షణా లనేకం వున్నా యంటాడు కూపర్. ఇండియనుల జాతీయ జీవనవిధానం గురించి అతనికి నూటికైన అనుభవంలేదు. అతని 'The Deerslayer' నవలలో కథారంగము, ఆస లతని నివాసము ఆట్సెగో సరోవరప్రాంతము ఇండియనులకు చిరంతనవాసభూమి కాదు. వారి వర్తనము గురించి అతనికున్న అభిప్రాయాలు (Iroquois యెడల అతని అప్రీతి కూడ) మొరేవియన్ మిషనరీ హెక్కె వెల్డర్ వ్రాతలనుండి గ్రహించినవే. అతడు ఇండియనుల నెంత ఆదర్శమూర్తులుగా చిత్రించినా బహుశా అమెరికనుల కంటె యూరపియనులకే వాళ్ళంటే ఎక్కువ ఔత్సుక్య మేర్పడింది. ఆ మరుభూమి దృశ్యాలూ అంత ఔత్సుక్య జనకాలుగా వున్నాయి. ఆ అడవులూ, సరస్సులూ, ఆ మిస్సిసిప్పీనదీప్రాంతపు బయళ్ళూ కూపర్ నవల The Prairie కే కాక ఫ్రాన్సిస్ పార్క్‌మన్ వ్రాసిన చరిత్ర గ్రంథాలకూ పూర్వరంగ మైనవి. ఆ ప్రాంతానికి చైతన్య మన్నది శ్వేతజాతీయుడివలన వచ్చింది. అతడు ఇండియనులు వేటాడే చోటుల్లోనికి చొచ్చుకుపోయాడు. అవిరామంగా, అక్రమంగా పోట్లా టలు, పోరాటాలు రేపేడు. చివరికి అంతా స్వాధీనం చేసుకున్నాడు. చాలాకాలం తర్వాత ఆట్సెగోకు తిరిగివచ్చిన కూపర్ ఆ పరిసరారణ్య గర్భస్రావమును గుర్తించి ఒక ఉత్తరంలో పేర్కొన్నాడు. దానినిబట్టి తెల్లవారి వలస ఎలా ఏర్పడిందో తెలుస్తుంది. ఇండియనులకీ ఏదో కొంత స్తోమత వుందని చెప్పబడిన నవలలలో కూడా వాళ్ళ భవిష్యత్తు విపత్సూ చకంగానే కనిపిస్తుంది. కృత్రిమత సరళతపై, ఒకే ఒక సంభావ్యమైన నిశ్చయంతో, యుద్ధం ప్రకటించింది. అది కేవలమూ ఇండియనుకీ, శ్వేత ముఖుడికీ మధ్య ఏర్పడిన సంఘర్షణమాత్రమే కాదు. అది ఒక సాంఘిక వ్యవస్థకూ, ఒక అవ్యవస్థకూ మధ్య యేర్పడిన సంఘర్షణ అని The Pioneers నవల నిరూపిస్తుంది. అందులో మొదటిదానికి ప్రతినిధి జడ్జి టెంపిల్. రెండవదానికి 'నేటీబంప్పో,' లేక 'లెదర్ స్టాకింగ్' అనే ప్రాచీన శ్వేతజాతి మృగయుడు.

ఈ లెదర్‌స్టాకింగు కథ లైదింటను ఇది మొదటిది. ఈ అయిదు కథల్లోనూ మృగయుని జీవితము యొక్క సమగ్రచిత్రణం చూడగలం. నేటీ మంచి ధైర్యశాలి. మంచివాడు. విద్యాగంధము లేనివాడు. ఇటు ఇండియన్ ప్రపంచానికీ, అటు శ్వేతముఖప్రపంచానికీ మధ్యస్థంగా వుంటుంది ఆతని స్థితి. మొహికన్ నాయకుడు Chingachgook ('చికాగో అని పలకా లనుకుంటాను' అన్నాడు మార్క్‌ట్వెయిన్) యొక్క ఆప్తమిత్రుడైన రెడ్‌స్కిన్‌కి ఎన్ని ఆటవికకౌశల విన్యాసా లున్నవో అన్నీ వున్నవాడు. ఇండియన్ విశ్వాసాల యెడ కొంత సహనం వున్నవాడే కాని శ్వేతజాతి లక్షణాలనూ కొన్ని మిగుల్చుకొన్నవాడు. అన్యవర్ణానికి చెందిన పిల్లను పెళ్ళాడటాని కిష్టపడడు. సమరయాత్రలో చికాగో ననుసరించినా ఇండియన్లవలె ఓడినవారి పెణతలు ఊడగొట్టాడు. The Last of the Mohicans లో హాకెయి (Hawkeye)అనే మరోపేరుతో కనిపిస్తాడు. నేటీ తన జీవితంలో మరి కొస్త పూర్వపు దశలో-మొహికన్ జాతిలో ఇక మిగిలిన ఇద్దరే ఇద్దరైన చికాగో, ఆతని కొడుకు ఉంకాస్ (Uncas) లతో కలిసి తిరుగుతూ వుంటాడు. ఈ నవల తరువాత మరుసటి వత్సరమే కూపర్ The Prairie ని ప్రకటించాడు. ఇందులో నేటీ నాగరిక విజృంభణం వల్ల పదచ్యుతుడై పడమటి సీమలకు పారిపోయి అక్కడ జీవగ్రాహకవృత్తితో ప్రాయపు ప్రొద్దు వాటారుతున్న వయస్సులో కనిపిస్తాడు. ఆతని అంతిమ నిశ్వాసమే ఆ నవలకూ చరమాశ్వాసము.

పాపం, చక్కని పాత్ర గతించింది. కాని కూపర్ తన The Pathfinder, The Deerslayer అనే నవలలో ఆ పాత్రకు పునర్భవం ప్రసాదించాడు. రెండవదానిలో నేటీ తన సమరయాత్రలో యువకవీరుడుగా దర్శన మిస్తాడు. Pathfinder లో ఆతడూ, చికాగో ఇద్దరూ యౌవన ప్రారంభంలో వుంటారు. అయితే కథంతా విలోమంగా చెప్పబడటంవల్ల ఆతని ఏకాకిజీవితపు భవిష్యత్తు, అటవీవిపాటనం, ఆతని పశ్చిమదేశప్రవాసం అన్నీ మనకు ముందుగానే తెలుసు. Deerslayer

లో అసలు కథ జరిగిన పదిహేనేళ్ళకు అతడు మళ్ళా గ్లిమ్మర్ గ్లాస్ (=ఆస్టెగో)కు తిరిగి వస్తాడు. అతగాడిని ప్రేమించిన అమ్మాయి ఒకర్తె ఇక్కడ వుండేది పూర్వం. కాని, పాపం, అతడు తిరిగివచ్చేసరికి ఉన్న దేమిటి? చివికి శిథిలావస్థలో ఆ చెఱువుగట్టున మాసిన నవారుపేలికలతో ఒక పాక వున్నది, ఆమె స్మృతిచిహ్నంగా. ఆ గతస్మృతుల గర్భం దొలుచుకువచ్చిన ఒక దుర్భర వేదనకు నేటీ బంపోవేకాదు నేటి పాఠకుడు కూడా గురి అవుతాడు.

ఆ మరుభూమిపై కాలం జరిపిన జైత్రయాత్ర ఒక సుదీర్ఘ పరిస్ఫుట మహేతివృత్తము. కూపర్ రచనలో శక్తి యింకా గోచరిస్తూనే వుంది. అయితే అతని లోపాలను "ఫెనిమోర్ కూపర్ చేసిన సాహిత్యపు నేరాలు" ('Fenimore Cooper's Literary Offences') అనే వ్యాసంలో నిర్దాక్షిణ్యంగా ఎత్తిచూపేడు మార్క్ ట్వెయిన్. కూపర్‌లో అసందర్భాలెన్నెనా వున్నాయి.ఉదాహరణకు—ఖచ్చితంగా కాలనియమానికి కట్టుబడినట్లు నేటీ, చికాగోలు జరిపిన అటవీసమావేశాలు విస్మయావహంగా వుంటాయి. కొంప లంటుకొనేదాకా ఉపద్రవాలపసరింపబడవు. సంభాషణలు తఱచు వికారంగా వుంటాయి. పాత్రల స్వభావంలో గాంభీర్యము వుండదు. హాస్యోత్పత్తికి కూపర్ చేసిన ప్రయత్నాలు ధారాళంగా వుండవు. అవసరమైన సంభాషణలు ఆఖ్యానధోరణి కడ్డుతగులుతూ వుంటాయి. శత్రువులు పొంచివున్నారన్న సన్నివేశంలో గూడ కథ వేగం పుంజుకోలేదు. ట్వెయిన్ అన్నట్లు కూపర్ కథల్లో ఇంద్రియవ్యాపారత్వరకూడా కనిపించదు.కథారంగ సన్నివేశము, పాత్రల గురించి అతనికొక సమ్యగ్దర్శనము లేదు. ఉన్నదంతా వట్టి ఊహాగానమే. నిర్జన నిరుపహతంగా సాగవలసిన చోట పుసుక్కున పాఠకుడికీ, సన్నివేశానికీ మధ్యకు తోసుకొస్తాడు రచయిత. ఉదాహరణకు—శత్రువులైన ఇండియన్లు తమ శిబిరంలో మంటచుట్టూ కూర్చునివుండగా వాళ్ళ రహస్యాలు కనిపెట్టడాని కక్కడ పొంచివున్న నేటీ—"అక్కడ చాలామంది యుద్ధవీరులు లేరని ఒక్క చూపులో కనుగొన్నాడు...రివెన్ వోక్ మాత్రం

సాల్వటార్ రోసాను చిత్రరచనాపర్యత్నుని చేసే ఒక మనోహర దృశ్య ప్రాంగణంలో ధగధగలాడుతున్న కాకపక్షములతో కూర్చునివున్నాడు." కూపర్ ఉద్దేశాన్ని మనం గ్రహిస్తాము. కాని ఆ సాల్వటార్ రోసా ప్రసక్తి నేటీకి మనలను దూరం చేస్తుంది. నేటీకి ఆ రోసా యెవరో వినుకలి కూడా లేదు. ఇక, కూపర్ శైలిలో సౌలభ్యం లేకపోయినా పని జరిగి పోతుంది. ఒక పాత్రయొక్క నడకను వర్ణిస్తూ—"అత డడుగు వేస్తే అది సున్నితంగా సాగదు. అక్రమంగా ఒళ్లంతా ముందుకువచ్చి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ జరిగిపోతాడు" అని చెప్పిన కూపర్ మాటలనే అతని శైలి కన్వయించవచ్చు. అయితే ఎప్పుడూ అది అంతగా అతని కథా గమనాన్ని అరికట్టలేదు. ఆ కథ లన్నిటా ప్రాథమికమైన గతిద్రుతత్వం వుండ. కథ చివరిమెట్టు ఎలా వుంటుందో అన్న సందేహం కలగదుకాని మధ్యలో ఏమెట్టు కామెట్టు తరువాతి మెట్టు ఎలావుంటుందో అనిపిస్తుంది. అంటే "అంత చమత్కారం" లేకపోయినా ఎప్పటికప్పుడొక ఔత్సుక్య తరంగం లేచి ఆ స్ఫూర్తి అనుస్యూతంగా కొనసాగుతుంది. ఆఖరికి సర్వ మంగళం అయ్యేదాకా పరమపదసోపానపటం ఆటలో పాములూ నిచ్చె నల పర్యాయన్యాయంగా భోగభాగ్యాల పరివర్తనాలు అత్యంత హఠా త్సంభూతాలుగా వుంటాయి.

పోతే, అతని కృతు లెన్నో వుండగా ఈ లెదర్‌స్టాకింగు కథలే అంత పే రెలా చేసుకున్నాయి? ఈ రోజుల్లో అవి పిల్లల పుస్తకాల బీరువాల్లో ఎంచాత కనిపిస్తున్నాయి? అంటే, మొదటి సంగతి-అతని కథ లన్నీ మధ్యరకంగా వున్నట్టు కనిపిస్తాయి. అందులో సాంప్రదాయికంగా రూపొందించబడిన నాయికానాయక పాత్ర లున్నాయి. అంతేకాక కథా చమత్కారాన్ని ఆకట్టుకొన్న పాత్రలూ మరికొన్ని వున్నాయి. The-Spy అన్న కథలో హార్వేబిర్చ్ అనే పాత్ర తక్కిన పాత్రలో తగినంతగా ఎప్పుడూ కలియదు. The Prairie లో నాయికానాయక పాత్ర చిత్ర ణంలో అతిరిక్తత కనిపిస్తుంది. అమెరికన్ నవలారచయితగా, అమెరికన్ తగుమనిషిగా కూపర్‌కి 'సొసైటీ' (సంఘము, లేక సమాజము) అన్న మాటయొక్క అర్థపరిస్ఫూర్తి ఏర్పడినట్లు మనము గ్రహింపగలము. సాంఘికమైన హీనస్థితిలోనుంచి ఒక ఉత్తమ సాంప్రదాయికనాయకుని

ఉత్పాదించలే డాయన. తన పాత్రలకు తగిన సాంఘిక యోగ్యత లున్నా యని నిరూపించడానికిగాను అప్పుడప్పు డాయన వింతవింత యుక్తులు చెప్పుకువస్తాడు. The Pioneers లో ఆలివర్ ఎడ్వర్డ్సును సంకర జాతివా డనుకొన్నప్పు డతనితో వెళ్ళడాని కిష్టపడదు ఎలిజబెత్ టెంపిల్. అదే అతడు మేజర్ ఎఫింగ్‌హామ్‌గారి మనుమడూ, అంచాత శతశః శ్వేతజాతీయుడూ అని తెలియగానే కథ యక్షకథ (Fairy tale)లాగు ఒక మలుపు తిరిగి ఎలిజబెత్ అంచక్కా ఆలివర్‌ను పెళ్ళాడుతుంది. అతడు వాళ్ళ అయ్య ఆస్తిలో సగానికి వారసు డవుతాడు. 1

నేటీ బంపో విషయంలో మాత్రం మరీ క్లిష్టత యేర్పడింది. అతడు స్వతంత్రుడుగా వున్నంతకాలం ప్రశంసకు పాత్రుడయ్యాడు. నాయక పాత్రకు తగినవా డనిపించుకొన్నాడు. కాని అతడు ఇండియన్ సమాజానికి చెందినవాడూ కాడు; తన స్థితి యేదో స్పష్టపడక అటు ఆంగ్ల సమాజంలోనూ చేరలేడు. అంచాత అతనికి పెళ్ళికావడానికే వీల్లేదు. అతనికి వచ్చిన రెండు అవకాశాల్లోనూ Deerslayer లోనిది చాలా యుక్తంగా వుంది. జుడిత్‌హట్టర్ అయితే అతనిని ప్రేమించిందికాని అతడే కాదన్నాడు. దాని కతడి కామెయం దనురాగం కలగకపోవడమే కారణమట! Pathfinder లో అతడే ప్రేమలో పడ్డాడు మేబెల్‌డన్‌హేమ్‌తో. ఆమె ఒక సైనికాధికారి కూతురు. నానావిధ క్షమాపణలతో,

---

1. రంగుమనిషినుండి తెల్లజాతి తగుమనిషి నెలా తయారుచెయ్యడ మన్న సమస్య 19 వ శతాబ్ది నవలలలో చాలావాటికి సామగ్రి సమర్చి పెట్టింది. Across the Plains అనే గ్రంథంలో ఆర్.ఎల్. స్టీవెన్సన్ Cassel's Family Paper లో ప్రకటింపబడిన తన చిన్ననాటి అభిమాన గ్రంథం గూర్చి ఇలా వ్రాశాడు: "దానిని దాది నాకు చదివి వినిపించింది. అందులో 'కస్టలోగా' అనే ఒక ఇండియన్ సాహసికుని కృత్యాలు వర్ణితములైనవి. చివరి ప్రకరణానికి వచ్చేసరికి అతి దయనీయంగా వాడు ముఖాని కున్న పూత కడిగేసుకొని ఏ సర్ రెజినాల్డో అయిపోతాడు. ఈ చిలిపి చమత్కారానికి నాకు ఒళ్లు మండిపోయింది. ఒక జమీందారో ఏదో కావడంకోసం ఒక ఇండియన్ వీరు డదంతా ఒదులుకుని అలా మారిపోవడాన్ని నా మనస్సు నిరాకరించింది."

యోగ్యతలతో ఆమె నాయిక పాత్ర అయి కూర్చున్నది (ఒక పెద్ద అధికారిగారు కీర్తిశేషులు కాగా వారి సతీమణి సంరక్షణలో పెరిగినది కావటం మూలాన అందరూ అనుకోనేదానికంటె ఎక్కువ నాగరికత గలదట ఆమె). నేటీని పరిచితేతరములైన వర్ణాల్లో వంచించడం అసంభవం. అతడు నిరక్షర కుక్షి. బొత్తిగా తక్కువ కులంలో పుట్టేడు. మేబెల్ అతనిని నిరాకరించడం తప్పనిసరి అయింది.

నేటీ నివసించే ప్రదేశం ఒక శూన్యంలాంటిది. అయితేనేమి, అదొక అద్భుతమైన ప్రపంచం. కాని తగిన సారవత్త్వము లేనిది. అక్కడున్న పీపాల పెద్దమనిషి (Cooper gentleman) ఇబ్బంది గాడు. పెద్ద మనిషి కానివాడికి సమగ్రసన్నివేశావ్రతలేదు. మన కూపర్ రోజుల్లో విశేషించి, తత్తుల్యమైన అభిరుచిగలవారి చూపులో ఆనాటి ఆమెరికాలోని ఒక అనాగరక సంఘానికి నవలకు వస్తువుగా వుండడానికి యోగ్యత లేదు. తత్ఫలితంగా నేటీ నడత సంఘంనుంచి తప్పించుకోవడంగా వుంటుంది. కూపర్ వ్రాసిన ఈ లెదర్‌స్టాకింగు కథలను గాని, సముద్రపు కథలనుగాని అతని సమకాలికుడైన బాల్జాక్ నవలలతో సరిపోల్చి చూస్తే బాల్జాక్‌ది ఒక చక్కని యథార్థ ప్రపంచంగాను, కూపర్‌ది సాహసకృత్యాలు చెయ్యడం కోసం దేశాటనం చేసే శూరవరేణ్యుల కాల్పనికజగత్తుగానూ కనిపిస్తాయి. ఆ కల్పనాంశమే బంపో కథలను వట్టి సాహసోదంతాలుగా గాక మరి కాస్త ఘనమైనవిగా రూపింప జేస్తుంది. కాని రానురాను ఆ అంశం పలచబడి ఆ సాహస గాథయొక్క వైశిష్ట్యం మాసిపోయింది. అదే మరోమాటగా చెప్పాలంటే లెదర్ స్టాకింగుకు తగిన పరిణతరూపం కథానాయకుడైన పశుపాలకుడు. అతడు వట్టి సామాన్యుడైనా పురుషకారం, ధైర్యసాహసాలు గలవాడు. అయితే అత డెంత శూరుడైనా, బిరుదలాంఛనాలు లేకపోవడం వల్ల సంఘంలో అతనికి స్థానం లేదు. అంచాత తన తాహతునుబట్టి నాయుడుగారి కూతురిని పెళ్ళాడటం మాట అలా వుండగా ముట్టడానికీ, చూడ్డానికీ, గూడా వీల్లేదు; తన దిక్కుమాలిన దారిన తాను పోవలసిందే. ఏమైతేనేమి, కూపర్ సాధించింది శ్లాఘ్యమైనదే. అమెరికన్ మరుభూమి యెడల అతనికున్న దృక్పథం

ఒక తరం క్రితం బర్ట్రిమ్ కున్నట్లు నాగరికుడైన యూరపియనుకున్న దృక్పథం వంటిదే అని చెప్పవచ్చు. అయినా కాకపోయినా ఒక సాహిత్య సమ్మోహన మంత్రం పఠించి పాఠకులను వశీకరణం చేసుకోవడంలో అతడు కృతార్థుడైనాడు. అతడు హెక్కెవెల్డర్ నుండియే విషయాన్ని గ్రహించినా, ఆ హెక్కెవెల్డర్‌ను చదవడాని కీనా డెవరూ శ్రమపడరు. కూపర్ వర్ణనలే హెక్కెవెల్డర్ వాటికంటె అన్యూనాతిరిక్తంగావుంటాయి. చిన్నప్పుడే మనం కూపర్ సృష్టించిన ప్రపంచాన్ని మరచిపోయినా ఆ వినూత్నకల్పనాప్రకర్ష ఈ నాటికీ మనచేత కూపర్ గ్రంథాలు చదివి స్తుంది. సముద్రసంబంధములైన అతని నవలలలో ఈ చమత్కారం బాగా తక్కువే అయినా వాటిలో కూడా చెత్తనుండి చేవను చేదగల సామర్థ్యం చూపించాడు కూపర్. అతని గ్రంథాలు చదవడంలో మళ్ళా మనం మన శైశవమధురస్వప్నాల్లో ప్రవేశించగలిగితే మన సమయం సద్వినియోగ మైనట్లే.

## ఎడ్గార్ అల్లన్ పో

ఇర్వింగు, కూపరు—వాళ్ళ రచనల గురించి తృణీకారపు మాట లేమి వినిపించినా, వాళ్ళు గొప్ప రచయితలని సమకాలికులైనా ఒప్పుకోనక తప్పదు. పో మాత్రము తన స్వల్పజీవితకాలంలో అంత ప్రసిద్ధి కెక్క లేదు. మొదట ఒక పత్రికారచయితగా అపరిణతమైన అమెరికన్ సాహిత్య రంగంలో రచయితల మందలో తా నొకడుగా పెనగులాడేడు. మెల్లగా చిల్లరదేవుళ్ళ మధ్య నుంచి దూసుకొనివచ్చి పెద్దల మధ్యలో పడ్డాడు. ఆ పెద్దలు Mrs. Sigourneys, Frances Sargent Osgoods, N. P. Willises, Thomas Holley Chiverses. వీళ్ళంతా అర్హతనుమించి మేధావులుగా ప్రశంసింపబడ్డారు (పోకూడా ఒక్కొక్క సారి వీరిని ప్రశంసించినవాడే). పాపం,అభాగ్యుడైన రచయిత పో.ఇర్వింగు ఇతని గురించి సానుభూతి ప్రకటిస్తూ వ్రాశాడు. సారస్వత ప్రతిష్ఠ గురించి మహత్తర స్వప్నాలు కనికని హీనమైన చిల్లర రచనలకు దిగాడు. లేమి యితనినికూడా తిప్పలు పెట్టింది. పత్రికా సంపాదకుడుగా గట్టివా

డనిపించుకున్నాడు; ఘనవిజయాలు సాధించాడు. కాని మనిషికి స్థిరం లేక పోవడం వల్ల ఆ విజయాలకు విఘాతా లేర్పడుతూ వచ్చాయి. చిన్న చిన్న సమీక్షలు తెగ వ్రాసేవాడు. ఆకర్షకంగా వున్నా అవకతవక హాస్య రచనలు చేసేవాడు. శంఖపరీక్ష గురించి పాఠ్యపుస్తకం వ్రాశాడు! ఇదీ వరస. అయితే ఎప్పుడూ నైచ్యానికి దిగజారలే దతడు. ఆస్కార్ వైల్డు రేవు సుంకాల అధికారి కడ ప్రకటించుకొన్నట్లు ఇతడు కూడ తన ప్రతిభను ప్రకటించుకోవలసివచ్చింది. ఆ 'జీనియస్సు' ను 'డిక్లేర్' చెయ్యడం అనే మాట ఆనాటి పత్రికలలో వెటకారానికి గురియైనది. పో వుంటూ వచ్చిన కార్యాలయాలు, విశ్రాంతిగృహాల అసహ్యకరమైన వాతావరణం దృష్ట్యా సందర్భోచితంగా లేకపోయినా పోకి ఆ మాట అంటే ఎక్కడ లేని ఆప్యాయతా, మమకారమూను. అతని సమకాలికులకు, ఇర్వింగుకు, కూపర్ కుగూడ పో యొక్క ప్రజ్ఞాప్రాభవం అంతుపట్టక పోయినా కాలం మాత్రం అతని పట్టుదలకు ప్రతిఫలాన్ని చూపించింది.

అయితే భావితరం వారి తీర్పు ఏకగ్రీవంగా లేదు. మొన్న మొన్నటి దాకా అతని దేశం వాళ్ళే అతని నొక వాచాలుడిగా కొట్టి పారేశారు ("Jingle man" అని ఎమర్సను). కాకపోతే, అతన్ని ప్రశంసిస్తూ అమెరికన్ సాహిత్యంలో ప్రధానమైన ప్రఘట్టకానికి అవతల వుండవలసిన వాడన్నారు. అయితే ఇతరు లనేకుల కతని ప్రతిభ గురించి ప్రశ్నే లేదు. టెన్నిసన్ ఆమోదించాడు దాన్ని. డబ్ల్యు. బి. యీట్స్ ఆమోదించాడు. బాడెలెయిర్ మొదలు వేలెరీ వరకు ఫ్రెంచి వారంతా ఆమోదించారు. ఫ్రెంచివారితో సాహిత్యగోష్ఠి జరిపినప్పు డెందరో అమెరికన్లు, వారి నోట 'ఎడ్గార్ పో' అనే మాట ఒక మంత్రంలా, ఒక గొప్ప అభినందనలా రావడం ఎఱుగుదురు. నిజానికి ఫ్రెంచివారికి 'ఎడ్గార్ పో' ఆంగ్లభాషీయులచే ఎడ్గార్ అల్లన్ పో గా వ్యవహరింపబడే వ్యక్తి కన్న భిన్నమైన వ్యక్తిగా భాసిస్తాడు.

బ్రిటనులో గాని, అమెరికాలోగాని మామూలు పాఠకుడికి కొన్ని పట్టయిన కథలు వున్నాయి. వాటిని చదివేటప్పుడు గుర్తుకొస్తాడు పో.

'The Gold Bug' అనే కథనుగాని, 'The Pit and the Pendulum' అనే కథను గాని ఎప్పుడో ఒకప్పుడు చదవని వాడెవడు? 'Raven', 'Never more', 'Bells' మొ॥ ఒకటి రెండు కావ్యఖండాల గురించికూడా ఆ చదువరికి జ్ఞప్తి వుండవచ్చు.

"The glory that was Greece
And the grandeur that was Rome"

అనే ఈ పంక్తులు పో వ్రాసిన 'To Helen' లోని వని తెలియక పోయినా, పంక్తులు తెలిసి వుండవచ్చు. పో తాలూకు ఏదైనా కావ్య ఖండికలూ, డెబ్బై కథానికలూ చదివినవారొక్కసారి మళ్ళా అదంతా స్మృతిపథంలో నెమరు వేసుకుంటే "అందులో మూడు పాళ్ళు ప్రతిభ, రెండు పాళ్ళు చెత్త" అని లోవెల్ మహాశయుడిచ్చిన సువిఖ్యాతమైన తీర్పుతో ఏకీభవించగలరు. వారు విట్‌మన్ అభిప్రాయంతో ఏకీభవించడానికి కూడా అవకాశం వుంది. విట్‌మన్ ఏమన్నాడంటే-పో పద్యాలు భావకవితా జగత్తులో విద్యుద్దీపాలలాంటివట. అవి కాంత్యుజ్జ్వలములు, కన్నులు మిఱుమిట్లు గొల్పుతవి. కాని వాటిలో వేడి లేదు. ఆ పద్యాల్లో అనుప్రాస కళాకౌశలం అట్టహాసంగా వుంటుంది. మితిమీరిపోయింది,అని. పో కవిత్వంగురించి ప్రసక్తి వచ్చినపుడు తరచుగా 'మెకానికల్' (అనాలోచితమైన) అనేమాట వినిపిస్తుంది.అతడు ఛందస్సు గురించి వ్రాసిన వ్యాసాలు ఊరికే అలా చూస్తే చాలు ఆ మాట అసంగతమైనది కాదనిపిస్తుంది. ఆ వ్యాసాలు పద్యరచనా శిల్పం గురించి అంతనొక్కి వక్కాణించిన రచయితయే ఆ నియమ నిబంధనలు తన లక్ష్యశుద్ధికే అతీతమై పోవడానికి సమ్మతించినట్లు సూచిస్తాయి. సత్యాన్ని విడనాడి, తన ఉపదేశానికి తానే విరుద్ధంగా, తనకూ అందము చందము మాధుర్యమూ కావలసివచ్చి పో తాను కూడా తరచు ఛందోనిబద్ధత లేని ధోరణిలోనికి జారిపోవడం కద్దు. పైవాళ్ళ విషయంలో చాలా ఖరోడాగా వుంటాడు (ఉదాహరణకు ఎలిజబెత్ బేరెట్ బ్రౌనింగు రచన గూర్చి ఆయన చేసిన నిశితపరిశీలనము గమనింపదగును). కాని స్వవిషయంలో తన తప్పులు తన కంటికి కనిపించవాయనకు. 'Ulalume' అనే పద్యంలో

“Kissed her”అనే దానికి ‘Sister’, ‘Vista’అనే మాటలతో... అంత్యప్రాస పాటిస్తాడు. ‘For Annie’ అనే మరో రచనలో ‘Annie’అన్న మాటను ‘many’తో జత పడుస్తాడు. పద్యా లన్నిటా ఛందోవిరామ చిహ్నాలను లాగి పారేస్తాడు. చమత్కారం చెదిరిపోతుంది. ఉదా: ‘Eulalie’ నుండి):—

I dwelt alone
In a world of moan,
And my soul was a stagnant tide,
Till the fair and gentle Eulalie became my blushing bride-
Till the yellow-haired young Eulalie became my smiling bride.

మల్లార్మె ఏరికోరి ప్రశంసించడానికిగాను ప్రత్యేకంగా ఆ చివరి పంక్తి నెత్తుకొన్నాడు. ఆంగ్ల పాఠకు లిందులోని ఏ పంక్తినీ పట్టుగా గ్రహించలేరు. పేర్లు పెట్టడంలో పో చేసిన ఎన్నిక ఈనాటి అభిరుచులకు సరిపడదు. ‘యు లలీ’ అన్న పేరైతే శ్రుతి సుభగంగానే వుందిగాని లిగెయ్యా (Ligeia), పోర్ఫిరోజీన్ (Porphyrogene) అనేవి గుత్తగా పెట్టుకొన్న మందుల పేరుల్లా వున్నాయి.) ‘Lenore’ అనే ఖండిక ప్రారంభంలోని పంక్తులు Eulalie పంక్తులలాగే బాగు లేవు:

Ah, broken is the golden bowl! the spirit flown for ever!
Let the bill toll!-a saintly soul floats on the stygian river;
And, guy de vere, hast thou no tear?—weep now or never more
See, on you dread and rigid bier low lives thy love Lenore!

ఇలాంటి శబ్దచిత్రం గల పద్యాల గురించి మనం కొత్త అధిక ప్రసంగం చెయ్యదల్చుకుంటే ముందుగానే ఆ పోలికలను పసి కట్టవచ్చు.

Far down within the dim west
When the good and the bad and the worst
and the best
Have gone to their eternal rest-

ఈ పంక్తుల్లో సూయజ్ గురించి సూచన లేదూ? అలాగే 'Al Aaraf' నుండి—

What guilty spirit, in what shrubbery dim,
Heard not the stirring summons of that
hymn?

అనే పంక్తుల్లో జాన్ బెట్జిమన్ గురించి సూచన లేదూ? అయితే పాపం యీ విధంగా పోను విమర్శించడం అన్యాయం. బాగు లేనిపద్యాల్లో గూడ కొన్ని మంచి లక్షణాలు లేకపోలేదు. 'For Annie' అనే ఖండికలో

Its old agitations
Of myrtles and roses

ఉన్నాయి "The city in the Sea" అనే కావ్యం చదువుతూ వుంటే ఏదో దారుణమైన భయం మనలను వెన్నాడుతున్నట్లు వుంటుంది:

Resignedy beneath the sky
The melancholy waters lie.
So blend the turrets and shadows there
That all seems pendulows in air,
While from a proud tower in the town
Death looks gigantically down.

[ఆకాశంక్రింద అతిసహానంతో నీళ్ళు జాలిగా పడిగాపులు పడుతున్నాయి. గోపురాలూ నీడలూ కలిసిపోతున్నాయి. గాలిలో ఏమిటో

అన్నీ యిటూ అటూ ఊగిసలాడుతున్నట్టు వున్నాయి. ఒక మహోన్నత వప్రంనుండి పురంవేపు మృత్యువు చూస్తోంది రాకాసిచూపు].

సరి, 'The Bells', 'The Raven', 'Politian' అనే ఖండికలను ఏ కోశానా మెచ్చుకోలేకపోయినట్లయితే మరికొన్ని ఖండికలున్నాయి అతిమాత్రమనోజ్ఞములైనవి. "Sonnet-to Science"లో ఇంద్రజాలవిద్య అంతరించిపోతోందని విచారిస్తాడు పో.

Hast thou not torn the Naiad from her flood,
The Elpin from the green grass, and from me
The summer dream beneath the tamarind
tree?

[నయ్యాడ్ నదిని వఱదనుండి, పిశాచాన్ని పచ్చికనుండి, వేసవివేళ చింతనీడలో నేను కన్న కలను నానుండి వేఱుచెయ్యలేదా నువ్వు?]

'ఎల్ఫిన్' విషయంలో ఎవరేనా అభ్యంతరం చెప్పవచ్చును కాని కవిహృదయంనుండి వినవచ్చే ఋతశ్రుతి కాదనరానిది. 'Romance' అనే ఖండికా ఇలాంటిదే. అందలి రెండవ పద్యము :

Of late, eternal condor years
So shake the very Heaven on big
With tumult as they thunder by,
I have no time for idle cares
Through gazing on the unquiet sky—

[ఈమధ్య, చిరంజీవి గండభేరుండపు కాలమానం గర్జించి భర్జించి గడబిడచేసి ఎక్కడో ఎత్తున వున్న స్వర్గాన్ని గ్రక్కదల్చుతూ వున్నది. కలగుండువడిన ఆకాశంకేసి చూస్తూ వుంటే అప్రయోజక విషయాల గురించి శ్రద్ధ తీసుకోవడానికి నాకు తీరిక లేదు].

ఈ ఖండికలోనే అస్పష్టమైన ఊహాచిత్రమూ వున్నది :

And when an hour with calmer wings
Its down upon my spirit flings...

'Alone', 'A Dream within a Dream' అనేవి చక్కని ఖండకావ్యాలు. కాని అతడెందుకొక మహారచయితగా పరిగణింపబడ్డాడో గ్రహించాలంటే మనం అతని మిగతా రచనలనుగూడ పరిశీలించాలి.

అతని ఘనతకూ, ప్రతిష్ఠకూ కావ్యాలకంటె కథ లెక్కువ గట్టి కారణాలని చెప్పవచ్చు. అయితే అతని హాస్యకథలను మినహాయించెయ్యాలి. అవి చాలామట్టుకు బాధాకరంగానూ, కొన్ని మరీ ఘోరంగానూ వుంటాయి. (ఉదా: 'The Spectacles' అనే కథలో ఒక హ్రస్వదృష్టి ప్రబుద్ధుడు తన ముత్తవ్వను చూసి మోహిస్తాడు. "The man who was used up" అనేది ఒక పసచెడిన సైనికుని అసహ్య వృత్తాంతం). పోతే, మిగతా కథలు ఉరమరికగా రెండు రకాలవి: భయానకములు, తార్కికములు. The Black Cat, The cask of Amontillado, The Fall of the House of Usher, Ligeia అనేవి మొదటి తరగతికి చెందినవి. The Gold Bug,The Purloined Letter మొదలైనవి రెండవ రకానికి చెందినవి. ఈ వేర్పాటు అంత కచ్చితమైనది కాదు. 'The Murders in the Rue Morgue' మొదలైన కొన్ని కథలలో రెండు ధోరణులూ కలిసిపోయాయి. అతని కథ లన్నిటా అతని ముద్ర ప్రత్యేకంగా కనిపిస్తుంది. అతని కథారంగా లెక్కువగా శిథిలాలయాలు, రైన్ నదియొడ్డున మినుకు మినుకు దీపాలతో కునుకులు తీసే కోట—ఇలాంటివే వింతగా, విడ్డూరంగా వుంటాయి. (అతనికి నచ్చిన గది ఎలాంటిదంటే—'The Philosophy of Furniture' అనే కథలో చెప్పినట్టు కెంపువన్నె అద్దాలు గల కిటికీరెక్క లుంటే చాలు). ఆ కథలు సాధారణంగా రాత్రి సమయాల్లోనూ, చీకటికోణాల్లోనూ జరిగిపోతాయి. నాయకులూ నాయికలు ప్రాచీన సంపన్నవంశాల వారసులుగా వుంటారు. (ఎప్పుడో గాని వాళ్ళు అమెరికనులై వుండరు). మంచి విద్యాబుద్ధులు నేర్చినవాళ్ళయివుంటారు కాని వట్టి నష్టజాతకులైపోతారు. ఇలాంటి విషయాల్లో

'గోథిక్' నవలయొక్క శృంగారపు లబ్జులను వాడుకొన్న మోహ శృంగార గ్రంథకర్తలకూ, పోకీ ఆట్టే తేడా లేదు. ఈ చమత్కారపు కథాపద్ధతి అతను కనిపెట్టిందేమీ కాదు. 'Blackwood's Magazine' లో ప్రచురింపబడిన కథలకు గల ప్రచారాన్ని గుర్తించాడు కాని వాటిని వేళాకోళం చేశాడు—"How to Write a Blackwood Article" లో:

"ఒక కథ వుంది 'Dead Alivc' అని. అబ్బో! మాగొప్పకథ!- అది చావకముందే సమాధిచేయబడిన ఒక పెద్దమనిషియొక్క కామవాంఛల రికార్డు. అందులో అభిరుచి, భయోత్పాతము, రసము, తత్త్వము, వైదుష్యము-ఓ-అన్నీ వున్నాయి. అయితే ఆ రచయిత పీనుగుపెట్టిలో పుట్టి పెరిగినవా డని ప్రమాణం చేసిచెప్పవచ్చు."

ఈ వక్కాణ మందిమధ్యనుంచి పోయొక్క వైశిష్ట్యాన్ని,అంటే అతని బుద్ధి వైభవాన్నీ, ఆత్మజ్ఞతనూ సూచిస్తుంది. బాడిలెయిర్ అన్నట్లు అతని కథల్లో బుద్ధిలో వేర్లు తన్ని దానిపై కళాసదృశకర్కశతర్కంతో పెత్తనం చలాయించేఅసంగతత్వం కనిపిస్తుంది. అప్పుడప్పు డది మితిమీరి వికారపు వాలకాలు వేస్తూవుంటుంది. 1 ఉద్దేశపూర్వకంగానే ఆ వాలకాలు వేయిస్తాడు పో. ఇక్కడ మనకు పోయొక్క జీవితధోరణే స్ఫురిస్తుంది. 1848 లో ఒక ఉత్తరంలో ఎవరో అతనిని చూడవచ్చిన క్రైస్తవపురోహితులు "పిచ్చివాడైన పోకి నమస్కరిస్తూ, నవ్వుతూ నిలబడ్డారు" అని వ్రాశాడు. ఈ పరమస్వచ్ఛ స్వభావమే అతని నవలను అద్భుతరూపకంకంటె బాగా రాణింపజేస్తుంది. అందులో ప్రసక్తము లయ్యే విపత్తులు హఠాత్సంభూతములు గావు, సహజసంభవాలు. తప్పించుకోడానికి వీల్లేనివి. (అత డొక

---

1. 'Ligeia'లో చెప్పినట్టు—జాలరులలోకి కృత్రిమంగా వాయుప్రసారంచేసి వాటి నలా కదులుతూవుండేటట్లు చేస్తారట! నాటకశాలకు సంబంధించిన ఇలాంటి ఉపాయాలు Nathan B. Fagin, The histrionic Mr. Poe (Baltimore, 1949) లో చర్చించబడ్డాయి.

చోట ఇలా అంటాడు: "మిగతా ఆకాశంఅంతా అలా నీలంగా వుండి పోగా, నేను చూస్తూవుండగా రాకాసిరూపు గైకొన్న మేఘం" అంటాడు. అదనిదృష్టిలో ఆపద అలాంటిదే).

బాడిలెయిర్ అన్న మాటలు కొన్ని మనం పోకి అన్వయించ వచ్చును:

Je Suis les membres et la roue
Et la victime et le bourreau.
Je Suis de mon coeur le vampire...

పో వ్రాసిన కథల్లో నాయకుడు తనను తానే నాశనం చేసుకుంటాడు. అయితే అది అంతతో పోయేది కాదు. (రాచపీనుగు తోడు లేకుండా పోదన్న సామెతగా) మరికొందరితో, ముఖ్యంగా నాయికతో ముడిపడి వుంటుంది. "The Philosophy of Composition" అనే వ్యాసంలో తన 'The Raven' కావ్య నిర్మాణస్వరూపాన్ని వ్యాకరిస్తూ దానిని తా నొక సూత్రానికి తగినట్లు రచించానని సూచిస్తాడు. అందులోనుంచి తఱచుగా ఉదాహరింపబడే విషయం చూడండి:

"నే నొకసారి ఓ ప్రశ్న వేసుకున్నాను—'విశ్వజనీనమైన మానవ స్వభావ భావనను బట్టి విషాదకరములైన విషయాలన్నింటిలోను ఏది అత్యంతము విషాదవ్యంజకమైనది?" అని. "చావు',—అన్నది తేట తెల్లమైన సమాధానము. "అయితేఈ అత్యంత విషాద విషయము ఎలాంటి స్థితిలో ఉత్తమకవితావస్తువుకాగలదు?'. అని మరోప్రశ్న వేసుకున్నాను. నే నిది వరకు చెప్పినదాన్నిబట్టి ఇప్పుడూ సమాధానం స్పష్టమే—"ఎప్పుడైతే అది సుందరవస్తువును చుంబిస్తుందో..." అంటే, ఏమన్నమాట—ఒక సుందరీమణి మరణంకంటె ఉత్తమ కవితావస్తువు కాగలిగింది ప్రపంచంలో మరి లేదని తీర్మానము. అలాగే, అలాంటి వస్తువుకు శోకవిధురుడైన ప్రేమికుని పెదవులకంటె తగినవి మరి లేవనడంకూడ వివాదాని కతీతమైన విషయము."

ఇందులో మనం విస్తుపోవడాని కేమీ లేదు. ప్రణయము, మరణము అనేవి ప్రపంచ సాహిత్యంలో సన్నిహితంగా పయనించడం వున్నమాటే.

ఉపజ్ఞావంతుడైన హెన్రీ జేమ్సు వ్రాసిన 'The Wings of the Dove' లో ఒక సౌందర్యవతి మృతియే వస్తువు.

పోగారి మరణాలు మాత్రం అదో ప్రత్యేకమైన తరహాకి చెందినవి. చావుబ్రదుకుల మధ్య ఎవరికీ అందిపొందని స్థితి, బ్రతికివున్నవారికీ చచ్చిన వారికీ నడుమ ఒకానొక విపరీతమైన, వావివరసలు లేని పైశాచికమైన అనుబంధం—ఇవీ అతని మనసును మల్లడిగొను విషయాలు. లిగెయ్యా, ఆమె భర్త; రోడరిక్ అషర్, అతని కవల చెల్లెలు మేడెలిన్; The Oval Portrait లో చిత్రకారుడూ భార్య; బెరెనిస్, ఆమె 'కజిను'; మొరెల్లా, పేరు లేని ఆమెకూతురు-వీరిలో చనిపోయినవాళ్ళంతా (మిగిలిన ఆ రెండో వారికోసం) శుబ్ధసమాధులనుండి లేచివచ్చిన వాళ్ళే. పోగారి భార్య విషయమూ అంతే. ఒక్క 'ఎలియనోరా' అనే ఖండికలోమాత్రం చనిపోయినవారు బ్రదికివున్నవారిమీద తమ పెత్తనం వదలిపెట్టుకున్నారు. అయితే ఇక్కడా ఏదో అదృశ్యరహఃప్రపంచం (లింబో) ద్వారా కొన్ని అనుబంధాలు సాగుతూ వుండేవి. ఇదీ పోయొక్క కథాప్రపంచంలోని నైరాశ్య తత్త్వం. జీవితం త్వరత్వరగా, నిర్విచారంగా మళ్ళిపోతుంది. కాని మరణం శాంతిని తెచ్చిపెట్టలేదు. అతని కీ ప్రపంచంలో స్థిరమైనది మధురమైనదంటూ లేదు. సుందరస్త్రీపాత్రలను శవాలను వర్ణించినట్లు వర్ణించాడు; చలువరాతి మలామా చేసిన మనుషుల్లా నున్నగా, తెల్లగా, స్మారక చిహ్నాల్లా, విసువెత్తించే ఆ నాటి విద్వత్సభాశిల్పప్రతిమల్లా వుంటారు వాళ్ళు.

ఆ శిల్పాలవలె పో కథలు కొన్నిటిని చూస్తే మనం ఉపేక్ష వహించి ఊరకుంటాము. లేదా చీదరించుకొంటాము. పో తన భయానకకథల్లో కెల్లా గొప్పదనుకునే 'లిగెయ్యా' ఈనాడు చాలామంది పాఠకులకు దైన్య క్రౌర్యపామరత్వముల కలగాపులగంగా కానవస్తుంది. మిగతాకథల్లో ఒక వక్రవశీకరణశక్తి వుంది. పైశాచికప్రకృతి లేదు. దుఃఖానుభవము యొక్క

వివిధదశలు నిరూపింపబడ్డాయి. పోయొక్క భావనాశక్తి తెలివితేటలు వుండి నాడీవ్యాధిపీడితుడవుతున్న బాలుని భావనాశక్తివంటిది. పాపం, చిన్నపిల్లాడిలా ఏదో డంబం ప్రదర్శించబోతాడు. శక్తిగురించి ఏవో కలలు కంటాడు పో. కాని పిల్లవాడిలాగే రాత్రిళ్ళు దీపా లారిపోయినా, తెరలు ముడతలుపడుతున్నా భయపడతాడు. అంతేకాదు. భారీమనుషు లన్నా, బరువైన తలుపులన్నా, తాళంకప్పలన్నా భయపడిపోతాడు. ఆ కథలు భయమూ, బాధా కలిగించేవిగా వుంటాయి. అందులో హతభాగులు కొందరికి బ్రతికివుండగా గోరీకట్టేస్తాడు, కొందరిని సుడిగుండాల్లో పడేస్తాడు పో. అయినా చదువుతాము అతని కథలను. ఆ రెండో తరగతికి చెందిన వాటిని మరీ ఖుషీగా చదువుతాము. వాటిలో నిజాయితీతోటే అతడు తన తర్కం, పాండిత్యం ప్రదర్శించడంలో కొంత అహంత కూడా ప్రకటిస్తాడు. అయినా వాటి నిర్మాణశిల్పము ప్రశంసాపాత్రమైనది. ప్రతిభాసహకృతంగా అతడు సృజించిన పాత్ర Auguste Dupin సాహిత్య జగత్తులోని అపరాధపరిశోధకవిద్యాపారీణుల కోవలో ప్రథమశ్రేణికి చెందినది.

కొద్ది చిన్న కావ్యాలు, కొద్ది కథలూ—ఇవీ సాహిత్య స్రష్టగా అతని ప్రతిష్ఠకాలంబనాలు. కాని అతని స్వరూపమును పూర్తిగా కొలవాలంటే విమర్శవ్యాసాలనుగూడా తీసుకోవాలి. వాటినికాని అతని గురువైన కోలరిడ్జిరచనలతో సరిపోల్చడమంటే విమర్శకుడుగా పోగారి పొలిమేరలను కనుక్కోవడమే. అతడు చాలా తీవ్రవాది. ప్రతీకార స్వభావుడు. అనేకసాహిత్యకలహాలలో మునిగితేలినవాడు. అక్రమ నిమిత్తాలతో నిందించనూగలడు, శ్లాఘించనూ గలడు. గ్రంథచౌర్యాన్ని ఇట్టే పసికట్టేస్తాడు. భూతవైద్యుడిలా శివమెత్తిపోతాడు. భాషానియమం గురించి అతని పట్టుపంతాలు వట్టిబీరాలే. ఆ విషయంలో, అదే పైవాళ్ళనైతే వట్టినే ఆక్షేపిస్తాడుగాని, తాను కొంత విశృంఖలంగానే ప్రవర్తించాడు. అతని సిద్ధాంతాలన్నీ నికరమైనవి కావు. అనేకపృచ్ఛల కవకాశ మిస్తాయి.

'యురేకా' లో వాటి కాయన చేసిన తత్త్వరూపారోపణముకూడ సామాన్యమైనది. అయినా కీలకాన్ని గ్రహించగల విమర్శకు డవును. (ఉదాహరణకు—మెకాలేగురించి వ్రాస్తూ: "అతడు చెప్పదలచుకున్న దేదో స్పష్టంగా అర్థంచేసుకోగలంకాబట్టి అతను చెప్పినదానిని ఆమోదిస్తాము").

అన్నిటినీ మించి, ఆయన తన విమర్శనమును గంభీరమైనదానిగా భావిస్తాడు. అత్యాశతో దాని కో మహోన్నతమైన స్థానం ఇచ్చుకుంటాడు. అతని మాట లెల్లప్పుడూ ఒకేరీతిగా లేకపోయినా, తాను వ్రాయబూనినదానికల్లా సిద్ధాంత ప్రతిపాదన చేస్తాడు. అయితే అవి ఇతరుల కుపకరించవచ్చు. కవిత్వ మొక సౌందర్య సాధన కావాలి. కాని అవి ఖచ్చితమైన సాంకేతిక ప్రమాణాలకు లొంగివుండాలి. కథలలాగే కావ్యాలుగూడ బాగా చిన్నవిగా వుంటేనే ఔత్సుక్యం కలిగించి చరితార్థము లవుతాయి. పోగారి విధానంలో ఇతిహాసానికీ, మూడంతస్తుల మేడలాంటి పెద్ద నవలకూ తావు లేదు. చరిత్రగతి సంగ్రహము, సారభూతము, విషయప్రధానము అయిన రచనలవంక మొగ్గు చూపుతూ వున్నదనే ఆయన దృక్పథం బహుశా పత్రికలకు వ్రాసే తన అభ్యాసయుక్తిమీద ఆధారపడినదే అయివుంటుంది. కాని ఆయన జోస్యానికి విరుద్ధంగా పందొమ్మిదో శతాబ్దిలో బొంతల్లాంటి నవలలు పుట్టేయి. జనం విరగబడి చదివి సంతోషించారు. పో గురించి అమెరికాకు సంబంధించినంతమట్టుకు అసలువిషయ మేమంటే—ఆయనకు కొన్ని ఆశయాలూ, ప్రమాణాలూ వున్నాయి. అమెరికన్ సాహిత్య రంగంలో రచన నొక మంచి వృత్తిగా స్వీకరించవచ్చునని నిరూపించాడు. అప్పుడప్పుడు తన విమర్శఖండపరశువుకు కొందరమాయికులను బలిచేసినా అది దేశీయరచయితల పట్ల మంచికే అయింది. సాహిత్య మంటే అదేదో మదుపులేని వ్యాపారం కాదు, అసిధారావ్రతంవంటిది సుమా అనే ఒక హెచ్చరికలా పనిచేసింది.

అయితే ఇంకా మన మతని వైశిష్ట్యాన్ని పూర్తిగా గ్రహించనట్టే. ఆ 'ఎడ్గార్‌పో' సంగతి గ్రహిస్తేకాని అది అంతుపట్టదు. బాడిలెయిర్, మల్లార్మె ఆ పేరంటే ఎంత మమకారం చూపిస్తారో, అంత అభిమానంతో పోరచనల కనువాదాలు చేశారు. ఆ 'ఎడ్గార్‌పో'ను వాళ్ళు కనిపెట్టేరన్నా అనవచ్చు. వాళ్ళ అనువాదపాఠాల్లో ఇత్తడిని బంగారం చేసిపెట్టేరు. అచ్చుకట్టు-బుచ్చుకట్టు మాటలనుండి శుద్ధమైన కవిత్వాన్ని రాబట్టేరు. ఒక కొంటె పత్రికారచయితను అనాగరకమైన అమెరికాదేశంలో ఏకాకి అయిపోయిన ఒక అభాగ్యయువకప్రభువుగా నిరూపించేరు. వాళ్ళను కున్న ఈ 'ఎడ్గార్‌పో' స్వరూపం మన మెరిగిన ఎడ్గార్ అల్లన్‌పోకి పూర్తిగా సరిపడదని ఒప్పుకోవాలి. అయితే అతడు తన స్వరూపం ప్రపంచానికెలా కనిపించాలనుకున్నాడో ఆ పోకీ, తనను తరువాతి తరం సాంకేతికరచయితలతోగాక మందుతరంగోథిక్‌రచయితల కోవకు జమకట్టే తన రచనలో కొన్ని యథార్థసందర్భాలలో తన స్వరూపం ఎలా భాసించాలని కోరుకున్నాడో ఆ పోకీ సరిపడుతుంది. అతని సమకాలికులైన ఆంగ్లకవులూ, అమెరికన్ (ముఖ్యంగా బోస్టను) కవులూ ధర్మోపదేశం చెయ్యాలని అంటే, ఈయన కావ్యం కావ్యంకోసమే వ్రాయాలని వాదించాడు. "నా విషయంలో కవిత్వం ఒక ప్రయోజనభాజనమైన ఉద్దేశం కాదు; ఉద్రేకం" అంటాడు. ఊహాకు బుద్ధిబలం తోడైనది. పోయొక్క కల్పనాప్రపంచంలోని అతిచారాలకు, అసభ్యాశలకు అట్టడుగున సూక్ష్మములైన, ఇప్పటిదాకా వ్యాకరింపబడని పోలికలూ, నిర్బంధాలూ వున్నట్టు సూచన లున్నాయి. ఈనాటికి మనం సాహిత్యంలో ఒక ఇంద్రియబోధను మరొక ఇంద్రియబోధతో సరిపెట్టుకోవటానికీ, మానవుడి ప్రవర్తన తఱచు క్రూరంగాను, యుక్తిదూరంగాను ఉంటుందని తెలుసుకోవటానికీ అలవాటు పడ్డాము. కాని అది బాడెలెయిర్ విషయంలో ఆయన పోరచన

లను చదువుతూవుంటే, ఒక ఆధ్యాత్మికరహస్యం తెలిసినంత ప్రేరణతో సంభవించిందట. ఆ పంక్తు లేమంటే:—"వర్ణదామంలోని నారింజరంగు కిరణమూ, మశకఝంకారము సుమారు తత్సదృశములైన ఇంద్రియావబోధలే నాలో కలిగిస్తున్నాయి" (Poe's Marginalia నుండి). "చేయకూడదని తెలిసివుండడంవల్ల నేగాని వేఱు కారణం లేక నీచకార్యం, లేక బుద్ధితక్కువ పని ఒక వందసార్లయినా తాను చేస్తున్నట్లు గ్రహించనివా డెవడు?" (The Black Cat). అలాంటి లోచూపుతో ఫ్రెంచివారు పోని సర్వసాహిత్యప్రపంచంలో ప్రాగ్రసరవరేణ్యులలో ఒకనిగా స్థిరపరిగణనం చేసుకున్నారు. అతని వివిధాన్వేషణలను చూచి వాటి కొక సంకేతరూపంగా అతని నారాధిస్తున్నారు. అయితే అలా చెయ్యడానికి ఆంగ్లభాషీయులకు మరికొంతకాలం పట్టింది. ఆలస్యానికి కారణం—ఖండాంతర ప్రభావాలను ప్రతిఫలింపజేసుకోవడానికి ఆంగ్లకవిత్వానికి కొంతకాలం పట్టింది—అదే కావచ్చు. Baudelaire's 'Fleurs-du Mal' ప్రకటింపబడినది 1857 లో. ఆ యేడు ఇంగ్లండులో ప్రకటితమైన ఒకేఒక ప్రముఖమైన కావ్యసంపుటి Aurora Leigh.

వాల్ట్ విట్మన్ పోయెడల కొంత అనాదరం వున్నవాడే అయినా అతని అంతరార్థాలను గ్రహించనివాడు కాడు. 1875 లో పోయొక్క సమాధికడ జరగవలసిన కర్మకాండ జరిగిపోయింది. మల్లార్మె పోగురించి ఒక గొప్ప గీతం వ్రాసిపంపేడు. విట్మన్ తన కెప్పుడో వచ్చిన ఒక కల గురించి చెప్పేడు:

"కలలో న్యూయార్కు రేవులోగాని, లాంగ్ ఐలండ్ రేవులోగాని లంగరు వేసి ఒయ్యారంగా ఊగిసలాడుతూ వుండగా నేను తరచు చూసిన ఓడల్లో ఒక చక్కని చిన్నారి ఓడ, దాని బంధాలన్నీ తెగి, ఆపడానికి వీల్లేకుండా ఆ రాత్రిపూట వడగళ్ల వానలో, వలిగాడ్పుల్లో, కెరటాలమీద తేలిపోతూ వెళ్ళిపోతోంది. నాకో పరిభాగంపై సన్నగా, సళాకుగా,

నాజూకుగా ఒక అందమైన వ్యక్తి కనిపించాడు. ఆ భయోత్పాతాన్నీ, అంధకారాన్నీ, విసంధానాన్నీ, తాను బలికావడానికి సిద్ధంగా వున్న స్థితిలో చూసి సంతోషిస్తున్నవాడిలా వున్నాడు. ఆ వ్యక్తిని ఎడ్గార్ పో గాను, ఆ స్థితిని అతని తత్త్వం, అదృష్టం, కావ్యాలుగాను ఊహించుకోవచ్చు..." ఆ కల Rimbaud's Le Bateau ivre' ను (పోనుండి గ్రహింపబడినదే) జ్ఞప్తికి తెస్తుంది. పో, ఎడ్గార్ పో అన్నవి ఒక శబ్దము—దాని ప్రతిధ్వని. నిజానికి రెంటికీ భేదం లేదు. కొందరు అతడి రచనలను చదవడంలోకంటే అతనిగురించి చదవడంలో మజా వుందనుకోవచ్చు. అతని రచనల నస లనుభవింపలేకపోవచ్చు. అంతమాత్రాన వాటిని ఉపేక్షించడం జరగదు. అవి మనలో కలిసిపోయాయి, మనం అతనివాళ్ళము అనే ఈ అభిప్రాయంతోనే Allen Tate అనే మరో అమెరికన్ కవి అతనిగురించి "Our Cousin, Mr. Poe"1 ('మా-మన-బాంధవుడు పో') అంటాడు.

1. The Forlorn Demon (Chicago, 1953)లో పునర్ముద్రితమైన ఒక వ్యాసంనుండి.

# 4

# న్యూ ఇంగ్లండు రోజులు

—:o:—

## ఎమర్సన్, థోరో, హాథార్న్

**రాల్ఫ వాల్డో ఎమర్సన్ (1803-82):**

అభిజనం: బోస్టన్. తండ్రితాతలు క్రైస్తవాచార్యులు.

విద్యాభ్యాసం బోస్టన్ లాటిన్ స్కూలులోను, హార్వర్డులోను. 1829 లో బోస్టను సెకండ్ చర్చికి గురువైనాడు. ఎల్లెన్ టక్కర్‌తో వివాహం. ఆమె మరణం 1831. 1832 లో ఆచర్చి ఉద్యోగానికి రాజీనామా. యూరపుకి మొదటిసారిగా పయనం (మరి రెండుసార్లు యూరపుకి: 1847, 1872). తిరిగివచ్చాక మసాచుసెట్స్‌లో కంకార్డు కడ స్థిరనివాసం. 1835 లో లిడియాజాక్సన్‌తో వివాహం. రచన, ఉపన్యాసం, వ్యాసంగం ప్రారంభించి క్రమంగా పేరు సంపాదించాడు. బోస్టనులో తరచు వుంటూవున్నా,

ఉపన్యాసాలకోసం ప్రయాణాలు చేస్తూవున్నా కంకార్డు నివాసమే కొనసాగించాడు. కంకార్డులో తన వంతు పౌర విధులూ, బాధ్యతలూ నెరవేరుస్తూవున్నా సంఘానికి వీలైనంత దూరంగా వుండేవాడు.1850ప్రాంతంలో దాస్యవృత్తి నిర్మూలనోద్యమం (Abolitionism) లో తీవ్రమైన ఆసక్తి ప్రదర్శించాడు. కృతులు:Nature (1836); 'American Scholar'-హార్వర్డు ఉపన్యాసము (1837); Divinity School ఉపన్యాసం, హార్వర్డు (1838); Essays (two series, 1841, 1844); Poems (1847); Representative Men (1850); English Traits (1856); The Conduct of Life (1860); May Day (పద్యకావ్యం, 1867;)Society and Solitude(1870);Letters and Social Aims (1876).

హెన్రీ డేవిడ్ థోరో (1817-62):

అభిజనం : కంకార్డు (మసాచుసెట్స్). తండ్రి ఒక స్టోరుకీపరు. ఆ వృత్తిలో రాణించలేక పెన్సిలు తయారీలో దిగేడు. విద్యాభ్యాసం హార్వర్డులో. అక్కడ విశిష్టుడు కాలేకపోయినా బాగా చదువుకున్నాడు. పట్టభద్రుడై, ఉపాధ్యాయవృత్తితో కొద్దిరోజులు కుస్తీపట్టేడు. ఎమర్సన్‌తో స్నేహం చేశాడు. 1841-3 లో అతని యింట్లోనే నివాసం. ఎమర్సన్‌గారి 'నెవ్యూ'కి 'ట్యూటర్'గా స్టేటిన్ ఐలండ్‌లో కొద్దిమాసాలు గడిపేడు. న్యూయార్కు రచయితలతోనూ, పత్రికాసంపాదకులతోనూ పరిచయాలు చేసుకున్నాడు. ఒకటి రెండు సమీక్షలేవో వ్రాశాడు

కాని ఆ వృత్తి అతని కేమంత హాయిగా లేదు. (వాళ్ళేదో 'Ladies Companion' కి, రుడ్డు దొరుకుతుంది, వ్రాయమన్నారు. తా నలాంటి దేమీ వ్రాయలేనన్నా డీయన.) అవివాహితుడుగా తన శేషజీవితమంతా కంకార్డు సమీపంలో గడిపేడు. 'వాల్డెన్' కొలనుదరి ఒక పర్ణశాల నిర్మించుకుని (1845-47), అక్కడే ఏకాంతంగా చదువు కుంటూ వ్రాసుకుంటూ నివసించాడు. మళ్ళా కంకార్డుకి వచ్చి తనకాలాన్ని విభాగించుకొని వ్రాత, ఉపన్యాసాలు, విహారం మొదలైనవి చేసుకుంటూ వుండేవాడు. 1849 లో A Week on the Concord and Merrimack Rivers, Civil Disobedience (Resistance to Civil Government అని దీని మొదటి శీర్షిక) అనే వ్యాసాలను ప్రకటించాడు. మరేవో చిల్లరమల్లర వ్యాసాలూ, పద్యాలూ ప్రకటించాడు. అసలు ప్రధాన మైన కృతి Walden (1854).

## నథేనియల్ హాథార్న్ (1804-64):

అభిజనం: సేలమ్ (మసాచుసెట్స్). తండ్రి నౌకాధి కారి (1808 లో చనిపోయాడు). విద్యాభ్యాసం బౌడో యిన్ కాలేజ్, మెయిన్. అక్కడ లాంగ్ ఫెలోతోను, ఫ్రాంక్లిన్ పీర్స్ (కొంతకాలానికి U. S. అధ్యక్షుడైన వాడు) తోను పరిచయం. పట్టభద్రుడై సేలంలో ఏకాంత వాసం చేస్తూ ఒక నవల (Fanshawe, గ్రంథకర్త పేరు లేకుండ 1828 లో ప్రకటితము), కొన్ని కథానికలు, గల్పి కలూ (సమీకరింపబడి Twice-told Tales అను పేర 1837, 1842 లో ప్రకటితము) వ్రాశాడు. 1836 లో సేలం

విడిచి, బోస్టనుకి వచ్చాడు. చిల్లర రచనలు చేశాడు. బోస్టను రేవుసుంకాల కార్యాలయంలో పని చేశాడు. 1841 లో బ్రూక్ ఫార్మ్ కమ్యూనిటీలో చేరాడు. 1842 లో సోఫియా పీబడీని వివాహం చేసుకున్నాడు. (ఆమె ఎమర్సన్‌గారి Transcendentalism, అంటే అనుభవాతీత విజ్ఞానవాదంలో కొంత విశ్వాసం గలది.) కంకార్డులో ఓల్డ్ మేన్స్‌కి వెళ్ళి కాపురం పెట్టేడు. మళ్ళా ఏవో కథలూ గల్పికలూ వ్రాశాడు—Mosses from an Old Manse (1846). మళ్ళా సేలంలో పోర్టు సర్వేయరుగా పనిచేశాడు 1846-9 లో. తరుపరి బెర్క్‌షైర్స్‌లో నివాసం. అక్కడ హెర్మన్ మెల్విల్‌తో స్నేహం. 1853-7 లో లివర్పూల్‌లో అమెరికన్ ప్రభుత్వ ప్రతినిధి. పిదప కొన్నాళ్ళు ఇటలీలో. 1860 లో కంకార్డుకి పునరాగమనం. రచయితగా మొదట అతని ప్రతిష్ఠ కెత్తిన పతాక The Scarlet Letter (1850) అనే నవల. తరుపరి నవలలు: The House of the Seven Gables (1851), The Blithedale Romance (18 2), The Marble Fawn (1860). తక్కిన కృతులు: The Snow Image (కథలు, 1851), Tanglewood Tales etc., (పిల్లల పుస్తకాలు), Our Old Home (ఇంగ్లండు గురించి వ్యాసాలు, 1863) మొదలైనవి.

న్యూ ఇంగ్లండంటే ఇర్వింగుకుగాని, కూపర్‌కిగాని, పోకిగాని కిట్టదు. ఇర్వింగు తన న్యూయార్కు-చరిత్రలో దాని నొక పుండా కోరుయాంకీ వ్యాపారుల దేశంగా చిత్రించాడు. (వాళ్ళ పేర్లు 'Preserved Fish-' ఇలా వుంటాయని వెటకారంకూడా చేశాడు.) కూపర్

ఆ ప్రదేశపు భయావహప్రకృతినీ, అక్కడి మనుష్యుల ధార్మికమ్మన్యత్వాన్నీ గర్హించాడు. పో, అంతకంటే జన్మభూమి అంటే అభిమానం తక్కువైనవాడు మరి వుండబోడు, అతని అభిప్రాయాలు చెప్పనక్కరలేదు; బోస్టన్‌ను (అతని జన్మభూమి) 'కప్పల చెరువు' అన్నాడు. ఈ కప్పల చెరువే **North American Review** కి ఉనికిపట్టు. 1815 లో ప్రారంభింపబడినప్పటినుండి క్రమంగా పలుకుబడి, యోగ్యత సంపాదించుకొని దేశంలో చాలా సంచలనం కలిగించింది. పోగారి అభిప్రాయంలో ఈ పత్రికే న్యూ ఇంగ్లండులో రచయితలను పరస్పరస్తుతిపాఠక సంఘప్రవృత్తికి ప్రోత్సాహపరిచింది. జె.ఆర్. లోవెల్ వ్రాసిన **'Fable for Critcis'** ను సమీక్షిస్తూ పో రణాయించి యిలా అనేశాడు:

"దాక్షిణాత్యసాహిత్య మంటూ ఒకటి లేదనే విశ్వాసాన్ని కలిగించాలనుకోవడం లోవెల్ కూటంవారి కొక ఫేషనై పోయింది. ఔత్తరాహులను డజనుమందిని పేర్కొన్నాడు. (దాక్షిణాత్యులలో) అంత ప్రసిద్ధులూ అయిన లెగారే, సిమ్స్, లాంగ్ స్ట్రీట్ మొదలైనవా రుండగా వారి ఊసెత్తేడు కాడు. పోనీ, దక్షిణదేశంలో, కనీసం న్యూయార్కు దాకానైనా తన దుర్బలసత్యసంధతను మోసుకువెళ్ళలేకపోయాడు మిస్టర్ ఎల్. అతని ప్రశంసకు పాత్రులైన వాళ్ళంతా బోస్టోనియన్సు. మిగతావాళ్ళు బార్బేరియన్సు..."

ప్రాంతీయాభిమానంమాట అలా వుండగా, ఈ 'కప్పలచెరువు' సరుకును నిరసించడానికి పోకి తగిన కారణాలు వున్నాయి. రచయిత అన్నవా డొక కళాకారుడు; ధర్మోపదేశకుడు కాడు అని ఉద్ఘాటించాడు పో. అయితే బోస్టనులోను, న్యూఇంగ్లండులోపలి దేశంలోను సాహిత్యమంతా నైతికప్రవచనాలతో నిండిపోయివుంది. అతడు మామూలుగా అభినందించే లాంగ్ ఫెలోసాహిత్యంకూడా ఆ బాపతుకు చెందిందే. పోచేత 'అనుభవాతీతవిజ్ఞానవాదులు' (**Transcendentalists**) గా పరిగణింప

బడిన ఎమెర్సన్ ప్రభృతులవిషయం తీసుకుంటే వాళ్ళంతా పో అభిప్రాయాలన్నిటికీ విరుద్ధంగా వర్తించినవాళ్ళే. కవిత్వతత్వంగురించి ఆ యిద్దరికీ వున్న అభిప్రాయాలను తైపారువేసి చూస్తే తెలుస్తుంది. 1838 లో ఎమర్సన్ తన పుస్తకంలో ఇలా వ్రాసుకున్నాడు: "ఆదినుంచీ ప్రపంచంలో ఉత్తమ కవిత్వ మన్నది ధర్మప్రవణమైనదిగా వుంటూవచ్చింది. అలాంటిదాన్ని ఉత్పత్తిచేసే ధోరణిలోనే వుంది పరిపక్వమైన ఆధునికభావన". పో వ్రాసిన **'Philosophy of Composition'** తో ఎమర్సన్ కవులకుచేసిన హితోపదేశాన్ని సరిపోల్చి చూసినా తెలుస్తుంది. కవు లెప్పుడూ శబ్దాడంబరాలతో తమ బుర్రలు బరువెక్కించుకోకూడ దని ఎమర్సను హితవు **(Merlin)**. "మర్మకవిత్వంకోసమే మర్మకవిత్వ మనే తగుమనుషుల కోవకు చెందినవాడు ఎమర్సన్; అలాంటివాళ్ళను మనం భరించలేం" అంటాడు పో, తన **Chapter on Autography** లో. మరోచోట 'అనుభవాతీతవిజ్ఞానవాదధోరణి'ని ఎలా అనుకరించడమో వెటకారంగా సలహా ఇస్తాడు పో:

"పరిస్థితుల యొక్క అంతరస్వభావం లోనికి మరి యెవడూ చూడలేనంత దూరం చూడగలగడంలోనే వుంది నేర్పు. ఈ రెండో దృష్టి వుందే, సక్రమంగా ప్రవర్తింపజేస్తే మంచి శక్తిమంతంగా వుంటుంది. ఊర్ధ్వ విషయాల ఏకత్వంగురించి ఏమైనా చెప్పుగాని అధోలోకద్వైవిధ్యంగురించి అక్షరంముక్క పైకనకు. వక్రోక్తులు నేర్చుకో. ప్రతీదీ సూచించు. ఏదీ నొక్కిచెప్పకు."

పో చెప్పిన యీ మాటలు న్యూఇంగ్లండురచయితలకు తగిన పరిచయవాక్యాల్లా వున్నాయి. ప్రత్యేకమైన బోస్టనుధోరణి ఒకటి వున్నదని సరిగా పోల్చుకున్నా డతడు. న్యూఇంగ్లండుచరిత్ర నిజాయితీవేపు ఒక మలుపు తిరిగింది. ప్యూరిటన్ అతివాదదృష్టి అంతరించిపోయింది. బోస్టన్ పరిసరాల్లోనే 'పతితులైన క్రైస్తవుల పాలిటి కొంగ హంసతూలికా

తల్పము' వంటిదైన ఏకేశ్వరవాదము (**Unitarianism**) నకు కొంత ప్రాబల్య మేర్పడింది. ధనికవర్తకులకూ, ఓడల యజమానులకూ తమ కత్తిదారుల మతోత్సాహంతోకన్నా అయివేజుతోనే ఎక్కువ ప్రమేయంగా వుంది. అయితే ఇంకా భిన్నమతోపదేశాల వాతావరణం కొంత పదునుగానే వుంది. న్యూఇంగ్లండు సంస్కృతి ఇంకా మతమూలకంగానే వుంది. అక్కడి పండితులు, దేవుడిని దేవుడనేకంటె 'ప్రకృతి' అని వ్యవహరిస్తే బాగుంటుం దనుకొంటున్నా, హాథార్న్‌లాగ ఏ చర్చికీ చెందనివారైనా, ఒక విధంగా దేవుడి మనుషుల్లాగే వ్యవహరిస్తున్నారు. **Transcendentalism** ను ఆ ఉద్యమానికి సంబంధించిన తన సంహిత 1 లో పెర్రీ మిల్లర్ అన్నట్లు అన్యూనాతిరిక్తంగా నిర్వచించాలంటే 'మతవిషయక నిదర్శన ప్రదర్శనము' అనవచ్చు. మతవిషయాసక్తి ఆనాడు న్యూఇంగ్లండుకే పరిమితమైనది కాదు. 19 వ శతాబ్దిలో పాశ్చాత్యప్రపంచమంతటా మత విషయకాలైన అభిప్రాయ భేదాలు బయల్దేరాయి. చాదస్తానికీ, భౌతికదృష్టికీ మధ్య సంఘర్షణ, సంతృప్తి కలిగించని విషయాంతరాలతో వైయక్తికశంకలు, వాదాలు నిలబెట్టుకోడానికి వెనకనుండి మద్దత్తులు— ఇవన్నీ యూరపులో ఎప్పటికంటె మిక్కిలి మెలకువతో, తేకువతో రంగంమీదికి వచ్చాయి. న్యూఇంగ్లండులోమాత్రం అది మతప్రతిపత్తి గలవారిలో విశ్వాసవికాసానికేగాని, వినాశానికి కాదు. అమెరికన్ అనుభవానికి తగినట్టు అది ఒక సీమలగురించిన అన్వేషణ. అభివృద్ధితోపాటు అవకతవకస్థితి కగ్గమైన అమెరికా ఒక ఉచితోద్దేశతీరం చేరుకోడాని కొక ప్రయత్నమది.

19 వ శతాబ్దిమధ్యకాలానికి బోస్టను, ఆలివర్ వెండెల్ హోమ్స్ ఉల్లాసంగా అన్నట్లు ప్రపంచాని కంతటికీ ఇరుసువంటిది కాకపోతే

---

**1. The Transcendentalists (Cambridge, Mass. 1950), 8.**

కాకపోవచ్చునుగాని, సంయుక్తరాష్ట్రాల సాంస్కృతిక కేంద్రస్థానం మాత్రం అయింది. మిగతా నగరాలు న్యూయార్కు, న్యూఆర్లియన్సు, ఫిలడెల్ఫియా మొదలైనవి బోస్టనుకంటె పెద్ద నగరాలు. ఛార్లెస్టన్ మొదలైన నగరాల్లో సంఘం ఆకర్షణీయమైన రూపాలు తాల్చింది. కాని ప్రక్కన వున్న హార్వర్డు (విశ్వవిద్యాలయస్థానం) అండతో, తన ఓడలు తెచ్చి పడేసిన సిరిసంపదలతో బోస్టను నగరమే ముందంజవేసి మిగతా నగరాలకు మార్గదర్శక మైనది. అక్కడి 'ప్రయివేటు' రాబడి 'పబ్లికు' అవసరాలకు పనికివచ్చింది. క్లబ్బు, గ్రంథాలయము, పత్రిక, ప్రచురణాలయము అన్నీ కలిసి పనిచేశాయి. అయితే ఏదో ఇంకా గొప్ప లోటు మిగిలేవుంది. హెన్రీ జేమ్సు తాను వ్రాసిన హాథార్న్ జీవితచరిత్రలో బోస్టను చావడుల నావరించివున్న సాంస్కృతిక దారిద్ర్యంగురించి చెప్పేడు.

ఇక ఇక్కడ బోస్టోనియన్సు అనిపించుకోని న్యూఇంగ్లండువారి గురించి చెప్పవలసివున్నది. వాళ్ళు కొందరు పట్నవాసపు ప్రభావాల నటకాయించారు కాని ఆ సౌకర్యాలనుమాత్రం తమ పల్లెటూరి ఇళ్ళలోనే పొందుతూవచ్చారు. 1852 లో న్యూహేంప్‌షైరులో ఎక్కచ్చిగా వున్న ఒక దీవిలోని ఒకరి యింటికి వెళ్ళిన హాథార్న్ అక్కడ చావడిలో బల్లమీద రస్కిన్ వ్రాసిన **Pre-Raphaelitism** ప్రతిఒకటి చూశాడు (అది ఇంగ్లండులో ప్రకటితమైన దా ముందటియేడే). ఆప్రక్కనే ఏదో చిన్న తత్త్వగ్రంథం వుంది. న్యూఇంగ్లండులో చాలా యిళ్ళలో అదే వరస. అప్పుడే డివినిటీస్కూలునుండి దిగబడిన హార్వర్డుయువపట్టభద్రుడు తన పుస్తకాలతో, ఉద్దేశాలతో ప్రశాంతంగా వున్న ఒక చిన్న శ్వేతజాతి పట్టణానికి పోయి అక్కడ ఒక పీఠం వేసుకొని ఉపదేశాలు మొదలుపెట్టేవాడు. అతని ముందుతరాలవారేగాని దిగివస్తే వాటిని తూర్పారబడతారు. అతని కోరచయిత కావాలని వుంటే ఆర్థికమైన ఇబ్బందు లంతగా అతనికడ్డురావు. బోస్టను పరిసరప్రాంతంగాని, మరే న్యూఇంగ్లండు రేవుప్రాంతంగాని అప్పటికింకా నిరాడంబరమైన గ్రామీణవాతావరణమే కలిగివుండేది.

రచయిత కాదలుచుకున్నవా డెవడూ దేనికోసమూ ఆధారపడటానికి లాభం లేదు. ఎమర్సన్, థోరో, హాథార్న్ చేసుకున్నట్లు తన భుక్తికి తానే పండించుకోవాలి. అప్పుడప్పుడు పుస్తకాలు తెచ్చుకోవడానికో, పత్రికాసంపాదకుడిని కలుసుకోవడానికో బోస్టనుకి వెళ్తూవుండాలి. ఎప్పుడేనా ఒక రచన ప్రచురింపబడో, ఒక ఉపన్యాసాని కవకాశం వచ్చో నాలుగు పైసాలు చేతికి రావచ్చు. ఇదివరకటి లాగే అతని పేరు ప్రజల దృష్టికి రావచ్చు.

ఇదిగో ఇలాంటి ప్రబుద్ధుల ప్రపంచంలోనుంచి, అన్యోన్యత ప్రబలిపోయిన సమాజంలోనుంచి బోస్టనులోగిట్లో ఆవిర్భవించింది 'అనుభవాతీత విజ్ఞానవాదం' (**Transcendentalism**). అదేమంత నిక్కచ్చిదైన మాట కాదు. ఆ నాటి పెద్దలలో ఎవరికీ దానిని తగిలించలేము. ఒక అభిప్రాయ మున్నది: మన మొక సిద్ధాంతాన్ని రూపొందిస్తే అది కొన్ని అభిప్రాయాలను స్థాపించడానికీ, సాహిత్యంలో, ఆధ్యాత్మికతత్త్వంలో, మత వ్యవస్థలో ఒక ఉద్యమాన్ని ప్రారంభించడానికీ చేసిన ప్రయత్నము అని. ఈ అభిప్రాయమందలి అసామంజస్యాన్ని జ్ఞాపకం చేసుకుంటూ ఆనాటి అక్కడి పరిస్థితి నిలా వివరించాడు:

"ఎవరి మట్టుకు వారు అసాధారణమైన ఉల్లాసంతో చదివేవారు, వ్రాసేవారు అక్కడక్కడ ఇద్దరూ ముగ్గురూ ఆడా మగా వున్నారు. వాళ్ళే కాస్త కోల్‌రిడ్జి, వర్డ్స్ వర్త్, గెటే, ఆమీదట కార్లైలూ అంటే పట్టించుకుని సంతోషంతో, సానుభూతితో చదివేవాళ్ళు. లేకపోతే వాళ్ళ చదువు కొక గుర్తింపు వుండేది కాదు. అమెరికన్ పై మెలుగు మాత్రమే మిగిలి వుండేది. ఆ చదువులు ఏకాకి చదువులుగానే వుండేవి." సామూహికంగా ఒక తెగపేరు పెట్టిగాని, ఒక ఉద్యమం పేరు పెట్టిగాని వ్యవహరించడానికి వీల్లేని ఆ మనుషుల ఒంటరితనాన్ని గూర్చి బాగా ఒత్తి చెప్పేడు ఎమర్సన్. పోనాటినుంచి ఏకాంతత, ఏకాకిత అన్నవి అమెరికన్

రచయిత లక్షణాలుగా పరిణమించాయి. విట్‌మన్‌లాంటి నిండైన అమెరికన్ ప్రముఖులకుగూడ తమ రంగంలో కలిసి సంప్రతించుకోవడాని కొట్టే మిత్రు లుండేవారు కారట! ఒక్క బోస్టను మిత్రమండలిని మినహాయిస్తే న్యూఇంగ్లండు విషయంలో ఇది మరీ సత్యం. ఆనాటి సాహిత్య వ్యాసంగాలను గురించి, అక్కడి కొ సంచాలకు లంతా ఒక పెద్ద కుటుం బానికి చెందినవారైనట్లు వ్రాయాలంటే సులువే (చూ: **Van Wyck Books' Flowering of New England.**) ఒక విధంగా చూస్తే వాళ్ళు కొంత రలాగే వుండేవారు. ఎమర్సన్, థోరో, హాథార్న ముగ్గురూ కొంతకాలంపాటు ఒక్క ఊళ్ళోనే (కంకార్డులో) నివసించారు. వాళ్ళూ, మరికొందరు వ్యక్తులూ ఒకరి డైరీల్లోనుండి, ఉత్తరాల్లోనుండి మరొకరు తలుచు బయటపడుతూవుంటారు. అయితే వాళ్ళు ఒకరి గురించి ఒకరికి తెలిసినంతగా ఒకరి నొక రెరిగివుంటూ రనుకోవడం సరికాదు. ఒకరి నొక రనుమానిస్తూ, కొస్తకొస్త ఎగతాళి చేసుకుంటూ, తానై పట్టించుకోవడాని కిష్టపడక ఎవడి మగ్గానికి వాడే శనాపతి అన్నట్లుగా ఎడయెడంగా వ్యవహరించేవారు. "మన పరిచితులంతా ('నన్ను ముట్టకు నా మాలకాకి' అన్న సామెతగా) ఎంత ఒంటెత్తుగా వుంటారు!" అంటాడు ఎమర్సన్. అతడే, ఏ పేచీ పూచీ లేని రచయిత ఎవడంటే, ప్రజాభిప్రాయాన్ని పాటించకుండా ఏ అజ్ఞాతమిత్రునో ఉద్దేశించి వ్రాసుకు పోయేవాడు అని వక్కాణించాడు. తెలిసిన మిత్రులూ అంటే "వాళ్ళూ, నేనూ మా అల వాట్ల మధ్య చేపలలాంటి వాళ్ళం. థోరో ఆసరాగా వున్నాడు కదా అనుకుందా మంటే, త్వరలోనే నేను వెళ్ళి ఒక తవిసెచెట్టును ఆశ్రయించ వలసి వస్తుంది" అని వ్రాశుచ్చాడు. హాథార్న చనిపోయినప్పుడు విచారిస్తూ ఎమర్సను తాను చాలా కాలం అతనితో మైత్రి ఏర్పడగల దనే ఆశతో నిరీక్షించా నంటాడు.

ఆనాటి తన తోడి రచయితలు చాలామంది వట్టి అల్పసంతోష ఉన్నాడు ఎమర్సను. జర్మను రచయితల లేఖినులనుండి జాలువారి, ఇంగ్లండు

ద్వారా వడపోతలు పోసుకొని వచ్చిన పేలవమైన తత్త్వ రచనలు వారి నాకర్షించాయి. **Transcendentalism** వారికి వారి వొక మంచి ప్రపంచమనీ, అది పరిణతివేపు నిదానంగా పురోగమించగలదనీ స్ఫురింప జేసింది. "తరతరాల కాలంలో ఒకేఒక విశ్వవికస్వర మహాసంకల్పం పయనిస్తున్నది. సూర్యరథ పరిక్రమణలతోపాటు మానవ భావనా ప్రపంచం విశాల మవుతూవున్నది"—టెనిసన్. అలాగే, 19 వ శతాబ్దిలో యూరపులో ఎక్కువగా, అసలు మానవ సమాజంలోనే కొంతకు కొంత అద్భుతపరిణామం వచ్చింది. దానితోపాటే విద్య,నిగ్రహము, దాస్యవృత్తి నిర్మూలనము, స్త్రీల హక్కులు, క్రొత్తదేశాలకు వలసలు మొదలైన విషయాలతో ఆసక్తి పొడసూపింది. ఎమర్సను, థోరో, థియోడర్ పార్కర్, మార్గరెట్ ఫుల్లర్, జార్జ్ రిప్లే, ఛానింగ్ కుటుంబీకులు, విట్‌మన్ ప్రభృతులు—వీరి ఉద్యమాలలోగల అమెరికన్‌తన మేమిటంటే మానవసమాజ పురోభివృద్ధికి తమ దేశం అద్భుతమైన అవకాశాలను చూపించిందనే ప్రగాఢవిశ్వాసమే. మొర్మన్ శాఖీయులు క్రైస్తవుల స్వర్గం ఈ ఖండంమీదనే వున్న దన్నట్లుగానే, ట్రాన్సెండెంటలిస్టులు కూడ స్వతంత్రుడైన మానవునికి పూర్ణవ్యక్తిత్వం అమెరికాలో మాత్రమే సిద్ధించగల దనే నమ్మకంతో వుంటారు.

ట్రాన్సెండెంటలిజమ్‌లో కొన్ని హాస్యాస్పదాలైన విషయాలున్నాయి. వట్టి ఆవేశపరులు కొంద రున్నారు. వాళ్ళకి మనస్విత, ఆర్జవము తక్కువ. ఎమర్సన్ వ్రాశాడు—ట్రాన్సెండెంటలిస్టుల సభకు హాజరైన ఒకాయన "అదంతా ఒక్క ఊపులో స్వర్గానికి వెళ్ళిపడినట్లుగా వుంది నాకు" అన్నాడట! గోష్ఠి జరుగుతూ వుండగా ఒక వ్యాసఘట్టం దగ్గర, పాపం, సానుభూతి గలవాడే, ఒక ఇంగ్లీషాయన లేచి ఒక ప్రశ్న వేశాడట—"అయ్యా ఆల్కాటుగారూ, నాకు దగ్గర్లో వున్న ఒకామెకు సర్వశక్తిమయమైన దైవత్వం గుణరూపాదులను విడిచిపెడుతుందా అని తెలుసుకోవాలని వుంది" అని. ఆ **Amos Broson Alcott** గారి

కూతురు **Louisa May** కొందరు ట్రాన్సెండెంటల్ త్వాష్టాల గురించి ఒక వినోదరచన చేసింది. ఆల్కాటు కడ ఒక దివ్యసందేశాల సంపుటం వుండేది. అందులో 'వ్యామోహం' గురించిన ఉపదేశం తగిన ఉదాహరణ:

"ఒకసారి వ్యామోహంలో పడి తేరుకున్నవాడికంటె అసలు వ్యామోహానికే అతీతుడైనవాడు మరీ ఘనుడు. ఆ ఘనుడు పతనం పొందని స్థితినిమాత్రమే మొదట పొందగలుగుతాడు. వ్యామోహం పొందినవాడు పాపం చేసినవాడు. పవిత్రాత్ములకు వ్యామోహం కలగనే కలగదు."

అలాంటి నమ్మకంలో తడబాటుపడే ఒక విధమైన అమాయికత్వం వున్నది. **Brook Farm, Fruilands** లో ట్రాన్సెండెంటలిస్టులు కొంతకాలం నెలకొల్పిన యుటోపియన్ సంసత్తులలోను ఆలాటి అమాయికత్వం వున్నది. అయితే ఆ విషయాలన్నీ పరిశీలించడాని కిది తావు కాదు. అదంతా న్యూఇంగ్లండురంగాని కొక పూర్వరంగంగా జ్ఞప్తిలో వుంచుకుంటే మంచిది. ఎమర్సన్, థోరో, హాథార్న్—ముగ్గురూ న్యూఇంగ్లండు వారు. ట్రాన్సెండెంటలిజమ్‌తో సంబంధ మున్నవారు. మనం విధిగా తెలుసుకోదగిన సాహిత్యసత్త అధికారము గలవారు.

## రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

"గూఢ తత్త్వము గూఢతత్త్వము కోసమే" ('**Mysticism for Mysticism Sake**') అని ఏదో మాటవరసగా అన్నాడు పో. చాలామంది ఎమర్సన్‌ను ట్రాన్సెండెంటలిస్టులలో ఒక తరహాకి చెందినవాడిగా, ప్రఖ్యాత నాయకుడు కాబట్టి దుర్విదగ్ధ ప్రముఖుడిగా పరిగణించారు. పో కూడ అలాగే భావించాడు. ఎమర్సన్ తన సహచరు లందరికంటె ట్రాన్సెండెంటల్ దృక్పథాన్ని గురించి ఎక్కువ వివరంగానే చెప్పేడు. అతని ముఖ్యవిశ్వాసాలన్నీ ముందుగానే మూడుగ్రంథాల్లో సూచించాడు: అందులో **Nature** అన్న దొకటి. చిన్న పుస్తకం. పన్నెండు సంవత్సరాలలో 500 ప్రతులుమాత్రమే

చెల్లినవి. మిగతావి **'American Scholar'** అనే ఉపన్యాసము, హార్వర్డు డివినిటీస్కూలు ప్రసంగము. వీటిలో అతడు మానవుడికీ, అతని ప్రపంచానికీ మధ్య చక్కని అనురూప్యం ఏర్పడివున్నదనీ, దానికి దాఖలాలు ప్రకృతికీ అతని అనుభవానికీ సంబంధించిన ప్రతి విషయం లోనూ కనిపిస్తాయనీ ఉద్ఘాటించాడు. సహజజ్ఞాన ప్రచోదితాలైన అతని అన్వేషణలు బాగా సాగడంకోసం ప్రాచీన విశ్వాసాలూ, సంప్రదాయాలూ అన్నీ ఉపేక్షింపబడా లన్నాడు. "పుస్తకాలు పండితుల పాలిటి వట్టి కాలక్షేపాలు. నేను జీవించినంతగా నా కీసంగతి ఇంత మాత్రం తెలుసు" అనీ అన్నాడు. మానవుని ఏకైకవిధి యేమంటే తన కోసమైనా తాను సత్యనిష్ఠ గలిగివుండాలి. అతని అంతర్దర్శనంవల్లనే అతనికి విశ్వజనీనమైన సత్యస్వరూపం అంతుపడుతుంది:

"అంతరంగములోని అంతరాంతరములలోనికి చొచ్చుకు వెళ్ళగా వెళ్ళగా ఆశ్చర్యకరంగా సర్వోత్కృష్టమైన సార్వజనీనమైన, మహాసత్యం హృదయగోచరమవుతుంది. ఆనందం లభిస్తుంది. ప్రతి మానవునిలోనూవున్న సత్త్వము 'ఇది నా సంగీతము, ఇదే నేను' అని గ్రహిస్తుంది."

ఆనాడు డివినిటీస్కూల్లో ప్రతి విద్యార్థీ 'హోలీ ఘోస్టు' పాలిటి కొక ఛత్రాజులా తయారయ్యేవాడు. అందుకే ఎమర్సను వాళ్ళకు "మొదట నీ ప్రవర్తనలోని అనుగుణ్యము చూసుకో, అప్పుడు దేవుడి గురించి ప్రచారం ప్రారంభించు" అని సలహా యిచ్చాడు. అతని ఉపదేశం విన్న పెద్దలందరూ ఆశ్చర్యచకితు లయ్యారు. అస లక్కడ దేవుడి గురించి వుండిన నియమనిబంధనలు సడలిపోయాయి. స్థానమే మారి పోయింది. 'దేవుని పితృత్వము, మానవుని సోదరత్వము, బోస్టను ప్రాంతీయత్వము'- ఈ మూటిని అంగీకరిస్తే చాలు, తమ పని అయిపోయిం దనుకునే ఏకేశ్వర వాదులకుగూడ అది పాఠ్యప్రణాళికకు అతీతమైపోయిన అముఖ్యస్థానంగా

భాసించింది. ఆనాడు జీవితం వాళ్ళకు మంచి కిటుకులూ, ప్రతివాడికీ అంత యింతో లాభమూ గల ఒక నిధిగవేషణంలా కనిపించింది. ప్రముఖ ఫలములు కార్యదక్షులవీ, పరిశీలనదక్షులవీ అయినవి. వాళ్ళకు శక్తి, కార్యోత్సాహము,ప్రతిభ అన్నవి సమానార్థకము లైనవి. మాంద్యము,అనౌత్సుక్యము, భోగలాలస మొదలైన స్వభావ తీవ్రతలు, పాపాలు కావుగాని, లోపాలుగా పరిగణింపబడినవి.

ఇవే ఆనాడు యూనిటేరియన్ ఆచార్యపీఠాన్ని వదలి పెట్టిన తర్వాత ఎమర్సను చేస్తూవచ్చిన ఐహిక ధర్మోపన్యాస విషయాలూను.మన మనుగడలలో ఎన్నెన్నో చక్కని అందికలూ, పొందికలూ వున్నాయంటాడు:

"సౌందర్యము:చిన్నచిన్న విషయాల్లో తఱచు ఎంతో అందం నిబిడీకృతమై వుంటుంది. చుట్ట కాలుస్తూవుంటే మానవ శరీరంలోని ఉచ్ఛ్వాస నిశ్వాసప్రక్రియ అంతా స్పష్టంగా కనిపిస్తుంది.అది ఒక జగత్సత్యం.దానికి తగిన మరొక నిదర్శనం సముద్రంయొక్క ఆటుపోటులు." (ఎమర్సన్ జర్నల్, మార్చి, 1852) వర్డ్సువర్తుకు వలెనే ఎమర్సన్‌కి గూడ ప్రకృతి ఒక గొప్ప సాత్త్వికావేశనిక్షేపము. హాథార్న్ కంకార్డు సమీపంలో ఒక వేసవిమధ్యాహ్నం అలా వెళుతూ ఒక చెట్లతోపులో ఒకాయనను చూసి యిలా అన్నాడట:

"అడిగో! ఆయన ఎమర్సన్. కాస్సేపు హాయిగా కాలక్షేపం సాగినట్టు లున్న దాయన కిక్కడ. ఎంచాతంటే ఇవాళ అడవుల్లోకి దేవతలు దిగివచ్చారన్నాడు; గాలిలో వారి గుసగుసలు వినబడుతున్నాయన్నాడు."

అలాటి వినోదయాత్రలలోనే ఎమర్సను తన దినసరులకు(**Journal**) చాలా విషయాలు సేకరించాడు. పుస్తకాల విషయంలో పైవాళ్ళకు హెచ్చరికలు చెయ్యడమే కాకుండా ఆయన తనకు తా నిలా అనుకున్నాడు:

"హోమరు, ఐస్కిలస్, సోఫోక్లిస్, యూరిపిడిస్, అరిస్టోఫేన్సు, ప్లేటో, ప్రోక్లస్, ప్లోటినస్ జంబ్లికస్, పోర్ఫిరీ, అరిస్టాటిల్, వర్జిల్, ప్లూటార్క్, ఎపుల్యూస్ ఛాసర్, డాంటే, రేబెలెయిస్, మాంటేన్, సెర్వాంటిస్, షేక్స్పియర్, జాన్సన్, ఫోర్డ్, చాప్‌మన్, బ్యోమంటూ-ఫ్లెచెరూ, బేకన్, మార్వెల్, మోర్, మిల్టన్, మోలియర్, స్వీడెన్ బోర్గ్, గటే—వీళ్ళ రచనలు చదివి తీరాలి నువ్వు"

(ఎమర్సన్ జర్నల్, అక్టోబరు, 1842)

అవన్నీ చదివేడాయన. అవే కాదు. కోల్‌రిడ్జి, వర్డ్స్‌వర్త్, కార్లైలు, ప్రాచ్యవేదాంతుల రచనలు కూడా చదివేడు. వారిలో హోమరు, ప్లేటో, డాంటే, రేబెలెయిస్, మాంటేన్, షేక్స్పియరూ అంటే అతనికి చాలా యిష్టమైనట్టు ఆయన దినసరి నుండి మనం గ్రహించగలం. ఆయనకు దినసరి ఒక ప్రముఖమైన జీవిత వ్యవసాయము. ఏభైయేళ్ళ పైచిలుకు ఆయన ఆలోచనలకు, ఆశయములకు ఆస్పదమైనది. అంయులో ఒక క్రమాన్ని పాటించడాని కాయన ప్రయత్నించలేదు కాని ఆ సంపుటాలకు సూచికలు తయారు చేయడంలో చాలా శ్రద్ధ తీసుకున్నారు. (అందులో పది సంపుటాలు అచ్చయినవి). ఆయన చేసిన రచనలకు ముడి పదార్థమంతా అంగఃలో వుంది. దాని సంగతి ఫ్రెడరిక్ హెడ్జ్‌కి వ్రాసిన ఉత్తరంలో ఆయన ఇలా వివరించారు:

"ఒకయేడాదిపాటు నేను పోగుచేసిన విషయాలెంత చిల్లరమల్లరగా వుంటాయంటే-డిసెంబరూ ఆ ప్రాంతంలో జనం ఉపన్యాసాలకోసం విరగబడుతూ వుంటే గబగబా నా పాత పంచాంగాలన్నీ కూడదీసుకుని, ఉపన్యాసానికేదో ఒక పేరు ముసుగు తగిలించాలి గదా అని విజ్ఞాన సర్వస్వం తిరగేస్తాను. ఆ ముసుగు ముడతల్లో ఎలాంటి మారుమూల విషయాలూ, వింతలూ విడ్డూరాలూ అన్నీ యిమిడి పోతాయి. శాంత స్వభావులూ, పండితులూ అయిన పెద్దలు మొదట హర్షాన్నే వెలిబుచ్చేవారు. కాని తదుపరి ఆంగ్ల సాహిత్యం, చరిత్ర, తత్త్వము, మానవ సంస్కృతి మొదలైన విషయాల గురించి ఏవో పొడిముక్కలు పోగుచేసుకువచ్చి వాటికి

ఉపన్యాసరూపేణా జ్ఞానస్నానం చేయించిన నా సాహసానికి వాళ్ళకాగ్రహం వచ్చేది. అయితే నేమి లెండి, ఇటీవల ఎంత సిగ్గులేకుండా ప్రసంగించినా దారి విడిచిపెడుతున్నారు."

దినసరి నుండి ఉపన్యాసం ఆవిర్భవించింది; ఉపన్యాసాల పరంపర నుండి వ్యాసాల సంపుటి అవతరించింది. ఆయన పద్యకృతులు కూడా అలా ప్రాదుర్భవించినవే. ఆయన వ్యాసాల కవి నాందీశ్లోకాల వంటివి:

"రోజు లన్నవి ఎక్కడో దూరాన వున్న మన మిత్ర పక్షంవారు రహస్యంగా పంపిన మనుషుల్లా వస్తాయి, పోతాయి. మనతో మాటాడవు. అవి తెచ్చిన కానుకలు స్వీకరించామా సరేసరి, లేకపోతే చల్లగా పట్టుకు పోతాయి." (24 మే, 1847)

అనే యీ పంక్తులు ఆయన గొప్పపద్యాల్లో ఒకటైన **'Days'**గా పరిణమించింది:

**"Daughters of time, the hypocritic Days,**
**Muffled and dumb like bare foot dervishes,**
**And marching single in an endless file,**
**Bring diadems and fagots in their hands,**
**To each they offer gifts after his will,**
**Bread, Kingdoms, stars and sky that holds them all.**

**I, in my pleached garden, watched the pomp.**
**Forgot my morning wishes, hastily**
**Took a few herbs and apples, and the Day**
**Turned and departed silent. I, too late,**
**Under her solemn fillet saw the scorn."**

[కాలం కన్న కూతుళ్ళు మాయదారి రోజులు ముసుగులతో మూగనోముతో బోడికాళ్ళ జోగుల్లా అంతులేని పంక్తులు దీరి కనక కిరీటాలూ

కట్టెమోపులూ పట్టుకు వస్తాయి. కోరితే అందరికీ భుక్తిని, రాజ్యాలను, తారకలను అన్నిటినీ పట్టుకునే ఆకాశాన్నీ కానుకలిస్తాయి. నేను నా అల్లిబిల్లి తోటలో ఆ వైభవాన్ని చూశాను, నాలో ఉదయించే కోర్కెల మాటే మరిచిపోయాను. తొందరగా ఏవో మొక్కలూ, ఏపిల్సూ ఏరుకొని వెళ్ళిపోయాను. ఆ రోజు మారుమొగం వేసి మెల్లిగా జారుకుంది. చాలా సేపటికి వెలుపుగోలిపే దాని తలకట్టు క్రింద ఒక ఈసడింపు చూశాను.]

ఇలాగు ఎన్నైనా దృష్టాంతా లెత్తి చూపవచ్చును గాని చాలా వాటిలో ఈ పద్యంలో వున్నట్లు జీవంగల భావపరిణతి గోచరించదు. వ్యాసంలోగాని, పద్యంలోగాని ఆయనయొక్క అన్వేషణకు విషయమైన స్వచ్ఛందవ్యక్తి (**Private man**) యొక్క అనంతత్వమే ప్రధానాంశము. నిలుకడగా ఒక్క విషయాన్నే పట్టుకొన్నను విశేషమైన అన్వయాతిచారం గాని, వాదక్రమ విన్యాసహానిగాని లేకుండా ఎంత వైవిధ్యానై నా ప్రదర్శింపగల శక్తి వున్న దాయనకు. ఇరవై యొక్కటో యేట 'ఆయాకాలములందలి విజ్ఞాన సంచయములు, మానవాభ్యుదయ సోపానములు అనదగిన సోలమన్ సామెతలు, మాంటెయిన్ వ్యాసాలు, బేకన్ వ్యాసాలు' మొదలైన అరుదైన పుస్తకాల గురించి దినసరిలో వ్రాసుకున్నా డాయన. ఆ గ్రంథాల కోవకు మరో పూస చేర్చాలని తనకున్న దన్నాడు.

తన దారిన తా నది సాధించినట్టే. ఆ గ్రంథా లాదర్శంగా వాటిలాగే సూక్తిసుందరమైన రచన చేశాడు. **Florio's 'Montaigne'**తో వైలక్షణ్యం బాగానే వున్నా దాని వలె ఒక స్వకీయ యోగ్యతాముద్రను తన రచనలో నిరూపించుకొన్నా డెమర్సన్. (షేక్స్పియరు దగ్గరా, బెన్‌జాన్సన్ దగ్గరా దాని ప్రతు లుండే వనుకోవడం ఆయన కొక తృప్తి నిచ్చేది.) అతని దినసరి వృత్తాంతాలు కొన్ని కట్టుకథలు, కొన్ని ప్రకృతి సందర్భ సంవాదులు (ఉదా: నేనూ ఎడ్వర్డూ మా దూడను కొట్టంలోకి లాగుకు రావడానికి ప్రయత్నించి విఫలుల మైనప్పుడు, ఆ ఐరిష్ పిల్ల

నోట్లో వేలుపెట్టి నేరుగా లోపలికి తోలుకువచ్చేసింది), కొన్ని వక్రో క్తులూ, ప్రవచన ప్రాయ వ్యాఖ్యానాలూను (రోజుల గురించి చెప్పినట్లు). అతని ఉపన్యాసమంటే అదో సూక్తుల పుట్ట. అవి తఱచు పొంకంగా, నిరాడంబరంగా వుంటాయి. అయితే వాటిలో భాష **North American Review** పుటల్లో కంటె గూడ జవజీవా లుట్టిపడేదని, ఆయన గ్రహించిన మామూలు వాడుక భాషగానే కచ్చితంగా వుందని చెప్పడానికి వీల్లేదు. వక్తృత్వం ఆయనను బాగా ఆకర్షించింది. సమకాలిక సాంప్రదాయికవ్యక్తులలో గొప్పవాడైన ఎడ్వర్డు ఎవరెట్టుని చాలా మెచ్చుకున్నాడు. అయితే బోడి ఉపదేశాలు (ఉదా: "ప్రతివాడూ తన సౌకర్యాల గురించి ఆలోచించుకొనేవాడే గాని అక్కడగల విషయాల గురించి ఆలోచించడం లేదు) జనానికి విసుగుకలిగిస్తున్నాయనీ, తార్కాణ చూపించి నగ్నసత్యాలను నిరూపించే ఉపన్యాసాలు చైతన్యంకలిగిస్తున్నాయనీ గ్రహించాడు. భాషయొక్క నిర్మాణ సౌష్ఠవము ("అర్థంతో ఐక్యసిద్ధి పొందగల శబ్దస్థితి")నకు ఆకృష్టుడై, తన కేదేనా ఒక గ్రామ కళాశాలలోనైనా అలంకారశాస్త్రాచార్య పదవి వస్తే బాగుండు నని అన్నారాయన. అంటే, అది అతని స్వభావాన్నీ, సాహిత్య దృక్పథాన్నీ పోల్చుకోడాని కొక చక్కని ఆధారం కాగలదు.

సరళ సుకుమార స్వభావుడైన ఆయనను తోటివారికి సన్నిహితుని చేయగలిగింది ఉపన్యాస వేదికయే. ఎదురుగా వున్న అంతమంది జనంతో ఏర్పడిన అనుబంధం ఆయన కెక్కువ ఆనందం కలిగించింది. అయితేవాళ్లతో మరీ తాదాత్మ్యం చెందకుండా వేఱుచేసిం దా వేదికయే. ఎదురెదురుగా వాళ్ళతో కలియకుండా వున్నంతకాలం వాళ్ళు చాలా మంచిగా, మర్యాదగా, అరమరిక లేకుండా మెల్విల్ వ్యవహరించినట్లు **'People'** అనిపించుకునేవాళ్ళు. అదే వాళ్ళ మధ్యకు వెళ్ళి కలిసి తిరిగేసరికి మోటుగా, అయథార్థంగా, స్వభావ తీవ్రతతో మెల్విల్ అన్నట్లు **'Public'**గా మారిపోయేవారు. అందుకే "మనిషిని ప్రేమిస్తాను నేను, మనుషులను కాదు" అంటాడు ఎమర్సను. 'సిటీ బస్సు **(Stage-coach)** లో ఆ

మనుషుల మొగాలు చూడు" అంటూ, "చావు ఇంతమందిని తప్పించే సిం దనుకోలేదు నేను" (లేక, వీళ్ళంతా బతికే వున్నారని నేను భావించ డం లేదు) అని టి. ఎస్. ఇలియట్ అన్నట్లుగానే (అంటే నిత్య జీవిత వ్యాపారాల్లో నిర్గుణ పరబ్రహ్మాలుగా కనిపించే మనుషుల్లో తగిన భావ పరిణతి, చైతన్యం లేవని తాత్పర్యం) ఇలా అన్నాడు ఎమర్సను:

"బోస్టను రాజవీధి (**State street**) లో నిలబడి ఆ మనుషుల వాలకాలు చూడు; తీర్పయిపోయాక ఉరికంబాలవేపు నడిచిపోయే దయ్యాల్లా వున్నారు" (అంటే ప్రజలు జీవచ్ఛవాల్లా రోజులు గడుపు తున్నారని)

దినసరి వ్రాసుకుంటూ వుంటేనో, వేదిక ఎక్కి ఉపన్యసిస్తూ వుంటేనో నిశ్చింతగా వుంటాడాయన. సామాజికులనుండి మంచిప్రోత్సా హమే లభించే దాయనకు.

1867 లో ఒకసారి జె. ఆర్. లోవెల్ ఒక మిత్రునికి జాబు వ్రాస్తూ ఎమర్సను ఉపన్యాసం గురించి ఇలా అన్నాడు:

"ఎమర్సను ఉపన్యాసం మామూలుకంటె, అసలతనికంటె గూడా, ఏమీ పొందిక లేకుండా వుంది. దానికో తలా తోకా లేదు. అయితే మటుకు, దానిలో వున్న సరుకెలాంటిదనుకున్నావు! నక్షత్రాలు దేనితో తయారయ్యాయో అలాంటి పదార్థం అదంతా. కొస్త నిదానంగా వుంటే ఆ అనుభూతి పొందకుండా వుండలేవు. అస్పష్టమైనదంతా విశ్వ గోళాల్లోకి విసిరేస్తాడు. అక్కడ నుంచి అది ఒక క్రమబద్ధమైన ఆకర్షణను పుంజుకుని వస్తుంది. ఆ ఉపన్యాసం వింటున్నంతసేపూ నాలో కాహ ళలు మారుమోగుతున్నట్టు అనిపించింది."

మన కా ఆనందానుభూతి కవకాశం లేదు. అయితే హెన్రీ జేమ్సు చెప్పిన మాట ఒకటి మనలను ఆకట్టుకుంటుంది. 'మిగతా రచయి తలు, వర్డ్సువర్తు ప్రభృతులు మన స్వరూపం మనం గ్రహించిన ట్లొక అవబోధాన్ని మాత్రమే కలిగించగలరు, కాని ఎమర్సను మన కది యింకా

పరమప్రాప్య మన్న ధ్యాస విడనాడకుండా చేస్తాడు' అంటాడు జేమ్సు. అతని దినసరి ఆకారంలేని పట్టి సాహిత్యపు ముద్ద. రూపు గైకొన్న కృతుల్లో ప్రాణకళ లోపించింది. కార్లైల అన్నట్లు అతని వాక్యాలైతే అకృతకంగా మంచి స్ఫూర్తిమంతములై వుంటాయి గాని, ఒక పేరాను తీసుకుంటే అదో గాజుల మలారంలా వుంటుంది. జార్జి రిప్లే, థోరో, **English Traits** గురించి ఆయన వ్రాసిన వ్రాతల్లో లాగ వ్యాసాల వస్తువు కొంత పరిధి యేర్పడినప్పుడు విషయనిరవధికమైన వ్యాసాల్లో కంటె ఫలితం చాలా సంతృప్తికరంగా వుంటుంది. అతని పద్యకృతుల్లో కూడా లోపాలున్నాయి. మరీ చిన్న పాదాలతో 1 వికారంగా వుంటాయి. అయితే చాలామంది సమకాలికుల పద్యాల్లోలాగ చచ్చుహంగు లుండవు. ఒక్కొక్కప్పు డవి వింతగా, చమత్కార చతురంగా వుంటాయి:

**Things are in the saddle**
**And ride mankind.**

[కావలసినవి జీనులోనే వున్నాయి కాని (ఎక్కడికో) స్వారి చేస్తూ పోతారు మనుషులు.]

అయితే తరచుగా ఆ పద్యాలు పెళుసుగా, కటువుగా, నీత్యుప దేశపు టూదరగా వుంటాయి.

ఆకృతిసౌష్ఠవలోపం ఎమర్సను భావనలో ఏదో గొప్ప లోటును సూచిస్తుంది. ఆ భావనారీతులు అతని వాక్యాలలాగే ఎగుడు దిగుడుగా వుంటాయి. అడుగడుగునా వ్యాఘాతమే స్ఫురిస్తుంది. మంచికీ చెడ్డకీ, వ్యక్తికీ సంఘానికీ, మతప్రాతికూల్యానికీ సాన్నిహిత్యానికీ, పాండిత్యా

---

1. జెర్ట్రూడ్ స్టైయిన్ (ఎమర్సను తరువాతికాలంలో అమెరికాలో శబ్దచిత్రమార్గదర్శకురాలైన రచయిత్రి) వలె ఎమర్సనుకూడ పదబంధాల లోని లయను ఊపిరిని బట్టి నిర్ణయించుకోవా లనే సిద్ధాంతం గలవాడు. ఆయన వక్తృత్వాభ్యాసంనుండి ఆ సిద్ధాంతం ఉద్బుద్ధమై వుండవచ్చు. ఆవిడమాత్రం తన పెంపుడుకుక్క నీళ్ళను కతకడం చూసి గ్రహించా నంటుంది.

నికీ సహజజ్ఞానానికీ, నిలబడి ఆలోచించవలసిన స్థితికీ కూర్చుని ఆలోచించవలసిన స్థితికీ రాజీ కుదర్చడ మెలాగు? అతనిపై వచ్చిన ఆక్షేపణల్లా— అత డీ సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించివుండలేదని కాదు, ఆ సమస్యలతో గర్భితములైవున్న గడ్డుచిక్కులను గుర్తించకుండా వ్యవస్థతో వ్యాఘాతం తెచ్చిపెట్టినందుకు; ఆ సమస్యలను వ్యతిక్రమంతో చెప్పినందుకు గాదు, అవి ఈ విశ్వగోళంయొక్క నిమ్నోన్నతాల్లాంటివని, ఒకదానికి విరుద్ధమైనది రెండవదానిని రద్దుపరిచేసిం దని తీర్మానించినందుకు. ఈ "బహుధా విప్రతిపత్తి ధీవిషయము" ఆయనను వ్యామోహపెట్టింది. 'యూరియల్'తో (హార్వర్డు డివినిటీ స్కూలుమీద చిన్న ప్రతీకారదృష్టితో ఎమర్సను చేసిన రచన):

**"Line in nature is not found;**
**Unit and Universe are round;**
**In vain produced, all rays return;**
**Evil will bless, and ice will burn."**

[సృష్టిలో ఋజుత్వం కనిపించదు. బ్రహ్మాండమూ, దాని భాగమూ వర్తులాకృతులే. నష్టజాతకాలు కిరణాలన్నీ తిరోగమిస్తున్నాయి. చెడు జయిస్తుంది, మంచు మండిపోతుంది.]

అవును, తుదకు చెడే నెగ్గుతుంది. లేక మేరీ బేకర్ ఎడ్డీ అన్నట్లు— "చెడు అంటే అదొక అభావార్థకము మాత్రమే. కేవలమూ పరిపూర్ణమూ అయిన లక్షణ మేమీ కాదు. ఉష్ణముయొక్క అభావమే శైత్యము. అదీ అలాంటిదే."

"Ode Inscribed to W. H. Channing" లో బానిసవృత్తి నెత్తిపెట్టి ఘాటుగా ఏవో మాట లన్నాక—

"Foolish hands may mix and mar;
Wise and sure the issues are,
Round they roll till dark is light."

[అపసంతి చేతులు కలిపేసి చెలుపవచ్చు
కాని విషయాలు వివేచితము లవితథములు
తమస్సు తేజస్సుగా పరిణమించేదాక
అవి పరిభ్రమిస్తూనే వుంటాయి.]

అని ఒక మనశ్శాంతి పొందుతాడు ఎమర్సన్.

'కాంగ్రెస్' దుర్నీతికి పాల్పడిందా అంటే దుర్నీతి అన్నది శక్తి యొక్క ఉనికి కొక తార్కాణం. ఆ రెండూ అవిభాజ్యములు. అదృష్టమంటే అపరిశీలితములైన, అజ్ఞాతములైన నిమిత్తముల సంపుటి. 'విశ్వము గురించిన ఏ మాటా, దాని ప్రగతిశీలము నంగీకరించనిదైతే, నిర్దుష్టమైన దనడానికి వీలులేదు.' పో చెప్పిన పురుగు అదొక విజేత; ఆఖరికి మనల్ని తినేస్తుంది. ఎమర్సను పద్యంలో అది—

"Striving to be man, the worm
Mounts through all the spires of form."

[నరుడుగా పరిణమించాలని పరిశ్రమిస్తూ పురుగు ఆకారపు టంచెలన్నీ అధిరోహిస్తోంది.]

ఎమర్సను ఉద్దేశంలో సరిపడని సంగతుల మధ్య దారుణస్పర్ధ లేదు; పొత్తుకోసమే అవి పోట్లాడుకుంటాయి. కాని మానవులంతా త్రోసేవారుగను, త్రోయబడేవారుగను చీలిపోతారు. క్రిందపడేవారు మీది వారిలో తమలో లేని శక్తియొక్క ఆధిక్యాన్ని గుర్తించి ఊరుకుంటారు. ఇక్కడ మనం అతిమానుషసిద్ధాంతానికి ఎడంగా లేము. అది ఎమర్సనును చకితుణ్ణిచేసివుండేది.

ఆయనను మరీ బొత్తిగా నిరసించడం సబబు కాదు. అతని రచనలన్నిటా ఒక స్వతంత్రవ్యక్తిత్వము, ఒక పరమాద్భుతమైన పవిత్రత వున్నవి. అజ్ఞత లేని నిరాడంబరత, జడత లేని స్తిమితత వున్నవి. అయితే తక్కిన అమెరికనుల సంస్కారం లాగే అతని సంస్కారంకూడా మితిమీరినట్లు వుంటుంది. కొలది రచయితలు మాత్రమే అతని ప్రమాణానికి రాగలరు. హోథార్ను, టెన్నిసన్ వంటి వారు కాస్త తక్కువే తూగు

తారు. ఆయన తన లోపాలు గుర్తించినవాడు. తన దేశంయొక్క, ఆ మాటకు వస్తే ఇంగ్లండుయొక్క లోపాలనుకూడా తెలుసుకోనివాడు కాడు. ఆయనలో ఓప్రక్క సున్నితమైన ప్రాంతీయతత్త్వంకూడా వుంది. అతని ఆశావాద మతని పతనానికి దారితీయలేదు కాని అతనిలాగే ఆశావాది యైన షెల్లీతో సరిపోల్చి చూస్తే ఎమర్సనులోని లోపం స్పష్టపడుతుంది. ప్రేమయే విశ్వరహస్యము, కవి యన్నవాడు పరిణతుడైన మానవుడుగా, సర్వమానవసమాజంయొక్క యోగం ఎలా వుంటుందో అదంతా తనకే పట్టినట్లు గమనించాలి; "తన జాతికి సంబంధించిన ఖేదమోదా లన్నీ తనవి కావాలి" అంటాడు షెల్లీ. ఎమర్సను ("షెల్లీ నన్నేమీ కదిలించలేకపోయాడు" అని 1841 లో చెప్పేడు.) సిద్ధాంతరీత్యా షెల్లీ చెప్పిన మాట నామోదించాడు. కాని ఆచరణలో తాను ప్రత్యేకంగా నిలిచాడు. సోదరమానవులతోనే అవ్యక్తాశయాల అడ్డుగోడలు పెట్టుకొని వేఱుపడ్డాడు. "Give all to Love" అనే ఒక విడ్డూరపు శీర్షికతో ఒక ఖండకృతి వ్రాస్తూ అందులో—అంతా ఇవ్వరు, అతిప్రియవ్యక్తినిగూడా వర్జించడానికి సిద్ధంగా వుండు అని సలహా యిచ్చాడు. 'Illusions' లో వివాహవ్యవస్థను వ్యంగ్యంగా మెచ్చుకుంటాడు—ఎంత చెడ్డ వివాహంలోనూ ఏదో లాభం వుండకపోదంటాడు. శానిసతనం అతనిలో సానుభూతిని రేకెత్తించింది, అయితే ఒక విపరీతమైన నిమిత్తంగా. షెల్లీ తన విప్లవధోరణివల్ల తల్లిగడ్డను విడిచిపోయాడు. అయినా, కవిగా తన బాధ్యతనూ, వివిధ కవితాశిల్పాలనూ స్పష్టంగా గుర్తెరిగినవాడు. ఎమర్సను విప్లవం అక్లేశకరమైనది. అతని ఆశయం ప్రకారం అమెరికన్ పండితుడొక నీరసవ్యక్తిగా, కవి అయినదానికంటె ఒక మహాయోగిలా (ఏసుక్రీస్తంతమాత్రం కాదు లెండి) కనిపిస్తాడు. నిర్లిప్తత అతని సామగ్రిలో ముఖ్యమైనది. తన పాద వినేవారు లేక అలా శూన్యంలో సంచరిస్తా షతడు. ("ఈ దేశంలో సాహితీపరుడికి సహృదయుడే కఱవైపోయాడు" అన్నాడు ఎమర్సను 1836 లో.) అతని సాహిత్యచరిత్రకు పూర్వపు ఘనత లన్నవి లేవు. అయితే ప్రేరణ పొందిన

మతబోధకుడి ప్రామాణ్యంలా కళాకారుని సృష్టికూడకూడ అప్రయత్న పూర్వకంగా, స్వచ్ఛందంగా వుండాలని నమ్మేవాడు కావడంవల్ల అతని కా పూర్వచరిత్రగురించి ఆసక్తి లేదు. ఈ నమ్మకంవల్ల శోచనీయమైన పరిణామం ఏర్పడింది. ఎమర్సను (దురదృష్టాలు దైవనిర్ణీతాలు అనే ఇలాంటి ప్యూరిటన్ ఉద్దేశాలలోని పేలవత్వాన్ని ఈయనా విశదపరి చాడు) మొదలుకొని విలియమ్ సారోయన్ వ్రాసిన 'The Time of Your Life' లోని బన్‌హామీదాకా అది ఒకటే కోవ అని ఎవరేనా అనుకోవచ్చు. లేక, ఈ కాలపు టమెరికాలో మనోగమ్యములైన కళా కృతులలో గల విశిష్టమైన ఆంతరపద్ధతికీ, అప్రయత్నపూర్వకమైన సామాన్యపద్ధతికీ సంబంధం వుందని అనుకోవచ్చు. అలాంటి సంబంధాల గురించి మాట్లాడటం తప్పుదారి చూపించడం కావచ్చు కాని అనేక ప్రకారాల్లో ఎమర్సను ఆలోచనలు అమెరికా స్వభావానికి తగిన ట్లుంటా యనడం సరియైనదే. కాని లోవెల్ అన్నట్లు ఎమర్సను కాలంలోనే, పారిశ్రామిక విప్లవం సాగుతున్న రోజులలో ప్రాచ్యుల నిస్సంగత్వం కలిసిన పేలవమైన వ్యష్టితత్త్వము ఆమోదయోగ్యంగా భాసించింది.

మరొకప్పు డిలా అన్నాడు లోవెల్ : "ప్రాయశః మాలో కొందరు శబ్దాతిశాయియైనదానిని వినగలరు, భావాతిశాయి గంభీరమైనదానికి స్పందనం పొందగలరు." కాని నిశ్చయవాదానికి సంబంధించినవనీ, శూన్యవాదానికి సంబంధించినవనీ వినిపించే అర్వాచీన సూత్రాలు మనకు కటువుగా వుంటాయి. ఈ విషయాలన్నిటి దృష్ట్యా మనం ఎమర్సనువేపు మళ్ళితే కొన్ని వింతైన సమన్వయాలు కనిపిస్తాయి. 'Concord' (సమన్వయార్థకశబ్దము; అతని నివాసమూ ఆ పేరింటి ఊరే) అనే మాట నొక పరమాశయమంత్రంగా పరిగణించే ఆయన హెమింగ్వేయొక్క సుప్రసిద్ధ సుదృఢ ధార్మిక ప్రవచనానికి ప్రస్తావనగా ఇలా అన్నారు :

"మంచీ, చెడూ అనేవి మార్పుకు లొంగే మాటలు. అయితే నా జీవలక్షణాని కనుగుణమైనదే మంచి. దానికి విరుద్ధమైనది చెడు."

## హెన్రీ డేవిడ్ థోరో

ఇలా చూచేసరికి ఎమర్సన్ థోరోలకంటె ఏ యిద్దరు రచయితలూ ఎక్కువ సన్నిహితంగా వుండరనిపిస్తుంది మొదట. ఇద్దరూ కంకార్డులో నివసించినవారు; సదృశ ప్రేరణలకు ప్రతీఘాతము పొందినవారు. ఎమర్సను లాగే పిన్నవా డీయనకూడా ప్రకృతితత్త్వపరిశీలనలో పరవశించి పోయాడు; దినసరి వ్రాయడం ప్రారంభించాడు. అందులోనుంచే విషయాలెన్నుకుని ప్రచురించాడు. ఎమర్సను లాగే స్వాతంత్ర్యము, పరహిత చింతనలగూర్చి ప్రవచనం చేశాడు. అలాగే బానిసవృత్తిని వ్యతిరేకించడం అనే నిమిత్త మొక్కటే ఆయనలో సంచలనం కలిగించింది. ఆ యిద్దరి ఆకారాల్లోగూడా సాదృశ్యం వుంది. ఇక నేమి, థోరోను ఎమర్సనుగారి శిష్యు డని తప్పకుండా అనుకోవచ్చు. ఎమర్సను తను నడుమ శైష్యోపాధ్యాయికానుబంధాన్ని స్పష్టంగా కలిగివుండలేదు గాని థోరో తన ఉద్దేశాలు తన ఉద్దేశాలకు ప్రపంచీకరణములే అని మాత్రం అనుకొన్నాడు. థోరోను తీవ్రంగా విమర్శించినవారిలో జె. ఆర్. లోవెల్ ఒకడు. ఆయన థోరోగురించి ఎమర్సనుగారి తోటలో రాలుగాయల నేరుకొన్నవా డని అన్నాడు.

అయితే యథార్థానికి ఇరువురివీ భిన్నవ్యక్తిత్వాలు. ఆశయాలు గూడ కొంత భిన్నము లైనవే. వాళ్ళలో సమానంగా వున్నదే వాళ్ళను దూరంచేసిన దనవచ్చు. కాలం గడిచినకొద్దీ వాళ్ళు కలుసుకోవడమే కష్టమైపోయింది. మే, 1853 లో తన దినసరిలో థోరో తాను ఎమర్సనుతో సంభాషించినట్లు, సంభాషించుటకు ప్రయత్నించినట్లు వ్రాసుకున్నాడు:

“కాలం సంగతి మరిచిపోయాను—కాదు నన్ను నేనే మరిచిపోయాను. ఆయన (ఎమర్సను) నిజానికి అభిప్రాయభేదం లేనిచోట వున్నట్లు అభినయించి గాలితో సంభాషించాడు. నాకు తెలిసిన దేమిటో చెప్పేడు. ఆయనను కాదనడానికి నే నెవడనో అనుకుంటూవుంటే ఎంత కాలం గడిచిపోయిందో నాకే తెలీదు.”

ఇంచుమించు అప్పుడే ఎమర్సను తన దినసరిలో ఇలా వ్రాసుకున్నాడు:

"కాదని వాదించేవాడు లేనిదే వెబ్‌స్టర్ మాటలాడ లేనట్లు, హెన్రీ (థోరో) కూడా ఎవడో ప్రతివాది వున్నప్పుడు తప్ప తన తత్వాన్ని గుర్తించుకోలేడు. అతనికి బయటపెట్టడానికి కొంత అపోహ కావాలి; కొంత వెయ్యడానికి కొంత పొరపాటు వుండాలి, కొంత విజయకాంతి వుండాలి. అతని శక్తుల్ని మేలుకొల్పడానికి ఢంకా నగారాలు కావాలి."

ఎంత విశదంగా వున్నాయి వాళ్ళ యీ మాటలు! ఆ 'నేతివాదు' లిద్దరి మధ్యను ఎంత ఒడుపు, నిక్కు గల అభిమానం! ఇద్దరికీ నవల లంటే ఇష్టం లేదంటేనూ, ఇద్దరూ మైత్రి గురించి ఆదర్శంగా వ్రాశారంటేనూ, ఇద్దరూ ఆత్మాభిమానులంటేనూ ఆశ్చర్యం లేదు. నీతికి నిలబడే మనిషి ఆత్మాభిమాని కాకుంటే మరేమి అవుతాడు?

అయితే ఎమర్సను వ్రాతల్లో లేనిదీ, థోరో చెప్పగలిగిందీ కొంత వుంది. ఎమర్సనుకంటె ఎక్కువ పట్టుగా చేస్తాడు, చెబుతాడు. ప్రపంచంలో వున్న మామూలు నేర్పులను, చిన్న చిన్న చేతిపనులను గూడ మెచ్చుకుంటాడు. తానూ చెయ్యగలిగితే బాగుండు ననుకొంటాడు ఎమర్సను. అనుకుంటే చేసి చూపిస్తాడు థోరో. ఆ నేర్పు లనేకం ఆయనకు కరతలామలకాలు. ఆయన సర్వేయరుగా, రైతుగా, వడ్రంగిగా ఆ కంకార్డు వూళ్ళో ఎవరితోనైనా సమానంగా పనిచేయగలిగి వుండే వాడు. ప్రకృతియెడల ఎమర్సను కున్న ఆసక్తి నిజమైనదే కాని థోరో దానితో సరిపోలిస్తే అది మితమైనది, సాహిత్యపరమైనదీను. 1851 లో ఎమర్సను తన దినసరిలో—"ఈ శతాబ్దిలో అమెరికాలోని యువతీ యువకు లందరూ పచ్చికమీద పండుకొని పైని గ్రీష్మాకాశంలోని మనోజ్ఞ మేఘ చంక్రమణాలను పరిశీలిస్తూ ఏళ్ళు గడుపుతున్నట్లు కానవస్తుంది" అని వ్రాశాడు. ఈ మాట ఒక కాలమునాటి ప్రకృతి ప్రియుల తత్వాన్ని చక్కగా తెలియజేస్తుంది. అది కొంత థోరోకి గూడ వర్తిస్తుం

వినుకోవచ్చు. అతడు ప్రకృతిరహస్యపరిశీలనకృషిలో సుదూరగామి. అయితే ప్రకృతి పరిశీలన నొక వృత్తిగా చేసుకొన్నవాడూ కాదు. ఎంత పరిశీలన చేసినా అతడు వృక్షాలూ, జంతువులూ వీటి గురించి అప్పటికి సిద్ధంగా వున్న విజ్ఞానానికి చేసిన దోహదంమాత్రం ఏమీ లేదంటారు. కాని ప్రకృతిలో అతని పొత్తు ఎలాంటిదంటే, అదొక అనితర సాధ్యమైన దివ్యానుభవం. పురాణాల్లోని వనదేవత1లా ప్రకృతిలో తన్మయత్వం పొంది పోయేవాడు.

కలగాపులగపు సాంఘిక జీవితకశ్మలం అతనికి కొన్ని కష్టాలు తెచ్చి పెట్టింది. అతడు విద్యావంతుడు. ట్రాన్సెండెంటలిస్టు ఉద్యమానికి కొంత దోహదం చేశాడు. ఆ గోష్ఠులకు హాజరయ్యేవాడు. ఒక సామాన్యమైన జీవనమార్గాన్ని కోరుకునే క్లిష్టజీవనుడైన మానవుడి సమస్య యేమిటో అదే అతని సమస్యయున్ను. ఒక జీవన వ్యాపృతి చూసుకోవాలి కాని అది అతని స్వేచ్ఛకు అడ్డురాకూడదు. తన ఆశయాలను వెల్లడించాలి, దానివల్ల తన కేమీ చిక్కులు రాకూడదు. ఎమర్సనులాగే అతడూ సంఘంతో అను బంధం గల వ్యక్తిగురించి ఆలోచించేవాడు. అయితే ఒక విశిష్టమైన మార్గంలో ఆలోచించేవాడు. కర్కశమైన సంఘంలోనికి వ్యక్తి ప్రవే శించడ మెలాగు? అన్నది కా దతని సమస్య. అతిచనువుగా వ్యక్తియొక్క పరిధుల్లోనికి చొచ్చుకువచ్చే సంఘంనుంచి అతడు తట్టుకోవడ మెలాగు? ఇదీ అతని సమస్య. వాల్డెన్‌లో అత నంటాడు: "ఒక మనిషి ఎక్కడికట వెళ్ళనీ మిగతా మనుషు లతనిని వాళ్ళ వాళ్ళ కుళ్ళు నియమాలతో చుట్టు

---

1. వనదేవత అంటే తన తృష్ణలు తన అధీనంలో వుంచుకున్న వనదేవతలా. చూ. అతని వాల్డెన్‌లో 'Higher Laws' అనే ప్రకరణంలో "నేను మంచి నెంత ప్రేమిస్తానో వన్యప్రకృతినీ అంత ప్రేమిస్తాను" అంటూ "ఎవనిలో అయితే క్రమక్రమంగా పశుత్వం నశించి దైవత్వం వెలు స్తుందో వాడూ భాగ్యవంతుడు" అని వక్కాణించిన అతని మెలకువ గమనింప దగింది.

ముట్టేస్తారు. చేతనైతే వాడిని తమ నిరాశామయనికృష్టసంఘంలోనికి బలవంతంగా లాగివేస్తారు."

వివిధశంకల కాయన చెప్పుతున్న సమాధానా లేమంత అందికపొందికగా లేవు. ఏకాకారంగా ఏర్పడిన జాతికి చెందినవా డవటంవల్ల ఆ సంఘంలో స్థానం సంపాదించుకోడాని కాయన ప్రయత్నించవలసిన అవసరం లేకపోయింది. అతని స్థాన మేదో అతనికి తెలియకపోయినా మనకు తెలుసు. అతని పేరు హెన్రీ. జాన్ థోరో అనే ఆయనకు కొడుకు. అతడు సంసారంలో స్థిరపడడానికి ప్రయత్నించినవాడు కాడు. ఇరుగు పొరుగువా రతని చపలవృత్తుల నసహ్యించుకొన్నా క్రొత్తవారి యెడల ప్రకటించేటట్లుగా అతనియెడల అమిత్రభావాన్ని ప్రకటించలేదు. ఆ సంఘంలో తన కనుగుణమైన ఏర్పాటు లున్నట్లుగా మరోచోట తటస్థించడం అరుదు. తా నున్నదీ పల్లెటూరైనా కొత్త నాగరికత గలది. మాట్లాడటానికి ఎమర్సను, హాథార్ను, ఆల్కాటులవంటి పెద్దమనుషు లున్నారు. వీధిచివరే తన కతిప్రియమైన కానకోన లున్నాయి. తాను పర్ణశాల నిర్మించుకొన్న చోటు - వాల్డెన్ మడుగు ఊరికి మైలున్నర దూరంలో వున్నది. ఇంకేం కావాలి? అంటే—

అత డొకసారి కార్లయిలుగూర్చి సానుభూతితో సమీక్ష వ్రాస్తూ ఇలా అన్నాడు:"కార్లయిలు ప్రకృతిని తా ననుకోని ఒక విషాదశ్రుతితో వర్ణిస్తాడు.ఇక్కడ న్యూఇంగ్లండులో పొటెటోలు సమృద్ధిగా దొరికేచోట మనుషులంతా పక్షుల్లా,తుమ్మెదపోజుల్లా కులాసాగా,విలాసంగా జీవిస్తున్న చోట అతని పుస్తకాలు చదువుతూవుంటే మా కేమనిపిస్తుందంటే అతడు ప్రపంచాన్ని పేర్కొన్నప్పుడల్లా లండను నే వుద్దేశించా డనిపిస్తుంది. ఆ లండను ఈ భూమండలంలో ఒక సెలవేసిన రాచపుండులాంటి ప్రదేశం. అంతకన్నా దక్షిణాఫ్రికాలో ఒక గ్రామం కార్లయిలుగారి కథారంగమైతే బాగుండేది. అతనికి తగిన సమాజం లభించివుండే దక్కడ. లేక, నిశ్శబ్ద నీరవమైన మరుభూమిలోనైతే అసలు సరిగా అతనికి కావలసిన సామాజికులు-ఇక పుట్టబోయేవారు - లభిస్తారు."

చెప్పిన మాటలైతే చమత్కారంగానే చెప్పేడుకాని థోరో, ఆయన మార్గాన్ని చూస్తే, ఆ మాట లాయన రచనలకూ అన్వయిస్తాయి. ఈయన కంకార్డు ఆ లండనుతోను, ఎడారితోను సంవదిస్తుంది. ఈయన రచనలూ అర్వాచీనులకే ఉద్దిష్టాలు.

పాపం, ఇదీ థోరోపరిస్థితి. రకరకాల ఒత్తిడులకు తట్టుకోవలసిన అవసరం కల్పించే దతనికి. అయితే ఏ ఒత్తిడీ ఆయన నాట్టే ఇబ్బందిపెట్ట లేదు. అతని పరిష్కారమార్గా లనుదారంగా వుండేవని ఆయనను కొందరు కంటగించుకొనేవారు. ఆర్. ఎల్. స్టీవెన్‌సన్, జె. ఆర్. లోవెల్‌లవలె వాళ్ళు థోరోను 'దాగిలిముచ్చు' అన్నారు; సగం మఠం, సగం మాటు (half-hermitage, half-ambush) అయిన ఒక అనుకూల ప్రదేశానికి పోయి నివసించడంకాక తక్కిన తన దేశీయ ప్రజల్లాగ నివసించి వుండవలసిందని హెచ్చరించారు. అందుకు సమాధానంగా—అన్యాయంగా ప్రవర్తిస్తోందని తా ననుకునే ప్రభుత్వానికి తలపన్ను కట్టడానికి ఒప్పుకోనందున కంకార్డు నిర్బంధంలో తాను వుండవలసిరాగా తన కేకొంతో ఖర్చయింది అని ఆయన అంటే అందు కభ్యంతరం చెప్పేరు. ఎంచాతంటే—ఆయన పక్షాన ఆ పన్ను నొక మిత్రుడు కట్టి ఆయన్ను విడిపించాడు. అయింతా వెంటనే వెళ్ళి బుడంకాయ లేరుకోగలిగే డాయన అన్నారు వారు. ఆ వాల్డేనుమఠంలో, ఊళ్ళోని తమయింటి తాలింపువాసన తగులుతున్నపాటి దూరంలో ఓ రెండేళ్ళపాటు కాలక్షేపం చెయ్యడం మేమంత కష్టమైన పనికాదని కూడా వాదించారు. 'Civil Disobedience' గురించిన వ్యాసంలో ఆయన—

"నా పద్ధతిప్రకారం నేను ప్రభుత్వంతో యుద్ధం ప్రకటిస్తున్నాను మెల్లగా. అయినా దానినుండి నేను పొందగలిగిన లాభా లింకా పొందు తాను రివాజుగా."

అని ఉద్ఘాటించడం చూచి, అలాంటి కుతర్కాన్ని అసహ్యించు కున్నారు వాళ్ళు.

థోరోకి తెలుసు తన స్థితి విమర్శకు గురి అవుతుందని. తన ఇరవై నాలుగోఏట ఇలా గన్నాడు: "ఏవో కొన్ని వస్తువులయెడ అకృత్రిమ మైన ప్రేమతప్ప, నా ఆశయాలను నెరవేర్చుకొనే గుణాలు నాలో లేవని తెలుసు." ఆ వస్తువులు ప్రకృతిసంబంధులు, ప్రకృతిలోనివి. ఆయన వాటిని అలవోకగా ప్రగాఢంగా ప్రేమిస్తాడు. ఒకసారి ఒక అడవిఎలుక ప్రక్కదానితో మాట్లాడుతూంటే అరగంటసేపు కూర్చున్నాడు:

"దాని చూపు సుకుమారమైనది. దానితో నయగా మాట్లాడేను. నోటికి చిత్రఫలపత్రా లందిచ్చాను. అది తల త్రిప్పుకున్నా నా చేతులు దానిపైకి చాచేను...నాదగ్గరేకాని కొత్త తిండాని కేమైనా వుంటే ఊరకే దానిని దువ్వడం మానేసివుందును...అదో పెద్ద ఉడుతలాంటిది. (అశుభ్రంగా వుంటుంది. బొక్కలు తవ్వుతుంది. ఎలుగుబంటికీ ఎలుకకూ మధ్యస్థంగా వుంటుంది) అది మాదేశపు వాస్తవ్యురాలని గౌరవిస్తాను. ఇక్కడ మా పూర్వులకంటె దాని పూర్వులు చాలాకాలంగా వున్నారు."

Maine అడవులలో తనకు విస్మయం కలిగించిన రెండు లేళ్ళ యెడలకూడ అతని ప్రేమ అలాంటిదే—అసలా అడవి కవే హక్కుదారులని. ఆ గ్రంథంలోనే మరో చక్కని ఘట్టంలో జంతువృక్షనాశానికి ఖేదపడతా డాయన:

"పుట్టిన ప్రతీజీవి చచ్చేకంటె బ్రతికేవుంటే బాగుండును—ముఖ్యంగా మనుషులూ, లేళ్ళూ, దేవదారుచెట్లూ. ఆ చెట్టుయొక్క జీవసారంతో, దాని తైలసారంతో కాదు, నాకు సానుభూతి; నా గాయాలను మాన్పేది అదీ. నాకు మల్లేనే అదీ చావులేనిదే. ఒకవేళ అది స్వర్గమంత ఎత్తుకి వెళితే అక్కడా నాకు నీడ పట్టుతుంది."

'Atlanti Monthly'కి ఈ రచనను స్వీకరించిన జె. ఆర్.

లోవెల్ ఆ చివరివాక్యం హద్దుమీరివుందనో, పాఠకులకు సంప్రదాయ విరుద్ధంగా భాసిస్తుందనో తీసేసి అచ్చువేసి థోరోకి ఆగ్రహం తెప్పించాడు. ట్రాన్సెండెంటలిజమ్‌కి థోరో చెప్పిన అర్థమదీ. అతనికి మానవ సమాజంతో తగిన అనుబంధం లేకపోవడంవల్ల అంత గొప్ప కల్పనాశక్తి గల రచయిత కాలేకపోయాడు. కాని ప్రకృతితో అతనికి గల సన్నిహితత్వం ట్రాన్సెండెంటల్ సాహిత్యంలో వుండే పలుదోషాలనుండి కాపాడింది. కేవలం అర్వాచీనుల నుద్దేశింపబడి చేయబడిన రచన అర్వాచీనుల చేతను, సమకాలికుల చేతగూడ ఉపేక్షింపబడుతుంది. మితిమీరిన భవిష్యద్దర్శనం రచయిత నొక వట్టి జోస్యుడిని చేసేస్తుంది.అలాంటి రచయిత ఎమర్సను చేసినట్లు తన భావప్రతీక లగు వాక్యాలను విశేషార్థభారంతో క్రుంగదీస్తాడు. ఇక అది వచనం కాదు, ప్రవచనం అయిపోతుంది. అయితే థోరో, బ్రతికిపోయాడు, తనకు తెలిసినదానిగురించే వ్రాశాడు—అంటే ప్రకృతి గురించి, తన స్వభావంగురించి. ప్రకృతిగర్భంలో దాగివున్న సంగీత స్ఫురణలే అతని కృతుల కాకృతులు తీర్చిదిద్దినవి. ఏవో భావపరంపరల చుట్టూ పేరుకొని గడ్డకట్టుకుపోకుండా అతని రచన నొకరసవాహినిగా ప్రవహింపజేసినవి.ముఖ్యంగా రచయితగా అతని ప్రతిష్ఠకెత్తిన పతాకయైన 'వాల్డెన్' కావ్యానికి సురుచిరాకృతి కల్పించాయి. అతని దినచర్య, ఆహారవిహారాలు, 'వాల్డెన్'కొలను, ఆ పరిసరమనోజ్ఞవన్యప్రకృతి--ఇవీ వట్టి పేలవమైన లోకవాసనలలో మునిగి మూల్గే సామాన్య మానవునిమీద ఆయన చేసిన దండయాత్రలకు స్థిరమైన అధిష్ఠానపీఠాలు. ఆ వచనం ఎమర్సను వచనంలో వైశిష్ట్యంగల భాగంవలె మెలకువగలది, మేలిమిగలది, సున్నితమైనది, చురుకైనది:

"Let us settle ourselves, and work and wedge our feet downward through the mud and slush of opinion...through Paris and London, through Newyork and Boston and Concord,

through and State, through poetry and philosophy and religion, till we come to a hard bottom and rocks in place, which we can call reality, and say this is, and no mistake...

Some circumstantial evidence is very strong, as when you find a trout in the milk.

Making the earth say beans instead of grass—this was my daily work."

ఒక్కొక్కప్పుడు థోరో రచనలో రూపకసౌభాగ్యం బాగా కనిపిస్తుంది. సర్ థామస్ బ్రౌన్ వంటి రచయితల కతడు ఋణపడివున్నట్లు తోపింపజేస్తుంది :

"Self-emancipation even in the West Indian Provinces of the fancy and imagination—what wilberforce is there to bring that about?"

ఇలాంటి పంక్తులను మినహాయిస్తే థోరో శైలి సామాన్యంగా సామయికంగా వుంటుందంటారు. అయితే ఎమర్సను రచనలోలాగ అందులో సజాతీయమైన భాషాతత్త్వం పాలెక్కువగా వుండదు. సామాన్యజనవ్యవహారసరళిని పరిశీలిస్తాడు థోరో. కాని మార్క్ ట్వెయిన్ లాగ దానిని యథాతథంగా పోతపొయ్యడు. అతని శైలికి దాని వైశిష్ట్యము దాని కున్నది. అది కొంతవరకే సమకాలికథోరణికి సన్నిహితంగా వుంటుంది. కార్లైలు పుస్తకాల గురించి "అవి నాగలి, పిండిమర, ధూమయంత్రముల వంటి కళాఖండాలే గాని చిత్తరువులూ విగ్రహాల వంటి కళాఖండాలు గావు" అంటాడు థోరో. ఈ మాట థోరోకే అన్వయిస్తే బాగుంటుం దనుకొంటారు కొందరు. థోరో రచనలో కొంతభాగం వెనుక ఎప్పుడో ఇంగ్లండులో వేయబడిన కరపత్రాల్లోని వచనరచనను తలపింపజేసేటట్లు వుంటుంది. అందు కతని "Slavery in

Massachusetts", లేక "A Plea for Captain John Brown" (క్రాంవెల్ కాలంలో చనిపోయినవాడు మళ్ళా ఇక్కడ కనిపించాడు) అనే రచనలలోని ఆ సుత్తిదెబ్బల వంటి వాక్యాలే తార్కాణాలు.

థోరో ఏవో కొద్దిగా పద్యాలు వ్రాశాడంటే అవీ ఎమర్సనువాటి లాగే అసంతృప్తికరంగా వున్నాయి. వాళ్ళ చరణాలు ఆ దినసరి గద్య నుండి పద్యాకృతి పొందడానికి తగిన పరిణామం పొందలేదు. అందులో అంత్యప్రాసము బలవంతంగా తెచ్చిపెట్టుకొన్నట్లు వుంటుంది. ఇద్దరిద్దరి కాళ్ళు కలిపేసి కట్టిన మూడు కాళ్ళ పరుగుపందెంలా వుంటుంది వాటి గమనం. స్వల్పకాలజీవితవ్యవధిలో ఆయన చేసిన రచన అంతటిలాగే అవీ అంతంతమాత్రంగానే వున్నాయి. కంకార్డు.సాహిత్యప్రపంచంలో వున్న కొఱతే అందులోనూ వుంది. ఇతని కవిత ఇంకా పాకంలో పడలేదన్న ఎమర్సనులాగే ఇతడుకూడ వేదికలేని పురోహితుడు; పాండిత్యాన్ని నిరసించే పండితుడు; ఒకవిధమైన విశృంఖలమైన అరాజకాన్ని మెచ్చుకునే కఠినాత్ముడు. హార్వర్డుకి వెళ్ళిన అల్లాటప్పయ్య. అతని వ్యక్తిత్వంలోని ఆ చివరా ఈ చివరా బాగా ముడిపడలేదు. తన బ్రతుకు తాను బ్రతికి తన రచనలో వ్యాఖ్యానించుకోవాలి అనుకునే ఆయన కోరికను మనము మన్నించగలము కాని తన రొట్టె తాను తినేసి అది మళ్ళా తన దగ్గర తాజాగా వుండా లనుకునే 'ట్రాన్సెండెంటల్' మన స్తత్వ మొకటి ఆయనలో వుందని అనుమానపడతాము. ఎమర్సను సమ్మతినీ, ఆశయాన్నీ ఒకప్పుడు నుందంగా, ఒకప్పు డొక ఆవేగంతో ఒక్క ముడి బిగించాలని అనుకొనేటట్లే థోరో తన వాలకాలు మారుస్తా డనుకుంటాము. అయితే అతని రచన "A Week on the Concord and Merrimack" ను సమీక్షిస్తూ "మన మొక నదీతీరపు విందుకు ఆహ్వానింపబడ్డాము. అక్కడ ఉపదేశం పొందడానికి కాదు" అని వ్రాసిచ్చిన మాట స్ఫురించాక ఊరుకుంటాము. ఏమి ఉపదేశం! ఏమి విందు! ఏమన్నా సరే

థోరో సాహిత్యం లోకోత్తరమైనది. వాల్డెన్ అయితేనేమి, తక్కిన రచనలైతేనేమి అమెరికాలో ఒక ప్రాంతంలోని మానవులు కొందరైనా ఆ సమీపారణ్యసీమల్లో సర్వేశ్వరుడిని కనుకోవడం సాధ్యమవుతుం దని విశ్వసించిన సత్తెకాలపు మనోజ్ఞదృశ్యాల స్మృతిప్రతీక లవి. అమెరికనుల కెప్పుడూ మరపురాని వారి భావాలపై స్వారిచేసే దృశ్యా లవి. అందులో పరుసవేదివిద్య ఎంత అసంగతమైనదో అంత అసంగతత్వమూ వుంది. అయితే మనం ఆ సంగతి పట్టించుకుంటే ఏవంవిధాన్వేషణ లన్నిటను గర్భితమైవుండే శాశ్వతమైన మానవాశయ మధురస్ఫూర్తి చేజారిపోయిన వార మగుదుము.

## నెథేనియల్ హాథార్న్

కంకార్డు నివాసానికి వచ్చాక 1842 లో ఒకనాటి మధ్యాహ్నం థోరోతో కలిసి నదీతీరానికి వెళ్ళేడు హాథార్న్. అతడు థోరోకడ ఒక పడవ కొన్నాడు. అది గడవేసి నడపాలని అతని ప్రయత్నం. సాధ్య పడటం లేదు. అత నంటాడు గదా—

"ఫలాన దిక్కున నడవా లని మనం గట్టిగా సంకల్పంచేసుకుంటే చాలు పడవ దానంతట అదే నావికుని ఉత్సాహశక్తి నాకర్షించుకొన్న దానిలా ఆ వేపు వెళ్ళిపోతుందని హామీ యిచ్చాడు థోరో నాకు. అది అతనిపట్ల యథార్థమైతే కావచ్చును కాని నా పట్ల ససేమిరా కాదు. పడవ దెయ్యంపట్టినదానిలా అటూ యిటూ అన్ని పక్కలకూ తిరుగుతోంది కాని అనుకున్న వేపుకి మాత్రం తిరగటం లేదు."

ఈ పిట్టకథ ఇద్దరి స్వభావాలనూ పట్టి యిస్తోంది. తన చేతులతో పడవను తయారుచేసి థోరోయొక్క స్థిరసంకల్పకౌశలాలు, హాథార్న్ యొక్క సగం సగం చింతాసంతోషాలు, జీవితగమనంలోని వక్రత్వాలను పట్టించుకొనే తత్త్వం విశదమైనవి.

అతనికీ థోరోకీ, లేక ఎమర్సనుకీ గల తేడాలు విస్తృతమైనవి. వాళ్ళిద్దరికీ ప్రకృతి అంటే అదీ మానవుడికి నిజమైన నివాసం అని విశ్వాసం. అతనికి మట్టుకు ప్రకృతి చాలా అందమైనదేగాని దానికీ మానవుడికీ సంబంధం లేదని అభిప్రాయం. పాపము, విధి, నరకము—వీటిగురించి చిర కాలానుగతంగా మానవులు పడుతున్న భయాలూ, బాధలూ అవన్నీ అనావశ్యకాలని వారి వుద్దేశం. 'Spiritual Laws' లో ఎమర్సను వ్రాసినట్లు—"అవి వాటికోసంగా త్రోవతప్పని మానవుని మార్గంలో చీకటి ప్రసరింపలేవు. ఆత్మపాలిటికి గడ్డురోగా లవి." అవిగాని ఒకసారి ఒక మానవుడిజీవితంలో ప్రవేశించాయో మరి వదులుకోడానికి మార్గాం తరం కనపడదు.

ఎందుకు వాళ్ళ కీ తేడా లేర్పడ్డవో ఊహించి లాభంలేదు. ఎమర్సను ఇంటిప్రక్క నిర్బంధంలో వున్న పిచ్చిదాని అరుపులు వినాలంటే కిటికీ తలుపు తెరవాలి (లేకపోతే తెరవాల్సిన అవసరం లేదు. అంటే అంత ఏకాంతంగా, ప్రశాంతంగా బ్రతుకుతున్నా డతడు.) ఆయనభార్య, కొడుకూ మరణించారు. అయినా ఎటు చూసినా అతనికి జీవితంలో పొందికే కని పించేది. హాథార్న్ జీవితంలో విషాదఘట్టాలు బాగా తక్కువనే చెప్పాలి. అయినా విధి మందంగానైనా తనమీద పనిచేయడం గమనించాడు. మరి ఆ తేడాకి అందరికీ తెలిసిన ఒక సమాధానం ఏమంటే — ఎమర్సను ట్రాన్సెండెంటలిస్టు. ట్రాన్సెండెంటలిజమ్‌యొక్క స్వేచ్ఛాసూత్రాల నామోదించలేకపోయాడు హాథార్న్; వెనుకటి న్యూఇంగ్లండు భీకర ధోరణే బాగుందనుకున్నాడు. ఈ సమాధానం సామాన్యమైనది. అతడు బ్రూక్ ఫార్మ్‌లో కొన్ని నెలలున్నాడు. దాని ఆశయాలను "The Blithedale Romance"లో విమర్శించాడు. "The Celestial Railroad" లో ట్రాన్సెండెంటలిజమ్‌యొక్క గుట్టుమట్లను విమర్శిం చాడు. అతనిని విషాద మింకా పట్టుకు వ్రేలాడలేదు. సేలమ్‌లో భూత విద్యావిశారదుడుగా వుండిన అతని పూర్వికుడైన జాన్ హాథార్న్‌పీడ కొంత

కాలం అనుభవించాడంటే ట్రోల్లోప్ నవలలు చదివి అందలి పుష్కలమైన వాస్తవికతకు సంతోషం పొందేడు. అదిగాక ఎమర్సనుతోను, మరి కొందరు ట్రాన్సెండెంటలిస్టులతోను అతనిలో కొంతభావసామ్యంకూడా వుంది. వాళ్ళవలె చిన్న వస్తువులలో పెద్ద తత్త్వం చూడటానికి ప్రయత్నించేవాడు. చుట్టపొగ చూసినప్పుడు సముద్రంయొక్క ఆటుపోటుల గురించి ఆలోచిస్తూవుండేవాడట ఎమర్సను. ఒక భౌతికమైన సత్యాన్ని గాని, అద్భుతాన్నిగాని చూసి దాని విశేషార్థాలనుగురించి అలా ఊహాలు చేస్తూ వుండేవాడట హాథార్న్:

"ఒక మహానగరంలోని ప్రముఖమైన పొగగొట్టంగురించి ఆలోచనలు,—సరఫరా ఆపివేస్తే ఏం జరుగుతుంది?...అప్పుడు మరోదానికి చిహ్నంగా తీసుకోవచ్చు."

Emblem (చిహ్నము), Symbol (చిహ్నము, లేక సంకేతము), Moral (నీతి), Analogy (సామ్యము), Type (రీతి, లేక ప్రకారము), Image (అభివ్యక్తి): హాథార్న్‌కి ప్రియమైన మాట లివి. అతడు "ప్రతి ప్రాకృతిక సత్యమూ ఒక ఆధ్యాత్మిక సత్యానికి సంకేతము" అనే ఎమర్సనుగారి ఆభాణకముతో ఏకీభవిస్తాడు.

ఇలాంటి పోలిక లెన్ని వున్నా, ఎమర్సనుకీ, హాథార్న్‌కీ కొన్ని ముఖ్యవిషయాల్లో గట్టితేడా లున్నాయి. మొదటిది హాథార్న్ ఆలోచనలన్నీ సంఘంమధ్యనున్న మనిషిగురించి; ప్రకృతిలోని మనిషిగురించి కాదు. అతడు తీసుకొన్న ఇతివృత్తం ప్రత్యేక మొక వ్యక్తికోస ముద్దేశింపబడినట్లున్నా పటుతరసన్నివేశాల్లో పాత్రల సమ్మర్ద మెప్పుడూ వుంటుంది. రెండవది—హాథార్న్‌నోటుపుస్తకాలను ఎమర్సనుగారి ఘనతరములైన దినసరులతో సరిపోల్చడం సమంజసం కాదు. కాని ఏ విషయాన్నీ ఎమర్సనంత నొక్కివక్కాణించడు హాథార్న్. ఈయన పృచ్ఛలైతే చేస్తాడు గాని సమాధానం అరుదుగా చెబుతాడు. ఫలితంలో విశ్వాసం లేకుండా

అన్వేషిస్తాడు. మూడవది—.ఎమర్సను ఎప్పుడూ గమనించని మారుమూల దారుణసమస్యలతో సంబంధం పెట్టుకొంటాడు. నాల్గవది—ఇతడు నవలా రచయిత. అంచాత రచనాశిల్ప సూత్రాలతో ఎమర్సనుకంటె ఎక్కువ ప్రమేయం వున్నవాడు. అందువల్లను, స్వభావంచేతను సూచనాప్రాయంగా కథాంశాల నున్మీలనంచేసే ఒక ప్రయోగదృష్టి గల రచయిత అతడు.

"అంతకన్నా ఆత్మవిశ్వాసం గలిగివుండగలడా అతడు?"—ఇది హాథార్న్ జీవితచరిత్రలో హెన్రీ జేమ్సు వేసిన ప్రశ్న. అవును, ఆ రోజుల్లో ఒక న్యూఇంగ్లండువాస్తవ్యుడుగాని, మరే అమెరికన్ గాని తగిన కళానుభవం లేని ఆ దేశంలో సంతృప్తికరమైన నవల వ్రాయగలడా? హాథార్న్ ప్రయత్నం క్లిష్టమైనదే. కాని అసంభవమా అది? అతనికి ముందు కూపర్, ఇర్వింగులు అమెరికన్ రంగాన్నీ, యూరపియన్ రంగాన్నీ తీసుకుని కొంత సాధించారు. ఇతనికి సమకాలంలోనే అయథార్థములైతేకావచ్చునుగాని అద్భుతమైన ఊహాప్రపంచాలను నిర్మించాడు ఎడ్గార్ పో. బహుశా హాథార్న్ చిత్రించిన అమెరికాలో లోపించిన విషయాలను లెక్కవేస్తూ అతనిలో వస్తుపుష్టి లేదంటాడు హెన్రీ జేమ్సు. అది మోతాదును మించిన మాటే. ఎందుచేతనంటే, హాథార్న్ నోటుపుస్తకాలు తీసిచూస్తే అందులో కావలసినన్ని కథావస్తువులున్నాయి. న్యూఇంగ్లండు సమాజం పేలవమైనదే కావచ్చుకాని అది మార్క్ట్వెయిన్ నివాసం అయిన మిస్సోరికంటె సౌష్ఠవం గలదే. అయితే మరి హాథార్న్‌కి సంకోచం దేనికీ అంటే అదొక అనిశ్చిత పరిస్థితుల సమష్టినుండి ఉద్బుద్ధమైనది. కూపరుఇర్వింగులు నవలా రచయితలుకారు; వారినుండి హాథార్న్ గ్రహించగలిగింది తక్కువ. ఛార్లెస్ బ్రాక్డెన్ బ్రౌను విషయంలోనూ అంతే. నిజానికి న్యూఇంగ్లండు వాస్తవ్యుడికి తన ఉద్దేశాలు ప్రకటించుకోవడానికి ఉపన్యాసము, పద్యకావ్యము, దినసరి అయితే పరిచితములైనవే కాని నవలమాత్రము మొదట్లో కొంత శంకావహమైన ప్రక్రియ అయినది.

The Scarlet Letter ఉపోద్ఘాతంలో తనగురించి పూర్వీకు లనుకుంటే ఎలా అనుకోడాని కవకాశం వుందో ఊహించి తమాషాగా ఇలా వ్రాశాడు:

" 'వీ డేం చేస్తున్నాడు?'అని మా పితృదేవతల నీడ ఒకటి మరోనీడతో గొణిగింది. 'ఏమిటీ! కథల పుస్తకాలు వ్రాస్తాడా! ఇదేం పని? ఒక దైవ ప్రశంసా? మానవసేవా కార్యమనా? ఎలాగూ చెడిపోయినవాడు ఫిడేలు వాయించుకుని బ్రతకవచ్చునే!' "

మిస్సోరిలో నిజంగా ఫిడ్లరు సంఘానికి పనికివచ్చేవాడికిందే జమ. అక్కడ మార్క్-ట్వెయిన్ వంటి వార్తాపత్రికా హాస్యకారుడుగూడ ఆదరింపబడతాడు. పశ్చిమ ప్రాంతీయుల కయితే అతడు గౌరవాస్పదు డైన వ్యక్తే. అయితే హాథార్న్ మాత్రం, అతనివలెకాక అస్పష్ట మార్గం లోనే దేవులాడేడని చెప్పాలి. సాహిత్యంలో నీతిబోధకు అలవాటు పడి పోయారు న్యూఇంగ్లండు వాసులు. మితిమీరిన నీతిబోధ నవలకు చెఱుపు. నవలా రచయిత కాబోయేవాడిని (19వ శతాబ్ది వాళ్ళనుకొన్నట్టు)అమార్గం పట్టించే చెట్టచెడు లక్షూశ్లాంటి వా ళ్ళిద్దరున్నారు: బన్యను, స్పెన్సరు. హాథార్న్ వాళ్ళపాల బడ్డాడు. ఇంకేముంది, ఒక వస్తుధ్వని ప్రక్రియ (Allegory) లో సగం మునిగి పోయాడు; మరెన్నటికీ తేలలేక పోయాడు.

మిగతా సగమూ—తోడిమనుషుల చేష్టల్లో, ఉద్దేశాల్లో,వారి న్యూ ఇంగ్లండు దృశ్యాల్లో కలిసిపోయిన 'సామాన్య ప్రపంచం' (The ordinary world అని ఆయన తరచు అంటూ వుంటాడు) లో మిగిలేడు. ఆ సగంలో హాథార్న్ అంత కల్పనాశక్తిగలవాడిలా కనిపించడు. అతని నోటుపుస్తకాల్లోని వ్యక్తిస్వభావచిత్రణలు కాస్త చప్పగా వుంటాయి. ఎవరి ప్రవర్తనలను గురించి అతడు వ్రాతలు వ్రాసుకున్నాడో ఆ మనుషుల స్వరూపాల కౌక పరిపూర్ణత్వం ఏర్పడలేదు. ఒక నాటకాల సంస్థ నటులను

పొగుచేసినట్టు వాళ్ళను పొగుచేస్తాడు. వాళ్ళు ఏవో నాలుగు మాటలనడానికి నిరీక్షిస్తూ చుట్టూ నిలబడిన వాళ్ళలా వుంటారు.

ఆ రెండు భాగాలనూ కలపడమే హాథార్న్‌కి సమస్య అయిపోయింది. అంటే యథార్థానికీ కల్పితానికీ కలుసుకోవడాని కనువైన ఒక తటస్థ పీఠాన్ని ఏర్పరచాలి. చింతకు తావైన చోట వాటి సమావేశమతని కసమ్మతమైనందున ఆ సమస్య మరీ క్లిష్టమైపోయింది. అమెరికా యొక్క యోగ్యతలలో, ఉల్లాసకరమైన వాతావరణంలో క్రొత్తదనంలో ఆయనకు నమ్మకం వున్నది. (ఆశ్చర్యం—ఈ విషయంలో ఎమర్సన్ థోరోల కంటెకూడ ఆయన యెక్కువ దేశభక్తి గలవాడు.) అతని ప్రకటన కర్తలూ, పాఠకులూ అతనిని వెలుగులోకి రమ్మని ఒత్తిడి చేశారు. కాని ఎలా రావడమో అతనికి తెలిసింది కాదు. అవును మరి, అతని సంకేతాలన్నీ వాటి శక్తిని— 'Mosses from an Old Manse' సమీక్షలో మెల్విల్ అన్నట్టు—'స్వాభావికమైన దుర్నీతి', 'మౌలికమైన పాపం' గురించిన కాల్వినిస్టు తాత్పర్యంనుండి పుంజుకున్నాయి. ఆ దుర్నీతి, పాపం ఎలాంటి వంటే "వాటి ఘటనలనుండి ఆలోచన గల మానవు డెవడూ పూర్తిగా తప్పించుకోలేడు."

The Marble Faun లో హాథార్న్ రోములోని ఒక భవనం గురించి ఇలా అంటాడు:

"ఆ జెయిలు కటకటాల్లాంటి ఇనపకడ్డీల కిటికీలూ, విశాలమైన విలువంపుసరంబితో వెలుపుగోల్పే దేవిడీద్వారమూ అక్కడున్న రంగు పూతల దేవదారుపెట్టెలకంటె ఎక్కువగా చిత్రకారుడి నాకర్షిస్తాయి; అతని తూలికకు సార్థకమైన పని కల్పిస్తాయి. అతడేగాని అమెరికన్ అయితే అతని దేశీయు లెందరో హాయిగా జీవించి అభివృద్ధి పొందవచ్చు. కాని ఒక జాతియొక్క జీవితం కవియొక్క ఊహనుగాని, చిత్రకారుని కన్నునుగాని మోహపెట్టిం దంటే ఆ క్షణంనుంచి అది వినాశాభిముఖంగా పోతోం దనుకోవచ్చు."

అదే తన దేశమే అలాంటి పతనం పొందిందంటే ఒప్పుకోలేదు హాథార్న్. The Marble Faun ఉపోద్ఘాతంలో అమెరికా అంటే- "అక్కడ ఛాయలులేవు, ప్రాతలు లేవు, వింతలు లేవు...ఉన్నదల్లా ఒక గొప్ప వెలుగుబాటలో పురోగమించే సర్వజన సాధారణమైన శ్రేయోభి వృద్ధులు మాత్రమే." అందుచేత సమకాలికమైన అమెరికాలోని ఆనందో త్సాహ స్థితికి కాల్వినిజమ్‌ను సరిపుచ్చే ప్రయత్నంలో ఒక చింతాసంతో షావహమైన మనఃస్థితిని సాధించడానికి సాయశక్తులా కృషి చేశాడు హాథార్న్. 1850 లో, శ్మశానాలమీద ఒక వ్యాసం వ్రాయాలని సంక ల్పించి అతడు తన నోటుపుస్తకంలో వివరించిన ఆశయాల్లో కొన్ని సరసం గానూ, కొన్ని గంభీరంగానూ వుండడమే ఇందుకు నిదర్శనం. ఇంకాఅతడు వ్రాసిన మరి కొన్ని కథలు, గల్పికలు, 'The Blithedale Romance' లోని ప్రాసంగిక విషయాలు, 'The House of the Seven Gables', 'Our OldHome' లోని ఆంగ్లేయ స్త్రీలను గూర్చిన పరిహాసధోరణి, పిల్లల పుస్తకాలు—ఇన్నిటిలోను ఆహ్లాదం కలిగించే గుణమూవుంది; అత డాశించిన గంభీరార్థస్ఫూర్తిని కలిగించే గుణమూ వుంది. ఒకేసారి సరస గంభీరధోరణులు రెండూ ప్రదర్శించడం అతని కంత చేత నయింది కాదు. ఎప్పుడెప్పు డేధోరణి అవసరమో ఆ ధోరణే నిర్ణయించు కున్నది. అదే అతనిని అతడు తన ప్రియమైన మాతృభూమిలో ఉన్నా యంటే ఒప్పుకోని ఛాయల్లో, పాత్రల్లో ముంచేసింది.

ఆ యథార్థత, కల్పన అన్నవి అతని నోటుపుస్తకాలలో చెదరుగా వున్న కథానూచనలలో ఒకదాని తరువాత ఒకటిగా కనిపిస్తాయి. అందులో ఒక చివర హెన్రీజేమ్సుకి ఆసక్తి కలిగించిన సన్నివేశ మొక టున్నది:

"ఒక ఆడపిల్ల—యోగ్యురాలే కాని చూపరులను ముగ్ధులను చేసే మోహన రూపవతి - ఒక పురుషుడిని గమ్మత్తుచేయడానికి ప్రయత్నించుట; వాడదిగ్రహించి ఒక ప్రతియుక్తి పన్నుట; ఆమెయే వానికి వశమైపోయి నాశనమగుట—ఇదంతా ఒక పరిహాస ధోరణిలో."

మరో చివర ఇలా ఉన్నది: "ఒకడు మిణుగురులను పట్టుకొని ఇంటిలో నిప్పు రాజవేసుకొనుటకు ప్రయత్నించుట—ఇది ఏదో ఒకదానికి సంకేతముగా ఉండగలదు. లేక "రకరకాల గాలులకు (వడగాలి, ఈదురుగాలి మొ॥) మనుష్యగుణారోపణము చేయుట."

ఇవి చూచేసరికి ఒక్కసారి మనం కల్పిత జగత్తులోకి నెట్టివేయబడతాం. ఇక తక్కిన సూచన లెలాంటివంటే: ఒక పిచ్చిపట్టిన సంస్కర్త—ఎన్నడూ ప్రేమలోపడని నాయకుడు - వెన్నెట్లో భూతం - నిర్భరమైన ఏకాంతత—రెండు దెయ్యాలు పూనిన దేహం - అద్దంలో ప్రతిబింబాలు తిరోగమించుట—రక్తం చల్లబడుట - బహిరంగ రహస్యము - నెత్తురు చారల అడుగు జాడ - విష పదార్థాలతో నిండిన పూటకూటి యిల్లు. ఇందులో కొన్ని ఒక భయానక కథయొక్క సంచికట్టులోని సామగ్రిలా వున్నాయి. ఒక అగాధంవంటి అసంగతత్వంలోకి కాలుజారిపోయే ప్రమాదం ఎప్పుడూ వుంది హాథార్న్‌కి. ఆ సంగతి అతనికీ తెలుసు.

అతని యౌవనదశ సేలమ్‌లో క్రమంగా గడిచి పోతూవుంది. తన శక్తిలో తనకే నమ్మకం లేక, తన ఆశయాల గమ్యం తెలీక ఆ నోటు పుస్తకంలో గిలికిన పంక్తులనుండి ఏవేవో కథలూ గల్పికలూ తయారు చేశాడు. ఒకప్పుడు తన వ్రాతలను తానే చింపేసేవాడు. అచ్చుకెక్కితే తన పేరు గుట్టుగా వుంచేవాడు. ఒకొక్కప్పుడు ఆసక్తి కోల్పోయి, చికాకు పడుతూ, తనను ప్రజలు గుర్తించడం లేదని బాధపడుతూ వుండేవాడు. కాని క్రమంగా పేరుచేసుకోవడం ప్రారంభించాడు. ఎడ్గార్ పో అతన్ని ఒక సమీక్షలో మెచ్చుకున్నాడు. అందులో సాహిత్య ప్రక్రియగా కథానిక అంటే తన కున్న విశ్వాసాన్ని సూచించారు. పో గ్రహించినట్లుగా, Twice-Told Tales, Mosses from an Old Manse అనే రచనలు నిరూపించినట్లుగా 'సత్తైకాలపు హాథార్న్' ('Harmless Hawthorne' అని మెల్విల్) విలువా, విశిష్టతా గల రచనలు చేస్తున్నాడు: Fire Worship, Buds and Bird Vo-

ices మొ॥ సాంకేతిక వ్యాసాలు, The Celestial Railroad మొ. వ్యంగ్య రచనలు. ఇక కథలో సర్వవిధాలూ—న్యూ ఇంగ్లండు చరిత్రలో అభూతకల్పనలు, యథార్థ మనోజ్ఞ దృశ్యాలూ ఎన్నెన్నో చిత్రించాడు. అందులో కండగల కథలు కొన్ని వున్నాయి. వాటి కారక్తి కట్టించే శక్తి బహుశా అతని మృదుమధుర వచనశైలివల్లనే వచ్చి వుంటుంది. అతని 'The Gentle Boy' అనే కథలో, పాపం, ఒక 'క్వేకర్' కుర్రాడిని పట్టుకొని కిట్టని న్యూ ఇంగ్లండు గడుగ్గాయిలు రాళ్ళు రువ్వి కొడతారు; అతడు నేస్తం కట్టిన ఒక పిల్లవాడతడిని మోసం చేస్తాడు. 'Egotism'లో, లేక 'The Bosom Serpent' లో భార్యతో వేరుపడిన ఒకాయన తన లోపల ఏదో ఒక పాము వుండి తనను కొరుక్కు తింటున్నట్లుగా అనుకుంటాడు; మళ్ళా తన భార్యను కలుసుకొని, తన చెడుగు లన్నిటినీ మరిచిపోయినప్పుడే అది అతనిని వదిలి పెడుతుంది. 'Young Goodman Brown' అనేది హాథార్న్ కథలన్నిటా ఉత్తమమైనది. అందులో న్యూ ఇంగ్లండు యొక్క ప్రాథమిక దశను చిత్రిస్తాడు. బ్రౌను అనే యువకుడు ఒక మాంత్రికుల 'సేబత్'కి హాజరవుతాడు. అక్కడ ఆ కూటంలో ఊళ్లోని పెద్దలే కాక తన భార్య 'ఫెయిత్' కూడా వున్నట్టు గుర్తిస్తాడు. గర్వము, అసూయ, పశ్చాత్తాపము అతని పాత్రలను చికాకు పెడతాయి. ఆలోచనలేని మనుషులతో కూడిన సమాజం అలాంటి అసాధారణ వ్యక్తులను బహిష్కరిస్తుంది. అయినా లోకంలో మంచివాళ్ళుంటూనే వుంటారు. కాని ఒక్క పాపం మాత్రం క్షమింపరానిది: మిగతా మానవ సమాజం నుండి కోరి వేరు పడడం అనే పాపం. ఇందు నిమిత్తమే Ethan Brand ఆత్మహత్య చేసుకున్నాడు; Rappaccini తన కూతురిని వదులుకోవలసి వచ్చింది; చాలా కాలం క్రితం Roger Malvin ను చావడానికి వదిలేసి వచ్చినందుకు పరిహారమా అన్నట్లు Reuben అనుకోకుండా తన కొడుకును తానే చంపడం జరిగింది. ఇలా హాథార్న్‌కి పనికివచ్చే సంకేతం దొరికిందా వెంటనే దానితో ఒక కథకు మెట్లు కట్టేస్తాడు.

అలాంటి దొంక సంకేత మాయనను బాగా ఆకర్షించుకొన్నది. 1837 లో "Endicott and the Red cross" లో 17వ శతాబ్ది సేలంలో ఒక మందవంటి సమాజం మధ్య నివసిస్తున్నదానిగా ఒక స్త్రీ గురించి యిలా వ్రాశాడు:

"ఒక యువతి - సౌందర్యవతియే - తన గౌనుమీద ఎదురుగా కనిపించేటట్లు 'A' అనే అక్షరం ధరించడం వల్ల పతనం పొందింది...తన అప్రతిష్ఠతో ఆటలాడుతూ అభిమానం దెబ్బతిన్నందువలన వచ్చిన తెంపుతో ఆ ఘోరమైన లాంఛనాన్ని ఎఱ్ఱని గుడ్డమీద పచ్చని పట్టు దారంతో నాజూకైన పనితనంతో కుట్టుకుని తగిలించుకొన్నది—ఆ "A" అన్న అక్షరం 'Admirable' (అంటే పొగడదగిన) అని అర్థం కావాలని వుద్దేశమై వుంటుంది. 'Adulteress' (వ్యభిచారిణి)అని కాకుండా అర్థ మేదైనా సరే కావచ్చును."

అదే సంకేతం గురించి మళ్ళా ఏడేళ్ళు పోయాక నోటు పుస్తకంలో వ్రాసుకున్నాడు, 1847 లో తన యశఃపతాకయైన The Scarlet Letter రచన ప్రారంభించాడు. అలాగు అక్షరాలు కుట్టుకునే ఆచారం ఒకటి వలసకాలంలో న్యూ ఇంగ్లండులో నిజంగావుండేది. 'Drunkard' (త్రాగుబోతు)కి 'D' అనీ, ఇంకా విడ్డూరం—'Incest' (వావివరుసలు తప్పిన వ్యభిచారము)కి 'I' అనీ వుండినట్లు ఆధారాలున్నాయి. అవి సరిగా అతని అలవి కందే వస్తువు, నీతి—వీని సమ్మేళనాన్ని సమకూర్చేయి. ఈ గ్రంథంలో ఒక ప్రత్యేక ఫక్కీ వున్నది. ఒక 'బహిరంగ రహస్యం' వున్నది. దాని నిర్మాణం చాలావరకు సమగ్రంగానే వున్నా, అంతకంటె ఎక్కువ సందేహాలతో అవతరించిన గొప్ప పుస్తకాలు కొద్ది మాత్రమే. డబ్బుకోసం ఆయన పడిన యిబ్బందులే అతని నా కథ మీద మనస్సును పూర్తిగా లగ్నం చేయనివ్వకుండా చేశాయి. ఆ కథ యొక్క దారుణతత్త్వం ఆయనకు వ్యసనం కలిగించింది. దానిని మరి కాస్త ఆకర్షకంగా చేయడానికని 'సేలం కస్టమ్ హౌస్'

గురించి ఒక పెద్ద పీఠిక వ్రాశాడు. అతని అపరిణత రచన Fanshawe ను అలా వుంచితే, అతడు పత్రికలకు వ్రాసిన కథల కంటె పెద్దవి మరి వ్రాయనేలేదు. ప్రకటన కర్త తొందరపెట్టి వుండకపోతే ఆ Scarlet Letter అయినా ఒక నవలగా పూర్ణస్వరూపం దాల్చి వుండేది కాదు.

అతని రచనలలో సర్వోత్కృష్టమైన దది. అది The Marble Faun వలె అనవసరంగా ప్రపంచింపబడిన వట్టి మిడి మిడి రచన గాక చదవడానికి చవిగొల్పే సార్థకమైన నవల. అందులో ముఖ్యమైనవి మూడే మూడు పాత్ర లున్నాయి—పెర్ల్‌ను గూడా మనం చేర్చాలనుకుంటే నాలుగు. ఆ మూడూ పెర్ల్ తల్లి హెస్టర్ ప్రిన్నే అనే వ్యభిచారిణి; పగ పట్టిన ఆమె ముదుసలి భర్త రోజరు; ఆ బిడ్డ పుట్టుకకు కారణమైన పుణ్య మూర్తి, ఉపరి మతగురువు, చేసిన పాపాన్ని చెప్పకుండ దాచిపెట్టి మనో వ్యథలకు గురియైన యువకుడు డిమ్మెస్‌డేలు. సుఖపరాయణ, సుతపరా యణ అయిన హెస్టర్ తన పాపానికి పశ్చాత్తాపము పొంది ప్రశాంతంగా వార్ధక్యాన్ని వెళ్ళబుచ్చుతుంది. పురుష పుంగవు లిద్దరూ-ఒకరు అంత రాత్మవల్లను, మరొకరు దారుణ ప్రతీకారవాంఛచేతను చిత్రహింసకు గురి అవుతారు. ఈ ఒక్క పొంకమూ బింకమూ గల నవలలో హాథార్న్ తన సమస్యలన్నీ పరిష్కరించుకోగలుగుతాడు. Marble Faun లో యూరపియను దుర్నీతితో ముడిముడిగా భేదనిరూపణం చేయబడిన అమెరి కనిజమ్‌ను వదలిపెట్టి ఇందులో తన మూడు పాత్రలను వలసకాలపు బోస్టను వాస్తవ్యులుగా చేస్తాడు. అమెరికన్ ప్రస్తుత స్థితిని కంటె గత కాలాన్ని చాలా వాస్తవికతా ప్రతిభాసతో చిత్రించడంలో ఘనుడు హాథార్న్. ప్రకృతాన్ని చిత్రించేటప్పుడు బహిరంగవిషయాలనే గ్రహించ లేక పోతాడు. అతని గతకాల పరిజ్ఞానం వల్లనే The House of the Seven Gables అన్వర్థంగా భాసిస్తుంది. అందులోనూ, The Blithedale Romance లోనూ 'అవి కల్పిత కథలు సుమండీ, వాటిలో వాస్తవికతను అద్దాలుపెట్టి చూసుకోవలసిందే' అని హెచ్చరిస్తూ సమ కాలికత్వ ప్రత్యయం చుట్టూ యుక్తి పన్నుతాడు.

Scarlet Letter చాలా గొప్ప నవలే అయినా అతడు వాడిన సంకేతాలకు సంబంధించినంత మట్టుకు చిన్న చిన్న లోపాలున్నాయి. వాస్తవికతతో ససేమిరా సరిపడని ఇతివృత్తాన్ని నిలద్రొక్కుకోవడంకోసం పాత్రలకు పైపూతలు పూసే లోతుకు పాతుకుపోయిన లోప మొకటి వున్నదని పో, ఆ తరువాత హెన్రీ జేమ్సు వక్కాణించారు. ఆ విషయాన్నే ఎమర్సన్ మరొక మాదిరిగా అన్నాడు: "హాథార్న్ తన బాణీ బట్టబయలయ్యేటట్టు మరీ తన పరిశీలన లోలోపలికి పాఠకులను రమ్మంటాడు. రొట్టెల అంగడివాడు ఖాతాదారులతో 'ఇక మనం రొట్టి చేసుకుందాం' అంటే ఎలా వుంటుందో అలా వుంది ఇది." Scarlet Letter కి వ్రాసిన ఉపోద్ఘాతంలో ఆయన చేసిం దిదే. గ్రంథం లోపల కూడ అదే పనిగా దేవులాడుతాడు సంకేతాలకోసం. ముఖ్యసంకేతం-హెస్టర్ అక్షరాన్ని గుండెపై ధరించడం దివ్యంగా వుంది. అయితే చీకటి ఆకాశంలోగాని, డిమ్మెస్‌డేల్ కండమీద గాని ఒక పెద్ద 'A' వుంటే కాదనడు హాథార్న్. చాలా అరుదుగా భావానికి వ్యంగ్యస్ఫూర్తి కలిగించగలుగుతాడు. సర్వసాధారణంగా వాచ్యంగా వివరించేస్తాడు: ఉదా॥ 'The Gentle Boy' నుండి:—

"The two females, as they held each a hand of Ibrahim, formed a practical allegory; it was rational piety and unbridled fanaticism contending for the empire of a young heart."

[చెరో చేతా ఆ ఆడంగు లిద్దరూ ఇబ్రహీమును పట్టుకోవడం స్పష్ట దృష్టాంతమై పోయింది. ఒక యువకుని హృదయ సామ్రాజ్యం కోసం అర్హ విశ్వాసమూ, పట్టపగ్గాలు లేని స్వమతదురభిని వేశమూ పడే పోటీ అది.]

చకచక సాగుతున్న కథ హఠాత్తుగా చవకబారు మాటల్లో కుంటుపడుతుంది. అవి రక్తిని చెడగొట్టుతవి. సత్యాసత్యోహాల విపరీత

సమ్మేళనం అతని 'The Birth-mark'ను చెడగొట్టింది. 'Drowne's Wooden Image' అనే కథ గూడ అలాగే చెడింది. 'Marble Faun' లో డోనాటెల్లో అనే బొచ్చుచెవుల పెద్ద మనిషి ఒక యుక్తమైన పాత్రగా గాని, సంకేతంగా కాని స్వీకరింపబడలేదు. 'The Blithedale Romance' కొంత మంచి గ్రంథమే కాని విసుగెత్తించే సంకేతాలతో దాని రక్తికూడా చెడింది. జెనోబియా దాల్చిన విజాతీయమైన పుష్పం, వెస్టర్‌వెల్ట్ పెట్టుకొన్న కృత్రిమ దంతాలూ హాథార్న్‌యొక్క తక్కిన విదితనిదానాల (Obvious Motifs) వలెనే పాఠకుడికి 'Peter Pan' లోని అలారంవాచీ మొసలిని జ్ఞాపకం చెయ్యగలవు. 'The Scarlet Letter' తరువాత ఆ స్థాయికి చెందిన నవల 'The Seven Gables'. ఇందులో హాథార్న్ పడిపోతూ వున్న ప్రాత యింటినీ, దురాశయుడైన పించియన్‌నీ సాంకేతికరచయితగా కంటె నవలారచయితగానే బాగా చిత్రిస్తాడు. (అంటే వాస్తవికతను సాధించడంకంటె అతనికి మోక్షం వేరే లేదని చెప్పడం కాదు. కల్పన అంటే మనఃస్ఫూర్తిగా ఆత్మప్రత్యయం పొందినప్పుడుగూడ అత డత్యుత్తమ రచనలు చేయడం కద్దు. అందుకు 'The Snow Image' తగిన తార్కాణం.)

'The Scarlet Letter' లో లేదు గాని 'జనసామాన్యం' గురించి హాథార్న్‌కి గల ఉద్దేశానికి సంబంధించి ఒక ప్రముఖమైన దోషం వుంది. సామాన్యత్వం అన్న దతని ప్రమాణం. అసాధారణత్వ మంటే అనుమానం. మనుష్య లోకరి జోలి కొకరు పోకూడ దనుకొంటాడు. ఈథన్ బ్రేండ్‌వలె చిల్లింగ్‌వర్త్ చేసిన పాపమేమిటి? కఠినుడై మానవ హృదయాని కుండదగిన పవిత్రస్థితి నతిక్రమించడమే. హాథార్న్ ఉద్దేశంలో ఏపాటి తీవ్రమైన ఆసక్తి అన్నా, ఆవేశమన్నా అది వెఱ్ఱికి అప్పచెల్లెలే; హాలింగ్స్‌వర్తుయొక్క సంస్కరణోత్సాహం రప్పాక్సినీయొక్క వెఱ్ఱితనాని కొకమెట్టు తరవాయిమాత్రమే. ఇంతకీ నవలారచయిత అన్నా, కళాకారుడన్నా ఏమిటి? ఇతరుల పరిస్థితులలోకి తొంగిచూసే ఒకింత అసాధారణ

వ్యక్తి. అంతే. హాథార్న్ రచయితగా తన వ్యాపారధర్మాన్నే కాదనే ధోరణిలో వున్నట్లు కనిపిస్తాడు; అందునా 'జనసామాన్యం' అంటే తన కున్న అనిష్టంతో అతని స్థితి మరీ సంశయాస్పదం అవుతుంది. మేధావు లంటే భయపడతా డతడు. అనాగరికులను తృణీకరిస్తాడు. ప్రయత్నించి చూస్తే కథలోని మట్టిబుక్కగాలవంటి గ్రామస్థులనుకంటె ఈథన్ బ్రేండు పాత్రనే పాఠకు లామోదించడానికి సుముఖత్వం చూపుతారు. అన్యథా కరించలేదు రచయిత.

అయితే ఇలాంటి లోపాలను—నవలారచనలో తన కొక దారి చూపే దాత లేక తనదారి తాను వెదుక్కుంటూ హాథార్న్ పడిన బాధ యొక్క స్వాభావిక ఫలితాలుగా పరిగణించవలసివుంది. అతడూ ఎమర్సను థోరో లెంత సత్యసంకల్పులో అంత సత్యసంకల్పుడు. కాని మానవుని అదృష్టాన్ని గూర్చిన భావనలో వారికంటె గంభీరమైన పరిజ్ఞానం గల వాడు. రచయితగా వారికంటె గురుతరశ్రమకు గురియైనవాడు. వారిలో వున్న ప్రక్రియా సౌలభ్యలోపం పలచబడిన ప్రాచీనమైన ఔపదేశిక ధోరణికి ప్రాతినిధ్యం వహిస్తుం దనవచ్చు. ఇతనిలోని నిశ్చయతాత్పర్య లోపం ఒక నవీనమైన భావవ్యక్తీకరణ ధోరణియొక్క ప్రాథమికదశను సూచిస్తుంది. అయితే వింత యేమంటే వారు ప్రాత నేపాటి నిరసించేరో ఇత డాపాటి వినియోగించుకొన్నాడు. అమెరికాలో ప్రభాతం విరిసిందని మాటవరుస కన్నాడేగాని ఇతని ఉద్దేశంలో అప్పటికింకా నవ్యప్రారంభ సంరంభం లేనట్లే. హెస్టర్‌తో చిల్లింగ్‌వర్తు అన్నట్లు:

"My old faith...comes back to me,and explains all that we do, and all we suffer. By thy first step awry thou didst plant the germ of evil; but since that moment, it has all been a dark necessity."

[నా చిరంతనవిశ్వాసం...మళ్ళావచ్చింది నాకు. మనంచేసే చేతలనూ, పడే బాధలనూ అన్నిటినీ వ్యాఖ్యానిస్తుం దది. నీ మొట్టమొదటి తప్పటడుగుతో అవినీతికి అంకురార్పణంచేశావు నీవు. ఆ క్షణంనుంచీ అదో గుట్టయిన అక్కఱ అయిపోయింది.]

# 5

## మెల్విల్ - విట్మన్

### హెర్మన్ మెల్విల్ (1819-91):

అభిజనము న్యూయార్కు నగరము. తండ్రి సంపన్నుడైన దిగుమతిదారు. కాని దివాలాతీసి 1832లో పోయినాడు. తల్లి బిడ్డలతో ఆల్బనీ చేరుకుని అక్కడ బంధువుల సాయంతో ఏలాగో కష్టపడి కాలక్షేపం చేసేది. మెల్విల్ ఒక బేంక్‌లో పనిచేశాడు. ఒక బడిలో పాఠాలు చెప్పేడు. తదుపరి ఒక నౌకలో చిన్న పనికుర్రాడుగా చేరి లివర్పూల్‌కి వెళ్ళివచ్చాడు. 1841లో అకుష్‌నెట్ అనే దక్షిణసముద్ర నౌకలో నౌకరీకి కుదురుకొన్నాడు. 1842లో మార్క్వెసాస్‌లో తన నౌకను విడిచిపెట్టేశాడు. అక్కడ ఒక నరమాంస భక్షకుల తెగ తారసిల్లింది. ఆ యింతా ఒక ఆస్ట్రేలియన్ నౌకను పట్టుకుని ఆ దీవినుండి వుడాయించేశాడు. తరువాత తహితీ, హానోలులూ ద్వీపాల్లో కొన్ని సాహస

యాత్రలు చేసి, 1844 లో యునైటెడ్ స్టేట్స్ నౌకలో ఇంటికి తిరిగి వచ్చాడు. తనసాగరయాత్రానుభవాలను పురస్కరించుకొని రచనావ్యాసంగాని కుపక్రమించాడు. అతని 'టైపీ' (Typee-1846), ఓమూ (Omoo-1847.ఆయేడే అతని వివాహంకూడాను) రెండూ జనామోదాన్ని పొందేయి. వరసగా 1849 లో మర్డీ (Mardi), రెడ్‌బర్న్ (Red-burn), 1850 లో వైట్‌జాకెట్ (White-Jacket), 1851 లో మోబీ డిక్ (Moby Dick), 1852 లో పీర్రీ (Pierre) అనే పుస్తకాలు వ్రాశాడు. ఇందులో మర్డీ జనాన్ని దిగ్భ్రాంతులను చేసింది. మోబీ డిక్ జనాకర్షణ నిరాశాజనక మైంది. పీర్రీవ్యవహారం పూర్తిగా నీరుగారిపోయింది. మెల్విల్ క్రమంగా తన రచనలపై ఆధారపడి బతకడం విరమించుకొన్నాడు. అయితే రచనలు చెయ్యడం మానలేదు. కథ లనేకం వ్రాశాడు. అందులో ఆరు కథలు కలిసి 'పియజ్జాటేల్స్' (Piazza Tales) అనేపేర 1856 లో వచ్చాయి. 1855 లో 'ఇజ్రీల్‌పాటర్' (Israel Potter),1857 లో 'ది కాన్ఫిడెన్స్‌మేన్' (The Confidence-Man) అనే మరోరెండు నవలలుకూడా వ్రాశాడు. అక్కడనుండి పద్యకవిత్వంవేపు చూపు మళ్ళించాడు. అందులో చాలాభాగము, 'క్లేరెల్' (Clarel, 1876) అనే పెద్ద కావ్యము ప్రయివేటుగా ప్రకటింపబడ్డాయి. 1866-85 సం.ల మధ్య న్యూయార్కులో కస్టమ్సు ఇన్‌స్పెక్టరుగా పనిచేశాడు. తదుపరి ఉద్యోగాన్ని విరమించి ప్రశాంతంగా కాలం గడుపుతూ చివరిరోజులలో 'బిల్లీబడ్' (Billy Budd) అనే రచన చేస్తూవుండేవాడు. అది 1924 లో ప్రకటితమైనది.

## వాల్ట్ విట్ మన్ (1819-92):

అభిజనము లాంగ్ ఐలండు. డచ్చి-యాంకీమిశ్రజాతికి చెందిన వాడు. తండ్రి వడ్రంగి, మేస్త్రీ. 1823 లో వారి కుటుంబం మన్ హట్టన్ నుండి వచ్చే ఈస్ట్ నది పొడుగునా తొరతొరగా అభివృద్ధి పొందుతూవున్న బ్రూక్లిన్ పట్టణానికి వెళ్ళిపో యింది. 1830 లో బడి విడిచిపెట్టి పెయింటర్ వృత్తి ప్రారంభించాడు. 1838-9 లో లాంగ్ ఐలండులో బడి పంతులుగా పనిచేశాడు. 1841-5 లో పాత్రికేయవృత్తి (జర్నలిస్టు); 1846-7 లో బ్రూక్లిన్ దినపత్రిక 'ఈగిల్' (Eagle) కి సంపాదకుడు. రాజకీయాల్లో డెమోక్రటిక్ పార్టీతో అభిప్రాయభేదాలు ప్రకటించాడు. కొస్త సోమరి సంపాదకుడుగా పరిగణింపబడ్డాడు. 1848 లో ఉద్యోగవశాత్తూ న్యూ ఆర్లియన్సుకి వెళ్ళి వచ్చాడు. 1851 4 లో బ్రూక్లిన్ లో వడ్రంగం చేసుకుంటూనే ఒక నోటుపుస్తకంలో ఏవేవో వ్రాసుకుంటూ వుండేవాడు. అందులోంచి బాహిరిల్లినవే 'లీవ్స్ ఆఫ్ గ్రేస్' (Leaves of Grass) అను పేర 1855 లో ప్రకటింపబడిన కవితలు. ఎమర్సనూ, మరికొందరూ వాటిని ప్రశంసించారు. సమీక్షకులు కొందరు ఆక్షేపించారు. అయితే వరసగా 1856, 60, 67, 71, 72, 76, 81, 89, 92 సం॥లలో పలుమార్లు పునర్ముద్రణం పొందిం దా కవితాసంపుటి. 1863-65 లలో ఒక గుమాస్తాగాను, వాషింగ్టన్ లో హాస్పిటల్ నర్సుగా ప్రజాయుద్ధంలోని క్షతగాత్రులకు సేవచేస్తూను గడిపాడు. 1865 లో 'డ్రమ్ టేప్స్' (Drum Taps) రచించాడు. 1873 దాకా వాషింగ్టనులోనే పనిచేశాడు. ఆ యేడే

పక్షవాతం వచ్చి జీవితాంతం కొంత దుర్బలుడుగానే వున్నాడు. 1871 లో 'Democratic Vistas' అనే వచనగ్రంథం వ్రాశాడు. 1879 లో పశ్చిమరాష్ట్రాల్లో పర్యటించాడు. 1882 లో 'Specimen Days and Collect' (స్వీయోదంతములు) ప్రకటించాడు. చివరి రోజులలో అతనిచుట్టూ ఒక శిష్యవర్గం చేరింది. అప్పటికి జనసామాన్యంలో అంత కాకపోయినా పండితవర్గంలో బాగా వాసికెక్కాడాయన. 1888 లో 'November Boughs' అనే గద్యపద్యాత్మకకృతి ప్రకటించాడు. న్యూజెర్సీరాష్ట్రంలో కేమ్‌డెన్‌లో నిర్యాణం. ఈయన అవివాహితుడు.

## హెర్మన్ మెల్విల్

ఎమర్సనూ, హాథార్నూ యూరపులో పర్యటించినవారైనా థోరోలాగ కలిగివున్నదాంట్లోనే తమ సాహిత్యజీవయాత్ర సాగించారు. ఎన్ని లోటుపాట్లు కలిగినదైనా న్యూఇంగ్లండు వారికింత ఉపాధి కల్పించింది. అంటే తక్కిన న్యూఇంగ్లండు వాస్తవ్యులలాగే వారూ ఆ ప్రాంతీయ పరిస్థితులనుండే తమ సారస్వతజీవితానికి దోహదం సంపాదించగలిగారు. అయితే హెర్మన్ మెల్విల్ నిమాత్రం ఆయన సాగర యాత్రలు పరిచితప్రపంచమైన న్యూయార్కు, ఆల్బనీలనుండి దూరం చేశాయి. అయితే ఆ కాలంలో సముద్రాన్నొక గొప్ప రూపకనిక్షేపంగా చేసుకున్న రచయిత మెల్విల్ ఒకడే కాదు. అతని సమకాలికుడైన ఫ్లాబర్టు 1846 లో ఒక మాట అన్నాడు—"సృష్టిగతమైన సుందరవస్తుజాలంలో ముఖ్యమైనవి మూడు: సముద్రము, హేమ్లెట్ (షేక్స్పియర్ రూపకం), మొజార్ట్ వ్రాసిన 'డన్ గయొవన్ని' (Don Giovanni)"

అని.1 హాథార్న్‌గాని దక్షిణసాగరయాత్రకు రావలసినదిగా తనకు వచ్చిన ఆహ్వానాన్ని అంగీకరించివుండినట్లయితే రచయితగా లాభం పొందివుండే వాడు. ఏమైతేనేం వీళ్ళందరిలాగు కాకుండా మెల్విల్ సాగరయాత్రలు చేశాడు; తన ఊహాగానాలను ప్రత్యక్షజ్ఞానంతో సమన్వయం చేసుకోగలిగాడు. సముద్రం రూపకంలాంటి ఒక సాహిత్యోపకరణం అంటే అది అంతమాత్రమే కాదు. అది యథార్థంగా ఎందరో మనుషులకు జీవనోపాధి ఘంటాపథమైనదనికూడ చెప్పాలి. మెల్విల్ వ్రాసిన మొదటి పుస్తకాలలో కొంత కాల్పనికప్రతిపత్తి గలదైనా అతన్ని వ్యగ్రుణ్ణి చేసిందీ యథార్థదర్శనమే. యాత్రాఖ్యానాలతో, సముద్రగాథలతో విసుగెత్తిపోతున్న ప్రజలకు అతని పైపై ఒకవిధమైన ఆత్మకథావరణంలో ఒక సరిక్రొత్త అద్భుతసన్నివేశాన్ని నిరూపించి ఉత్సాహం కలిగించింది. నిజానికి అందులోని వస్తుసన్నివేశం కొంత మెల్విల్ ఊహనుండి ఊడిపడినదే అయినా, ఆయన తన పుస్తకాన్ని నవలగా పరిగణించినట్లు తోచదు. ఉపోద్ఘాతంలో ఆయన తనకు 'పైపూతలు లేని సత్యాన్ని చెప్పాలని ఆతురమైన కోరిక వుం' దంటాడు. తన కథ కొక పటము (Map), ఆధారసామగ్రిగల ప్రకరణాలూ చేర్చాడు. (ఇంగ్లండులో ప్రచురింపబడిన

---

1. "సృష్ట్యాదినుంచి భావనయొక్క అంతరాంతరాలలోనికి చొచ్చుకునివెళ్ళి జేవురించిన కళ్ళతో బహిర్గమించే అంతర్ద్రష్టలను ప్రేమిస్తాను నేను" అని 3-3-1849 లో ఒక ఉత్తరంలో మెల్విల్ వ్రాసిన మాటను—"నేనొకానొక ఓరిమిగల సారసపక్షివంటివాడను. లోతుకు వెళ్తాను కాని వట్టి చేతులతో మొహం మాడ్చుకుని తిరిగివస్తాను. ఏదో గట్టి ఆకర్షణ భావంయొక్క లోతులలోనికి, దృఢహృదయులకు గూడ ఔత్సుక్యం కలిగింపక మానని అంతరాంతరాలలోనికి నన్ను పట్టి లాగుతూవుంటుంది" అని 7-10-1846 న లూయీ కోలెట్‌కి వ్రాసిన ఉత్తరంలో ఫ్లాబర్టు అన్న మాటను సరిపోల్చి చూడండి.

ఆ పుస్తకం పేరు—"Narrative of a Four Months' Residence Among the Natives of a Valley of the Marquesas Islands; or A Peep at Polynesian Life." ఈ పేరే ఆ పుస్తకాన్ని ఉత్పాద్యగ్రంథజాలం (నవలలు మొ॥) నుండి పృథక్కరిస్తున్నది. మొత్తంమీద శైలిమాత్రం ఒక యాత్రికుని ఉత్తమసాహిత్యాభిరుచినుండి బాహిరిల్లిన ట్లుంటుంది:

"Those who for the first time visit the South Seas, generally are surprised at the appearance of the islands when beheld from the sea. From the vague accounts we have of their beauty, many people are apt to picture to themselves enamelled and softly swelling plains, shaded over with delicious groves, and watered by purling brooks..."

'టైపీ' ఒక అమెరికన్ యువకుడు తన సహచరుని ('టోబీ') తోపాటు నౌకను విడిచిపోయి చేసిన సాహసయాత్రల నుత్తమపురుషలో ఆఖ్యానించే గ్రంథం. ఇద్దరూ ఒక పర్వతపంక్తి దాటి ఒక లోయలో ప్రవేశించారు. అక్కడ ఒక నరమాంసభక్షకుల గుంపు మధ్య చిక్కుకున్నారు. టోబీ ఎలాగో తప్పించుకుపోయాడు గాని, పాపం, కథకుడు మాత్రం వాళ్ళకడ ఉండిపోక తప్పిందికాదు. అయితే వాళ్ళతనిని ఆదరంగా చూడటం ఆయన కాశ్చర్యం కలిగించి, మనసు కుదుటపడింది. కాని ఒకసారి వాళ్ళ బారినుండి పారిపోయాడు. వాళ్ళతనిని సముద్రంలోనికి వెంటతరిమారు. అంతలో అలా పోతూ ఒక నౌక అతన్ని రక్షించి ఎక్కించుకు వెళ్ళిపోవడంతో కథ కంచికి పోతుంది. ఆ తెగవారంతా చక్కని స్వేచ్ఛాజీవులు. అందులో ఒక అమ్మాయితో ఆయన చిన్న శృంగారానుబంధంకూడా పెట్టుకొన్నాడు. అంటే, అది కాస్త కావ్య

మార్గాన సాగిందే కాని స్పష్టమైన ప్రణయకలాపం కాదు. ఈ ఉదంత మంతటియొక్క పరమార్థం నాగరికులలోని చెడుకీ, అనాగరకు లనిపించుకొనేవారి మంచికీ మధ్య వున్న వ్యత్యాసంలో వ్యక్తమౌతుంది. ఈ కృతిలో సృజనాత్మకమైన కౌతుకవ్యంజకత తక్కువైనా, తరువాత తరువాత మెల్విల్ గొప్పగా ప్రపంచించి వ్రాసుకున్న వ్రాతల ముడిపదార్థమంతా ఇందులోనే వుంది. ఇందులో అత డొక సముద్రయానాన్నీ, ఒక మామూలు ప్రయాణాన్నీ వర్ణించాడు; శ్వేతజాతి నాగరికతనూ, దాని నీతిశాస్త్రాల ఆర్భాటాన్నీ నిశితంగా విమర్శించాడు (అయితే సాంప్రదాయికమార్గంలోనే,రూసో ఊసుకూడా ఎత్తుకున్నాడు); దేశద్రిమ్మరి కథకుడికి తన జాతివారిలోగాని, అనాగరకజనుల్లోగాని తనకు సంతృప్తినిచ్చే విషయం కనిపించదని సూచించాడు. టోబీయొక్క ఉల్లాసకరమైన, మర్మం లేని స్వభావము ఆ పాత్రచిత్రణాన్ని కొంత అప్రమాణీకరించినా, మెల్విల్ అతనిగురించి అప్పుడప్పుడు సముద్రయానాల్లో తమ గుట్టు మట్లు దాచుకుని ఏదో చెప్పలేని ఒక వింత యోగం వెన్నాడుతూ వున్నట్లు ప్రపంచమంతా తిరుగుతూ కనిపించే మనుషుల కోవకి చెందినవాడంటాడు. మళ్ళా అతని మోబీడిక్‌లో కనిపించింది కాస్సేపే అయినా మరపురాని బల్కింగ్టన్ పాత్రలో ప్రసక్తమైన ఉద్దేశం ఇక్కడే రూపు దిద్దుకొంది.

మెల్విల్ 'టైపీ'లో తన కథ నెక్కడ విడిచిపెట్టేడో (నాయకుని పలాయనం) అక్కడనుండి ఎత్తుకొన్నాడు తన 'ఓమూ'లో. ఇందులో మరీ అశుభసూచకమైన వాతావరణం కల్పించాడు. ఇందులో ఆ అమెరికన్ యువకు డెక్కినది ప్రాతబడి పాడైపోయిన నౌక. ఆ నౌకాధికారి వట్టి అసమర్థుడు. తక్కిన సిబ్బంది అంతా తిరగబడే రకం. అందులో ఒకరు చావడం తటస్థిస్తుంది. మరో నావికుడు ఇక మూడువారాల్లో నౌకలో నాలుగోవంతు మనుషులుకూడా మిగలరని జోస్యం చెబుతాడు. సరే,

నౌక నాశనమైపోయినట్లే. అయితే ఆ బీభత్సపు బింకం కొంత సడలి తిరుగుబాటంతా చివరి కొక ప్రహసనప్రాయమన్నివేశంగా తయారవుతుంది. మళ్ళా 'తహితీ' దీవియొక్క హీనదశగురించి చెప్పినప్పుడుమాత్రమే కథలో కాస్త గాంభీర్యం కనిపిస్తుంది. పాపం, ఆ ద్వీపవాసులు శ్వేత జాతీయుల రోగాలతో తమ ఒళ్ళు గుల్లై, సదాశయులైన మతప్రచారకులవల్ల తమ సంస్కృతి గోల్పడి—"తాడి పెరుగుతుంది, పగడం వ్యాపిస్తుంది, నరుడు నశించిపోతాడు" అనే ఒక ప్రాబల్యాన్ను జపిస్తూ అంతరించిపోడానికి సిద్ధంగా వున్నారు.

కథకుడు తానొక అమెరికన్ నౌకలో తహితీద్వీపాన్ని విడిచిపోవాలనే నిశ్చయానికి వచ్చి, అందు కొక చక్కని అవకాశం దొరికేదాకా తానూ తన విడ్డూరపు నేస్తం డాక్టర్ లాంగ్ ఘోస్టూ కలిసి ఒక పెద్ద తరంగం వచ్చి తాకినట్లు వచ్చాడా ద్వీపానికి. అప్పుడొకసారి ఎలాగైతేనేం, కథలో మళ్ళా ఉల్లాసం వెల్లివిరిసింది.

మెల్విల్ అంటే సరసస్మృతిప్రతీకలుగా కృతులు నిర్మించే రచయిత అనే ప్రజాభిప్రాయాన్ని బలపరుచుకున్న రచన ఓమూ. దానినే గట్టిగా అనుసరించినా 'మర్డీ' అనే రచన దది వేరే విషయం. మర్డీ ఎత్తుగడ మంచి సూటిగా వుంటుంది. ఇందులో వచనశైలి మరీ విశిష్టంగా వుంటుంది :

We are off! The courses and topsails are set; the coral-hung anchor swings from the bow; and together the three royals are given to the breeze, that follows us out to sea like the baying of a hound. Out spreads the canvas-alow, aloft-boom stretched, on both sides, with many a stun' sail, till like a hawk, with pinions poised,

we shadow the sea with our sails, and reelingly cleeve the brine.

ఇంత చిన్న ప్రసంగంలో రెండు ఉపమానాలూ, ఒక క్రియా విశేషణసంపుటి ప్రక్రియా వుండడం చూస్తే అవి పిదప కాలపు మెల్విల్ ధోరణిని సూచిస్తాయి. ఆ శైలి మలయమారుతంలా వుంది. ప్రత్యేకంగా ఈ తిమింగిలాహరణయాత్ర విసుగు పుట్టించేదిగా వుందని కథకు డన్నప్పటికీ అత డొక శక్తిమంతుడు, బాధ్యత లేని యువకుడు, ఓడలోని ప్రయాణికులకంటె బాగా చదువుకొన్నవాడే గాని వారి కే విధంగానూ పరాయివాడు కాడు అని మాత్రమే గాని మరింకేమీ అయినట్లు సూచన యేమీ లేదు. గ్రంథంలో అధికభాగంలో 'తాజీ' అనే పేరున వ్యవహరింపబడిన కథకుడు ఓడను విడిచిపెట్టెయ్యా లని త్వరలోనే ఒక నిశ్చయానికి వచ్చి, ఒక వృద్ధనావికుని తీసుకుని ఒక చిన్నపడవలో వెళ్ళిపోతాడు. అలా పశ్చిమంగా పసిఫిక్ మహాసముద్రంలో ఒక దీవుల పంక్తివేపు సాగిపోతారు. వారి సాహస యాత్రలు ఉత్సాహపూరితాలుగానూ, యుక్తంగానూ వుంటాయి.

సరి, ఒక మార్పు వస్తుంది. మిన్నులు పడ్డచోట ఒకభూఖండాన్ని చూస్తాడు తాజీ. ఒక దేశవాళీపడవ, అందులో ఒక వృద్ధపురోహితుని పుత్రులైన యువయోద్ధలు కొందరు కనిపిస్తారు. ఆ ముసలాయన బలిపీఠానికి పశువుగా గొనిపోబడుతూవున్న 'యిల్లా' అనే అందమైన శ్వేతజాతి ఆడపిల్లకు కాపలాగా కూర్చునివుంటాడు. ఆమె నెలాగైనా రక్షించాలనే పట్టుతో ఆ పురోహితుణ్ణి చంపేస్తాడు తాజీ. అయితే మెల్విల్ హఠాత్తుగా తన కథాగమనాన్ని పూర్తిగా మార్చేశాడు. అతని వచన రచనావిన్యాసం ఒక అద్భుతరూపకంలో లాగు రసోత్తరంగా సాగింది.

మళ్లా కథకు డొక మలుపు తిరిగాడు. యాత్రికులు మర్డీ అంతరీప శ్రేణి (Archipelago) చేరుకుంటారు. ద్వీపవాసులు తాజీకొక దేవర

కిచ్చినట్లు స్వాగత మిస్తారు. అక్కడ యిల్లాతో హాయిగా కాలక్షేపం చేస్తాడు. హఠాత్తుగా ఆమె ఒకనాడు మటుమాయ మైపోతుంది. ఆమె కోసం ఆ అంతరీపశ్రేణినంతా గాలించడానికని నలుగురు మర్డీనివాసులను వెంటబెట్టుకుని అందులో బబ్‌బలంజా అనే తాత్త్వికునితో సహా బయలు దేరుతాడు తాజీ. వీళ్ల యీ పర్యటనోదంతమే గ్రంథంలో అధికభాగాన్ని ఆక్రమించుకుంటుంది. యిల్లాఅన్వేషణమన్న దొకటే అందుకొక నిమిత్తం; కాదు, వట్టి సాకువంటిది. అసలు చమత్కారం వాళ్లు కనుగొనే విశేషాల మీద ఆధారపడివుంది. అయితే అక్కడక్కడ యిల్లాను జ్ఞాపకంచేసే విషయాలు లేకపోలేదు. ఆ పురోహితుడి పుత్రులు ముగ్గురు తాజీని చుట్టు ముట్టి అందులో గ్రంథకర్త దృష్టిలోనే ఎక్కువైపోయిన ట్లనిపించిన రెండుపాత్రలను (తాజీ అనుచరులను) చంపేస్తారు. అయితే ఇలాంటి సంఘటన లన్నీ మార్డియన్ ప్రపంచంగురించి కథకుడు చేసే అధిక్షేపమూ, ఊహాగానాల ప్రవాహంలో మునకలువేస్తూవుంటాయి. ఆ అధిక్షేప మార్గమంతా ఎగుడుదిగుడుగా వుంది. కొన్ని దీవులు నరుల దోషాలకు (మతాభినివేశపు పిడివాదము, ఆభిజాత్యగర్వము మొ॥) సంకేతా లవుతే, కొన్ని యథార్థదేశాలకే సంకేతాలు ('డోమినోరా' ఇంగ్లండుకీ, 'వివెంజా' సంయుక్త రాష్ట్రాలకూ). ఆ ఊహాగానంకూడ ఒకప్పుడు గంభీరంగానూ, మరొకప్పుడు వట్టి పరిహాసధోరణిగానూ వుంటుంది. 'తాజీ' గ్రంథకర్త అయిన కథకుడితో తాదాత్మ్యం పొందిపోతాడు; ఒక్కొక్కప్పుడు ప్రత్యేకం అతని ప్రసక్తి లేకుండానే పుటలు దొర్లిపోతాయి. బబ్‌బలంజాదులుమాత్రం జీవితార్థవిచారణ చేస్తూ జగడాలాడటం కనిపిస్తుంది. ఎడపతడప మెల్విల్ అంటే తాజీ తన ఉదంతాన్ని తానే పరామర్శించు కొంటూవుంటాడు; లేక ఏవేవో వింతవింత భావకవితాధోరణు లాలపిస్తాడు.

"కలలు! కలలు! బంగారు కలలు! శయోసేక్రమెంటోనుండి దూరం పరసాగిన పూతపట్టిన పచ్చికబయళ్ళవలె అంతులేని బంగారురంగారు

కలలు!...బయాళ్లు వర్తులములైన అనంతాకృతులవలె నున్నవి: జాజియాకులు తురిమినట్లున్నవి. నా కలలు బఱ్ఱెలవలె కదుపులుగట్టి కనుచూపుమేర మినువ్రాలిన దాక భూప్రదక్షిణములు చేస్తూ మేతలు మేస్తున్నవి. అన్నీ చేజారి పారిపోకముందు ఒక్కటైనా వ్రేటుకి దక్కాలని ఈటి పట్టుకొని వాటిపై దూకేను."

అదే ప్రకరణంలో బబ్‌బలంజా మాటలుగా చెప్పబడినట్లు ఒక పూనకం వచ్చిన వాడిలాగ ఏకాగ్రచిత్తంతో—"వస్తువుల తత్త్వం, వాటి కతీతమైన వైచిత్ర్యం, నిర్భరానందాశ్రువుయొక్క మూలతత్త్వం, గోచరార్థాలక్రింద దాగిన రహస్యం, చింపిరిసీపిలోపలనున్న అమూల్య రత్నం" మొ॥ వానిగురించి వ్రాస్తాడు మెల్విల్.

గ్రంథం ఇక అయిపోవచ్చిం దనగా యాత్రికులు సెరీనియా అనే దీవి కనుగొంటారు. అక్కడ ఒక నిజమైన ప్రణయప్రశాంతవాతావరణం నెలకొని వుంటుంది. వాళ్లు తాజీ నిక అతని నిరర్థకమైన యిల్లాగవేషణం మానుకొమ్మంటారు. కాని అల్లాపురోహితు డేసుడిగుండానికైతే ఆమెను బలిపశువును చెయ్యా లనుకున్నాడో ఆ సుడిగుండంలోనే ఆమె మునిగి చనిపోయినట్లు కనుగొంటాడు తాజీ. ఆ నిశ్శబ్దనీరవసరోవరంనుండి ఘూర్ణితార్ణవంలోనికి ఒంటరిగా పయనమైపోతాడు. కాని పురోహితపుత్రులింకా వెంటతగులుతారు. సాగరసంగీతంలా ప్రారంభమైన గ్రంథం ఒక ఆర్తనాదంలా పరిణమించింది. అదంతా మార్యట్ (Marryat), కూపర్‌ల అర్థవంతమైన ప్రపంచంలోనుండి పో(Poe) రచించిన Narrative of Arthur Gordon Pym (ఇది మొదట బాగానే ప్రారంభమవుతుంది కాని ఒక భయంకరమైన విధ్వంసప్రక్రియతో అంతమవుతుంది) లోని బీభత్సంలోనికి ప్రవేశించినట్లుంటుంది. హాథార్న్ కూడా ఒక పెద్ద విపత్తు తెచ్చిపెడతాడు తన గ్రంథంలో. కాని తానుమాత్రం దానినుంచి దూరంగా తొలగిపోవడానికి ప్రయత్నిస్తాడు. మెల్విల్‌లో మాత్రం పోలో వున్నట్లే

ఒక సహజమైన శైత్యం వుంది. ఇతనిలోని ఉత్సాహశక్తి అయితేనేం, అతనిలోని ధీశక్తి అయితేనేం ఒకవిధమైన అపస్మారాన్ని కలిగిస్తాయి (పాఠకులకు). 'మర్డీ' అలాంటి పుస్తకమే. అతిప్రయాసపడి తన రచనా సముద్దేశాన్నే పట్టి గజిబిజి చేసేసుకున్నాడు గ్రంథకర్త. అయినా అది చెడ్డపుస్తకాలలో మంచి పుస్తకం. అద్భుతమైన అతని 'మోబీడిక్' చదవడానికి ముందొక అసాధారణ చమత్కారావహమైన అవతారికాప్రాయ గ్రంథంగా వుంటుంది.

'మర్డీ' తరువాత మరి తెరిపిలేకుండా వరసపెట్టి వ్రాసేవాడు మెల్విల్. ఈ పర్యాయం ఎలాగైతేనేం. బహుశా తాను స్వవిషయంలోనూ, పాఠకప్రజానీకం విషయంలోనూ సాధించవలసినదానికంటె ఎక్కువ సాధించాననుకొన్నట్లున్నాడు. మళ్లా కొంత తన టైపీ, ఓమూల ధోరణికి వచ్చాడు. 'వైట్ జాకెట్'లో 'యునైటెడ్ స్టేట్స్' అనే అమెరికన్ యుద్ధనౌకలో తన అనుభవాల గురించే వ్రాసుకున్నాడు. 'రెడ్ బర్న్'లో అతని న్యూయార్కు - లివర్పూల్ యాత్రోదంతమే ప్రపంచించాడు. పగడగా నవల వ్రాయగలగడంలో తనమట్టుకు తనకీ తగిన నమ్మకం లేనట్లు మళ్లా తానే యథార్థవిషయాల కపటకథకుడుగా తయారయ్యాడు. అతని వచనం సరళంగా, నిరాడంబరంగా టైపీలోకంటె మరీ మృదువుగా పరిణామం పొందింది. 'రెడ్బర్న్'లో శైశవదృష్టితో చూచినట్లు అతడు చేసిన ఒక తైలవర్ణచిత్రపటవర్ణన చూడండి:

[It] represented a fat-looking, smoky fishing-boat, with three whiskerandoes in red caps, and their trousers legs rolled up, hauling in a seine. There was high French-like land in one corner, and a tumble-down grey lighthouse surmounting it. The waves were toasted brown, and the

whole picture looked mellow and old. I used to think a piece of it might taste good.

ఇందులో ఆ 'Whiskerandoes' అన్న మాటను విడిచిపెడితే నూటిరైన ఈ వర్ణనను మార్డియన్ రచనావిన్యాసాలతో ముడిపెట్టడానికవకాశం లేదు.

అలా కొద్ది సంవత్సరాలలో మెల్విల్ అయిదుపుస్తకాలు వ్రాసేశాడన్నమాటేగాని అందులో దేన్నీ నవలగా పరిగణించడం సుకరం కాదు. మొదటి మూడింటా ప్రధాన కథారంగము దక్షిణసముద్రము. అయితే అందులో నౌకాంతర్గతసన్నివేశమే చాలినంత వున్నప్పటికీ మెల్విల్‌ని ప్రధానంగా ఆకర్షించినట్లు కనిపించేవి దీవులూ, వాటి ఉష్ణపరిసరాలూను. ఆ తరువాతి రెండుకృతులు-అంటే 'వైట్ జాకెట్', 'రెడ్బర్న్'లు అయన వృత్తాల పరిధినతిక్రమించాయి. 'రెడ్బర్న్'లో మధ్యతీరంలో జరిగిన దీర్ఘ ప్రస్తావం కొంత వున్నా రెండు గ్రంథాల్లోనూ మొత్తానికి భూతలంమీద కన్నా సాగరయాత్రలోనే అది మానవుడి యోగానికి తగినంత తాద్రూప్య యోగ్యత గల దన్నట్లు ఆస్థ వ్యక్తంచేస్తాడు మెల్విల్. అలాగే నావికుల జీవితాన్ని చిత్రించడంలోనే ఆ నౌకలో అక్కడి కదొక చిన్నతరహా సమాజం, అదో చిన్నప్రపంచం అన్నట్లు ఆస్థ ప్రకటిస్తాడాయన. రచనా వ్యాసంగకాలంలో మొదట్లో ఒక ప్రక్క చాలా గ్రంథాలుతరచి చదువుతూవుండేవాడు. షేక్స్పియరు గ్రంథాలు చదివి చాలా ఉపయోగం పొందేడు. మిగతావారిలో సర్ థామస్ బ్రౌన్ అంటే అతనికి చాలా ఉల్లాసం. అంతే కాదు, అప్పట్లో - అంటే బహుశా ఆయన తన ఆరోపుస్తకం, తిమింగిలపు వేట గురించి వ్రాసినది, దాని మొదటి ముసాయిదా తయారు చేసినప్పుడు కాబోలు - ఒక ప్రముఖ స్నేహానుబంధం ఏర్పరచుకొన్నాడు. ఆ తొలుతటి గ్రంథాల్లో బాగా సూచింపబడినట్లు అతనికి కావలసింది ఏదో సాంప్రదాయికమైన ఆఖ్యానఫక్కీలో పట్టి కథ

చెప్పడం కాదు; తన సాహసగాథ లోక గొప్ప ప్రాముఖ్యాన్ని నిరూపించుకోవాలని అతని కోరిక. అయితే హాథార్న్ వ్రాసిన కథలు చదివి ఆయనతో పరిచయం ఏర్పరచుకొన్న దాకా తాను స్వాభావికవీరగాథలని అనుకునే వాటి విషయంలో అతన్ని ప్రోత్సహించడాని కెవరూ లేక పోయారు. హాథార్న్ విషయంలో మెల్విల్ అతడూ తనలాగే గోచరార్థాలక్రింది గోప్యాల నన్వేషించేవా డనీ, నవలను తన పరికరంగా చేసుకున్నవాడనీ గుర్తించాడు. వారి స్నేహం తగ్గిపోయింది. మెల్విల్ చింతించాడు. అయినా అదే అతడు మోబీడిక్ వ్రాస్తున్నప్పు డొక గొప్ప బలవర్ధనిలా పనిచేసింది. అదేగాని కొనసాగితే ఇంకా ఉన్నతార్థ ప్రతిపాదకంగా ఆ గ్రంథాన్ని తీర్చిదిద్దడాని కుపకరించి వుండేది.

మోబీడిక్‌లో ఒక పెద్ద తిమింగిలగ్రాహకనౌకలో దక్షిణ సాగర యాత్రను విషయంగా తీసుకున్నాడు మెల్విల్. అలా చెయ్యడంలోనూ, ఇందులో మరి యథార్థాయథార్థ ద్వీపాల్లో ద్రిమ్మరడం కాకుండా ఆ నౌకనే అంటి పెట్టుకుని వుండడంలోనూ ఒక నియతమైన సామాజిక వాతావరణం నెలకొల్పడానికి తగిన పరికరం సమకూర్చుకున్నాడు. అలా వాస్తవికత కొకవంక గట్టిగా కట్టువడుతూనే ఊహకు స్వచ్ఛంద గమనం కలిగించుకొన్నాడు. భౌతికయాథార్థ్యంనుండి తత్త్వవిచారణకు పూనుకొన్నాడు (హాథార్న్‌లో తఱచు ఇటునుంచి అటుగా కనిపించేటట్లు విపరీతం గాకుండా). మొదటి ముసాయిదాలో కథ బాగా ఒక దస్తావేజు ధోరణిలో సాగినట్లు కనిపిస్తుంది. ఇప్పుడూ కొన్ని ప్రకరణాల్లో ఆ వాసన కనిపిస్తూనే వుంది. అది ఓవెన్ చేజ్ ఆఖ్యాయిక మొదలైనవాని వారసత్వం. ఇందులోని ఆ తిమింగిలాఖేటకం చివరికి ప్రత్యేకం మోబీ (మోచా) డిక్ అనే ఒక తెల్ల తిమింగిలంమీదా, ఆ నౌకాధికారి అహాబ్‌కి మోబీడిక్‌ఎంటే ఏర్పడిన విపరీత ద్వేషం మీదనూ కేంద్రీకరింపబడింది. నవల ఒక అద్భుతమైన శక్తిని పుంజుకుంది. అది ఉద్వేగప్రశమనలను ఒకదాని వెంట ఒకటి కలిగిస్తూ ఒక గభీరగమనంతో సాగి సాగి వరసగా మూడు

రోజుల ఏకాగ్రమైన నీరాటపు పోరాటపు ఘట్టంలో అవిలంఘ్యఫలంగా తిమింగిలం తిరగబడి ఆహాబ్‌ను స్వాహాచేసి ఓవెన్ చేజ్ యొక్క 'ఎస్సెక్స్' ఎలా కుత్తునియలై పోయిందో అలా 'పీకోడ్' (Pequod) ను బడాలున బ్రద్దలుచేసి సర్వనాశనం చేసిన ఘట్టంలోనూ బిర్రబిగుసుకు పోయిన అవస్థ వుందే అది వర్ణనాతీతం. ఆ చలదవస్థాచిత్రణం అమోఘం, అనన్యసాధ్యం. ఈ ఒక్కసారి మెల్విల్ శక్తి కార్యానుకూలంగా వుంది. అతని యాత్ర, నావికులు, నౌక, అధికారి, అసలు తిమింగిలం, ఒకటేమిటి - అన్నీ జీవకళ ఉట్టిపడుతూవున్నాయి. ఇందలి వస్తువిపులీకరణంలో ఆర్జవ మున్నది. 'మర్డీ'లోలాగ ఏవేవో అర్థాలకోసం దేవులాడడం, ధర్మపన్నాలు దంచడం లేవు. అయితే ఇష్మేయిల్, ఆహాబ్, ఎలిజా, గేబ్రియల్ ఇలా పాత్రలకు పూర్వపు మతగ్రంథాలలోని పేర్లే కొన్ని పెట్టబడిన మాట వాస్తవమే కాని ఆ పాత్రలు బయల్దేరిన న్యూ ఇంగ్లండు విషయంలో ఆ పేర్లూ సహజంగా వ్యవహారంలో వున్నవే (గుడ్‌మన్ బ్రౌనుభార్య 'ఫెయిత్' అయినట్లు). ఆ విధంగా మెల్విల్ బైబిల్ సామ్యాలను చక్కగా స్ఫురింపజేయగలిగాడు.

ఆహాబ్ కొంతవరకు హాథార్న్ పాత్రల కోవకు చెందినట్లుంటాడు. 'The Great Carbuncle' అనే హాథార్న్ కథలో ఒక వృద్ధుడైన అన్వేషకుడు ఒక అమూల్యవస్తువుగురించి కొండలూకోనలూతిరుగుతూ దానివల్ల లబ్ధి వుంటుందనే ఆశ పోయినప్పుడిలా అనుకుంటాడు: "ఆ అవివేకం గతించి చాలా కాలమైనది. అయితే ఆ దౌర్భాగ్యపు ఱాయికోసం మఱింకా అన్వేషణ సాగిస్తున్నా వేమయ్యా అంటే నా యౌవనకాలపు వ్యర్థాశ వార్ధకంలో నా పాలిటి కొక విధి అయిపోయింది. ఆ అన్వేషణే నా శక్తి, నా ఆత్మబలము; అదే నా రక్తంలోని కవోష్ణరక్తిమ, నా ఎముకల్లోని మూలుగు!...అయితేనేం, వ్యర్థమైన జీవితకాలం వెనుకకు మళ్ళి రాకుండా వుండేందుకు ఆ సూర్యకాంత మాణిక్యంమీది ఆశ మాను

కుందునా? అది దొరికిందా, ఒక గుహలోకి దానిని తీసుకుపోయి, అక్కడ నా పిడికిట దాని స్పర్శను అనుభవిస్తూ హాయిగా కళ్ళుమూస్తాను. అది కూడా నాతోపాటే శాశ్వతంగా సమాధి అవుతుంది."

ఇతడో విలక్షణమైన వ్యక్తి; డాక్టర్ హీడెగ్గర్, ఈథన్ బ్రేండ్‌ల వలె వట్టి అత్యాశాస్వప్నాలు కంటూ తన ఏకాకితను లక్ష్యం చెయ్యక భ్రష్టుడై పోయినవాడు. హాథార్న్ వాళ్ళను ప్రమాదపతితులుగా చిత్రించి వుండటంవల్ల వాళ్ళ పాపప్రవృత్తిమాత్రం విస్రంభపాత్రం కాదు. సరి కదా ఆ సూర్యకాంతమాణిక్యంలాంటి విషయాలను సత్యప్రతిపత్తితో స్వీకరించలేము. అదే ఆహాబ్ విషయం తీసుకుంటే ఆ దివ్యాదివ్యమానవుని పాత్ర, ఆ పాత్రకు సంబంధించిన సమస్యలు మనల నాక్రమించుకొంటాయి. ఎంత క్లేశానికి గురైనా సరే అతనిలో మానవత్వాని కొక నిలుకడ వుంది. అతని ఆశయం విశ్వసనీయమైనది. ఫాదర్ మేపిల్ గారి మనోజ్ఞ మతప్రసంగంలోని జోనాలాగ ఆహాబ్ కూడా "దేవుని యెడల విధేయులంగా వుండాలంటే మన ఆత్మల కవిధేయులం కావలసి వస్తుం" దనే సిద్ధాంతం పాటించినట్లుగా ఇచ్ఛాపూర్వకంగానే పాపం చేశాడు. కాని అదే ప్రసంగంలో ధీరత్వమూ, అహంకారమూ సద్గుణాలుగానే పరిగణింపబడ్డాయి: "ఎవడైతే గర్విష్ఠులైన దేవుళ్ళనీ, అధికారులనూ తలాయించి యెదుట తన వ్యక్తిత్వాన్ని నిలువరించుకో గలుగుతాడో వాడిదీ ఆనందమంటే." అమితత్వమంటే వ్యసనపడతాడు హాథార్న్. కాని మానవుడికున్న అవకాశాల దృష్ట్యా మరికొంత ఉదారతతో మెల్విల్ మంచి అయినా చెడు అయినా ఏ కొంతో అమితత్వంమీదనే ఆధారపడి వుంటుం దంటాడు ఖచ్చితంగా. అందుచేత ఆహాబ్ నాయకుడూ (Hero), దుష్టప్రతినాయకుడూ (Villain) కూడా అవుతాడు. తాజీ తన్ను తాను మాత్రమే పాడుచేసుకుంటే ఆహాబ్ ఇతరులనుగూడ వినాశానికి గురి చేస్తాడు.

'మోబీ డిక్' ప్రపంచ నవలాసాహిత్య నిక్షేపంలోని అనర్ఘ మణులలో ఒకటి. ఎన్నిసార్లు చదివినా ఏదో ఔత్సుక్యం కలిగిస్తూనే వుంటుంది. అయితే కొన్ని చిన్నచిన్న లోపాల విషయంలో మాత్రం మెల్విల్ ప్రారంభగ్రంథాలతో పోలిక పోలేదు. 'మర్డి'లో తాజీయే కథకుడుగా ఉద్దిష్టుడైనా, మధ్యలో కథ చెబుతున్న దెవడో మరచి పోవడం తటస్థిస్తుంది మనకు. 'మోబీడిక్'లో కూడ ఈ తబ్బిబ్బు కనిపిస్తుంది. "నన్ను ఇష్మేయిల్ అనండి" అన్న మొదటి వాక్యం ముందు హెచ్చరికలా వుంది. కాని ఆ ఇష్మేయిల్ బొత్తిగా బాధ్యత లేని ధోరణి అవలం బిస్తాడు. మెల్విల్ ముందునాటి పుస్తకాలలోని ఆఖ్యాతయున్నూ, అతడూ ఒకడే అనిపిస్తుంది. ఇద్దరూ గ్రంథకర్తృంశసంభూతులే. 32వ ప్రకరణంలో ఇష్మేయిల్ అంటాడు: "దేవుడు రక్షించి నాచేత ఎప్పుడూ ఏదీ పరి పూర్ణంగా చేయింపకుండుగాక. ఈ గ్రంథమంతా కేవలం ఒక ఆకర్షణ- కాదు కాదు, ఆకర్షణల కాకర్షణ. ఓ కాలము, బలము, ధనము, క్షమ." ఈ మాటలు విధిగా గ్రంథకర్త యొక్క జనాంతికం. క్వీక్వెగ్ అనే ఒక స్థానిక తిమింగిల శూలాయుధునితో నేస్తంగట్టిన ఇష్మేయిల్, "తోడేలువంటి నా హృదయము, వెర్రెత్తిన నా చేయి తో డేలువంటి ప్రపంచానికి మరి యెదురుతిరగలేదు" అని అన్నప్పుడు తన పేరుకి సంబంధించిన మర్మాన్ని సూచిస్తాడు. అయితే నవలలో మరెక్కడా ఆ యువకుని ఘోరదర్శనానికి ప్రసక్తి వుండదు. మొత్తానికి టైపీ కథకుడిలాగే వుంటా డితడుకూడ. క్వీక్వెగ్‌తో అతని స్నేహంకూడా అలాగే ఒక ప్రాథమిక దశకు సంబంధించిన విలువలను నిరూపించేదిగానే కనిపిస్తుంది. అయితే పానకంలో పుడకలాగు ఈ ఇష్మేయి లొకడు అని అనుకున్నట్లుగా మెల్విల్ ఆ కథాంశాన్ని జారవిడిచేశాడు. వరసగా ఇరవై యెనిమిది ప్రకరణాల్లో కథ ఇష్మేయిలే చెబుతాడు. ఆ తరువాత మూడు ప్రకర ణాల్లో (Enter Ahab నుంచి Him Stubb అన్నదనుక) ఇష్మే యిల్‌కి కథతో సంబంధమే లేదు. ఇతరుల స్వగతాలగురించి అత నెలా

తెలుసుకుంటాడు? మళ్ళా నవల ఇష్మేయిల్ కథనంలోకి దిగినా తఱచు అతడిని వదుల్చుకుంటూ వుంటుందికూడ. అసలు కథ ఎవడి చేతిమీద నడుస్తోందో, ఆ పుస్తకం ఏ తరగతికి చెందేది కాబోతున్నదో మెల్విల్ కే ఒక నిశ్చయ మేర్పడినట్లు కనిపించదు. అతడు షేక్స్పియర్ స్వగతాల బాణీలు బనాయించడానికి ప్రయత్నం చేశాడు. అయితే అదంతా, దాని అవకాశాన్ని అనవసరంగా విస్తృతం చెయ్యడానికీ, ఇష్మేయిల్ కి తప్పని సరియైన స్వల్పావకాశంనుండి దానిని తప్పించడానికీ చేసిన ఒక వికారమైన ప్రయత్నంలా గ్రహించవలసివుంటుంది. వెళ్ళినకొద్దీ మోబీడిక్ త్వరత్వరగా పరిణామం చూపుతుంది. తాజీవే అంశలు విడివడి ఇష్మేయిల్, ఆహాబ్ అనే రెం డవతారా లెత్తేరని ఎవరేనా అన్నా అనవచ్చు. అయితే ఒకవంక ఇష్మేయిలూ, మెల్విల్—ఇద్దరూ ఇంకా కథాఖ్యానగౌరవంకోసం పోటీపడుతున్నట్లే వున్నది.

ఇవన్నీ చిన్నచిన్న లోపాలు. అయితే మెల్విల్ ఆ వెంటనే వ్రాసిన Pierre; or the Ambiguities అనే నవలతోపాటుగా పరిశీలిస్తే ఈ నీహారలేశాలలోని చమత్కారంఅవగతమౌతుంది. 'మోబీడిక్' పూర్తికావచ్చినప్పటికే 'పీర్రె' అతని మనస్సులో మెదుల్తూవుండివుంటుంది. 'మర్డీ' లాగునే 'పీర్రె' కూడా చక్కగా నెరవేరి పేరుతెచ్చుకొన్నది కాకపోయినా స్మరణీయమైన వింతసన్నివేశంగలదవును.ఇందులో మెల్విల్ మొదటి సారిగా సముద్రాన్నీ, దూరదూరప్రదేశాలనూ విడిచి పెట్టేస్తాడు. సమకాలికమైన అమెరికాసంగతి ప్రథమపురుషలో చెబుతాడు. పీర్రె భాగ్యశాలియైన యువకుడు. అందచందాలు, కుటుంబము, సామర్థ్యము, ప్రధానమై పెళ్ళాడడానికి సిద్ధంగా వున్న అందమైన వధువు అన్నీ అమరి వున్నవాడు. అయితే వింతగా అతని జీవితరంగంలోకి మరో అమ్మాయి ప్రవేశిస్తుంది. తా నతని తండ్రికి చాటుగా పుట్టినదాన నని చెబుతుంది. ఆ తండ్రి చనిపోయాడు. పీర్రెకు ఆమె అంటే గట్టి మోజుకలుగుతుంది.

కాని తన తల్లి ఆ పిల్లనుగాని, అసలు తన భర్తయొక్క దోషాన్నిగాని అంగీకరించదని అతనికి తెలుసు. హేమ్లెటు పడ్డ అవస్థలో పడ్డాడు, పాపం, పీర్రె. అసలతనప్పుడు చదువుతున్న పుస్తకాల్లో హేమ్లెటు ఒకటి. ఒక వెర్రి తలవిసురుతో ఆమెను న్యూయార్కుకి తీసుకుపోతాడు. తానేదో ఆకస్మికమైన బుద్ధిహీనతవల్ల ఆమెను పెండ్లాడినట్లందరికీ నమ్మకం కలిగిస్తాడు. ఆ వార్త ఒక అఘాతం కాగా అతని తల్లి మరణిస్తుంది. కులవధువు క్రుంగిపోతుంది. పీర్రె నిర్ధనుడైపోతాడు. ఆ అమ్మాయీ, తానూ అక్కడా యిక్కడా దిక్కుమాలిన కొంపల్లో కాపురం చేస్తూవుంటారు. జీవికకోసం పీర్రె ఒక పుస్తకం వ్రాయడానికి ప్రారంభిస్తాడు. అయితే అతడు నిరాశాపరీతుడై వ్రాసిన ఆ పిచ్చిపుస్తకాన్ని ఏ ప్రచురణకర్తా స్వీకరించడు. చివరికి ప్రముఖపాత్రలన్నిటి చావుతో ఒక నెత్తురుమడుగు కట్టి కథ కంచికి పోతుంది. 'పీర్రె' నవలలో చాలాభాగం అస్వాభావికమైన యుక్తిచతురతతో, నడుమనడుమ సమకాలికసాహిత్య, సంఘసంస్కార పరిస్థితులపై సరసపరిహాస ధోరణితో సాగిపోతుంది. పోగారి ప్రధానపాత్రలవలెనే పీర్రెకూడ రచయితయొక్క రూపాంతరమే; వాళ్ళవలెనే అమెరికా అంటే రచయితకున్న అసంతృప్తిని వ్యక్తంచేసేవాడే. మొదట్లో మెల్విల్ ప్రజాస్వామికవాది. విట్‌మన్‌లాగే షేక్స్పియర్‌లోని ధనికస్తోత్రాలను గర్హించాడు. అయితే క్రమంగా అతని ఆ విశ్వాసం దిగనార్చుకుపోయింది. ప్రజల్లోని అవిమృశ్యకారిత్వం (కొంతవరకు తన గ్రంథాలవిషయంలోనూ), మానవస్వభావంలోని నైచ్యమూ అతనిలోని ఆశావాదప్రకృతిని దిగమింగేశాయి. అతడు పీర్రేను 1850 నాటి అమెరికాలోని దురవస్థకు గురియైన 1800 నాటి సంపన్నుడిగా చిత్రించాడు. ఇదివరకు 'పీపుల్' వేఱు, 'పబ్లిక్' వేఱు అని నిరూపించడానికి ప్రయత్నించిన మెల్విల్ ఇప్పుడు పీర్రే విషయంలో 'ప్లోటినస్‌ప్లిన్‌లిమ్మన్' అనేఆయన వేసిన ఒక కరపత్రంద్వారా కన్నీళ్లు తుడవడానికిమాత్రమే సిద్ధపడ్డాడు. ఈ కరపత్రం సదాచారావశ్యకతయే సామాన్య మానవుని ప్రవర్తనకు పరమావధి అనీ, అదే శిష్టులు,

విశిష్టులు అయినవారికైతే నాతికఠినమైననిస్సంగత్వంతో నిండైన సౌజన్యం వుండాలనీ బోధిస్తుంది. అయితే తాజీకంచేగాని,ఆహోబ్కంచేగాని ఏవిధం గానూ వివేకాతిశయం లేని పీర్రేకు-అస లాకరపత్రాన్నే ఎక్కడో పడే సినవాడికి దాని ఉపయోగ మేమీ లేదు. ఇదంతా చూస్తే అంతకుమూడేళ్ల క్రితమే, 'రెడ్ బర్న్' లో—"కొలంబస్‌కి ముందునుంచీ ఆసక్తిగల మాన వులు కోరుకొంటున్న మరోప్రపంచం న్యూయార్కులో అవతరించింది; కడలిమట్టం కనుగొన్న ఒడంబమే ఈ భూతలస్వర్గపు కాణాచినేలను పరిధిల జేసింది" అని ఉద్ఘాటించిన మెల్విల్ ఇంతలో ఎంత కుంచించుకుపోయాడు అనిపించకమానదు.

పీర్రేతరువాత తన వ్రాతలపై బ్రతికే ప్రయత్నంక్రమంగా విరమించు కున్నాడు మెల్విల్. ఇంకా కొన్నేళ్ళపాటు వచనరచన కొనసాగించాడు. అప్పట్లోనే 'ఇజ్రేల్ పాటర్' అనే దిక్కుమాలిన ఒక చారిత్రకనవల వ్రాశాడు. దీనితాలూకు అమెరికన్‌కథకుడు లండనులో నలభైయేళ్ళు అన్యాయంగా ప్రవాసం చేశాడట. 1 'ది కాన్ఫిడెన్స్ మేన్' అన్న నవల కూడా అప్పుడు వ్రాసిందే. ఇందులో మెల్విల్ ఒక చిన్న మిసిసిపీ స్టీము లాంచిమీద సాగరయాత్ర సాగించాడు. ప్రయాణీకులు కలిసికట్టుగా చేసే వంచనను, సులభవంచితులయ్యే పరిస్థితిని అధిక్షేపాత్మకంగా చిత్రించా లనుకొన్న మెల్విల్ ఉద్దేశమైతే బాగానేవుందిగాని నిర్వహణలో ప్రయా ణీకులఉద్దేశాలలోలాగే గజిబిజి యేర్పడిపోయింది. ఈ నవలలోని సందేశం 'ఇజ్రేల్ పాటర్', 1850 ప్రాంతంలో ఆయన వ్రాసిన మరికొన్ని కథలలో లాగే ప్లోటినస్‌ప్లిన్‌లిమ్మన్‌కరపత్రంకంటే భిన్నంగా వున్న ట్లనిపిస్తుంది.

---

1. ఈ Israel Potter స్వీయచరిత్ర 1824 లో ప్రకటింప బడింది. అసలుకథ తెలుసుకోవాలంటే చూ:Richard M. Dorson (ed.), America Rebels: Narratives of the Patriots (New York, Pantheon, 1953).

అప్పటికే అమెరికాలో ఒక విభేదపు వాతావరణం ఏర్పడుతూవుంది. థోరో సంఘంనుండి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. దాస్యమోచనవాదియైన గేరిసన్ అమెరికన్ రాజ్యాంగగ్రంథాన్ని బహిరంగంగా తగులబెట్టేడు. మెల్విల్ వట్టి ప్రేక్షకుడైనవాడు, అదృష్టవంతుడుకూడా అయితే, చావకుండా మిగలవచ్చు నని సూచించాడు. వేర్పాటుగా వుండడమన్నది స్థిరంగా సాధ్యమయ్యే విషయం కాదు. థోరో సాధించినంత మృదువుగా ఎప్పుడూ సాధింపబడలే దది. క్లేశజాలంలో చిక్కుకున్న 'బెనిటో సెరెనో' పై దుష్టుడైన నీగ్రో బానిస బేబో పెత్తనం చలాయిస్తాడు. అయింతా బెనిటోకి తన నాయకుడిని అనుసరించడంతప్ప, అంటే అతనిలా చావడం తప్ప గత్యంతరం వుండదు. ఒకవేళ వాడి పట్టు తప్పించుకున్నా ప్రాయసకాడైన బార్టిల్‌బీలాగైనా చావక తీరదు. ఇలా అంటే మెల్విల్ తన సొదనే వ్రాసుకున్నా డనిగాని, ఆనాటి అతని కథ లన్నీ నిరాశాపూరితా లనిగాని చెప్పడం కాదు. 'ది ఏపిల్ ట్రీ టేబిల్' అనే కథలో ఒక బలిష్ఠసుందరమైన కీటకంయొక్క ఆశావహమైన అభివ్యక్తి చిత్రణ మున్నది (గృహోపకరణాల కర్రను దొలిచి తన మార్గాన్ని ఏర్పరచుకుంటుం దది). థోరో వ్రాసిన వాల్డెన్ దాని ప్రసక్తితోనే అంతమవుతుంది. మెల్విల్ కథలు కొన్ని బాగా నేవున్నా అవి తనచుట్టూ వున్న ప్రపంచంతో పెనగులాట మానుకొన్న రచయిత వ్రాసిన వని మాత్రమే అనిపిస్తాయి.

ఇక ప్రజాయుద్ధం (Civil war) 1861 లో వస్తుం దనగా అంత కొంతముందు మెల్విల్ గద్యంనుండి పద్యకవిత్వంలో పడ్డాడు. సాయే లోగా ఒక బృహత్సంపుటానికి సరిపడ్డా వ్రాశాడు 'క్లేరెల్' (Clarel) కాక. 'క్లేరెల్' అతని పద్యకృతుల్లో పెద్దది. అది ఆ పుణ్యభూమికి ('Holy land' - Palestine కు బోలు) ఒక సాంకేతిక ఫక్కీలోనూ, యథార్థంగానూ సాగిన పూర్ణయాత్ర. ఎమర్సను థోరో కవిత్వం గురించి చెబుతూ "అతని సామర్థ్యం కన్న అతని ప్రతిభ గొప్పది"

అన్న మాటనే మనం మెల్విల్ కవిత్వం విషయంలోనూ అన్వయించుకో వచ్చు. పద్ధతి ప్రకారం చూస్తే అది కొంత విలక్షణంగా, వికారంగా కనిపిస్తుంది. ఓ పది పన్నెండు ఖండికలు, 'క్లేరెల్' లో అక్కడక్కడ కొన్ని భాగాలూ చాలా సంతృప్తికరంగా వున్నాయి. అయితే ఈ కొన్నిటి లోనే అన్నీ ఛందస్సు దృష్ట్యా నిర్దుష్టంగా లేవు. ప్రజాయుద్ధం గురించి వ్రాసినవి కొన్ని చాలా బాగున్నాయి. విట్‌మన్‌కి లాగే మెల్విల్‌కి గూడ ఆ యుద్ధమంటే అదో గొప్ప విషాదభీషణ సన్నివేశ మనిపించింది. ఒక విధంగా అత డలా అనుకోవడం సబబే:

"ప్రకృతి భయంకరాకృతి యంశ ఎదురు వచ్చింది నేడు
అకటా! ఆ రాగతానందము గుండె పగిలి ఎగిరిపోయింది"

అంటాడు మెల్విల్.

మాతృభూమి అంటే ఒక మౌలికమైన విశ్వాసాన్ని ఎన్నడూ కోలుపోలే దతడు. కాని అది అతనిలో ఒక కుశంకను దారితీస్తుంది. ఈ నాడు మానవుడు సాధించిన విజయం కాలాంతరంలో అతని పతనం కావచ్చు నంటాడు; "వ్యవస్థాపకుల స్వప్నం చెదిరిపోతుంది, కాలం వెనక ఎలా వుందో ముందూ అలాగే వుంటుం" దంటాడు. ఈ భావ సంఘర్షణే మానవప్రాభవం గురించిన అతని దృష్టిని యథాస్థితికి తేగలుగుతూ వుంది. ఏడో పడీ, ఎనిమిదో పడిలో పడ్డాక అతని కవిత ప్రధానంగా మానవుని ఔన్నత్యాన్ని అంగీకరించినవాని హితోపదేశంలా వుంటూ వచ్చింది. 'The Berg', లేక 'The Maldive shark' లలో లాగ ఒక్కొక్కపు డతని కవితలో బరువైన వ్యాకులత, ఒకప్పుడు సున్నితమైన విషాదశ్రుతి కనిపిస్తాయి: "ఏదిరా నెడ్‌బన్, మనం దిమ్మ తిరిగిన మహా ప్రపంచం ఎక్కడుంది?" అంటా డొకచోట.

మెల్విల్ జీవితాని కాశ్వాసాంతంలా వచ్చింది 'బిల్లీబడ్' (Billy Budd). అదో పెద్ద కథానిక. మళ్ళా ఇందులో నౌకను కథారంగం చేసి

అందులో వుండే కఠోర నియమనిబద్ధతను, కవితోపశ్రుతి ప్రతిపత్తిని ప్రదర్శించాడు. అలాగే తన కిదివరలో ఇష్టమైన దుష్టబుద్ధి పాత్రకు మళ్ళా ప్రసక్తి కల్పించాడు. 'వైట్ జాకెట్' లో 'బ్లేండ్' (Bland), 'రెడ్ బర్న్' లో జాక్సన్ - ఇద్దరూ ఇయాగో వారసులు. చెడు అంటే స్పష్టమైన అభిప్రాయంతో కార్యాచరణ కుద్యమించేవారు; మామూలుగా నవలలోని పాతబాణీ 'విలన్'లు కారు. అయితే వారిలో ద్వేషించవలసిన దానికంటె జాలిపడదగిన తత్త్వమే ఎక్కువగా కనిపిస్తుంది. ఈ 'బిల్లీ బడ్' లో - క్లేగర్ట్ అనే ఆయుధాధికారి బిల్లీ బడ్ అనే యోగ్యుడైన ఒక యువకుని అత డేదో తిరుగుబాటు లేవదీయబోతున్నా డనే అపోహతో తీవ్రంగా ఆక్షేపిస్తాడు. బిల్లీ బడ్ అతడిని పడగొట్టేస్తాడు. అతడూ ఇతడిని పడగొడతాడు. ఇద్దరూ ఒకరివల్ల ఒకరు చనిపోతారు. క్లేగర్ట్ దుష్టుడే కాని బిల్లీ అంటే అతనికి ద్వేష మెందుకు కలిగిందో చెప్పబడింది. అంతటికీ ఒక అనుమానం, ఒక అపోహ కారణం. ఆ మాత్రం దానికి బిల్లీది ఏసుక్రీస్తులాంటి స్వభావమనీ, ఆ నౌకాధికారి కెప్టెన్ వెరె దేవుడు లాంటి వాడనీ హంగూ, హంగామా చేశారు కొందరు వ్యాఖ్యాతలు. ఇదంతా మెల్విల్ చివరికి క్రైస్తవాశ్రమ స్వీకారం చేశాడని నిరూపించడానికి బనాయింపబడిన మతల బనవచ్చు. బిల్లీ అమాయికుడే, వెరె న్యాయవంతుడే అని తప్పక అనుకోవచ్చు. కాని ఇటీవలి విమర్శకులు చేసిన వ్యాఖ్యానాల భారం భరించడానికి బిల్లీవంటి చిన్న పాత్రకు సామర్థ్యం చాలదు. బహుశా అమితత్వంమీద మోజు తగ్గిన మెల్విల్ యే అమాయికత్వం వల్ల వచ్చే అనర్థాలు కూడా వుంటాయని ఒక చరిత్రాత్మక సంఘటన ద్వారా వ్యక్తం చేయదలచుకొన్నాడేమో! ఓటమి అన్నది ఎవరికీ తప్పనిది అని కూడా అభిప్రాయపడ్డాడేమో అనిపిస్తుంది. మరి తాజీ, ఆహాబ్, పీర్రేలవలె యాతన దేనికి? అందుకే బిల్లీ విషయంలో ఒక మేల్తరమైన తీర్పు చూపిస్తాడు; 'ఓమూ' లోని తహితీ ద్వీపవాసులలో వున్నట్లు బిల్లీలోను ఒక వేదనాత్మకమైన, అవ్యక్తమైన ఘనత వున్నట్లుగా చూపుతాడు:

"ఈ చేతి సంకెల లింత సడలించు
నన్ను బాగా దొర్లించు
నిదురమబ్బు క్రమ్ముతోంది
చిత్తడి దుస్తులు నాపై మెలిపడుతున్నాయి."

## వాల్ట్ విట్‌మన్

మెల్విల్‌కి సమకాలికుడే వాల్ట్ విట్‌మన్. ఇతడూ న్యూయార్కు రాష్ట్రంవాడే. ఇద్దరిలోనూ కొంత సామ్యం వుంది. ఒక అమితత్వం, ఆ ప్రక్కనే నిస్సంగత; ఒక పురుషకారం ఆ ప్రక్కనే ఒక ఆడారి బిడియమూ పొత్తు కలుపుకుని వున్నాయి యిద్దరిలోనూ.

"City of hurried and sparkling waters!
City of spires and masts!
City nested in bays! my city!—"

అని 'మన్నహాట్ట' గురించి విట్‌మన్ అన్న మాటలు మోబీడిక్ మొదటి ప్రకరణంలోని "insular city of the Manhattoes, belted round by wharves" అనే మాటల్లాగే వినిపిస్తాయి. అందులోనే 'కత్తిని పట్టగల కటారిని నెట్టగల చేతిలోని' ప్రజాతంత్ర ప్రభుత్వ ఘనతను విట్‌మన్‌లాగే శ్లాఘిస్తాడు మెల్విల్. ఇరువురికీ సముద్ర మొక అంతులేని చమత్కార నిక్షేపం. విట్‌మన్ కదొక లయాత్మకమైన జీవనాడి వంటిది. తరంగసైౖరమైన సాగరంతో తన కవితా గమనాన్ని సరిపోల్చుకుంటా డాయన. విట్‌మన్‌లాగే మెల్విల్ కూడ కొన్ని ఉత్తమ ప్రవచనాలు చేస్తాడు: ఆహాబ్ మాటలుగా - "ఓ ప్రకృతీ! ఓ జీవాత్మ! మీ అనుబంధాల సామ్యాలు వాగతీతంగా ఎంత దూరంలో వున్నాయి! ఎంత చిన్న పరమాణువూ పదార్థాన్ని కదిలించలేదు, పదార్థంపై బ్రతకలేరు.

కాని దాని యుక్తిసహమైన రూపాంతర మేదో మనస్సులోనే వున్నది.”
అంటాడు.

అయితే మెల్విల్‌కి, విట్‌మన్‌కు (ఇద్దరూ ఎన్నడూ ఒకరి నొకరు కలిసినట్లు లేదు; అలాగే ఒకరి రచనల గురించి ఒకరు పట్టించుకున్నట్లూ లేదు) మరికొన్నిట్లో తేడాలు లేకపోలేదు. విట్‌మన్‌లాగే న్యూఇంగ్లండు స్వభావానికి విరుద్ధంగా ఒక పరిపూర్ణతనూ, శక్తినీ కలిగివున్నప్పటికీ మెల్విల్ విట్‌మన్‌తోకంటె తన మిత్రుడైన హాథార్న్‌తోనే ఎక్కువ సన్నిహితమైన భావబాంధవ్యాన్ని కలిగివుంటాడు. రవికిరణసందీప్తాలైన సాగర తరంగాల క్రిందనే రాకాసు లున్నారు, నౌకాభంగభయోత్పాతహేతు వున్నది-అని యిలాగు నిగూఢక్లేశాల నాశంకించే మనస్తత్వం మెల్విల్‌లో వున్నది కాని విట్‌మన్‌లో లేదు. విట్‌మన్‌కి ఎమర్సనుతో భావబాంధవ్య మున్నది. విట్మన్ రచయితగా రూపొందుతున్న కాలంలో ఎమర్సన్ రచనలు అతనికోసమే ఉద్దిష్టాలైనవా అనిపించాయి. ఇద్దరి నోటుపుస్తకాలనుండి ఉద్ధరింపబడిన యీ ఉదాహరణలు రెండూ వారి అనుబంధాన్ని సూచిస్తాయి.

ఎమర్సను :

“ఒకనాడు వింతలుగా పరిగణింపబడిన విషయాల గురించే పాతిక ముప్ఫయ్యేళ్ళాయె వ్రాస్తున్నాను; ఉపన్యసిస్తున్నాను. కాని యీనాటికి నాకొక్క శిష్యుడుకూడా లేడు...వాళ్ళను దూరంగా పంపించెయ్యడమే నాకు సంతోషం. కాని వాళ్ళు కోరి వస్తే నేనేం జేస్తాను?—వాళ్ళవల్ల నాపనికి విఘాతం, నాకో బాధ్యత ఏర్పడుతాయి. నా మార్గాని కనుయాయి లేడన్నదే నాకొక గర్వకారణం. భావస్వాతంత్ర్యా న్నివ్వని మార్గానుసరణాన్ని అంతర్దృష్టికొక కళంకంగా పరిగణిస్తాను నేను.”

విట్‌మన్ :

“నేను గొప్ప తాత్త్వికుడి నేమీ కాను; నే నొక తత్త్వవ్యవస్థను కనిపెట్టి నెలకొల్పబోవడం లేదు...కాని నేను మీలో ప్రతిపురుషుడినీ,

స్త్రీనీ ఆ కిటికీదగ్గరికి తీసుకువెళ్తాను. వెళ్ళి నా ఎడంచేతితో మీచేయి పట్టుకుని కుడిచేతితో ఆదీ అంతూ లేని ఆ మార్గాన్ని చూపిస్తాను...కాని మీకు బదులు నేనుగాని, ఆ దేవుడుగాని ఈదారిన వెళ్ళడం జరగదు."

ఈ ప్రవచనాలు రెండూ ఒకదాని కొకటి తద్భిన్నంగా లేవుకాని గట్టి పోలిక వున్నది. ఇటీవల కొంతకాలంగా చెడును గుర్తించే మెలకువ హాథార్న్‌కీ, మెల్విల్‌కీ వుందని ప్రశంసించడమూ, ఈ సర్వోత్కృష్ట వాదులకు—ముఖ్యంగా ఎమర్సనుకి అది లేదని నిరసించడమూ విమర్శకుల కొక ఆచార మైపోయింది. సరే, ఇలాంటి మెలకువలను గురించిన సోమరి కుతూహలాన్ని ఒప్పుకుందాం కాని వెనుకపాటున వచ్చే పరాకుల మాటేమిటి? వీటితోపాటు వాటినీ నమ్మవలసిందేనా? విమర్శ కంతెక్కడికి? చూడగా విమర్శ అన్నది ఒకరియెడల అనవసరమైన అతిమాత్ర కాఠిన్యం వహించడం,మరొకరియెడల మితిమీరిన పక్షపాతంప్రదర్శించడం అన్నట్లుగా స్థిరపడిపోయేటట్లు తోస్తుంది దాని స్వభావం. కాని ఇటీవల వచ్చిన ఒక గొప్ప పుస్తకం 1 హాథార్న్‌ని ప్రశంసిస్తూ విట్‌మన్‌ని పట్టుకుని అత డన్నివిధాలా హాథార్న్‌కి విరుద్ధుడనీ, అమెరికన్ కవిత్వాన్నీ, వచన రచననూ పాడుచేసినవా డనీ దుయ్యబట్టడం శోచనీయం. విట్‌మన్ మహా రచయితలందరిలాగా అద్వితీయుడు, విశిష్టుడు. అత డెవరికీ ప్రతికూలుడు కాడు. అయితే కాస్త మితమైన ధోరణిలోతప్ప. అతని రచనల్లో ఎగుడూ దిగుడూ లేకపోలేదు. న్యూఇంగ్లండు 'ట్రాన్సెండెంటలిజమ్' ఎక్కడైతే అభేద్యంగా నిలవలేదో అక్కడే అదీ ఆక్షేపణకు గురి అవుతుంది. ఒకసారి నాగరికనారీమణి శ్రీమతి 'బి'గారు (Mrs. B) అలా వయ్యారంగా చెయ్యెత్తి 'ట్రాన్సెండెంటలిజమ్ అంటే కాస్త అతీతమైన దన్నమాట,

---

1. Marius Bewley, 'The Complex Fate': Hawthorne, Henry James and some other American writers (London, 1952).

(A little beyond) అన్నారు. ఎమర్సనుజర్నల్‌లో ఉదాహరింప బడిన యీ వక్కాణకు దీటుగానే వుంది, తన కవిత్వంగురించి తానే ఒక ఆకాశరామన్న సమీక్షు వ్రాసుకుంటూ 'వాక్యార్థము లనంతములు, అనిర్ధారితములు; ఎప్పుడూ అతీతమైన ఏదో అర్థాన్ని సూచిస్తూనే వుంటాయి.' అని విట్‌మన్ చేసిన ఉద్ఘాటన. ఎమర్సనులాగే ఇతడూ అవిచారమూలకమైన ఆశావాదాన్నీ, ఒక నిరాకార నిరంజనత్వాన్నీ ప్రదర్శిస్తూవుంటా డనే ఆక్షేపణకు గురి అయ్యాడు. రచయితగా ఈయన ముఖ్యోద్దేశాన్ని ప్రసిద్ధాలైన యీయన మాటలలోనే చెప్పాలంటే— "ముఖ్యంగా ఒక వ్యక్తిని, అంటే ఒక మానవుడిని (అమెరికాలో 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో వున్న నన్నే) స్వచ్ఛందంగా, సమగ్రంగా, సత్యాత్మకంగా సాహిత్యంలో ప్రతిష్ఠించాలి" అని. అదీ అతని ఆశయం. తన రచనలు అమెరికనులందరికీ, ఆ మాటకు వస్తే సర్వమానవసమాజైక తానమైన భావన గలవాడు కావడంవల్ల మానవు లందరికీ ఉద్దేశించాడు. అందుచేత ఆయనను వ్యక్తిత్వంగల కవి అనవచ్చును. ఈ సిద్ధాంతం వట్టి ముడియూహలతో వుందనీ, విట్‌మన్ దర్శనంలో గాంభీర్యం లేదనీ శాంటాయనగా రాక్షేపించారు. డి. హెచ్. లారెన్సు విట్‌మన్‌ని చాలా ప్రశంసించారు కాని—'నేనే అంతా, అంతా నేనే; మనమంతా ఒకటే; కొంతకాలమాయ సనిచెడిన యీ బ్రహ్మాండంలాగు అనన్యమైన ఏకైకమైన తత్త్వానికి చెందినవాళ్ళం' అనే విట్‌మన్‌వాక్యాల్లో (ఇవి 'పో' యొక్క 'Supernal Oneness'ని జ్ఞాపకంచేస్తాయి) గల ట్రాన్సెండెంటల్ డంబాన్ని గర్హిస్తారు.

కొందరు ఎమర్సన్‌లో కనిపించని మరికొన్ని విషయాలు విట్మన్‌లో గుర్తించి నిరసించారు. అవేమిటంటే—మరీ తీవ్రమైన దేశభక్తియొకటి (ఇది వాళ్ళ యింట్లో వున్నదే: వాళ్ళ నాన్న వరసగా తన కొడుకులు ముగ్గురికీ జార్జివాషింగ్టన్, థామస్ జెఫర్సన్, ఆండ్రూ జాక్సన్ అని ముగ్గురు అమెరికన్ అధ్యక్షుల పేర్లూ పెట్టేశాడు. ఇది అమెరికనులకు

అసహజమైన ఆచార మేమీ కాదు). పరిమాణాన్నీ, గుణాన్నీ సమంగా పరిగణించడ మొకటి. సిడ్నీ లేనియర్ అనే దాక్షిణాత్య - అమెరికన్ కవి విట్‌మన్ వాదధోరణి నిలా వెటకారం చేశాడు. అదెలా ఉంటుందటా—"మైదానం విశాలంగా వుంది కాబట్టి పోకిరీతనం ప్రశంసనీయమైనది, మిసిసిపీ నది పొడవుగా వుంది కాబట్టి ప్రతీ అమెరికనూ దేవుడే"అన్న ట్లుంటుందట! ఆఁ, విట్మన్ కావ్యం 'Leaves of Grass' యొక్క 1855 పీఠికలోని మాటలు పట్టుకొని అలా అని వుంటాడు లేనియర్. అందులో ఏమని వుందంటే:

"ఇదిగో ఇక్కడ వున్నది ఇది వట్టి దేశం కాదు. బహుసమృద్ధమైన దేశాల దేశ మిది. అజ్ఞాన బంధాలు త్రెంచుకుని అశేషప్రజానీకంతో ఘనంగా కదిలిపోయే కార్యదక్షత వున్న దిక్కడ."

ఇది కాకపోతే లేనియర్ ఆరోపణకు 1856 లో ఎమర్సనుకి విట్మన్ వ్రాసిన ఉత్తరంలోని యీ పంక్తులైనా కావచ్చు కారణం:

"ప్రపంచంలో వున్న పెద్ద ఆవిరి ముద్రణయంత్రా లిరవై నాల్గింటి లోను ఇరవై యొకటి సంయుక్త రాష్ట్రాలలోనే వున్నాయి."

ఇలాంటి ప్రకటనలు మనకు కొన్ని విషయాలను జ్ఞాపకం చేస్తాయి: అమెరికా అంతా ఒక్కసారి కాకుండా ఫ్రాన్సు,లేక జర్మనీఅంతేసి ఖండ ఖండాలుగా కనుగొనబడివుండవలసిం దంటాడు శామ్యూల్ బట్లర్.

"విట్‌మన్ దేశంగురించి మంచిమంచి పాటలు వ్రాస్తా డను కున్నాను. కాని దాని గొప్పలగురించి వట్టి పట్టికలు తయారు చేయడంతో సంతృప్తిపడేటట్టున్నా డతడు" అన్నా డెమర్సన్.

ఆ పట్టికలు పలుమలు పలురకాల ఎగతాళికి పాల్పడ్డాయి. అతని పదజాలంకూడా అలాగే అపహాస్య భాజనమై పోయింది. అది "భగవద్గీ తనూ, న్యూయార్కు హెరాల్డునూ కలిపేసిన పులగంలా వుంటుం" దన్నా

డెమర్సన్. విట్మన్ copious, orbic మొ॥ కొన్ని పదాలను విసు
గెత్తేటట్లు వాడేడు. ఘోరమైన శబ్దార్థ దోషాలు చేశాడు ('Seminal'
అని వుండవలసిన చోట 'Semitic' అనే శబ్దం వాడేడు). వింత వింత
పదాంతరూపాలు సృష్టించాడు. ఉదా: promulge, philosophs,
literats. అన్యభాషలనుంచి, ప్రముఖంగా ఫ్రెంచినుంచి కొన్ని శబ్దా
లెరువుతెచ్చుకున్నాడు: formules, delicatesse, trottoir,
embouchure, Americano cantabile. కపాలశాస్త్రం
నుండి కొన్ని మాటలు గ్రహించాడు: amative, adhesive. ఫలి
తాలు హాస్యాస్పదంగా వున్నాయి:

The freshness and candour of their physiognomy, the copiousness and decision of their phrenology...

In thy resplendent coming literati, thy full-lung'd orators, thy sacerdotal bards, kosmic Savans...

కస్టర్ యొక్క 'లాస్ట్ స్టేండ్' ('Last Stand') అనే పెద్ద వర్ణ
చిత్రపటాన్ని శ్లాఘించిన అతని (విట్మన్) ఆ సందేహాస్పదమైన ఉత్సా
హమే అతనిచేత అదే ధోరణిలో సురుచిరహాసవ్యంజకాలైన మాట లని
పించింది. ఆ తరువాత వచ్చిన అతని కృతుల ప్రతులలోగూడ వాటిని సరి
చేసుకోనిచ్చింది కాదు. అతడు తన కృతులను నిత్యం మళ్ళీమళ్ళీ పరిశీలిం
చుకొనేవాడు; కాని తఱచు దానివల్ల ఉపయోగంమాత్రం కనిపించేది
కాదు.

నిజానికి పనిచెడిన సందర్భంలో అతడు చాలా ఘోరదర్శనమిస్తాడు.
ఒక అనాగరకు డెవరో పనికిమాలిన దని పారేసిన టోపీ తెచ్చిపెట్టుకుని
గొప్పలు పోయినట్లు విట్మన్ తన విడ్డూరమైన శైలిని చూసుకుని మురిసి

పోతాడు. పిదపకాలంలో అతని చుట్టూ శిష్యులు పోగయ్యారు. అయితే ఏసుక్రీస్తువాలకంలా ఆడంబరంగా కనిపించే యీ దాడీవాలా కొక్క రెండాకులు తరవాయిగా వుంటారు వాళ్ళు ఆవిద్దూరపు వేషభాషల్లో—ఇదీ విట్‌మన్‌గురించి సామాన్యంగా పదిమందీ చెప్పుకునే ధోరణి. అయితే కాస్త సన్నిహితంగా ఆయనపరిచయం సంపాదించడానికి శ్రమపడే వాళ్ళకు అతని అపజయాలే అతని ఘనవిజయాల కవకాశమిచ్చాయని గ్రహించగలుగుతారు. ఎలాగో కాని, యీ సామాన్యపత్రికారచయిత, శ్రమజీవుల యోగక్షేమాలగురించి చిల్లరమల్లరరచనలు చేసినవాడు ఒక సరి క్రొత్త సమంజసమైన మార్గంలో మానవుడినీ, అమెరికాదేశాన్నీ గొప్పగా నిరూపించడాని కొక చక్కని పథకం భావించగలిగేడు. రకరకాల అతని అభిరుచులు,అనుభూతులు అన్నీ ఆ పథకానికి పరిపోషకాలుగా మలుచుకో బడ్డాయి: తల్లివంకవారి 'క్వేకర్' మతవిశ్వాసము: షేక్స్పియరు సాహిత్యము, సంగీతరూపకాలు—బహిరంగ వేదికలపై జరిగే పాటకచ్చేరీలలో, ఉపన్యాసాలలో అద్భుతశక్తిని ప్రదర్శించే పదజాలం; తన స్వభావస్థితి గురించి తనకు హామీనిచ్చే కపాలశాస్త్రము; ఎమర్సనులాగే తానూ విశ్వ లీలను దర్శించడానికి వీలిచ్చిన గొప్పగొప్ప విజ్ఞానశాస్త్రవిషయాలు; మార్టిన్ ఫర్కుహార్‌టుప్పర్‌యొక్క చక్రభ్రమణంలాంటి పద్యరచన; జార్జిసేండ్ వ్రాసిన 'Consuelo',దాని ఉత్తరకథయైన 'The Countess of Rudolstadt (బహుశా యిదే మానవజాతిప్రతినిధిగా తానొక పాత్ర నిర్వహించడానికి దాని స్వభావభావన కతని కవకాశమిచ్చింది కావచ్చును); దీర్ఘకావ్యనిరవకాశస్థితిని తనకు సూచించిన 'పో' (Poe); బ్రాడ్వేలోనూ, బ్రూక్లిన్ ఫెర్రీలోనూ కనిపించే జనసమూహాలు; అభిముఖమైన అట్లాంటిక్‌మహాసముద్రపు పోటు; జనపదపరిసరాల్లో వివిధ ఋతువులు వినిపించే మధురస్వరప్రవాహము; తన సాగరతీరనివాసమునుండి పశ్చిమాశాభిముఖంగా అఖండంగా కొనసాగిపోయిన అమెరికామహామహీమండలంగురించి తన కేర్పడిన ప్రత్యక్షపరిజ్ఞానము—ఇవీ, ఇంకా అనేక

విషయాలూ కలిసి అతని 'Leaves of Grass' కావ్యంగా అవతరించాయి—అతని ముప్ఫయ్యారో ఏట, ఒక అమెరికా స్వాతంత్ర్యమహోత్సవ దినాన (ఆ ప్రథమప్రతిప్రావిర్భావము జులై 4, 1855 సం.). అందులో వున్నవి పన్నెండు ఖండికలు. అందు సర్వోత్కృష్టమైనది 'Song of Myself' అన్నది. అతని పీఠికలైతేనేం, కవితలైతేనేం (విట్మన్ గద్యం అతని పద్యంతో కవగట్టినట్లే వుంటుంది) ఎమర్సన్ మహాశయుడు చెప్పిన లాంటి సత్యాలనే, అంటే సామాన్యమానవులలోని దివ్యాంశ, గతానుగతికమైన జీవనలీలలో వారి భాగస్వామ్యం మొదలైనవాటిని ఉద్ఘాటిస్తాయి. తక్కిన సందర్భాల్లో ఆ కవితల పరిమళమే వేఱు. అది ఎమర్సనీయము కాదు. ఆ తరువాత చేర్పులూ, మార్పులతో వచ్చిన ప్రతుల వైఖరీ అంతే. పూర్వపూర్వ ప్రతుల్లో మాత్రం అక్కడక్కడ ఎమర్సన్ ప్రదర్శించిన సంతృప్తి తత్త్వము కొంత లేకపోలేదు. అయితే అది ఆవిష్కృతమైన పద్ధతిలో తేడా వున్నది. ఎప్పుడేనా ఒకప్పు డది కటువుగాను, మరొకప్పు డది ఎమర్సనుగారి ఛలోక్తుల్లా మొహంమొత్తే పరిహాస ధోరణిలోనూ వుంటుంది. కాని సర్వసాధారణంగా మనం ప్రతిస్పందనం పొందక తప్పని ఉల్లాససల్లలితంగానే వుంటుంది. కొన్ని కొన్ని కండపట్టులాంటి సందర్భాల్లో ఆ కవితా ఖండిక లనుపమస్ఫూర్తిమంతాలై వుంటాయి. కొన్నిట ఎమర్సను రచనలలో లేని ఉషస్సుష మోపమమైన నిత్యనూతనసంతోషసౌరభం గుబాళిస్తూ వుంటుంది:

To behold the day - break!
The little light fades the immense and
diaphanous shadows,
The air tastes good to my palate...
I hear bravuras of birds, bustle of growing
wheat, gossip of flames,
Clack of sticks cooking my meals...

The glories strung like beads on my
smallest sights and hearings, on
The walk in the street and the passage
over the river—

[ప్రొద్దుపొడుపును చూడాలని
చిన్ని దివ్వియకూడ చక్కని మెలుగారునీడలను మట్టుపెడుతోంది.
పవనాంకురములు చవిగొల్పుతున్నవి...
పులుగుల కిలకిలా రావములు, గోధుమచేల గలగలలు,
జ్వాలల పేలాపన
నా కూడును వండే కట్టెలు మండే కటకట సవ్వడి...
నడివీథిని బడి నడిచిపోయినా, నదిపై పయనించినా
ఎటు కన్నా, ఎటు విన్నా పూసగ్రుచ్చిన ట్లున్నవి శోభలు!]

ఇలాంటి పంక్తుల నెవడు కాదంటాడు? ఇది పద్య మవునో కాదో ఎవడు పట్టించుకుంటాడు? సమపాళ్ళమైన యీ విట్మన్ రచన స్వాభావికమైన ఆకలికి తగిన ఆహారంవంటిది.

ఇందలి సందేశం హాథార్న్ ఇచ్చిన సందేశంకన్నా గాంభీర్యంలో కొఱవడివున్నదని మనం అంగీకరించినా ఇలాంటిది విట్‌మన్ సాహిత్యంలో ఒక అంశమాత్రమే. మేక్స్ బీర్బమ్‌చేత ఒక కార్టూన్‌లో ఎగతాళిగా చిత్రించబడిన విట్మన్ పిదపకాలంలో బాగా పరిణతుడయ్యాడు. ఆ మొదట్లోకూడా విమర్శకులాక్షేపించినంత యిదిగా లేడు విట్మన్. బయటా లోపలా కూడా కాస్త పట్టించుకోనేవాడు కాదు, అంతే. అయితే కొందరు సమకాలికులైన సమీక్షకులు చెప్పినట్లు, తనపక్షం వహించి తన కళ్మలాన్ని సంఘంలో బహిరంగంగా ప్రక్షాళనచేసే పుణ్యం గట్టుకొన్న ఒకాయనతోమాత్రం ఆంతరంగికంగా వ్యవహరించేవాడట! తన కవిత్వంలోని భావస్థితి ధ్వనిమార్గంలో వుంటుం దంటా డాయన.

అందులో ప్రతివాక్యంలోనూ ఏదో గభీరమైన అంతరార్థం వున్నదంటాడు. అందులో కొన్ని వాక్యాల్లోని నిగూఢత్వానికి కారణం బహుశా తనలోని సలైంగికాభినివేశాలను దాచుకోవాలనే స్వాభావికమైన కోరిక అయినా కావచ్చును. ఏమయితేనేమి, (మనకు కావలసిన) అతని బహిఃస్వరూపంలో దానికి నిమిత్తం లేదు. ఈ పంక్తులలోని చమత్కారం చిత్తగించండి :

**Ever the hard unsunk ground,**
**Ever the eaters and drinkers, ever the upward**
**and downward sun, ever the air and the**
**ceaseless tides,**
**Ever myself and my neighbours, refreshing,**
**wicked, real,**
**Ever the old inexplicable query, ever that**
**thorn'd thumb, that breath of itches and**
**thirsts,**
**Ever the vexer's hoot! hoot! till we find**
**where the sly one hides and bring him**
**forth,**
**Ever love, ever the sobbing liquid of life,**
**Ever the bandage under the chin, ever the**
**trestles of death.**

[ఆ కపటనాటక సూత్రధారి ఎక్కడ దాగున్నాడో మనం
కనుగొన్న దాక, కన్నదాక —
ఎప్పుడూ అదే క్రుంగని కుతలము,
ఎప్పుడూ తినేవాళ్ళు, త్రాగేవాళ్ళు, అలా క్రిందికీ మీదికీ
అర్కుని గమనము,

ఎప్పుడూ అలా సేదదేరుతూ, నీచంగా, నిక్కముగా ప్రవర్తిస్తూ
నేనూ, ఇరుగుపొరుగులవారూ,
ఎప్పుడూ అదే అర్థం అంతుపట్టని ప్రాచీనప్రశ్న,
ఎప్పుడూ అదే క్రూరవిధి, అదే కండూతిపిపాసలతో కైపెక్కిన
ఊపిరి,
ఎప్పుడూ అదే కేక, వేసారినవారి వెఱ్ఱికేక!
ఎప్పుడూ అవే ప్రేమలు అనుబంధాలు, అదే జీవితనిశ్వాసస్రవంతి,
ఎప్పుడూ ముంజేతికి సంకెల, మృత్యువున కంకవన్నియ.]

విట్మన్ వ్రాసిన **'Song of Myself'** నుండి కలవరంతో హృదయాల నుగ్గబట్టే ఇలాంటి ఖండాల నొకయాభై అయినా ఎత్తి చూపవచ్చు. అతని సాహిత్యాన్ని మొత్తంగా చూసినా అతడు మన లోకంలో అసమత్వముగాని, బాధగాని లేవని చెప్పదలచుకొన్న పూనిక గలవాడుగా తోచదు. అసలు, 'బాధ లన్నవి నాకు దుస్తులు మార్చడం వంటి' వంటా డాయన. ఆయన తన దేశాన్నే నిర్దాక్షిణ్యంగా విమర్శించ గలడు కూడ:

**Let there be no suggestion above the suggestion of drudgery !**
**Let none be pointed toward his destination !**
**....................**
**Let the sun and moon go ! let scenery take the applause of the audience ! let there be apathy under the stars !**

[పాటుపడమని చెప్పడం తప్ప ఆపై మరే సూచనయు లేకుండుగాక!
ఎవనికీ తన గమ్యంవేపు చూపు పడకుండుగాక!
సూర్యుడూ చంద్రుడూ వెళ్తూవుండనీ! ఏ దృశ్య మా ప్రేక్షకుల
మెప్పు పొందనీ! తారాబలంతో ఉదాసీనత వుండనీ!]

ఈ పంక్తులు 'Respondez' అనే ఖండికలోనివి. అది తరువాతి ప్రతుల్లో పరిహరింపబడింది. కాని యిలాంటి భయక్రోధాలు తక్కిన ఖండికల్లోనూ వున్నాయి; 'Democratic Vistas' అన్న గద్యకృతి లోనూ వున్నాయి.

భయమూ, దిగులూ అన్నవి అతనికి స్వాభావికమైన మనఃస్థితులు కావు. జీవితంయొక్క ఉచ్చనీచస్వభావస్థితులలో అతనికున్న ఆనందమూ, సంతృప్తీ, చావు విషయంలో అతనికున్న ఒకవిధమైన అమరత్వభావన— ఈ రెండూ సరియైన తూకము గలవి:

**The smallest sprout shows there is really**
**no death,**
**And if ever there was it led forward life,**
**and does not wait at the end to arrest it,**
**And ceas'd the moment life appear'd.**

**.......................**

**All goes onward and outward, nothing**
**collapses,**
**And to die is different from what anyone**
**supposed and luckier.**

[నిజానికి చావన్నది లేదని చిన్న చిగురు నిరూపిస్తున్నది
ఉంటే ఒకవేళ, జీవుడి నెదుటికి నెడుతుంది గాని ఎక్కడో
చివర దాని నడ్డుకోడానికి దారి కాయదు
జీవము పొడలిన మరుక్షణంలో తోకముడిచేస్తుంది మృత్యువు.

.......................

అన్నీ పైపైకి పయనిస్తాయి, ఏదీ పడిపోదు
మరణమంటే ఇదివర కెవ్వ రనుకొన్నదీ కాదు; అదొక
మహాయోగం.]

విట్మన్ వృద్ధుడవుతున్నకొద్దీ అతని భావనను మరీ బలంగా ఆక్రమించుకొంది మృత్యువు. అయితే ఒక జీవితానికీ, మరో జీవితానికీ మధ్య ఒక విష్కంభంలాగు మాత్రమే. అతనికి చావంటే నదురూ బెదురూ లేదు. చాలా చిన్నప్పుడే బ్రతుకున కొక సలాం కొట్టేశాడు. నలభయ్యో ఏట వ్రాసిన **'The Wound Dresser'** లో 'మూడుకాళ్ళ ముదుసలినైనా క్రొత్తముఖాల మధ్యకే వస్తాను' (**'An old man bending I come among new faces'**) అంటా డాయన.

ఆ 'సివిల్ వార్' కాలంలో ఆసుపత్రులు కొంత దోహదం చేసినట్లున్నాయి యిలాంటి అభిప్రాయాలకు. వెనకటి కొక గ్రీకుచరిత్రకారుడంటాడుగదా—శాంతికాలంలో (యుద్ధంలేని కాలంలో) కొడుకులు తండ్రులను పాతేస్తారు; యుద్ధకాలంలో తండ్రులు కొడుకులను పాతేస్తారు అని. ఆ కాలపు టమెరికను రచయితలలో యుద్ధపు బీభత్సాన్ని ఒకవంక గ్రహిస్తూనే ఒంటరిగా బతికినవాళ్ళు మెల్విల్, విట్మన్ ఈ యిద్దరే అనిపిస్తుంది. విట్మన్ తన్నుతా నొక తండ్రిగా భావించుకున్నాడు. సమరాంగణ యమయాతనలన్నీ తట్టుకొని అమెరికా దేశం దేశమంతా శస్త్రవైద్యుడి మునివాకిటికి హాజరుకావడం చూశాడు. అతని కవితావేశం విషాదనిషాదశ్రుతి నందుకొన్నది :

**"Word over all, beautiful as the sky,**
**Beautiful that war and all its deeds of**
**carnage must in time be utterly lost,**
**That the hands of the sisters Death and Night**
**incessantly softly wash again, and ever**
**again, this soil'd world."**

అని సమరాలూ, దారుణసంహారకాండలూ పూర్తిగా అంతరించాలనీ, ఒకవంక మృత్యువు, రాత్రి అనే అక్కచెల్లెళ్ళు ఎప్పటికప్పుడు కలుషితమైపోయిన లోకాన్ని ప్రక్షాళితం చేస్తున్నారనీ అంటాడు.

ఏవంవిధమైన ప్రశాంత పరిణత స్థితి మహానుభావుడు లింకన్ గురించి విట్మన్ వ్రాసిన గొప్ప కావ్యం 'When lilacs last in the dooryard bloom'd' లోనూ కనిపిస్తుంది.

1855 లో తన Leaves of Grass పీఠికలో విట్మన్-'మానవు లందరిలోనూ మహాకవి అనిపించుకొన్నవాడే సమభావన గలవాడు' ('equable man') అంటాడు. ఆ మాటకు 'By Blue Ontario's Shore' లో మళ్ళా ప్రసక్తి ఏర్పడుతుంది. ఆ'equable' అనే మాటే విట్మన్ యొక్క విలక్షణ ప్రవృత్తిని విశదం చేస్తుంది. ఆత్మాభిమానం వినయసనాథం కావాలంటాడాయన. ప్రజాస్వామికమనే గొప్ప వ్యవస్థకు ప్రకృతిలో పెరుగుదల గల వస్తువు లన్నిటిలోకీ చిన్నదైన గడ్డిని సంకేతంగా చేస్తాడు. అతడూహించిన నవ్యమానవు డంత నిరాడంబరంగాను మాట్లాడుతాడు. జీవిత నిర్మాణం ప్రాచీన శిల్పసదృశమైన నిబద్ధత గల దన్న అభిప్రాయ మాయన కొక వట్టి కల్పనగా తోస్తుంది. అది ప్రకృతిసిద్ధాలైన అన్ని వస్తువులలాగే సాంగోపాంగమైన ఆకారం గలదనీ, అయితే ఆ ఆకారం మనం ముందుగా ఊహించగలిగినది కాదనీ, నిర్మాణంలో ఒక నిబద్ధత లేనిదనీ, ఒకప్పుడు సాపేక్షంగా కూడ వుంటుం దనీ ఆయన ఉద్దేశం. అబ్రహాం లింకన్ మరణం గురించి ఒక ఉపన్యాసంలో ఆ హత్య లోకంలో ఒక అతి సామాన్యమైన సన్నివేశంలా, అంటే ఒక మొగ్గో కాయో విచ్చుకున్నట్లు ప్రశాంతంగా, నిరాడంబరంగా జరిగి పోయిం దంటాడు.

ఇటువంటి సందర్భంలో తమ శబ్దాడంబరం ప్రకటించుకోకుండా ఈ అవకాశాన్ని జారవిడుచుకోడానికి సిద్ధపడే రచయిత లెంద రుంటారు? కాని విట్మన్ తన కవిత్వంలో ఎలాగైతే ప్రకృతిలోలాగే ఒక ప్రత్యేకమైన ఉద్దేశమూ, అంగోపాంగ నిమిత్తమూ లేకుండా సంఘటనలు వర్ణితాలౌతవో అలాగే ఈ సంఘటననీ ఇట్టే అలవోకగా చెప్పేశాడు. ఒకచోట తన గురించి చెప్పుకుంటూ కవి అన్నవాడు తన పద్యపు పాదు

క్రింద తన లయనూ, సమస్వరూపతనూ దాచుకుంటాడనీ, అవి వాటికోసం చూస్తే కనిపించవనీ, వాటంతట అవే ఏ పొదమీదనో లీలక్ మొగ్గలు విచ్చుకొన్నట్లు, దోసకాయలూ, అడవిబాదం పిక్కలూ, బేరిపళ్ళవలె ఒక కుదురైన ఆకారం కూర్చుకొన్నట్లు కనిపిస్తాయనీ అంటాడు. సమకాలికులైన కవులలో అప్రయత్నసిద్ధమైన సద్యఃస్ఫూర్తి, నిజమైన హృదయస్పర్శ కొరవడ్డాయని వాపోతాడు. టెన్నిసన్ రచన లెత్తుకుని అందులో- 'ఆ పుటలన్నిటా ఒక అదృశ్యగంధంవలె వ్యాపించివున్న ఆంగ్ల సామాజిక జీవిత వాసన, వాళ్ళ నిర్వ్యాజపారతమ్యము, సంప్రదాయాలు, చాదస్తపు టలవాట్లు, సుఖాతిరేకము వలని విసుగుదల, లోపల వెన్నుకు బట్టిన కొవ్వులాంటి శృంగారలాలస, ప్రాత కొంపలూ సరంజామూ, అంతటా బూజుపట్టిన రహస్యాలు, చీపర పాపర తీగెలతో పాకుడుతో నిండిన గోడలు, కండకం, ఆంగ్లదేశ బహిరంగ దృశ్యాలు, ఎండలో కిటికీ సందులో రొదచేస్తూ ముసిరే ఈగ' మొ॥ చూసి వ్యసనపడతాడు విట్మన్.

ఆయనకు కవులంటే వున్న అభిప్రాయాన్ని ఈ నిరాడంబర చతుర ప్రసంగానికి దీటుగా గ్రహించవచ్చు. ఆయనదృష్టిలో కవి అంటే ఒక ప్రాడ్వివాకుడిలా తీర్పు చెప్పేవా డని కాదు; దిక్కుమాలిన వస్తువును గూడ దీప్తిమంతం చేసే సూర్యుడిలా వుండేవాడు.

కవుల విధుల గురించి కవులు చేసే సర్వనిర్వచనాల్లాగే ఇది కూడ ఒక వ్యక్తిగతమైన వక్కాణే అవుతుంది. అయితే చాలా నిర్వచనాలకంటె యిది మరీ వగులుగా వుంది. అది కాని భవిష్యదమెరికా కవికి ఏదో అంతర్జ్ఞాన విశ్వాసపు మైకంలో పడిపోయే ప్రేరణ కలిగించే మాటయితే అది అపాయకరమైన సలహాయే అవుతుందని వక్కాణించిన విమర్శకులతో మనం ఏకీభవించవచ్చు. నిజానికి విట్మన్‌ని పూర్తిగా అంగీకరించలేము కాని ప్రాత ప్రపంచానికీ క్రొత్త ప్రపంచానికీ మధ్య గల తేడాను ఎత్తి చూపుతూ, అమెరికన్ మార్గదర్శిని శ్లాఘిస్తూ అమెరికన్ జనసామాన్యం

తప్పక తమ దేశికోత్తములను సంభావించడానికి పూనుకొంటారని ఆశిస్తూ తన కావ్యవాణిని వినిపించిన పలుతావుల అతడవశ్యం అభినందనీయుడే. కాని అమెరికన్ అనుబంధాల గురించి ఆయన చేసిన చిత్రణ కొంత కలవర పెట్టేటట్లుగా వుంటుంది. ఈ నాడు అమెరికాలో జనసామాన్యానికి అతని కావ్యఖండాల్లో కల్లా సమయకేవలమైన (thoroughly conventional) 'O Captain ! My Captain !' అనే దొక్కటే తెలిసివుండడంలో వుంది చమత్కారం. ఉన్న దౌర్బల్య మంతా అతని 'పబ్లిక్' కవిత్వంలోనే వుంది. అయితే జనసామాన్యానికి ప్రరోచకంగా వుండాలని అతడు చేసిన ప్రయత్నంలో మాత్రం స్వభావతః ఏదో కాస్త ఉదాత్తమైన అమెరికనుతనమే వున్నది. ఇందులో అతడొకవేళ భంగపడినా అది అతని కంత వ్యసనకారణం కాదు. కవి యన్నవాడు నేరుగా మానవసమాజాన్ని ఉద్దేశించి మాట లాడకపోయినా మానవులకోసం మాట్లాడగలడు కదా. ఈ విధంగానే విట్మన్ తన ఉత్కృష్టతను నిరూపించుకొన్నాడు.

# 6

# మరికొందరు న్యూఇంగ్లండు రచయితలు

## బ్రాహ్మణకవులు - చరిత్రకారులు

### హెన్రీ వేడ్స్‌వర్త్ లాంగ్‌ఫెలో (1807-82) :

అభిజనము పోర్టులండ్, మెయిన్. విద్యాభ్యాసం బోడోయిన్ కాలేజీలో. అక్కడ హాథార్న్ సహాధ్యాయుడు. 1826-9 ఫ్రాన్సు, స్పెయిను, ఇటలీ, జర్మనీలలో పర్యటన. తిరిగి వచ్చాక బోడోయిన్‌లో ఆధునిక భాషాశాఖాచార్య పదవి (1829-35). 1835 లో మళ్ళా యూరపు పర్యటన చేసి వచ్చి హార్వర్డులో టిక్నర్ తర్వాత ఫ్రెంచి స్పానిష్ భాషా శాఖాచార్యుడయ్యాడు. 1854 వరకు అనిష్టంగానే ఆశాఖాధ్యక్షపదవి నిర్వహించి, ఆ యేడే సాహిత్య వ్యాసంగం చేసుకోడానికని ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. అప్పటికే తన గద్యపద్య రచనలతో ఆయన

అంతర్జాతీయ ప్రతిష్ఠ నందుకొన్నాడు. ఆ రచనలు : Hyperion (1839), Voices of the Night (1839), The Spanish student (1843), Evangeline (1847). Hiawatha (1855), The Courtship of Miles Standish (1858), ఇంకా మరికొన్ని రచనలూ ప్రకటింపబడటంతో ఆయన ప్రతిష్ఠ పెరుగుతూ వచ్చింది. ఆయన రెండుసార్లు వివాహం చేసుకోవలసి వచ్చింది; పాపం, భార్య లిద్దరూ విచారకర పరిస్థితులలోనే చనిపోయారు.

## జేమ్సు రస్సెల్ లోవెల్ (1819-91) :

అభిజనము: కేంబ్రిడ్జి, మసాచుసెట్స్. విద్యాభ్యాసం: హార్వర్డులో. 1844 లో సంస్కర్త్రి శిరోమణి మెరయా వైట్‌ను వివాహమాడి, ఆమె ప్రభావంతో బానిసతనాన్ని వ్యతిరేకిస్తూ కొన్ని రచనలు చేశాడు. 1848 లో A Fable for Critics, Biglow Papers (మొదటి వరుస) అనే రచనలతో శీఘ్రకాలంలోనే పేరు చేసుకొన్నాడు. 1853 లో మెరయా చనిపోయింది. ఆ తరువాత సంస్కరణోద్యమంలో ఆయన ఆస్థ సన్నగిల్లింది. 1855 లో హార్వర్డులో లాంగ్‌ఫెలో తరువాత ఆ పదవికి నియుక్తు డయాడు. మరి కొద్ది సంవత్సరాలలో కవితలూ, వ్యాసాలూ శరపరంపరగా కురిపించాడు. 'అట్లాంటిక్' మాస పత్రికకు తొలి సంపాదకు డితడే. 'నార్త్ అమెరికన్ రివ్యూ'తో కూడ సంబంధం గలవాడు. తదుపరి స్పెయిన్‌కి మినిస్టర్ (1877-80), ఇంగ్లండుకి మినిస్టర్ (1880-5).

ఆలివర్ వెండెల్ హోమ్స్ (1809–94) :

పుట్టుక: కేంబ్రిడ్జి, మసాచుసెట్స్. చదువు: హార్వర్డు. ఫ్రాన్సులో వైద్యవిద్యాభ్యాసం చేసి, డార్ట్‌మూత్‌లో కొంతకాలం అధ్యాపనం చేసిన తర్వాత హార్వర్డులో శారీర, శరీరధర్మశాస్త్రాల్లో ఆచార్యు డయ్యాడు (1847-82). బోస్టన్‌లో, కేంబ్రిడ్జిలో సాంస్కృతిక సామాజిక కార్య క్రమాల్లో ప్రముఖపాత్ర నిర్వహిస్తూ వుండేవాడు. మొదట కథకుడుగా, పద్య రచయితగా ప్రాదేశికంగా లబ్ధ ప్రతిష్ఠు డయాడు. పిదప The Autocrat of the Breakfast - table (1858), The Professor at the Breakfast - table (1860), The Poet at the Breakfast - table (1872), మరో మూడు నవలలు, కొన్ని పద్యసంపుటాలు - వీటితో వ్యాప్త యశస్కు డయ్యాడు. అతని పేరిటివాడే అయిన అతని కొడుకు కూడా ప్రఖ్యాతుడైన హార్వర్డు వ్యక్తి.

విలియమ్ హిక్లింగ్ ప్రెస్కాట్ (1796–1859):

అభిజనం: సేలం, మసాచుసెట్స్. విద్యాభ్యాసం: హార్వర్డు. 1815-17 సం॥లలో యూరపులో పర్యటన చేస్తూ చారిత్రక పరిశోధన కుపక్రమించాడు. చాల శ్రమపడి History of Ferdinand and Isabella (3 సంపుటాలు, 1838) ప్రకటించి కృతకృత్యు డయాడు. అది చూచి "పట్టుదలకు, ఏకాగ్రతకు ఫలస్వామ్యం పొందగలిగే వారి కిత డొక ఆదర్శనిదర్శనం" అని ఇతని గురించి అభివర్ణిం చాడు లాంగ్‌ఫెలో. తరువాతి రచనలు: History of

the Conquest of Mexico (3 సం॥ 1843), Conquest of Peru (2 సం॥ 1847), Phillip II చరిత్ర (2 సం.)

జాన్ లోత్రోప్ మోట్లే (1814-77) :

అభిజనం: బోస్టన్. విద్యాభ్యాసం: హార్వర్డు; పిదప రెండేళ్ళు జర్మనీలో. తరువాత బోస్టన్‌లో న్యాయశాస్త్ర వ్యాసంగం, Morton's Hope (1839), Merry Mount (1849) అనే నవలల రచన, నెదర్లండ్స్ చరిత్ర రచనా ప్రారంభం. తన పరిశోధనల ఫలితంగా The Rise of the Dutch Republic (3 సం॥ 1856), History of the United Netherlands (4 సం॥ 1860, '67), Life and Death of John of Barneveld (2 సం. 1874) అనే పుస్తకాలు వ్రాశాడు. ఆస్ట్రియాకు మినిస్టర్ (1861-7). 1869-70 లో బ్రిటన్‌కి మినిస్టర్‌గా వుండగా తన తప్పేమీ లేనిదే ఉద్యోగంనుండి విరమించుకుని పోవలసి వచ్చింది.

ఫ్రాన్సిస్ పార్క్‌మన్ (1823-93) :

అభిజనం: బోస్టన్. విద్యాభ్యాసం: హార్వర్డు. 1843-4లో యూరపు పర్యటనం. 1846లో అమెరికాపశ్చిమ ప్రాంతంలో పర్యటించి అక్కడ శ్రమతో జీవితం గడుపుతూ ఆరోగ్యం పాడుచేసుకొన్నాడు. అయితే Oregon Trail (1849) అనే తన రచనకు సామగ్రి మాత్రం సేకరించుకున్నాడు. అంత దుర్భరమైన అనారోగ్యంలోనూ అమెరికన్ వలసల్లో ఆంగ్లేయులూ, ఫ్రెంచివారూ పడినపాట్ల

గురించి వరసగా గొప్ప రచనలు చేశాడు. అతని రచనలు : History of the Conspiracy of Pontiac (1851), Pioneers of France in the New World (1865). మరి ఆరు సంపుటాలు : A Half-century of Conflict (1892); Vassall Morton (1856) అనే ఒక నవల; ఉద్యానవనసంరక్షణ గురించి ఒక పుస్తకం. ఆ విద్యలో ఆయన హార్వర్డు ఆచార్య పదవిలో వుండేవాడు.

'సివిల్‌వార్' తరువాతి రోజుల్లో బ్రతికివున్న అమెరికన్ రచయితల పేర్లు కొన్ని వరసగా చెప్పమంటే కొద్దిమంది మాత్రమే మెల్విల్ విట్మన్‌ల పేర్లు చెబుతారు. ఆ కొద్దిమందీ ఎమర్సన్ పేరు విధిగా చెబుతారు. బహుశా జాన్ జి. విట్టియర్ అనే 'క్వేకర్'కవి పేరుకూడ చెబుతారు. ఈ ఇద్దరూ మసాచుసెట్స్ రాష్ట్రీయులు. అయితే ఆ ప్రాంతీయాభిమానం కేవలం మసాచుసెట్స్‌కి సాధారణమైనది కాదు, బోస్టన్‌కి (కేంబ్రిడ్జికి సన్నిహితమైన హార్వర్డుకికూడ) ప్రత్యేకమైనది. వాళ్ళరోజుల్లో అక్కడివాళ్ళకి అద్భుతమైన ప్రఖ్యాతి వుండేది. లాంగ్‌ఫెలో వ్రాసిన 'Psalm of Life' (జీవిత సంకీర్తన) వంటి ఒక ఖండకావ్యం వుందంటే అది బాడిలెయిర్ (Baudelaire)కీ, (అతని 'Le Guignon' అనే సానెట్‌లో సూచింపబడినట్లు), క్రిమియాలోవున్న ఒక ఇంగ్లీషు సిపాయికీ (అతడు సెబాస్టపూల్‌లో మరణశయ్యపై ఉన్నప్పుడా గీతంలోని ఒక పంక్తిని పునశ్చరణ చేసేవాడని తెలిసింది) సమానంగా పరిచితమైనదే.

అయితే ఈనాడు పరిస్థితులు మారేయి. చరిత్రకారులంటే ఇంకా గౌరవభావం మిగిలివున్నదేమోకాని వారి రచన అంతగా చదవబడడం లేదు (పార్క్‌మన్ విషయం ఇందుల కపవాదము కావచ్చు). ఒకనాడు బహుధా శ్లాఘింపబడిన కవు లీనాడు పాఠ్యపుస్తకాల్లో దిక్కుమాలిన ఒక్క ప్రకరణంలో గుచ్చెత్తి కుదింపబడ్డారు. కొన్ని జ్ఞాతాజ్ఞాత సందర్భాలతో

సరిపోల్చుకోడానికి ఆ కవులూ, చరిత్రకారులూ చేతికాపుగామాత్రం ఎంచబడుతున్నారు. ఎమర్సను చెప్పనే చెప్పేడుగదా (తన 'జర్నల్'లో—1841 అక్టోబరు - "రాజవీధిలో 'ట్రాన్సెండెంటలిజమ్' అంటే ఏర్పడిన అభిప్రాయం కొన్ని ఒప్పందాలను రద్దుచేస్తుం"దని. ఆ తరువాత కొన్నేళ్లకు కూడా అదే విశ్వాసంతో వున్నాడు:

"ఈనాడు సోక్రటీసుగాని ఇక్కడ వుంటే అతనిని కలుసుకుని మాట్లాడడానికవకాశం వుంటుంది. కాని లాంగ్‌ఫెలోని చూడండి—ఆయన దగ్గరికే వెళ్ళడానికి వీల్లేదు. అదో పెద్ద భవనం, ఆ భవనంలో సేవకులు, రంగురంగుల సారాయములతో బారులుతీర్చిన సీసాలు, గ్లాసులు, గొప్పగొప్ప కోట్లు" (ఇలా యింత పటాటోపంతో వున్నప్పుడు ఆయనను కలుసుకోవడానికి వీ లెక్కడ చిక్కుతుంది అని)

మరి లాంగ్‌ఫెలోగారేమన్నాడు (1840, డిసెంబరు): "ఇంత కేంబ్రిడ్జిలోనూ ఒక్క ట్రాన్సెండెంటలిస్టు వున్నాడు. అదీ ఒక చిన్న 'ట్యూటరు!' థియొలాజికల్ స్కూల్లో అయితే అదీ లేదు. ఆ చీడపట్టిన జాతి అంతరించింది" అని గదా. రామరామ! నిరాడంబరమైన ఆ 'కంకార్డు' ప్రపంచానికి బదులు విట్మన్ విమర్శకు గురియైన టెన్నిసన్‌గారి ఇంగ్లండు కంటె నాతిభిన్నమైన వాతావరణమే ఇక్కడా (అమెరికాలో) అవతరించినట్లైనది. అందుకు బోస్టన్ ఒక తగిన తార్కాణం. అక్కడ జనాభా వ్యాపారులు, తప్పితే 'బ్రాహ్మణులు'. (ఈ 'Brahmins' అనే మాట వారిలోనే ఒకడైన ఆలివర్ వెండెల్ హోమ్సు వాడుకచేసినట్టిది) ఈ బ్రాహ్మణు లన్నవాళ్ళు ఆగర్భశ్రీమంతులు; అధ్యయనానికో, అధ్యాపనానికో హార్వర్డుకి వెళ్ళినవాళ్ళు; ప్రజాస్వామిక మన్నా, సరిహద్దు ప్రాంతమన్నా, సమకాలిక సమస్య లన్నా పడనివాళ్ళు. సుఖాలకోసం యూరపువేపూ, మళ్ళిపోయిన కాలంవేపూ అర్రులు జాచేవాళ్ళు. తాము బ్రతికివున్న కాలాన్నీ, తమ దేశాన్నీ అర్థం చేసుకోలేక పోయినవాళ్ళు. అయితే వాళ్ళు మరీ గొప్ప సంస్కారవంతు లేమో మరి!

వెర్నన్ ఎల్. పేరింగ్టన్ ఈ బ్రాహ్మణపుంగవుల మీద చిన్న దాడి చేశాడు. అతని కున్న జెఫర్సోనియన్ పక్షపాతం అందరికీ తెలిసిందే. అయితే అమెరికన్ పండితు లెందరో తామూ అందులో భాగస్వాము లయారు; ఆ బ్రాహ్మణులను వేళాకోళం చెయ్యడమన్నది ఈనా డొక జాతీయక్రీడ అయిపోయింది.అయితే ఆ క్రీడలో ఇంకా అంత రక్తి కలగడం లేదు. మరి వాళ్ళు తక్కువవాళ్ళా? ఆ వెనకటి రోజుల్లో తలకు మించిన కీర్తికిరీటాలు పెట్టుకుని పీఠాధిపతుల్లా కూచున్నారు. కాబట్టి యీ వినోద మింతకాలం జనరంజకంగా కొనసాగుతూ రావడానికి మనం ఇతర నిమిత్తా లేమున్నాయో అన్వేషించుకోవాలి. అస లా బ్రాహ్మణత్వం అన్న మాట యొక్క ఉద్దేశంలోనే ఏదో మర్మం వుంది. మనకు తెలుసు అమెరికా కొక ఆత్మవిశ్వాసంతో కూడిన సాంప్రదాయిక మార్గం అంటూ లేదు. 'పెద్దమనిషి' (Gentleman) అనే మాట 'మోటు మనిషి' (Snob) అనే మాటకు చెల్లివరస అయిపోయింది; ఒక వెటకార మైపోయింది. బోస్టన్‌వాస్తవ్యులు కానివారికి బ్రాహ్మణులంటే మోటుమనుషుల్లాగాను, "ఓ, మాకేమిటి! సెయింట్ జేమ్సు ఆస్థానంలో మినిస్టరు గిరీకూడా వెలిగిం చేస్తాం" అనుకునే ఫాదిరీ చేతికింది మనుషుల్లాగాను కనిపిస్తారు.(లోవెల్, మోట్లే నిజంగానే వెలిగించారు) బేరెట్ వెండెల్ వ్రాసిన అమెరికన్ సాహిత్యచరిత్ర (A Literary History of America, 1900) చూచి ఎఫ్. ఎల్. పట్టీ అనే ఒక పెన్సిల్‌వేనియా ప్రొఫెసర్ దానికి 'A Literary History of Harvard University, with Incidental Glimpses of the Minor Writers of America' అని పేరు మార్చవలసిన అవసరం వుందన్నాడు. అతడన్న దానిలో కొంత సత్యం లేకపోలేదు. 1900 ప్రాంతానికల్లా ఇలాంటి ధోరణికి చెందిన, కాస్త అసందర్భంగా కనిపించే పుస్తకాలు వచ్చాయి. బోస్టనువాసులు కానివారు వాటిలోని అసందర్భతను కన్నా యాథార్థ్యాన్నే కంటగించుకొనేవారు. 19వ శతాబ్దిలో చాలకాలం బోస్ట

నంటే యు. ఎస్. యొక్క వైజ్ఞానిక రాజధానిలా వుండేది. ఆనాటి సాహిత్యశ్రేష్ఠుల కెక్కువగా అదీ, తప్పితే దాని కందుబాటులో వున్న న్యూఇంగ్లండు ప్రాంతమూ నిలయాలుగా వుండేవి. అక్కడ మంచి పుస్తక ప్రచురణాలయాలూ, North American Review (స్థాపన 1815), Atlantic Monthly (స్థాపన, 1857) మొ|| పేరుమోసిన పత్రికలున్నాయి. అమెరికాలోకల్లా బోస్టన్ - కేంబ్రిడ్జి ఒక్కటే సంస్కృతి కేంద్రంగా ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జిల కంతో యింతో సాటి రాగలది.విక్టోరియా యుగపు ఇంగ్లండులో ట్రివెల్యన్,హక్స్‌లీ, వెడ్జ్‌వుడ్, స్టీఫెన్ మొ|| ఘరానా వంశాలతోపాటు ఘనంగా చేర్చి చెప్పుకోదగిన వంశాలు (నార్టన్, లోవెల్, ఏడమ్స్, హోమ్స్, లాడ్జ్) బోస్టన్‌లో మాత్రమే చూపించ గలుగుతాము. Atlantic Monthly లో వచ్చే రచనలలో చాలా భాగం బోస్టన్ రచయితలనుంచే. 1868 లో జరిగిన ఒక తమాషాగురించి ఎమర్సను చెప్పేడు: "అట్లాంటిక్ క్లబ్బు సమావేశ మొకసారి జరిగింది. అట్లాంటిక్ పత్రిక క్రొత్త సంచిక ప్రతులు లోనికి తీసుకువచ్చారు. ఆ యింతా కాపీలకోసం అంతా ఆత్రుతగా లేచి పోయారు. తలా ఒక కాపీ పుచ్చుకుని స్తిమితంగా కూచుని ఎవడికి వాడు తన సొంతరచన చదువుకున్నాడు ముందు." ఇక్కడే వుంది బోస్టన్ వారి అంతర్ముఖత్వమంటే. అయితే ఏం జెయ్యడం? ఆ పత్రిక సంపాదకుడి కింకెక్కడనుండి వస్తాయి రచనలు? డబ్ల్యు. డి. హొవెల్స్ తొలి పద్యాన్ని అట్లాంటికే ప్రచురించింది.సారా ఆర్నె జ్యూయెట్ (Sarah Orne Jewett) పందొమ్మిదేళ్ళ అమ్మాయిగా వుండగానే ఆమె కథ నొకదానిని స్వీకరించింది అట్లాంటిక్. యువకుడైన హెన్రీ జేమ్సుకీ, మార్క్ ట్వెయిన్‌కీ అవకాశమిచ్చింది. అది కాని మెల్విల్ విట్మన్‌ల వంటి రచయితలయెడ నిరాదరణ చూపింది, ఇక ఇంచుమించు తక్కిన అమెరికను పత్రికలన్నీ అలాగే చేసేవి. కాక ఒకప్పు డది ఏది దొరికితే ఆ రచననే స్వీకరించేది. ప్రజాయుద్ధానికి పిదప కొంతకాలం

అంత మంచి రచన లాట్టే దొరికేవే కావు. బోస్టన్‌దే ఎప్పుడూ పై చేయి. దాని నొక 'అమెరికన్ అకాడమీ' అనవచ్చు. అయితే అదే మంత అభేద్యమైనది కాదు; మరీ అంత వెనుక చూపుగలది కాదు. దాని మీద వచ్చిన ఆక్షేపణలు చాలమట్టుకు, పేరింగ్టన్ చేసిన దాడి సహా, కొంత అక్రమంగా వున్నాయి. అయితే పేరింగ్టన్ ఆలివర్ వెండెల్ హోమ్సులోని లోపాలను నొక్కి వక్కాణిస్తూనే అతడి నొక చతుర వ్యక్తిగా చిత్రిస్తాడు.

బోస్టనువారిని వ్యతిరేకించినవారికి చిక్కొకటి వచ్చి పడింది. ఏమంటే వాళ్ళ శత్రుపక్షంవారి దగ్గర రాబోయే విమర్శను ముందే పసికట్టి, ఆ విమర్శకుల చేతులు కట్టేసే నేర్పు వుంది. అంతే కాదా బోస్టను వారు చాలా తెలివైన ఘటాలు; తమ లోపాలను చక్కగా తామై తెలుసుకోగల ఆత్మజ్ఞులు. ఆ తరువాతి తరంవాడైన హెన్రీ ఏడమ్సు (బోస్టనువాడు) 1820-70 మధ్యకాలపు రచయితల గురించి మాట్లాడుతూ 'మన తెలివి తక్కువ గురించి మనకు తెలుసని దేవుడికి తెలుసు. ఆత్మవిశ్వాసం లేకపోవడం అదో అంతర్ముఖత్వంగా, అమెరికా అంటే నిరసనగా, బోస్టన్ అంటే పడకపోవడంగా పరిణమించింది...పరిణతుల మైన యూరపియనులం మనం. ఇక దేవు డేపాటివాడు!' అంటాడు.1 పరపక్షీయుడు తనకు తానే బండారం బైట పెట్టుకున్నప్పుడు అందు నిమిత్తం అతడిని వేరే అనడం దేనికి? ఇంతకూ ఆ బ్రాహ్మణులు మొత్తానికంపరూ సంపన్ను లైనప్పటికీ అల్పులు కారు (ఉద్దేశంలో). పేరింగ్టనే అంగీకరించినట్లు వాళ్ళు చాలా శ్రద్ధాళువులు ; తగు జాగరూకతతో పరి

---

1. మరో బోస్టనాయన ఏమన్నాడంటే-"యాంకీ ('Yankee,' ie, న్యూ ఇంగ్లండు పౌరుడు) పడే ఆరాటమల్లా దేహాత్మల సంబంధం గురించి దేవులాడడమే."

శ్రమ చేసే రకం. హార్వర్డులో ఆధునిక భాషాశాఖాచార్య పదవి సంపాదించడంలో లాంగ్‌ఫెలో అదృష్టవంతుడనే చెప్పాలి. అయితే దానికి తగిన యోగ్యత జాగ్రత్త పెట్టుకొన్నాడు. అంత గొప్ప పండితుడు కాకపోవచ్చును కాని స్వయంకృషి, సంస్కారమూ గలవాడు. బహు భాషలు బాగా నేర్చి తన పరిజ్ఞానాన్ని పనికివచ్చేదానిగా చేసుకో గలిగినవాడు. అతనికి తరువాత పదవికి వచ్చిన లోవెల్ కూడ తగిన యోగ్యత గలవాడే. హోమ్సు వైద్య విద్యాప్రవీణుడు. ముప్ఫయి అయిదేళ్ళు హార్వర్డు వైద్య విద్యాలయంలో శారీర శాస్త్రాచార్యుడుగా పనిచేశాడు. చరిత్రకారులైన ప్రెస్కాట్, మోట్లే, పార్క్‌మన్ పెద్ద పెద్ద ప్రణాళికలు వేసుకుని శక్తివంచన లేకుండా నిర్వహించారు. నిజానికా బ్రాహ్మణులంతా తమ పూర్వులెంత పురుషకారంతో చెడుశక్తుల విజృంభణాన్ని తట్టుకున్నారో అంత యిదిగానూ తాము సోమరితనాన్ని నిగ్రహించుకొన్నారు. పాపం, ప్రెస్కాటు, పార్క్‌మన్ దృష్టిమాంద్యంతో చాలా బాధపడ్డారు. అయితే తక్కినవారిలాగే తామూ లాంగ్‌ఫెలో 'Psalm of Life'లో చెప్పినట్టు - 'లెండి, మనమంతా ఏ ఫలితానికేనా సరే ఎదురొడ్డిన యెదతో (కలిసి) పని చేద్దాము. ఇంకా విజయాలు పొందుతూ, సాధన చేస్తూ పరిశ్రమించడం, ప్రతీక్షించడం నేర్చుకొందాము' ('కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషు కదాచన' అని కదా మన గీతాశ్రుతి కూడ) అనే నిరూఢి నియతోద్దేశాన్ని పాటించి నిలిచిన ధీరులయ్యారు.

ఇక మరో సంగతి: ఆ బ్రాహ్మణుల సంస్కారాతిశయం గురించి వచ్చిన ఆక్షేపణ పూర్తిగా వారికి వర్తించదు. విమర్శకులెంతసేపూ వాళ్ళ విందు భోజనాలు, పరస్పర సంభావనలూ ఇలాంటి విషయాల మీదనే పట్టిస్తారు; వాళ్ళ సున్నితమైన సాహిత్యపు జీర్ణశక్తికీ, ట్వెయిన్ విట్మన్ మొ॥ వారి పేరాకలికీ వా రాకడతారు. ఒకసారి బోస్టనులో ఒక విందు సందర్భంలో లాంగ్‌ఫెలో, ఎమర్సన్, విట్టియర్ల నేదో మంచి

గానే పరిహాసం చేయబోయిన ట్వెయిన్‌కి ఏదో చిన్న అమర్యాద జరిగిందని ఎంతో గలభా లేవదీశారు. వారికీ వీరికీ ఏవో కొన్ని తేడా పాడా లుండవచ్చును; అందులో కొంత యథార్థమే కావచ్చును గాని, మరీ అంత సాగదీయకూడ దా వ్యవహారాన్ని. నిండైన బ్రాహ్మణుడు లోవెల్ వ్రాసిన Biglow Papers జాతీయమైన అమెరికన్ సాహిత్యాని కొక అలంకారము. ఇండియానా నవలా రచయిత ఎడ్వర్డ్ ఎగిల్‌స్టన్ (Edward Eggleston) ని అడవులలోని స్థావరాలూ అక్కడి వారి జీవనవిధానాల గురించి వ్రాయమని ప్రోత్సహించిందతడే. లాంగ్‌ఫెలో కూడ ఒక్కొక్కప్పుడు మంచి ప్రౌఢంగా వ్రాస్తాడు. 'కవనాగ్' (Kavanagh) అనే నవలలో ఒక న్యూ ఇంగ్లండు గ్రామాన్ని వర్ణిస్తూ ఇలా వ్రాశాడు:

"కసాయి మిస్టర్ విల్మర్‌డింగ్స్. తన బండి ప్రక్కను నిలబడి వుండగా ఐను పిల్లు లతని చుట్టు చేరేయి... మిస్టర్ విల్మర్ డింగ్స్ ఆ గ్రామానికి తాజా కూరా నారా సరఫరా చెయ్యడమే కాకుండా పసి పిల్లల బరువు కూడా తూకం వేసేవాడు. అతని 'కాటా' లో బరువు చూపని పిల్ల డుండేవాడు కాదు... అత డాలస్యంగా టోపీలూ, నవ రాలూ అమ్ముకునే ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళిద్దరూ వివాహ విహారయాత్ర సంకల్పించి ఆ ప్రక్క పట్టణంలో భార్యను చంపిన నేరానికి ఉరితీయబడుతున్న ఒక పురుష పుంగవుని చూడటానికి బయ ల్దేరేరు. అతని కసాయిసాల పైకప్పున మొలిచినట్లు రెం డెద్దుకొమ్ము లున్నాయి. ఆ ప్రక్కను తోళ్ళను శుభ్రపరిచే పెద్ద గోతు లున్నాయి. వాటిని రక్తంతో నింపుతూవుంటా రనుకునేవాళ్ళు బడి పిల్లకాయలు."

ఆలివర్ వెండెల్ హోమ్సు 'ఎల్సీ వెన్నెర్' (Elsie Venner, 1861) అనే నవలలో ఆత్మరక్షణార్థం కథానాయకునిచే తన్నబడిన జాగిలాన్ని వర్ణిస్తూ ఇలా అంటాడు:

"అది తెరచిన తలుపవతలకి అలా దొర్లుకుంటూ జాలిగా అరుచు కుంటూ పోయింది. దాని యజమాని తన మొక్కవోయిన పనసకత్తి నెలా పాత్తిళ్ళలో దాచుకుంటాడో అలాగే అది తన పొట్టి తోకను ముడుచు కొంది." మార్క్ట్వెయిన్‌ని హోమ్సుకి ప్రతిద్వంద్విగా నిరూపించవచ్చు. అతని 'టామ్ సాయర్' ('Tom Sawyer', 1876)లో చర్చిలో జరిగే ఒక సమారాధన సందర్భంలో ఒక పిల్లకుక్క చర్చి చావడిలో చేసిన ఒక స్వారి గురించి చెప్పబడింది. అసలు మొదటి ప్రతిలో ఆ సంద ర్భాన్ని అది 'గొళ్ళెంలా తోక ముడుచుకుంది' అని పొడిగించాడు. కాని ట్వెయిన్‌కి ఆప్తమిత్రుడైన డబ్ల్యు. డి. హోవెల్స్ ఆ ప్రతిని పరిశీలించి ఆ పొడిగింపు గురించి 'చాలా బాగుంది కాని కాస్త అసహ్యంగా వుంది' అని పుస్తకంలోనే ఓ ప్రక్క వ్రాసేశాడు. అది చివరికి తొలగింపబడింది. హోవెల్స్ అభ్యంతరం చెప్పకపోయినా ట్వెయినే తొలగించి వుండే వాడు. మంచి అభిరుచిని ప్రకటించడంలో ఆ బ్రాహ్మణుల కంటె అభిని వేశం గలవాడు ట్వెయిన్.

ఆ దుర్విదగ్ధులైన అమెరికన్ బ్రాహ్మణులగురించి పేరింగ్టన్ చెప్పింది వక్రంగా వుంది. అతని సూత్రాలను కొన్నింటిని మనం అంగీకరించినా వాళ్లే కాదు, మరింకా బోలెడుమంది అమెరికను లాక్షేపణకు గురికావలసి వుంటుంది. వారిలో ఒక్కరూ బాహాటంగా బానిసతనపు నిర్మూలనోద్య మంలో పాల్గొన్నవారు కాకపోయినా ఆ ఉద్యమఫలితాలమీద చాలా ఆసక్తి చూపించేవారు. లాంగ్‌ఫెలో దౌర్జన్యవాదియైన జాన్ బ్రౌన్‌ను తన దినచర్య పుస్తకంలో ప్రశంసించాడు. ఆయనకొడుకు, హోమ్సు కొడుకూ యుద్ధంలో గాయపడ్డారు. పార్క్‌మన్ జనసామాన్యాన్ని అసహ్యించు కొనేవాడైనా ఏ పక్షానికీ చెందని ప్రజల నుద్దేశించిన The Life of David Crockett, The Big Bear of Arkansas అనే పుస్త కాలలోని దేశిత్వాన్ని మెచ్చుకున్నాడు. "మరీ నాగరికాలైన సాహిత్య మార్గాల్లో శైలీలాలిత్యం బాగా కనిపిస్తుంది కాని, భావవ్యక్తిత్వం

బొత్తిగా తక్కువ. ఇలా చూచేసరికి అవి అమెరికన్ పుస్తకాలనిపించేటట్లే ఆంగ్లేయోపజ్ఞాలైన వనికూడా అనుకోడాని కవకాశం వుంది" అంటాడాయన.

బ్రాహ్మణులను తక్కువపరిచి మాట్లాడితే పేరింగ్టన్‌కి ప్రతిగా తప్పుచెయ్యడానికి పాల్పడే ప్రమాదం వుంది. కాని అందులో కవులైన వారి గ్రంథాలుమాత్రం తమ పరపతి సంతగా నిలద్రొక్కుకోలేక పోయాయి. అయితే యిది కేవలం బోస్టనుకి మాత్రమే వర్తించేమాట అని మనం గుర్తుంచుకోవాలి. అసలా 19 వ శతాబ్ది ఇంగ్లండులోలాగే అమెరికాలోనూ కవులకు స్థానచలనం కలిగిన కాలంగదా. లాంగ్ ఫెలో, లోవెల్, హోమ్సులకు ఇంగ్లండుప్రజాసామాన్యంలో కొంత ప్రచార మేర్పడిందంటే దానికి కారణం వాళ్ళేదో అమెరికనుపద్ధతిలో ఉద్దేశపూర్వకంగా అందుకు ప్రయత్నించడం కాదు; ఇంగ్లీషురచ్చసావళ్ళలో మెచ్చుకోబడుతూవుండిన కవిత్వవైఖరి కతిసన్నిహితమైన దృక్పథం వారి కుండడమే. టెన్నిసన్ వంటివారి విషయంలో ఆ స్థానభేదానికి కారణం ఆయనసాగసైనకవిత్వానికీ, పొగాకు,బీరు,యాస మున్నగువాని ప్రభావానికి లోగినవారి వ్యక్తిగతమైన ప్రవర్తనకీ మధ్యనున్న అగాధభేదమే. అంటే టెన్నిసన్ గాని, ఆ బ్రాహ్మణకవులుగాని తమ వ్యవహారానుగుణంగా రచన చేయకపోతిమే అని పట్టించుకున్నారని చెప్పడంకాదు. అసలే రచయితలంత అనుగుణ్యం పాటించారు గనక! అయితే బ్రాహ్మణుల విషయంలో మాత్రం వెనుక రెండో అధ్యాయంలో చెప్పినట్లు కొన్నిచిక్కులెదురొక్కన్నాయి. వాళ్ళకు అటు నాగరికమైన నానుడీ పలుకుబడీగాని, ఇటు జనసామాన్యపు జాతీయమైన నుడికారముగాని ఏదీ కుదిరింది కాదు. అయితే ఇది అమెరికనురచయిత లందరికీ సంబంధించిన సమస్య. మరి బోస్టనువారికి ప్రత్యేకంగా వున్న ఇబ్బంది యేమిటీ అంటే—అది బహుశా ఇంద్రియప్రవణము కాని ధార్మికతలో వారి న్యూఇంగ్లండువారసత్వము అక్కఅకు మించి వారి కెక్కువ నాజూకుతనం (అంటే ఒకవిధమైన

దౌర్బల్యమే నన్నమాట) నేర్పివుండడమే అయివుంటుంది. ఈ విషయంలో మనం బ్రాహ్మణులంటే ఒక అనుచితమైన నాగరికతాతిశయం గలవారని తేలుతుం దనే పేరింగ్టన్ అభిప్రాయంతో సమ్మతించవచ్చు. ఆ నాగరికతాతిశయం ఏమంటే ఆకాలంలో ఏర్పడిన ఆంగ్లేయామెరికన్ దురోగ్య ఫలితాలున్నూ, అదనంగా బోస్టనువారి బుద్ధిసూక్ష్మతవలని వైపరీత్యాలున్నూ. అవే వాళ్ళ కాలంలో బ్రాహ్మణకవుల విజయాలకు, మన తరంలో పరపతిపోయే పరిస్థితికీ హేతువులైనవి.

అసలా బ్రాహ్మణకవులలో ఎక్కువ పరపతి గల ఆ లాంగ్ ఫెలో మన కొరకబెట్టిందేమిటి? గద్యంలో హైపెరియన్, కవనాగ్ అనే రెండు నీరసాలైన నవలలు ప్రసాదించాడు. అక్కడక్కడ మధ్యలో మంచి తెలివిరేకలు విరిసిన సందర్భాలున్నా మొత్తానికి రెండుకి రెండూ పొగరుగా వుంటాయి. ఇక పద్యంలో అల్లిబిల్లి వ్రాతలు కొన్ని; పేరాసతో వ్రాసిన రెండు పెద్ద కావ్యాలు. ఇవాంజిలిన్ ఒకటి, డాంటేరచన కనువాదము హయవాతా ఒకటి. పో1, విట్మన్ ఇద్దరూ అన్నట్టు (కొన్ని ఉద్దేశాలు దాచుకుంటూ) లాంగ్ ఫెలో సామర్థ్యం గొప్పదే. అతని పద్యాల్లో ప్రయత్నమేమీ కనుపించదు. శబ్దగుంభనంతో, ఛందస్సుతో చాలా బాగా భావాన్ని ప్రకటిస్తాడు. ఇతనితో సరిపోలిస్తే మెల్విల్‌లో భావనిర్భరత అధికమే కాని ఆ తరం యువకవులందరిలోను వైశద్యం విషయంలో కడగొట్టువా డతడు. లాంగ్ ఫెలో ఏ కొంతో ఉపజ్ఞ లేనివాడు కాడు. యూరపుసాహిత్యంలోని చీకటికోణా లన్నీ గాలించి గాలించి గొప్ప దినుసును వెలుగులోకి తెచ్చాడు. ఇర్వింగ్‌లాగే తానూ తన మాతృ

---

1. లాంగ్ ఫెలోయే తన డైరీలో ఇలా వ్రాసుకున్నాడు (24-2-1847): "హెక్సామీటర్‌లో గంభీరంగా వ్రాస్తా డొక హార్వర్డు ప్రొఫెసర్; పెంటామీటర్‌లో చీవాట్లు పెడతాడు పురోభాగి పో."

దేశాని కొక స్వకీయమైన జానపదసారస్వతాన్ని సమకూర్చడానికి సాయ శక్తులా ప్రయత్నించాడు. 1840 జనవరిలో అత డిలా వ్రాసుకొన్నాడు:

"ఒక క్రొత్తపుంత కనుగొన్నాను - అది పదకవిత (Ballads). ఒక పక్షం క్రితం వచ్చిన తుపానులో నార్మన్ శోకంగురించి "Wreck of the Schooner Hesperus" అని రచన ప్రారంభించాను. ఇంకా మరింత వ్రాయా లనుకొంటున్నాను. ఇక్కడ న్యూఇంగ్లండులో ఈ జాతీయపదకవిత్వ మన్న దొక దున్నని పొలంవంటిది. కావలసినంత పదార్థ మున్నది."

అలాగే మరింత వ్రాశా డాయన. మంచి ఫలితాలు కనిపించాయి. ఉదాహరణకు, "Paul Revere's Ride" అనే పదంగురించి అమెరికనుబడిపిల్లకాయలలో తెలియనివారు కొద్ది. అయితే ఆ దేశి పదాలు ఉన్నవున్నట్లు ఆయన కంత ఔత్సుక్యం కలిగించలేదు. అమెరికా కొక జాతీయసాహిత్యం ఏర్పడాలనే వాదంలోనూ అతనికి విశ్వాసం లేదు. అతనికి కావలసింది అమెరికాయూరపుల సంసర్గమూ కాదు—"ఆదర్శ ప్రాయమైన స్వీయమైన కవితాప్రపంచమూ, బాహిరమూ వాస్తవమూ అయిన గద్యప్రపంచమూ" అంటాడు. ఒక్కొకపు డాయన నా రెండవదే ఆకర్షించేదని 'కవనాగ్' నుండి ఆ ఉదాహరణ తెలియజేస్తుంది. అయితే కవిత్వమే ఆయనహృదయాని కునికిపట్టు. అది యూరపుగురించయినా, అమెరికాగురించయినా అందులో వాస్తవికతకోసం ఉబలాటపడేవాడు కాదు. ఆయన అమెరికాపశ్చిమప్రాంతా న్నెప్పుడూ చూచినవాడు కాదు. ఆ అవసరమూ లేదాయనకు. (అందుకు తన్నొక రాక్షేపించ వలసింది లేదంటాడు). 'ఇవాంజిలిన్' కావ్యంలో మిసిసిపీనదిని వర్ణించ వలసివచ్చినప్పుడు బన్వార్డ్ అనే ఆయన ఆ నదీదృశ్యా లన్నిటిగురించి తయారుచేయించిన చిత్రపటమొకటి పొరుగూళ్ళలో ప్రదర్శింపబడుతూ వుంటే వెళ్ళి చూచివచ్చి అంతతో సంతృప్తిపడ్డాడు. తన 'హయవాతా'కు

సామగ్రి పుస్తకాలు చదివి సంపాదించాడు. ఛందస్సు ఫిన్‌లండ్‌నుండి సంపాదించాడు. కాని దీనివిషయంలో చాలా విమర్శకుల గురి అయ్యాడు. 'My Lost Youth' అనే రచనలో తన బాల్యంగురించి వ్రాస్తూవున్నప్పుడు పోర్టులండ్, మెయిన్‌ల గురించిన తన స్మృతులను డాంటే పంక్తులనుండి రాబట్టుకొన్నాడు.

"Siede la terra dove nato fui Sulla marina" అనే పంక్తి

"Often I think of the beautiful town
That is seated by the Sea"

[నే నెప్పుడూ సాగరతీరస్థమైన ఆ సుందరనగరంగురించే ఆలోచిస్తూవుంటాను]

అనే పంక్తిగా పరివర్తితమైంది. అలాగే అందులోని బృందగానంలోని—.

"A boy's will is the wind's will;
And the thoughts of youth are long,
long thoughts."

[బాలచిత్తం గాలిచిత్తమూ ఒకటి
యువభావనలు కడుంగడు దీర్ఘములు]
అనే పంక్తులు—

"Knabenwille tis aindeswille
Junglings Gedanken lange Gedanken."

అని హెర్డర్ జర్మనుభాషలోనికి చేసిన ఒక లేప్‌లండ్‌గీతానువాదంనుండి అనూదితాలైనవి.

అయితే ఇలాంటి పరివర్తనాలు చెయ్యడం తప్పని కాదు. అసలు కొందరు నవ్యకవుల కవి దైవదత్తాలు. అయితే ఎజ్రా పౌండు, టి. ఎస్.

ఇలియట్ ఒక యౌగికమైన స్ఫూర్తికోసం అలాంటి పరివర్తనాలనే కాదు సూటిగా ఉదాహరణాలనుగూడ కోరి చేస్తారు. లాంగ్ ఫెలో విషయంలో అలాంటి ప్రయోజనదృష్టి యేమీ లేదు. అతని సాహిత్యపు చిల్లర సరంజామాలో అవి ఊరికే పద్దు వేయించుకుంటాయి. లాంగ్ ఫెలో సాహిత్యంలో ఎఱవుసొమ్ము లున్నాయని గాని, కలగలుపు వాసన లున్నాయని గాని సర్వసాధారణంగా పాఠకులు పోల్చుకోలేరు. ఉదాహరణకు- 'హయవాతా'లోని ఇండియన్లు ఆయన స్వయంగా వెళ్ళి ఆ రక్తదేహులను ప్రత్యక్షంగా చూడకపోవడంవల్ల అయథార్థవ్యక్తులు గారు, మరి వాళ్ళాయన సృజనాత్మకభావననుండి కాక కాల్పనికాశయంనుండి బహిర్గమించినవారగుటయే కారణం. అందుచేతనే వాళ్ళు పుస్తకంలో ప్రాతకాలపు చిత్తరువులా పరిహాసాస్పదంగా కనిపిస్తారు. వెటకారం విట్ మన్ లాంటి గొప్ప కవి నేం చెయ్యలేదు గాని, పాపం, వీళ్ళను పట్టుకుని ముంచెత్తింది:

"He killed the noble Mudjokivis,
Of the skin he made him mittens,
Made them with the fur side inside
Put the inside skinside outside."

[వాడు ఉదారుడైన ముడ్జొకివిస్‌ను చంపేశాడు
వాని చర్మంతో మేజోళ్ళు చేశాడు
బొచ్చున్న పైభాగం లోపలికి మడిచాడు
లోపలి తోలుపొర వెళ్ళబెట్టేడు.]

పాపం, లాంగ్ ఫెలోకి కాలం కలిసిరాలేదు. కారణం అతని బ్రాహ్మణత్వం కాదు. తన తరంయొక్క అవసరాలను బాగా గుర్తించడమే కాని అధిగమించడం చేతకాలే దాయనకు. ఒకసారి ఎమర్సన్ అతని 'హయవాతా' గురించి సున్నితంగా మాట్లాడుతూనే ఇలా చురక వేశాడు: "నీ పుస్తకాలు చదవడంతో నా కెప్పుడూ ఒక మంచి సంతృప్తి

వుంది - నాకేం ఫరవాలేదు, నేను క్షేమంగానే వున్నా ననిపిస్తుంది (అవి చదువుతున్నప్పుడు). రకరకాల నేర్పులు గల చేతుల్లో పడ్డా నని పిస్తుంది గాని మళ్ళా వెంటనే అవి క్షేమంకరహస్తాలే, ఫరవాలేదను కొంటాను."

లోవెల్ ప్రభకూడా తగ్గిపోయింది. అతని రచన లన్నీ కాక పోయినా కొన్నయినా వాటి ఘనతను కోలుపోయాయి. అతని 'The Fable of Critics' (1848) లో సమకాలికులైన అమెరికన్ రచయితల గురించిన మాటలలో పరిహాసకుశలత, లోచూపు కనిపిస్తాయి. ఉదాహరణకు—విట్టియర్ విషయం తీసుకుని "సామాన్యపు టుద్రేకానికీ, కేవలమైన మహావేశానికీ మధ్య వియోగమెఱుగని తీవ్రమన స్తత్వం" అంటాడు. (ఈ మాట లోవెల్ కీ వర్తిస్తుంది. న్యూ ఇంగ్లండు తరహాలో ఆయన తానే తన విమర్శకులలో అగ్రగణ్యుడు). అతని 'Biglow Papers' లో కొన్ని మానవస్వభావంగురించి సత్వర, కోపావిష్ట, పారిహాసిక వ్యాఖ్యలతో సజీవంగా వుంటాయి. ఆయన వ్యాసాల్లో చాల భాగం చదవడానికి బాగానే వుంటాయి. ఛాసర్, ఎమర్సను గురించి వ్రాసిన వ్యాసాల్లాంటివి మరీ బాగా వున్నాయి. రచన అనర్గళంగాను, యుక్తంగాను వుంటుంది. అతని కావ్యఖండికలూ, వ్యాసాలూ సూక్తి సుందరంగా వుంటాయి—

[Wordsworth] was the historian of
Wordsworthshire
[Thoreau] watched Nature like a detective
who is to go upon the stand—

అయితే అవి నిశితపరిశీలనను సాధారణంగా తట్టుకోలేవు.

అంత్యదశలో ఆయన అమెరికను పండిత మండలిలో అగ్రేసరుడుగా వాసికెక్కేడు. ఆక్సుఫర్డ్ విశ్వవిద్యాలయ మాయన నాచార్య పదవి కాహ్వానించింది. వర్జీనియా వుల్ఫ్ గా పిదప వాసికెక్కిన ఏడెలిన్ స్టీఫెన్ కు ధర్మపిత (Godfather) ఆయన.

ఈనాడు, అమెరికన్ సాహిత్యంలోని సర్వప్రముఖావస్థలనూ తన సారస్వతజీవితగమనంతో పెనవేసుకొన్న వ్యక్తిగా ఆయనతో మన కాసక్తి కలుగుతుంది. యువకుడుగా ప్రజాస్వామ్యంలోనూ, బానిసతనాన్ని వ్యతిరేకించే ఉద్యమంలోనూ ప్రగాఢమైన విశ్వాసం కలిగివుండే వాడు. ప్రౌఢవయస్సులో హార్వర్డు విశ్వవిద్యాలయంలో ఆచార్యపదవిని, ఆ ప్రక్క Atlantic Monthly, North American Review ల సంపాదకత్వ బాధ్యతనుగూడ నిర్వహించేవాడు. పెద్దవాడయాక సంప్రదాయపక్షపాతలంబు డయ్యాడు. అప్పట్లో హెన్రీ జేమ్సు కొకసారి "నేను చూసిన సమాజాల్లో కల్లా మసాచుసెట్స్‌లోని కేంబ్రిడ్జి సమాజమే (Society) శ్రేష్ఠమైనది" అని వ్రాశాడు. అతడు విట్మన్ సాహిత్యంలో ఘనతను గుర్తించలేకపోయాడు. వర్డ్స్‌వర్తు ముందుగా సాంప్రదాయిక సౌందర్యాన్ని తన రచనలలో ప్రదర్శించలేకపోయాడని వాపోయాడు. అది ప్రదర్శించడంవల్ల లేండర్ వ్రాసిన వట్టి పద్యాల్లో గూడ వర్డ్స్‌వర్తు రచనలలో లేని హుందా, శక్తీ వున్నా యన్నాడు. చక్కని తగుమనిషి తరహా పెనుపొందిన కొద్దీ లోవెల్‌లో సర్వసమభావన అభివృద్ధి కాజొచ్చింది. యూరపియను సాహిత్యం ఆయనకు కొట్టిన పిండి. గొప్ప గొప్ప యూరపియను గ్రంథాలలో ఆయనకున్న పరిచయం గొప్ప హోటళ్ళతోను, ప్రాంతీయపు తినుబండారాలతోను వున్న పరిచయంలాంటిది. అతని రచనలనిండా ఆ సాహిత్యపు ఐతిహ్యాలే. జాతీయమైన అమెరికన్ సాహిత్యం గురించిన భావన ఆయనకూ, లాంగ్‌ఫెల్‌కూ కనిపించినట్లే తెలివితక్కువ భావనగా తోచింది. చూడండి—జేమ్సు గేట్స్ పెర్సివల్ అనే ఒక చిన్న అమెరికన్‌కవి గురించి ఒక వ్యంగ్య చిత్రణంలో లోవెల్ ఏమన్నాడో:—

"ఒక చిన్న 'ఏవన్' (Avon) * వాగు షేక్స్‌పియర్‌ను కనగలిగినప్పుడు, మరి మిసిసిపీ మహానదీగర్భంనుండి మరీ గొప్పవాడికోసం మనం ఎదురుచూడొద్దూ! ఈనాటికి మొదటిసారిగా భౌతిక భూగోళం (Phy-

---

* షేక్స్‌పియర్ ఊరికి సమీపంలో వున్న చిన్న ఏరు.

sical Geography) పదో కవితాదేవతగా (Tenth Muse) తన అర్హస్థానం నిరూపించుకొన్నది."

అయితే అమెరికనుగా అతడు తన దేశంనుండి యితరులు గ్రహించ గలిగింది వుందనే మాట ఎప్పుడూ సందేహించలేదు. ప్రజాయుద్ధం జరుగుతున్న రోజులలో వ్రాసిన Biglow Papers రెండో వాయలో ఆంగ్లాభిమానం దూరంచేసి జాన్ బుల్ ను ఉద్దేశించి—

"ఎందుకయ్యా, జాన్! గౌరవంగురించి పెద్దమాటలు
చెబుతావు—నువ్వే దాన్ని కాతరచెయ్యనప్పుడు?"

అని అంటాడు. "On a certain condescension in Foreigners" అనే వ్యాసంలో యూరపియను సాహిత్యంలోని సంపర్కోచితాలైన ఉదాహరణ లన్నీ తన గుప్పిట్లోనే వున్నా తా నమెరికనునని ఢంకా బజాయించి చెప్పేశాడు. నిజానికి తానూ మరికొందరు బ్రాహ్మణరచయితలలాగే (ముందునాటి కూపర్ లాగున) యూరపియనుల కెదురొడ్డి తన దేశీయుల నాగరికపు తరహా గురించి, గుణగణాల హెచ్చు తుందుల గురించి సమర్థించుకోడానికి ముందంజవేయవలసివచ్చింది. తరుపరి మరింత వివేకపరిపాకము పొంది, బోస్టన్ - కేంబ్రిడ్జియే రెండు ప్రపంచాల్లోని మంచినంతటినీ రొుత్తి యివ్వగలదనే విశ్వాసంతో ఆ 'బ్రాహ్మణ' చ్ఛత్రం క్రిందనే హోమ్సుతో చేతులు కలిపాడు. అయితే ఎప్పుడూ అత డొక రచయితగా ఏకాగ్రతనూ, అభిప్రాయవ్యక్తీకరణపద్ధతిలో సమగ్రతనూ సాధించలేదు. ఉదాహరణకు—అతని 'Mason and Slidell: A Yankee Idyll' లోని యీ పద్యాన్ని చూడండి:-

"O strange New World, that yit wast never young,
Whose youth from thee by gripin' need was wrung,
Brown foundlin' o' the woods, whose baby-bed
Was prowled roun' by the Injun's crackln' tread...

ఈ పంక్తులు ఇతఃపూర్వము విరచితమైన 'The Power of Sound : A Rhymed Lecture' అనే పద్యకావ్యంలోని యీ క్రింది పంక్తులకు రూపాంతరాలు :

"O strange New World that yet wast
never young,
Whose youth from thee by tyrannous
need was wrung,
Brown foundling of the forest, with
gaunt eyes,
Orphan and heir of all the centuries...

ఇందులో ఏది మంచి పాఠ మన్నది చర్చాస్పదమైన విషయం. మాండలికధోరణిలో వున్న మొదటిది కాస్త క్రమం తప్పినదిగా తోస్తుంది. అయితే రెండవదానిలోని Tyrannous అన్న మాటకంటె మొదటి దానిలోని 'Griping' అన్నదే బరువైన మాట. కాని ఆ మాండలిక ధోరణి ఆ పంక్తులలో సరిగా హత్తుకున్నట్లు లేదు. 'The Injun's clacklin' tread' అన్నది నీరసమైన మార్పు. మొత్తాని కా మాండలిక శాబ్దిక విన్యాసం వినడానికి నాటకపు వాటాన్ని మాత్రమే కలిగివున్నది. ఉభయపాఠాల్లోనూ నైపుణ్యం అయితే వున్నది కాని శక్తిమత్త లేదు. ఇంత ప్రస్ఫుటంగా కాకపోయినా యీ విధమైన ద్వైవిధ్యం యితర బ్రాహ్మణ రచయితలలోను కానవస్తుంది. ఉదాహరణకు— చరిత్రకారుడైన విలియమ్ ప్రెస్కాట్ వున్నాడు. ఆయనకు ముందు మూడుతరాలనుంచీ వాళ్ళ కుటుంబానికి హార్వర్డు వారసత్వం వున్నది; బిరుదలాంఛనాదిక ప్రతిపత్తి వున్నది. అతని శైలిని ఆంగ్లేయుని శైలి కంటె భిన్నమైనదానినిగా గుర్తించడాని కనువుగా వుండదు. అయితే అత డాంగ్లేయు డేం కాదు; అచ్చపు బ్రాహ్మణుడు. ఇంగ్లీషు దృశ్యాలు

చూచి విసువెత్తి తన ఇంటిమీదే మమకారం పుట్టుకొచ్చినవాడు. అది చింపిరి చింపిరి కంచెలతో, మొరళ్ళతో ఆవరింపబడివున్నా అమెరికాలో ఇంకా నరుడి చేయి గట్టిగా తల్లి ప్రకృతి తల దువ్వడానికి ప్రయత్నం చేయడం లేదనడాని కది తార్కాణ మనుకొనేవాడు. ఇంగ్లండులో వున్న కాలంలో "అడవిలాంటి దైతేనేం, నాదైన,నా ప్రియమైన అమెరికాలో లేకపోతినే" అని అనుకొనేవాడు.

ఇంకా సామర్థ్యంగాని వుంటే లోవెల్ బ్రాహ్మణత్వం తెచ్చి పెట్టిన కష్టనిష్ఠూరాల నధిగమించివుండేవాడు. అతనికి పద్యాలు వ్రాయడ మన్నది అవలీలగా వశంవదమైన విద్య. పద్యాన్ని పద్యం తరుముకు వస్తుంది. ఎంత వ్రాసినా తరగకుండ నరసాగుతుంది వస్తువు. వాసికెక్కిన అతని 'Harvard Commemoration Ode' లో, అన్ని పంక్తు లున్నాయా, అన్నీ మంచి ఉల్లాసంగా సాగిపోతాయి. అందులో అభిరుచి సౌష్ఠవం సమృద్ధిగా వుంది. వేదనా, ఉత్సాహమూ వెంటనే వ్యక్తమవు తాయి. అయితే లోవెల్‌కి తన లోపం తెలుసు. అప్పటి కిరవైయేళ్ళక్రితం లాంగ్ ఫెలోకి వ్రాస్తూ తనకు నెమ్మదిగా వ్రాయడం చేతగాకుండా వుండడంచేత తన Fable for Critics అనే గ్రంథం పూర్తికాగానే కొంతకాలం కవిత్వం విరమిస్తా నని వ్రాశాడు.

లోవెల్ మిత్రుడు ఆలివర్ వెండెల్ హోమ్సు విషయంకూడా ఇంచు మించు ఇలాంటిదే. అతడూ ప్రయత్న మన్నది లేకుండా పద్యాలు వ్రాసెయ్య గలడు. భాషాసమస్య అంటే అతనికి మంచి ఆస్థ వున్నది. శ్లేష లన్నా, రుచిరసూక్తు లన్నా మక్కువ. ఎప్పుడూ ఒక తగుమనిషితరహాకి చెందిన భావనతో వుండేవాడు. పైగా అతడొక వైజ్ఞానికుడు. ప్రసూతిజ్వరాల గురించి ఒక ప్రముఖపరిశోధన నిబంధము వెలయించినవాడు. కాల్పనిక కావ్యజగత్తుకు సంబంధించిన ఊహ లాట్టే నచ్చనివాడు. అతని కభిమాన పాత్రులైన కవులు పోప్, గోల్డుస్మిత్, కేంప్‌బెల్. వాళ్ళ కాలంనాటి

మోటుదనము, నీటుదనమూ అంటే అతనికి చాలా యిష్టము. 'Mysticism' (గజగర్భ పద్ధతివలె సాహిత్యంలో ఒక నిగూఢభావనిబంధన సంప్రదాయమార్గము) అనే మాటను నిందావచనంగా ఉపయోగించాడాయన. "సృజనాత్మకరచన చేసేవాడు రక్తికోసము, వైజ్ఞానికు డైనవాడు సత్యంకోసమూ ప్రాకులాడుతారు" అని అంటాడు. అయితే ఊహాకీ, భావనకీ అసలే తావులేదని కా దతని ఆశయము; అది విజ్ఞానానికి ఉపాంగంగా ఉండాలనిమాత్రమే. "జీవితం ప్రాణవాయుశ్వాసంతోను, భావస్పందనంతోను స్థితి నిలుపుకుంటుంది" అనీ తన Autocrat చేత అనిపిస్తాడు. అతని రచన సరిగా అలాగే ఆ రెండింటి మిశ్రంలా వుంటుంది. ఒకవంక విందులు, కళాశాలోత్సవాలూ మొ॥ సందర్భాలకు సరిపడేటట్లు తాత్కాలిక నిమిత్తాలతో పద్యాలు వ్రాశాడు; ఇష్టాగోష్ఠులు (ఉదా: "ప్రేమకళ గురించిన సర్వవిషయమూ విజ్ఞానసర్వస్వంలో 'Fortification' అన్న శీర్షికక్రింద వుంటుంది, చదువుకోవచ్చును") చేశాడు; మరో వంక శాస్త్రవిజ్ఞానాన్ని మానవప్రవృత్తి కనుగుణంగా మలచడానికాసక్తి చూపేడు. Elsie Venner, The Guardian Angel, A Mortal Antipathyఅనే నవలలలో గొప్ప ప్రాముఖ్యంగల నైతిక స్వాతంత్ర్యం గల వ్యక్తులతో నిమిత్తం గల, ఇతివృత్తాలతో వట్టిపేలవాలైన స్థానికవిశేషాలను గూడ కలిపేస్తాడు. ఎల్సీ వెన్నేర్ దుష్టవ్యక్తి అయితే ఆ దుష్టత్వంవారసత్వంగా సంక్రమించింది (హాథార్న్ కథలోలాగ ఒకరకమైన సర్పవిషం వింతగా ఆమెతల్లి రక్తంలో ప్రవేశించిందట) గనుక ఆమె 'నిరాక్షేపణీయ'. మిగతా రెండునవలల్లోని ప్రముఖపాత్రల తత్వంగూడ ఇలాగే ముందుగా నిర్ణయింపబడింది. అలాంటప్పుడు మన చేతలకు మనమే బాధ్యులమా? సంఘం మనల్ని శిక్షించాలా? అనే సందేహాలు, సంఘ మన్నదే మాయ, మోసం అనే ఒక నిరూఢాభిప్రాయంతో కలిసి, గతశతాబ్ది చివర నుండిన ప్రకృతిశాస్త్రరచయితలను కలవర పెట్టేయి. కాని హోమ్సుకి సంఘ మంటే బోస్టనే. ఆ నగరాని కాయనే

పట్టపుకవి (Poet - laureate) రహస్యపరిహాసాలు, ఒకవిధమైన ఆచారకాండగా పరిణమించిన ప్రసంగాలు, అభిరుచుల ధోరణి, ఆత్మ సంతృప్తిసూచన, అంతర్గతంగా కాస్త కావేషీ—ఇవి ఆక్స్ ఫర్డులోనూ కేంబ్రిడ్జిలోనూ ఆసలే లేనివి కావు. అవి బహుశా ప్రబుద్ధుల సమాజాన్ని అంటిపెట్టుకునివుండే లక్షణాలు కావచ్చు. అమెరికన్ రచయిత లెక్కువగా ఒక చిన్న ప్రాంతీయాభిమానంతో కాక అమెరికాఖండం ఖండమంతటినీ కావలించుకునే దేశాభిమానం ప్రకటించడంలో విట్మన్‌తో పోటీపడు తున్నా రంటే, ప్రత్యేకం ఆ బోస్టనును ప్రేమించినందుకేనా మనం హోమ్సుని ఆక్షేపించడానికి వెనుకాడవలసివుంటుంది. హోమ్సుని మనం నిర్దోషి అని నిరూపించినా, అతని నొక మహారచయితగా ఎత్తిచూపలేము. అతని రచనంతా బుద్బుదప్రాయమైనది. అతని కావ్యాల్లో ఎన్నిక చేయ దగిన 'The Deacon's Masterpiece'గాని, The Wonder ful One Hoss shay గాని కాస్త రక్తి గొలిపే సామాన్యపద్య రచనలు. అంతే. అతనికి పేరుతెచ్చిన మరో కావ్యం వుంది—'The Chambered Nautilus'. ఇది లాంగ్ ఫెలో వ్రాసిన 'Psalm of Life' లాగున కాస్త హెచ్చరిక గొలుపుతుంది. శ్రావ్యంగావుంటుంది కాని లోతు లేదు. ఇక ఇతని నవల లున్నాయంటే అందులో ఒక ఏకా గ్రత లేదు; బహుముఖంగా ప్రాకిపోయిన ఒక జిజ్ఞాసమాత్రం కనిపిస్తుంది. అతని Breakfast Table సంపుటాల్లోనూ అదే లోపం వుంది. కొన్ని ప్రకరణాలు చదివినతర్వాత మనలో ఒక సంచలనం కలిగి, పోనీ ఇవి ఒక పుంజూనెమలిపాటైనా, లేక Tristram Shandy పాటైనా చేశాయి కావే అనే ఆశ్చర్యం పొందుతాము. అవి W. H. Mallock వ్రాసిన New Republic తో సమానస్థాయిలో వున్న ట్లనిపిస్తాయి. కాని ఆ పాత్ర లేవ్యక్తులకు ప్రతినిధులో పోల్చుకుని సంతోషించడానికవకాశం లేదు. అయితే అవి హోమ్సూ, అతని ప్రతిస్పర్థులూ అని చెప్పవచ్చు. ఆ పాత్ర లన్నిటినీ అతిచతురంగా పొరపొచ్చెము లేకుండా తీర్చిదిద్దేదు హోమ్సు.

లాంగ్ ఫెలో, లోవెల్, హోమ్సు-ముగ్గురూ తమ కాలంలో గొప్ప వారుగా పరిగణింపబడినవారే కాని పిదపకాలంలో వారి ప్రభ తగ్గి పోయింది. వాళ్ళ గ్రంథాల్లో తగిన తూకం లేదు. ఆ గుణం మనకు 'బ్రాహ్మణ' చరిత్రకారులైన ప్రెస్కాట్, మోట్లే, పార్క్‌మన్ల రచన ల్లోనే కనిపిస్తుంది. తమ పరిశ్రమకు ఆర్థికమైన అవసరం లేనివారైనప్పటికీ పారిశ్రామికావశ్యకత గల న్యూఇంగ్లండు వాతావరణపు వత్తిడికి వారు తల యొగ్గక తప్పలేదు. (అమెరికాలో తీరుబాటు తరగతి మనుషులే కనిపించరు అని ఒక ఆంగ్లేయుడైన అతిథి అన్న మాట కొక బోస్టను గేస్తురాలు, "ఎందుకు లేరు? వున్నారు; కాని వాళ్ళను మేము దేశద్రిమ్మరు లంటాము" అని సమాధాన మిచ్చిందట!) ఆ వాతావరణమే వారి చూపు చారిత్రకపరిశోధన వేపు త్రిప్పివుండవచ్చు. మోట్లే నవలారచయిత కావ డానికే ఇచ్ఛగించివుండేవాడు కాని నవలారచనలోను, సాహిత్యవిమర్శ లోను కొన్ని ప్రయత్నాలు చేసి విఫలుడైన తర్వాత నవలారచనకంటె చరిత్ర రచనయే తనకు తగిన రంగ మని నిర్ణయించుకొన్నాడు. పార్క్‌మన్ కూడా మొదట్లో నవలారచనలో వేలుపెట్టేడు (Vassal Morton, 1856). కాని అందులో అతని స్వీయచరిత్ర రచనోచితధోరణి చూస్తే అతని నైపుణ్యప్రకటనకు తగిన తావు వేరే వుందని విశదమైనది. న్యూఇంగ్లండులో సృజనాత్మకరచనను ప్రోత్సహించే గుణ మేదో లోపించిన ట్లున్నది. అయితే ఆ లోపం పండితులకీ, విమర్శకులకూ ప్రోత్సాహకారణమైనది. అమెరికనుసాహిత్యాన్ని సింహావలోకనం చేస్తే స్ఫూర్తిమంతంగా కానవచ్చేది సృజనాత్మక సాహిత్యం కాదు. దేశాట నము, రాజకీయవిభేదాలు, జీవితచరిత్ర, ప్రాచీనవిషయస్మృతులు, చరిత్ర- అనే విషయాల్లో మకుటాల్లాంటి గ్రంథాలు కానవస్తాయి.

తగిన అదనులో వచ్చా రీ త్రిమూర్తులు. క్రొత్త ప్రపంచానికి (అమెరికాకు) చరిత్రకారులు కావలసివచ్చింది. జేరెడ్ స్పార్క్స్, జార్జ్ బేంక్రాఫ్ట్‌లవంటి చరిత్రకారులు అమెరికను ప్రజాస్వామికాభివృద్ధిగురించి

ఎలుగెత్తి చాటుతున్నారు. ప్రెస్కాట్, మోట్లే, పార్క్మన్‌లు బ్రాహ్మణులు కావడంవల్ల సంయుక్తరాష్ట్రాల రాజకీయచరిత్రయెడల ఆట్టే మోజుపడలేదు. అలా పడివుంటే రాజకీయపక్షీయులకంటె వారి ఘనతయేమీ కనిపించివుండేది కాదు. వస్తువుకోసం ప్రతీక్షించేవారిలో మొదటి యిద్దరినీ స్పేనిషుచరిత్ర ఆకర్షించింది. ఇర్వింగూ, టిక్నరూ ఆ విషయాని కప్పుడే ప్రచారం కలిగించే ప్రయత్నం చేశారు. ప్రెస్కాట్ తన వ్యాసంగం ప్రారంభదశలో టిక్నర్ మార్గా న్ననుసరించాడు. ఇర్వింగు అతనికోసం కార్టేస్ మెక్సికో విజయవృత్తాంతాన్ని విడిచిపెట్టేడు. ఇక తన వంతుగా ప్రెస్కాట్ డచ్చి ప్రజాస్వామికాభ్యుదయం (Rise of Dutch Republic) వ్రాస్తూవున్న మోట్లేకు తోడుపడ్డాడు. నిజాని కప్పుడు ప్రెస్కాటు తాను రెండవ ఫిలిప్ రాజ్యకాలం గురించి వ్రాస్తూ వున్నాడు. అంటే తాను తరచి తీసిన సారాన్ని మోట్లే కందించా డన్న మాట. పార్క్మన్ మరోత్రోవ త్రొక్కేడు. పట్టభద్రుడు కాకముందు అతనికి పైవిషయా లంటే మంచి అభినివేశం. కెనడాలో మొదట్లో ఫ్రెంచి వారి వ్యాపకా లెలా వుండేవో ఆ కథంతా వ్రాయాలని నిశ్చయించుకొన్నాడు. క్రమంగా అతని ఆస్థ పెంపొందగా ఆయన అంటాడు:

"ఫ్రాన్సు ఇంగ్లండుల మధ్య వచ్చిన అమెరికన్ తగాదా సంగతంతా, అంటే అమెరికారణ్యచరిత్రను సవిస్తరంగా చేర్చుకు నేటందుకు నా ప్రణాళికను విస్తృతం చేసుకున్నాను. అస లిదీ నా చూపు. నా వస్తువుకి నేనే ముగ్ధుడ నయ్యాను. రాత్రీ పగలూ ఆ ఆరణ్యకదృశ్యాలే నా ఊహలను వెన్నాడుతూవచ్చాయి."

సరే, అలా ముగ్గురూ వారివారి విషయాల నెన్నుకొని పని ప్రారంభించారు. ముగ్గురికీ చరిత్ర అంటే ఒక సాహిత్యశాఖ. 16వ శతాబ్ది స్పేనిష్ రాజ్యవిస్తరణ, నెదర్లాండ్సులో ప్రజాస్వామిక దారుణనియంతృత్వ విధానాల మధ్య సంఘర్షణ, అమెరికారణ్యచరిత్ర అనే విషయాలు నాటక సన్నివేశాల్లా వారికి రక్తిగొలిపేయి. నిజానికి ముగ్గురూ తమ ఆశయ ప్రతీ

కగా నాటక (Drama) శబ్దం ఉపయోగించారు. యథార్థకథనం గురించి ఉన్నతప్రమాణా లాశించి విషయసేకరణకు విపులపరిశ్రమ చేసివున్నా వారి పూనిక స్కాట్ నవలల్లో లాగ రంజకంగా కథ జరిగినట్లు చెప్పాలని. వారు సాంఘికచరిత్రగురించికూడా కొన్నిప్రకరణాలు చేర్చారు కాని అవ కాశం దొరికినప్పుడల్లా దాని నొక ప్రముఖకథానాయకుడికి (Cortes, William the Silent, Pontiac) ముడిపెడుతూ వచ్చారు. ప్రెస్కాట్ మెక్సికోవిజయము (The Conquest of Mexico) అనే తన గ్రంథరాజంలో మెక్సికోపతనం నుండి కార్టెస్ మరణంవరకూ వున్న నాటకీయసన్నివేశాన్ని ప్రపంచీకరించడంలో తాను గాని అసమయ పరిష్కారం (premature denouncement) అనే దోషానికి పాల్పడలేదేమో అనే విషయం అవతారికలో చర్చించాడు. పైగా అందలి ఫలైక్యాన్ని (the unity of interest) తాను పరిరక్షించా ననే విశ్వాసం వెలిబుచ్చాడు.

ముగ్గురి విషయంలోనూ వైదుష్యం నాటకీయమైన ఆసక్తితో పెన వేసుకుని సిద్ధి పొందింది.అయితే కొన్ని గుట్టుమట్లు చెప్పకతప్పదు.ముగ్గురూ ప్రాటెస్టెంట్లు, కేథలిక్ చర్చి గురించి కొంత కటుత్వం ప్రదర్శించారు. ప్రెస్కాట్ తన డైరీలో శైలీలాలిత్యంగురించి శ్రమ పడ్డట్టు వ్రాసుకున్నాడు. పార్క్‌మన్ మిగతా ఇద్దరికంటే కాస్త తక్కువ ప్రద ర్శించాడు. నిజాని కతని రచన సుశ్రావ్యంగా వుంటుంది. అతని గ్రంథాలు క్రోధరసోత్పాదకాలుగా వుంటాయి. పాత్రలు విందు భోజనాలు చేసినట్లుంటాయి. నాగరికదేశాల కనాగరక దేశాలతోగల తేడాపాడాలు నిరూపింపబడ్డాయి. మోట్లే తన నాయకప్రతినాయ కులను మరీ అతిశయంగా చిత్రిస్తాడు. అతడూ, అతనికాడికి కాస్త తక్కువస్థాయిలో ప్రెస్కాటూ అప్పుడప్పుడు తమ ఆధారసామగ్రివిష యంలో అశ్రద్ధ చూపుతారు. పార్క్‌మన్ అప్పుడప్పుడు తన రచనలో ఒక అహంకారశ్రుతిని వినిపిస్తాడు. అయితే ఆయా లోపాలను వారి

వస్తువులుకలిగించే ఉద్వేగమూ, వాని పరిణతిప్రగతికి సహకరించిన వారి కథాఖ్యాననైపుణీ అతిశయించేసి కనపడనీయవు.

ముగ్గురిలోనూ పార్క్‌మన్ గొప్పవాడు. ఆయన మొదట తన Oregon Trail తో బాగా ఆకర్షించాడు. ఆ గ్రంథంలో శ్వేతజాతి వేటగాళ్ళతోను, వలసదారులతోను పరిచయ మేర్పడ్డా ఇంకా శక్తిమంతులుగా మైదానాల్లో నివసిస్తూవుండిన ఇండియన్ల దగ్గరికి 1846లో అప్పుడే హార్వర్డుపట్టభద్రుడై తాను వెళ్ళిన సందర్భంలో తన అనుభవా లన్నీ వివరించాడు. అనుకోకుండా తన స్వభావాన్నిగూడా వ్యక్తంచేశాడు. అతనిలో ఒక ఆత్మవిశ్వాసము, శ్రమసహిష్ణుత, ఇండియను లన్నా అనాగరక శ్వేతజాతిమృగయు లన్నా ఒక ఏహ్యభావమూ కనిపిస్తాయి. అనాగరకులలో ఉదారులుకూడా ఉండవచ్చు నన్నది ఆయన నమ్మలేని విషయం. నాగరకపు పెద్దమనిషితరహా అంటే ఆయనకు ప్రతిపత్తి. ఆ అడవులన్నీ అలాంటి ఉన్నతగోత్రసంభవులతో నిండిపోవా లన్నది ఆయనఆశయం. అయితే వాళ్లు శక్తిమంతులైనవాళ్లుగా వుండాలి. పురుషకార మన్న మాట ఆయనకు చాలా ప్రీతిపాత్ర మైనది.

ఇలాంటి అభిమానాలూ అవీ Pioneers of France in the New World మొదలు Montcalm and Wolfe దాకా పార్క్‌మన్ వ్రాసిన ప్రముఖచారిత్రకగ్రంథా లన్నిటా అస్పష్టంగానైనా కనిపిస్తాయి. The Conspiracy of Pontiac అన్నది మాత్రం మొదట్లో ఆ కోవకు చెందిన గ్రంథం కాదు. పార్క్‌మన్‌కి మగసిరి అంటే ఎంత గౌరవమో సత్యం అన్నా అంత గౌరవము.ఆ చూపుతోటే Evangeline లో అకేడియన్సును, హయవాతాలో ఇండియన్సునూ చిత్రించడంలో మరీ అనవసరమైన భావమార్దవం చూపించినందుకుగాను లాంగ్‌ఫెలోను విమర్శిస్తాడు; ఇతివృత్తంలోని అసందర్భాలకు కూపర్‌ను అపహసిస్తాడు పార్క్‌మన్. తన రచనలో అలాంటి కాలు

జారడాలు లేకుండా చూసుకుంటాడు. తన రచనల ఆనుపానులు బాగా తెలిసినవాడు కావడంవల్ల చరిత్రకారులు విధిగా తమదేశచరిత్రలే వ్రాయాలంటాడు. ప్రాచీనశేఖనాలన్నీ గాలించి ఆధారసామగ్రి సేకరించి యాథార్థ్య పీఠంమీద తన చరిత్రకథనాన్ని ప్రతిష్ఠించాడు. అంచాత అతనికి ఆచార్యులైన La Salle, Frontenac Montcalm మొదలైనవారి యెడనున్న అభిమానం అస్థానపతితమైనదని కాని, అస్వాభావికమైనదనిగాని అనుకోడానికి వీల్లేదు. అతని పక్షపాతాలు, అభిప్రాయవైపరీత్యాలు ఉన్నవి ఉన్నట్లుగా అతనితో పాటు పరుగెత్తిపోయినవికావు. అతని Montcalm and Wolfe అనే గ్రంథంలోని కొన్ని ఘట్టాలు కోరి గొప్పలు కొన్ని తెచ్చిపెట్టుకున్నట్లుంటాయి కాని సామాన్యంగా అతని రచన నీరసంగా వుండదు; ఆడంబరంగానూ వుండదు. ఆర్జవము, విషయ ప్రభుత్వము కలిగివుంటుంది. సరే ఈ బ్రాహ్మణరచయితల రచనలు చిక్కదనం లేకపోయినా చవిగొల్పేవిగా వుంటాయని సరిపెట్టుకొని యీ ప్రసంగం ముగించేముందు మనం విధిగా అనుకోవలసిన మాట ఒకటుంది. పార్క్‌మన్ అమెరికన్ అరణ్యప్రపంచం గురించి తానుకన్న కలకు ఊపిరి పోసి ఒక ఉజ్జ్వలచరిత్రగా రూపొందించాడు.

# 7

# అమెరికన్ హాస్యము-ప్రతీచీన వికాసము

## మార్క్ ట్వెయిన్

శామ్యూల్ లేంగ్‌హార్న్ క్లిమెన్స్ (మార్క్-ట్వెయిన్) (1835-1910):

అభిజనము: మిస్సోరి. తండ్రి జాన్ మార్షల్ క్లిమెన్స్. అత డొక తీరుబడీ, రాబడీ లేని న్యాయవాది; భూమిలాభాల అంచనాదారు; 1839 లో మిసిసిపిరాష్ట్రంలో మిస్సోరి కడ హన్నిబల్‌లో స్థిరపడ్డాడు. శామ్యూలు తండ్రి పోయాక 1847 లో బడి విడిచిపెట్టి ముద్రాపకుడుగా తరిఫీదు పొందేడు. 1853-4 లో ప్రాక్పశ్చిమ పట్టణాలలో ముద్రణవ్యాపారం చేశాడు. బ్రెజిల్‌లో బాగా సంపాదించుకొందా మనే ఉద్దేశంతో న్యూ ఆర్లియన్స్‌దాకా వెళ్ళి మళ్లా

ఆ పథకం మార్చుకొని మిసిసిపిలో నౌకాచోదకవృత్తి స్వీకరించాడు. ఈ జీవిత పూర్వార్ధమే అతని గొప్ప గొప్ప రచనలకు పునాది అయింది. అవి The Adventures of Tom Sawyer (1876), Life on the Mississippi (1883), The Adventures of Huckleberry Finn (1884). ప్రజాయుద్ధపు కడపటిదశలో Confederate Volunteer గా సేవడాలోను, శాన్‌ఫ్రాన్సిస్కోలోను 'మార్క్‌ట్వెయిన్' అనే మారుపేరుతో పత్రికలలో హాస్యరచనలు చేస్తూ, జనరంజకాలైన ఉపన్యాసాలు చేస్తూ పేరుగడించుకొంటూ వుండేవాడు. 1869 లో The Innocents Abroad అనే యాత్రాకథనం వ్రాసి చాలా పేరు చేసుకున్నాడు. 1870 లో ఒలీవియా లేంగ్డన్‌ను వివాహమై కన్నెక్టికట్‌లోని హార్ట్‌ఫర్డులో స్థిరపడ్డాడు. చాలా పుస్తకాలు వ్రాశాడు. ఇంచుమించన్నీ పాఠకుల ఆమోదాన్ని పొందేయి. అతని రచనలు: Roughing it (1872); The Gilded Age (1873, ఇది తన హార్ట్‌ఫర్డుమిత్రుడు సి. డి. వార్నర్‌తో కలిసి వ్రాసినది); A Tramp Abroad (1880); The Prince and the Pauper (1882); A Connecticut Yankee in King Arthur's Court (1889); The Tragedy of Pudd'n head Wilson (1894); PersonalRecollections of Joan of Arc (1896). ఇంకా అనేక కథలూ, గల్పికలూ, వ్యాసాలూ వ్రాశాడు.

'బ్రాహ్మణ' రచయితలు తాము వ్యక్తిగతంగానూ, తమ రచనల ద్వారాను యూరపియనులకు అమెరికాను ఉదారంగానే నిరూపిస్తూ

వచ్చారు. యూరపియనులు శిరఃకంపం చేస్తూవచ్చారు. విట్‌మన్ తన The Poet and His Program (1881)లో London Times ని ఉదాహరించిన ప్రకారం ప్రసిద్ధులైన అమెరికను రచయితలకు ఇంగ్లీషువారి భావధోరణి, పలుకుబడి బాగా పట్టుబడినా యని, పైపై మెఱుగుల ఆంగ్లమేధావులు వారిని ఇంగ్లీషుపుట్టుక పుట్టినవారిలాగానే సంభావించా రనీ తెలుస్తుంది. వాళ్ళ పుస్తకాలైతే చదివే వాళ్ళకు బాగానే వున్నాయి కాని వాటిలో ఆదినుండి అంతందాక జాతీయత అన్నది లోపించింది. ఉదాహరణకు జె. ఆర్. లోవెల్‌ను తీసుకుందాం. రచనలో కాస్త రాజకీయాల ప్రసక్తి వచ్చేసరికి కావలసినంత అమెరికన్ హాస్యం కురిపిస్తాడు. కాని స్వచ్ఛమైన కవిత్వం వ్రాయవలసి వచ్చేసరికి అతడు న్యూడిగేట్ పోటీదారుడికంటేకూడ నెరవైన అమెరికన్ అని చెప్పలేము. 'టైమ్సు' పత్రిక అమెరికనుల కొక స్వదేశీయమైన సాహిత్య మంటూ వుండాలని అమెరికనులు చర్చించుకున్నట్లుగానే, కొంత వారి అసంబద్ధ ధోరణిలోనే చర్చించింది. లాంగ్‌ఫెలో, లోవెల్‌లలో ఇంగ్లీషు స్వభావం కంటె 'న్యూ ఇంగ్లీషు' స్వభావం, అంటే అమెరికనుతనం ఎక్కువ. వారు లెస్లీ స్టీఫెన్‌కంటెగాని, మేథ్యూ ఆర్నాల్డుకంటెగాని ఎక్కువ ముష్కరంగా వ్రాయలేకపోయారు (Biglow Papers లో లాగు అప్పుడప్పుడు తప్ప). అమెరికన్ బైతు (Ruffian) కనబడినప్పుడింగ్లీషువారుల్లాసంగానే పలకరించేవారు కాని లోవెల్, లాంగ్‌ఫెలో ప్రభృతులు వంచనకు పాల్పడిన సందర్భాలవంటి సందర్భాల్లో ఆ అమెరికను బైతును అమెరికనుల దృష్టికి అవమానకరంగా వారి జాతి కంతటికీ ప్రతినిధిగా పరిగణించేవారు.1870లో గ్రేట్ బ్రిటన్‌కి అమెరికన్ మినిస్టర్‌గా వున్న మోట్లే (Motley) స్థానంలో జనరల్ షెంక్ (General Schenck)నియమింపబడ్డాడు. మోట్లే మంచి పండితుడు, తగుమనిషి. మంత్రిగా వుండదగినవా డనిపించుకొన్నవాడు షెంక్. 'డ్రాపోకర్' అనే ఆటను లండను వాసులకు పరిచయంచేసి నలుగురినీ బాగా ఆకర్షించాడు. ఆ క్రీడలో

చిరకాలాభ్యాసం వలన బాగా ఆరితేరినవాడతడు. దురదృష్టవశాత్తూ అతడొక అనిశ్చయమైన గనిత్రవ్వకపు సాహసకార్యానికి పూనుకొన్నాడు. అందులో, పాపం, కొందరు బ్రిటిష్ మిత్రులు చాలా నష్టపోయారు. అక్కడితో షెంక్ ఉద్యోగభోగం సరి. అమెరికానుండి శ్రీముఖం వచ్చింది. ఇంటిముఖం పట్టేడు. కాస్త వింతగా అసాధారణంగా కనిపించే అమెరికను లంతా అనాగరికులే అనే ఇంగ్లీషువారి అభిప్రాయపు బుజువుల పట్టికలో చేరిపోయాడు.

ఐనప్పటికీ చాలామంది అమెరికనులకంటె బ్రిటిషువారే ఎక్కువగా అమెరికనులకు స్వయంవ్యక్తికమైన, దేశీయమైన సాహిత్యసంపద ఏర్పడాలనే ఆసక్తి ప్రకటించారు. (అలాంటి కొందరు బ్రిటిషువారి విషయంలో అది అమెరికాలోని జీవితవ్యవస్థ గురించి ముందుగానే తమ కున్న ఊహల కుపాధి కల్పించుకోవా లనే కోరికయే కావచ్చు) డబ్ల్యు. ఎమ్. రొజెట్టి పూచీపైని విట్మన్ స్వదేశంలోకంటె ఇంగ్లండులోనే ప్రచురంగా అభినందనలు పొందేడు. సివిల్ వార్ కాలంలోను ఆ పిమ్మటను నిజమైన అమెరికనుతనం గురించి ఇంగ్లీషువారి కున్న ఆశయాలకు మంచి ఫలితాలే కలిగేయి. ఆర్టెమస్ వార్డ్ ఇచ్చిన ఉపన్యాసాలూ, Punch పత్రికలో వ్రాసిన వ్యాసాలూ; 'బైరన్ ఆఫ్ ఓరెగాన్' అని పేర్పడ్డ జాక్విన్ (ni cincinnatus) మిల్లర్ వ్యక్తిత్వము; బ్రెట్ హార్టె వ్రాసిన కథలు; కవితలు; జోష్ బిల్లింగ్సు సూక్తులు; మార్క్ ట్వెయిన్ రచనలు—ఇవీ ఇటీవలి అమెరికన్ సంగీత మోదాంతరూపకాల్లాగు అనర్ఘశక్తి సందీప్తాలై లండను లండనంతటినీ ఉర్రూతలూగించాయి. అయితే 'Oklahoma', 'Anne Get Your Gun' అనే రచనలలాగు అవన్నీ అందరికీ ఉపభోగ్యాలైనవి కావు. జాన్ నికోల్ అనే స్కాచ్ విమర్శకుడు తన 'అమెరికన్ లిటరేచర్' (1885) అనే గ్రంథంలో అమెరికన్ హాస్య రచనలలో కొన్నిట పతనం పొందుతున్న శైలి గురించి చాలా విచారించాడు. బహుశా జీవద్రచయిత లందరిలోకీ మార్క్ ట్వెయి

నొక్కడే ఆంగ్లభాషను వ్యవహరించేవారి సాహిత్యశైలి స్థాయిని దిగజార్చిన వారిలో అగ్రగణ్యు డని కూడా అన్నాడు. మొత్తానికి సంయుక్త రాష్ట్రాలలోని తూర్పు రాష్ట్రాల విమర్శకుల కంటె బ్రిటిషు విమర్శకులే 'పాశ్చాత్య' (అమెరికన్) హాస్యం యెడల ఎక్కువ సానుభూతి చూపించారు. హావెల్సు అన్నట్లు "పడమటి అమెరికా తొలుతగా సాహిత్యంలో తన వ్యక్తిత్వానికి ప్రవేశం కలిగించుకొన్నప్పుడు తన కావల నున్న ప్రాచీనమైన, నాగరికమైన ప్రపంచాని కున్న పరిజ్ఞానా న్నేమీ ప్రదర్శించి వుండలేదు. ప్రాచ్యం మాత్రం తన భుజాలమీంచి యూరపు వేపు బితుకు బితుకుగా చూస్తూ, తాను సాహిత్యవిషయసృష్టి చేసుకోవడమే కాదు, తనకు తానే దాని విలువ కట్టుకోవాలని కూడా తహతహ పొందుతూ వుండేది."

పాశ్చాత్యపు, లేక సీమల (Western or frontier) హాస్యమన్నది నిజానికి పాశ్చాత్యసీమకే పరిమితమైనది కాదు. దానిలో కొంత న్యూ ఇంగ్లండు స్వభావం, దిగువ తూర్పు దేశపు ధోరణులు కూడా గోచరిస్తాయి. ఉదాహరణి: 'అత్యుక్తి' స్వభావధోరణి (లోవెల్ చేసిన కర్ర గులకరాళ్ళ వర్ణనలో కనిపిస్తుంది. అవియట 'పైపూతతో అచ్చం పాలరాళ్ళలా తయారయేసరికి నీటిలో మునిగిపోయాయట'!) పడమటికి వ్యాపించకముందే తూర్పువారికి పరిపాటి అయిపోయింది. ఆర్టెమస్ అనగా ఇంకా మరికొందరు హాస్యరచయిత లనగా మొదట తూర్పునుండే ఉదయించారు. బ్రెట్ హార్టె పెరిగింది బ్రూక్లిన్‌లోను, న్యూయార్కులోను. ఆయన వట్టి పోకులరాయుడు. తాను వ్రాసిన గని పని మకాముల గురించి వాస్తవానికి సూటియైన అనుభవం లేనివాడు. 'టైమ్సు' పత్రిక అన్నట్లు జాక్విన్ మిల్లర్ అతని దుస్తులూ, అతని వైఖరీ సూచించేటట్లు రచనలో ఎక్కడా మోటుధోరణి కనిపించదు. 'అతని పద్యాల్లో మంచి ధార, గతి, పొందిక కనిపిస్తాయి. భావవిషయంలో మాత్రం అతని గిరిశ్రేణి గీతాలు హాలెండులో వ్రాసివుంటే బాగుండు ననిపిస్తుంది.' ఈ

ప్రాచ్య పాశ్చాత్య విభాగ మన్నది స్థూల ప్రదేశాల కెంత సంబంధించిందో మనఃస్థితికీ అంతే సంబంధించింది. కాని యెందుకో ప్రాచ్య ప్రాంతీయులు తమ పాశ్చాత్య ప్రవృత్తినే తమది కాదనుకొంటారు. జాన్ హే ఇండియానా నుండి తూర్పుగా వచ్చాడు (మిగతా పాశ్చాత్యు లనేకులు చేసినట్లుగానే). సరసుడు, వృద్ధుడు అయిన హేకి, తన Pike County Ballads (1871) తో అమెరికన్, బ్రిటిష్ పౌరుల మెప్పులందిన యువకుడైన హేకి చాలా అంతరం కనిపిస్తుంది. ఒకసారి ఇ. సి. స్టెడ్‌మన్ అనే న్యూయార్కు రచయిత 1873 లో ఒక మిత్రునితో "దేశం దేశమంతా ఒక మోటుయాసతో కూడిన అకటా వికటమైన హాస్య పంకిల ప్రవాహంలో పడి కొట్టుకుపోతోం" దన్నాడు. విమర్శకులు కొందరు హే వ్రాసిన Pike County హాస్యం యెడల అంతకంటే ఎక్కువ దయ ప్రకటించలేదు. మరి మూడేళ్ళ కొక ప్రాచ్య సమీక్షకు డొక ఇండియానా రచయిత వ్రాసిన గ్రంథాన్ని సమీక్షిస్తూ అది 'కొండలమీద నుంచి గాత్సు (Goths) చేసిన దండయాత్ర' లా వుంద న్నాడు.

అక్కడ సమీక్షకుడు తమ సగం సగం రోమకమైన నాగరికత నశించిపోయిన సంగతి ఉద్దేశించినా ఉద్దేశించకపోయినా ఆ అన్న మాటలు స్ఫూర్తిమంతాలైనవి. ఆ గాత్ దేశంవైపు చూపు సారించడం మంచిదే - గాత్ ప్రముఖుడు మార్క్ ట్వెయిన్‌ని అర్థంచేసుకోవాలంటే. అమెరికన్ గాత్ భూమి అంటే ప్రాచీనమైన వాయవ్యభాగం, గనుల సరిహద్దు ప్రాంతం, పసిఫిక్ తీరం అనే ప్రదేశాలు కలిసిన దేశం. మూటికి మూడూ చాలా విజాతీయమైన ప్రదేశాలు. ఇంకా అనేక ప్రదేశా లా దేశం కిందికే వస్తాయి కాని ట్వెయిన్‌కి తెలిసిన వా మూడే. ఇంకా స్థావరాల యేర్పాటు దశలో వున్న అమెరికా దేశ విభాగాలను నిర్వచించాలంటే ఆ గాత్ దేశాన్నంతా స్థూలంగా పశ్చిమదేశ మనిగాని, సరిహద్దు ప్రాంత మనిగాని వ్యవహరించవచ్చు. మొదటి స్థావర నిర్మాతలు వచ్చే

దాకా ఆ దేశమంతా ఘోరకీకారణ్యం; కొద్దిమంది ఇండియన్లు, శ్వేత మృగయులూ మాత్రం వుండేవారక్కడ. బ్రతుకు చాలా క్లిష్టంగా వుండేది. ఆ మనుష్యులు విపరీతమైన ఆత్మప్రత్యయంతో బ్రతుకు నిల ద్రొక్కుకున్నారు. అలా చెయ్యడంలో చట్టము, సంభాషణ, సాంఘిక దృక్పథము మొ॥ వానిలోని సారస్యాలయెడ ఏవగింపు పెంచుకున్నారు. 1842లో చార్లెస్ డికెన్సు అమెరికాలో పర్యటిస్తూ మొట్టమొదటగా ఒక పశ్చిమప్రాంతీయుని-ఒక కాలువలో పడవమీద పిట్స్‌బర్గ్‌కి వెళు తున్నవాడిని కలుసుకున్నాడు. అతడు చాలా విడ్డూరంగాను, నిర్లక్ష్యం గాను కనిపించాడు. మిగతా ప్రయాణికులతో ఇలా అన్నాడట: "నా నివాసం మిసిసిపి ప్రాంతంలోని ఆ గోధుమవన్నె అడవులు. సూర్యుడు నా మీద ప్రకాశించేటప్పుడు అంత కాంతిమంతంగా వుండడు. నేను గోధుమవన్నె అడవి మనిషిని. నేనుండే చోట నున్నని దేహాలు వుండవు. మేమంతా మోటుమనుషులం."

అలాంటి మనుషులు కొందరొక క్రొత్త పదజాలం తయారు చేశారు. ఉదా: absquatulate, flabbergast, rampageous మొ॥వి. అనేక సన్నివేశాలకు నప్పేటట్లుగా fixings, notions, doings అనే మాటలు కలిపించుకొన్నారు.

సరిహద్దు ప్రాంతపు జీవితంలో ఒక ఏకాకిత, శూన్యత గోచరిస్తాయి. ఆ ఏకాంతత విషాదగర్భితమైనది కూడ. "అట్లాంటిక్‌కి ఆవలి దేశంలో హాస్యం గంభీరస్వభావులు, గాంభీర్యాన్ని మించిన స్పష్టతతోడి అంత ర్దర్శనం గలవారూ అయిన ఒక జాతి జనుల అసాధారణ తేజస్సులా వుంటుంది. అత్యుక్తిలోనే దానికి విశ్వాసం. ఎగతాళితోపాటు నిజాయితీని మేళవిస్తుంది. ఫలితం నీగ్రో సంగీతంలోలాగు విషాద శ్రుతిలో వినోదగీతం ఆలపించినట్లు వుంటుంది," అంటాడు జాన్ నికోల్. మరో మాటగా

చెప్పాలంటే, పశ్చిమ ప్రాంతపు టాశావాద దృక్పథము, అది తలి చోక శుభస్థితినుండి ఉద్భుద్ధమైనదైనా, అప్పుడప్పుడు నైరాశ్యపు పొలిమేరల్లో నిలవడం కద్దు. భంగపాటు కెప్పుడూ అవకాశం వుంది గనుక దాని గురించి ఆలోచించే ప్రశ్నే లేదు. చెదురు చెదురుగా వున్న ఒక సరిహద్దు గ్రామం, అది యిదివరకే ఒక పట్టణంగా వుండేదని బుకాయిస్తే తప్ప, దాని స్థితి నెలా సంరక్షించుకోగలదు? (లింకన్ గారి న్యూసేలెమ్ సంరక్షించుకోలేకపోయింది గదా!)

కాన్‌స్టన్స్ రూర్కె తన American Humour (1931) లో- "పశ్చిమారణ్య ప్రాంతీయుడు ఇండియన్‌ని జయించా డదిసరే. కాని ఇండియన్ కూడా అతడిని జయించాడని చెప్పాలి" అన్నది. అవును, అతడిని కూడా తనలాగే ఒక అనాగరికుడిగా, మృగయునిగా, మృగప్రాయునిగా, అంధవిశ్వాసావృత భయాలకు దాసుడిగా చేసేశాడు ఇండియన్. నిజమే కాని స్థావర నిర్మాణ కార్యక్రమం చకచకా ముందుకి సాగిపోయింది - తోకెవిల్లీ లెక్క ప్రకారం ఏడాదికి పదిహేడు మైళ్ళ చొప్పున. ఆవిరి యోడ, ఇనుపదారి అరణ్యం గుండెలు చీల్చుకుంటూ సాగిపోయాయి. తొరతొరగా సరిహద్దు ప్రాంతీయులు వార్తాపత్రిక (మార్క్ ట్వెయిన్ హన్నిబాల్‌లో ఏడు పత్రికలుండేవి), పాఠశాల, చర్చి, శాసనకార్యాలయం ఏర్పరచుకొన్నారు. "గుడారంలోకి పియానోని అంత తొరగా తెచ్చిపెట్టింది మతమే" అన్నాడు ఎమర్సను. కాని బ్రెట్ హార్టె "అది మంచిదికాదు సరిగదా, చెడుగు సుమా" అని ఉద్ఘాటించా డతనితో: "కాలిఫోర్నియాలో సంగీతానికి ప్రవేశం కలిగించిన వాళ్లు జూదరులు. న్యూయార్కులో, తత్రాపి దేశమంతటా వివిధ వస్త్రధారణాడంబర విధానాలు తెచ్చిపెట్టినవారు వేశ్యలు." 1

---

1. తే 18-10-1872 దీ క్రింద ఎమర్సను జర్నల్‌లో ఉదాహరింపబడిన 'హార్టెతో ఒక ప్రసంగం' నుండి.

నిస్సందేహంగా ఆ రెండింటికీ ప్రభావం లేకపోలేదు. నిజానికి అమెరికను స్త్రీ తన పాత్ర నిర్వహించడానికీ, ఆమె భర్త అనుమతించడానికీ సిద్ధంగానే వుండేవారు. అయితే డికెన్సు తా నమెరికన్ పద్ధతుల వల్ల కొంత అవమానానికి గురియైనా తన పర్యటనలో 'ఎక్కడా ఏ స్త్రీ ఏ విధంగానూ న్యూనతకు గురికావడం చూడలే' దన్నాడు. ఆ పశ్చిమప్రాంతం మోటుతనానికీ, నియమ రహిత స్వభావానికీ ఎంత పేరుపడినా, ఒక ప్రక్కనుంచి మర్యాద, మార్దవం కూడా అలవరుచుకోవాలని కూడా ఉబలాటపడజొచ్చింది. The Lady of the Lake, Marmion గ్రంథాలను చాలా మెచ్చుకునే ఒక చోక్టావ్ (Choctaw) నాయకుని డికెన్సు చూశాడు. మురికితో మూలిగే గనిపనుల పట్టణాలలో కూడ సంగీత నాట్యశాలలు వెలిశాయి. అక్కడి మనుషులు ఉన్నతమైన అభిరుచి గురించి ఆస్కార్ వైల్డు యిచ్చిన ఉపన్యాసాన్ని టిక్కెట్లు కొనుక్కుని మరీ విన్నారు. టామ్‌సాయర్ దొంగలముఠా ఒక ఆదివారపు బడి వనభోజన యాత్రికులపై దాడి చేసింది. అయితే అది జరిగింది శనివారం నాడు. ఆ దొంగల తలిదండ్రులు కూడా వాళ్ళను 'సేబత్' రోజున (ఆదివారం నాడు) క్రీడావినోదాల్లో కూడా పాల్గొననివ్వరు. అదీ సంగతి.

అప్రాచ్యపు టాటవికుని గురించి "అతనికి సంబంధించినదంతా ఒక పరిష్కృతి లేకుండా దానంతట అది ఏర్పడిందే, అనాగరకమైనదే కాని పద్దెనిమిది శతాబ్దుల పరిశ్రమానుభవాల ఫలితం అతనిలో కనిపిస్తుంది" అని తోకవిల్లీ అన్న మాటను కాన్‌స్టన్స్ రూర్కే వక్కాణకు జోడిస్తే అక్కడి కా సందర్భం పరిపూర్ణంగా అర్థవంతం అవుతుంది. ఆ ఆటవికుని సరిహద్దులు కదలిపోయాయి, అడవులు పట్ట విడిచాయి, అతని క్రీడ వ్యర్థమైన సివంగా పరిణమించింది. అంతా మారిపోయింది. ఆ చకచక సాగే పరిణామదశలో విషాదం ఘనీభవించిన విషమసమయాలు కూడా వచ్చాయి. కొన్నాళ్ళపాటు దేశంలోని జలమార్గాల్లో మిట్ట తెప్పలు, గుర్రాలు లాగే పడవలే గొప్పగా ఎంచబడేవి. ఆ యింతా ఆవిరి

పడవలు వచ్చి వాటి స్థానం ఆక్రమించుకున్నాయి. 'ప్రాత పద్ధతు' లన్నవి అంతరించాయి. ఏదో అక్కడా అక్కడా మిట్టతెప్పల రాజైన 'మైక్ ఫింక్' కథనూ, "ఎందుకొచ్చిన పరిణామా లయ్యా! ఆ నాటి మా సరదాలూ, సంబరాలూ, చెటాపటా పోటీలూ, పోరితాలూ ఏవీ? ఇంకెక్కడ? అన్నీ. గంగలో కలిశాయి!" అనే అతని ఆక్రోశమూ, అలాంటివే మరి కొసిన్ని ప్రాత సంగతులు మాత్రమే ఇంత ఊపిరి నిలుపుకున్నాయి. ఆర్టెమస్ వార్డ్ వబాష్ కెనాల్ ప్రాంతంలో యువకుడుగా వున్నప్పుడు వ్రాసిన ఒక నదీయానపు దినసరిలో సరిగా అదే మనఃస్థితిని ప్రదర్శించాడు. "ఆవిరి పడవల హడావుడికి ముందునాటి 'Old Long Sign' రోజుల మాట యిది - ఆ రోజులే హాయిగా వుండేవి," అంటాడు. ఆవిరి పడవల శకం కొస్త పెద్దదేకాని అవి అట్టే మన్నికగలవి కావు. వాటికి 'పేస్టుబోర్డు'లని పేరు పెట్టేడు థేకరీ. ఒక్కొక్కదానిలో ఒక ఇంజనూ, పదివేల విలువచేసే నగిషీపనీ వుండేవి. అయితే గట్టిగా ఒక ఇసకగోడను ఢీకొంటే అంత నగిషీతోటీ అది హఠాత్తుగా నాశనం కావలసిందే. మరెందుకో ఆ నిర్మాణం అతి పేలవంగా వుండేది.

ఆ పాశ్చాత్యుడు పరిసరానికి పొందే ప్రతిస్పందనం చాలా స్వాభావికంగా వుండేది. అస్వాభావికంగా పుట్టినవారి గురించి, అకాలంగా మరణించిన వారిగురించి ఎవరూ మాట వరుసకి కూడా ఏడ్చేవారు కారు. వారి బ్రతుకులు హాస్యాస్పదా లయ్యేవి. ఆ ప్రాంతం వారికి చెప్పుకోడాని కొక పౌరాణిక భావప్రపంచం, ఒక కల్పితగాథా ప్రపంచమంటూ లేవు. అయితే అలాంటి దొకటి క్రొత్తగా కలిపించుకోవడం సులువైంది. ఆ జానపదకథానాయకులు కొంత అతిమానుష, లేక అమానుష వ్యక్తులే. అయితే వారితో మరీ వింత, విడ్డూరమూ ఏమీ లేవు. 'మైక్ ఫింకు'లా తతిమా సామాన్య మర్త్యు లందరికంటే కొస్త ఘనమైన తిండిపోతులు, త్రాగుబోతులు, పోటుమానిసులూ; అంతే. డేవీ క్రోకెట్ అనే వాయవ్య ప్రాంతపు వీరుడికి కూడా అలాంటి ఘన

తలే ఆరోపించ బడ్డాయి. ఆయన పలుకులు మ్రింగేసే, ఎనుబోతును విసిరేసే, చంద్రుడిని గుండేసి కొట్టేసే 'కెంటక్' (Kentuck) కోవకు చెందినవాడట. ఈ క్రోకెట్ గాథ కేర్పడిన ప్రాచుర్యం చూస్తే ఆ సరిహద్దు ప్రాంతానికి సంబంధించిన ఆత్మ ప్రత్యయాడంబరంతో కూడినవీ, కృత్రిమాలూ అయిన విషయాలు కూడా యథార్థాలుగా భాసించే గుణాన్నెలా పొందుతాయో తెలుస్తుంది. నిజానికి డేవీక్రోకెట్ ఆ పశ్చిమారణ్యవాసుల్లో వట్టి సామాన్యుడు. అతనికి కాంగ్రెసన్నా, ప్రెసిడెంట్ ఏండ్రూ జాక్సనన్నా పడదు. ఆ యింతా ఆటవికుల ఓట్లను నాచుకోందామని ప్రతిపక్షం వారైన 'విగ్గులు' (Whigs) క్రోకెట్ని పట్టుకున్నారు. అతనికొక చరిత్ర వ్రాసిపెట్టేరు. అందులో ఆనాటికి తగిన నానా డప్పాలూ కొట్టేరు. కట్టుకథ లల్లేరు. ఒక తరంపాటుగా ఆ ఆటవిక జాతి మేము 'సగం గుర్రాలము, సగం మొసళ్ళము' అని చెప్పుకుంటున్నదానికి తగినట్లుగా ఆ క్రోకెట్ని ఒక అమానుష వ్యక్తిగా ప్రచారం చేశారు. అదృష్టవశాత్తూ ఆ గాథకి తగినట్లే అలామోవద్ద టెక్సాస్ స్వాతంత్ర్యసమరంలో వీరోచిత మరణం పొంది అమరు డయ్యాడు క్రోకెట్. అతడి కథ కల్పితమైనదే అయినా, ఒక పుక్కిటి పురాణం పెరగడానికి కేంద్రప్రాయుడైన వ్యక్తిగా చాలా ఉపకరించాడు. దేవుళ్ళలో జమకావడాని కంగీకరించినందుకు గాను డేవీ క్రోకెట్ని మనం అంతగా ఆక్షేపించకూడదు. బఫెలో బిల్, వైల్డ్‌బిల్ హికాక్ మొదలైన మరికొందరూ అలాగే చేశారు. జడ్జ్, మేజర్, కల్నల్, అంతెందుకు జనరల్ అనే గౌరవార్థపు బిరుదులన్నీ గాథలు కలిపించడానికి తగిన ఉపపదాలు. ఒకప్పుడా బిరుదులు యథార్థమైనవే కావచ్చును. ఒక్కొక్కప్పుడు యథాయథార్థాలు రెండూ కలిసి వుంటాయికూడా. ఎలాగంటే ఇండియనులు దోచుకున్న ఒక వేగను సందులో కిట్ కార్సన్‌కి ఒక చిన్న నవల కనిపించిందట. అందులో ఇండియన్ స్కౌట్ అయిన కిట్ కార్సన్ సాహస కృత్యాలే వర్ణింపబడి వున్నాయట!

వంచన అన్నది అమెరికను జీవితంలో చొచ్చుకుపోయిన గుణం. అమెరికన్ హాస్యంలో దానిదే అగ్రతాంబూలం. యాంకీ సార్థవాహుని కొయ్య జాజికాయలనుండి రొండిలో తురుఫాసులు దాచుకున్న చైనా విగ్రహారాధకుడి గురించి బ్రెట్ హార్టె వ్రాసిన కావ్యం వరకూ కావలసినన్ని తార్కాణాలు. జీవితగమనంలో స్పర్థ పెరగడంతో వంచన కనంతములైన అవకాశా లేర్పడ్డాయి. నీటుదనపు ప్రశంసలకోసం నిజాయితీ బలి అయ్యే దని డికెన్సు చెప్పేడు. ట్రొల్లోప్ గ్రహించిందీ అదే. 'ఈ సరిహద్దు ప్రాంతంలో ప్రతిమనిషీ విధిగా నీటుగా, డాబుగా వుంటాడు. అలా ఉండని వాడు తూర్పుకి- యూరప్పంత తూర్పుకయినాసరే వెళ్ళిపోవడం మంచిది. అక్కడ పనికొస్తాడు వాడు'1 ఇని అతనితో ఎవరో అన్నారట! క్రమంగా కాపట్యంయొక్క వికారాలుచమత్కారాలుగా పరిణమించాయి. వినోదాలుగా చలామణీకాజొచ్చాయి.ఒక నియతాకృతిలేని పశ్చిమప్రాంత పట్టణవీధులకువెన్నెల సౌందర్యపువెల్ల వేసినట్లు హాస్యంవంచనకొక మార్ద వాన్నిచ్చింది.ప్రతివాడూ అంతోయింతో తానూ ఒక ప్రదర్శకుడైనప్పుడు, పరమార్థంలో ఏ ఒక్కడికీ తఖరారు లేదు. అందరు మనుషుల్నీ ఎల్ల వేళలా ఎప్పుడూ కమ్మకట్టలేము. అసలు వాళ్ళు ఒకరి నొకరు కమ్మకట్టుకోవడంలో నిమగ్నులై వున్నారు. ఇదీ అసలు పద్ధతి. అమలుజరిగినట్లే వున్నది. ఒక వరసపెట్టి పి. టి. బర్నమ్ చేసిన గమ్మత్తులు తరచు వాటిని మారుస్తూ వచ్చినంతకాలం ప్రజామోదం బాగా పొందుతూ వచ్చాడు. జాక్విన్ మిల్లర్ ఒక ఇండియన్ బాణంవల్ల తాను గాయంపొందే నన్నాడు. ఏంబ్రోజ్ బియర్స్ అన్నట్లు, అతడు కాని ఎప్పుడన్నా మంచి కాలుతో కుంటుతూ నడిచాడా,మరేంలేదు,అతనింకా మరి కాస్త అభినయాభ్యాసం చేసుకోవలసి వుందన్నమాట. నిజానికి మిల్లర్ తన ప్రయాస తాను

1. చూ. ఆంథోనీట్రొల్లోప్ వ్రాసిన 'నార్త్ అమెరికా' (లండన్, 1862), i. 188)

పడ్డాడు. పెద్దతనంలో ఒక క్లోండైక్ (Klondike, ie. బంగారు బొత్తి ముల ఉన్నినూటు) నేపథ్యంలో ఒక హాస్యనాటకమేళంతో తిరిగాడు. అయితే బహుశా అతని సామాజికు లెవరికీ అత డొకప్పుడు లాటిను, గ్రీకు చదివాడని తెలిసివుండదు. తెలిసివుంటే ఉల్లాసకరాలైన అమెరికన్ అసంబద్ధతలలో మళ్లా ఇదొకటవుతుంది. ఇలాంటి వాటిగురించి (అసలే లేనివాటి గురించి) నవ్వకేం జేస్తాము? ఇలాగే ఒకసారి అసలు నామరూపాలు లేని నగరాలగురించి 'పుట్టనియట్టి బిడ్డలకు బూసలు గట్టుగు రమ్మలక్క' లన్నట్లు అవి యెప్పటినుంచో ఉన్నట్టుగా బొమ్మలతో గూడా ప్రకటనలు వచ్చాయి. అలాటి పట్టణాన్ని విస్కాన్సిన్ రాష్ట్రంలో సందర్శించిన లారెన్సు ఆలిఫేంట్ తన అనుభవాన్ని ఇలా వివరించాడు:

"ఆ కార్యాలయంలో ఆ నగరం తాలూకు తబిసీళ్ళన్నీ చూసుకున్నాక అక్కడ కొన్ని జాగాలు కొందామని బయలుదేరేము. ముఖ్యంగా కొన్ని స్థలాల సన్నివేశం మమ్మల్ని బాగా ఆకర్షించింది. అందులో కొన్ని నదీతీరాని కతిసమీపంలో, గ్రేండు హోటలుకి మూలగా, రేవు మెట్ట కెదురుగా, పెద్ద చౌకుకు ముందుగా, థామ్సన్ వీధికి వెనుకగా, పట్టణంలో కెల్లా హడావుడిగా వుండే వ్యాపారకేంద్రానికి మధ్యగా వున్నట్లు చూసుకుని బాగుందనుకుని బయలుదేరేము. దారిలో ఒక దట్టమైన అడవి. దానిని కొంకికర్రలతో ఛేదించుకుంటూ పోయాము. అదే 'థర్డ్ ఎవెన్యూ' ట! తదుపరి ఒక కొండవాగు ఒడ్డుకు చేరేము. దాని వాలంట ఒక కుర్ర చిట్టడవిలో చొరబడ్డాము. (అది 'వెస్టు స్ట్రీటు'ట!) ఆ చిట్టడవి చివరికి వచ్చేసరికి అక్కడొక ఊబ్బలి (బురదనేల). అదే పెద్ద చౌకు. దాని కవతలి యొడ్డున దూర శక్యముగాని పొదలు. అదే మా స్థలాల అద్భుత సన్నివేశం!" 1

---

1. లారెన్సు ఆలిఫేంట్ రచన, Minnesota and the Far west (Edinburgh, 1855), 159-60.

ఇక అమెరికన్ పేర్ల విషయం: అందరికీ అదో ముచ్చట. (మేథ్యూ ఆర్నాల్డుకి తప్ప; అతనికి వాళ్ళేదో కోపం తెప్పించారు.) ఉదాహరణకి అబ్రహాం లింకన్ బ్లేక్ హాక్ యుద్ధానికి (కాంగ్రెసులో దీన్ని పరిహాసం చేశా డాయన) వెళ్ళిన సంగతి తీసుకుందాం. అప్పు డాయన ఒక చిన్న తెప్ప ఎక్కాడు. దానిమీద 'పెకింగ్ నుండి హవానాకు' అని వుంది. ఇదంతా ఇల్లినాయ్‌లోనే.

పశ్చిమ ప్రాంతపు హాస్యంలో ఇలాంటి అసంగతులు విధిగా వుంటాయి. వలసల కాలంనుంచి మంచి ప్రచారంలో వున్న 'ఆఖ్యానం' (1835 నాటికే Baron Munchausen అమెరికాలో ఇరవై నాలుగు తడవలు ముద్రణ పొందింది) పశ్చిమానికి వ్యాపించి అబద్ధపు టంతు కనుక్కొంది. చూడండి మృగయాఖ్యానంలో వేటకాడు తనను చెరో వేపు నుండి ఒక ఎలుగ్గొడ్డు, ఒక కణుసు తాకవస్తూవున్నప్పుడు ఎదుట సూదిగా వున్న ఒక కొండ సిగిలంమీద తుపాకి పేల్చాడట; ఆ యింతా గుండు రెండుగా చీలి ఇరువైపుల నున్న జంతువులు రెండింటినీ చంపేసిందట! ఆ ధసరుకి ప్రక్కనున్న చెట్టునుంచి ఒక ఉడత దూకేసిందట! తుపాకి మడమ వేటగాడి భుజాన్ని బలంగా తాకి వెనుకపాటుగా నది యొడ్డున నిలబడ్డ అతనిని నదిలోకి నెట్టిందట. ఒడ్డుకు వచ్చి చూచుకొనేసరికి అతని ఒంటి నిండా చేప లున్నాయట!

ఆఖ్యాన మంటే చెప్పబడటం దాని ముఖ్యలక్షణం. దాని కొక కథకుడూ, వట్టి ఉపన్యాసప్రియులైన సామాజికులూ కావాలి. (ఆ ఉపన్యాసకులు చిల్లరదుకాణదారులు, హాస్యగాళ్ళు, మతాచార్యులు, రాజకీయవేత్తలు, రచయితలూ, ఇంకా ఎవరైతేనేం.) ఆ విషయాన్ని ఆసక్తితో గ్రహించిన ఎడ్వర్డ్ హింగ్‌స్టన్ అనే ఇంగ్లీషు నాటక సమాజ ప్రతినిధి ఇలా అన్నాడు:

"అమెరికా ఒక పెద్ద సువిశాలమైన ఉపన్యాసాల సాల. ఉపన్యాస

వేదిక సరాసరి బోస్టనునుండి న్యూయార్కు, ఫిలడెల్ఫియాలగుండా వాషింగ్టనుదాకా సరళరేఖలో సాగిపోతుంది. ఏలెఘనీస్ ప్రథమ శ్రేణిలో ఉన్నతవితర్దికలు, రాకీపర్వతాలమీద తాళ్వారమూ (Gallery) వున్నాయి.

భూగోళాన్ని నిత్యం చుట్టబెడుతూవున్న బ్రిటిషుసైన్యం మ్రోయించే ప్రభాతభేరికి సంబంధించిన అత్యుక్తిలో కొంత సత్యం వుండవచ్చు. అంతకంటె యథార్థమైనది సంయుక్త రాష్ట్రాల్లో ఉపన్యాసకుడి గొంతుక ఊరికే వుండ దన్నమాట."

ఆర్టేమస్ వార్డ్ ఒక సంగతి చెప్పేడు:

"ఒకసారి ఒహాయోలో ఒక ఉరిసందర్భంలో, షెరిఫ్ వచ్చి హంతకుడి మెడకు త్రాడు తగిలించేముందు 'చెప్పుకోవలసిందేమేనా వుంటే చెప్పుకో' మన్నాడు. ఆ యింతా ఆ గుంపులోంచి దూసుకు వచ్చి ఒక సుప్రసిద్ధ స్థానిక వక్త—"అతనికి చెప్పుకోవడానికేమీ లేకపోతే, దురదృష్టవంతుడైన మా తోటి పౌరుడు ఉపన్యసించడానికి సుముఖంగా లేకపోతే, అవతల తొందరయేమీ లేకపోతే, ప్రకృతసందర్భాన్ని వినియోగించుకుని ఒక సరిక్రొత్త రక్షణపథకం యొక్క ఆవశ్యకతగురించి కొన్ని ప్రతిపాదనలు చేయాలని చూస్తున్నాను."

ఇక రాజకీయోపన్యాసధోరణి ఆ రూపకాలంకార అట్టహాసాలతో అదో రాబందుపక్షువిక్షేపణం లాంటిది. అప్పుడప్పుడు పరిహాసఫక్కిలోకి దిగినప్పు డాఖ్యానంయొక్క రూపాంతరంలా వుంటుంది. ఆ సరిహద్దు ప్రాంతపు హాస్యం ఎక్కువపాలు మౌఖికమైనది. వార్డు, ట్వెయిన్ మొదలైనవారు మాంచి ఘటికులైన ఉపన్యాసకులు (ఉపన్యాస ప్రదర్శకులు) వాళ్ళ హాస్యపదాలూ, కథలూ చాలామట్టుకు ఉత్తనే కాగితంమీద పెట్టిన స్వగతాలు.

ఈ స్వగతాలు సాధారణంగా మాండలికభాషలో వుండేవి. అది

యొకటిగాని ఒక ఉపన్యాసానికి నకలు వ్రాత కాకపోతే, ఉద్దేశ పూర్వకంగా వికృతోచ్చారణకు గురి అయ్యేది. హాస్యోపన్యాసకుడు ఒక పట్టి చదువుకోని బడుద్ధాయి మొగం పెట్టేవాడు. ఉండివుండి ఒక పాచి లాటినుమాట విసిరేవాడు. కాని దాని కోడూ కొమ్మూ ఊడదీసే వాడు. అతడు షేక్స్పియరుని ఉదాహరించినపుడు ఆయనకీ ఆ గతే పట్టేది. ఆ చమత్కారం అసలు పాఠకుని మనస్సులోవున్న సుష్ఠుపాఠంమీద ఆధార పడింది కావటం మూలాన ఆ హాస్యం పైకి కనిపించేటంత నేర్పయినది కాదు. అయితే అలాంటి బ్రిటిషుహాస్యంలో అంతర్గతంగా వుండే పక్షు పాతదృష్టి యిందులో లేదు. నాలుగుకాలాల పాటు నిలువగల శక్తీ లేదు. శ్లేషలు కాస్సేపయేసరికి కోపం తెప్పిస్తాయి; ఆఖ్యానాలు రాను రాను రొడ్డగొట్టుగా వుంటాయి. వికృతోచ్చారణానుకూలమైన వర్ణవ్యతిక్రమం చదవడానికి క్లేశం కలిగిస్తుంది. ఈనాడు బ్రెట్ హార్టేను అతడు వట్టిచప్పిడి వనుకొన్న పద్యాలకు, కథలకు మెచ్చుకోవడం జరుగుతోంది. అలాగే వార్డు, జోష్ బిల్లింగ్సు మొ. రచయితల గురించిన స్మృతులు ఏవో చెదు రుగా వున్న చిల్లరమల్లర హాస్యకృతుల్లో బ్రతుకుతున్నాయి. అమెరికా గురించి జాన్ నికోల్ అన్న మాటలు గమనించండి:

“ఏదో అంతా జాతీయంగా వుండాలనే అభినివేశం ఛోటా అమెరికన్ రచయితలను చాలమందిని హాస్యాస్పదులను చేసింది. చస్తే ఇంగ్లీషువాళ్ళలా మనం నడవకూడదని వాళ్ళు చతుష్పాత్తులు కావడం మొదలెట్టేరు. ఎడిసన్, స్టీలుల సంభాషణపద్ధతి నాక్షేపిస్తూ తా మేదో వింతగొంతుకల వికృతఘోషతో తృప్తిపడ్డారు.”

హాస్యరచయితలు ఉద్దేశపూర్వకంగానే ఇంగ్లీషువారిలా వ్రాయకూడ దనిమానుకున్నారని సూచన చెయ్యడంలో నికోల్ తప్పటడుగు వేసినప్పటికీ, అతని ఆక్షేపణలో కొంత సత్యం వుంది. అప్పుడప్పుడా కొత్తగొంతుకలు లియర్, కర్రోల్, జోయ్సుల నుడికారానికి సన్నిహితంగా వుండేవి. అర్థం పర్థం లేని అయోమయ ప్రపంచంలో ఆలాపనలు చేసేవి.

ఉదా: బి. పి. షిల్లబెర్ చిత్రించిన శ్రీమతి పార్టింగ్టన్ (అమెరికనుల 'మిసెస్ మాలె ప్రోప్' యీమె) స్మృతులు చిత్తగించండి.

"నా చిన్నతనంలో ఆడపిల్లలకు పరావర్తనము, ముందు జాగ్రత్త, గుణకారము, పునఃపూరణము, సామాన్యనిందలకు సంబంధించిన సూత్రాలు అర్థమై నదులు, మరణములు, పాఠశాలలు, పడకటిళ్ళు, ఆధికారిక ప్రదేశాలు, మధ్యవర్తుల గురించి తెలుస్తే చాలు వాళ్ళకి చాలా Eddication (i.e. education, చదువు) వున్నట్లే కాని యీనాడు వాళ్ళు 'bottomy' (botany, వృక్షశాస్త్రము),'algebery' (Algebra, బీజగణితము) చదువుకోవలసి వుంది. (ఇంకా "They have to demonstrate supposition about the sycophants of circuses, tangents, and diogenese of parallelogromy, to say nothing about the oxhides, corostics, and the abstruse triangles." ఇలా వెళ్ళింది ఆ ధోరణి.)

శ్లేషపరిహాసకుశలులైన అమెరికన్ హాస్యరచయిత తన సామగ్రితో పత్రికలు నింపుతూ వచ్చాడు. తన సమకాలికుడైన బ్రిటిషు రచయిత థేకరీ 'మైకలేంజెలో టిట్ మార్ష్' అనే పేరుతో వ్రాసినట్లు, తానూ ఒక విడ్డూరమైన 'కలంపేరు' తగిలించుకున్నాడు. డేవిడ్ రాస్ లాకే-- 'పెట్రోలియమ్ వి. నేస్బీ' అనీ, రాబర్ట్ హెన్రీ న్యూయెల్—'ఆర్ఫియస్ సి. కెర్' (అమెరికన్ ప్రెసిడెంటులను పీడించిన పదవీగవేషకుని గురించిన దారుణమైన వ్యంగ్యం వుంది, ఇలా పేరుపెట్టుకోవడంలో) అనీ మారుపేరులు పెట్టుకున్నారు. ఒక్కొక్కరి దొక్కొక ధ్వని. దానికి 'కోట' అని పేరుపెట్టాడు ఆర్టిమస్ వార్డ్. వాళ్ళందరి కృషి ఫలితమే పశ్చిమప్రాంతపు హాస్య మంటే. వాళ్ళ గంటంలో అతి సామాన్యుడు, సుఖాసక్తుడూ అయిన అమెరికన్ కంఠశ్రుతికూడ కలిసింది. అందులో చాతుర్యం వుంది. చిరుబురులున్నవి. అప్పుడప్పుడు హాయిగొల్పే అసభ్యత

వుంది. ఆనాటి దేశాన్ని చూసి దేశందేశమంతా ఆడారి రచయితల మయమైపోయిందని వాపోయాడు హాథార్న్ 1855 లో.

మార్క్ ట్వెయిన్‌కి మార్గదర్శకులు వాళ్ళే. వాళ్ళ దశలన్నీ గడిచి వచ్చాడాయన. ఆయన కలం పట్టకముందే అతని హాస్యజీవాతువు లన్నీ అమెరికావాళ్ళకు సుపరిచితాలైనవే. ఆసన్నంగా వున్న ప్రజాయుద్ధం గురించి ఆర్టిమస్ వార్డ్ అన్న యీ క్రింది మాటలు, లేఖనపద్ధతి మినహాయిస్తే, ట్వెయిన్ మాటలే అనిపిస్తాయి:

"I said the crisis had not only cum itself, but it had brought all its relations. It has cum with a evident intention of makin us a good long visit. It is going to take off its things and stop with us."

(నే నన్నది గండం అదొక్కటే దాని మానాన అది రావడం కాదు, దాని బంధువు లందరినీ తోడుకు వచ్చింది. చాలాకాలం తిష్ఠవేసుకూర్చునే వుద్దేశం వున్నట్టు స్పష్టంగా కానవస్తోంది. దాని సిబ్బందిని వదిలేసి మనతోనే స్థిరపడి పోతుంది.)

ఒకసారి ట్వెయిన్ ఇలా అన్నాడు:

"బడుద్ధాయిలకు, బభ్రాజమానులకు మన ధన్యవాదాలు. వాళ్లుగాని లేకపోతే మిగిలిన మన మెలా నెగ్గుకొస్తాము?"

అయితే యిదే వుద్దేశం జోష్ బిల్లింగ్స్ అప్పటికే వ్యక్తం చేసి వున్నాడు:

"దేవుడు మూర్ఖులను రక్షించుగాక! వాళ్ళను బైటికి పారిపోనివ్వకండి. వాళ్ళు గాని లేకపోతే బుద్ధిమంతులకు బ్రతుకు హుళక్కి."

మరి యిదేమిటి? ట్వెయిన్ కైంకర్యానికి పాల్పడ్డాడందామా? అది అర్థంలేని మాట. పరస్పరం మార్చుకునే ఒక పద్ధతిద్వారా ఒక వార్తా

పత్రిక మరోదానినుండి తన కిష్టమైనదానినల్లా ప్రకటిస్తూ వుండేది. అలాంటి ప్రత్యంతర చమత్కారాలు ప్రచారాలు పొంది పొంది చివరికి వాటి మాతృకలు గుర్తింపరాకుండా పోతాయి. అవి ఎవరెవరి ఉపన్యాసాల్లోనో చోటు చేసుకుంటాయి. మళ్ళా రూపాంతరంలో అచ్చుకెక్కుతాయి. ఒకసారి ట్వెయిన్ తన వృద్ధాప్యంలో ఒక సంగతి గురించి చెప్పేడు. అది తన చిన్ననాటి ముచ్చట అన్నాడు. కాని నిజాని కది డేవీక్రోకెట్ ఆత్మకథలోనిది. అందులో కది మరెక్కడనుండి దిగుమతి కాలేదని ఖాయం. ఈ హాస్యాని కున్న సమ్మోహనశక్తి నిరాకరించడానికి వీల్లేనిది. అబ్రహాం లింకన్ హాస్యమంటే చెవికోసుకుంటాడు. అతని కదో వెర్రి అభినివేశం. అతని మిత్రులూ, మిత్రేతరులూ కూడా "అది నాకో చమత్కారాన్ని స్ఫురింపజేస్తోంది" అని అతడు తన సంభాషణ ఎత్తుగడలో విధిగా వేసే 'తస్నా'ని ఉదాహరించడాని కుబలాటపడతారు. బహుశా అతనిని పరిహసించే వారికంటె ఆయనయే అమెరికావంటి సువిశాలమైన, వైవిధ్యోపేతమైన దేశంలో జానపద హాస్యానికున్న ఏకీకరణ శక్తిని బాగా తరచి గ్రహించివుంటాడు.

ట్వెయిన్ హాస్యంలో చాల భాగం వార్డ్ దాని కంటె, ఇతరుల దాని కంటె మరింత చిక్కగా వుంటుం దనడమే దాని విలక్షణత. నేవడాలో, కాలిఫోర్నియాలోను పత్రికా రచయితగా, ఇటీవలే ఒక 'కలంపేరు' (రెండు నిలువుల యెత్తున గాలి లేచిందంటే మిసిసిపి నావికుడు పెట్టే కేక ననుసరించి) పెట్టుకుని ఆసక్తితో తక్కినవాళ్ళ పద్ధతు లనుసరించాడు. ముఖ్యంగా అతని ప్రథమవిజయాలకు కారణభూతాలైన Jim Smiley కథ, సుప్రసిద్ధమైన Jumping Frog of Calaveras County కథ వ్రాసిన ఆర్టెమస్ వార్డు కతడు కొంత ఋణపడివున్నాడు. కాలిఫోర్నియాలో అతడు హాస్యోచితమైన అసంబద్ధత గల ఆర్టెమస్ ధోరణిలోనే ఉపన్యసించి మెప్పు పొందేడు.

ఒకసారి వార్డుగారి ఉపన్యాసపు కుడ్యప్రకటన పత్రంలో ఇలా వ్రాసివుంది:

> Artemus Ward delivered lectures before
> ALL THE CROWNED HEADS OF
> EUROPE
> ever thought of delivering lectures

(అంటే 'యూరపులోని కిరీటధారుల ముందు ఆర్టెమస్‌వార్డు ఉపన్యాసాలిచ్చాడు' అని డాబుసరిగా భాసిస్తుంది కాని 'అశ్వత్థామా హతః' అన్నట్లు 'ఆ కిరీటధారులు ఉపన్యాసాలివ్వడానికి ముందు' అన్న అర్థం తదుపరి చిన్న లిపితో వున్నది. అసలు వాళ్ళు రాజులు, వాళ్ళకేం పట్టింది ఉపన్యాసాలివ్వడానికి?)

అలాగే ట్వేయిన్ ఒకసారి యిలా ఒక ప్రకటన చేశాడు:

"7½కి తలుపులు తెరుచుకుంటాయి. 8కి ప్రారంభం అవుతుంది క్షోభ".

న్యూయార్కు ప్రజలుకూడా అతని ఉపన్యాసాలను హర్షించారు. ఆయనకు సంతృప్తి కలిగింది. తదుపరి ఒక ఆధికారికమైన మధ్యధరా ప్రాంత పర్యటనలో విలేఖకుడుగా పనిచేశాడు. అప్పట్లో అతడు వ్రాసిన లేఖలే 'Innocents Abroad' అనే పుస్తకరూపం ధరించాయి. అది వెంటనే మంచి పేరు చేసుకుంది. 'ప్రాతలోకం' ('Old world', i.e. ప్రధానంగా యూరపు అని.) యొక్క లోపాలు గుర్తించడంలో అమెరికనులలో ట్వెయినే మొదటివాడు కాదుగాని ఒక బడాయికోరుతనంతో దాని నెదుర్కోవడంలో అతడే మొదటివాడు. 'తాహో' సరస్సు 'కోమో' సరస్సుకంటె చాల అందమైన దంటాడు. 'ఆర్నో' లోకాని కాసిన్ని నీళ్ళు వుంటే అదో నది అయిపోయే దంటాడు. ఆ పాతలోకపు

ఘనుల కనవసరంగా అర్హతను మించిన ప్రతిష్ఠ వచ్చిం దంటాడు. ఆ రచయితలు తమ రాజపోషకులకు కొట్టిన 'తైరు' ప్రజాస్వామికపద్ధతి కతివిరుద్ధంగా వుందంటాడు. విదేశీయు లంతా సంభాషణౌచిత్యం నేర్చుకోవా లంటాడు. అయితే అతడు తన యీ మందుగుండు సజ్జునంతా యూరపు మీద ప్రయోగించడానికే దాచిపెట్టుకు కూచోలేదు. అతని తోడిదేశస్థులు కూడా ఆ ప్రయోగంలో తమవాటా తాము పుచ్చుకున్నారు. ఆ పుస్తకం వేలకొలది అమెరికన్ ప్రజానీకంయొక్క ఆశయాల కద్దం పట్టింది. అందరూ ఆస్థతో యూరపువిషయంలో తమ కొక మార్గదర్శకమైన పుస్తకంగా సంభావించి దాని ననుసరించారు. అమెరికాకు నాగరికతను మించిన గొప్ప యొకటి వున్నదని ప్రకటించిం దా గ్రంథం. ఆ నాగరికత తమకు బాగా నచ్చినదికాని, తమను తలదన్నిపోయినది కాని కాదనికూడ చెప్పింది. ఆ పిమ్మట కొన్ని సంవత్సరాల కాయన వ్రాసిన 'A Tramp Abroad' లో అనాగరకగర్వం అంత లేదుగాని యూరపులో వున్న అమెరికనుల గురించి చక్కని విసుర్లూ, చమత్కారాలూ వున్నాయి.

అతని హాస్యంలో కొంత భాగం అంత ఔత్సుక్యజనకంగానూ, నిలుకడగానూ వుండదు. అయినా నేస్బీలు, బిల్లింగ్సుల నేర్పులను మించిపోయిన నిబ్బరమైన పూనిక కనబడుతుం దందులో. పుస్తకాలూ వ్యాసాలూ ధారావాహికంగా వచ్చాయి ట్వెయిన్ కలంనుండి. ఒక్కొక్కటి అతని ప్రతిష్ఠ నినుమడింపజేశాయి. అతనిని అమెరికన్ హాస్యరచయితలలో అగ్రేసరుడిగా నిరూపించాయి. సుదూరపశ్చిమసీమల్లో అతని సాహసయాత్రల గూర్చిన 'Roughing It' అనే పుస్తకంలో అత్యపూర్వాలైన హాస్యగాథలు కొన్ని వున్నాయి. 'The Gilded Age' అనే నవలలో ప్రజాయుద్ధానంతరం తొందరగా ధనవంతుల మైపోవా లనుకునేవాళ్ళ మీద గట్టిదెబ్బలు కొట్టేడు వ్యంగ్యంగా. ఇందులోని ప్రధానపాత్ర కల్నల్ బెరియా సెల్లర్స్ ఒక హిరణ్యాక్షుడి లాంటివాడు. తానూ, తన మిత్రులూ కోటీశ్వరు లైపోవాలని పెద్దపెద్ద పథకాలగురించి నిత్యం కలలుకంటూ

వుంటాడు. ట్వేయిన్‌కి కుటిలులైన కాంగ్రెస్‌వారంటే మంట. వాళ్ళపై తన కోపపు తనివి తీర్చుకోడానికతడు సెల్లర్స్‌ను తన(తన తండ్రియొక్క) ప్రతినిధిగా చేసుకున్నట్టున్నది. అయితే ఆ సెల్లర్స్ వాషింగ్టన్‌లోని ప్రభుత్వపారిషదులకంటె ఎక్కువ నిజాయితీ పరుడేమీ కాడు. కాని సెల్లర్స్‌పాత్రలో ఏమిటో ఒక వెర్రి ఉల్లాసం కనిపిస్తుంది. ఆ భారీపథకాలు చూసుకుంటేనే కడుపు నిండిపోతుంది. సెల్లర్స్‌పాత్రమాట అటుండగా ఆ పుస్తకంలో ఒక అయోమయ తత్త్వం వుంది. నాయకపాత్రలను, దుర్జనప్రతినాయకపాత్రలనూ సులువుగా ఒకదాని కొకటి గ్రహించడానికి వీలుగా వుంటాయి. ట్వేయిన్ తాలూకు A Connecticut Yankee అనే నవలకూడా ఇలాగే కొంత అస్తవ్యస్తంగా వుంటుంది. అయితే అందులోని ఉపకథలను త్రోసివేయడానికి వీలులేదు. అందులో కథానాయకుడు సైకిలు, టెలిగ్రాఫు, కోల్ట్‌రివాల్వర్ మొదలైన ఆధునికపరికరాలు అమరివున్న ఆనాటి కన్నెక్టికట్ సంఘంలోని యువకుడు. ఒక పనికిమాలిన మాన్యాని కధికారి. వాడి కథలు మంచి హాస్యరక్తి కట్టేయి.

కేవలం హాస్యరచయితగా మాత్రమే ట్వేయిన్‌తో మనం పనిపెట్టుకున్నా అతని కళానైపుణీవిలసనం అంతటినీ సమగ్రంగా సమీక్షించలేకపోతాము. అతనిలో ఎన్నో శ్లేషలు, అవీ యివీ. వార్తాపత్రికవ్యాపార సరళి అంతా ఆమూలాగ్ర మతనికి కొట్టిన పిండి. బాహాటమైన అత్యుక్తి, పునరుక్తివైవిధ్య మంతా వుం దతనిలో. "ముక్కుమీద మొటిమ వున్న మనిషి పునరుత్థాన ప్రాభవం గురించిన ఆశతో చచ్చిపోయాడు" అన్నే లాంటి ఉత్కర్షావికర్షణం కూడా వున్నది. వికటత్వము, నింద—వీటికి సంబంధించిన అన్నిరకాల యుక్తుల్లోనూ ఆరితేరిన జాణ అతడు.

ఇన్నిమాట లనుకున్నామా, ఇంకా మన మాతని హాస్యంయొక్క ఉద్దేశాలు, వ్యాప్తి, చిత్రంగా అది పొందిన పరాజయాలు మున్నగువాని గురించి చెప్పినట్టే కాదు. అందులో ఒక ముఖ్యమైన అంశ మేమంటే ప్రపంచమంతా పాడైపోతోందే అనే అతని ఆక్రోశం, దుర్భర విషాదము.

హాస్యానికి నీగ్రో పాటలలో (ట్వేయిన్ కివంటే చాలా యిష్టం) జాన్ నికోల్ గుర్తించినట్టు విషాదంతో చక్కని పొత్తు వుంది. లేదా స్విఫ్ట్ వ్రాసిన అధిక్షేపకావ్యాల్లోవలె కోపంతో, విసుగుదలతో నైనా సామరస్యం వుం దనవచ్చు. మిగతా అమెరికాలోని చమత్కారప్రియులంతా వట్టి 'బఫూను'లుకారు. వార్తాపత్రికలవాళ్ళు మాత్రం చాలాకాలం బట్టి ప్రత్యేకం ఒక కూటంలా చెలామణీ అవుతూవచ్చారు. ప్రజాభిప్రాయ మహాస్థానం గుత్తగొన్న విదూషకులలాంటివాళ్ళు వాళ్ళు. అందులో పింజల్లాంటి రచయితలు కొందరు, కొత్త పరువానికి వచ్చినవాళ్ళు కొందరు, మాగినవాళ్ళు కొందరు; అర్ధరాత్రి కాఫీసేవించేవారు కొందరు, ధూమపాయులు కొందరు, పోకిరీపాటగాళ్ళు కొందరు; అబద్ధాలనూ పాచిమాటలనూ కనిపెట్టేవారు కొందరు; ప్రతిస్పర్థులను తడకట్టేవారు, తాము చూస్తూవున్నలోకంతోటే సంబంధం లేనట్టు తిరిగేవారు కొందరూను. రచయితలుగా వాళ్ళకు క్షత్తత అన్నా, చమత్కారపు పదబంధా లన్నా మోజు. ఆంబ్రోస్ బియర్స్, రింగ్ లార్డ్నర్ లలాగు వాళ్ళు తరచు కటుత్వం ప్రదర్శిస్తారు. అయితే మానవసహజాలైన దోషాలయెడ తమ కున్న అక్కసుకు ముసుగేసి ఉల్లాసం కలిగించడానికి ప్రయత్నించవలసివస్తూవుంటుంది వాళ్ళకు. ఫలితంగా వాళ్ళ రచనలలో ఒక వింతైన అస్తిమితత గోచరిస్తుంది. వాళ్ళఎక్కువ నేర్పు ప్రదర్శించినకొద్దీ వాళ్ళ ఉద్దేశానికీ, భాషకూ-అంటే వాళ్ళు అన్నదానికీ, అనుకొన్నదానికీ మధ్య పెద్ద అఘాత మేర్పడే ప్రమాదం వుంటోంది.

మార్క్ట్వేయిన్ పత్రికలకు సంబంధించిన హాస్యరచయితగా తన జీవితంలో కొంతకాలంమాత్రమే పనిచేసివున్నా, ఆతని కాపత్రికలవాళ్లకుండే దృక్పథమే వుంది. అయితే చాలామంది కంటె బహు నేర్పరియైన వాడు. కలుపుగోలుతనం గలవాడు. వ్యర్థాడంబరాలంటే మండిపడేవాడు. కార్యనిపుణాలైన పరికరా లన్నా,

సాంకేతికాభ్యుదయ మన్నా మంచిప్రతిపత్తి గలవాడు. రచనాశిల్పంతో చాలా ఆసక్తి వున్నవాడు. ప్రజలను ప్రేమించేవాడు. వాళ్ళ మూక వుమ్మడి గ్రుడ్డితనాన్ని ద్వేషించేవాడు. అతడు గ్రంథకర్తేకాని మరీ అంత ధీశాలి కాడు. విపరీతమేధావ్యాపారం గల రచనలంటే అతనికి కిట్టదు. హెన్రీ జేమ్సు రచనలంటే అతనికి చెడ్డ విసుగు. లోకపీడుడువివరణం చేసే జార్జి ఇలియట్ అన్నా, హాథార్న్ అన్నా డిటో. జేన్ ఆస్టెన్‌రచనలు చదవనేచదవడు. 'పో' రచనలు చదువుతాడుగాని ఎవరేనా పరిహారం చెల్లిస్తా మంటేనే చదువుతాడు.

మార్క్‌ట్వెయిన్, 'పో'—ఇరువురి మధ్యను వున్న అంతరాన్ని మనమింకా సాగదీయవలసిన అవసరం లేదు. అయితే వీరిమధ్య కొన్ని సామ్యాలు కూడా లేకపోలేదు. సామ్యాలు వున్నా యనడం మొదట కొంచెం అసందర్భమైన మాటగానే కనిపిస్తుంది. అయితే ఆ సామ్యాలు ట్వెయిన్‌యొక్క నిరాశాదృక్పథాన్ని విశదంచేసుకోడానికి తోడ్పడు తాయి. పాత్రికేయుడుగా పోజీవితం వార్తాపత్రికల ప్రపంచం పొరుగు లోనే సాగింది. అతని రచనలు తొందరతొందరగా రూపుగైకొన్నవి ముఖ్యంగా అతని హాస్యచిత్రణలు జనసామాన్యపు మోహభ్రాంతుల సరళి కనుకూలంగా సాగేయి. మొత్తాని కవి బాగులేవనే చెప్పాలి. అయితే ఆ బాగులేనితనమే వాటిలోని ఆకర్షణ అయి కూచుంది. అవి అతికటువుగా బలవంతంగా తెచ్చిపెట్టుకొన్నట్లు, విడ్డూరంగా, భయంకరంగా కూడా వుంటాయి. తెలిసినవారి కవి సరసంగానే వుంటాయి. ప్రహేళికలు, తమాషాలయెడ ఒక ప్రత్యేకమైన ఆసక్తి వున్నట్లు కనిపిస్తుంది. (ఉదా: 'The Balloon Hoax', Diddling considered as one of the exact sciences')-అయితేవాటి మట్టున రచయితకు తన పాఠకుల యెడలనే ఒకవిధమైన ఏవగింపు వున్నది.ఆయన వాళ్ళకన్నా గడుసువాడు. వాళ్ళు ఏ ప్రేరణ కెలాంటి ప్రతిస్పందనం పొందుతారో ఆయనకు తెలుసు; కొలిచినట్లు తెలుసు. దోషవంచితులు వాళ్ళు. తన కథల్లో పో తన ఉద్దేశాని కుపబలకంగా చామ్‌ఫర్ట్‌ను ఉదాహరిస్తూ వుంటాడు:

"toute idee publique, toute convention recue, est une sottise; car elle a convenue auplus grand nombre'.

[ప్రజాభిప్రాయ మంతా, అనుశ్రుతమైన సంప్రదాయమంతా వట్టి తెలివితక్కువది. అయితే సంఖ్యాబలసమన్వితమైన దది.]

ఆ ఏవగింపుకి మట్టున పోలో ఒక గొప్ప నైరాశ్యం దాగివుంది. అయితే, పాపం, సామాన్యప్రజలు వికారంగా వుండడమేకాదు, వాళ్ళు నిస్సహాయులుకూడ. 'Eureka'లో అతడు సృష్టించిన ప్రపంచంలో ఒక పరిపూర్ణమైన సమరసత్వం వుంది. అయితే అతని యితివృత్తాలలాగే ఆ సమరసతకూడా ఘోరమైనది. "కారణం నుండి కార్యాన్ని, విత్తు నుండి ఫలాన్ని వేరుచెయ్యడం కుదరదు. ఫలితం నిమిత్తంలోనే, ఫలం విత్తులోనే సిద్ధంగా నిబిడమై నిహితమై వుంటుంది" అంటూ డెమర్సను. "మొదటి వస్తువుయొక్క మౌలికమైన యోగంలోనే అనంతరవస్తువుల అవాంతరనిమిత్తం వాటి ఆవశ్యంభావివినాశబీజాలతో సహా గర్భితమై వుంటూ" యంటాడు పో. చూశారా ఈ పెద్దలిద్దరి మాటలూను—ఒకే పాదునుండి లేచిన రెండు పరస్పరభిన్ననిర్ణయా లవి. ఏనాటినుంచో సిద్ధంగా వున్న బోనులోని ఎలకలు మనుష్యు లంటాడు పో.

ట్వేయిన్ ఉల్లాసముల్లసితుడైన ఎమర్సనుకికంటె పోకే ఎక్కువ దరిదాపుల్లో వుంటాడు. ఇతని హాస్యంకూడా ఉపద్రవంగానే వుంటుంది. రక్తపాతంగురించికూడా అమానుషమైన ఉల్లాసంతో రాయగలడు. శవాల కంపునుంచి కూడా భయంకరమైన హాస్యాన్ని ఉత్పత్తిచేయగలడు. ఒక్కొక్కప్పుడు అసలుసందర్భాని కతీతమైన విపరీతధోరణిలో పడిపోతా డాయన. అప్పుడు పాఠకుడికి కలిగే వైమనస్య మింతా అంతా కాదు. ఇదేదో ప్రాంతీయమైన లోపమని అనేస్తే సరిపోదు. అతని అభిరుచి హార్షించదగిన అపావిత్ర్యంనుండి సంగనాచితనపు కంగులదాకా ఊగిస లాడినా (ఒక టిషియన్ దిగంబరుడినీ, ఎబెలార్డ్ అనే దుర్బోధభీరువునీ

చూచి ట్వెయిన్ ఆశ్చర్యచకితు డైనప్పటిలాగ), ట్వెయిన్ నిజానికి చాలా సున్నితమైన హృదయతత్త్వం గలవాడు. పోలాగే ఆయనకూడా ధ్వనులకూ, రంగులకూ అసాధారణప్రతిస్పందనాలుపొందుతాడు. అయితే పోలాగే 'తమాషా'లు చెయ్యడమంటే మోజుపడతాడు. అతనిలాగే నాటకీయంగా సన్నివేశాలను నప్పడంలో మెలకువ గలవాడు. నేర్పుగా పరులను టోకరాకొట్టించగల ఊహాశాలులను మెచ్చుకుంటా డాయన. (ఉదా: అసత్యాలాపకుశలుడైన అతని పాత్ర Huckleberry Finn) మందికి దూరంగా నిలవగలిగిన ధీరు డన్నా ఆయనకుచాలా యిష్టం(The United States of Lyncherdomలో వ్రాస్తూ "ధైర్యవిశ్రుతుడైన మనిషి ముందుకు రావడానికి ఏమందికీ దమ్ము లుండవు" అని అన్నా డాయన). అయితే రెండు సందర్భాలలోనూ ఆయనకు లోలోపల మానవ సమాజంమీద నిరసనవుంది. 1871 నాటికే తన రచయితృదశాప్రాంగణం లోనే మానవసమాజాన్ని "ఇదో అల్పసరీసృపాల బాడుగబండి" అని వర్ణించాడు. ఆ నిరసనకు వెనుక ఆయన వదులుకోలేని ఒక విషాదంగూడ వున్నది. 'ఇదంతా ఒక అభాగ్యమానవజాతి' అని ఆయన అనుకొన్నమాట మరీ నిరర్థకమైనది కాదు. "The Man that corrupted Hadleyburg'(1900) అనే ఆయన కథానికలో ఒక ఘోరమైన గమ్మత్తుకి యథార్థమైనకిమ్మత్తు ఏర్పడిన వైనం తెలియజేస్తుంది. ఆ Hadleyburg లోని పెద్దపెద్దలంతా వట్టి దగుల్బాజీలని తేలుతుంది. వాళ్లకి చెప్పుకోడానికి సాకుగూడా లేదు—"అన్నిటిలాగే అదీ విధివిహితం"అని అనుకోవడం తప్ప. 'The Mysterious Stranger' (అతని మరణానంతరం 1916 లో ప్రచురింపబడింది)లో మానవుడికి స్వతంత్రమైన ఇచ్ఛాశక్తి వుందనుకోవడం మిథ్య అనే అతని చిరంతన విశ్వాసం మరీ చిక్కపడి కనిపిస్తుంది. అతని చరమసందేశ మేమంటే—ఈ ప్రపంచానికొక గుణమూ, యోగ్యతా లేవని మాత్రమే కాదు, అసలు యథార్థత్వమన్నదే లేదు—అని. మానవసమాజ మంతా "శాశ్వతమైన శూన్యంలో

అలా దిక్కుమాలి తిరుగుతూవుండవలసిందే" అని. ఇప్పటికి కట్టుకథ (నేవడా ఆటంబాంబులోలాగ) దాని పరమావధికి చేరుకుందని అనుకోవచ్చు.

Huckleberry Finn వ్రాయకముందే ట్వెయిన్ కర్మసిద్ధాంతిలాగ నిశ్చయవాది. అయినా మానవసమాజాన్ని తిట్టడ మెప్పుడూ మానలేదాయన. పోకూడా అలాగే తక్కిన రచయితలను నిత్యం దుయ్యబడుతూనేవుండేవాడు. అతనికి బడిపంతులువృత్తి బలవంతపుబ్రాహ్మణార్థం లాంటిదే అయినా తన విధి తాను చక్కగా నిర్వహించినవాడు. అనుభవం మీద బడిపంతుళ్ళ బుద్ధి మొద్దుబారిపోతుం దని గ్రహించాడు. అయితే వాళ్ళతో కాస్తయినా ప్రాథమికజ్ఞాన ప్రరోచన చెయ్యడాని కాయన యేమీ ప్రయత్నించివుండలేదు. ట్వెయిన్ కూడా ఆ అవిశ్వాసశీలియైన మనుజద్వేషస్వభావుడైన అయ్యవారులాంటివాడే. శాన్ ఫ్రాన్సిస్కోలో అతనికి 'Wild Humorist of the Plains' (అవన్యసీమలో ఆటవికమైన ఘోరధోరణి గల హాస్యగాడని అర్థం) అనీ, 'the Moral Phenomenon' (నైతిక మార్గంలో ఒక వింతలాంటివా డని అర్థం) అనీ మారుపే ర్లున్నాయి. ఆయన మాటిమాటికీ వెఱ్ఱిమొఱ్ఱి హాస్యం తన పూనిక కాదనీ, ప్రబోధమే తన పూనిక అనీ నొక్కివక్కాణిస్తాడు. పో, ట్వెయిను ఇద్దరూ ఆశించిన ఫలితాలు చేరుకునే తమ ఉద్దేశాలగురించి నిష్ణాతులకుండే నిండుగర్వంతో ఉద్ఘాటించినా, ఇద్దరి సృజనపద్ధతుల మధ్యనుగల అంతరం చాలా పెద్దది. పో నైతిక ప్రబోధాన్ని వదిలిపెట్టి మిథ్యాసౌందర్యం కోసం వెదుకులాడుతాడు. ట్వెయిన్ పరిహాసము నెన్నుకొంటాడు; ప్రజలను బెల్లించిగిలిగింతలు పెట్టి అసలువిషయం గ్రహించేటట్లుచేస్తాడు. అతని రచన అంతఎగుడుదిగుడుగా వుంటుందంటే ఆశ్చర్యపడవలసిన పని లేదు. అతనిది సగంఉల్లాసంగా ఉరకలువేసే రకం, సగం వట్టి జడప్రకృతి. ఆ ఉల్లాసంలో పాశ్చాత్య జీవితావ్యవస్థలో పడే తుళ్ళుపాటు కొంత. అతని గురించి హవెల్స్-"అతనిసంభాషణలో వాయవ్యదేశపు, లింకనీయమైన, ఎలిజబెతెన్

వైశాల్యం వుంది. అయోగ్యపు టూహలతో స్వైరవిహారం చేస్తూ ఆయనే ఉత్తరాలను నేను దాస్తూవచ్చాను. వాటిని కాల్చివేయడాని కశక్తుడ నయ్యాను. అలాగని, ఒకసారి చదివాక, మళ్ళీవాటి ప్రక్క చూడలేకపోతు న్నాను'' అని వ్రాశాడు.

ట్వెయిన్ అంటే స్వతంత్రాలోచన గలవాడు. స్వేచ్ఛగా మాట్లా డుతాడు. ప్రజాస్వామికవిశ్వాసం గలవాడు. బానిసతనం, బూర్జువాతనం, అసహనం అన్నవాటిని ముట్టడిస్తాడు. అసహనం నుండి తప్పించుకోవ డానికే ఆయన తూర్పుదేశానికి వచ్చేశాడు. దక్షిణదేశపు రాజకీయాల గురించి చర్చిస్తూ ఆయన 1876 లో కన్నెక్టికట్ నుంచి ఒక మిస్సోరీ మిత్రుడి కిలా వ్రాశాడు:

“అక్కడివాళ్ళ స్థితి గ్రహించా ననుకుంటున్నాను నేను. ఓ పరి పూర్ణమైన స్వేచ్ఛ! నీ యిష్టం వచ్చినట్లు ఓటుచేయవచ్చు. అయితే తక్కిన వాళ్ళలా అనుకుంటారో నీ యిష్టమూ అలాగేవుండాలి. లేకపోతే సంఘబహిష్కారము. అదృష్టవశాత్తూ ఈ మనుషులతో ఏర్పడిన విశాలానుభవం తెలివిగా నివాస మేర్పరచుకోవడానికి తోడ్పడింది నాకు. దేశంలో అతి స్వచ్ఛందంగా వుండే మూల బతుకు తున్నాను.” అంటే లాంగ్ ఫెలో, లోవెల్లుల న్యూ ఇంగ్లండులో నన్న మాట. 'తూర్పుదేశపు' ట్వెయిన్ లో కొంత సంగనాచితనం వచ్చిపడింది. కాకపోతే వట్టి మంది పరిపాలన తెచ్చిపెట్టడానికి పెద్దల దొరతనంమీద కత్తి గట్టడం దేనికి? మనమంతా పరిస్థితులకు బానిసల మనుకున్నప్పుడు అసలా కత్తిగట్టడం వల్ల ప్రయోజన మేమిటి? 'ట్వెయిన్' అనే అతని కలం పేరే అతని ద్వంద్వ స్వభావాన్ని తెలియజేయడం సముచితంగా వుంది. అంతేకాదు, ఆ ద్వంద్వస్థితి గురించిన భావన అతన్ని దగా చేయడం, ఇతివృత్త యుక్తులుగా అత డీ ద్వంద్వాలను కలగలుపు పోలి కలను వాడుకోవడం ('The Prince and the Pauper' లోను, 'Pudd'nhead Wilson' లోను), ఆయన అమ్మవంక 'డర్ హేమ్'

ప్రభువులనుండి, అబ్బవంక ఒక రాజహంతయైన న్యాయాధిపతినుండి తన వారసత్వాన్ని ఎన్నుకోవడం కూడా సముచితంగా వున్నట్లే తోస్తుంది. అందాన్ని హాస్యంతో కలపడం, సంపన్నుల సంఘంలో గల అసమానత నొకవంక విమర్శిస్తూ, వేరొకవంక తాను వారి ఆడంబరపు వేడుక లనుభవించడం వల్ల కలిగే అనర్థాలను రాకుండా చేసుకోవడం కోసమే ఆయన గతకాలపు విషయాల గురించి వ్రాసేవాడు. అతని కలాంటి ప్రోత్సాహమిచ్చేవారు అతని గ్రంథాలపై సమీక్షలు వ్రాసేవారున్నూ, "నీ Tom Sawyer, Huckleberry Finn హాస్యధోరణికి చెందినవి కాని నీ 'Joan of Arc' రమణీయంగా వుంది" అని అతనికి నమ్మిక పుట్ట మాట్లాడే హార్ట్‌ఫర్డు సహవాసులున్నూ. అత డా మాటల నామోదించేవాడు. అయితే అతని సంచికట్టులోని వస్తువులు పో వస్తువులలాగే అయథార్థాలైనప్పటికీ పో కలిపించే వాతావరణంలోని మసృణత్వం వాటి కుండేది కాదు. అవి ప్రహసనత్వంనుండి అధిక్షేపత్వం వేపు చాపల్యంతో పరిభ్రమిస్తూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు వెగటుగొల్పుతవి కూడ. అయితే అవన్నీ ఒక నిష్ణాతుడైన హాస్యచతురాస్యుని సృష్టికి చెందినవి కాబట్టి నిరంతరం సరస పరిహాస సురుచిరాలుగా పఠనాసక్తి కలిగించేవిగా వుంటాయి. కాని పిదప కాలపు చలనచిత్రాల్లో చార్లీ చాప్లిన్ వాలకాల్లోలాగ అందులో హాస్యం అనాలోచితంగానూ, ఆశయం చెదురుగానూ కనిపిస్తుంది. ఒకసారి అది మనకు మిఠాయి వుండ తింటున్న ట్లనిపిస్తుంది. ఒక్కొక్కసారి పంచదార పైపూతతో చేదుమాత్ర మ్రింగిన ట్లుంటుంది. మరొకప్పు డస లే పూతా లేని మాత్రలాగే వుంటుం దది.

ఒక సాంప్రదాయిక మార్గంలో సిద్ధహస్తుడైన ట్వెయిన్ వంక చూస్తే, తొలిచిత్రాల్లో చాప్లిన్‌లాగ, గొప్ప కళాకుశలుడుగా దర్శనమిస్తాడు. అమోఘ మా ప్రయోగ సామర్థ్యం. తలచినట్లు తగిలి తీరుతుంది. హాస్యోల్లుంఠనాల ఔద్ధత్యం లేకుండా స్నిగ్ధం, సన్నిహిత పరి

జ్ఞాన విదగ్ధతను ప్రకటించే అతని పుస్తకాలు కొన్ని వున్నాయి. వాటి కోసమైనా తరతరాలా ఆయన్ని స్మరించుకుంటూరు ప్రజలు. అవి Tom Sawyer, Life on Mississippi, అన్నిటినీ మించి Huckleberry Finn అనేవి. వాటిలో అతనికి సుపరిచితమైన, అతని బాల్యానికి ఆటపట్టయిన నదీతీరస్థ నగరానికీ, నదికీ సంబంధించిన జీవితంలోని మాధుర్యమూ, వాస్తవికతా వుంటాయి. డికెన్సుకి మిసిసిపి అంటే ఒక మురికి గుంట, బురద వరద. నిశీథ సమయాల్లో నీలాకాశంలో అనుదినం అనపాయంగా మెరిసే మెరుపులు తప్ప దాని విషయంలో సంతోషించదగిన దింకేమీ లేదట. అదే యువకుడుగా వున్నప్పుడు, తదుపరి స్మృతిచక్షుష్మంతుడైన మార్క్ ట్వెయిన్‌కి జీవిత సర్వస్వమూ అదే. ప్రమత్తుల పాలిటి కది ప్రమాదగుండమే కాని హక్‌ఫిన్‌లా దాని స్వరూపం తెలిసినవాళ్ళ కది దయామయ మంగళదేవత. ట్వెయిన్ గ్రంథాల్లో ఆ మహానది మానవ మహాప్రస్థానాని కొక సంకేతం. టామ్ సాయర్ 'ఒక చెడు కుర్రాడి కథ' (అయితే వాడికి పెద్దవాళ్ల లక్షణాలు చాలా పట్టేయనుకోండి). కొంత మోతాదు మించింది. అంత పరిపూర్ణ సంతృప్తి నివ్వదు. Life on Mississippi బ్రహ్మాండమైన ఎత్తుగడతో ప్రారంభమైనా చివరి ప్రకరణాల్లో చప్పబడిపోతుంది. కాని Huckleberry Finn, అందులో Jim కి కలిగిన టామ్ సాయర్‌లో లాంటి విమోచనం మాట అలా వుండగా, అదొక చక్కని పరిపూర్ణత గల నవల. ఒక సీమదేశపు కుర్రాడి గురించి మరపురాని చిత్రణ అది. నిశ్చయ వాదం సరియైన తత్త్వం అవునా కాదా అన్న ప్రశ్న అలా వుండ నివ్వండి. కాని సామాన్యజనంతో లావాదేవీలు పెట్టుకునే నవలా రచయిత పట్ల మాత్రం అది చెడు సిద్ధాంత మనక తప్పదు. తమ తరఫున నావలికుడు (novelist) ఏమి తీర్మానించుకున్నాసరే సామాన్య జనం మాత్రం తమ జీవిత గమనాన్ని పురాకృత నిర్ణయంగా భరించలేరు. నావలికుడు గట్టిగా అలాంటి తన అభిప్రాయాన్ని రుద్దితే, పాత్రలు జీవంలేని పోత

బొమ్మలు కావలసివస్తుంది.Huckleberry Finnలో మాత్రం పాత్రలు (విట్మన్ అన్నట్లు) 'నవనవోన్మేషంగా, ఆకతాయిగా, వాస్తవికంగా' వున్నాయి. అందులో కొన్ని పాత్రలు కఠినచిత్తక్షోభలో, ఒక కుక్షిణీ పట్నవాసపు పశుప్రాయత్వంలో, అర్థం పర్థం లేని ఘోరవంశవైరాల్లో, నీగ్రో బానిసతనంలో (జిమ్‌లాగు) చిక్కుకున్న మాట వాస్తవం. కాని హక్ మాత్రం స్వచ్ఛందంగానే వున్నాడు. స్వభావసిద్ధమైన అతని ప్రకృతి ఇంకా మలచబడలేదు; తనను నాగరికంగా చేద్దా మనుకొన్న పరిసరం చేతబడి అత డింకా నాశనం కాలేదు.జిమ్‌ను బానిసతనపు సత్వర దుష్పరిణామంనుండి రక్షించగలిగా డతడు నలుపు దోషంనుంచి తప్ప. అయితే చివరికి నేటీబంపోలాగు ఆత్మరక్షణార్థము హక్ నాగరికతకు దూరంగా పోవలసి వచ్చింది. అమెరికనుల నిస్సంగత్వమంటే అదీ. కాని హక్ విషయంలో థోరోగారి సన్యాసంలాటి దేమీ అతి న్ననుసరించలేదు. ఆ నూత్న ప్రపంచం (The New World, i.e,అమెరికా)ఇంకా కొత్తగానే వుంది. అవ్యవస్థలోకి, కేవలం ఇంద్రియచోదితమైన పాశవ ప్రకృతిలోకి కాలుజారేదాకా అలాగే వుంటుంది. ఉండకపోతే పునరావృత్తి లేని పోగాలపు విషాదశ్రుతులు వినిపించడం మొదలవుతుంది.వ్యాపారాలు, చర్చిలు, నీతిరూపకాలు, అచ్చుపడిన అబద్ధాలు, వేదికలమీది వేషాలు, కదుపులుగా, గుంపులుగా, సేనలుగా, మానవులు కదిలిపోతూ వుండడం ("సైనికులు కొంద రొకచోట చేరడం చూడటానికి దారుణం" అంటాడు ఎమర్సను) ఒక టాకశే వస్తున్నాయి. ట్వెయిన్ ఇందులో కొన్ని విషయాలను విడిచి పెట్టేశాడు. 'సివిల్ వార్'లో కొద్ది వారాలు సైనికుడుగా పనిచేసి నేవడాప్రాంతానికి వెళ్ళిపోయాడు. ఎడారిని వికసింపజేసే ప్రయత్నంలో వున్న యితరులతో చేతులు కలపడానికి. అయితే మార్గదర్శకు లన్నవారు చేయవలసివచ్చేటట్టుగా అక్కడి జనుల ఉదారమైన అమాయికత్వాన్ని అపహరించడంలో తాను చేసినదానికి తరువాత విచారించాడు.

నూటికైన అనుభవంలోని సూనృతత్వాన్ని కాపాడడం కోసం కొంతకు కొంత ప్రయత్నించిన అమెరికన్ రచయితలలో ఎర్నెస్ట్ హెమింగ్వే మరొకడు. అతడు Huckleberry Finnను అందులోను, తతిమ్మా కృతుల్లోను అనుషంగికంగా అమెరికను వాతావరణానికి తగిన గద్యశైలిని సృజించడం అనే ఘనవిజయాన్ని సాధించిన మార్క్ ట్వెయిన్‌ను సముచితంగా మెచ్చుకొన్నాడు హెమింగ్వే. అలాంటి శైలికోసం వాషింగ్టన్ ఇర్వింగు ఒక ప్రయత్నంచేశాడు. లోవెలూ చేశాడు. వార్తా పత్రికల హాస్యరాయుళ్ళు చేశారు. వాళ్ళ ప్రయత్నమంతా హాస్యరచనల ద్వారానే జరిగింది. అమెరికనులు చిన్నచిన్న సామాన్యపుసహజసరళాలైన రచనలలో మాత్రమే తమ మాతృభాషలోని జాతీయతయొక్క సౌలభ్యాన్ని ప్రకటించగలరు; సాధారణంగా అది ప్రయోగింపబడే సాంప్రదాయిక ధోరణిభారాన్ని తప్పించుకోగలరు. ఒకసారి 'ఏదీ, నిజమైన అమెరికను శైలి అన్నది ఎక్కడుం'దని అడిగాడు నో వెబ్‌స్టర్ (Noah Webster).

" 'రాణీగారి ఇంగ్లీషు' (the Queen's English) అంటూ ఏమీ లేదు. సరుకంతా ఉమ్మడికంపెనీహక్కుదారుల చేతుల్లోకి పోయింది. మనకు మిగిలిందల్లా వాటాల (Shares) భారం మొయ్యడం" అని వెబ్‌స్టర్ చేసిన ఆరోపణలో మార్క్ ట్వెయిన్ రోజు వచ్చేవరకూ సత్యంలేదు. అతని చేతిలో హాస్యపుటపభ్రంశపు పలుకుబడి, మాండలికము ఒక వాటమైన సారస్వతాయుధంగా, నిరాడంబరంగా, నిసర్గసుందరంగా, ఉపన్యాసంలా భాసించే, కాని ఉపన్యాసంకాని మాదిరిగాతయారైనవి. హావెల్స్ అంటాడు: "లబ్ధప్రతిష్ఠులైన పెద్దలు వ్రాసే చాదస్తపు టింగ్లీషు పాండిత్య ప్రకర్ష, మెలకువ కలిగివుంటుంది. తన తాతగా రెవరో దానికి తెలుసు" అని. మార్క్ ట్వెయిన్ రచనల్లో వస్తువిషయంలో పాశ్చాత్యజీవితంలో లాగే ఒక సంకరమైన అసంగతత్వం వుంది. కాని రచన విషయంలో హెమింగ్వే వారసత్వాన్ని చూసిన ఒక క్రొత్తధోరణి చివురుతొడిగింది.

# 8

# ముకుళోన్మేషము

## సిడ్నీ లేనియర్ (1842-81):

అభిజనం: జార్జియారాష్ట్రంలోని మేకన్. అదే రాష్ట్రం ఓగిల్‌థోర్ప్ యూనివర్సిటీలో విద్యాభ్యాసం. 'సివిల్ వార్'లో 'యుద్ధఖైదీ' అయినాడు. అంతటితో సంగీత విద్వాంసుడుగా జీవితం సాగిద్దామనుకున్న అతని ఆశలు పటాపంచలై పోయాయి. పాపం, అసలే బాగులేని అతని ఆరోగ్యం మరీ దెబ్బతిన్నది. అయితే యీ అనుభవం Tiger-Lilies (1867) అనే అతనినవలకు సరకు సరఫరా చేసింది. అనారోగ్యదారిద్ర్యాలచే పీడితుడై కవిత్వసంగీతాలను వరించాడు. ఒక బాల్టిమోర్ సంగీతమేళంలో మురళీధరుడు (Flutist)గా చేరేడు. 1877 లో అతని కవితలు, 1880 లో 'The Science of English Verse' అను పేర కొన్ని ఉపన్యాసాలూ ప్రచురింపబడ్డాయి.

జార్జ్ వాషింగ్టన్ కేబిల్ (1844-1925):

అభిజనం: న్యూ ఆర్లియన్సు. 'సివిల్ వార్'లో కొంత కాలం 'కాన్ఫెడరేటు' పని చేశాక రచయిత అయ్యాడు. మొదట్లో గల్పికలవంటి అతని రచనలు కొన్ని పత్రికలలో పడుతూ వచ్చాయి. కొన్ని 'Old Ceole Days' అను పేర సంపుటీకరింపబడ్డాయి (1879). 1880 లో The Grandissimes అనే నవల, తదుపరి అనేక కథలు, అతడు ఔత్తరాహుడైనా దక్షిణసీమకు సంబంధించినవి, వచ్చాయి.

జోయల్ చాండ్లర్ హేరిస్ (1848-1908):

అభిజనం జార్జియా. అనేక దాక్షిణాత్యపత్రికలలో పని చేశాడు. తదుపరి 1876-1900 నడుమ 'అట్లాంటా కాన్స్టిట్యూషన్' అనే పత్రికతో సంబంధ మేర్పడ్డది. అందులోనే 1879 లో అతని ప్రప్రథమ కథానిక అంకుల్ రెమస్' అనేది ప్రకటింపబడింది. పిమ్మట పరంపరగా చాలా వ్రాశాడు కథలు. వాటికి చాలా గిరాకీ యేర్పడ్డది. మంచి ప్రచారం వచ్చింది. ఆయన పోయినప్పుడు 'అంకుల్ రెమస స్మారకసంఘం ఒకటి ఏర్పాటయింది. దక్షిణసీమ జీవితంగురించి ఇంకా కథలూ, నవలలూ వ్రాశాడు.

హేరియట్ బీచర్ స్టోవె (1811-96):

అభిజనం: కన్నెక్టికట్. 1832 లో ఆమె తండ్రితోపాటు సిన్సిన్నటికి వెళ్ళిపోయింది. అక్కడ తండ్రిగారి తత్వపాఠశాలలో ఆచార్యుడుగా వున్న సి. ఇ. స్టోవెను వివాహం

చేసుకుంది (1836). బానిసతనాన్ని గట్టిగా ప్రతిఘటించింది. మెయిన్‌లో నివసిస్తూ 1852 లో 'అంకుల్ టామ్స్ కేబిన్' అనే నవల వ్రాసింది. అది ఆవేశాన్ని రేకెత్తించి మంచిప్రచారం పొంది ఆమెచే ఇంకా చాలా నవలలు వ్రాయించింది. అందులో 'Dred, A Tale of the Great Dismal Swamp' (1856) అనేదికూడ మరో దాస్యత్రుణీకారకమైన నవల. కొన్నేళ్లు మార్క్ ట్వేయిన్‌కి సన్నిహితంగా కన్నెక్టికట్ రాష్ట్రంలోని హార్ట్‌ఫర్డ్‌లో నివసించింది. కాని ఆవిడకు ఫ్లారిడా స్థావరమంటే ఆసక్తి. ఆ దక్షిణరాష్ట్రంలోనూ కొంతకాలం గడిపింది.

సరా ఆర్నె జ్యూయెట్ (1849-1909):

అభిజనం: దక్షిణపు బెర్‌విక్, మెయిన్. యౌవనప్రథమదశలోనే రచనావ్యాసంగం ప్రారంభించింది. ఆమె తొలి రచనలు 'Deephaven' అనే పేర ప్రచురింపబడ్డాయి (1877). పాఠకజనసమాదరణ పొందేయి. మెయిన్‌కి సంబంధించిన కొన్ని నవలలూ, కవితలూ వ్రాసింది. ఆమె రచనల్లో లబ్ధప్రతిష్ఠమైనది 'The Country of the Pointed Firs' (1896).

ఎమిలీ డికిన్సన్ (1830-86):

అభిజనం: ఆమ్‌హెరస్ట్, మసాచుసెట్స్. ఆమె జీవితమంతా అక్కడ గడిచినట్టే. ఒక్క ఏడుమాత్రం మౌంట్ హోల్యోక్ స్త్రీపాఠశాలలో గడిపింది. ఆవిడ క్రమంగా ఏకాంతత వరించింది. సంపన్నన్యాయవాదియైన తండ్రి యింట్లోనే తన వాసం. ఆమెకు గల కొద్దిమంది మిత్రులతో

ప్రముఖుడు హార్వర్డుపండితుడైన థామస్ వెంట్‌వర్త్ హిగ్గిన్సన్. తన కవితావ్యాసంగంలో ఆయనసలహా పొందుతూ వుండేది. అనంతరం ఆయనే ఆమెకావ్యాలు పరిష్కరించి ప్రకటించాడు.

విట్మన్, మెల్విల్‌ల కృతులను, జాన్ డబ్ల్యు. డిఫారెస్టు వ్రాసిన 'మిస్ రేవెనెల్స్ కన్వర్షన్ ఫ్రమ్ సెసెషన్ టు లాయల్టీ' ('Miss Ravenel's Conversion from Secession to Loyalty,' 1867) అనే కృతినీ, పేరు సూచించేదానికన్నా పెరిమ గలదానీన్నీ,మినహాయిస్తే 'సివిల్ వార్' కాలంలో బయల్వెడలిన సాహిత్యంలో సారం తక్కువ. అమెరికన్ రచయితలలో కొద్దిమంది మాత్రమే యుద్ధంలో పాల్గొన్నారు. ఎంబ్రోజ్ బియర్స్, సిడ్నీలేనియర్లు పాల్గొన్నారు. ట్వెయిను, హవెల్స్, హెన్రీజేమ్సులను భీరుశ్రేష్ఠు లని పరిహాసంచేశాడు హెచ్. ఎల్. మెన్‌కెన్.యుద్ధంవల్ల సైనిక స్మారకగీతాల పంట పండింది. లోవెల్ వ్రాసిన 'హార్వర్డ్ ఓడ్', దక్షిణదేశపు యువకవి హెన్రీ టిమ్‌రాడ్ వ్రాసిన 'ఎతోన్ జెనిసిస్' అలాంటివే. ఇవి అమెరికన్ పాఠకుల కెంత రక్తి గొలిపినా విదేశీయులకు మాత్రం లాభంలేదు. అనుకొన్నట్లుగా దేశీయ రచయిత లందరికీ యుద్ధం గొప్ప ఉత్సాహాన్ని కలిగించింది. అమెరికా దేశపు ఘనతలను రక్తపాతం ఋజువుచేసిన రోజుల్లో, ఆ రచయితలకు వాటిని సిరాలో నిరూపించే అవకాశం కలిగింది. చూడండి "కీర్తిశేషుల యెడ మన కర్తవ్యము" అంటూ 1865 లో యేల్‌లో ఒక ఉపన్యాసమిస్తూ హొరేస్ బుష్‌నెల్ ఏమన్నాడో: "ఇకమీద మనం అమెరికను భాషలోనేగాని ఇంగ్లీషులో వ్రాయకూడదు. మన కొక స్థితి యేర్పడింది. మనం మనదీ అనిపించుకొనే నాగరికత నేర్పరచుకోవాలి. స్వతంత్రభావన కలిగివుండాలి. మనకున్న అవకాశాలనే రాణింపజేసుకోవాలి."

ఆ తరువాత కొద్ది వత్సరాలకు మార్క్ ట్వెయిన్ అమెరికను భాష

వ్రాయ మొదలుపెట్టేడు. వెంటనే అది అనుసృతం కాలేదు సరికదా కొందరు అమెరికన్ రచయితలది తమ ప్రయోజనాలకసమగ్రమైనదని, అస లెన్నడూ అనుసరించడమే మానేశారు. ఆనాటి అమెరికన్ సాహిత్యం అనుకోకుండా కొంత ఆందోళనను వ్యక్తం చేసింది. యువరచయితలందరూ పెద్దవారి నీడల్లో పీటలు వేసుకున్నారు. ఎమర్సను, లాంగ్‌ఫెలో 1882 దాకా వున్నారు. లోవెల్, విట్టియర్, హోమ్సు, పార్క్‌మన్ 1890 కి పైబడి వున్నారు. అమెరికాలో స్వర్ణయుగంఅవతరించడానికి పునర్నిర్మాణ కృషి సాగుతున్న గడ్డురోజులను చూసి, కిట్టని విమర్శకుడెవడైనా హోరేస్ బుష్నెల్ ఆశించిన నాగరికత జాడైనా కనిపించలేదని అనుకోవచ్చు. కాని కాస్త సానుభూతి గల పరిశీలకుడు చెదురుచెదురుగా వున్న సిడ్నీ లేనియర్‌లాంటి రచయితలను, ప్రధానంగా స్థానిక ప్రకృతి చిత్రణ భాషణములపై ఆధారపడి అంతంతమాత్రంగా సాగుతూవున్న సాహిత్యాభివృద్ధినీ గమనించగలడు (న్యూఇంగ్లండులోను, దక్షిణపశ్చిమసీమలలోను).

పేటపేటను బానిసతనం, రాష్ట్రీపుహక్కులు మొ. విషయాల్లో చిక్కుకున్న దక్షిణదేశం యుద్ధానికి ముందు దానిశక్తులను వాదాల్లో కేంద్రీకరించింది. అడపాతడపా హాస్యరచనలుచేసే పోను, విలియమ్ గిల్మోర్‌సిమ్స్ (పాపం, ఈయన 'అమెరికన్‌స్కాట్' అని అప్పటికే మాట పడిన కూపర్‌పేరట 'ది సదరన్‌కూపర్' అనిపించుకొన్నందున రెట్టింపుగా ప్రాంతీయమైన అప్రతిష్ఠపాలైనాడు) లాంటి కొద్దిమంది రెండోరకం రచయితలను మినహాయిస్తే సృజనాత్మకసాహిత్యం విషయంలోదాక్షిణాత్య సంప్రదాయ మంటూ ఏమీ లేదు. యువకవీ, గాయకుడూ అయిన లేనియర్ మైత్రికోసం, బాసటకోసం తపించాడు. ఒకసారి ఒక ఉత్తరదేశపు మిత్రుడికొక జాబు వ్రాస్తూ "ఇక్కడ మేమంతా అంధకారంలో ఎలా కొట్టుమిట్టాడుతున్నామో నీకు తెలియదు" అన్నాడు తన పద్యాలకు కాస్త గుర్తింపు వస్తూవున్నా, ఉత్తరదేశంలో అచ్చువడాని కవకాశ మేర్పడుతూవున్నా ముందునాటి పోలాగే తానూ ఒక దుర్భరమైన

అశాంతికి గురికావలసి వచ్చింది లేనియర్. ఒక్కరికీ జీవితంలో స్వాస్థ్య భద్రత లేకపోయింది. ఇద్దరూ అతిశయంగా ఊహాగానాలు చేశారు. అద్భుతపరాక్రమం, అమలినలు, కామోద్రేకరహితలు నైన అంగనలు, అలౌకికసౌందర్యము మున్నగు విషయాలనుగురించిన అతిలోక దాక్షిణాత్య భావనాడంబరం వారిని లోగొన్నది. ఇద్దరూ ఛందశ్శాస్త్రతత్త్వంగురించి క్రొత్త సిద్ధాంతాలు కనిపెట్టేరు. తన 'The Science of English Verse' (1880) అనే పుస్తకంలో లేనియర్ ఒకమూల సూత్రపరిపాలనకు లోగిన వసుటచే సంగీతము, ఛందస్సు సమానప్రతిపత్తిగలవే నని అంటాడు. కవిత్వంలో ఛంద స్సన్నది 'మెట్రోనోమ్' అనే తాళవాద్యానికనుగుణంగా వుంటుందనీ, అంటే దానికి ప్రధానమైనది కాలమే కాని ఉచ్చారణ కాదనీ అతని అభిప్రాయం. కష్టపడి ఒక పగడైన శయ్యలో సంగీతంలా వినిపించాలనే ఆశయంతో కవిత్వసృష్టికి ప్రయత్నించాడు. ఫలితం పో కవిత్వంలోలాగే సుతిమించి రాగాన పడ్డది:

"Oh, What is abroad in the marsh and the terminal sea?
Somehow my soul seems suddenly free
From the weighing of fate and the sad discussion of sin,
By the length and the breadth and the sweep of the marshes of Glynn."

లేనియర్ నిజంగా చక్కని పంక్తులు కొన్ని వ్రాశాడు; అయితే ఆయన ఏమంత పెద్ద కవి కాడు. అతనిది సున్నితమైన బుద్ధివిశేషమే కాని దాని యుక్తిశాలితమీదే అమితంగా ఆధారపడి అపజయం పొందే డతడు. అయితే అతడూ, పో దక్షిణదేశంలో ఒక సాహిత్యసముద్దేశానికి ప్రాతిపదికలు వేశారు. ఆ సముద్దేశానికి దాక్షిణాత్యకాల్పనికోద్యమంవల్ల అప్పు

డప్పుడు విఘాత మేర్పడినా, మన కాలంలో అది మంచి కవిత్వాన్ని ఉత్పత్తి చేసింది.

లేనియర్‌లో వున్న ఊహాశాలిత, పాండిత్యము, మార్దవమూ లేక పోయినప్పటికీ ఇతరదాక్షిణాత్యరచయితలు తమ పరిసరపరిధిలో వున్న ఆ ఉత్సాహమూ, ప్రాభవమూ, పడిపోతున్న సాంఘికవ్యవస్థ, నీగ్రోలూ కలిసిన వాతావరణాన్ని ఆచుకోడానికి చక్కని ప్రయత్నాలు చేశారు. ఇక్కడే వుంది దాక్షిణాత్యసాహిత్యాభ్యుదయాని కొక మారటరహదారి. అది ట్వేయిన్‌లో (అతడు దాక్షిణాత్యుడైనంతవరకూ), బహుశా పోగారి హాస్యచిత్రణలలోగూడ, నిక్కచ్చిగా అగస్టస్ లాంగ్‌స్ట్రీట్ వ్రాసిన 'జార్జియా సీన్స్' (1835) లో, జార్జ్ వాషింగ్టన్ కేబుల్, జోయెల్ చాండ్లెర్ హేరిస్‌లోను గోచరిస్తుంది. (ఈనాటి దాక్షిణాత్యరచయితలైన విలియమ్ ఫాక్నర్, రాబర్ట్ పెన్ వారెన్, యుడోరావెల్టీ, కార్సన్ మెక్ కల్లర్స్, ట్రూమన్ కెపోట్‌లు ఉన్నతమైన ఆలంకారికమర్యాదకూ, న్యూనమైన జీవితస్థితికీ సంబంధించిన రెండు మార్గాలనూ మెట్టిన మేటు లనిపించుకొన్నారు) అందులో కేబుల్ ఔత్తరాహులతో సంబంధాలు గల దాక్షిణాత్యుడు. అతనికి లూసియానా జీవితసూక్ష్మా లన్నీ బాగా తెలుసు. అతని 'Old Creole Days' (1879), 'The Grandissimies' (1880) లలోను, ఇంకా తరువాతి పుస్తకాల్లోనూ ఒక నిరంతరమైన సత్యాత్మికత గోచరిస్తుంది. ఎడనెడ దర్శనస్ఫూర్తి వుంటుంది. అపుడపుడు మార్దవం కనిపించినా ఆ క్రియోల్ మాండలికం వుండే అది ఒక ఆటంకంగా వుంటుంది. చిత్రణకు తగిన వాస్తవికత ఎల్లప్పుడూ వుండదు. అది ఉత్తరప్రాంతీయమైనదైనా, దక్షిణప్రాంతీయ మైనదైనా స్థానికప్రకృతిచిత్రణ గల రచనల్లో చాలా భాగాని కిలాంటి వ్యాఖ్యలు సరిపడతాయి.

అయితే జోయెల్ చాండ్లెర్ హేరిస్ వ్రాసిన మంచికృతుల్లో

స్థానికమైనది సార్వజనీన మవుతుంది. తెల్లవారి కుర్రవాడికి లోకంపోకడ గురించి బోధచేస్తున్న నీగ్రోవృద్ధుడైన అంకుల్ రెమస్ (Uncle Remus) నిజంగా ఒక అమరపాత్రము. అసాధ్యుడైన బ్రెర్ రేబిట్ (Brer Rabbit), భగ్నాశయుడూ ఉపరి దుస్స్వభావుడూ అయిన బ్రెర్ ఫాక్స్ (Brer Fox), ఇంకా అతని పురాణంలోని మిగతా పాత్రలించుమిం చన్నీ అలాంటివే. హేరిస్‌కి అంకుల్ రెమస్ కథలు వ్రాయవలసిందని అమితమైన ప్రోత్సాహం లభించినా (అప్పటికే పది సంపుటాలు వ్రాశాడు), తా నచ్చమైన దాక్షిణాత్యుడైనా, అంకుల్ రెమస్‌ను ఒక ప్రచారపు పెరుమాళ్ళుగా చెయ్యలే దాయన. యుద్ధకాలానికి కొ_స్త ముందు వెనుకల పరిస్థితినీ, తాత్కాలిక పరిస్థితినీ స్మరణకు తెచ్చుకుని చూ_స్తే రెమస్ దక్షిణ దేశంవారి దయనీయస్థితికి తగిన ప్రతినిధి అనిపిస్తాడు. లేక థామస్ నెల్సన్ పేజ్ వర్ణించడానికి మోజుపడిన బాపతుకి చెందిన వింత నీగ్రో పెద్దయేనా అవుతాడు. అయితే అతడు తెలివైన ఘటం. తమ అకించనత్వాన్ని బాగా అర్థంచేసుకొన్నవాడు. అధికారుల నతిశయించడంలో అకించను లవలంబించే విధానాలకు హర్షించేవాడు.

హేరిస్ ఏమన్నాడో చూడండి:

"నీగ్రోరచయిత పట్టి దుర్బలుడినీ, ఏ హానీ చేయలేని వాడినే ఎందుకు తన కథానాయకుడుగా వరిస్తాడంటేనూ, ఆ కథానాయకుడికి ఎలుగులు, నక్కలు, తోడేళ్ళతో పోటీపెట్టి అతడినే గెలిపిస్తా డంటేనూ దానికి పెద్ద శాస్త్రీయమైన అన్వేషణ యేమీ అక్కరలేదు. ఆ గెలుపు అదేదో ఒక గొప్ప యోగ్యత దని కాదు, నిస్సహాయత్వాని దని తాత్పర్యం. అది అసూయ, కక్షా, కావేషీ కాదు; కుటిలత."

అంకుల్ రెమస్ కథలు సహజంగా హాస్యమూ, స్పందనశక్తీ కలిగినవే అయినా కథాఖ్యాతయొక్క మాండలికభాషణం మీదకూడా కొంత ఆధారపడివున్నాయి. అయితే ఆ రెమస్‌యొక్క తాత్త్వికదృక్పథం అంటే

మంచి వారూ దరిద్రులూ అయినవా రందరి తత్త్వం, అసలు గ్రంథకర్త దృక్పథం ఆ కథలకు కాలదోషం పట్టకుండా చేస్తుంది. హేరిస్‌కి అభీష్ట గ్రంథం 'The Vicar of Wakefield'. 'దాని నిరాడంబరత, దాని విస్మయస్ఫూర్తి' తన జీవితగమనంలో ఒక ద్రుతిని కలిగించా యంటా డాయన. సాహిత్యం సామాన్యప్రజానీకంగురించి చెప్పినపుడే దానికర్తవ్యాని కది సన్నిహితంగా వచ్చినట్లవుతుందని హేరిస్ అభిప్రాయం. హాథార్న్ నాటి న్యూఇంగ్లడు జీవితంలోని పేలవత్వం గురించి, విసుగుదల గురించి హెన్రీ జేమ్సు ఎత్తిపొడుపులను సాగ్రహంగా కాదని ఖండించాడు హేరిస్. నిజాని కాయన స్వస్థలం పరిసరంలో నీగ్రోల ఉనికి జీవితాని కొక గాంభీర్యాన్ని చేకూర్చింది. ఈ విషయాన్ని వినియోగించుకొన్న తొలి తరం రచయితల్లో ఆయన ఒకడు.

అంకుల్ రెమస్, ట్వెయిన్ గారి జిమ్‌లతో పాటు అమెరికన్ నవలా ప్రపంచంలో వాసికెక్కిన నీగ్రోకథానాయకుడు అంకుల్ టామ్. హేరియట్ బీచర్ స్టోవేయొక్క సుప్రసిద్ధనవలలోనిపాత్ర టామ్. ఆ పాత్రలతో తులతూచితే ఇత డొక పరిహాసచిత్రంలా కనిపిస్తాడు. ధర్మనిష్ఠుడు, విశ్వాసపాత్రుడు, యథార్థాని కతీతమైన మంచితనం కలవాడు. ఆ 'Uncle Tom's Cabin' అనే నవలలో నీగ్రో గురించి 'నావిక పంచాంగం' (The Nautical Almanac)లో కంటె లోచూపులో గల విశేష మేమీ లేదంటూ ఒక దాక్షిణాత్యు డాక్షేపించాడు. కాని స్టోవే నవలను అంకుల్ రెమస్‌తో సరిపోల్చి నిర్ణయాలు చెయ్యడం న్యాయం కాదు. ప్రజల్లో సానుభూతిని దీపింపజెయ్యా లనే ఆశతో ఆమె ఆ కాలాని కనుగుణమైన ఒక బాటను తన రచనలో చూపింది. అంతే. నిజాని కామె రచనలో అన్ని విపరీతధోరణు లున్నందుకు అసంఖ్యాకాలైన తక్కిన దాస్యవ్యవస్థావ్యతిరేకా (Anti-Slavery; లేక దాస్యవ్యవస్థానుకూలా)లైన నవలలవలె అసందర్భరచనగా పరిగణింపబడవలసిందే కాని వాటన్నిటికంటె అది అమితసుందరంగా వుంది. అందుల కామె వస్తు

విషయంలో అపారమైన శ్రద్ధాసక్తులను వ్యక్తంచేస్తూ అందులో ఒక విశిష్టమైన శక్తిని, ఔత్సుక్యవ్యంజకతను, ఆఖ్యానవైదగ్ధ్యాన్ని, ప్రమాణ పరిజ్ఞానాన్ని ప్రదర్శించి వుండడమే కారణం. పామర్‌స్టన్ (Palmer-ston) మూడు పర్యాయాలు చదివిన పుస్తకం ఇదే. గ్లేడ్‌స్టన్ (Glad-stone) కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగినట్లు చేసిం దీ గ్రంథరాజమే. ఒక శతాబ్ది గడిచాక చూసుకుంటే పాఠకుని ప్రతిస్పందనం కొంత లఘుశ్రుతి కావచ్చు. అయినా అది గొప్ప నవలే. అంకుల్ టామ్‌ని సకలగుణాభిరాము డని చిత్రించడం సుతిమించిపోయిందంటే, ఆమాటే డికెన్సు పాత్రలు చాలావాటికికూడా చెల్లుబడి అవుతుంది. ఆ నవలయొక్క నాటకీకరణానికి జనరంజకత్వం కలిగించిన 'ఎలిజా' యాతన, 'ఈవా' మరణము అనే సన్ని వేశాలు కాలాంతరంయొక్క అభిరుచికి సంబంధించిన వైనా, అందులోని కడమపాత్రలుకూడా—టాప్సీ, సెయింట్ క్లేర్, షెల్బీ, సైమన్ లెగ్రీ పాత్రతోసహా పాఠకుల స్మృతిపథంలో నిలిచిపోతాయి.

శ్రీమతి స్టోవేయొక్క ప్రమాణపరిజ్ఞానం అంత ప్రతిష్ఠనందుకోని ఆమె మిగతా నవలలలోకూడా విశదమవుతుంది. వాటిలో తను న్యూ ఇంగ్లండు రంగపీఠంమీద మతమమత, మతచర్చలే జీవితతంతువులైన చిన్న చిన్న చిక్కని జనసంఘాలగురించిన చిత్రణ చేసిందామె. ఆ జనసంఘాల్లో ఒక గాంభీర్యం వుంది. ఆ జనం జీవితంలో కొన్ని కోణాల్లో దర్శించిన గాంభీర్య మది. వాళ్ళ సమస్యలతో సర్వదా మనకు సానుభూతి ఏర్పడదు. ఉదాహరణకు 'The Minister's Wooing' (1859) అనే నవలలో నాయిక తన ప్రియుడు డెందులోనో మునిగి చనిపోయాడని తెలిశాక అతడు వైభవోపేతమైన స్థితిలో చనిపోనందుకు దుఃఖిస్తుంది. స్టోవే 'విలన్' పాత్రలు—అదే పుస్తకంలోని ఆరన్ బర్, 'Oldtown Folks' (1869) లోని ఎల్లరీ డేవెన్‌పోర్ట్ అనేవాళ్ళిద్దరూ పరమపాపాత్ములుగా చిత్రింపబడ్డారు. అయితే స్టోవేలో సరసపరిహాససముల్లాసం లేకపోలేదు. ఆమె కాటన్ మేదర్ వ్రాసిన Magnalia Christi Americana

చిన్నప్పుడే చదివింది. అది తన కాలిక్రింది కాణాచి నేల అంతా ఏదో దైవికమైన పూర్వవివేకంతోడి ప్రత్యేకమైన అనుబంధంవల్ల పునీతమైపోయిన ట్లొక భావస్ఫురణ కలుగజేసిం దన్న దామె. స్కాటునవలలుతప్ప మరే నవలలూ చదవకూడదని ఆమెకు తండ్రి ఆదేశం. ఆయన ఒక మతాచార్యుడు. అయితేనేం, సకుటుంబంగా వాహ్యాళికి వెడలినప్పుడు మాత్రం ఆయన తన హోదా నలా వుంచి పిల్లలకు బాదంకాయలు కావాలంటే నిట్రమైన కొండకొత్తెంమీద వున్న చెట్టెక్కి, కాయలు రాల్చి, క్రిందనున్న అగాధంలోకి దూకి కాయలేరి పప్పుకొట్టి యిచ్చేవా డట. అయితే ఇలాంటి సన్నివేశా లామెనవలలలో తరచు ప్రసక్తాలు కావు. పుస్తకాలైతే హాథార్న్ సంయమనం గోచరిస్తుంది వాటిలో. ప్యూరిటన్ సంప్రదాయ పరిజ్ఞానం విషయంలో ఆవిడ హాథార్న్‌కి సాటి, పోటీకూడాను. పైని చెప్పిన నవలలు ('The Pearl of Orr's Island', 1862 & 'Poganuc People', 1878 సహా) న్యూఇంగ్లండు సన్నివేశానికీ, కాల్వినిస్టు స్వభావానికీ ఆమంత్రణాలుగా, సరసత్వాన్ని అధఃకరించిన యోగ్యతను ప్రదర్శిస్తాయి. అవి వర్ణన, సంవిభాగము అనే అంశాలకు సన్నిహితమైన పట్ల బాగా రాణిస్తాయి. నవలలుగా తగిన తాహతు లేదు వాటికి. గల్పికలుగా, అందును ఆమెకు బాగా అవగాహన అయిన పరిసరంయొక్క చిత్రణలుగా జవగలిగిన రచన లవి. ('అంకుల్ టామ్స్ కేబిన్'లోని దక్షిణప్రాంతచిత్రణమాత్రం ఆమెకు కొంత పరకీయమైన సన్నివేశం.)

స్టోవేరచనలలో ఈవిధమైనదానిని స్థానికచిత్రణ మనవచ్చు. అది ఆ కోవకు చెందిన న్యూ ఇంగ్లండు రచయితలలో సరా ఆర్న్ జ్యూయెట్ (Sarah Orne Jewett) కు ఉద్బోధక మైనది. జ్యూయెట్ తన బాల్యంలోనే 'The Pearl of Orr's Island' ను ప్రీతి పూర్వకంగా చదివింది. ఆ నవల 'మెయిన్' (Maine) తీరంగురించినదే. జ్యూయెట్ కూడ ఆ ప్రదేశంలో పెరిగినదే. ఆమెకూడా మొదట తన కథ

ల్లోనూ, పిదప నవలలలోనూ ఆ తీరస్థ ప్రకృతిని చిత్రించడం ప్రారంభించింది. అయితే ఆమె చిత్రణం పరిమితమైనది. సామాన్యంగా అది సముద్ర సమీప భూముల్లో, పక్కణాల్లో వున్న జనసామాన్యం గురించినది. ఆమె పాత్రలలో ఎక్కువమంది తమతమ జీవితమంతా ఒకరి నొకరెరిగిన స్త్రీలే. 'సదృశైక విషయపరిజ్ఞాతలైన వారి మధ్య పొత్తు చిరకాలం నిలవదు' అనే ఎమర్సను మాట వారిపట్ల వర్తించకపోగా, మోటుగా కనిపించేటంత మితభాషణలై వుండగలరు వాళ్ళు. ఇక్కడ మిస్ జ్యూయెట్ కి ఒక చిక్కు వచ్చిపడింది. ఆమె గ్రహించింది: 'న్యూఇంగ్లండులోని గొప్పసంగతులను గురించి చెప్పడం కష్టంగా వుంది. అక్కడి మనుషుల ఆశయ వ్యక్తీకరణవైఖరి ముక్తసరిగా వుంటుంది. భావం హృదయాన్ని ఆవరించుకొన్నపుడు బయల్వెడలిన కొద్ది మాటలూ అచ్చులోకి వచ్చేసరికి వెలవెలబోతూ వుంటాయి.' సగం గతవిషయభావనతో గడుస్తుంది వారి జీవనం. వారి రేవులూ, స్థావరాలూ నానాటికీ క్షీణిస్తూవున్నాయి. పుట్టుకలకంటె గిట్టుక లెక్కువైనట్లు తోస్తుంది. (ఒక దీవిదీవంతా అక్కడి రైతులు సకుటుంబంగా పడమటి ప్రాంతపు బంగరుభూములకు తరలిపోగానే సాఫ్ సీదాగా ఖాళీ అయిపోయింది) నవలారచయితకిదేమంత పనికివచ్చే పరిస్థితి కాదు కాని జ్యూయెట్ యొక్క నెమ్మదికి, పొడిమిగల నేర్పుకి సరిపోయింది. 'The Country of the Pointed Firs' (1896) అనే ఆమె గ్రంథరాజం ఉప్పవాసనలతో తెల్లరేకు పైకప్పులతో నున్న ఒక చిన్న 'డన్నెట్' అనే ఊహాకల్పితమైన పట్టణంగురించిన చిత్రణపరంపర. అదీ మన కొక కథాఖ్యాత కళ్ళలోనుంచి కానవస్తుంది. అది యెవరో కాదు మిస్ జ్యూయెట్టే. తన నేస్తురాలు శ్రీమతి టాడ్ద్వారా యీ మెహూడా ఆ పౌరుల జీవితరంగాల్లో నమ్రంగా ప్రవేశిస్తుంది. ఆ పౌరులలో కొందరు దూరదేశాలు తిరిగినవారు. కెప్టెన్ లిటిల్ పేజ్ 'హడ్సన్' అఖాతానికి వెళ్ళేడు. అక్కడ తా నొక 'ఆర్కిటిక్ పుణ్య లోకాన్ని' కనిపెట్టినట్లు విశ్వసించే వెర్రివా డొక స్కాట్ వృద్ధునితో

పాటు నివసించాడు. మిసెస్ ఫాస్టిక్ చిన్నప్పుడే తన తండ్రిగారి ఓడమీద ప్రయాణం చేసింది. ఆమె అంటుంది: "ఆ రంగులు పూనుకునే అనాగ రకులను చూసి తీరవలసిందే. నా చిన్నప్పుడు నేను చూశాను, దక్షిణ సముద్రపుదీవుల్లో ప్రయాణాలుచేసి.ఆ వెనకటి తిమింగిలపు వేటరోజులు... అవీ ప్రయాణాలకు తగిన రోజులు...మంచి ఉత్సాహంగా వుండేది. ఒడ్డు పట్టేసరికి మేమెంతో సంపన్నుల మైపోయినట్లు భావించేవాళ్ళం"అని. అయితే వాళ్ళంతా పెరిగి పెద్దవాళ్ళయారు. వాళ్ళమీదను ప్రపంచపు నీడలు బారినవి. దేశాలు తిరిగినవాళ్ళు కూడా 'మెయిన్' రాష్ట్రపు మారు మూలనున్న తమ స్వస్థానంతో మరే ప్రదేశమూ సాటిరా దనుకోకతప్పదు.

జ్యూయెట్ రచన ఆమెపాత్రల నివాసాల్లాగే నీటుగా, నిసర్గసుంద రంగా, అయితే అప్పుడప్పుడు మాత్రం అప్పుడుకూడా వాటిలాగే కొ_స్త శోభాడంబరంగా వుంటుంది. అది మితంగా, ముక్తసరిగా వుంటుంది; అలాగని వట్టి సామాన్యమైన చప్పిడిధోరణి కాదు. అది ఒక పతనావస్థ యొక్క సవిషాదదర్శనాన్నీ, న్యూఇంగ్లండు యొక్క జీవకళనూ తూచినట్లు వ్యక్తం చేస్తుంది. ఆ వ్యక్తీకరణం పతనం పొందుతున్న రాష్ట్రాంతర మైన దక్షిణప్రాంతపు స్థానికచిత్రణ రచనలనుండి యీ మెరచనను బాగా పృథ క్కరిస్తుంది:

"ఆ యెత్తైన చోట దక్షిణముఖంగా ఒక దిక్కుమాలిన ప్రాత యిల్లు వుంది.ఆ శూన్య గవాక్షాలచ్చంగా చూపుడిగిన కళ్ళలా వున్నాయి. చుట్టూ మంచుకొరికిన గరిక మట్టిరంగు ఉన్నివలె అల్లుకొని వున్నది. తలుపు వార పచ్చని ఆకులతో ఒక అడవిపూల మొక్క ఒక్కగానొక్క వంగిన కొమ్మతో తొంగి చూస్తోంది.

"మన మిప్పుడు కొ_స్త రొట్టెముక్క, వెన్న తిందాము. తిని ఆ యింట్లో ఏదో కొయ్యకు మేకల కందకుండా మన సజ్జను తగిలిద్దాము..." అన్నది (శ్రీమతి టాడ్).

రచయిత్రిగా ఆమె తన 'మెయిన్' రాష్ట్రాన్ని ప్రేమించడమే కాదు, తక్కిన బాహ్యప్రపంచం గురించి కూడా బాగా తెలుసు. ఆమె బాల్జాక్, జోలా, గస్టవ్ ఫ్లాబర్టు రచనలు చదివింది. ఆమె మెయిన్ కి దూర సీమలైన నెబ్రస్కా, న్యూమెక్సికోల గురించి వ్రాసినప్పుడుకూడా ఆమె రచనలు ఒక స్థైర్యం, స్త్రీజనోచితమైన మార్దవం, ఉల్లాసం, పరిణతి గలిగి విల్లా కేథర్ (Willa Cather, 1876-1947) ని జ్ఞాపకం చేస్తూ వుంటాయి. విల్లా, 'The Country of the Pointed Firs' అన్న జ్యూయెట్ నవలను 'The Scarlet Letter', 'Huckleberry Finn' అనే నవలలతో సమానంగా పరిగణించి 'చిరస్థాయిగా నిలిచే అవకాశం గల అమెరికన్ పుస్తకాలివి మూడు' అని ఉద్ఘాటించింది. హేరియట్ బీచర్ స్టోవేనుండి సారా ఆర్నె జ్యూయెట్ దాకా, ఈమెనుండి విల్లా కేథర్ దాకా ఇక్కడో చక్కని క్రమం వుంది. అమెరికన్ సాహిత్యానికి స్త్రీలుకూడ ఒక విశిష్టమైన దోహదం చేశారన్న విషయాన్ని వెంటనే సూచిస్తుందీ పరంపర. పక్షాంతరంగా చూస్తే అందలి హానికరమైన ధోరణులు కొన్ని హాథార్న్ కి కోపం తెప్పించాయి. సూసన్ బి. వార్నర్ వ్రాసిన 'The Wide, Wide World' (1851), 'Queechy' (1852) అనే నవలలు ఏడిపిస్తుంటాయి కాని హాథార్న్ కి సమకాలికాలైన ఆ చచ్చుచవకబారు నవలలు అతని గొప్ప పుస్తకాలకంటె అధికంగా అమ్ముడుపోయాయి. అయితే మంచిపక్షం చూసుకుంటే విల్లా, ఎల్లె గ్లేస్గో (1874-1945) రచనలలో వున్నట్లుగా స్వస్థానవేషభాషాభిమానంతో అనుబంధాలతో ఆ సాహిత్యం అమెరికన్ గద్యవాఙ్మయంలోని బాహ్యాడంబర పారుష్యధోరణులకు విరుద్ధమైన (పూరిపాకలో పియానో లాగు) ఆవశ్యకమైన ధోరణి కవకాశం కలిపించింది.

ఇంకా మరికొందరు రచయిత్రులను పేర్కొనవచ్చు. ఉదాహరణకు మేరీ విల్కిన్స్ ఫ్రీమన్ (1852—1930) మొదలైన వారు శ్రీమతి స్టోవే, కుమారి జ్యూయెట్లవలెనే న్యూఇంగ్లండు వాతావరణాన్నే

వర్ణించారు. అమెరికను కవయిత్రులం దగ్రగణ్య యైన ఎమిలీ డికిన్సను కూడా అలాగే చేసింది. ఆమె మసాచుసెట్స్ రాష్ట్రంలో అమ్హెర్స్ట్ అనే చిన్న పట్టణంలో అజ్ఞాతవాసం చేసింది. ఒక్క న్యూఇంగ్లండు సమాజంలో తప్పిస్తే మరెక్కడా ఒక స్త్రీ ఒకేసారి అంత అసుఖంగా, ఒంటరిగా వుంటూ, మరోవంక అంత మనోజ్ఞంగా, స్పష్టంగా, అంత ఇహ పరాల సన్నిహితానుబంధాన్ని గురించిన అభిజ్ఞతతో వుండడానికి వీలు పడదు; అంత ప్రతిభావంతురాలైనా అంత అసమత, అసమగ్రతలతో వుండడానికి వీలుపడదనికూడా అనవచ్చు. ఎందుచేతంటే ఈ న్యూఇంగ్లండు లోనే 'స్థానిక చిత్రణం' రచనల వైభవం ఒక యింటి ప్రాకారానికి, దాని చుట్టూ వున్న తోటకి, అందులో ఒక చిన్న పచ్చికపట్టునుంచిగాని ఆ యింటి కిటికీనుంచిగాని కనబడే దృశ్యానికి గూడ పరిమితంగా అంత ప్రాదేశికమైన స్థాయికి దిగజారిపోయింది. ఇక్కడే ఏకాంతత అన్నది అది ఇచ్ఛాపూర్వకమైనదా అనిపించేటంత పరిపూర్ణంగా భాసిస్తుంది. ఇక్కడ ఒకవంక 'కాల్వినిజమ్' యొక్క విషాదాత్మకశక్తి, మరోవంక ప్రకృతితో మానవుడు తాదాత్మ్యం పొందడంవల్ల వచ్చే అతీంద్రియపార వశ్యమూ కనిపిస్తాయి మరి.

ఎమిలీ డికిన్సన్ పోయేసరికి ఒక వేయి ఖండకావ్యా లామెవి అముద్రితంగా పడివున్నాయి. ఆమె వాటిని వ్రాసినట్టు కొద్దిపాటి మిత్రు లకు మాత్రమే తెలుసు. అందులో చాలామట్టుకు ఆ వేళకి చేతి కే కాగితంముక్క అందితే దానిమీదల్లా తరువాత పద్యాలల్లడానికిగాను ముందుగా గిలికిన ఊహలు మాత్రమే; వట్టి ముడిసరుకు. కొన్ని మాత్రం కాస్త శ్రద్ధగా పునశ్శీలితాలైనవి. అన్నీ చిన్న చిన్న పద్యాలు: చాలా మట్టుకు నాలుగేసి పాదాలవి. అన్నిటా ఆమె ఆత్మీయతాముద్ర అతి స్పష్టంగా వుంది. అవి తంతివార్తలలా టూకీగా, కరిచెప్పినట్లు వుంటాయి. ఒకొక్కప్పుడు తమాషాగా, చమత్కారంగా వుంటాయి. ఒకొక్క ప్పుడు చపలంగా, చాదస్తంగా వుంటాయి. వాటికి తగిన ప్రమాణం ఒకటి

వాటికి వుంది. పెద్దవీ, దూరంగా వున్నవీ అయిన విషయాలు ఆమె దర్శనంలో చిన్నవిగానూ, సన్నిహితంగానూ, ఇటునుంచి అటు విపరీతంగానూ కనిపించడం కద్దు. ఆమె సృజించుకొన్న చిన్నారి పొన్నారి ప్రపంచంలో పొలిరొట్టి పొత్తికడుపులోని మెత్తని భాగం ఒక విందు భోజనపు భోగంలా వుంటుంది. ఈగ, సాలీడు, తుమ్మెద, పిచ్చుక, సీతాకోకచిలుకవంటి అల్పజీవులుకూడ అట్టహాసం చేస్తూ కళ్ళముందు కదులాడుతాయి. చూడండి:

"The cricket sang
And set the sun
And workmen finished, one by one,
Their seam the day upon.

The low grass loaded with dew,
The twilight stood as strangers do
With hat in hand, polite and new,
To stay as if, or go.

A vastness, as a neighbour, came—
A wisdom without face or name,
A peace, as hemispheres at home,—
And so the night became."

[కీచురాయి పాడింది, ప్రొద్దు క్రుంకింది, ఒకరొకరే పనివాళ్ళు పని ముగించారు. పగలు గడిచింది. మంచు క్రమ్మింది గరిక; ఆకకైనా, పోకకైనా సరే సిద్ధంగా చేతిలో హేటు పుచ్చుకుని నమ్రతతో నిలుచున్న అభినవాగతుడైన వ్యక్తిలా వుంది మునిమాపు వెలుగు. ఏదో విశాలత్వం పొరుగుమనిషిలా వచ్చింది. ఇంటిపట్టున ప్రపంచార్ధగోళా లేర్పడినట్లు నామరూపాలు లేని యేదో జ్ఞానస్ఫురణ, ప్రశాంతి వచ్చాయి. ఆ యింతా రాత్రయింది.]

ఈ ఖండకావ్యం నిజాని కామె రచనల్లో గొప్పదేమీ కాదు కాని ఒక ప్రత్యేకత గలదానిగా పరిగణింపవచ్చు. ఛందస్సు దోషజుష్టమైనది. ఒకదాని కొకటి పొందని భావచిత్రాలుగూడ చాల వున్నాయని తోస్తుంది. చివర సకర్మక క్రియాపదం పడవలసి వుండగా దాన్ని గొంతు నొక్కేసి హఠాత్తుగా చమత్కారఖలీనంలా అకర్మకక్రియను ప్రయోగించినట్లు తోస్తుంది. అయినా యీ ఖండికనే నిరూపించేటట్లుగా ఆమె రచనలలో అసాధారణమైన భావసంపద, జాగరూకత కనిపిస్తాయి. కీచురాయి, పనివాడు, అభినవాగతుడు, పొరుగుమనిషి అనే అల్పవస్తువులతో రాబోయే రాత్రికి ప్రత్యుత్థానం చేస్తుం దామె. చివరిపద్యంలో అల్పం విశాలమైనట్లు అలా "A wisdom without face or name" అనడం వుందే అద్భుతం! ఇందులోనే డికిన్సనులో మనోవికారానికి లొంగిపోయే గుణం బాగా వున్నట్లు గమనిస్తాము. ముఖ్యంగా వెలుగులోని మార్పువల్ల వచ్చే పరిణామాన్ని గమనించగలం. అసలు వస్తుస్థితిలో వచ్చే సున్నితమైన మార్పును, అంటే మర్త్యజీవితంయొక్క క్లేశాత్మకమైన అస్థిరత్వాన్ని స్ఫురింపజేసే శక్తి వెలుగున కున్నది. చూడండి:

"Presentiment is that long shadow on the lawn
Indicative that suns go down;
The notice to the startled grass
That darkness is about to pass."

[బయలున బలసిన ఛాయ అది అవశ్యంభావిశంక, సూర్యాస్తమయ సూచన, అదరిన బెదరిన గరిక కది చీకటి రాక తాఖీదు.]

ఈ పంక్తు లిది ప్రత్యేక మొక కవితాఖండిక అన్నంత నిండుదనం నిరూపిస్తున్నాయి. మరో నాలుగు పద్యాల ఖండికలో మొదటి దిలా వుంటుంది:

There's a certain slant of light,
On winter afternoons,
That oppresses, like the weight
Of cathedral tunes,

చివరిది :—

When it comes, the landscape listens,
Shadows hold their breath;
When it goes, 'tis like the distance
On the look of death.

[చలికాలపు టపరాహ్ణవేళల నొకానొక వాలు జూపుతుంది వెలుగు. అది చర్చిలోని గవాయిగానంవలె దుర్భరబాధాకరంగా వుంటుంది.— అది వచ్చినపుడు దృశ్యాలకు వినుకలి, నీడల్లో నీరవనిస్తబ్ధత; పోయేటప్పుడది మృత్యువు చూపున గల దూరము.]

మృత్యువిషయము ముందుగానే ఆమెమనస్సును లోగొన్నది. ఆమె చూపున మృత్యువంటే అది స్థిత్యంతరాని కొక ద్వారం. ఆమెకు చాలా ఆదరపాత్రమైన 'Book of Revelation' (శ్రుతిప్రకాశకృతి)తోగాని, ఆమెనాటి భక్తిగీతాలలో చిత్రింపబడ్డ సాంప్రదాయిక స్వర్గంతోగాని ఏ కొంతో సామ్య మున్నట్లుగా ఆ మృత్యు వదొక ప్రాభవ విశేషంగా భావింపబడింది. చావంటే ఆమెదృష్టిలో ఒక తీరుబడి లాంటిది, ఒక మహోవిభవము, ఒక గుర్తింపు; ఈ భూమిమీద పూర్తిగా తెలుసుకోడానికి వీలుపడని కొద్దిమంది అరుదైన మనుషులతో కలిసి వుండడం. ఇల్లంటే వల్లకాటికి మునివాకిలి :

We paused before a house that seemed
A swelling of the ground;

The roof was scarcely visible,
The cornice but a mound.

నేలకు వాపు వచ్చినట్లున్న ఒక యింటిముం దలా నిలిచాము మేము. పైకప్పు లీలగా కనిపిస్తోంది. ఇంటిబొద్దు (సరేసరి) ఒక దిబ్బలా వుంది.]

శ్మశానానికెక్కడో మీద 'మోక్షార్హ వరణము' (White Election) న కావల ఒక సర్వసంపన్న మహారాజ్యా న్నేలుతున్నాడట భగవంతుడు. ఆ వైభవాల నామె 'Purple, Royal, Privilege, Emerald, Diadem, Courtier, Potosi, Himmaleh' అనే మాటల ద్వారా (అర్థం: ధూమ్రవర్ణము, రాజసంబంధ, హక్కు, గరుడపచ్చ, కిరీటము, ఆస్థాని etc.) తెలియజేస్తుంది. ఈ మాటలన్నీ అమరత్వంగురించి ఆమెకుగల ఊహాలను బలపరుస్తున్నాయి. జీవితం మూడు వంతుల ముప్పాతిక మృత్యు నివాసానికి ముందుగదిలో ఓర్చుకునే బాధ. 'కాల్వరీ సమ్రాజ్ఞి' (Empress of Calvary) ఆమె విట్మన్‌తో 'ఎవరేమనుకొన్నదానికంటెగూడ విలక్షణ మైనది మృత్యువు. అది ఘనతరమైన అదృష్టము' అని చెప్పివుంటుంది. తన జీవితాన్ని సాధ్యమైనంత మేరకు ప్రశాంతంగా వుంచుకునే ఆ కవి ఆస్థితిలో నిశితపరిశీలకు డవుతాడు. 'స్వర్గాన్ని కూడదీయడానికి తన వంకరచేతులు జాపి', బాహ్య ప్రపంచంలో దానిగురించి వున్న మర్మాలను దేవుకుంటాడు. ప్రకృతియే కొన్ని కిటుకులను చూపుతుంది. అయితే అవి అంత ఉత్కృష్టమైనవి కావు; ఆశపుట్టించి బాధించేవి, క్షణికాలూను:

"We spy the forests and the hills
The tents to Nature's show,
Mistake the outside for the in,
And mention what we saw."

[ప్రకృతి 'ప్రదర్శనము' నకు వేసిన డేరాలవంటిఅడవుల్లో కొండల్లో

వేగునడుపుతాము కాని బాహిరమైనదాన్ని ఆంతరమైనదానిగా పొరపడి చూసింది చెబుతాము.]

ఆమె నిరీక్షిస్తున్న దా 'in' (ఆంతరమైనదాని) కోసమే. అది ఆ మాయ తెరను మర్త్యుడు చించడానికి సిద్ధంగా వున్నప్పుడు మెరిసే సద్యో విద్యుల్లత. ఒక తుపాను వచ్చేముందు ఋతువులు జారుకోనేటప్పుడు (ఒకొ్కకప్పుడు 'సంగీతంకలిగించే బాధలా' వుంటుం దట యిది), మరణ మాసన్నమైనప్పుడు వెలుగు తన వాలకాన్ని మార్చుకోనేటట్లుగా సంభ విస్తుం దది. అలాంటి సమయాల్లో ఆమె—'నాకు తెలిసిందల్లా అమరత్వ ప్రకటనపత్రికసంగతులే' అని అనుకొంటుంది. 'Just lost when I was saved' అనే కావ్యఖండికలో తాను బ్రదికి బయటపడిన జబ్బు గురించి ఒక ప్రయోజనపర్యవసాయికాని అన్వేషణ చేసింది:

Therefore, as one returned, I feel,
Odd secrets of the line to tell!
Some sailor, skirting foreign shores,
Some pale reporter from the awful doors
Before the seal!

[ (కనుక), తిరిగివచ్చిన నేను పరదేశతీరాలుతాకిన నావికునివలె, మూసుకోడానికి ముం దాభయంకరద్వారదేశంనుండి వచ్చిన వివర్ణవార్తా వహునివలె ఆమార్గపు వింతవింత మర్మాలను చెప్పా లనుకుంటాను.]

సరే, ఏమైనా పరలోకంగురించి డికిన్సను దర్శనంలో కొ స్త చాద స్తము, చాపల్యము, భ్రాంతి, సంకుచితత్వము గోచరిస్తాయి. అది ఆమె స్వభావంలో వున్న (గాంభీర్యం లేని) వట్టి వన్నెచిన్నెల తత్వం. 1 ఏకాంత

1. By Richard Chase, 'Emily Dickinson' (American Men of Letters), London, 1952.

తత్వం గురించి ఎంత చెప్పినా ఆమె St. Teresa of Avila వంటి గూఢతత్వవాదిని కాని, St. John of the Cross వంటి మత కవయిత్రిగాని కాదు. మీదుమిక్కిలి శాశ్వతతత్వంతో సరసమాడుతుంది. దేవుడితో చేసిన మోసాని కతడిని క్షమించినట్లు వగలాలకబోస్తుంది. ఒక్కొక్కప్పుడు మరీ బిడియం ప్రకటిస్తుం దతనిముందు:

"I hope the father in the skies
Will lift his little girl,—
Old - fashioned, naughty, everything,—
Over the stile of pearl."

[నింగిలో వుండే తండ్రి ఈ సత్తెకాలపు టల్లరిపిల్లను తన ముత్యాల సోపానసరణిమీది కెత్తుకుంటా డనుకొంటాను.]

ఆమె కృతుల్లో దేవుడి విషయం కొంత చిక్కగా వుంటుంది. తానీసృష్టి యెందుకు చేశాడో బహుశా తనకే తెలియని ఆ స్రష్ట ఒక కన్నపు దొంగ అట! ఒక ఉత్తమర్ణుడు, తండ్రి, తగు మనిషి, సామంతుడు, రాజు, ఒక్కొకప్పుడు మృత్యుమూర్తి, మరొకప్పు డదొకలాంటి ప్రేమికుడు నట. అలాంటి చిత్రణలతో ఒక్కొక్కప్పుడు న్యూఇంగ్లండుహాస్యం అంచులు గట్టినట్లు తోస్తుంది. ఒక్కొక్కప్పుడు ప్రేమకుపాత్రులుగాక గిలికితే ఉలికి పడే పిల్లల ప్రవర్తనలో వుండే నిర్లక్ష్యస్వభావం గోచరిస్తుంది. ఏమైనా, ఆముష్మికవిషయాలగురించికూడా సుతిమించిన చనవు తీసుకుంటుంది. క్రిస్టైనా రొజెట్టి (Christina Rossetti) డికిన్సను కవిత్వాన్ని శ్లాఘించి శ్లాఘించి ఆమె మతవిషయక, మత విరుద్ధరచనలగురించి మాత్రం విచారం వెలిబుచ్చిం దంటే ఆశ్చర్యపడవలసిన పని లేదు. అసలు లోపం ఆమెయొక్క మతవిశ్వాసపు లోటుది కాదు-అపరిణతిది; చిలిపితనంది. (ఆమె తన ఉత్తరాలక్రింద "Your Gnome", అంటే సంరక్షకు రా లన్నట్లు సంతకం చేసేదిట!)

అయితే ఆమె రచనలగురించి చివరికి తీర్మానించుకోవలసిం దేమంటే, అందులో ఒక గొప్ప ఆర్జవము, ఉపజ్ఞ కనిపిస్తాయి. 'మృత్యువు' అనే వస్తువు విషయమై ఎంత ఆసక్తి వున్నా తనచుట్టూ వున్న ప్రపంచంగురించి, తన కవితాశిల్పపు పరికరంగురించికూడా చురుకైన వివేకంప్రదర్శిస్తుంది. పద్ధతిప్రకారం చెప్పాలంటే మాత్రం గొప్ప కవయిత్రి కా దామె. పద జాలప్రయోగంలో ఒక సార్థకమైన ఉరవడి అలజడి తెచ్చిపెట్టింది. ధర్మ శాస్త్రం, క్షేత్రగణితం, యంత్రవాస్తుశాస్త్రాలనుంచి పరిభాషను తెచ్చి తన ప్రయోజనాలకు వాడుకొన్నది. వట్టి మామూలు వాడుకమాటలకు క్రొంగ్రొత్త సందర్భాల్లో జీవకళ పొదిగింది. భాషాభాగాలను ఒకదాని కొకటి వాడడానికికూడా వెనుకాడలే దామె:

"Kingdoms like the orchard
Flit russetly away"

ఒక్కొక్కప్పు డామె సంక్షిప్తత న్యూఇంగ్లండు జాతీయంలా వుంటుంది:

"And 'twas like midnight, some,—"

ఈ సంక్షేపాత్మకమైన 'Some' అనేమాట వాడితే అమెరికన్ కవే వాడాలి.

ఆమెకు మిత్రులు లేకపోలేదుకాని వారి నల్లంతదూరాన ఉంచుతూ వుండేది—స్వవిషయాలను ఒక కవి కుండే ప్రత్యేకతతో హుందాగా చర్చించవచ్చునని. (థోరోలాగు—ఆయన ఒక ఉత్తరంచివర 'బహుశా నీతో మాట్లాడినట్లుగానే తరచు నాతో నేనే మాట్లాడుతూవుంటానని గ్రహించగలవు'అని వ్రాశాడు). అబ్బే! ఉత్తరాలవల్ల లాభమేమిటి! అన్న ట్లుగా ఆమె ఒకసారి ఒక విలేఖకుడితో 'బయలంతా దాక్షిణ్యమయంగా వుంది. వాసనలు వలపన్నుతున్నాయి. ఈనాడు మొదటిసారిగా నేను చెట్లులోని ఏటిని వింటున్నాను' అన్నదట. ఇంకా 'నేను నిజంగా నా బుర్రమీది పైకప్పు తొలగిపోయినట్లు భావించగలిగితే అప్పు డనుకుంటాను

అది కవిత్వమని' అన్నది. ఒక విమర్శకు డామెను విట్మన్‌తో సరిపోలుస్తూ 'ఇద్దరూ తమకంటె ముందు మరెవ్వరూ అసలు కవిత్వ మన్నది వ్రాయనట్టుగా వ్రాశారు' అన్నాడు.1 అది సరియైన విమర్శనమూ అయింది; వారికొక గొప్ప కితా బిచ్చినట్లూ అయింది. ఆమె గొప్పగా చెప్పిన పంక్తులు కొన్ని వున్నాయి. అందులో కవిగ్రామణుల విదగ్ధవిన్యాసాలు కానవస్తాయి. ఉదా:

"Farther in summer than the birds,
Pathetic from the grass,"

[గ్రీష్మంలో పక్షులకంటె పైపైకి, గరికకంటె దయనీయంగా...]

ఇలాంటి పంక్తులు నిష్పత్తి కతీతమైనవి వందలకొలది వున్నాయి. అయితే అవి మనకు పరిచయం చేసే కావ్యఖండికమాత్రం నిస్పృహ కలిగిస్తుంది. అతుకులమారి దామె ప్రతిభ. కావ్యశరీర మంతటా వ్యాపించివుండదు. తనకు చెవుడున్నట్లుగా మనతో గుసగుస లాడుతాడు హాథార్న్. మనకు చెవు డుందనుకొన్నట్లుగా చప్పట్లు కొట్టి పిలుస్తాడు మెల్విల్. తన కృతుల కెలా శ్రుతికూర్చవలెనో ఎమిలీ డికిన్సనుకికూడా తెలీదు. అయితే వాళ్ళలా ఆమెకూడ కలతపొందిన తన ఏకాంతతనుండి శక్తిని పుంజుకుంటుంది.

---

1. A. C. Ward, American Literature: 1880—1930 (London, 1932), 43.

# 9

# అమెరికన్ వచన వాఙ్మయంలో వాస్తవికత

## విలియమ్ డీన్ హావెల్స్ (1837-1920) :

అభిజనం ఒహాయో. తండ్రి ధనహీనుడు, విద్యావంతుడు అయిన ఒక 'అచ్చు' పనివాడు. తిరిగి తిరిగి కుటుంబం కొలంబస్‌లో స్థిరపడింది. (అందులో మజా అయిన ఒక మజిలీని తన A Boy's Town (1890) లో వర్ణించాడు). అక్కడొక వార్తా పత్రికకు వ్రాతలు వ్రాస్తూ హావెల్సు విద్యావ్యాసంగం చేశాడు. వెనిస్‌లో రిపబ్లికన్ పార్టీ ప్రభుత్వ ప్రతినిధిగా (1861-5) వుంటూ యూరపుదేశాన్నీ సాహిత్యాన్నీ నూటిగా తెలుసుకోవడానికి తన అవకాశాలను వినియోగించుకొన్నాడు. అమెరికాకు తిరిగి వెళ్లి, మొదట కొన్నాళ్ళు బోస్టనులో, పిదప న్యూయార్కులో పని చేస్తూ, త్వరలో అమెరికన్ నవలా రచయితలలో,

వ్యాసకర్తలలో, పత్రికా సంపాదకులలో అగ్రశ్రేణికి చెందినవా డనిపించుకొన్నాడు.

హేమ్లిన్ గార్లెండు (1860-1940) :

అభిజనం విస్కాన్సిన్. తన తొలుకారు కొంత అయోవా లోనూ, దక్షిణపు డకోటాలోనూ కూడ గడిపాడు. మాధ్యమిక విద్యాభ్యాసానంతరం బోస్టనుకి వెళ్ళేడు. తనకు తెలిసిన ప్రాంతం గురించే తాను వ్రాయాలని పెట్టుకొన్నాడు. ఒక యథార్థ దర్శన శిల్పంతో Crumbling Idols (1894) వ్రాశాడు. అయితే బహుశా ఎప్పుడూ అతడు వాస్తవికతకు నూటికి నూరుపాళ్ళు మనఃపూర్వక సౌముఖ్యం ప్రకటించినట్లు లేదు. క్రమంగా వదిలేశాడు దాన్ని. అతని చివరి పుస్తకాల్లో ఆధ్యాత్మికత నెలకొన్నది.

స్టీఫెన్ క్రేన్ (1871-1900) :

అభిజనం న్యూజెర్సీ. అక్కడా, న్యూయార్కులోనూ నివసించాడు. అతని చదువు కొంత అమార్గం పట్టింది. ఔపచారికంగా పత్రికా విద్య (Journalism) కొంత పట్టుబడింది. అతని మొదటి గ్రంథం Maggie (1893); సొంత మదుపు పెట్టుకొని వేయించుకొన్నాడు. The Red Badge of Courage (1895) అనే రెండో పుస్తకం పేరు చేసుకునేదాకా ఆ మొదటిది ఉపేక్షకు గురి అయి వుండిపోయింది. పాపం, అతని ఆ స్వల్పజీవితంలో చివరి రోజులు అశాంతిమయాలై పోయినవి. అతని అనుభవాల్లో చెప్పుకోదగ్గవి: మెక్సికోలో వార్తాపత్రిక నడపడం, క్యూబాకొక సాహసయాత్ర (1896), గ్రీసులో క్యూబాలోనూ

యుద్ధవార్తావహత్వం, ఇంగ్లండులో కొన్నాళ్ళపాటు నిద్రాణమైన గ్రామీణజీవనం, జర్మనీలో క్షయరోగంతో చిట్టచివరి చావు.

ఫ్రాంక్ నోరిస్ (1870-1902) :

అభిజనం చికాగో. తలిదండ్రులతో శాన్ ఫ్రాన్సిస్కోకి వెళ్ళిపోయాడు (1884). వారి అనుమతిపై పేరిస్‌కు, మధ్యయుగపు చిత్రకళ నేర్చుకోడానికి, వెళ్లేడు. తదుపరి కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో చదువు. క్రమంగా ముందునాటి తన కాల్పనిక విషయాభిరుచి విడిచి వాస్తవిక చిత్రణ గల నవలలు వ్రాయడం ప్రారంభించాడు. 1895-6లో దక్షిణాఫ్రికాలో యాత్రావిలేఖకుడు (travel correspondent) గా పని చేశాడు. 1898 లో క్యూబాలో స్పెనిష్ - అమెరికన్ యుద్ధవార్తా ప్రచురణ కర్తగా వుండేవాడు. న్యూయార్కులో ఒక ప్రకటనకర్త దగ్గర పాఠకోద్యోగంలో వుంటూ చాలా నవలలు వ్రాశాడు. ఆకస్మికంగా మరణించాడు.

జాక్ లండన్ (1876-1916) :

అభిజనం శాన్ ఫ్రాన్సిస్కో. తలిదండ్రు లెవరో తెలీదు. చిన్నప్పటినుంచీ సాహసయాత్ర లంటే విపరీతమైన మమకారం పెంచుకున్నాడు. దేశద్రిమ్మరిలా తిరుగుతూ వుండేవాడు. 1897 లో క్లోండైక్‌లో బంగారంకోసం నలుగురితోపాటు పోలోమని పోయాడు. ఆ మధ్యలో చదువు చెట్టెక్కుతూ దిగుతూ వచ్చింది. కాని గట్టెక్క లేదు. 'The Son of the Wolf' (1900) అను పేర

అతని కథలు మొదటిసారిగా పుస్తకరూపం దాల్చేయి. తరుపరి అతడు సామ్యవాదం గురించి వ్రాసినా, విదేశాల గురించి వ్రాసినా అతని పుస్తకాలు ప్రజల్లో బాగా వ్యాప్తి పొందేయి.

థియొడర్ డ్రెయిజర్ (1871–1945) :

అభిజనం ఇండియానా. తండ్రి వలసవచ్చిన ఒక నిరుపేద జర్మను దేశీయుడు. అతని మతవిశ్వాస ప్రగాఢత్వం కొడుక్కి-ససేమిరా పడలేదు. అతని నిర్ధనత డ్రెయిజర్‌కి ధన మంటే విపరీతమైన కామనను, భక్తిని కలిగించింది. నడివయస్సు దాకా U. S. లోని పెద్ద పెద్ద పట్టణాల్లో పత్రికలలో పని చేస్తూ వుండేవాడు. అతని నవలలు అనాదృతాలైపోయినవి.

ఎంబ్రోజ్‌బియర్స్ (ఇతడు Ur Mencken, మనుష్యద్వేషి) తన 'Devil's Dictionary' (i. e., పిశాచకోశం)లో 'పఠనము' నిట్లు నిర్వచించాడు:

"అంటే మనం చదివే సమస్త పుస్తకాల సామాన్య సమాహార స్వరూపం. మా దేశం విషయంలో ఇండియానా నవలలు, మాండలికపు కథానికలు, 'యాస'బాసలో హాస్యము అన్నవి అందులో విధిగా గతార్థం అవుతాయి."

'స్థానిక చిత్రణ' (Local-Colour) రచన లన్నవి ఆయనకు పరిహాసప్రాయా లైపోయినవి. అందులోని వాస్తవికత (Realism) మాటకేమి? అది వేరే సంగతి. దాని గురించి ఆయన అంటాడు :

"వాస్తవికత అంటే బాండ్రుకప్పల దృష్టిలో భగవంతుని సృష్టి

యెలా వుంటుందో చిత్రించే కళ, అడవి యెలుక చిత్రించిన దృశ్యంతో విరిసిన ఉల్లాసం లేక ఒక కొలపురుగు వ్రాసిన కథ."

ఇదంతా నిందావచనం. నిజాని కిందులో ఒక మజా వుంది. వాస్తవికతావాదుల మనుకొనేవారి కిదొక చిత్రమైన కళలప్రశ్న. వారు తమ వంతు కొన్ని ఆశయప్రకటనలు చేసి సమాధానం చెప్పి కున్నారు. అందులో 'reality' (i.e, యథార్థత, అంటే-idealisy-ఆదర్శవాదము), romanticism (కాల్పనికత), Sentimentalism (వాసనావశంవదాశయత్వము) అనువానికి విరుద్ధమైనదిగా, 'truth (సత్యము = తరచు పైమెరుగులు లేనిది), 'honesty' (ఆర్జవము, లేక నిజాయితీ), 'accuracy' (అన్యూనాతిరిక్తత) అనే పదాలు ప్రయుక్తములు. అసలైన జీవితాన్ని, అంటే జీవితాన్ని ఉన్నదున్నట్టు చిత్రిస్తామని వారి ప్రతిజ్ఞ. అలాంటి ప్రకటనలు వారి ఆశయాల నంత సంతృప్తికరంగా నిర్వచింపలేవు. వారి మాటల్లో అసలు జీవితం, లేక వాస్తవికత అంటే యేమిటి అనే ప్రశ్న ప్రశ్నగానే మిగులుతుంది. 'వాస్తవికత' గురించి ఒక సరియైన ఊహ, నవలా రచయిత కనుగుణమైన సామగ్రి ఎలాంటిది? - అని చూసుకుంటే తేల్తుంది.

"తాలిమి గల చదువరీ, నన్ను మరోసారి క్షమించు. నేను మీ కిచ్చేది ఉదాత్త జీవిత విషాదాంత సంఘటన కాదు, రక్తిగొలిపే భోగ నాగరిక చరిత్ర యేమీ కాదు. ఇది కథానాయకురా లనిపించుకునే తాహతు లేని ఒక స్త్రీ యొక్క చిన్న కథ."

ఈ పంక్తులలోని ఆ సత్తైకాలపు తనమే (వినయమే) దాని ప్రాక్తనత్వాన్ని సూచిస్తుంది. అవి 1861 లో ప్రచురింపబడిన రోజ్ టెర్రీ కూక్ (Rose Terry Cooke) అనే న్యూ ఇంగ్లండు రచయిత యొక్క కథానికలోని పంక్తులు. మరి ఒకటి రెండు దశాబ్దులు గడిచేసరికి అలాంటి పకటనలు మరికాస్త తరచుగా వచ్చాయి కాని ఆ క్షమాపణ చెప్పుకునే

ధోరణి కాస్త తగ్గింది. అంటే 'వాస్తవికత' అన్నది రచయితకు సుపరిచితమైన పరిసరం గురించి. అక్కడి వేషభాషలు, ఆహారవిహారాలు, కథారంగస్వరూపమూ మొదలగువాని స్వభావ యాథాతథ్యానికి తూచా తప్పని దృక్పథం తోడి రచనల ఉత్పత్తికి దారితీసిం దనవచ్చు. దానికి అమెరికనులకు ప్రత్యేకమైన విశేషార్థం వొకటి వేరే వున్నది. ఆనాటి అమెరికన్ నవలలలో వస్తుగతంగా తర్క ప్రాచుర్యం కనిపిస్తుం దనే బియర్సుతో ఏకీభవిస్తాడు హెన్రీ జేమ్సు. ఆ కోవకి చెందిన ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను గ్రంథాల్లో మాత్రం అంత ప్రాచుర్యం లేదని అతని భావన. అదంతా ఇటీవలే ఆంగ్లో-సాగ్జను జగత్తుపై పొటమరించిన ఆత్మతత్వంయొక్క అనాగరకమైన జిజ్ఞాస అనే వెల్లువలోని భాగమే అని అతని వుద్దేశం. రుడ్‌యార్డ్ కిప్లింగును శిఖరాగ్రమున భరించిన తత్వం అదే.

ఒకవిధంగా అమెరికన్ వాస్తవికతయొక్క అభ్యుదయం గురించి వ్రాయడం సులువే. అది దాని కలగాపులగపుతనంవల్ల స్థానిక ప్రకృతినుండి పరిణతమైన ఉద్యమం అనీ, తదుపరి కాల్పనికోద్యమవాదులైన నవలా రచయితలతో తలపడి యుద్ధాలు చేస్తున్న 'స్వభావవాదం' (Naturalism) అనే ఉద్యమంలో పర్యవసించిందనీ (అయినా కాకపోయినా) వ్రాయడాని కేం వ్రాసెయ్యవచ్చు. కల్పన - యథార్థత, సంపన్నజీవితం - సామాన్యపు బ్రదుకు, విజాతీయత - ప్రజామోదము, పగటికల - పట్టపగలింటి వెలుగు, వాసన - వివేకము ఇలా ఎన్నో విరుద్ధధోరణు లున్నాయి కాని ఎక్కడికని? ఏదో వ్రాసెయ్యవచ్చు. సులువే. అంతా పూర్తిగా తప్పూ కాదు కూడాను. మరి ఆనాడు విలియం డీన్‌హవెల్సువంటి నవలా కర్తలున్నారు—మేం వాస్తవికతావాదుల మని బాహాప్పళించి చెప్పుకొనే వారు, వ్యతిరేకుల మొహంలోకి సూటిగా చూస్తూ తమ మతస్మృతి సూత్రాలు వివరించేవారు, తాము మిత్రులుగా భావించే ఇతర రచయితల తరఫున వకాల్తా పుచ్చుకున్నట్లు వాదించేవారు, సూటియైన ఒక సాహిత్య

మహాసంగ్రామం చకచక సాగిపోతున్నట్లుగా పోటీలు, పోరాటాలు, పక్షాలు, కక్షలు, కావేషాలు మున్నగు వివాదవిషయానికి రూపకాలంకార ప్రాయమైన సామగ్రినంతా చక్కగా వాడుకొన్నవారు ఎందరో మహాను భావులు ఉన్నారు. ఇంక వేరే మరికొందరున్నారు ఫ్రేన్సిస్ మేరియన్ క్రాఫర్డ్ లాంటి నవలాకర్తలు. వాళ్ళు మేం కాల్పనికతావాదుల మని చెప్పుకోకపోయినా హవెల్సుతోటీ, అతని అనుచరులతోటీ బాహాటంగా ఏకీభవించనివారే. చెడిక్ చెడీ ఇద్దరికీ బెడిసింది. 1886 లో ప్రచురింపబడిన ఫ్రేన్సెస్ హాడ్గ్‌సన్ బర్నెట్ వ్రాసిన 'Little Lord Fauntleroy' కీ, హవెల్సు వ్రాసిన 'Indian Summer' కీ మధ్య, ఆ మరుచటియేడు వచ్చిన థామస్ నెల్సన్ పేజ్ వ్రాసిన 'In Ole Virginia' కీ జోసఫ్ కిర్క్‌లండ్ వ్రాసిన 'Zury, the Meanest Man in Spring Country' కీ మధ్య చూడండి దృక్పథంలో గాని, ఆ వాగ్విన్యాసధోరణిలోగాని ఎంత అంతర మున్నదో! చాలా వుంది.

నిశితంగా పరిశీలించి చూస్తే ఆ 'యుద్ధం' (సాహిత్యచరిత్రకారు లున్నూ, హవెల్సున్నూ తరచు వాడిన రూపక మిది) ఒక సంకులసమరంలా, అంతఃకలహంలా కనిపిస్తుంది. అస లందులో పాల్గొనే కక్షిదారు లందరూ 'గణియం' (Uniform) వేసుకున్నట్లు లేదు. వాళ్ళందరికీ యుద్ధపు టాశయాలు తెలిసినట్లూ లేదు. అందులో ఎంబ్రోజ్ బియర్స్ ఏ పక్షానికి చెందినవా డన్నది ప్రశ్న. మొదట్లో హవెల్సుతోపాటు వాస్తవికవాద ప్రముఖవీరుల్లో ఒకడైనా, 1886 నుంచి ఇంగ్లండులో నివసిస్తూ 'The Princess Cassamassima' వ్రాస్తూ వుండిన హెన్రీ జేమ్సు ఏ పక్షంవాడని చెప్పాలి? ఒక విమర్శకుడు—మార్క్‌ట్వెయిన్ 1873 లో తన 'The Gilded Age' లో వాస్తవికతావాదులమీద గట్టి దెబ్బ తీసిన తరువాత కాల్పనికవాదులతో చేతులు కలిపేడు—అని చేసిన ఆరో

-షణతో 1 మనం ఏకీభవించగలమా? (అతని 'Huckleberry Finn' 1884 లో ప్రచురింపబడింది) పోతే, ఆ విమర్శకునిచేతనే 'ఉదారుడైన వ్యాఖ్యాత' అని ఉచితరీతిని అభివర్ణితుడైన ఛార్లెసు డడ్లీ వార్నర్ ('The Gilded Age' రచనలో ట్వెయిన్‌కి సహాయకుడు) గురించి ఏమనుకోవడం? జాన్ డస్ పాసోస్ (John Dos Passos) తో సరిపోల్చుదామా అంటే అది హాస్యాస్పదం. అతడూ పాసోస్‌లాగు అక్రమప్రాప్తసంపత్తి, దాని దారుణపరిణామాలగురించి ఒక విషాదప్రస్థాన త్రయం 'Trilogy' వ్రాసివుండవచ్చునుగాక, అది వేరే సంగతి. ఇక కాల్పనికవాదుల నాయకుడైన మేరియన్ క్రాఫర్డ్ విషయం చూడండి. అతడేం చేశాడని! 'పదిహేనవ శతాబ్ది వెనిస్' అనీ, 'పదునాల్గవ శతాబ్ది కాన్‌స్టాంటినోపిల్' అనీ అభూతకల్పనలతో ఇలా ముప్పై విడ్డూరపు నవలలు వ్రాసేశాడు. సమకాలికమైన అమెరికాగురించికూడా ఓ ఏడు వ్రాశాడనుకోండి. అందులో ఒకటి (An American Politician, 1884) పైపై మెరుగుల కాలం ('Gilded Age') యొక్క అవినీతిని కూర్చినది. అతడు పూర్తిగా తన సలహా తానే పాటించి వుండకపోయినా, 1893 లో ఒక పృచ్ఛకుడితో ప్రపంచంఅంతటిలోనూ సంయుక్తరాష్ట్రాలు నవలారచయిత కొక గొప్పనిక్షేపం చూపించాయని వక్కాణించాడు. ఇక, గతించిన శకాలగురించి సుదూరసీమలగురించి వ్రాయడం కాల్పనికోద్యమప్రవర్తకు డనిపించుకోడానికే అయితే హవెల్సు యొక్క అభినందనలు పొందిన రుడ్‌యార్డు కిప్లింగు, ఆర్. ఎల్. స్టీవెన్సను లను మనం గర్హించవలసిందేనా? కాక, మరో ఉదాహరణ—1888 లో

---

1. గ్రేంట్ సి. నైట్ వ్రాసిన 'The Critical Period in American Literature' 1890-1900 (Chapel Hill, N.C., 1951), 169. ప్రొఫెసర్ నైట్ పుస్తక మిది. ఉన్నవాటిలో చాలా చక్కని విమర్శనిబంధము.

హావెల్సుచేత 'చాలా సరదాౖయెన మిత్రు' డనీ, 'అభినివేశంతో వాస్తవిక వాదిగా మారినవా' డనీ అనిపించుకొన్న సిడ్నీలుస్కా విషయం తీసుకోండి. 'లుస్కా' అన్నది అతని మారుపేరు. అసలుపేరు హెన్రీహార్లెండు. న్యూయార్కుకి వలసవచ్చిన 'జ్యూ'ల (Jews) గురించి నవలలు వ్రాశాడు. ఒకటి రెండేళ్ళ కాయన తన మారుపేరు విడిచేసి యూరపులో నివసించడానికి వెళ్ళిపోయాడు. అక్కడ 'The Yellow Book' ను పరిష్కరించాడు. అక్కడ చిటుకులలాంటి చక్కని రచనలు కొన్ని చేశాడు: 'Grey Roses' (1895—ఆ చివరి దశాబ్దిక్షీణదశను, ఆపేరు చూడండి, ఎంత టిప్‌టాప్‌గానూచిస్తోందో!), 'The Cardinal's Snuff-Box (1900), 'My Friend Prospero' (1903). ఏమైనట్టు? మార్పువెంట స్వధర్మత్యాగం చేసే డందామా? ఈ క్రొత్త సిపాయి (రూపకాలను కలిపెయ్యడానికని) అవతలి సేనలో చేరిపోయా డందామా?

అవు నలాగే. కొంతకు కొంత. అయితే జయాపజయాలగురించి అత్యుక్తిగా మాటలాడితే 'వాస్తవికత' అనేదాని స్వభావాన్ని చాల మట్టుకు గమనించన ట్లవుతుంది. 'వాస్తవికత' అనేది అదో ముద్ర. అది లేకుండా మనం చేసేది లేదు. 19 వ శతాబ్ది మూడోయామంలో వ్రాయబడిన అనేకనవలలకు సమానమైన లక్షణాల్లో కొన్నిటిని పృథక్కరించడాని కాముద్ర పనికివస్తుంది. అయితే తక్కిన నిర్దేశాలలాగే ఇదీ ఒక అయథార్థకఠోరమైన యుక్తదర్శనం ప్రకటింప సమర్థమైనది. కాలూ చెయ్యీ కూర్చుకొన్నాక యిది సాహిత్యంలో మనలను మరీ ముఖ్యవిషయాలయెడగూడ పరాకో చిరాకో పడేటట్లు చేసి అధమములు, సామాన్యములూ అయిన కొలబద్దలకోసం అన్వేషించడానికి పూనుకొనేటట్లు చేస్తుంది. ఇందుచేతనే కాబోలు, హావెల్సు, స్టీఫెన్ క్రేన్ వ్రాసిన 'Maggie' ని (శిష్టమైన స్వాభావికవాదపు నవల అని) ప్రశంసించినవాడు (ఎవరూ చదివిపెట్టిన నవల కాదిది) ఆ క్రేనే వ్రాసిన 'Red Badge of courage' ని (దానికంటె ప్రశస్తతరమైనది, పేరంత

బాగులేకపోయినా (ప్రజామోదం బాగా పొందింది) నచ్చలేకపోయాడు. బహుశా హావెల్సుకి మిత్రు లంటే వాళ్ళ కలహాశయాలను గూడ గ్రహించ లేనంతటి వల్లమాలిన కృతజ్ఞత కాబోలు! అతడేకాని గ్రహించివుంటే, న్యూయార్కు 'జూ' (Jews) ల గురించి ప్రథమతః వాళ్ళు అణగారిన ఆర్తు లని కాక వాళ్ళు అమెరికాకు అవసరమైన ఒక వింతశోభకు, సృజ నాత్మకభావనాశక్తికి దోహదం చేయగల వైదేశికజాతి అని పరిగణించి వారిగురించి వ్రాసిన హార్లెండు విషయంలో అంత విశ్వాసం వ్యక్తం చేసి వుండేవాడు కాడు.

నిజానికి వాస్తవికత, కాల్పనికత అనేవి తత్కాలస్వభావవ్యక్తీ కరణలు. ఫ్రేంక్ నోరిస్‌ను సమర్థిస్తూ ఒక వ్యాసంలో హావెల్సు అంటాడు- అతని నవలలు అతనితరంవారి అవసరాలకు సమాధానా లని. 'ఏకాలం లోనూ ఉత్తపుణ్యానికి పుట్టడు నవలా రచయిత అన్నవాడు' అనికూడా అన్నాడు. అయితే చారిత్రకనవలాకర్త విషయంలో ఆ ఆవశ్యకతను తృణీక రించాడు. అయితే అతని అనుయాయులే తమ రచనలలో సూచించినట్లు, ఆయన పరాకునో, ఉద్దేశపూర్వకంగానోకాని, అలా అనడం పొరపాటే ననాలి. అసలు నోరిసే, వాస్తవికతలోనే వుంది నిజమైన కల్పన అని వాదించాడు. అది వట్టి మాటవరుస కాదు.

హావెల్సు చేసిన సమీక్షు ఆ కాలంయొక్క స్వస్వభావ సమీక్షా దక్షమైన లక్షణాన్ని విశదపరుస్తుంది. 'నూతనోద్యమం' అను పేరిట ప్రకాశించే సర్వకళాత్మక దృక్పథాల్లోనూ, అభిరుచుల విషయంలోనూ సంయుక్త రాష్ట్రాల కొక ప్రేరణకలిగించి నడిపిం చింది యూరప్పే అయినా, ఆ పూర్వోక్త లక్షణం మాత్రం కడమ పాశ్చాత్యప్రపంచంలో కంటె అమెరికాలోనే ఎక్కువగా ప్రతిభాసిం చింది. 1886 సంవత్సరంలో 'Little Lord Fauntleroy' గ్రంథం వచ్చింది. ఆయేడే ఎమిలీ డికిన్సను దీర్ఘవిశ్రాంతి తీసుకుంది, చికాగోలో

Haymarket Massacre జరిగిం దప్పుడే; అయేడే "పాతదేశాలింకా తాబేటి అడుగులు వేస్తూవుంటే మా 'రిపబ్లిక్కు' (అమెరికన్) ఎక్స్ప్రెస్ వేగంతో పరుగులు వారుతోంది" అని ఉద్ఘాటించిన అయస్కాంత శక్తిశాలి ఆండ్రూ కార్నెగీ వ్రాసిన 'Triumphant Demo-Cracy' (i.e., ప్రజాస్వామ్య విజయదుందుభి) వచ్చింది.

అమెరికా అతిశీఘ్రంగా మారుతోందన్న అతని మాట సత్యం. 1860 కి 1900కి మధ్య దాని జనాభా 31 మిలియన్ల నుండి 76 మిలియన్లకు పెరిగింది. మిగతా జనం పల్లెలనుండి పట్నవాసాలకు చేరడం మొదలుపెట్టింది. అనుకోకుండా హఠాత్తుగా అల్పకాలంలో పట్నాలు మొలిచాయి. అవి ఒక దశాబ్దిలో మహానగరా లయిపోయాయి. తగిన దృష్టాంతం చికాగో. అది 1833 లో 350 మంది మనుషులు మాత్రం కలిగిన పల్లె. 1870 నాటికి 350 మంది 300,000 మంది అయినారు. 1880 కి 500,000; 1890 కి మిలియను పైమాట. అంతకంతకు పెచ్చు పెరిగిపోతున్న పారిశ్రామికోద్యమ ప్రభావ ఫలితంగా మానవమానమే అంతర్ధాన మైపోయేటట్లు కనిపించింది. ఆ పారిశ్రామిక సంస్థ లన్నిటికి ఆర్థికమైన దన్ను కార్నెగీ, ఫ్రిక్, వేండర్ బిల్ట్, రాక్ ఫెల్లర్ మున్నగు మహాసంపన్నులనుండి లభించేది. వాళ్ళు ఒకని మించి ఒకడు అతికాయుడూ మహాకాయుడూ అయిపోతున్నారు. ఆ పరిస్థితి హెన్రీజార్జి (తన 'Progress and Poverty', 1879 లో వ్రాసిన్చిన 'కలవారి సభకు (House of Have), లేనివారి సభకు (House of Want) కు మధ్యగల అంతరాన్ని' మరింత పెంచింది. అసహాయులైన సామాన్య ప్రజలు తండోపతండాలుగా వలసవచ్చి న్యూయార్కు, పిట్స్‌బర్గు, చికాగో, డెట్రాయ్ట్, ఇంకా మరో పన్నెండు పట్నాల్లోనూగల గూడెములలో ఇరుక్కొంటున్నారు. అందులో చాల మంది మొదటిసారిగా నడిమియూరపునుండి, తూరుపు యూరపునుండి వచ్చినవారు. అందులో వట్టిబైతుల్లాంటి ఇటాలియన్ రైతులు, మారుమూల పోలిష్‌గూడెములనుండి వచ్చిన జ్యూలు—వాళ్ళకీ క్రొత్తప్రపం

చాన్ని తేరిచూడటానికి తగిన. దీమసం లేదు. Statue of Liberty యొక్క పీఠంమీద ఎమ్మా లాజరస్ తాను వ్రాసిన గీతంలో యూరపు నుండి అన్నాతురులై స్వేచ్ఛార్తులై వచ్చే ప్రజలకు స్వాగతం చెప్పింది. ఆ స్వచ్ఛందమైన వలసల విషయం ఉద్దేశంలో చాలా గొప్పదే కాని వాస్తవ స్థితిలోమాత్రం కాదు. అక్కడి వాస్తవ్యులుమాత్రం సామరస్యంతో యథార్థాన్ని ఆమోదించలేరు. అలాంటి బహుభాషీయ మూలప్రకృతులు గల స్థితినుండి ఒక ఏకైకమహాజాతి ఎలా ఆవిర్భవిస్తుం దన్నది ప్రశ్న. అందు కాస్థితి సమగ్రనిర్భరస్వరూపం ధరించాలి. ధరించిందా మరి? బహు కాల ప్రవాసానంతరం 1904-5లో మాతృదేశానికివచ్చిన హెన్రీ జేమ్సు 'ఎల్లిస్ఐలండు' (వలసవచ్చినవారిని గమ్యానికి చేర్చే చోటు)ను చూసి దానిని "రాజకీయసాంఘిక సంస్కారాత్మకమైన మా దేహం (దేశం) యొక్క మ్రింగుడుగుణం గోచరించిం"దని భావించి విచారించాడు. మరొకరి (అంటే తన దేశం వారి) మహత్తరానుబంధంలో పాలు పంచు కోవడానికి అన్యదేశీయులు ప్రకటించే ఆశ, హక్కు జేమ్సుకి స్వదేశనష్ట భీతిని కలిగించాయి. ఆ వెల్లివిరిసిన జాతీయచైతన్యాన్ని (స్విట్జర్, స్కాటు లలో వున్నలాంటిదాన్ని) చూసికూడా నిశ్వసించకుండా వుండలేక పోయాడు.

దేనినీ ఒకపట్టాన మెచ్చుకోలేని జేమ్సుకి అమెరికాదేశపు ప్రాచీన ఘనత బాగా అంతరించిపోయిందనిపించవచ్చు. అవును, నడుమంత్రపు సిరి పట్టిన ఘనుడు తన కూతురికి యూరపుఖామందులతో సంబంధం ఏర్పరచు కోవడంలోను, భయభ్రాంతుడైన వలసదారుడు వట్టి రాజకీయపు పోరం బోకుకి తన ఓటునివ్వడంలోను ప్రజాస్వామికాదర్శ మపహాస్యభాజన మైపోయింది.అవినీతి పట్నవాసపు రాజకీయాలకే పరిమితమైనది కాదు.అది రాష్ట్రశాసనసభల్లోనూ, అసలు ఫెడరల్ప్రభుత్వంలోనూ అభివృద్ధి పొందింది. ఇంక గ్రామాల సంగతి చూసుకుంటే అక్కడి రైతులు పట్న వాసపు పేదవారిలాగే తరచు అసంతుష్టులై వుండేవారు. ఒకనాటి సిస

లైన రైతునాయకుడు జెఫర్సను అప్రయోజకుడికింద జమ అయిపోయినా డానాడు. వ్యవసాయం రాకీపర్వతాల్లో వానలు గిరాకీ అయిన ప్రదేశం దాకా వెర్రిగా వ్యాపించిపోయింది. అసలే కోపోద్రిక్తులూ, హతాశులూ అయిన స్వస్థానగృహస్థులు వర్షాభావము, పైరుచీడలు, పచ్చికబీళ్ళు తగలబడిపోవడాలు మొదలైన ప్రకృతివైపరీత్యాలకూ, విపరీతపు బాడుగలు, తమ సరుకులకు తక్కువ రేట్లు, అప్పు పుట్టకపోవడాలూ అనే మానవకల్పితదురంతాలకూ తలయొగ్గవలసివచ్చిం దని గుర్తించారు. 1890 ప్రాంతంలో అంతవరకు జనస్థానం కాకుండా ఖాళీ వుందనుకొన్న సరిహద్దు సీమకూడ మిగల్లేదని తెలుసుకున్నారు అమెరికనులు. సంయుక్త రాష్ట్రాలకు పడమటిసరిహద్దు మిసిసిపే అనిపించుకొన్న కాలంలోనే జెఫర్సను తన దేశంలో ఇక రాబోయే వేయితరాల వారు వారి వారసుల దాకా చోటు చేసుకోగలిగివున్నారని తోడిపౌరుల నభినందించాడు. కాని శతాబ్దిలోపునే స్థలాభావం బాగా ఏర్పడిందనిపించవచ్చును. ఏమైతేనేం, నిస్సీమంగా పడమటిదేశం మిగిలివుంది అనే నిబ్బరం దబ్బరఅయింది.

తమ దేశంలో వరసపెట్టి వస్తున్న త్వరితపరిణామాలు చూసి క్లేశపడుతున్న అమెరికనులు కారణాలకోసం, సర్వరోగనివారిణులకోసం అన్వేషించారు. ఆ అన్వేషణ 'యుటోపియన్' (i.e., వట్టి భావనా జగత్తుకి సంబంధించిన ఆశాపూరితమైన ఆదర్శవ్యవస్థాచిత్రణాత్మకమైన) నవలలకు సామగ్రి అయింది. ఆనాటి వాటిలో ఎడ్వర్డుబెల్లామీ వ్రాసిన "Looking Backward: 2000-1887" అనేది నేటికీ స్మరింపబడే కొద్దినవలల్లో ఒకటి. ఆ బెల్లామీ నవలలు ప్రచురింపబడిన సంవత్సరమే i.e., 1888లో ప్రచురింపబడిన 'Credidimus Jovem Regnare.' అనే తన ఖండకావ్యంలో తాను కోరి మీటిన శ్రుతుల్లో లోవెల్ మహాశయు డంతకంటె మరీ మూలముఖ్యమైన అశాంతిని వ్యక్తీకరించాడు:

"Men feel old systems cracking under'em;
Life saddens to a mere conundrum

Which once Religion solved, but she
Has lost-has Science found?-the key."

[ప్రాతపద్ధతులు తమ కళ్ళముందే విచ్చిపోవడం గ్రహిస్తున్నారు జనం. జీవితం క్లేశావహమై ఒక ప్రహేళికలా అయిపోయింది. ఒకప్పుడు మతం దాన్ని పరిష్కరించింది. కాని (ఇప్పుడు) అదే మాయమైపోయింది. పోనీ, విజ్ఞానశాస్త్రం (Science) కనుక్కుందా ఆ కిటుకు?]

డార్విను 'పరిణామ సిద్ధాంతం' (Theory of Evolution) లో శాస్త్రవిజ్ఞానం ఆ కిటుకును కనుగొన్నదనే అనుకొన్నారు చాల మంది. హెర్బర్టు స్పెన్సరుచే వ్యాఖ్యానింపబడి ప్రచారం పొంది అది జనసామాన్యంమీదను, హేమ్లిన్ గార్లండ్, జాక్‌లండన్, థియొడర్ డ్రెయిజర్ మొదలైన యువరచయితలమీదను గాఢమైన ముద్ర వేసు కుంది. అది అందరికీ మెచ్చుగొల్పలేదు కాని సత్యస్థితికి సరిపోతున్నట్టుంది మరి. వ్యాపారసరళికి చెందిన ప్రపంచంలోను, జనసంకులాలైన నగర వీధుల్లోను మనుగడయే ఒక సమస్య, ఒక యాతన అయిపోయిన పరిస్థితికి తగిన సజీవశాస్త్రీయమైన సామ్యంకావడమేకాక ఆ సిద్ధాంత మొక పాప భారాన్ని తొలగించింది. మనుషుల ప్రవర్తనలు వారసత్వంచేతను, పరిసరంచేతను నిర్దిష్టాలైతే ఇక పాపా లన్నవి పాపాలుకావు. స్పెన్సరియన్ డార్వినిజమును నైరాశ్యవాదంగాగాని, స్తబ్ధస్వభావాత్మకమైనదనిగాని వ్యాఖ్యానించవలసిన పని లేదు. అభ్యుదయం అవశ్యంభావి అంటే ఆ పరిణామపద్ధతి పూర్వనిర్దిష్టమైనదైనా తఖరారు లేదు. అర్హతములే మనగలిగి, యత్నప్రమాదాల అనంతరం నిష్కళంక పరిపూర్ణత యేర్పడ గలిగినంతకాలం డార్వినిజమ్‌ను లాంగ్‌ఫెలో మహాశయుని 'Excelsior' (i.e., నిరంతరప్రవర్ధమానమైన) కావ్యసత్యానికి శాస్త్రంకట్టిన తాయెతులా గ్రహింపవచ్చును.

స్పెన్సరుమాటల బాసట వున్నా లేకపోయినా అమెరికనుల

కనేకుల కాకాలం యోగ కాలంగా రూపించింది. కష్టాలు గట్టెక్కి ఆశ్వే పణలనుండి సంస్కరణ మవతరించింది. అధమస్థితిలో వున్నారనుకునే పేదరైతులూ, పనివాండ్రుకూడ యూరపులో వున్న వాళ్ల సజాతీయుల కంటె దుస్థితిలో లేరుసరికదా తమ సంతతి కొక ఆశాజనక మైన భవిష్య త్తును చూపగల స్థితిలో వున్నారని చెప్పాలి. కాని పరిణామ వేగం ఉత్సాహజనకంగా వున్నా, కలవరంకూడా కలిగిస్తోంది. 'రిపబ్లిక్' దౌడు తీస్తోంది. అది అమెరికనులను చాలాదూరం లాక్కుపోయింది. దేశంలో వాళ్ళ చిన్ననాటి ప్రశాంతతను హరించింది. తాతలనాటినుండి వస్తూ వుండినవేమి వుంటే అవన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. ఇంకా పరిణామ శీలమైన రేపుమాపుల రూపురేకలుమాత్రం ముందు గోచరించాయి. కొందరి కది స్వదేశీయగతస్మృతివ్యామోహాన్ని ఉద్దీప్తం చేసింది. చాల 'స్థానిక చిత్రణ' రచనలలో ఇది సువ్యక్తమైంది. ఉన్న దున్నట్లుగా అసలు రంగాన్ని అది మళ్ళా పునరావృత్తిలేని మార్పుపొందకముందు కన్నులకు కట్టేటట్లు చిత్రించడమే వాటి పూనిక. "Befo' de War" (i.e., Before the war, i.e., యుద్ధానికి ముందు--ఇది థామస్ నెల్సన్ పేజ్ వ్రాసిన పుస్తకాలలో ఒకదానిపేరు) హృదయవేధ అన్నది ఆ కాలంలో ఒకస్థిరమైన దాక్షిణాత్యపు టావేశం. గత జీవితవైభవాలగురించి ఆ దాక్షిణాత్యుల కట్టుకథలకు దేశమంతా చెవికోసుకొన్నది; పాతమను షులకోసం, పాతవ్యవస్థలకోసం దేవులాడే నీగ్రోపరిస్థితినుండి విషాదశ్రుతి విన్నది.

"Still longing for the old plantation
And for the old folks at home."

ఈ పంక్తులు స్టీఫెన్ ఫాస్టరువి[1]. అతడు తాత్కాలికంగా చూడ

---

1. Stephen Foster (1826-64) — My old Kentucky Home, Massa's in de Cold, Cold Ground, Jeanne with the Light Brown Hair మొ॥ ఒక డజను నీగ్రోగీతప్రబంధాలు వ్రాసినవాడు.

టానికి దక్షిణానికి వెళ్ళిన ఔత్తరాహుడు. అయినా ఆ నీగ్రో హృదయంలోని విషాదాన్నర్థంచేసుకోగలిగాడాయన. అతడు (నీగ్రో) ఆఫ్రికానెప్పుడో మరిచిపోయా డిక్కడ ప్రవాసిగా (అలాగే అమెరికనులుకూడా విస్మృతమైనయూరపునుండి వచ్చిన ప్రవాసులే). ఇప్పుడు తన ప్రాత కెంటకీ నివాసానికి దూరంగా ఒక మారుమూల సౌహార్దదరిద్రమైన మరుభూమికి అమాయికంగా విసరివేయబడటంతో అతని ప్రవాసక్లేశం ద్విగుణీకృతమైపోయింది. కార్నెగీ 'ఎక్స్‌ప్రెస్' కవాటంగుండా చూస్తుండగా వెనక్కి నక్కినక్కి జరిగిపోయే దృశ్యంలా వెళ్ళిపోతోంది గతం. అమెరికనులు స్నానశాలలో నవీనతను, గ్రంథాలయంలో ప్రాచీన ప్రపంచాన్ని నచ్చుతూ మెచ్చుతూ అప్పుడప్పుడాదృశ్యాలను స్మృతులుగా నెమరువేసుకుంటారు. మరీ పడమటిసీమల్లో నివసిస్తూవుండినప్పుడు న్యూఇంగ్లండంటే మోజూ, అసూయా పడినవారు ఈనాడు సంయుక్తరాష్ట్రాల పేరు చెప్పి దాని చివికిపోయిన సంప్రదాయవిధేయ స్వభావాన్ని నిరసించారు. కాని లోలోపల దాన్ని చూసుకునే సంయుక్త రాష్ట్రాలకికూడా ఒక చారిత్రకసంపత్తి వుందని సంతోషగర్వం పొందుతూ వుంటారు.

వాస్తవికతోద్యమప్రగతిలో అన్ని తరాలూ చూసిన హావెల్సు న్యూఇంగ్లండంటే మొదట్లో తన కుండిన గౌరవం గురించి దాపరిక మేమీ చెయ్యలేదు. ఒహాయో (Ohio) లో పుస్తకాలు తెగచదివేస్తూ తన బాల్యంలోనే కవిని కావాలని నిశ్చయించుకున్నాడు. తన 23 వ ఏట బోస్టనుకి వెళ్ళేడు. అక్కడి 'అట్లాంటిక్' మాసపత్రిక అతని కావ్య ఖండిక నొకదాన్ని ఆమోదించింది. దాని సంపాదకుడు లోవెల్ అతనికొక విందు ఏర్పాటుచేశాడు. దానికి ఆలివర్ వెండల్ హోమ్సు, ప్రచురణ కర్త అయిన జె. టి. ఫీల్డ్సుకూడా హాజరైనారు. అందరూ ఆ యువకవి

నభినందించారు. ఆ విందుగురించి హావెల్సు మహోల్లాసంతో తన తండ్రి కిలా వ్రాశాడు:

"విందు నాలుగ్గంటలసేపు జరిగింది ... 'రైన్' (Rhine) సారాయంలా నాకు మంచి మత్తు కలిగించింది. లోవెలు, హోమ్సు ఇద్దరూ నాకు బాగా చేయూత నిచ్చేటట్లు కనిపించారు. కాఫీ వచ్చేసరికి హోమ్సు తమ ఉద్యమపువారసత్వంగురించి ప్రసంగం ప్రారంభించాడు. రేపుసాయంకాలం ఆయనతో నాకు 'టీ' ఏర్పాటు జరిగింది..." అలాంటి ప్రోత్సాహం లభించాక సహజంగా హావెల్సు ఫీల్డ్సుతో ఒక ప్రవక్తలా "బోస్టనువంటి మంచి ఊరు మరి లేదు. దానిని దేవుడు దీవించుగాక!" అన్నాడు. అయితే ఆ పూర్వదేశయాత్రలో న్యూయార్కు-రాష్ట్రాన్ని పరిశీలించినకొద్దీ ఆయన కనిష్టతయే కలిగింది.

'సివిల్ వార్' ఫలితంగా అమెరికా ప్రభుత్వప్రతినిధిగా ఇటలీకి వెళ్ళేడు. (అది ఆయన లింకన్‌గురించి వ్రాసిన యుద్ధకాలపు జీవిత చరిత్రగ్రంథానికి ప్రతిఫలం.) ఆనాటి అనుభవ మాయనకు యూరపియను సమకాలికసాహిత్యంతో సన్నిహితపరిచయం కలుగజేసినా (ఇక జీవితాంతమూ ఆయన ఆ పరిజ్ఞానాన్ని ఎప్పటికప్పుడు సమగ్రంగా వుంచుకొనే వాడు), యూరపుఖండం అతనిని చకితుణ్ణి చేసింది. ఒక క్రొత్తచూపు ఏర్పడి డికెన్సు, హీనె ప్రభృతులైన యూరపియనురచయితల యెడల అతని కున్న అనురక్తి శాశ్వతంగా వెనుకకునెట్టివేసింది. 1862 లో ఆయన వెనిసునుండి ఇలా వ్రాశాడు:

"మన దేశంలోకంటే యూరపులో జీవితం ఉల్లాసంగానూ, కలుపుగోరుగానూ వుంటుందని పుస్తకాలు చెబుతాయి. కాని అవన్నీ అబద్ధాలు, తెలివితక్కువమాట లంటాను నేను...అమెరికాలో అప్రతిబంధమైన వట్టి మొక్కుబడిబాపతుగాని సాంఘికానుబంధాలద్వారా అమాయికంగా మనం పొందే ఆనందం యూరపులో అపచారమైపోతుంది.

వివేకంగల స్త్రీపురుషుల కా సంగతి కొంత తెలుసు. అయితే వాళ్లు అపచారభాగస్వాములే...యూరపులా కాకుండా అమెరికా అంతకంతకీ గొప్ప అభివృద్ధి సాధించాలని నా ఆకాంక్ష. దేవుడికి నా మొఱ. నే నమెరికాకు తిరిగిరాగానే ఓరెగాన్ వెళ్లా లనుకుంటున్నాను. యూరపియను నాగరికత ప్రభావానికి వీలైనంత దూరంగా వుండి జీవితం గడపుతాను."

ఈ ఉత్తరం వ్రాసినప్పుడు హావెల్సుకి ఇంటి మమత కలిగింవనడంలో సందేహం లేదు. ఈ ఉత్తరం ఆయన తన సోదరికి వ్రాసినందువల్ల కొంత అత్యుక్తి వుండడం సహజం. అతడు అమెరికాకు తిరిగి వచ్చాక వెళ్ళింది ఓరెగాన్‌కి కాదు; 'అట్లాంటిక్' పత్రికకు సహాయ సంపాదకుడుగా బోస్టనుకి వెళ్ళివుండడం గమనింపవలసిన విషయం. అయితే అమెరికాయైకనైతికదృక్పథంగురించి ఆయన తన విశ్వాసాన్ని యథార్థంగా వ్యక్తీకరించా డనాలి. అతని చూపులో అమెరికా రూపొందించుకొన్న వస్తువు లన్నిటిలోకి గొప్పది ఉల్లాసలలిత, వివేకహేవాక అయిన అమెరికన్ బాలిక.1 ఉదాహరణకి—ఒహాయోలో మిస్‌వింగ్ అనే అమ్మాయి హావెల్సు ఒకసారి తనతో ఫోనులో మాట్లాడుతూ ఇక అది దించేస్తా డనగా—"ఉండండి మిస్టర్ హావెల్సు! మీరు వన్నడగకపోయినా మీకోసం "పాడాలనుకుంటున్నాను." అన్నది. డాక్టర్ స్మిత్‌గారి యింట పాడగా విన్నాను. ఆమె 'ఎక్సెల్సియర్' గేయంపాడిన తీరు నా హృదయాన్నాచేసింది...సరే, (ఆ ఫోనుదగ్గర) కూచుం దామె, పాట పాడింది..." అని చెప్పేడు హావెల్సు 2.

---

1. టామ్‌ఏపిల్‌టన్ (లాంగ్‌ఫెలో బావమఱది) అనే బోస్టన్ వావదూకవరేణ్యుడు 1874లో "అమెరికన్‌అమ్మాయిలకటాక్షాల్లో వుండే ఆశ్చర్యార్థకం" గురించి వ్రాశాడు.

2. హావెల్సు 'Life in Letters' (2 v., London, 1929), i. 18.

ఆ విషయాన్ని వెటకారం చెయ్యా లనిపిస్తుంది. నిజాని కలాంటి వెటకారానికి గురి అయ్యాడు హావెల్సు. అత డొకసారి ఒక ఉద్దేశం ప్రకటించాడు: "మన నవలాకర్త లెక్కువగా జీవితంలోని మహోల్లాస కరాలైన సంఘటనలతోనే నిమిత్తంపెట్టుకుంటారు. అవే బాగా అమెరిక న్ననిపించుకొనేవి...సామాన్యమైన చప్పిడిధోరణిలో పడి పోయాం అనిపించుకునే ప్రమాదం వున్నాసరే అసలైన మన గొప్పలకు తగినట్లు మనం వుండడం అవసరం" అని. ఆ యింతా ఆ ప్రకటన వేళా కోళంపాలైంది. హావెల్సును అలా ఏవో 'అద్భుత విషయాలు పుట్టిస్తూ వుంటా' డని కొట్టిపారేశాడు మెన్‌కెన్ ('An Agues Repplier in Pantaloons' అని కూడా అన్నాడు). అయితే 1860, 1870 ప్రాంతాల్లో హావెల్సు ఇంకా తన మతాన్ని రూపొందిస్తున్నాడు.అప్పట్లో అతడు చేసిన ఆ ప్రకటన లన్నీ నిండైన నిజాయతితో చేసినవే, అతనిమట్టు కవి నిరాడంబర సత్యాలే.

నిజాని కవి అతనిని వాస్తవికతకు సన్నిహితం చెయ్యడానికీ, సమ కాలికులైన యూరపియను నవలాకర్తలతో అతడు మనసార హర్షించిన అంతరంగికసిద్ధాంతాలనుండి ఆమోదయోగ్యం కాని వాళ్ళఅమిత స్వేచ్ఛను వేరుచెయ్యడానికీ తోడ్పడ్డాయి. సర్వసాధారణమైన సమాజతత్త్వంతో కూడిన అమెరికాలో వాస్తవికత అంటే రోజూ మనం చూసే మనుషుల గురించి వ్రాయడమే. దైవాద్వా ఈ సామాన్యమైన అమెరికన్ ప్రజానీకం హంతకులూ, మోహప్రేరకులూ, కన్నపుదొంగలూ, వ్యభిచారులూ కారు. అలాగని ప్రచ్ఛన్నవేషంలో వున్న ప్రభువులు కారు. తలవని తలంపుగా భాగ్యాలకు, జమీలకు వారసులైనవారూ కారు. ఊరికే గాలిమేడలు కట్టే స్వభావం గలవారుకాక సంభావ్యత గురించి ఉచితవివేకం గలవారు కనుక వారి జీవితాల్లో కొన్ని పరిస్థితు లలా కాకతాళీయంగా కలిసి వచ్చాయి.యువకులుగా యుక్తవయస్కులుగా వాళ్ళు ప్రేమల్లోపడ్డారు; పెళ్ళిళ్ళు చేసుకున్నారేకాని యెక్కడా ఏ ఇద్ద రాత్మబంధువులూ కల్తీలేని

సౌఖ్యం నిమిత్తం ఒకరికొకరు పూచీపడిన సూచనలు లేవు. పైగా హావెల్సు తనకథానాయకులకూ, నాయికలకూ నడుమ ప్రతిబంధకాలు—అవి నిజంగా ప్రతిబంధకాలనదలుచుకుంటే మాట—వున్నాయని చెప్పడానికి బాధ పడ్డాడు. అతని పాత్రలు కొన్ని ప్రేమలో పడ్డాయంటే, కొన్ని అందు లోంచి బయటపడనూ వచ్చునన్నట్లుగా వుంటాయి(ఉదా:'A Chance Acquaintance', 1873); లేక వాళ్ళ పెళ్ళికేదో ఆపద మూడ వచ్చు (ఉదా: 'A Modern Instance', 1881);ఒక తగిన అనుబంధం ఆ దంపతుల ఆప్తుల కాగ్రహం కలిగింపవచ్చు (ఉదా: 'An open-eyed Conspiracy', 1897). ఈ ప్రేమలూ, పెళ్ళిళ్ళ మాట అలా వుండగా హావెల్సు చుట్టూ చూస్తూవుండిన అమెరికనులలో తమ తమ ఉద్యోగాలూ, హోదాలగురించి సతమతమయ్యే వాళ్ళూ వున్నారు. అమెరికాలో పెద్దా చిన్నా తరగతి భేదంలేదని యెన్నడూ మభ్యపెట్ట జూచినవాడు కాడు హావెల్సు. అతని 'A Chance Acquaintance'లో కథ ఒక ఆరణ్యకకన్యను వివాహం చేసుకోవడానికి ఒక బోస్టనుయువకుడు తన పరిసరం దాటలేని పరిస్థితిమీద ఆధారపడి వున్నది. అతడు చిత్రించిన అమెరికనులకు వారి నీతినియమాలు వారి కున్నాయి. అవి సంసారపక్షంగా వుండేవే అయినా వారిమట్టు కవి యథార్థాలే. వాటి నెదుర్కోకతప్పలేదు. ఆడది తన బ్రతుకుతెరువు తాను చూసుకోవాలా అన్న దొక ప్రశ్న. అక్కర్లేదని అతని 'Dr. Breen's Practice (1881),'A Woman's Reason' (1883) అనే గ్రంథాలను బట్టి చెప్పవచ్చు. ఒక చిన్న అమ్మాయిని నడివయసువాడు పెళ్ళాడవచ్చునా అని మరో ప్రశ్న. తనకన్నా అతనికి తగిన జత అయినదాని కాయనను విడిచివెళ్ళిపోతుందొక అమ్మాయి **'Indian Summer'** (1886) లో.

హావెల్సు తన ప్రధానమైన ఆసక్తి నవలారచనలో వుందని నిశ్చయం చేసుకోగానే కలంపట్టి కాగితంమీద చిత్రించిన ప్రపంచం అది చాలమట్టు కది స్త్రీల ప్రపంచం. అతడు నవలారచనవేపు సహజంగా మొగ్గిన ట్లవు

పిస్తాడు. ఇంకా చాలా సాహిత్యప్రక్రియలున్నూ చూశాడు. పూర్తిగా కవిత్వం ఎన్నడూ మానలేదు. నాటకాలు వ్రాశాడు. బాగా చదువుకొన్నాడు. చాలా సమీక్షలూ, వ్యాసాలూ వ్రాశాడు. 'అట్లాంటిక్'లో ఓ అయిదేళ్ళు పనిచేసినంతలో దానికి ప్రధాన సంపాదకుడై కూచున్నాడు. అతని మొదటి పుస్తకాలు రెండూ ఇటలీ పర్యటనానుభవ చిత్రణలు. అతని మొదటి నవలలు యాత్రికులగురించి; లేదా వెనీసు ప్రజలతో ప్రతియోగంగా అమెరికనులగురించి. ఆ దశలో అతడు హెన్రీజేమ్సుకతి సన్నిహితుడుగా వుండేవాడు. యావజ్జీవితము మంచిస్నేహమే వుంచుకుంటూ వచ్చాడు. అయినా అది ఇద్దరూ ఒకరి నొకరు విమర్శించుకోడాన్ని అభ్యంతరం పెట్టలేదు. 1880 నాటికి వారిద్దరూ అంతర్జాతీయమైన పౌత్సుక్యోద్రేకం కలిగించిన జె & హెచ్ అనే కలిసిపోయిన సయాందేశపు కవలలవంటివారైనారు.

హవెల్సు అమెరికన్ కథారంగం గురించి శ్రద్ధవహించడం ప్రారంభించాడు. యూరపును తన మట్టుగా చేసుకోడానికి నిశ్చయించిన జేమ్సుతో సరదాగా జగడమాడుతూ వుండేవాడు. 1880 నాటికి వాస్తవికత విషయంలో కొన్ని అంశాల్లో హవెల్సుముద్ర స్థిరపడిపోయింది. వాస్తవికతావాదిని అన్నవాడి కెవడికైనా సరే మద్దత్తు ఇవ్వడానికి సిద్ధంగా వున్నాడాయన. 1882లో ఆయన అన్నాడు: "చేతికి దొరికిన 'జోలా' (**Emile Zola**) పుస్తకమల్లా చదివేశాను. ఈ క్రొత్తపంథ బహుధా ఫ్రెంచి నవలాస్వరూపంవల్లనే ప్రభావిత మైనప్పటికీ, జోలా ప్రదర్శించిన వాస్తవికతకుకాక డాడే (**Alphonse Daudet**) ప్రదర్శించిన వాస్తవికతకే వ్యాప్తి యెక్కువ వుంటుంది. దాని కొక స్వయంవ్యక్తమైన ఆత్మశక్తి వుంది. అది సాధారణంగా ఫ్రెంచినవలారచయితల ముఖ్యాశయమైన ఒక స్త్రీని ఒక పురుషుడు పశువులా వెన్నాడడమనే విషయాని కతీతంగా వుంటుంది." గట్టిగా నోరువిప్పి సంసారుల యిళ్ళలో నిశ్శంకంగా చదువుకోడానికి వీల్లేని సాహిత్యం అంటే కిట్టనివాడు హవెల్సు. అందుచేత నే

జోలాని అతిశయించడానికి పోటీపడనందుకు తన స్థితిని సమర్థించుకోవల
సిన అవసరం కనపడలేదాయనకు. అమెరికను అభిరుచివల్లనే అమెరికను
జీవితంకూడ పేరిస్‌జీవితంకంటె ఎక్కువ నాగరికంగా వుండేది. హావెల్సు
తన నవలల్లో కొద్దిపాత్రలను ఎన్నుకొని, ఏదో సామాన్యమైన కథా
దృష్టితో గాకుండా, ఒక సమస్యను నిరూపించి దానికొక పరిష్కార
మార్గం సూచించడం (ఆనందప్రతిపాదనంకంటె ఉపదేశప్రదానమే నవల
యొక్క ప్రధానప్రయోజన మనీ, అదొక వాస్తవికతావాదసూత్ర మనీ
ఆయనకు దృఢవిశ్వాసం), విషయాన్ని సురుచిరంగా, ముక్తసరిగా వివరిం
చడం అదీ థేకరీలో లాగ రచయిత పాఠకుడిమీద స్వారిచేసే పద్ధతిలో
కాక వాక్యోవాక్య శైలిలో వివరించడం, తాను కన్నవీ విన్నవీ సంగతులను
యథాతథంగా ప్రయాసపడి అక్షరపునర్భవం ప్రసాదించడం చేస్తాడు.
అతడిలో 'ప్రాతపనిమనిషి' స్వభావం కొంత వున్నా రచయితలలో ఆరి
తేరిన చేయి అనీ, విమర్శకులలో చాల ఉదారుడనీ చెప్పాలి. కాక పోతే
అంత భిన్నప్రకృతులైన మార్క్ ట్వెయిన్, హెన్రీ జేమ్సు లిద్దరితోనూ
సమంగా అంత దోస్తీగా ఇంకెవ డుండగలడు? అలాంటి పరిపక్వ బుద్ధి,
క్రొత్త నేర్పుల నాదరించే చిత్తద్రుతి గలవాడు, స్వదేశపు నైతిక
వైశిష్ట్యాన్ని స్వవిషయంగా భావించేవాడు కనుకనే ఆయన మనసుమీద
ఆనాటి సమ్మెల మురికిపేటల అమెరికా విధిగా గాఢముద్ర వేసుకుంది.

'The Rise of Silas Lapham' (1885) అనే అతని
గొప్ప నవలలో అతని శక్తి శిఖరాగ్రసీమ చేరుకొన్నది. అది ఇంకా అమె
రికన్ పారిశ్రామిక దృశ్యం అతనిని కదల్చివెయ్యక ముందు. లేప్‌హేమ్
స్వయంకృషి వల్ల వృద్ధిలోకి వచ్చిన ఒక వ్యాపారి. బోస్టన్‌లో తన
భార్య, పినెలోప్, ఇరీన్ అనే ఇద్దరు కూతుళ్ళతో కాపురం వుంటు
న్నాడు. లేప్‌హేమ్ వంశస్థు లంత మార్దవం గల మనుషులు కారు.
అయితే ఈ ఆడపిల్ల లిద్దరూ తల్లిదండ్రులకంటె చాలా నయం. ఆ
బోస్టన్‌లోనే చిరకాలంగా వుంటూవున్న 'కోరే' (Corey) కుటుంబం

వారున్నారు. ఆ యింటి యజమాని ఒక విదూషకప్రాయుడు. ఇల్లాలు కొంస్త మోటుమనిషి. కొడుకు టామ్-శక్తిమంతుడు...మనిషిలో రసం మరుగుపడిపోకుండా రక్షించే ఆవేశ మన్నది రవంత కూడా లేనివాడు. అతడు వ్యాపారంలో ప్రవేశించి లాప్ హేమ్ దగ్గర చేరినప్పటినుంచి ఆ కుటుంబాల మధ్య పరిచయం ఏర్పడింది. ఒక లాప్ హేమ్ కుర్రదానితో ప్రేమలో పడ్డాడు టామ్. ఆ కుటుంబాల మధ్య గల అంతరం హావెల్సు వస్తువుని రక్తి కట్టించింది. అది నాగరికతకూ తద్విరుద్ధతకూ అన్యోన్యత ఏర్పడడం వంటిది. చాలా సరసంగా, మనఃకర్షకంగా నిరూపింపబడింది. ఒక విందులో 'కోరే'ల యెదుట లాప్ హేమ్‌ల బండారం బయట పడు తుంది. టామ్‌తోడి లాప్ హేమ్ ప్రణయకలాపంలో ఒక పొరపాటు జరిగి నప్పటి ఆ సన్నివేశమూ అంత రాణించలేదు. టామ్ తనను ప్రేమించా డనుకొని టామ్‌తో ప్రేమలో పడుతుంది ఇరీన్. నిజాని కత డామె అక్కను ప్రేమించాడు. ఇక్కడ హావెల్సు తన సహజ నిరపాయమైన వాస్తవికవాద ధోరణిలో ఒక ప్రవక్తలా వ్రాసుకుపోతాడు. పెద్ద ప్రమాద మేమీ జరగకుండ ఒక ప్రాసంగికేతివృత్తాన్ని కలిపిస్తాడు కాని అది అంత యుక్తంగా లేదు. ఎవరికీ ఏ తఖరారూ రాకూడదని హావెల్సు సిద్ధాంతం. కాని ఎంత సున్నితంగా అయితేనేం ఆ పాత్రలలో ఒకరి మును కులు చెక్కుకుపోయాయి.

హావెల్సు కోరి పేరు పెట్టినదానికి తగినట్లుగా ఆ కథలో మరో ముఖ్యమైన సంగతి యేమంటే ఆర్థికపు చిక్కుల్లో పడిన లాప్ హేమ్ మనోవేదన. ఇక సర్వనాశనానికి సిద్ధంగా వున్న పరిస్థితిలో తన ఆప్తులకే మోసంచేసి ఏదో అమ్మ జూపి అంటిగట్టి ఆ ఊబిలోంచి బయట పడ దామా అనుకున్నాడు గాని ఆశను తట్టుకొని వట్టి చేతులతో దివాలా తీశాడు. అలా చెయ్యడంలో ముందునాట తనకున్న ఒక వాడియైన అభ్యా సాన్ని, అప్పుడప్పుడు భార్య దెప్పి పొడుపులు సిగ్గుతోపాటు తన యెలు కను నిలుకడగా వుంచిన దాన్ని కూడా విడిచిపెట్టేడు.

ఇలా ఊరికే నవలలోని కథ చెప్పినంతమాత్రాన అందులోని రచయిత నేర్పు తెల్లము కాదు. ఒక ఉదారచిత్తత, దాని పరిధిలో ఒక అసమాన నైపుణ్యమూ, ఒక ధారాళత, ఒక చతురపరిశీలనాత్మకమూ, ఆర్ద్రమూ అయిన వ్యాఖ్యానమూ కనిపిస్తాయి అందులో. హోమ్సు తమ ఉద్యమపు వారసత్వం గురించి అన్న మాట మంచి జోస్యమే అయింది. ఎందుచేతనంటే హావెల్సు చేతిలోనే బోస్టనులో రజతయుగం ఆవిష్కృతమైంది. ఆ యుగం అవకాశమిచ్చినంత మేరకు హావెల్సు హాయి సంప్రదాయాలకు దూరంగా బోస్టను యొక్క అభ్యుదయానికి కృషి చేశాడు—దాని వైదుష్యస్థితి (చిన్నప్పుడే ఒక్కసారి, ఒక రోజంతా పని చేసిన మీదట అయిదు భాషలు నేర్చుకొన్నాడు), దాని లిఖిత విషయబద్ధత, ఆర్జవము, తన కొలదు లెరిగిన దాని సరసత్వము మున్నగు విషయాలలో. 1

1880 లో బోస్టను విడిచిపెట్టి న్యూయార్కుకి వెళ్ళిపోయాడు హావెల్సు. ఆ న్యూయార్కు అభ్యుదయానికి కృషి చెయ్యడంతో హావెల్సు ఇకపై అమెరికా దేశపు సాహిత్య కేంద్రపీఠం బోస్టను కాదు అని నిరూపించాడు. అంచాత అతని న్యూయార్కు ప్రస్థానాన్ని "అమెరికన్ 'వాస్తవికత' యొక్క తొలుతటి చరిత్రలో అతి ముఖ్య సంకేతప్రాయమైన సన్నివేశం" గా అభివర్ణించాడు ఆల్ఫ్రెడ్ కజిన్. 2 న్యూయార్కు ఎప్పటికంటె యథార్థ స్ఫూర్తిమంతమైనది. 1878 నాటికి **North**

---

1. బోస్టను స్మృతుల చమత్కారం గురించి చూ. ఎమ్. ఏ. డెవుల్ఫ్ హోవే సంపాదితమైన **'John Jay Chapman and His Letters (Boston, 1937). 195.**

2. **On Native Grounds (New York, 1942), IX.**

**American Review** న్యూయార్కుకి తరలి వచ్చింది.1 మరికొన్ని పత్రికలు (**Periodicals, i.e.** నియతకాలములు), ప్రచురణ సంస్థలూ అభివృద్ధి పొందుతూ వున్నా యక్కడ. అక్కడ "చాలామంది యువ చిత్రకారులు, రచయితలూ వున్నారనీ, అక్కడ స్వేచ్ఛ తాండవిస్తోందనీ" హావెల్స నాన్న ఒక మిత్రుడితో. చేతిలో **Harper's Magazine** సంపాదకత్వం పెట్టుకుని, ఒక నవలా రచయితగా వాసికెక్కిన ఆయన తన చిత్తం వచ్చినట్లు మాట్లాడగలడు; తప్పక అతని మాటలు వినేవారుంటారు.

కాల్పనికోద్యమానికీ, ఒక క్రొత్త శత్రువుగా వచ్చిపడిన పెట్టుబడిదారీ విధానానికీ విరుద్ధంగా వాస్తవికవాదాన్ని బలపరచడం కొనసాగించాడు. అమెరికన్ జీవితంలోని యోగ్యతలను మరుగుపరిచే తెర

---

1. ఈ విషయం గురించి లాంగ్‌ఫెలో (30-10-1877 లో ఒక ఉత్తరంలో) ఇలా వ్రాశాడు: "ఆస్‌గుడ్ 'నార్త్ అమెరికన్'ను ఏపిల్టన్సు చేతిలో పెట్టేశాడు. ఇక మీదట దాని సంపాదకత, ముద్రణ, ప్రచురణ న్యూయార్కులోనే జరుగుతాయి. ముద్రణకార్యాలయంలో వున్న మిస్టర్ క్లార్కు ఆ విషయం గురించి "అది న్యూఇంగ్లండు బ్లేర్నే * రాయిని వదులుకోవడం లాంటిదే" అన్నాడు. అతడు మరికొంత ప్రాచీన కావ్యధోరణిలో "ట్రోయ్ తన పెల్లేడియమ్†ను గోల్పోయింది అని చెప్పివుండవలసింది." (శామ్యూల్ లాంగ్‌ఫెలో సంపాదించిన **"Final Memorials of Henry Wadsworth Longfellow, London", 1887, 267.**)

* **Blarney** అంటే స్తోత్రపాఠం. **'Cork'** అనే చోటుకి దగ్గరగా వున్న **Blarney** దుర్గంలో ఒక రాయి వుందట. అది చేరడం కష్టం. దానిని స్పృశించేవారి కది స్తోత్రాల ననుగ్రహిస్తుందట!

† అనగా సరస్వతీ పీఠం.

లాంటి కాల్పనికోద్యమాన్ని నిరసించడంలో అతనికి కలిగిన బాధ యేమీ లేదు గాని ఆ యోగ్యతలు పెట్టుబడిదారీ విధానం కూడా అందులో ఒక భైనప్పుడు రాణించగలవా అని. ఫిలడెల్ఫియాలో దానిగురించి విధానాత్మకంగా జరిగిన చర్చలు ధాటీగా, గంభీరంగా వున్నాయి. అలాగే బానిసతనం గురించి జరిగిన చర్చలు గూడ అమెరికాదేశం అంతటా నైతికపు, సాంఘికపు విలువల గురించి ఒక స్తిమితమైన ఆలోచన నెసకొల్పింది. కాని అంతఃకలహం (సివిల్ వార్) అంతరించేసరికి ఉదారాశయాలు తిరోహితాలైపోయాయి (హావెల్స్ అలా అనుకోవడం మొదలెట్టేడు). "ఆదర్శవాద ఊహను, తప్పితే నైతికవాది ఆత్మను సన్నికర్షించే 'సివిలు' ఉద్యోగ సంస్కరణమనే చిన్న విషయం తప్పితే మరి దేని వూనూ లేదు దేశంలో. ఎన్నడూ ఏ జాతీ ఎరగనట్టి యుద్ధం చూసిన తర్వాత చవకగా కొనడం, ప్రియంగా అమ్మడం వంటి వ్యాపారదృష్టి బాగా ప్రబలిపోయే అవకాశం (ఛాన్సు) మాత్రం వచ్చింది మనకు." ఒకనాడు హావెల్సును అతని వాస్తవికతావాద ప్రాథమిక దశలో భవ్యావిష్టుని చేసిన అమెరికా యొక్క స్నిగ్ధప్రకృతిలో, పవిత్ర స్థితిలో ఏదో ప్రత్యవాయం వచ్చింది. ఆనాడాయన అనుకొన్నట్లుగా 'అమెరికన్ జీవితం ఒక యుద్ధతంత్రము, అదృష్టపు క్రీడగా అయిపోయింది; అందులో ప్రతివ్యక్తీ పాల్గొనాలి. భయ విషమస్థితుల కెదురొడ్డాలి.' 1892 నాటి 'హోమ్‌స్టెడ్' సమ్మె మొ॥ సందర్భాల్లో వ్యక్తమైన నాటి పారిశ్రామిక పాశవత్వం ఆయన మనస్సును కలచివేసింది. వట్టి కూట సాక్ష్యంమీద 'హే మార్కెట్టు' అరాజకవాదులురితీయబడిన సంఘటన 'శాశ్వతంగా చరిత్రలో మనకు తలవంపులు ఘటించిన అతి దారుణ క్రూర కర్మ'. ఆ యింతా టాల్‌స్టాయ్ తన గురువుగా అతడు 'సామ్యవాది' అయినాడు. **'Hazard of New Fortunes'** (1890) అనే ఒక గొప్ప నవలలో స్పర్ధాళువైన సంఘం యొక్క నైతిక పతనాన్ని చిత్రించాడు. మానవ జాతి విషయంలో అకార్యకరణం గురించి టాల్‌స్టాయ్ మతాన్ని ప్రపంచీకరించాడు. అదే

సత్యాన్ని 'ధర్మఘోష' వంటిదని అతడు సంభావించుకొన్న **'Annie Kilburn'** (1889) లోను, **'A Traveller from Altrunia'** (1894) అనే 'యుటోపియన్' నవలలోను ఉద్ఘాటించాడు. ఇందులో అతడు సామ్యవాదాన్ని బలపరిచాడు. ఆ యుటోపియా పేరు సూచించే టట్లు అత డాశించినది పరార్థ ప్రాపకతత్వ ప్రతిపాదనంగా తోస్తుంది. అయితే అది ఒక రాజకీయ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకొన్నంత మాత్రాన సాధ్యపడేది కాదు.

హావెల్సు సామ్యవాదంతోడి తన సామాన్యానుబంధాన్ని ఎప్పుడూ మళ్ళించుకోలేదు. 1898 లో స్పెయినుతో జరిగిన యుద్ధోద్ధత్యాన్ని గర్హించాడు. 1607 లో **'Through the Eye of the Needle'** అనే మరో యుటోపియన్ నవల వ్రాశాడు. ఆ కాలపు మనుషుల ఆశయాలనూ, ఉద్దేశాలనూ, వాటి నుత్పాదించే సాంఘికమైన అశాంతినీ చూసి సంకటపడ్డా డాయన. టాల్‌స్టాయ్‌లాగు, "చివరికి రచయిత కూడా ఒక కార్మికుడు మాత్రమే" అని వాదించడానికి సౌముఖ్యం చూపేడు. తన వృత్తికి తాను క్షమాపణ చెప్పుకోవడం మొదలెట్టినప్పటి నుంచి (అంటే తాను రచన చేయవలసిన ఆవశ్యకతను సమర్థించుకోగలిగిన నాటినుంచి) అతడు గణనీయుడట. అయితే (రక్షించి) హావెల్సెప్పుడూ ఆ చివరి మెట్టుకు దిగేదాకా తన వ్యాసంగం కొనసాగించలేదు. అతని మాటే విశదం చేసినట్లు అమెరికాలోని అతి ప్రముఖ వాస్తవికతావాదిగా ఆయన తన బాధ్యతల గురించి ఆరాటపడ్డాడు. ఒక దివ్యోదారమైన మధ్యరకపు అమెరికన్ వ్యక్తిత్వాన్ని ఊహించాడు. 1890 నాటి అవ్యవస్థతో ఆ మధ్యరకం అంతరించిపోయినట్లయింది. సాహిత్య సత్యంగా ఎవరేనా గమనించగలదల్లా మరీ ధనికులకు నిరుపేదలకు, చెరిపే వారికి చెడేవారికీ మధ్య విభేదం. ఏ పక్షాన్నీ సరిగా నిరూపించలేక పోయాడు హావెల్సు. అతడు వ్యుత్పన్నుడు. తన పాత్రలలో వ్యుత్పత్తి లోపం గురించి వ్రాయగలడు. లోపంగానే వ్రాయగలడు కాని అనోక

పరమ సత్యమైనట్లు వ్రాయలేదు. డార్విన్ చేసిన రూపణం అతన్ని చకి తుణ్ణి చేసిందిగాని అది అతని వ్రాతల కుదో్బధకం కాలేకపోయింది. వాస్తవికతావాద ప్రతిష్ఠాపనార్థమైన యాతన గురించి చెప్పడమంటే అతని కెక్కడలేని ఉత్సాహమూ వస్తుంది. కాని జీవితమే ఒక యాతన అన్న తలంపు అతనిని క్రుంగదీస్తుంది.

న్యూయార్కుకి వెళ్ళిన తరువాత ప్రకటితాలైన తన నవలలలో చాలావాటికి డార్విన్ రాద్ధాంతంతో సంబంధం లేదని గ్రహించినవా డవటంవల్ల తన రచనల ద్వారాను, యువ రచయితలను వారి ఉద్దేశాలు, ఆశయాలు అవి తన కనిష్టాలైనా వాటిని తాను గ్రహించి వారిని ప్రోత్స హించడం ద్వారాను తన ఉద్యమాని కొక రాజీ కుదుర్చుకొన్నాడు హావెల్స్. అయితే అది యెల్లకాలం సాగిరాలేదు. ఆ వాస్తవికతావాదం యొక్క 'హయాము' వుండే అది యువ రచయితల చురుకుతనపు సుకే కారాన్ని ప్రేరేపించేటటువంటిది. సాంఘికంగా చూస్తే ఈ నవయుగం అమెరికను లంటిపెట్టుకొని వుండే నైతికాశయానికి విరుద్ధమైన దైనప్ప టికీ, సాహిత్యపగంగా చూస్తే అప్పుడు ఆ నైతికాశయాని కభ్యున్నతి కలిగింది. అమెరికను రచయితలు స్వస్థాన వేషభాషాభిరతు లని ముందే గమనించాము. అయితే ఆచరణ మాత్రం పట్టు తప్పింది. వారి భాషలో ఏదో దోషం వుంది; కాలం మరీ చప్పిడిగా వుంది; ఏ పూనికకైనా నడుం కట్టడాని కెవరూ సిద్ధంగా లేరు. ఆ పరిస్థితి చక్కబడటానికి 'స్థానిక చిత్రణ' రచనలు మంచి పని చేశాయి. అయితే ఒక ముఖ్య సందర్భంలో మాత్రం ఆ రచనలు అమెరికన్ ఆదర్శానికి ఎప్పుడూ పూర్తిగా న్యాయం చేకూర్చలేకపోయాయనే చెప్పాలి. అందులో నాయికా నాయకులు విట్మన్ మనుషుల్లా వినీతులు కారు. వాళ్ళు పేదవారైతే కావచ్చును గాని విద్యావంతులూ, వినీతులూ కావాలి. కూపర్ తరువాత అర్ధ శతాబ్ది గడిచినా ఆ సాంప్రదాయికమైన ఆశయం ఇంకా సజీవంగానే వుంది.

అయితే వాస్తవికవాదం, ప్రతిబంధకంగా వున్న అతి పరిచితమైన

ఇతివృత్తాలను వాటి మామూలు నాయికా నాయకులతో సహా విడిచి పెట్టి సంప్రదాయాన్ని ఛేదించింది. పేదసాదలను, వెనుకబడిన వారిని అసలీ సంఘ సంఘాతంలో నిగూఢంగా వున్న మానవధర్మ సూక్ష్మాన్నీ అర్థంచేసుకోడానికి ప్రయత్నించింది. తన అనుయాయుల పక్షాన హావెల్స్ చివరికి రచయితల అలవికందిన ఆ వస్తుసమృద్ధిని చూసి పొంగిపోయాడు. స్వభావవాది (లేక వాస్తవికతావాది) పట్టణంలోని పేదను, పొలంమీది రైతును పలుకరించగలిగాడు. ఇతరులు ప్రయత్నించి విరమించుకొన్న పశ్చిమప్రాంతాన్ని తానావిష్కరించాడు. అయితే ఒక అసంతృప్తి, ఒక విపరీతమైన దిగులు రచయితను చకచక ముందుకు నడిపించాయి. ఆగ్రహావేశాలతో చిత్తం వచ్చినట్లు ఒక స్తిమితస్థితి లేకుండా వ్రాసేశాడు. తానొక విప్లవాన్ని ఆవాహన చేస్తున్నాడో, ఒక పతనావస్థను విచారిస్తున్నాడో తనకే తెలీదు. తన వస్తువు జనసామాన్యమో, పౌరజనమో, అసలు కఠినమైన విధినిగళంలో తగుల్కొన్న మానవ సంఘమో ఒక నిశ్చయం వున్నట్లు లేదతనికి.

హామ్లిన్ గార్లెండు ఒకడు అలాంటి రచయిత (అతనికి **'Ibsen of the West', i.e,** '(అమెరికా) పడమటిప్రాంతపు ఇబ్సెను' అని పేరట). అతడొక రైతుబిడ్డ. ఒక పాఠశాలస్నాతకోత్సవానికి తానిచ్చిన ఉపన్యాసానికాయన 'అబ్బాయీ, పడమటికి వెళ్ళు' అనే హోరేస్ గ్రీలీ ఆదేశాన్ని విషయంగా గ్రహించాడు. ఆయనమాత్రం తనకవకాశం కలగగానే తూర్పుప్రాంతానికి వెళ్ళేడు. అంతకుముందు హావెల్సులా బోస్టనుకి వెళ్ళేడు. అపరిణతశైశవావస్థ గడచినంత అతనికి న్యూఇంగ్లండుయొక్క ప్రాచీనవైఖరి ఆశ్చర్యౌత్సుక్యాలను కలిగించింది. ఆ తూర్పుదేశంలో అతడు విద్యావ్యాసంగం (పర్యటన చేస్తూ ఒకవంక, ఉపన్యాసాలిస్తూ ఒకవంక విషయం సేకరిస్తూ) చేసిన కాలంలో అతని నాకర్షించింది కాల్పనికతత్వం కాదు; స్పెన్సర్, హెన్రీజార్జ్, విట్మన్, టెయిన్, మాక్స్ నోర్డో ఇంకా ఎవరివైనా సరే సజీవంగా కనిపించే రచనలు మాత్రమే

అతని నాకర్షించేవి. పైలాపచ్చీసు ప్రాంతంలో వ్యాసాలూ, కథానికలూ వ్రాయడం ప్రారంభించాడు. ఆశలతో, సిద్ధాంతాలతో, నిందలతో సుళ్లు తిరిగిపోయేది అతని మనసు. ఆ స్థితిలో ఆయన హావెల్సును, జేమ్సును చిన్న చూపు చూశాడు. లోవెల్ ను, హోమ్సును తలిమ్మా కరుడుగట్టిన సాహిత్య గీర్వాణులను ('Fossil representatives of Classicism) ఏవగించుకొన్నాడు. 27 వ ఏట ఒక గొప్ప గ్రంథంలో 'సాహిత్యప్రజాస్వామికము' ('Literary Democracy') నకు సామాన్యప్రజలను పట్టంగట్టాలనుకొన్నాడు. అప్పటికి హావెల్సుగురించి తన కున్న అభిప్రాయాన్ని పునఃపరిశీలన చేసుకున్నాడు. ఈ దురభిమాని అయిన యువకుడిని చేరదీశాడు హావెల్సు. అతడిని తన మౌలికమైన అపేక్ష ప్రేరేపించినట్లుగా స్వకీయ ప్రాంతంగురించి, నాగరికతయెడల దాని కున్న రోషమాత్సర్యాల గురించి, అక్కడి దుర్భరదారిద్ర్యంగురించి, అకాలంగా వార్ధక్యానికి గురి అయ్యే స్త్రీజనంగురించి వ్రాయవలసిందిగా ప్రోత్సహించాడు హావెల్సు. పశ్చిమప్రాంతజీవితాన్ని నిర్లిప్తంగా పరిశీలించిన అమెరికనులలో ఇతడే మొదటివాడు కాడు. ఎడ్వర్డ్ ఎగిల్స్టన్ (Edward Eggleston) వున్నాడు. అతడి 'The Hoosier School-Master' (1871) అనే పుస్తకం గార్లెండుని చిన్ననాడే బాగా ఆకర్షించింది. ఇంకా మరొకటున్నది-ఎడ్గార్ డబ్ల్యు. హోవె అనే 'కాన్సాస్' (Kansas) వార్తాపత్రిక సంపాదకుడు వ్రాసిన 'The Story of a Country Town' (1883). అది అతని ముప్ఫయ్యో ఏట అచ్చయింది. అయినా హతాశుడైన ఒక వృద్ధుడు వ్రాసినదానిలా వుంది. అయితే విసువెత్తిన తన జీవితపు సంతోషదారిద్ర్యంనుండి బయటపడాలనే ఆశమాత్రం అందులో మిగిలి వున్నట్టు కనిపిస్తుంది. ఈ వికారకరిన నిర్బంధాత్మకమైన నవలలో ఒక పాత్రచేత ఇలా అనిపిస్తాడు హోవే:

"పశ్చిమప్రాంతీయుడు నాలుగుపైసాలు కూడేసుకోగానే బతకడానికి తూరుపుదేశం వెళ్ళిపోవడం గమనించలేదూ నువ్వు? ఏమిటి దాని

అర్థం? అతనిచేత డబ్బు గణింపజేసిన ఆ సుగుణమే అక్కడి (తూర్పునాటి) సంఘం మనదానికంటె మెరుగుగా వుందనే ఉద్బోధం కలిగిస్తోం దనడం కాక మరేమిటి?...అభివృద్ధి పొందుతూ హాయిగా వున్నవా ళ్లెవరూ ఈ పడమటికి రారు. వచ్చేదల్లా దరిద్రనారాయణులూ, దౌర్భాగ్య దామోదరులూ, నిరాశ్రయులూ, వ్యాధిగ్రస్తులూ - ఒక్క మాటలో చెప్పాలంటే వట్టి అలగా జనం. ఈ దేశంతోపాటు తామూ అభివృద్ధి పొందాలని వచ్చారు. తామే దేశంనుండి వచ్చారో ఆ దేశంలో దానితోపాటు తాము పెరగలేకపోవడమే అందుకు కారణం."

కొద్ది సంవత్సరాల అనంతరం గార్లెండు ఒక విలేఖరితో ఇలా అన్నాడు:"ఆ స్వేచ్ఛావనిలో ఏదోఅద్భుతగుణంవుంది.పశ్చిమం మనుషుల్ని ఆకర్షిస్తోంది. కాని అదంతా వట్టిదని నిరూపించా లనుకొన్నాను నేను."

1887 లో మళ్ళా ఒకసారి తనవారిని చూద్దామని ఆయన అక్కడికి వెళ్ళినప్పుడు అక్కడి రైతువాడు తన చరిత్రలో ఒక ఘోరాతిఘోరమైన ఘట్టంలో వున్నట్టు గమనించాడు. హొవే రైతులు మాత్రం వాళ్ళకాడికి కాస్తనయంగానే ఉన్నారు. గార్లెండు రైతులుమాత్రం ఋణపీడలో నలిగిపోయి వున్నారు. హొవేకంటె గార్లెండే గొప్ప రచయిత. రైతుల దౌర్భాగ్యానికి (తా నెలాగో తప్పించుకుపోయాడు దాన్ని) కలిగిన హృదయస్పందనం ద్వారాను, వాస్తవికతా వాదపు సూత్రాలను అమలు జరపడం వల్ల కలిగిన ఉద్రేకం ద్వారాను ఆయన తన లోటుపాట్లను కప్పుకోగలిగాడు. తన రస్తా కతడు **'Veritism'** (యథార్థవత్వము) అని పేరు పెట్టుకొన్నాడు. మరేం లేదు, తనను చకితుని చేసిన జోలా స్వభావవాదానికీ, హవెల్సు మొ॥ వెనుకటి తరంవారి వాస్తవికతావాదానికీ మధ్య నెక్కడో తా నున్నట్టు సూచించడానికే. అతని వ్రాత పెటుకుగా వుంటుంది. సున్నితమైన సంభాషణ నడపగల నాదస్వాదాత్మ అతనికి లేదు. కాని **'Main-Travelled Roasd'** (1891) అనే కథల

సంపుటిలో ఒక హృదయవిదారకమైన పరిస్థితిని చాలా ఆర్జవంతో, హుందాగా వర్ణిస్తాడు. ఆ వర్ణన అతని తలిదండ్రులను గూడ కలచివేసింది. అందులో అతని రైతువాడొక డంటాడు: "నాలాంటివాడు వట్టి నిస్సహాయుడు. బెల్లపునీటి బానలో పడిన ఈగలాంటివాడు. గింజుకున్న కొద్దీ కాళ్ళు నలిగిపోతాయి."

గార్లెండు బహుగ్రంథకర్త. తరువాతి గ్రంథాలలో **'Populism'** (హెన్రీ జార్జి చెప్పిన కరపరిహార విధానాలు, **i.e., single tax remedies**) గురించి ప్రచారం మొదలుపెట్టి తన కథలను పాడుచేయసాగేడు. అయితే క్రమంగా అతని సద్విషయానురక్తి తగ్గిపోయింది. అతని పుస్తకాల చలామణీ పడిపోయింది. హవెల్సు ప్రభృతులైన వాస్తవికతావాదుల అభిప్రాయానికి తానెంత విలువ ఇచ్చుకున్నాడో అంత ప్రతిష్ఠ తనకీ రావాలని ఆరాటపడ్డాడు. 1900 నాటికి హవెల్సులాగే అమెరికాయొక్క నవ్యవికాసంతో (మనస్సు పూర్తిగా సమాధాన పడకపోయినా) సర్దుకుపోవడాని కలవడ్డాడు. అప్పట్లో పశ్చిమం అతని నాకర్షించింది. అంటే అయోవా, సౌత్ డకోటా మెట్టభూములు కాదు; రమణీయమైన రాకీ పర్వతప్రాంతం. అది మిథ్య అయినాసరే తథ్యంగానే గ్రహించాడాయన. దాని గురించి తెగ రాసిపారేశాడు. తన బాల్యం గురించి కూడా వ్రాశాడు. అయితే పిదప పుస్తకమల్లా మొదటి దానికంటె చమత్కారంగా వున్నా, చేవ తగ్గిపోతోంది. అతడూ, హవెల్సూ చాలా కాలం జీవించారు. కాని ఎంత గడించినా, ఎంత ప్రశాంతంగా వున్నా వాళ్ళ వార్ధకం వారి వెనకటి గొప్ప రచనల సత్తువతో రాజీపడలేకపోయింది. వాళ్ళ వెనుకనే వచ్చిన మరికొందరు రచయితల స్వల్పకాల జీవితాలు చూసుకుంటే చాలా తేడా కనిపిస్తుంది. స్టీఫెన్ క్రేన్ తన 29 వ ఏట, ఫ్రేంక్ నోరిస్ 32 వ ఏట, జాక్ లండన్ 40 వ ఏట, హెరాల్డ్ ఫ్రెడరిక్ (అతని **'The Damnation of Theron Ware**

(1896)-ఇది 'Illumination' అను పేర ఇంగ్లండులో ప్రచురింపబడింది- అనే ఒక్క నవల నిమిత్తంగానైనా వీళ్ళలో చేరతాడు) 42 వ ఏటా మర ణించారు.

1883 లో క్రేన్ **'Maggie—A Girl of the Streets'** అనే ఒక చిన్న విషాదాత్మక నవల ప్రచురించాడు. ఆ పేరే ఆ నాటి సాహిత్య ప్రపంచాన్ని దో స్తీకి గాని, కు స్తీకి గాని పిలిచింది. ఒకప్పు డతనిచే తన 'సాహిత్య పితలు' గా పరిగణింపబడిన హావెల్సు, గార్లెండూ అతని పక్షం అవలంబించి తాము చేయగలిగిన సాయం చేశారు. అప్పుడే ప్రకటితాలైన ఎమిలీ డికిన్సను కావ్యాల గురించి చెప్పాడు హావెల్సు. క్రేన్ కూడా కొన్ని వ్రాశాడు. అవి చకచ్చకితంగా, ఒక ప్రత్యేకత, మనం అనుకోని భావచిత్రాలు, విశేషణాలూ కలిగి వుంటాయి. ఎమిలీ డికిన్సను, వార్తాపత్రికా చమత్కార చతురుడు ఎంబ్రోజ్, బీర్సునల ధోరణులు కలిసిపోయిన ట్లుంటాయి. క్రేన్ కూడా వార్తాపత్రికల మనిషే. ఒక ఖండికలో ఆ విషయం ప్రస్తావించాడు కూడాను:

**"A news paper is a court**
**Where everyone is kindly and unfairly tried**
**By a squalor of honest men."**

[వార్తా పత్రిక ఒక కోర్టు (వంటిది). అక్కడ సత్యప్రియులందు అధముడైన వాడిచేత ప్రతి వ్యక్తీ మంచిగాను, చెడుగాను విచారణకు గురి అవుతాడు.]

అయితే ఇవన్నీ స్వభావవాద పరిణామంలో ఆనుషంగిక విష యాలు. క్రేన్ చనిపోయాక, 'మేగీ' రచన "అతని ఉత్తమ కృషి" అని సంభావించాడు హావెల్సు. దాని గురించి క్రేన్ అనుకొన్న దేమంటే - "లోకంలో పరిసరమన్న దొక గొప్ప విషయం. అది జీవితాలకే ఆకృతు

తేర్పరచగలదు అనే సత్యాన్ని 1 చూపడానికి ప్రయత్నిస్తుంది మేగీ" అని. స్వభావవాదపు చరిత్రలో ఇదొక ముఖ్యమైన వక్కాణం.

దాని కాలం విషయం ప్రసక్తమైనది. కాని పాతకాలపు సినిమా లాగు చాలా విడ్డూరంగా వుంది. అతని కావ్యఖండికలలో లాగే అందు లోని ప్రముఖవిశేషం వివరణాత్మకపదజాలం. దానికీ, వెనుకటిస్వభావ వాదానికీ సంబంధ మేమీ లేదు.

క్రేన్ కథలలోను, అతని సివిల్ వార్ ఉత్తమకృతి (**Master Piece**) అయిన **'The Red Badge of Courage'** లోను వున్న ఆ విశేషాన్ని హోవెల్సు ఆమోదించలేదు. యుద్ధమన్నది అప్పటిదాక అమెరికన్ వాస్తవికతావాదులచేత వస్తువుగా స్వీకరింపబడలేదు. భీషణత్వం, బీభత్సం, మానవహృదయంమట్టునవుండే పాశవికతాస్ఫూర్తి ఇవన్నీ కలిసి

---

1. చాలామంది రచయితలు మేగీ జోలా వ్రాసిన **L' Assommoir** చే ప్రభావితమై వుండాలని సూచించారు. కావచ్చు కాని సన్ని హితంగా చేతికందే విషయాన్ని గమనించడం మంచిది: బ్రూక్లిన్ మతాచార్యుడు డెవిట్ టాల్మేజ్ చేసిన ప్రసంగాలు విశేష ప్రచారం పొంది 1885 లో **'The Night Side of New York Life'** అను పేర పునర్ముద్రణ పొందేయి. ఒక ఉపన్యాసంలో ఆయన తన సామాజికులను 'మేగీ' అనే ఒక నిరుపేద బోగంపిల్లను కనికరించవలసిందిగా కోరుతాడు. ఆత్మరక్షణార్థం ఆమె కొక్కటే గత్యంతరం వుందట. " 'ఈస్ట్' నదికి దారితీసే వీథి, అర్ధరాత్రి, ఓడరేవు చివర, నీటిలో నిండు జాబిల్లి, నిజంగా లోపల తగినంత లోతు వుందా అని ఆమె ఆశ్చర్యపోయే టంత సున్నగా ప్రకాశిస్తున్నాడు. నిజంగా వుంది. ఆమె దూకడం గుర్తించడానికి దగ్గర్లో పడవవా డెవడూ లేడు..." - ఇదిగిలాగ క్రేన్ మేగీ జీవితం చాలిస్తుంది.

యుద్ధాన్ని ఆధునికోద్యమపరిణామాని కొక ప్రముఖవిషయాన్ని చేశాయి. ఈ 20 వ శతాబ్దిలో చాలామంది మనుష్యుల కేదోఒక విధంగా దాని అనుభవం కొంత వున్న దనడం స్పష్టపడిన సత్యం. 'The Red Badge' వ్రాసినప్పటికి క్రేన్ కలాంటి అనుభవం లేదు. అంతఃకలహం అతని తరం వారిని, తరువాతితరాల అమెరికనులను మోహపెట్టింది. అది వారి సొంత యుద్ధం; ఏ యూరపియనూ ఎరగనిది, సరిగా అర్థంచేసుకోలేనిదీను. అదో కొత్తరకం యుద్ధం. కేవలం సామాన్యప్రజల యుద్ధం. ప్రవీణుల యుద్ధం కాదు. అది ఛాయాచిత్రాల కెక్కినదీ; కర్మాగారాలూ, రైలుదారుల మీద ఆధారపడినదీ, సుదీర్ఘరక్తపాత నానాజుగుప్సావహమైనదీ, చమత్కారదరిద్రమైనదీను. ఆ యుద్ధంలోనట "జోడులోనుంచి, నాడాలో నుంచికూడా బొబ్బ లెక్కిపోయాయట!" అంటాడు మెల్విల్.

ఆనాడు క్రేన్ తన నవలను రైతుల కడగండ్లనుండీ, ఆ మహానగరంలోని హెచ్చుకుందులనుండీ కాదు; యుద్ధవిషయంనుండి తయారు చేశాడు—చిన్నదైనా అద్భుతమైనదాన్ని.అందులో పాత్రల సంవాదాలు స్వభావవాదసంవాదులు. (ఉదా: (We've helt'em back; derned if we haven't); 'కథానాయకుడు' హెన్రీఫ్లెమింగ్. అతిసామాన్యుడైన యువకుడు. చదువుసంధ్యలు లేని రైతుపనివాడు. అతని పేరుకూడా సగం నవల అయ్యేదాకా తడవబడలేదు. అతడూ, అతని మిత్రులూ ఒంటరిబ్రతుకులుగా ఆ న్యూయార్కుమహానగరంలో మేగీలాగే అసహాయులు. ఎవడూ సంపాదించిన దేమీ లేదు. అంతా అయోమయం, అవ్యవస్థ. ఏలాటి వీరత్వం లేక నాయకత్వం ప్రదర్శిత మైనదీ వాళ్ళ సామూహికగర్వం, పగ, ఆపాతకోపం తెలియజేస్తాయి. అయినా ఆ నవలను స్వాభావికతావాదనిదర్శనంగా తీసుకుని చర్చించడం దాని అంతరస్థితిని గ్రహించకుండాపోవడమే అవుతుంది. భయమంటే ఒక వ్యక్తిగతమైన ప్రతిస్పందనం క్రేన్ మనస్సును ముందుగనే లోగొన్నది. అందుచేతనే ఫ్లెమింగ్ మాటతీరునుబట్టి మొద్దువాడుగా కనిపించినా వాడు

లోపల పడే క్షోభ చూస్తే అది మనసు, బుర్రలో దినుసు గలవాడు పడి నట్లే ననిపిస్తుంది. (ఈ తేడా అసలు వ్రాతప్రతిలో ఉన్నంత స్పష్టంగా అచ్చుపడినపుస్తకంలో లేదు.) క్రేన్‌కి యుద్ధదృశ్యమన్నా మంచి ఉత్సాహమే. దాన్ని రంగుకీ, రసానికీ స్పందించే చిత్రకళా కావ్యకళా కారుల చిత్తస్థితితో అభివర్ణిస్తాడు. గాయమట 'ఎర్రని లాంఛన' మట **(Red Badge)**! భయమంటే 'రక్తహరితవర్ణాంచితరాక్షసు'డట! ప్రతీ భావనా వాడిగా, కంపరమెత్తించేటట్లుగా, భీషణరమణీయంగా వుంటుంది:

"పగటి దూతలా వచ్చిన పర్యెరకు నెత్తిమీద కదలాడే ఆకులను తేరిపారజూచాడు...

బాకా లొకదానివెంట నొకటి సిగ్గులేని పందెపుకోళ్ళలా ఎలు గిచ్చినవి...

దూరాన నున్న ప్రతిపాద ఒక జ్వాలాప్రరోహసంవలితచిత్రమైన స్తబ్ధరోమంవలె కనిపిస్తోంది..."

యుద్ధం భయంకరమైనదే అయినా, ఆ యువకుడు చివరికి భయ విముక్తుడై యుద్ధాంతమూ అలాగే వున్నాడనే అంత విశ్వసనీయంకాని ఉద్దేశంతో ఆ పుస్తకం ముగుస్తుంది. మొత్తానికీ సురుచిరకృతి సారాంశం ఏమంటే—ఈ ప్రపంచమంతా వ్యవస్థలేని ఒక వస్తువు; మనిషికీ మనిషికీ మధ్య ఆర్ద్రమైన అనుబంధం ఏర్పడడంలోనే దానికి గతి అంటూ ఒక టుంటుంది అని. **'The Open Boat'** అనే క్రేన్ ఉత్తమకథానిక లోను ఈ ఉద్దేశమే పునరుద్ఘాటింపబడింది. ఆ కథ ఆయనకు స్వయంగా అనుభవసిద్ధమైన ఒక నౌకాభంగసన్నివేశాన్ని పురస్కరించుకొని వ్రాయ బడింది.

అయితే అప్పుడప్పు డొక పరిహాసపుమాట ఆ మధ్య దూరి ఆ ఉద్దేశపు హుందాను చెరుపుతూవుంటుంది:

"పడవమట్టున నున్న చల్లని హాయిగొల్పే సముద్రజలాన్ని తాకిన వెంటనే ఆ పత్రికావిలేఖకుడు, నోరు సర్వసామాన్యవాయుప్రసారంతో నిండివున్నా, తాను నిద్రలో మునిగిపోయాడు."

ఎక్కడైతే 'ప్రపంచోపకరణసామగ్రి' (**'The furniture of the World'**) రెండు దీపాలను కలిగివుంటుందో, 'అలా కాకపోతే తరంగాలు తప్ప మరేమీ వుండదో' ఆ తీరంవేపు జరిగే ఆల్కగావున్న తమ పుట్టిలో వేరుచేయబడిన మనుషులకు సహజమైన మార్దవానికీ, అందరూ గండం గడిచి గట్టెక్కేసమయంలో అందులో ఒకణ్ణి ముంచేసే సముద్రుని నిర్లక్ష్యమైన క్రూరత్వానికీగూడ అది చక్కని తార్కాణం.

ఈ ఉదాహరణలు క్రేన్‌లో ఏమాత్రం కాల్పనికభావన వున్నదీ, ఆ ప్రక్క (పత్రికారచయితగా) నదెంత పరుగులు తీసే చక్కని మనుష్య నిరసనస్వభావమున్నదీ విశదంచేస్తాయి. అతడు క్యూబాలోను, గ్రీసులోను యుద్ధవార్తావిలేఖకుడుగా వున్న ఆ తెరిపిలేనికాలంలో ఆ రెండు ధోరణులూ పెనవడి వ్యక్తమయ్యాయి.

అమెరికన్‌రచయితల విషయంలో వార్తాపత్రికల మనిషిగా పాత్ర వహించడ మొక వైశిష్ట్యం. వింతవింత విపత్కరప్రదేశాల్లో తిరుగుతూ, అసలువిషయానికి లోపలా బయటా వుంటూ, విట్మన్‌ధోరోలకంటె ఎక్కువబాధ్యతకు గురికాక, ఏకాంతంగా అపరిచితసందర్భాల్లో తన్ను తాను పరీక్షించుకుంటూ వుండే విలేఖకుడివిషయంలోగూడా ఆ వైశిష్ట్యం వుంది.

ఫ్రేంక్‌నోరిస్‌కూడ క్యూబాలోను, దక్షిణాఫ్రికాలోను యుద్ధ విలేఖకుడుగా పనిచేశాడు. అతడినీ వాస్తవికతావాది అనిగాని, స్వభావ వాది అనిగాని ముద్రవెయ్యడానికి వీలులేదు. అతడు తన భార్య కిచ్చిన **'The Octopus'** ప్రతిమీద **'Mr. Norris, Esq. (The Boy Zola)!'** అని వ్రాసుకున్నాడు. కాని ఒక స్నేహితునితో అత

డానవలగూర్చి "నేను చేసినవాటిలో కెల్ల అది గొప్ప 'కాల్పనిక' విషయం" అన్నాడు. ప్రకటితమైన అతని రచనలలో మొదటిది ఒక ప్రాచీనమైన కవచంగురించిన వ్యాసం. అత డప్పటికి కవచానికి బీర్స్ ఇచ్చిన నిర్వచనం—"అది మనిషిచే ధరింపబడే ఒకరకమైన దుస్తు. దానిని తయారుచేసే దర్జీ వాడు కమ్మరివాడు" అనేదాన్ని ఎరిగి పర్యుత్సుకుడై వుండడు. కాని అతని మొదటినవలలు—**Mc Teague (1899), Vandover and the Brute** (1914, కీర్తిశేషు డయాక), **Moran of the Lady Letty** (1898-ఇది ఇంగ్లండులో **'Shanghaied'** అను పేర ప్రకటితమైంది) అనేవి స్వభావవాదచిహ్నాలు సమృద్ధిగా కలిగి వున్నాయి. వాటిలో **vital** (ఆవశ్యక), **real** (యథార్థ), **elemental** (ప్రాథమిక), **bestial** (పశుప్రాయమైన) మొ॥ విశేషణా లనేకం కనిపిస్తాయి. అందలి పాత్రలు పరిస్థితులను ప్రతీకల్లా వుంటాయి. వాటి ఆంతరప్రకృతులు పశుప్రాయంగా వుంటాయి. కాస్త ఒత్తిడికలిగే సరికి పశుత్వాన్నే ప్రదర్శిస్తాయి.

డార్వినియన్ సాహిత్యోద్దేశంలో వున్నట్టుగాఒకదానివెంట ఒకటిగా ఆశానిరాశావాదాలూ, ఒకానొకవిజాతీయతా కలిసి నోరిస్‌ను హెన్రీ హార్లెండుప్రభృతులకోవ కెక్కిస్తాయి. అవన్నీ అతడు పెద్దపెట్టున ప్రారంభించి సమాప్తిచెయ్యని **The Wheat** అనే త్రివిధవిషాదాత్మకమైన గ్రంథంలో (**'trilogy'**) చూడనగును. ఆ మూడవభాగ మసలు వ్రాయబడనే లేదు. రెండవభాగం—చికాగో గోధుమవ్యాపార కేంద్రం గురించి ఘాటైన రచన—ఆయన పోయాక 1903 లో **'The Pit'** అను పేర ప్రచురింపబడింది. **'The Octopus'** (1901) లో కాలిఫోర్నియాలోని గోధుమపంటగురించి, రైతులకు రైలుదారివాళ్ళతో వచ్చిన జగడం, వారి గొంతునొక్కిన ఉదంతంగురించి వ్రాశాడు. ఆ జగడం వారి జీవిత వైఖరినే మార్చివేసింది. ఆ మార్గాని కడ్డువచ్చినవారందరూ హత మారిపోయారు. రైతులంతా కలిసికట్టుగా దాన్ని ప్రతిఘటించారు.

కాని, హృదయం లేని యంత్రానికి బలిఅయిపోయారు. గ్రంథాంతంలో ఒక హేమంతసాయంతనం శాన్‌ఫ్రాన్సిస్కో పురవీధుల్లో ఒక రైతువితంతువు తన చంటిపిల్లతో, చేత చిల్లిగవ్వ లేక, ఆకలితో అలమటిస్తూ తిరుగుతుంది. పాపం, చివరి కొకచోట చదికిలబడుతుంది; చస్తుంది. అదే వేళప్పుడు ఆ నగరంలోనే ఒక రైలుదారుల అధికారి చేసిన ఘనమైన విందు ఆ ప్రక్కనే వర్ణితమైంది గ్రంథంలో.

ఇదంతా మూలాన్ని కదలదీసే తీవ్రమైన వ్రాత. అయితే గ్రంథం చివర్లో కనిపించే నిశ్చయవాదం (లేక విధివిధాన విశ్వాసవాదం, i.e., determinism) వస్తుచమత్కారాన్ని కొంత దిగదీసింది.

ఉదా: ఒక యువకవికీ, రైలుదారుల అధ్యక్షునికీ మధ్య నడచిన ప్రసంగం చిత్తగించండి :

"మనుషులతోగాదు, రెండుశక్తులతో మనకు ప్రమేయం—గోధుమ, రైలుదారి. వాటిని పరిపాలించే పద్ధతి ఒకటున్నది: ఇచ్చుబడి, అక్కఱ (Supply and demand). ఆ వ్యాపారంలో మనుషులు చేసే దేముంటుంది? అతిస్వల్పం."

ఈ మాటలు ఆ కవికే కాదు పాఠకుడికికూడా నచ్చజెప్పడానికుద్దేశింపబడ్డాయి. అయితే చివరికి 'అభివృద్ధి' అనే శక్తి ఉత్కర్ష ప్రతిపాదనం చేయడంతో నోరిస్ కారుణికదృక్పథాన్ని పొందగలిగాడని చెప్పాలి. ఒక అవాంతరకథలో అతడిది వ్యక్తంచేశాడు. ఒక గుప్త తత్వం గల కోనారి (Shepherd) వుంటాడు. వాడు చనిపోయిన తన ప్రియురాలిగురించి ఖేదపడుతూ వుంటాడు. ఆమెను మళ్ళీ కూతురి రూపులో గుర్తిస్తాడు. అసలు చావన్నది లేనేలేదని తీర్మానించుకుంటాడు ఎలమంద. మానవప్రమాణంలోలాగే, అంతకంటె అధికతరంగా గోధుమ పంటపొలాలావిషయాన్ని విదితంచేస్తాయనుకుంటాడు:

"Untouched, unassailable, undefiled, that mighty world-force, that nourisher of nations, wrapped in a Nirvanic Calm, indifferent to the human swarm, gigantic, resistless, moved onward in its appointed groves..."

[అస్పృష్టము, అనాక్రాంతము, అకలుషితమూ అయిన ఆ మహా జగచ్ఛక్తి ఆ ప్రజాసముజ్జీవిక నిర్వాణప్రశాంతిపరీతమై అలక్ష్యనరసంఘమై అత్యద్భుతంగా నిరాఘాటంగా నియతక్షుణ్ణమార్గంలో పురోగమించింది.]

నోరిస్‌విషయంలో అతని ఆలంకారికరచనావిన్యాస మంత దృఢమైన నేపథ్యం కాదు. The Octopus లోని ఊరికే ఉబ్బిపోయిన ఘట్టాల్లోంచి ఏవో నాలుగుపంక్తు లుదాహరించడ మంటే దాని ఆఖ్యానశక్తి కన్యాయం చేసినట్లే అవుతుంది. క్రేన్ కాడికి కాస్త తీసిపోయినా, సిద్ధాంతసంబంధమైన అవ్యవస్థ వున్నా, ఆయనరచనలు మాత్రం అవశ్యపఠనీయాలే. అతడూ యువజనోచితమైన శక్త్యుత్సాహాలు గలవాడు. అతని బుద్ధివక్రతకే అతడిని మెచ్చుకుంటారు.

జాక్‌లండన్, నోరిస్‌తోటి కాలిఫోర్నియావ్యక్తి; నోరిస్‌కంటె ఎక్కువ సమర్థుడు; తక్కువకల్తీ గలవాడు. నీషే (Nietzsche), కార్ల్‌మార్క్స్ (Karl Marx) ధోరణులకు సంఘర్షణ అతని చాలా కృతుల్లో కానవస్తుంది. అయితే సోవియట్‌పాఠకు లతనిని అప్టన్ సింక్లెయిర్ (Upton Sinclair) తోపాటు చేర్చి ఆ యిద్దరినీ అమెరికను నవలాకర్తలలో అగ్రగణ్యు లనడాని కాసంఘర్షణ యేమీ ఆటంకం కాలేదు. సాగరసంబంధాలైన సాహసకృత్యాలు (అందులో కొన్ని నిషిద్ధాలు), సామ్యవాదమహోద్యమం, క్లాండైక్‌బంగారపురద్దీ, లండను మురికిపేటలు, హార్స్ట్‌ప్రెస్ (Hearst Press) తరఫున రష్యాజపాను యుద్ధపరిశీలన—ఈ మొదలైన, ఇంకా అనేకాలైన అనుభవా లతని ఆ

యింత జీవితకాలంలోకి చొచ్చుకువచ్చాయి. మళ్ళా అనేకగ్రంథాల రూపంలో బాహిరిల్లేయి. అతిమానుషవ్యక్తి - అమానుషవ్యక్తి, మహా సంగ్రామం—తోడేళ్ళ దాడి, నోర్డిక్ (Nordic) ప్రజల మతోద్యమం—పెట్టుబడిదారీవిధానపువినాశం — కలగాపులగంగా కనిపించే యీ విషయాలను నిగ్రహంలేని కుతూహలంతో, నిపుణంగా, నీరవంగా అచ్చుపడిన శబ్దాలతో చేసిన ప్రకటనధ్వనిలా రచనలో నిబంధిస్తాడు. 'The Iron Heel' (1907) అనే అతని సామ్యవాదనవలలో కథానాయకు "లోక లోకోత్తరపురుషుడుగా, నీషే అన్నట్లు ఒక అందమైన జంతువుగా, ప్రజాస్వామ్యప్రబలవిరోధిగా" చిత్రింపబడ్డాడు. ఇదంతా హాస్యాస్పదంగా కనిపిస్తుంది. కాని అందులో ఆకర్షణీయమైన చాతుర్యం వుంది. ఆ చాతుర్యంలో నైశిత్యంమాత్రం తక్కువ. అత డన్వేషకుడే గాని, ఆత్మభ్రాంతికి లోనైనవాడు. వట్టి బండరచయిత. కాని అతని పత్రికరచనపడికట్టులు, కండగల మగసిరిగల మాటలూ చదువరికి మంచి చవిగొల్పుతాయి. అతను తొందర్లో వ్రాసిన సందర్భాలలో గూడ కవిత్వపు పలుకు కనిపిస్తుందికాని కవిత్వసాధన కతడు తీరికగా కృషి చేయ లేదు. స్థాలీపులాకంగా ఒక్క ఉదాహరణ తీసుకుందాం అతని 'A Daughter of the Snows' (1902) నుంచి :

"The rainbow-wall curled up like a scroll, and in the convulsions of the scroll, like a bee in the many folds of a magnificent orchid, Tommy disappeared."

[ఆ రంగుజెండాలు కాగితపుచుట్టలా చుట్టుకొన్నాయి ; దాని ముడతలలో, అందమైన కదంబపుష్పం పొరపొరల్లో తుమ్మెదలా, టామీ అంతర్ధానమైపోయాడు] టామీ నిజంగా చాలా పిరికిపందయే, చావాల సిందే; కాని అంత గొప్ప చావు చస్తాడని ఎవ రనుకోగలరు? ఇలా ఆ వర్ణన

అంతా ఏటివరదమట్టున మంచుపలకక్రింద పడిపోయిన మానవాకృతిలా అద్భుతస్ఫూర్తిమంతంగా వుంది.

పిదపకాలపు వాస్తవికతావాదం - స్వభావవాదం గురించి తాను నచ్చి ప్రజలకు నచ్చజెప్పడానికి చాలా పాటుపడవలసి వచ్చింది హావెల్సు. బహుశా ఎర్ర రక్తపు ఆటవిక ప్రకృతుల గురించి జాక్ లండను చేసిన ఉద్ఘాటనం గాని, నోరిస్ చేసిన న్యాయమైన స్త్రీపురుషభేద ప్రతిపాదనం (ఉదా: Mc Teague లో లాగ) గాని అవి తథ్యమైనవి, సిసలైన అమెరికనుతనం గలవీను. కాని వాస్తవికతావాదం హావెల్సు యొక్క నైతికపరిధి పరిమితి నతిక్రమించిపోయింది. ఆ విలువలకే స్థానభ్రంశం పొందేయి. ఇక మరి మంచీ-చెడు అనే మాట పోయి దుర్బలము, దృఢము అనే అర్థాలే మిగిలేయి. పరిస్థితిపైకి లేవగలిగినవారు కొద్దిమందే వుంటారు. అధిక సంఖ్యాకులు-అందును పురుషులకంటె స్త్రీలు-దానికి బానిసలు. అయినప్పటికి హావెల్సుకి బదులు నోరిస్ తన సమ్మతిపై రక్షింపబడ్డాడు. జాక్ లండన్‌లో నీతి జాడలు మాత్రం వున్నాయి. దృఢచిత్తాలైన తన పాత్రలను మెచ్చుకున్నా, నీరసాలను నిరసించాడు. కాని, ఇక థియోడర్ డ్రెయిజర్ విషయ మొకటి వున్నది. అతడిని హావెల్సు ఆమోదించలేక పోయాడు. నోరిస్ తా నొక ప్రచురణకర్త కోసంగాను డ్రెయిజర్ మొదటి నవలను (Sister Carrie) చదువుతున్నప్పు డతని సంగతి ఉత్సాహంతో గుర్తించాడు. కాని ఆ ప్రచురణకర్త ఎందుకో తన ఉద్దేశం మార్చుకొని ఆ నవల అచ్చువెయ్యడం మానేశాడు. ఇంగ్లండులో అది 1901 లోనే అచ్చయినా, అమెరికా దాన్ని చూడడానికి మరి ఏడేళ్లాగవలసి వచ్చింది. అప్పుడు "తీవ్రములైన ఆక్షేపణలే ప్రశంసలను మించిపోయాయి" అంటాడు డ్రెయిజర్. ఆ తరువాతి పుస్తకాలకూ అలాంటి గతే పట్టింది. అంచాత 1920 దాక నవలారచయితగా డ్రెయిజర్ కేమీ ప్రతిష్ఠ ఏర్పడలేదు. అప్పటి కతనికి సగంవయసు చెల్లిపోయింది. బూతు రచన అనే ఆరోపణమీద జేమ్సు బ్రేంచ్ కేబెల్ వ్రాసిన 'Jurgen'

(1919) విషయంలో లాగ అసలతని శక్తి యేపాటిదో అన్న విషయం మరుగున పడిపోయింది. మెన్కెన్ (Mencken), అతని అనుయాయులూ వున్నారంటే వాళ్ళు జనామోదం పొందడంకోసమని ఎంత చచ్చు పుస్తకాస్తన్నయినా సమర్థించుకొంటారు. కిట్టనివారి ఆక్షేపణనే దాని గుణంగా ఎత్తి చూపుతారు.

'Sister Carrie' రివాజు వారీ లక్షణాలనుబట్టి అది స్వాభావిక వాద పక్షానికి చెందిన గ్రంథ మనిపించుకుంటుంది. 'కేరీ' ఒక పేద పల్లెటూరి పిల్ల; కాని అందమైనది. చికాగో చేరుతుంది. అక్కడ మొదట ఒక వ్యాపారయాత్రికు డామెకు మరులు పురెక్కిస్తాడు. తరువాత ఒక హోటల్ మేనేజరు ప్రలోభపెడతాడు. మొదటి ప్రకరణానికి 'The Magnet Attracting: A Waif Amid Forces' అని పేరు. కేరీ తన్ను తాను పోషించుకోలేకపోతుంది. ఆమె ప్రియులూ పోషించలేకపోతారు. అందులో రెండోవాడు డబ్బు దొంగిలించి, ఆమెను న్యూయార్కు తీసుకుపోతాడు కాని తాను చెడతాడు. డ్రెయిజర్ తన 'The Financier' (1912) లో - మన ఇచ్ఛకు ప్రమేయం గల స్వభావాన్ని మలుచుకోవాలనే ఇచ్ఛ మనకు, లేక మన లోపాలకూ బల హీనతలకూ మన ఇచ్ఛతో ప్రమేయం లేక బాధలకు గురి అవుతున్నాం మనం అంటాడు. మనమంతా ప్రేమకోసం, శక్తికోసం దేవులాడుతాము. ఎక్కడో కొందరు - ముఖ్యంగా 'The Financier', దాని ఉత్తర భాగం 'The Titan' (1914) లోని ప్రధాన పాత్రలా అంతశ్శక్తి సంపన్ను లుంటారు. కాని, వాళ్ళు అపవాదప్రాయులు. ఎక్కువమంది జీవితకాళీకరాళ జిహ్వకు చేతు లందిచ్చేవారే. ఈ విషయాన్ని డ్రెయిజర్ ఇంకా విపులంగా తన 'An American Tragedy' (1925) లో చిత్రికపడతాడు. అందలి ప్రధాన పాత్ర ఒక బీదబాలుడు. దారిద్ర్య భారంతో క్రుంగిపోయినవాడు. తనవల్ల గర్భవతి అయిన ఒక అమ్మాయిని-తన మార్గాని కవరోధంగా వున్న దానిని తొలగించుకుని జీవిత మహేంద్ర

జాలంలో ప్రవేశించాలనుకుంటాడు. చేసిన హత్యకు ఫలితంగా ఉరికంబాని కెక్కుతాడు. వాడు హత్య చేశాడా అంటే లేదు. ఆ అమ్మాయి సగం ప్రమాదవశాత్తూ చనిపోయింది.

అక్లైడ్ గ్రిఫిత్స్ - ఆ ఉరితీయబడినవాడు నిజానికి నిర్దోషిగా విడవదగినవా డన్న సూచన పుస్తకంలో లేదు.అసలు వాడి కేం జరగాలో డ్రెయిజర్ కి తెలిసినట్లు లేదు. విమోచనావకాశాలు లేదని మాత్రమే ఆయన చెప్పగలడు. దాని కెవరు బాధ్యులు? అందరినీ అనవచ్చు; ఎవరినీ అనడానికీ లేదు. అలాంటి పరిస్థితి అది. అయితే అమెరికాదేశపు నైతిక సాంఘిక స్మృతులూ, సాంప్రదాయిక నవలా సాహిత్యమూ మానవ స్వభావానికి సంబంధించిన సత్యాలను తప్పుగా ప్రకటించాయని డ్రెయిజర్ విశ్వాసం. కేరీ తన అవినీతి ప్రవర్తనకు శిక్ష పొందలేదు. అదే ఆ నాటి పాఠకజన ప్రపంచం అయితే ఆమెకు శాస్తి చేసి వుండేవారు. ఆమె నిజంగా డ్రెయిజర్ కి సోదరి అయినట్లుగానే, ఎవని భార్య అయిందో తాను అతనిచేత బాగా ఆదరింపబడుతుంది. 'Jennie Gerhardt' (1911) అనే మరో పతిత ఆ పుస్తకంలో అందరికంటె తానే ఉత్తమంగా ప్రవర్తిస్తుంది.

డ్రెయిజర్ కి నవలాకర్తగా గల తాహతు గురించి తగినంత వివాద వుంది. అతడు చాలా కాలం చిన్న పాత్రికేయుడుగా వుండినప్పటి లాగానే ఆ నవలలను గూడ ఊకదంపుడుగా, డాబుసరిగా వ్రాస్తాడనీ, అతని తాత్త్విక దృష్టి మరీ వట్టి నామరూపాలు లేకుండా వుంటుందనీ (అతడది మౌలికమైన దనుకొన్నప్పటికీ), అతని పుస్తకాలు నిరాకార నిరంజనంగా వుంటాయనీ విమర్శకులు వాదించారు. ఇర్వింగ్ బేబిట్ 'An American Tragedy' ని 'అది చదివితే బాధ కలిగించే నవలే' అని ఒప్పుకుంటూ విషాదాంతం మాత్రం కాదని కొట్టిపారేశాడు. గ్రంథకర్త పాఠకులను అనవసరంగా ప్రయోజనం లేనిదానికి బాధపెట్టే డన్నాడు.

'Reality in America' (అమెరికాలోని యథార్థత) అనే వ్యాసంలో లయొనెల్ ట్రిల్లింగు—పేరింగ్టన్ ప్రభృతులు డ్రెయిజర్‌లోని ఘోరతలోపాలనుగూడా మెచ్చుకున్నారనీ, దానికి కారణం అపండితులుగా కనిపించగలిగే అమెరికన్ రచయిత లంటే వారికి వున్న మిథ్యా గౌరవమే అనీ అంటాడు. మరోవంక డ్రెయిజర్ అంటే నిజంగా మోజు పడేవారు అతనిలో వున్న వికారాలు భరింపదగినవిగానే వుంటాయనీ, అస లవి అతనిపాలిటి కొక సంపత్తిలాంటివే ననీ అంటారు. ఎలా గను కొన్నా ఒకటి స్ఫురిస్తుంది మనకు—డ్రెయిజర్ (ఇంగ్లీషు పేరులా వినిపించని పేరుగల మొదటి ప్రముఖ అమెరికన్ రచయిత యితడే) ఈ నవీన యుగపు అమెరికా జాతీయతా సౌరభం చూరగొన్న నవలారచయితలలో ప్రథముడని చెప్పాలి. (యూరపు ప్రసక్తి అతని గ్రంథాల్లో రాదు.) స్వాభావికమైన తన కథాజగత్తులో నాన్యతోదర్శనీయమైన కరుణరసపుష్టి ప్రదర్శించిన నావలికులలోను ఈతడే అగ్రగణ్యుడు.

అమెరికను లిష్టపడినా పడకున్నా డ్రెయిజర్ విషయం వారిపాలిటి కొక ప్రత్యేక ప్రాముఖ్యం గల దనేమాట అవశ్యం అంగీకార్యం. యూరపియను లతని నవలలను చక్కని ఆసక్తితో చదవగలరు. అమెరికనుల కవి తమ యింట్లోనే తమ కుటుంబంలోనే జరిగిన సన్నివేశాలుగా భాసించి అతని అనుభూతిలో పాలుపంచుకోగలుగుతారు (అతడు వ్రాసిన సాంసారికవిషయా లనేకం అతని కుటుంబంలో జరిగినవే). ఆయన ఆలంకారిక రచనాడంబరంనుండి, హావెల్సు, నోరిస్, జాక్‌లండన్‌ల రచనార్భాటంనుండి అమెరికనుల కొక హాయిగొల్పే విశ్రాంతిని ప్రసాదించాడు. అలాగే నాగరికపు నాజూకులనుంచి, రివాజులనుంచి, యూరపియను సాహిత్యం చూసి తమ్ము మోటువారిగా భావించే, తమ చతురోక్తుల నర్థంచేసుకోలేని, తమ జీవితవిధానం సమర్థించుకోడానికి వీల్లేనిదే అయినా హాస్యాస్పదం కాదనే కవచప్రాయమైన విశ్వాసానికి దారిచూపించే ఒక

వింతమనుషుల మధ్య తా మున్నట్లుగా చిరంకాలంగా అనుకొనే పరిస్థితి నుంచి అమెరికనుల కొక మోక్షమార్గం చూపించాడు. ఆ విధాన మేమిటో (అమెరికను జీవనవిధానం) డ్రెయిజర్‌కి తెలుసు. అందులోని యథార్థత, గజిబిజి, ఆ వ్యూహాల్లాంటి పురవీధులు, కట్టడాలు, పొలాలు, నదులు, రైలుదారులు, భాండారాలు, హోటళ్ళు, రుచులు, ఉష్ణస్థితులు, ఉద్యోగాలు, పాటలు, పలుకుబళ్ళు ఒకటేమిటి అన్నీ తెలుసాయనకు. E. M. Forster అన్నట్లు అనుభవం పాలిటి కొక సత్యం వున్నట్లుగానే భావనకీ ఒక సత్యం వున్నది. డ్రెయిజర్‌ది అనుభవసత్యం; సన్నివేశగతమైన సత్యం. దౌర్భాగ్యవశాత్తు ఈ జీవితాని కొక తీరూ తెన్నూ ఎలా లేదో అతని నవలలకీ లేదు. అయితే అవి జీవనంలేనివి కావు. బోస్టను విడిచి న్యూయార్కుకి వెళ్ళిపోయేటప్పుడు బహుశా హావెల్సు అనుకోకుండా కనుగొనడానికి పూనుకొన్న ఒక క్రొత్త అమెరికాదేశపు రూపురేఖలు కనిపిస్తాయి డ్రెయిజర్ రచనలలో. ఆ అమెరికాను హావెల్సు ఆమోదించలేదంటే డ్రెయిజరూ ఆమోదించలే దన్నమాటే. అయితే డ్రెయిజర్‌కి దాని సంగతి అతనికంటె బాగా తెలుసు.

# 10

## దేశాంతరగతులు

హెన్రీ జేమ్సు (1843-1916) :

అభిజనము న్యూయార్కు. ఇంటి వద్దను, యూరపులోను (1855-8), రోడ్ ద్వీపంలో (Rhode Island) న్యూపోర్టునగరంలోను విద్యాభ్యాసం. హార్వర్డులో న్యాయశాస్త్రం అభ్యసిస్తూ రచనావ్యాసంగంలో పడి దానికి స్వస్తి చెప్పేడు. తన కేంబ్రిడ్జి) మసాచుసెట్సు) నివాసానికీ యూరపుకీ మధ్య పర్యటిస్తూ విమర్శాత్మకరచనలు, చిన్నచిన్న నవలికలూ (Novelettes) వ్రాయడం ప్రారంభించాడు. 1875 నుంచి జీవితాంతం అతడు యూరపులో వున్నట్లే. మధ్యలో 1880 ప్రారంభంలో ఒకసారి, 1904-5 ప్రాంతంలో ఒక యాత్రాసంబంధమైన గ్రంథరచనకు పూనుకొని సామగ్రిని సిద్ధంచేసుకునేటందుకొకసారి సం. రాష్ట్రాలకు వెళ్ళేడు. 1889 నుంచి 1895

వరకు నాటకవ్యాసంగంలో మునిగిపోయాడు. లేకపోతే జనసామాన్యాన్ని ఉర్రూతలూగించిందిగా చెప్పుకోదగింది అతని రచన లన్నిటిలో ఒక్క 'డెయిసీమిల్లర్' (1879) అనేదే అయినా అతడు ప్రధానంగా తన శక్తిని నవలా రచనలోనే కేంద్రీకరించి వుండేవాడు. 1910-11 లో ఆఖరుసారిగా అమెరికా వెళ్ళివచ్చాడు. మొదటి ప్రపంచ సంగ్రామం ప్రారంభమైన దనగానే సంచలించిపోయాడు. తానూ యుద్ధంలో పాల్గొనడానికిగాను ససెక్సునుంచి లండనుకి తన మకాం మార్చేడు. 1915 లో బ్రిటిషు పౌరుడుగా గుర్తింపబడ్డాడు. చనిపోవడానికి కాస్త ముందుగా ఒక యోగ్యతాపత్రిక (ఆర్డర్ ఆఫ్ మెరిట్) ను పొందేడు.

## ఎడిత్ వ్హార్టన్ (1862-1937) :

ఆభిజనము న్యూయార్కు. ఈమెది గొప్ప పరపతిగల కుటుంబం. తగిన సంబంధం వచ్చేదాకా పెళ్ళికిముందు ఇంటివద్దనూ, యూరపులోనూ అధికవ్యయాని కోర్చి చదువు కొంది. రచయిత్రి కావడానికి గల సాధకబాధకాల నెదుర్కొంటూ వుండగా ఈమెకు సాంఘికపరిస్థితి చాలా ఇబ్బంది కలిగించింది. 1907 పిదప తన రోగిష్ఠి భర్తకు విడాకు లిచ్చేసి, ఎక్కువగా యూరపులోనే కాలక్షేపం చేస్తూ, తరచు దేశాటన గావిస్తూ యాత్రాగ్రంథాలు, నవలలు, కథానికలూ వ్రాసింది. మొదటి ప్రపంచసంగ్రామ కాలంలో ఫ్రాన్సులో సహాయకార్యక్రమానికి మనఃపూర్వకంగా తనజీవితాన్ని అంకితం చేసుకుంది.

### హెన్రీ ఏడమ్సు (1838-1918) :

జనసం బోస్టను దగ్గర. హార్వర్డులోను, జర్మనీలోను విద్యాభ్యాసం. అంతర్యుద్ధ (సివిల్ వార్) కాలంలో ఇంగ్లండులో అమెరికా మంత్రిగా వున్న తండ్రివద్దనే కార్యదర్శిగా వుండేవాడు. చక్కని రచనలు కొన్ని చేసిన తర్వాత రాజకీయరంగం గురించిన తన ఆశలు మానుకుని వాషింగ్టను వదలి హార్వర్డుకు పోయి అక్కడ చరిత్ర శాఖలో ఆచార్యుడుగావుంటూ 'నార్త్ అమెరికన్ రివ్యూ'కి సంపాదకత్వం వహించాడు (1870-7). 1872 లో మేరియన్ హూపర్‌ని వివాహం చేసుకుని తరువాత మళ్ళా కొంతకాలం వాషింగ్టనులో నివసిస్తూ వచ్చాడు. కాని 1885 లో ఆమె ఆత్మహత్య చేసుకొన్న తరువాత మన శ్శాంతి గోల్పోయి ప్రపంచమంతా పర్యటించడం మొద లెట్టేడు. అప్పుడప్పుడు వాషింగ్టనుకి వస్తూ పోతూ, తరచు ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా తన స్నేహానుబంధాలను పాటించుకుంటూ వుండేవాడు.

### గర్‌ట్రూడ్ స్టీన్ (1874-1946) :

జనసం పిట్స్‌బర్గ్‌లో, ఒక జర్మనీ - యూదు సంపన్న కుటుంబంలో. చదువు కాలిఫోర్నియా, యూరప్, హార్వర్డ్ ప్రక్కనున్న రేడ్‌క్లిఫ్, బాల్టిమోర్‌లోని జాన్ హాప్‌కిన్స విద్యాలయాల్లో. సామాన్యపు చదువయి పోయాక 1902 లో తన సోదరునితో పేరిస్‌నగరానికివెళ్ళి అక్కడే స్థిరపడిపోయింది. అక్కడొక కళాక్షేత్రం వంటిది నెలకొల్పి, ప్రచురణయోగం పొందినా పొందక

పోయినా నిదానంగా రచనావ్యాసంగం సాగిస్తూవుండేది. ఆమె కృతులు : 'జాగ్రఫీ అండ్ ప్లేస్' (Geography and Plays, 1922); 'లూసీ చెర్చ్ ఎమియబ్లీ' (Lucy Church Amiably) అనే నవల (1930); 'ఫోర్ సెయింట్స్ ఇన్ త్రీ ఏక్ట్స్' (Four Saints in Three Acts) అనే పేరుతో వర్జిల్ థామ్సన్ సంగీతానుగతంగా వ్రాసిన ఒక గేయరూపకం (Opera Libretto, 1934); 'పికాసో' (Piccasso, 1938); 'పేరిస్ ఫ్రాన్స్' (Paris France, 1940); 'వార్స్ ఐ హేవ్ సీన్' (Wars I have Seen, i.e. నేను చూసిన యుద్ధాలు, 1945).

వాస్తవికతావాదు లోకరోకరే అమెరికాను నిజంగా ఒక గద్య కావ్యంలా, అంటే సురుచిరానుభవశూన్యమైనదానిగా పరిగణింప బోతూ వుండిన కాలంలో చాలమంది అమెరికా రచయితలు మరొక విధంగా భావించేవారు. అప్పట్లో కాల్పనికోద్యమాభినివేశ మొకటి ఒక విలక్షణమైన ఆకర్షణ కలిగించినట్లు కానవస్తుంది. మార్క్ ట్వెయిన్ గతం గురించి వ్రాయడాని కుత్సహించాడు. అటు లండనునుండి బ్రెట్ హార్టె, ఇటు వాషింగ్టను (డి. సి.) లోనే వున్న జోక్విన్ మిల్లరూ అనుకొన్నట్లు వాళ్ళెరిగిన పరిస్థితిలో కంటె మెరుగ్గానే వుందని చెప్పాలి అమెరికను పాశ్చాత్యఖండ మంటే. సరిక్రొత్త వింతపోకడలు పోయిన హెన్రీ హోర్లెండు, ఎడ్గార్ సాల్టస్, జేమ్స్ హునెకెర్ లవంటి అమెరికన్ పోకుల రాయళ్ళు (బాడ్ లెయిర్ ను భ్రమపెట్టిన పనిలేని హెర్క్యులస్ వంటి పోకిల్లా స్వరూపం జోలాలు, జాక్ లండన్లతో సమానంగా ఆధునికమైన ఉద్యమానికి చెందింది), మరికొందరు అమెరికా రచయితలే వున్నారు— హోర్లెండు వ్రాసిన 'యెల్లో బుక్' ప్రపంచంతో వాళ్ళ పోలిక అంతంత

మాత్రమే అయినా అతనిలాగే బతకడాని కని యూరపుచేరినవాళ్ళూ, కాకపోతే చూసొద్దామని పెద్దపెట్టున బయలుదేరినవాళ్ళూ. ఎందుకైతే నేం, వాళ్ళకి యూరపు మరీ బాగా వున్న ట్లనిపించింది; నచ్చింది. ప్రవాసులన్నా, దేశాంతరగతులన్నా వాళ్ళే. పైకి కనిపించే వాళ్ళ విప్లవాత్మకధోరణి స్వదేశీయసోదరులను చాలా కలవరపెట్టసాగింది. 1920 ప్రాంతాని కల్లా దేశాంతరవాస మన్నది అమెరికా రచయితల కొక స్వాభావికమైన 'తరహా'గా పరిణమించింది. ఆ పరిణామం ఎంతలాంటి దంటే—ఈ సూత్రానికి లక్ష్యభూతుడైన మేథ్యూ జోసఫ్‌సన్ అన్న మాటలు చిత్తగించండి, తెలుస్తుంది :

"వైజ్ఞానికులు వలసవెళ్ళడ మన్నది కీలు సడలిపోయినట్లు పట్టించు కోవలసిన సంగతేనా? ఎప్పటికంటె చాలా తరచుగా మన విజ్ఞులు విస్తృతావకాశాలు గల ప్రపంచంలోకి మరింత స్వేచ్ఛగా ఊపిరి పీల్చు కోడానికని బయల్దేరిపోతున్నారు". 1

అసలు అమెరికనులంటే యూరపుకి క్రొత్తవారని కాదు. ఆ ప్రాత ప్రపంచాన్ని చూడాలని వుండడం సహజం. అయితే మొత్తానికి అంత ర్యుద్ధం అయిపోయేదాకా అమెరికను లక్కడే స్థిరపడిపోవడానికంత యిచ్ఛగించేవారు కాదు. హాథార్న్ ఇంగ్లండును 'మా పూర్వపు టిల్లు' అన్నాడే కాని ఆ పేరింటి తన పుస్తకంలో మాత్రం తరువాతితరంవాళ్ళ కున్నంత ఆంగ్లతామమకారం ఏమంత ప్రకటించలేదు. దాని పీఠికలో "మే మెంత పూసుకు తిరుగుదా మనుకొన్నా ఆంగ్లేయు డెవ్వడూ అమెరి కాను మొగమోటానికైనా లక్ష్యపెట్టేవాడు కాదు" అన్నా డాయన.

అంతర్యుద్ధానంతరం యూరపు నోసారి చూచిరావడ మన్నది

---

1. Portrait of the Artist as American (New York, 1930), 294.

అమెరికా యెడల అదో అవిధేయతగా భావించేవారు కాదు చాలామంది. డబ్బుంటే సరి దానికి. అసలీ పర్యటన అన్నది దేశసంపన్నతకు సంబంధించినది. 1891 లో న్యూయార్కు రేవులో తొంభై వేలమంది కేవు చెల్లించారు. అమెరికా నాటికే సంపన్నదేశ మనడాని కది చాలు. అలాంటప్పుడు అమెరికా బహుముఖాల తనప్రతిష్ఠను విస్తరింపజేసుకోవడంలో ఆశ్చర్యమేముంటుంది? అలాగే సార్జంట్, వ్విజ్లర్, మేరీ కస్సాట్ మొదలైన అమెరికన్ కళాకారులూ, హెన్రీ జేమ్సు, ఎడిత్ వ్హార్టన్, హెన్రీ ఏడమ్సు, ఫ్రేన్సిస్ మెరియన్ క్రాఫర్డ్, హోవర్డ్ స్టర్గిస్, స్టువర్ట్ మెర్రిల్, గర్ట్రూడ్ స్టీన్, ఎజ్రా పౌండ్ మొదలైన అమెరికన్ రచయితలూ ప్రాగ్దేశ పురోగాములు కావడం అసహజం కాదు. అందులోకీ యూరపులో స్థిరపడిపోయినవా రసలు అసాధారణమైన 'ప్రపంచ పౌర' దృక్పథం గలవారు. ఇందుకు సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో అమెరికను దంపతులకు పుట్టి, అమెరికాకు పోయే ముందు రోమ్‌లోనూ, పేరిస్‌లోనూ నివసించిన హోర్లెండు విషయ మొక దృష్టాంతం. హెన్రీ జేమ్సుకి చిన్నతనంలోనే యూరపుతో పరిచయ మేర్పడింది. ఎడిత్ వ్హార్టన్, మెరియన్ క్రాఫర్డ్, స్టర్గిస్, మెర్రిల్ మొదలైనవా రంతా అంతో యింతో యూరపులో పెరిగి పెద్దవాళ్ళయినవారే. లేండరూ, బ్రౌనింగ్సూ ఏ మాటా పడకుండా విదేశాల్లో స్థిరపడగలిగినప్పుడు అమెరికన్లు మాత్రం అలా చేస్తే విమర్శ కెందుకు గురి కావాలి? నిజాని కలాంటి విమర్శ విమర్శ కాదు; వెంగలితనం. దానికి మేథ్యూ జోసఫ్‌సన్ మొదలైన వాళ్ళ యొనుగొత్తులు కూడా అంతకంటె వాటంగా లేవు. ఇంతకీ యూరపులోనే నివసించాలనుకోవడాన్ని జనసామాన్యం విడ్డూరంగా పరిగణించడం తప్పలేరు. థియోడర్ రూజువెల్టంతవాడే జేమ్సుని వట్టి పనికిరాని కుర్రనాగమ్మ అనేశాడు. (అ యింతా జేమ్సు కూడా రూజ్‌వెల్టుని పట్టుకుని కేవలం ఒక అపూర్వ వాచాలత యొక్క రాక్షసావతారం అని వర్ణించాడు). ఈ 'చమత్కారాలు' మోటుగా కనిపించినా కొంతవరకు సరియైనవే

అనాలి. ఎంచాతంటే ఆ ప్రవాసులకీ తమ దేశమంటే 'తోపల స్వయం పాకాలు' కొన్ని వున్నాయి. ట్వెయిన్, మెల్విల్, ఎమిలీ డికెన్సనుల కంటె ఎక్కువగా స్వీయసంస్కృతికి బాహ్యులు కాకపోతే కాకపోవచ్చును గాని వాళ్ళు అలా దూర దూరంగా 'ఒంటికోటి రామ లింగాల్లా' వుండే తీరు చూస్తే అసహ్యం వేస్తుంది.

అయితే ఈ ఆక్షేపణ లేవీ అద్భుత ప్రతిభాశాలిదైన హెన్రీ జేమ్సువంటి రచయిత స్వరూపాన్ని సరిగా నిరూపించలేవు. ఒకసారి 1889లో అతని సోదరుడు విలియమ్ సోదరి ఎలైస్‌కి రాస్తూ "మన హెన్రీ చేసే ఆంగ్లీకరణ లన్నీ కేవలం రక్షరేకుల్లాంటివి. అతడు నిజంగా అమెరికాదేశ వాస్తవ్యుడని నే ననను గాని జేమ్సు వంశీయుడు; తనది అని చెప్పుకోదగ్గ దేశం మరొక టేదీ లేనివాడు" అని తన అభిప్రాయం వ్యక్తీకరించాడు. హెన్రీ ఒక విశిష్టమైన మంచీ మర్యాదా గల కుటుం బానికి చెందినవాడు. అతని తండ్రి తన బిడ్డలను నిశిత స్వభావులుగా, అంటే ఏడుపు మొగాల్లా కాకుండా, ఆశావాదులనుగా, అలాగని విషయలోలురు కాకుండా, స్వతంత్ర యోజనాశీలురైన కార్యదక్షులనుగా, కుటుంబం లోని తక్కినవారు సౌహార్దంతోటే అయినా నిర్దాక్షిణ్యంగా ఇచ్చే సల హాలను పాటించేవారినిగా తయారు చేశాడు. ఉత్తమ ఫలితాల నిచ్చిం దతని కృషి. అయితే అది కొన్ని చిత్రమైన తెగుళ్ళు ఆ బిడ్డలను చుట్ట బెట్టుకునేటంతవరకూ తెచ్చింది. విలియమూ హెన్రీల విషయంలో తప్పని సరిగా ఆ తెగుళ్ళు కొంత పని చేశాయి. అందరినీ అతిశయించాలనే అభినివేశమైతే రేకెత్తించాయిగాని తమ కృషికి తగిన రంగమేదో నిర్ణయించుకోవడంలో కొంత చిక్కు కలిగించాయి. ఒకసారి నిర్ణయించు కున్నారా మరి వాళ్ళను ఎడతెగని ప్రయత్నంనుండి విరమించుకోడానికి వీల్లేకుండా చేసింది వాళ్ళ కుటుంబ పరిస్థితి.

హెన్రీ తన అభిమాన కర్మక్షేత్రంగా సాహిత్యాన్ని ఎన్ను

కొన్నాడు. ప్రారంభంలో వాస్తవికతావాదాభిముఖంగా వ్యాసంగం సాగించాడు. 'అట్లాంటిక్' పుటల్లో తన ప్రసక్తికవకాశం కలిపించిన మిత్రుడు హవెల్సులాగే తానూ ఉత్పాద్యేతివృత్తం గల నవలను దాని కున్న స్వరూప ప్రమాణాలతోనే ఒక కళాస్వరూపంగా ఉపాసించాడు, జేమ్సు. కేవలం దాని నొక ఆఖ్యాయికలా మాత్రం భావించలేదు. మారు వేషం వేసుకున్న అభిప్రాయ వేదికలాగు అంతకంటే కాదు. నవలా రచనలో అతడు హవెల్సన్నట్లుగా హాథార్న్, జార్జ్ ఇలియట్లకు వారసుడనిపించుకొన్నాడేగాని, ఎంత ప్రలోభ పెట్టేదయినా జిగిబిగులు లేని థేకరీ డికెన్సుల రచనా పద్ధతికి మాత్రం వారసు డనిపించుకోలేదు. అతని సాహిత్యం మనస్తత్వ సత్యం లక్ష్యంగా గలది. సంక్షిప్తత, ఆర్జవం దానికి జవమూ, జీవమూను. పేరిస్‌కి వెళ్ళి టర్జనీవ్ (ఇతడూ ఒక ప్రవాసంలో వున్న రచయితే), జోలా, డాడే, ఫ్లాబర్ట్, గొంకోర్ట్సుల సాహచర్యంలో ఇతడూ ఆ రంగంలో వ్యాసంగం చెయ్యడం విధాయకమైంది. వాళ్ళ నైరాశ్యవాదం దారుణమైనదే అయినా, వాళ్ళు జుగుప్స కలిగించే విషయాల గురించే వ్రాసినా, వాళ్ళ ధీశక్తి యెడల, సత్యపరత్వం యెడల హెన్రీకి అపారమైన గౌరవం. అయితే పేరిస్‌లో చివరి కతనికి అసంతృప్తే మిగిలింది. అతడు తన సిద్ధాంతాలు ప్రసరింప జెయ్యడానికి తగిన సమాజంకోసం అన్వేషించసాగేడు. ఈ విషయంలో అమెరికా పరదేశులకు బాగుండవచ్చు గాని తనకి లాభంలేదు. అతడు హవెల్సునెంతో అభినందించాడు, చేతి కందిన విషయాన్నంతా చక్కగా వినియోగించుకున్నాడని. కాని అమెరికాలో వున్న అమెరికన్లు అందుకు సరిపోరని అతని వుద్దేశం. హాథార్న్ గురించి తాను వ్రాసిన పుస్తకంలో ఇదే వుద్దేశం, అంటే అక్కడేదో పెద్ద వెలితి యేర్పడినట్లు, వ్యక్తం చేశాడు. ఆ పుస్తకాన్ని వెనకేసుకొస్తూ హవెల్సుతో నవలారచయితను కదిలించగలిగేది ప్రాచీన నాగరికత గల దేశమే నని సత్యనిష్ఠమైన తన విశ్వాసం విశదీకరిస్తాడు. అంటే పరిణతి, వికాసము పొంది స్థిరంగా నిలబడగలిగిన

పద్ధతులు, ఆచారాలు, రివాజులు, అలవాట్లు మొదలైనవే సరంజామా. అసలు దాని బ్రతుకులవి అని ఆయన అభిప్రాయం. అంటే సంపన్నములైన సంస్థలు లేని దేశం సంస్కృతి లేని దేశమని కాదతని అభిప్రాయం. (కుపితులైన సాటిస్వదేశీయులు చాలామంది మరోలా అనుకున్నారు లెండి అతని గురించి.) అతడు తనకు ప్రమేయం వున్నంతమట్టుకు తన రచనలు యూరపులోనే ఉట్టి కట్టుకొని ఉండిపోవా లనుకోలేదు. తన సాహిత్య విహారానికి వీలుగా కాస్త విశాలమైన రంగం కావా లనుకొన్నాడు. అంతే. ఐరోపీయు డమెరికా నుపేక్షించవచ్చునుగాని అమెరికను మాత్రం యూరపును గుర్తించవలసిన అవసరం వుంది. పరిశీలనాసక్తీ, మానవ జీవిత వైవిధ్యజిజ్ఞాసా వున్నవా డెవడు యూరపు నెన్నుకోక అమెరికాతోటే అల్పసంతుష్టుడై పడివుండగలడు?

తన మనస్సును సమాధానపరుచుకోగానే నిబ్బరంగా ఇంగ్లండులో స్థిరపడిపోయాడు హెన్రీ. లండనునగర మంటే అదో సంగ్రహప్రపంచం. మానవజీవితంలోని వైవిధ్యం సమగ్రంగా గోచరిస్తుం దక్కడ. ఆంగ్ల సమాజంలోలాగే లండనులో కూడ యూరపుఖండంలో మరెక్కడా లేని దృక్పథాలూ, అవకాశాలూ కనిపిస్తాయి. అయితే ఇదంతా హెన్రీకి యూరపులోని లోపాలుగాని, స్వదేశంయొక్క యోగ్యతలుగాని తెలియవని చెప్పడంకాదు.అసలు హావెల్సులాగ ఇతడున్నూఆదినుంచీ యూరపుకన్నా అమెరికాయే కల్లాకపటం లేని దనే అభిప్రాయం గలవాడు. ఎన్నడూ ఆ అభిప్రాయాన్ని పూర్తిగా వదులుకొన్నవాడు కాదు. నిష్కళంకతే పణమైతే అతి సులువుగా అమెరికాదే గెలుపు. ఎలాగైతేనేం, నవలారచయితగా అతడు నిష్కళంకత ప్రదర్శించక తప్పదు. ఏవేవో ప్రలోభాలు, వినాశాలు, దారుణాలు, ఎప్పుడో పాతుకు పోయిన పాతకాలపు సమాజపద్ధతుల చిక్కులు మొదలైనవి ముట్టబెట్టినా, అతిగా భరింపబడినా అన్ని దృక్కోణాల్లోంచి ఆ కళంకరహితపద్ధతిని చాలా విలువైనదానిగా చూసుకుంటాడు హెన్రీ. దాని పతనావస్థను గురించి

చెప్పేటప్పుడు గూడ దానినే ఉన్నతంగా,ఆప్యాయంగా పరిగణిస్తా డతడు. అతడు శైలిలో, శిల్పంలో, జీవితంలో ఒక నిండుదనం పరిపక్వత పొందినట్లే అతని కథానాయకులూ, నాయికలూ పరిపూర్ణత పొందజూస్తారు. తనకి ముందూ వెనకా వచ్చిన అమెరికన్లలాగే అతడూ ఒక ఆదర్శం గురించి భావనచేశాడు. అది వున్నదని, లేదా వుండాలని విశ్వసించేవాడు. అమెరికాలో ఆదర్శలక్ష్యాలు శూన్యంలో వ్రేలాడుతున్నట్లు గుర్తించాడు. పేరిస్‌లో కళార్జవాన్నీ, ఇటలీలో అద్భుత శిల్ప సౌందర్యాన్నీ, ప్రకృతి రామణీయకాన్నీ, ఇంగ్లండులో ఒక మంచి కట్టుదిట్టంగల సమాజవ్యవస్థనూ గుర్తించాడు.అయితే ఇవన్నీ కాస్తో కూస్తో లోటుపాటులు కలిగి వున్నవే. ఆంగ్లేయుల జీవితం భౌతికవాసనలతో నిండిపోయివుంది.అప్పుడప్పుడు వారి గ్రామసీమల్లోమాత్రం అదీ సర్వసమభావన గల అమెరికా పౌరుడికైతే అనతిక్రమరమణీయమైన సమానత్వం గోచరిస్తుంది. కాని మొత్తానికి యూరపుఖండమంతా పతనావస్థ కున్ముఖంగా వున్నట్లే భాసిస్తుంది.

జేమ్సుకి అమెరికా యూరపుల అనుబంధంలో లాభసాటియైన ఇతివృత్తం దొరికింది. అతని మొట్ట మొదటి సరైన నవల 'రోడరిక్ హడ్సన్' (1876) లో ఒక అమెరికన్ యువశిల్పి ఇటలీలో పొందిన పతనం వర్ణితమైంది. ఈ ఇతివృత్తాన్నే అతని కనేకవిధాల పురోగామి యైన హాథార్న్ తన 'మార్బుల్ ఫాన్'లో నడిపించి నెగ్గలేక పోయాడు. అంతకంటే సున్నితమైన చూపులో 'ది అమెరికన్' (1877)లో ఒక అమెరికా పౌరుని పేరిస్ సమాజం ఎలా ఏడిపించిందీ వివరిస్తాడు జేమ్సు. క్రిస్టోఫర్ న్యూమన్ అనే ఒక కోటీశ్వరుడు యూరపులోకంతా పరమప్రాప్యమైన వస్తువునూ, ఒక వధువునూ పొందడానికని వస్తాడు. సరే. ఒకామెను చూస్తాడు. అయితే ఆమె తాలూకు పెద్దలు ఆ సంబంధాన్ని నికృష్టమైన దానిగా పరిగణించే సరి కామెను వదులుకోవలసివస్తుంది. పాపం, తనకూ ఆపాటి పరువూ ప్రతిష్ఠా గల న్యూమన్ అభిమానం దెబ్బతిని అదోలా మారిపోయి,

ప్రతీకారావకాశాన్ని కూడా జారవిడుచుకొని యూరపు వదిలి వెళ్ళి పోతాడు.

జేమ్సు నవలలలో అగ్రగణ్యమైనది 'The Portrait of a Lady' (1886). అందులోనూ యూరపులో ఒక అమెరికన్ కావించిన అన్వేషణే ఇతివృత్తం. ఇసబెల్ ఆర్చర్ అనే ఒక అందచందాల తెలివైన పడుచు అమెరికానుంచి యూరపుకి వస్తుంది. మంచి స్థితిమంతురాలైన తన అత్తసంరక్షణలో వుంటూ వుంటుంది. లార్డ్ వార్బర్టన్ అనే ఒక ఆంగ్లేయ డామెను ప్రేమిస్తాడు. పెళ్ళాడమని కోరుతాడు. అయితే అతని పేరు, హోదా, పొలమూ, ఇల్లూ ఘా మేదా ఇవేవీ ఆమెకు పట్ట లేదు. అతడిని నిరాకరిస్తుంది. ఏదో వీటన్నిటికంటే అతీతమైన గొప్ప సంబంధం తనకోసం కాచుకూర్చుందనుకుంటుంది. (దీన్నే ఎమర్సనీయ మైన ఆశయ మంటారు—విందు భోజనం ఎలాగూ తిగుల్తుం దన్నప్పుడు పడ్రాళ్ళుకూడా నిశ్చింతగానే కూచుంటా రనడం) ఆస్మండ్ అనే ఒక నాగరికుడు, అప లెప్పుడో అమెరికన్ వారసత్వం గలవాడే కనిపిస్తాడు. అతడు తన అభిరుచి ప్రకారం సర్వగుణ పరిపూర్ణు డనుకుంటుంది ఇసబెల్. పెళ్ళాడేస్తుంది. అయితే క్రమేణా వా డొక విషపుచ్ఛమనీ, కటిక గుండెల వాడనీ, కేవలం డబ్బుకోసం తనను పెళ్ళాడేడనీ గ్రహిస్తుంది. కాని ఇక తాను చెయ్యగలిగిం దేముంది? తన అదృష్టాన్ని హుందాగా శిరసావహిం చడమే. పాపం, అలాగే చేసింది. ఈ అంతర్జాతీయ వస్తువీ నవలలో చాలా నాజూకుగా చిత్రించబడింది. నాయిక యొక్క ఆశలు హద్దుమీరిన వనీ, ఆమె దురదృష్టాని కామెయే నిందార్హు రాలనీ సూచిస్తాడు రచయిత. కాని గ్రంథంలో యూరపు-అమెరికాల విషయకమైన విప్రతిపత్తి అది అలా మిగిలివుండనే వున్నది. అందులోని పాత్రలు ఇసబేల్, ఆమె స్నేహి తురాలు హెన్రీట్టా, ఆమెను మెచ్చుకునే గుడ్‌వుడ్ మొదలైన వాళ్ళంతా పూర్తిగా అమెరికా సంబంధీకులు. ఏవేవో చిన్నచిన్న పొరపాట్లు చేసి వున్నా వాళ్ళంతా మంచి వాళ్ళకిందే జమ. ఆస్మండ్, మేడమ్ మెర్లే

మొదలైనవాళ్ళు వాళ్ళూ అంతో యింతో అమెరికనులే అయినా మంచి వాళ్ళకిందికి లెక్కకు రారు. వాళ్ళ అమెరికను తనం యూరపువల్ల కలుషితమైపోయింది. ఇదీ సంగతి. అయితే రచయితపట్ల ఇదేదో వట్టి తెలివి తక్కువ దేశాభిమానమని అనుకో రాదు. జేమ్సు చాలా ప్రాముఖ్య దృష్టితో, సదసద్వివేకంతో చేసిన సమన్వయ మిది. అంతవరకూ కచ్చితంగా కనిపిస్తూనే వున్నా పండు కోసుకు తిన్నాక 'ఈడెన్' తోట మరెందు కుంటుంది! నీలినీడల్లోకి మాయమైపోయింది. పుణ్యానికి పుణ్యమే ప్రతిఫలం కావాలి, మరింకేమీ కాదుగనుక.

అంతర్జాతీయమైన వస్తు వదెంత విలువైనదైనా జేమ్సుచూపులో, అదొక్కటి మాత్రమే కా దతని వస్తువు. మిరియపుగింజలాంటి అతని 'వాషింగ్టన్ స్క్వేర్' (1881) అనే నవలలో న్యూయార్కులోని అమెరికనులగురించి వ్రాశాడు. అందులోని నాయిక మొదట్లో కాస్త తెలివి తక్కువపడినా ఇసబెల్‌లాగానే విధేయంగా పీకలమీదికి వచ్చిన వ్యవహారంనుంచి తప్పించుకోవడానికి అవకాశం వచ్చినాసరే వదులుకుంటుంది.

అతని 'ది బోస్టోనియన్స్' (1886) అనే నవలలోగూడా అమెరికాయే ప్రధానకథారంగం. అందులో అమెరికా అంటే యూరపుకంటె చాలాచాలా గొప్పదని తనకు లోలోపల గల మమకారాన్నంతా ప్రదర్శిస్తాడు జేమ్సు. అది అనంతాశయాలకు, ముఖ్యంగా ఆడకూతుల ఆశలకు చక్కని ఆశ్రయభూమి అని నిరూపిస్తాడు. హావెల్సు హెన్రీ యేడమ్సుల్లాగు స్త్రీలకు చాలా ప్రాముఖ్య మిస్తాడు. అమెరికనుమహిళ పురుషునికంటె ధీరత్వంలో, నాగరికతలో చాలా ఉదాత్తురాలు అని తన సమకాలికులలో కొంతమంది లాగు తానూ ఒక నమ్మకంతో వుండేవాడు జేమ్సు. అయినా ఆ నవలలోనే స్త్రీల హక్కుల తరఫున వకాల్తా పుచ్చుకున్నవాడిలా మాట్లాడుతూనే స్త్రీసంస్కరణోద్యమాన్ని నిరసిస్తాడు.

ఇటువంటి ఉద్యమాల 'మేడిపండుపరిపూర్ణత' అతనికి కిట్టదు. అంతేకాక ఇవి పురుషస్వభావానికీ, సాహసం, సహనం, జిజ్ఞాస, నిర్భీకత మొదలైన శక్తులకూ, వాస్తవికంగా చూస్తే నైచ్యవైపరీత్యాల సమ్మేళనమైన ప్రపంచాన్నీ వాస్తవపరిస్థితులనూ ముఖాముఖి యెదుర్కొని దాన్ని యథాతథంగా గ్రహించగలిగే శక్తికీ హెచ్చరికలు, కాదు ఉత్పాతాల్లాంటివని అతని అభిప్రాయం. ఈ మాటలు పుస్తకంలో బేసిల్ రేన్సమ్ అనే పాత్రనోటినుండి వచ్చినవే అయినా నిజానికి బతికితే పరిపూర్ణంగా బతకాలని పట్టుదలగల జేమ్సువ్యక్తిత్వాన్నే వ్యక్తీకరిస్తాయి. రేన్సమ్ దక్షిణ రాష్ట్రాలవాడు. బోస్టన్లో వ్యాపించివున్న శుష్కమైన మౌలికసంస్కారవాదానికి విముఖుడైన పూర్వాచారపరాయణుడు. జేమ్సు కిలాంటివాడంటే కిట్టను. ఎలాగైతేనేం రేన్సమ్ ఆశయాలన్నీ ఆనాడు దక్షిణ రాష్ట్రాలలో వ్యాపించివున్న నైతికదురహంకారం కారణంగా వ్యర్థమైపోయాయి. చివరికి రేన్సమ్ ఒక బోస్టన్యువతిని పెళ్ళాడుతాడు. ఒకరిది మరీవిపరీతమైన అమాయకత్వం, ఇంకొకరిది పొగరుబోతుతనం కావడంవల్లనో యేమో వాళ్ళు దంపతులుగా సుఖపడడాని కవకాశాన్నాట్టే ప్రసాదించడాని కిష్టపడడు జేమ్సు. ఇలాగు పాఠకు లెదురు చూసేదానికి విరుద్ధంగా గ్రంథాన్ని ముగించడం అతని ప్రతిభాలక్షణమా మరేమన్నానా అన్నది ప్రశ్న. అత డప్పటికి అమెరికనుప్రజలకు ఏకొంతో దూరంగా వున్నట్లు గ్రంథంలోనే కొన్ని సూచనలు వున్నాయి. అందలి మృదువైన వ్యంగ్యోల్లంఠనము, స్తిమితమైన విమర్శల మేళనం కరగిపోలేదు. ఆయన స్ఫురణకు తెచ్చుకొని వన్నెపెట్టి సిద్ధాంతంగా రూపొందిస్తున్నాడు. అంతకంటె భావసంపన్నమైనదీ, బహుచిత్తములను తాకినదీ అతని 'The Princess Casamassima' (1886). యూరపులోని 'మౌలికపరిణామవాద' (Radicalism) విపరీతధోరణుల పరిశీలన మందలి విషయం. అతనికంటికి యూరపు 'నిద్దా'గా కనిపిస్తుంది. చాలామట్టు కతని అనంతరకృతుల్లో అదే కథారంగం. అమెరికా అవసర

మైనపు డనుసంధించుకోవడానికి తగిన తావుగా ఉపకరించిం దతనికి. అది కొన్ని పాత్రలకు గమ్యంగాను (The Tragic Muse, 1890 లో పీటరు, బిడ్డీషెర్మింగ్ హేములకు), మరికొన్నింటికి ప్రస్థానభూమిగాను (The Wings of the Dove, 1902 లో మిల్లీ థీల్ కి, The Golden Bowl, 1904 లోని మేగీ వెర్వర్ కి ఉపకరించింది. అమెరికా నుండి వచ్చే పాత్ర లా దేశపు వైశిష్ట్యాన్ని మోసుకువచ్చిన ట్లుంటాయి. కాని 'The American Scene' (1907) అనే యాత్రాచరిత్ర ఒక్కదాన్ని మినహాయిస్తే జీవితాంతమూ ఆయనరచనల్లో ప్రధానకథా రంగం యూరపుఖండమే. అతని మాతృదేశస్మృతి క్రమంగా మసక బారినట్లుగానే అతని కృతుల్లో సంబంధసౌష్ఠవం తగ్గుతూవచ్చింది. అందు చేత ఒకనా డాయనను దయనీయుడైన ప్రవాసిగా పరిగణించడం పరిపాటియైనది. అతని రచనలో రానురాను గజిబిజి యెక్కువైన దన్నమాట నిజం, కాని అతడు దారితప్పిపోయా డని అనుకోవలసిన అవసరం లేదు. ఒక అర్ధశతాబ్దిపాటు దుసికిలకుండ తన ప్రతిభను మెరయించిన మహాభాగు డాయన. అమెరికన్ రచయితలలో అతివిశిష్టుడు. అంతమాత్రమే కాదు. ఏ కోవకుచెందిన రచయితల మధ్యను కోటికి పడగెత్తువాడు. అమెరికా గురించి అత డన్న మాట మరో యథార్థదేశంకోసం వెర్రిమోజుతో పడి పోయాడని తోపింపజేయదు. పైగా నవలావస్తువుగా అమెరికా నేం జేసుకోవడమో అతనికి తెలిసివుండేది కాదనిమాత్రం సాక్ష్యమిస్తుంది అతని 'The American Scene'. మరోవంక 'The Jolly Corner' అనే అతని కథానిక అక్కడే చెడిపోవడాని కుండిపోయాడా అనిపించే మరో జేమ్సుయొక్క ఘోరదర్శనం చూపిస్తుంది. అతడు తన రచనలో ఒకందుకు అమెరికామీద ఆధారపడ్డాడు. అది మిల్లీ థీల్ వంటి రాజపుత్రికలను ప్రభవింపజేసే వింతదేశం. ఆ పాత్ర కీర్తిశేషురాలైన అతని ప్రియబాంధవి మిన్నీటెంపిల్ ప్రతిబింబమే. ఆమె అంటే అతని కెనలేని గౌరవం. జేమ్సు తన జీవితమంతా తమ జేమ్సుకుటుంబానికి తగిన

సాహిత్యకల్పంకోసం అన్వేషించాడు. అందుకుగాను యూరపియన్ సంఘంతో ఛాయామాత్రంగానైనా ఆ అనుబంధాలు కాని గ్రహించ గలిగాడంచే దాన్ని తా నెరిగినదానికంటె ఎక్కువ చేసి మరీ ప్రతిష్ఠించ వలసివచ్చింది తన సాహిత్యంతో. ఇంకా తన ఊహలోని అమెరికానుంచి మినీ్న టెంపిల్ యొక్క, లేక తన సన్నిహితబంధువులయొక్క తాత్త్విక దృక్పథాన్ని గ్రహించి దానికి జోడించవలసివచ్చింది.

పెద్దవాడైనకొద్దీ చెప్పవలసిం దింకా ఎక్కువ వుంటోంది జేమ్సుకి. అత డంతకంతకు ఒంటరియై పోయాడు. అమెరికాతో సంబంధం తెగిపోవడం కాదు కారణం. మరి తన పాఠకలోకంతో సంబంధం తక్కువ కావడం. ఆ లోకం ఎప్పుడూ అంత పెద్దది కాదు, అమెరికనుల ప్రాబల్య మెక్కువైనది కాదు. లండన్ నాటకరంగంద్వారా తన పలుకుబడి నినుమడింపజేసుకొందా మని ఆయన చేసిన ప్రయత్నాలు తీవ్రమైన ఆశాభంగం కలిగించాయి. 'The Princess Casamassima' వంటి గొప్ప నవలలకుకూడ తగిన పరపతి లేకుండా పోయింది. తన సాహిత్యానుబంధం విషయంలో అత డెన్నడూ వెనుకంజ వేయకపోయినప్పటికీ అనేక కథల్లో కళాకారుల కేర్పడే ఒంటరితనాన్ని గురించి హాథార్న్‌గారి అంతర్దర్శనాన్ని స్ఫురింపజేసేటట్లు తన వ్యాకుల తను వ్యక్తంచేశాడు. అతని 'The Madonna of the Future' (1879) రోమ్‌లో ఒక అఖండకళాఖండం గురించి కలలు కని కని, చివరి కేమీ చెయ్యలేకపోయి తన జీవితంలాగే చావునుగూడా అజ్ఞాతంగా ఎదుర్కొన్న ఒక అమెరికన్ చిత్రలేఖకుని విఫలత్వాన్ని తెలుపుతుంది. మిగతా కథల్లో తనలాగే పరిణతుడు, కార్యసక్తుడూ అయి, సర్వసాధారణమైన ఉపేక్షకు, ఒక్కొకపుడు కావేషాలకూ గురియవుతూ కొద్ది శిష్యులకు మాత్రమే తెలిసినవాడై కాలక్షేపం చేసే రచయిత గురించి పట్టించుకొన్నట్లు కనబడతాడు జేమ్సు. కాలగతి నేమనడం? 'Beltraffio' (1884), 'The Middle Years' (1895) ల రచయితకు

పట్టిన గతి యిది! ఆ 'Middle Years' అన్నదాని నా పిమ్మట తన స్వీయచరిత్రశకలానికి పేరుగా గ్రహించా డాయన. ఆయ నంటాడు : "చీకటిలో పనిచేస్తాం మనం—చెయ్యగలిగిం దేదో చేస్తాము—మన కున్నదేదో ఇస్తాము. మన సందేహమే మన ఉద్రేకం. మన ఉద్రేకమే మన లక్ష్యం. మిగిలింది కళోన్మాదం."

సరే, చివరికి చూసుకుంటే కథలు, వ్యాసాలు, నాటకాలు, యాత్రాచరిత్రలు, నవలలు ఇలా తామరతంపరగా కనిపిస్తాయి జేమ్సు రచనలు. కేవలం పడిన పాటును బట్టి చూస్తే అదంతా గట్టి ఘనవిజయమనాలి. 'సంకలిత ప్రతి' (Collected Edition) లోని చేర్పులూ, తొలిపలుకులూ అవే చాలు అతని పరిశ్రమకూ, కళాప్రియంభావుకతకూ తార్కాణాలు. ఉత్త ఉపేక్షితస్థితినుండి ఉన్నతశిఖరాగ్రా లధిరోహించిం దతని ప్రతిష్ఠ. లయొనెల్ ట్రిల్లింగ్, ఎఫ్. ఆర్. లీవిస్ మొ॥ విమర్శకు లతనిని ఆంగ్లనావలికశ్రేష్ఠులతో సమానుడిగా పరిగణించారు.

అయితే అతని జీవితకాలంలోమాత్రం చదవడాని కంత సుకరంగా కనిపించేవాడు కాడు చాలమందికి. ఈనాడుకూడ అతని రచనలో కొన్ని చిక్కు లున్నాయి—కొందరు విమర్శకులైతే సులువుగా తోసిపారేశారు గాని. అతని పిదప కాలపు పేరుపడిన శైలి గహనాలైన భావాల, దృశ్యాల వాహికగా మాత్రమే కాదు పదాల కూర్పుగా కూడ కలవరపెట్టేదిగా వుంటుంది. అవసరం లేనప్పుడుకూడ జేమ్సు వాక్యాలు పట్టి ప్రమిదల్లా వుంటాయి. 'The Wings of the Dove' నుండి ఈ వాక్యం చూడండి :

"It was wonderful for Milly how just to put it so made all its pieces fall at present quite properly into places."

చిట్టిమాటల పొట్టివాక్య మిది. అయితే ఆ క్రియావిశేషణానుబంధి శబ్దాలు—at present, quite, properly అన్నవి—టోంపల్లా వున్నాయి మధ్య. place అనడానికి బదులు places అనడం కూడా విడ్డూరంగా వుంది. అలాంటి వాక్యాలు వేలమీద కలిసివున్నప్పుడు, జేమ్సు పాఠకుడిని మరికొన్ని గురుతరశ్రమలకు గురిచేస్తాడు గనుక ఫలితం పాఠకుడు చకితుడు కావడం. అతని వస్తువులు ప్రముఖమైనవి, స్పష్ట మైనవి. అవి అమితస్పష్టంగా, చొరవగా వుంటా యంటాడు హెచ్. జి. వెల్సు. జేమ్సు పిదప కృతులలో అవి ప్రదర్శించే ధర్మశీలత విపరీత పరిమాణంలో వుంటుంది. అదెలా వుంటుం దంటే పాఠకుడు ఒక చిత్ర ప్రదర్శనశాలలో ప్రవేశించినట్లు, ఆ చిత్రాలయెడ ఆసక్తి, పరిజ్ఞానం, ఉత్సాహమూ గల వ్యక్తి అతని ననుసరించి తన విమర్శతో చాలాసేపు డబ్బా వాయించినట్లు వుంటుంది. అలాంటి సాహచర్యం కొంత వికాసం కలిగించినా భరించడానికి విసుగ్గాను, కాస్త సిగ్గుగాను వుంటుంది. అయితే పాఠకుల మధ్య అవగాహనశక్తిగురించి అప్పుడప్పుడు పోటీ యేర్పడు తుంది. అది కొందరిచేత యథార్థంకంటె ఎక్కువగా 'అర్థంచేసుకున్నాం, అనుభవించాం' అని దంభప్రకటనలేనా చేయిస్తుంది; లేదా 'అదంతా అర్థంలేని చెత్త' అని తృణీకరించేటట్లయినా చేస్తుంది. ఆ రెండింటికీ తల యొగ్గని నిజాయతీ గల పాఠకు డుంటే, అప్పుడప్పుడైనా రచనలో ఆ మందకొడితనాన్ని భరించలేడు. పైపైవాటంగానైనా త్వరగా పురోగమించా లనుకుంటాడు.

ఈ విషయాన్నే భంగ్యంతరంగా చెప్పాలంటే జేమ్సు నిజంగా ధర్మప్రవక్త గాని, ద్రష్ట గాని కాడు అని చెప్పాలి. అతడు 'కళాపర మార్గమూ, జీవితసత్యమూ రెండూ ఒక్కటే, వేరు కావు' అని అనుకొనే రచయిత. అందుకే జీవితంయొక్క అంతరార్థాల గురించి అతని పాత్రలు చేసే అన్వేషణ కళాకారుని సృజనాత్మకవిధానంతో సమన్వయింపబడింది. అతని దృష్టిలో ఆ రెండింటికి పారమ్యస్థితి అత డనుభవ మనుకునేదానిని

ప్రకల్పించే రయవిచలద్రహస్సుందరక్షణాల్లో ఏర్పడుతుంది. అతని సమన్వయం ఇతర వృత్తుల్లో వున్నవారికి గూడ ఆసక్తి గొల్పుతుంది, ఆమోదయోగ్యం అవుతుంది. మరి వాళ్ళ దృక్పథమూ అలాంటిదే గదా. కాని సామాన్యపాఠకుడికి 1 'జేమ్సియన్' ఉద్రేకం అనేది అమూల్యంగా భాసిస్తుంది. అయితే ఆ ఉద్రేకం, అనుభవక్షణా లనే మాటలకు చాలా మంది చేసుకునే అర్థాలు వేఱు, అతని ఉద్దేశాలు వేఱు.

జేమ్సు నవలల్లో కొన్నిట ఉద్దేశ మన్నది (motive) కార్యగతి (event) ని ఉక్కిరిబిక్కిరిచేసి గ్రసించివేస్తుంది. ఒకప్పు డా కార్యగతి హఠాత్తుగా ఆగమేఘాలమీద గండభేరుండంలా, చండ్రగాడ్పులా నెట్టుకొనివస్తుంది కాని యేం లాభం? వెంటనే ఒక అస్పష్టతాగాధంలోకి దూసుకుపోయి హతాశులను చేస్తుంది పాఠకులను. పాత్రలతిసున్నితంగా ఒకదానివే పొకటి పరిక్రమిస్తాయి. వాగతీతమైన శక్తి యేదో వాటి మధ్య ప్రసరిస్తుంది. పాఠకుడు తన కర్థమైన దనుకుంటాడు కాని అడిగితే చెప్పలేని అవస్థలో పడతాడు. 'ఆ తివాసీలో వున్న ఆకార మేమిటో, మిల్లీథీల్స్‌కి వచ్చిన జబ్బేమిటో' చెప్పడు జేమ్సు. అతని తిరస్కార ముద్దేశపూర్వకమైనది. అతని నిగూఢతకు కారణం అసమర్థత కానేకాదు. అది ఆరితేరిన వారి హస్తలాఘవం అని సమర్థించి ఒప్పించవచ్చు ('Henry James' The Major Phase' లో F. O. Matthiessen చేసి చూపించినట్లు). అతని అస్పష్టత హాథోర్న్ దానికంటె నిస్సందేహంగా గొప్పది. హాథార్న్ ఒక ప్రకృత్యతీతమైన అద్భుతాన్ని ప్రతిపాదించి దాని కొక పీలైన భౌతిక వ్యాఖ్యానం జతకూర్చి తరచు తద్భారాతిశయాన్ని తగ్గి

1. 'general reader' అన్న మాటకు సమానార్థకంగా 'most people' అని E. E. Cummings ఒక ఘోరమైన పదబంధం తయారుచేశాడు.

స్తాడు. అదే జేమ్సు అయితే అలాంటి సందర్భాల్లో (ఉదా: 'The Turn of the Screw' 1898, 'The Jolly Corner' లలో లాగు) పాఠకుడికి సాధారణంగా వెసులుబాటివ్వక తన అవ్యక్తత, సంశయవ్యంజకతలతో అతడినాశ్చర్య చకచ్చకితుణ్ణిచేస్తాడు. అయితే ఎక్కడైతే ఒక సన్నివేశగతమైన అవ్యక్త చమత్కారం పాఠకుడిని అవకాశాల పద్మవ్యూహంలో పడేసి తన దారి తాను చూసుకోవలసిందే అనేటట్లు చేస్తుందో అక్కడ పాత్రలు పాఠకుడి గాలాని కందవు. అలసిన పాఠకుడు పోటీనుండి విరమించుకుంటాడు. అది హెన్రీ సంగ్రహించుకొన్న రీతిగా 'జేమ్సు కుటుంబా'నికి సాటిరాదు.

అయితే, పరకోటి ముట్టిన అతని చివరినాటి రచనాశిల్పపు బీజాలు ముందునాటి కృతులలో వున్నప్పటికీ ఉపరి పరిశీలనాంశాలు అతని సాహిత్యమంతటికీ వర్తించవు. 'The Wings of the Dove', 'The Ambassadors' (1903) - రెండూ 'పరాజయా' లే అయినా అవి 'జేమ్సియన్' పరాజయాలు (failures). చాలామంది రచయితల విజయాల కంటె ఘనతరాలైనవి. అవి విపరీతంగానైనా వుంటాయి, నిర్దుష్టంగానైనా వుంటాయి, లేక కొంతకొంత రెండు రకాలగానూ వుంటాయి. పాఠకు డెటువుకున్నా జేమ్సుపట్ల అనన్యయాలంకారం సమన్వయించుకోవలసిందే ('James is Sui generis'). అతని ప్రతి కృతిలోను అత్యల్పమైన కథానిక మొదలు అతి దీర్ఘ మహాగహనమైన నవలలదాకా అన్నిటా అగాధమైన ద్రోహాన్నీదుర్మార్గాన్ని ప్రదర్శించగల, అఖండమైన విశ్వాసాన్నీ సౌజన్యాన్నీ ప్రచురింపగల, నరజాతిమీద నిలుకడగల, నిశితమైన రెప్పవాల్పని నిఘా ఒకటి వున్నట్లు చూడగలం. మరే నవలా రచయితా అతిక్రమించనంతగా ఆ విషయాలు జేమ్సు కృతుల్లో వివేక సహాకృతంగా సంగ్రథితా లయ్యాయి.

"గొప్ప నవల అనిపించుకునేవల్లా అన్నిటికన్నా ముఖ్యంగా నైతిక ప్రమాణాల గురించిన ప్రగాఢ పరిజ్ఞానంమీద ఆధారపడి వుండాలి.

అప్పుడూ తగిన నిబద్ధతతోనూ, సాధన సంపత్తి విషయంలో తగిన పొదుపుతోనూ నిర్మాణం సాగాలి. ఆ నిర్మాత నవలలోని సన్నివేశం పాత్రలనెలా మలుస్తుందీ అని కాక, తన పాత్రలు వాటి వాటి స్వభావాని కనుగుణంగా సన్నివేశాన్నెలా తీర్చి దిద్దుతాయో అని మాత్రమే తన పనిగా అడుగడుగునా గుర్తుంచుకోవాలి." అనే యీ సూత్రాలు హెన్రీజేమ్సు అభిప్రాయాలను సన్నిహితంగానే వుంటాయి. అయితే యీ మాట లతని సన్నిహిత స్నేహితురాలైన ఎడిత్ వార్టన్ అన్నవే. జేమ్సులాగే ఆమె కూడా అమెరికాతో సంపర్కం లేకుండా అయింది. భర్తను విడాకులిచ్చిన తరువాత ఫ్రాన్సులో నివాస మేర్పరచుకొంది. మొత్తం మీద జేమ్సులాగే ఆమె కూడా సత్సమాజంలో వున్న ప్రజల గురించి వ్రాయడానికే మొగ్గుదల చూపింది. (ఆమె 1911 లో వ్రాసిన 'Ethan Frome', 1917 లో వ్రాసిన 'Summer' అన్నవి మాత్రం ఇందుకపవాదాలు.) ఇద్దరూ వ్యక్తికీ సామాజిక వ్యవస్థకీ నడుమనున్న పట్టుపంతాల గురించే వ్రాశారు. ఇద్దరూ ఆ సామాజిక వ్యవస్థ అన్నది ఆదర్శప్రాయమైనదని భావించినవారు కారు. జేమ్సు ఆ ఆదర్శాన్ని వ్యక్తిరూపంలో అమెరికానుండి దిగుమతి చేస్తాడు. అయినప్పటికీ, ఎంత స్వచ్ఛందంగా అసంతృప్తికరాలుగా వున్నా తన సంఘం యొక్క పద్ధతులను పాటిస్తాడు. అవి పని చేస్తాయనడంలో సందేహం అక్కరలేదు. అదే ఎడిత్ వార్టన్ విషయం తీసుకుంటే ఆవిడ కంటికి సంఘం పతనోన్ముఖంగా కనిపిస్తుంది. దాని ఒత్తిడి యథార్థమైనదే అయినా నీచంగా, అసమరసంగా వుంది. ఆమె ప్రముఖపాత్రలు ఒక నిశ్చయానికి రాలేక పోతున్నామే అనే ఆక్రోశం గలవిగా కనిపిస్తాయి.

వార్టన్ తన మిత్రునితో ఎప్పుడూ వేర్పడలేదు. అత డొక సంఘానికి సంబంధించినవాడూ అంటే అది న్యూయార్కులోని వాషింగ్టన్ స్క్వేర్ ప్రపంచమన్నమాట. అయితే హెన్రీ ప్రాతినిధ్యం వహించిన తీరు చూస్తే 'జేమ్సు కుటుంబం' అంతటా వుంది, ఎక్కడా లేదు అని

చెప్పాలి. ఎడిత్ వార్టన్ మట్టుకు తాను పెరిగిన వాతావరణాన్ని బట్టి పాతకాలపు న్యూయార్కు సమాజంలోని వ్యక్తిగా కనిపిస్తుంది. న్యూపోర్టులో ఒకటి రెండు 'డాన్సు సీజన్లు', వేసవులూ గడిచాక ఆమె తానొక గేస్తురాలైంది. విశిష్టమైన ప్రతిభ, సాహిత్యప్రీతి గలది. తన చుట్టూ వున్న సంఘం ఆమెకు చాలా సంకుచితంగానూ, అనాగరకంగానూ కనిపించింది. దాని ప్రమాణాలు మోటుగా వున్నా అనర్థకంగా వున్నాయి. న్యూయార్కులో మరో కొత్తరకం సంపన్నుల పెత్తనం వెలయగానే ఎడిత్ వార్టన్ ప్రపంచం వేరుపడిపోయింది. పాత పేరంటే విలువ అంతంత మాత్రంగా వుంది. అన్నిటికన్న ముఖ్యమైనది డబ్బు - 'నడుమంత్రపు సిరిరాయుళ్ళు' ('Parvenus') Fifth Avenue లో మేడలు లేపినదానికాధారం ఈ డబ్బే.న్యూయార్కు నాగరికవర్గం గురించి ఆమె భావనను ఇంకొక రింకొక సందర్భంలో అన్న యీ మాటలతో చెప్పవచ్చు: "అది యిదివర కెంత బాగుండేదో యిప్పు డంత బాగా లేదు; ఈనా డేమి ఘనత వుందో అది యిదివరకు లేదు." సున్నితమైన స్వభావం గలిగి ఒంటరిగా వున్న పిల్ల అవటం వల్ల తన పెంపకంలోని కాఠిన్యానికి నొచ్చుకొన్నది - ముఖ్యంగా తా నన్వేషించా లనుకొన్న 'సృజనాత్మక ప్రపంచం' (Creative World) యెడల దాని ఉదాసీనతకు. పైగా ఆ పరిస్థితి కనంతరం వచ్చిన స్థితి చూస్తే అది మరీ పాడు. ఎందులోనూ ఆమెలాంటి వ్యక్తి ఇముడలేదు.

ఈ అసంతృప్తిని ఆధారం చేసుకుని తన కున్న సామగ్రితోనే వార్టన్ మంచి నవలలను సృజించింది. సాంఘిక వైపరీత్యాల యెడల ఆమె చూపు నిశితమైనది. సాంఘిక పరిణామాలకు బలియైపోయినవా రంటే ఆమెకు దయ. తన Ethan Frome లో న్యూయార్కు సంఘానిది కాక ఒక న్యూ ఇంగ్లండు వ్యవసాయ క్షేత్రం యొక్క ఊషరత్వాన్ని (గొడ్డుతనాన్ని) కథారంగంగా చేసుకుని మానవుని నిస్సహాయత్వాన్ని అతినిపుణంగా చిత్రించింది. న్యూయార్కునుగూర్చిన 'The House

of Mirth' (1905), 'The Custom of the Country' (1913), 'Hudson River Bracketed' (1928) అనే మూడు నవలల్లోనూ ఆమె తన ప్రత్యేకపరిజ్ఞానాన్ని బాగా వినియోగించుకొన్నది. The House of Mirth లో లిలీబార్ట్ దూబరాతనం, అల్పత్వమూ గలదైనా వాటివలన కాకుండ ఒక వంచనాత్మకమైన సమాజంమధ్య తాను నిజాయితీగా బ్రతుకదలచినందువల్ల బాధలకు గురిఅయింది. ఇక The Custom of the Country లో రాల్ఫ్‌సంగతి చూడండి:

"రాల్ఫ్ ఒక్కొక్కప్పుడు తన తల్లినీ, తాతనూ ఆదిమవాసులుగా జమకట్టి, తమపై దాడివచ్చిన జాతి పరాక్రమించినకొద్దీ త్వరత్వరగా అంతరించిపోతూవున్న దురదృష్టవంతులైన సిసలైన అమెరికాభూఖండ వాస్తవ్యులతో సరిపోల్చేవాడు. వాషింగ్టన్ స్క్వేర్‌ను ఒక నిర్బంధ మందిరం (Reservation) గా వర్ణించడాని కుత్సహించాడు."

లిలీ, రాల్ఫ వ్యర్థంగా పెనగులాడవలసివచ్చిన మోటుమనుష్యుల సంగతి కచ్చితంగా చిత్రింపబడింది.

డ్రెయిజర్‌లాగ వార్టన్ చదువరి నెప్పుడోగాని అంత బాధపెట్టదు, పెట్టలేదు. లిలీపతనం విషయంలో విచారపడవలసిం దేమీ లేదు. రాల్ఫ విషయమూ అంతే. రచయిత్రి కాపాత్రయెడల లిలీబార్ట్‌యొక్క వ్యర్థ మిత్రుడైన లారెన్స్‌సెల్డెన్‌యెడల వున్నట్లే కొంత అసహిష్ణుత, ఆతురత వున్నట్లు తోస్తుంది. వార్టన్‌లో 'సంఘర్షణ' అని చెప్పుకోదగిన దేమంత లేదు; క్రొత్తసంఘం వచ్చి ప్రాతసంఘాన్ని తేలికగా వెనుకకు నెట్టి వేసింది. వ్యక్తి సంఘశక్తివల్ల ఎంత నిర్జితు డవుతున్నాడో తన లోపం వల్లనూ అంతే నిర్జితు డవుతున్నాడు. సమగ్రసంఘర్షణచిత్రణ రాహిత్యం ముఖ్యంగా ఆమెపిదపకాలపునవలలలో కనిపిస్తుంది. Hudson River Bracketed లో ఆమె అస్తిత్వం లేని ఒకానొక 'వ్యవస్థ' కోసం అన్వేషిస్తున్నట్లు కనిపిస్తుంది. కథానాయకుడు వాన్స్ వెస్టన్ ఇల్లినాయ్

రాష్ట్రింలోని యుఫోరియాకు చెందిన ఒక యువరచయిత. యుఫోరియా చిత్రణం ఆమె సింక్లెయిర్‌లూయిస్ (Sinclair Lewis) నుండి సామగ్రిని సేకరించిందా అన్నట్లు అస్ఫుటంగా చేసింది (ఇక్కడ లూయిస్ తన Babbit (1922) ను ఆమెకు అంకితం చేశాడన్నవిషయం గమనార్హం. వాన్స్ తండ్రి బేబిట్‌లాగే పెద్ద ఆస్తిపరుడు.) ఈ యుఫోరియావికృతచిత్రణంలో కాకపోతే, మరెక్కడుం దా వ్యవస్థ?

ఆ వ్యవస్థ మొదట్లో హడ్సన్ నదీతీరాన వున్న ఒక ప్రాతయింటిలో వున్న ట్లనిపిస్తుంది. వాన్స్‌దృష్టిలో ఆ 'పాడుకొంప మూర్తీభవించిన భూతం' (embodiment of the Past); 'మానవుని చిరంతన పరిశ్రమకు చిహ్నం'; అదో 'చార్ట్రిస్' (Chartres), 'పార్థినన్' (Parthenon), 'పిరమిడ్' (Pyramid) లాంటిది.' కొన్నాళ్ళ కతని దృష్టి దానినుండి మళ్ళిపోయింది. ఉత్సాహదోహలమైన న్యూయార్కుజీవితంలో పడిపోయాడు. కాని అక్కడ పరాభూతుడై తన తొలిప్రేయసియైన కవిత్వంవైపు తిరిగాడు (వార్టను రెండు కవితా సంపుటులు ప్రకటించింది.) కాని తా నే స్థాయిలో వున్నదీ తెలుసుకోలేక పోయాడు. గ్రంథాంతంలో ఒక వృత్తికి సంబంధించిన ఉద్దేశం తప్పిస్తే అతనికి మిగిలిం దేమీ లేదు. అంటే అదితప్ప ఇక మరేమీ తన తరంలోని మనిషికి మిగలలేదని ఆమెవుద్దేశంగా తోస్తుంది. న్యూయార్కులోని సాహిత్యవాతావరణంకూడ ఏమీ ఉత్సాహం రేకెత్తించేదిగా లేదు. 1928 నాటికి "నడుమంత్రపు సిరిరాయుళ్ళు" కూడా నామరూపాలు లేకుండా పోయారు. 'ఆదివాసుల'తోడి వాషింగ్టనుస్క్వేరుపేరు స్మృతి నుండికూడ చెరిగిపోయింది. చూడండి, Hudson River Bracketed లో ఆ నగరయాత్ర చేయిస్తూవున్న ఒక 'పథప్రదర్శకుడు' (guide) తన బాకాద్వారా ఇలా వాగుతాడు:

"మనం ఇప్పుడు 'ఫిఫ్త్ ఎవెన్యూ'లో ఎక్కచ్చిగా మిగిలిన ఒకా నొకరి నివాసం సమీపిస్తున్నాం. ఇది ప్రపంచమంతటా 'Four

Hundred' అను పేర ప్రసిద్ధికెక్కిన ఒక అసలైన ప్రాచీనసమాజ నాయకునికి చెందింది."

హెన్రీ జేమ్సులాగే ఎడిత్ వార్టన్ కూడా 'అంతర్జాతీయవస్తువు' (International theme) ను వాడిచూసిందికాని ఫలితస్ఫూర్తి తక్కువైంది. అండైన్ స్ప్రెగ్ (Undine Spragg) అనే ఒక నడిమి పడమటి (mid-Western) దేశపు టమ్మాయికి, ఒక ఫ్రెంచి సంపన్నుడికి జరిగిన పెళ్ళి (The Custom of the Country) లో గల చమత్కారం అండైన్ ద్వేషపూరితపాత్ర కావడంవల్లను, ఆమె కెవరితోనూ నిండైన చెలిమి చేతగాకపోవడంవల్లనూ దిగజారిపోయింది. ఇంక ఆవిడ పెనిమిటి సంగతి ఎవడి క్కావాలి? వార్టన్ని 'సామాన్య పాఠకుల హెన్రీజేమ్సు' అని అనవచ్చు. ఇద్దరి వస్తువులలోను, అభిప్రాయప్రాతిపదికల (Preconception) లోను, పైపై వస్తూన్మీలన విన్యాసచాకచక్యంలోనూ సామ్యం వున్నది. ఆమెకథలను, నవలలను జేమ్సురచనలతో సరిపోలిస్తే ఇద్దరి అలవినీ (Scope) నిర్వచింప వీలవుతుంది. ఆవిడ నేర్పు సామాన్యమైనది కాదుగాని అతని ముందు తీసిపోతుంది. ఆ సరిపోల్చడంవల్ల ఒక సాహిత్యరాజ్యంకోసం ఇద్దరూ ఏకరీతిగా సాగించిన అన్వేషణసంగతికూడా తెలుస్తుంది. అవును, అది రాజ్యమే. వాళ్ళ ప్రవర్తన ప్రమాణా లెలా ఉన్నతమైనవో, వాళ్ళ పదజాలంలోకూడా ఎమిలీడికిన్సను పదజాలంలోవలె రాచవారి వాగ్ధోరణి హుందాతనం కనిపిస్తుంది. జేమ్సు చిత్రించిన మిల్లీథిల్ ఒక 'రాకుమారి'. ఎడిత్ వార్టన్ 'సింహాసనాల' గురించి ప్రసంగాలు చేస్తుంది. ఆ పదాల పరమార్థం కఠినంగానే వుంటుంది కాని మోటుగా కాదు. బహుశా వాళ్ళకు చెప్పదలచుకొన్నదానికి తగిన పదజాలం కళంకితం కాని స్వచ్ఛస్థితిలో ఉపలబ్ధం కాదేమో!

ఇక హెన్రీఏడమ్సు - తన కాలంగాని, దేశంగాని ఫలశ్రుతి పలక

లేకపోయిన పలకని ఉన్నతాశయాలు గల మరో అమెరికన్ రచయిత ఏడమ్సుకుటుంబం ఘనతలో జేమ్సుల కుటుంబాన్ని మించిపోయింది. అతని తాత, ముత్తాతకూడ సంయుక్తరాష్ట్రాల కధ్యక్షులైనవారు. తండ్రి అంతర్యుద్ధకాలంలో ఇంగ్లండుకు మంత్రిగా వెళ్ళినవాడు. తప్పక హెన్రీ వాళ్ళ ననుకరిస్తా డనుకోవడాని కవకాశం వుంది.

అయితే అమెరికన్ ప్రభుత్వరంగంలో పాల్గొనడాని కవకాశం లేకపోయిం దతనికి. తన ఘోరపరాజయాన్ని తన కుటుంబ దౌర్భాగ్యానికి, తత్రాపి అమెరికా దేశమంతటికీ, ఇంకా యావత్ప్రపంచానికీ ఆరోపించు కొని తన నిత్యసామాన్య పౌరజీవితంకూడ గుప్తంగా గడపసాగేడు. ప్రతి పక్ష విమర్శకులకు హెన్రీ నమ్రత అదో పెద్దతరహా అహంభావంగా తోచింది. అస లతడు వట్టినే చిలచిలలాడేవాడా, లేక అతని నిదానం సమకాలికుల నిదానంకంటె గంభీరమైనది కాదా అన్న విషయం మీద వాదోపవాదాలే జరిగాయి. అతనిలో 'నేను రాజుని కాలేను; (అలాగని) సామంతుడి ననిపించుకోడాని కిష్టపడను' ('roi ne puis, due ne daigue') అనేలాంటి భావం ఒకటి గాఢంగా వుందని చెప్పాలి. కాని తన మిత్రుడు హెన్రీ జేమ్సులాగ ఇతడుకూడ అతివిశిష్టస్వభావుడు; తన దేశాన్ని తన పద్ధతిలో ప్రేమించినవాడు. నడివయస్సులో వాషింగ్టనులో చరిత్రకారవృత్తిలో వుండగా ఒకసారి ఆయన ఛార్లెస్ మిల్నెస్ గేస్కెల్ అనే తన ప్రాణస్నేహితుడైన ఆంగ్లేయునితో "ఈనాడు తన కోసంగాని, తనలోపలగాని పనిచెయ్యడానికి తగిన దేశం అమెరికా ఒక్కటే అన్నాడు. అంతర్యుద్ధకాలంలో బ్రిటిష్‌వారు మోసంచేశా రనే ఊహతో వారిమీద మండిపడ్డాడు. వారి దారుణమైన భౌతికవాదాన్ని (లేక అనాత్మవాదాన్ని i.e., 'materialism'ను) తరచు నిరసిస్తూ వచ్చాడు. ఇక ఫ్రాన్సు అంటే చిన్నప్పుడే అతనికి నిరసనభావ మేర్పడింది. పెద్దయాక, ఫ్రెంచి జీవితంలోని కొన్ని అంశ లతడు దగ్గరగా గమనించడం జరిగింది. ఫ్రాన్సులో సామాన్యమైపోయిన అవినీతి కటువిమర్శ కతనిని ఉసికొల్పింది. మొత్తానికి

యూరప్ అంతా కుళ్ళిపోయివుందనీ, విప్లవం కేవలం అదనుకోసం వేచి వుందనీ అతని భావన.

కాని ఏడమ్సు అమెరికాలో హాయిగా లేడు. చివరి ముప్ఫయేళ్ళ జీవితమూ ఆయన, వట్టి కల్లబొల్లి అనాగరికాగ్రేసర చక్రవర్తులతో నిండి పోయిన వాషింగ్టను వైఖరి చూడలేక తప్పించుకోవడానికి ప్రయత్నిం చాడా అన్నట్లు నిర్విరామంగా దేశాటనం చేశాడు. 1892 లో అమెరికా ఎలా వుందో చెబుతూ ఆయన, "ఏలిఘెనీస్ (Alleghenies) కి పశ్చి మంగావున్న ప్రాంతమంతా ఒక్క పరిప్రక్షాళితమైపోతే ఒకటి రెండేళ్ళలో మంచి స్వరూపం అవతరించి వుండే" దంటాడు. అయితే దాని తూరుపు దేశంయెడల అత డేమీ అంతకంటె ఘనమైన అభిప్రాయం వ్యక్తం చేసెయ్యలేదు. అయితే యూరపుకూడా అతని దృష్టికనేకవిధాల, అంత కంటె ఘనంగా కనిపించక పోయినప్పటికీ ఆ 'ప్రాతలోకం' అతనికి మాతృ దేశంలో కరువైపోయిన ఒక మనశ్శాంతిని చేకూర్చింది.

అయితే యూరపువేపు తిరిగేముందు హెన్రీ ఏడమ్సు అమెరికాకు తాను చెయ్యగలిగింది చేసి వెళ్ళేడు. మిగతా బోస్టను పెద్దల్లాగే ఆయన కూడా సృజనాత్మక స్వభావంకంటె విమర్శనధోరణే ఎక్కువ పాలు గలవాడు. ఆ బోస్టోనియన్ శ్రద్ధాసక్తులను కూడగట్టుకొని అమెరికా చరిత్రరచన కుపక్రమించాడు. అతని పరిశ్రమ తొమ్మిది సంపుటాల అక్షరా కృతిగా ఘనీభవించి 'History of the United States during the Administration of Jefferson and Madison' అనుపేర వెలసింది (1889-91). అవి ఫ్రాన్సిస్ పార్క్ మన్ సంపుటాల్లాగ చక్కని పరిశోధన ప్రబంధా లనిపించుకున్నాయి. అత డాకాలాన్నే ఎన్నుకోవడాని కనేక కారణా లున్నాయి. అది తన తాతముత్తాతల అధికారాల తరాలకు మధ్యకాలం. తాతముత్తాతల ఊసెత్తు కుంటే ఔచిత్యసహాకృతంగా దాన్ని చర్చించడాని కవకాశం వుండదేమో.

అదిగాక ఆ కాలం అమెరికా దేశచరిత్ర ఇంకా రూపురేకలు దిద్దుకొం టున్న కాలం. మరోసంగతి: మానవజాతి కార్యగతుల గురించి తనకు తా నొక విచారం సల్పి అందులో ఏమన్నా ఒక పద్ధతి వున్నదా అని చూడా లనే ఆశకూడ గలవా డతడు. బహుశా ఇలాంటి నిమిత్తాలతోనే కాబోలు గతంలోకి దిగిన మార్క్‌ట్వెయిన్‌లా ఏడమ్సుకూడ అలాంటి పద్ధతేమీ లేదని ఒక నిశ్చయానికి వచ్చాడు. జెఫర్సన్, మేడిసన్, మన్రోలు 'మిసిసిపి నది మధ్య తుప్పతుప్పన ఎగురుతూ అభినయంచేసే పట్టి మిడతలు'. 'నీరస మైన ప్రాతికూల్యపు మార్గాన సాగిన సామాజికవికాసమే' చరిత్ర.

ఏడమ్సు తన తొమ్మిది సంపుటాల్లోనూ మానవుల భ్రాంతిచాపలాల నావిష్కరించడంలో చక్కని ఆసక్తి చూపి రక్తిగొలిపేడు. ఒక విశాల దృక్పథం కూడ చూపేడు.అదే దాన్నొక ప్రామాణిక గ్రంథం(Classic) చేసేది. కాని పిమ్మట తన అభిరుచికి తగిన నైరాశ్యదృక్పథంతో చరిత్ర కొక క్రొత్త నిర్వచనం చేసుకున్నాడు. 'ఉపలభ్యమాన శక్తి' సిద్ధాంతం ('the law of entropy' in physics,i.e, the available energy) తీసుకుని దాన్ని చరిత్రకు సమన్వయించాడు—మానవ శక్తి అనునిత్యం, పునస్సంపాదన నిరవకాశంగా చెదిరిపోతోంది, వ్యర్థమై పోతోంది అని నిరూపించడానికి. అవయవాత్మకమైన వస్తువు లన్నిటిలాగే 'సంఘం' (Society) కూడ ఒక నిలకడగల స్థితి ఏర్పడేదాకా దిగజారి పోతూవుంటుంది. ఈ స్థితి ఎంతో దూరంలేదు; దగ్గర పడిపోయింది అని ఏడమ్సు భావన. ఎందుచేత నంటే, ఆధునిక జగత్తంతటా అతి త్వరితమూ, నిత్యనూతనమూ అయిన పరిణామప్రగతి కనిపిస్తోంది. విల్లర్డ్‌గిబ్స్ (Willard Gibbs) అనే అమెరికన్ శాస్త్రజ్ఞుని గ్రహదర్శన సూత్రాన్ని (Rule of Phase) గ్రహించి దాని ప్రకారం చూస్తే మానవశక్తి క్షీణించే వేగాన్ని గణితశాస్త్ర ప్రకారం లెక్కించవలసిందే నంటాడు. ప్రపంచ చరిత్రను మూడవస్థలుగా విభాగించవచ్చు. అందులో మూడవదైన విద్యుదవస్థ (the Electric Phase)ను ఆయన చికాగో

లోను, పేరిస్‌లోను ప్రదర్శనశాలలలో నెలకొల్పబడిన విద్యుదుత్పాదక యంత్రాలు(Dynamos)చూసి గ్రహించాడు. ఆ అవస్థ 1900 నుంచి 1917 వరకు వుంటుంది. అటుపై ఆకాశ సంబంధమైన మరో అవస్థ(Ethereal Phase) వుండవచ్చునట. అవి 1921 సం॥లో మానవజాతి చరిత్రావకాశాల అవధిని సూచిస్తాయట.

ఈ మాటలు వినగానే ఎవరికైనా పాపం ఏడమ్సుతనశక్తిని వృథా చేసుకుంటున్నాడేమో అనిపిస్తుంది. సరే, అతని ఊహ ఎలాగూ అయథార్థమైనదే.అసలాఊహ ఆయన చేసిననాడే పట్టించుకోవలసినపనిలేకపోయింది. కాని ఆయనకు సాదృశ్యాలంటే ఇష్టము. ఒక విప్రకీర్ణ ప్రపంచంయొక్క కావ్యరూపంలా ఆ ఊహ ఆయన కుల్లాసం గొల్పింది. ఇక ఆ నాడు చరిత్ర కూడా ఒక శాస్త్రమే అని వినిపిస్తూ వుండిన ప్రసంగాలకు విసుగెత్తి ఆ విషయాన్ని పరీక్షకు పెట్టేడు. ఆ విషయంలో ఆయన కొస్త సముద్ర తీరంలో కాన్యూట్ లాగ ప్రవర్తించాడు. తన్ను జూచి తరంగాలు తటపటాయించకపోతాయా అని కాన్యూటు లోలోపల అనుకోలేదని ఎవరికి తెలుసు? అవి సహజంగా పురోగమించేసరికి అతడు తన ఆస్థాన జనాన్ని నిందించడంలో ఆనందాన్ని పొంది వుంటాడు. అలాగే తోడి చరిత్రకారులతో ఏడమ్సున్నూ. "రెచ్చగొట్టకపోతే చరిత్ర చచ్చిపోతుంది. నా వృత్తికి నేను చేయగలిగిందల్లా ఒక మిడుతలా సేవ చెయ్యడమే" అంటాడాయన ఒక లేఖలో.

బాగుంది, ఆయన సిద్ధాంతా లాయనచే ఒకటో రకం పుస్తకాలు రెండు వ్రాయించాయి. చరిత్ర అంటే ఏకత్వంనుండి నానాత్వం వేపు సాగిన ఒక ఉద్యమం. అదే నరజాతి సుఖయోగ పరిభాషలో చెప్పాలంటే ఏకత్వం మనకు సర్వమూ ఇచ్చింది; నానాత్వం అంతటినీ హరించుకుపోయింది. 1895 లో ఫ్రాన్సులో సెలవులు గడుపుతూ ఆ వాతావరణమంతటా ఒక వింత ఆకర్షణను గమనించా డాయన. అక్కడి పల్లీపక్క—

శాల చిన్నాపెద్దా గుడిగోపురా లతనికి ముచ్చట గొలిపేయి. ఆయన సంగీత సాహిత్యాల్లో, పన్నెండు పదమూడు శతాబ్దులనాటి ఆధ్యాత్మిక ప్రపంచంలో మునిగి తేలేడు. శాంతి పొందేడు. శాంతి అంటే - మేరీ కన్య మూర్తిలో వున్న ఐక్యస్ఫురణతో, ఆమెకు నరులు కట్టిన ఆలయాలలో గల శక్తిస్ఫురణతో సమంగా ఆయన భావించిన ఆత్మశాంతి. ఏడమ్సుపై స్త్రీల ప్రభావం చాలాకాలం పనిచేసింది. 'డెమోక్రసీ' (1880), 'ఈస్తర్' (1884) అనే అతని నవలలలో నాయికలే నాయకుల కంటె గురుతర వ్యక్తిత్వం గలవారు. రమణుల సహవాసంలో (పురుషుల సాహచర్యం కంటె ఆయన ఎక్కువగా అపేక్షపడేది) జీవితమంతా రమణీయంగా, రచనాచణంగా వుందనే భ్రాంతి కలగడాని కవకాశం వుంది. అయితే వాళ్ళ పీడితభర్త లెదురయ్యేసరి కా భ్రాంతి పటాపంచలై పోతుంది.

ఈ అనుభవాన్నీ, ఉత్తర ఫ్రాన్సులోని ఉత్తమ క్షేత్రాల యెడ తన కేర్పడిన ప్రతిపత్తినీ ఆయన 'Mont—Saint—Michel and Chartres' (1904) లో మేళవించాడు. 11 వ శతాబ్ది Mont-St. Michel పురుషత్వంనుండి 12 వ శతాబ్దికి మానవ స్వభావం క్రమంగా మార్దవం, స్త్రీ జనోచితమైన సౌకుమార్యాన్ని చేకూర్చుకుంటూ శృంగార కావ్యాల్లో, గోథిక్ శిల్పాల్లో, ముఖ్యంగా Chartres లో ప్రతిఫలిస్తూ పరిక్రమించింది. ఏడమ్సు దృష్టికి చరిత్ర సర్వంలోనూ అదే గొప్పకాలంకింద లెక్క. నార్మండీని తన చిరంతనపైతామహంగా చెప్పుకోడానికి సంబరపడ్డాడు. ఏ విషయానైనా ఎత్తుకోడానికి బోస్టను కంటె నార్మండీ చాలా అనుకూలమైన ప్రదేశం. ఇక్కడైతే స్త్రీని మన సారా అభినందించవచ్చు (విట్మన్ని మినహాయిస్తే అలా చేసినవా రమెరికనులలో అరుదు అని ఆయనే అన్నాడు); చట్టంనుండి, 'ప్యూరిటన్' దేవుడినుండి, యంత్రప్రాయమైపోయిన ప్రపంచంనుండి వేర్పడి ఊరట పొందవచ్చు. 'Mont-St.Michel' లో పవిత్రమైన అనురాగతత్వం

ప్రతిఫలించింది. దాన్ని ఏడమ్సుయొక్క ప్రవాసస్థితిరూపంగా భావించడం తాదృశప్రజ్ఞావైభవం గల అమెరికను లోక మహోత్తమ దేశంకోసం అది తమకడకు వస్తుం దనుకోకుండా సాభినివేశంగా ఎంత ప్రయత్నం చేశారో దాన్ని ఉద్ఘాటించడమే అవుతుంది.

ఇక అతని 'The Education of Henry Adams' వుంది. అది లోపాయికారీగా 1907 లోనే అచ్చయినా నలుగురి దృష్టికి వచ్చింది 1918 లో. 20 వ శతాబ్దిలోని నానాత్వంగురించిన పరిశీలన కది ఉద్దిష్టమైనది. ప్రథమపురుషలో చెప్పబడిన ఆత్మకథ అది. తనతో పోల్చి చూస్తే ప్రశాంతంగావున్న యాంత్రికావస్థ (Mechanical Phase) తరువాత వచ్చిన విద్యుదవస్థ (Electric Phase) యొక్క అవ్యవస్థను ఏడమ్సు జీవితంలోనే ఎత్తిచూపుతుం దా గ్రంథం. మేరీమాతకు బదులు దారుణమైన 'డైనమో' ముందు నిలుచున్నాడు మనిషి. ఈ పరిణామమంతా సన్నిపాతం (delirium) లా వుంది. ఆ పుస్తకం కేవలం గత కాలం గురించిన ఏడుపే అనుకుంటే విసువెత్తిస్తుంది. ఏడమ్సు స్వీయ జీవితప్రమేయం చెప్పకుండా తన సిద్ధాంతవివరణలతో నింపిన చివరి ప్రకరణాలు సామాన్యపాఠకుడి (average reader) కి విధిగా ఆసక్తి కలిగించలేవు. కాని మొత్తంమీద అది అమితనమ్రతతో, అందమైన రచనతో, అనేకములైన ఉద్దేశాల వ్యక్తిత్వాల సమీక్షణంతో కూడిన గ్రంథరాజం. ఇందులో ఏడ మ్సేమన్నా అభినయం చేస్తున్నాడా అనే ప్రశ్నతో ఆగిపోకూడదు మనం. ఒక కళాఖండం ఎంత యథార్థమైనదో మన కిందులో కనిపించే అతని స్వరూపంకూడా అంత యథార్థమైనదే. ఒక శకంయొక్క చిరస్మరణీయమైన చిత్రం ఆ గ్రంథం.

ఏడమ్సు లేఖల్లో కూడ రక్తి, అంతర్దర్శనమూ లేకపోలేదు. ఆంగ్ల భాషా లేఖారచయితలలో అతి విదగ్ధులలో అత డొకడు. దక్షిణ సముద్రం గురించి కాని, ఆర్కిటిక్ వలయం గురించి కాని, అప్పుడే చదివిన

పుస్తకం గురించి కాని, హఠాత్తుగా స్ఫురించిన ఒక ఊహ గురించి కాని - దేనిగురించి వ్రాసినా, వర్ణించినా (లేఖలలో), ఆ వ్రాతల్లో ఒక వింత నైజం, చతురోక్తి చమత్కారం నిక్షేపిస్తాడు. అది గమనించిన పాఠకుడత డెంత నిస్పృహుడైనట్లు వెర్రిమొహంవేసినా అతడిని వెంటనే క్షమించడానికి సంసిద్ధత చూపడమే కాదు, ఇంకా ఎక్కువగానే సంభావిస్తాడు. 'జెరెమియా' లందరిలోకీ మహోల్లాసి అతడే (Jeremia అనే ఆయన 'Book of Lamentations' వ్రాసిన ఒకానొక ప్రవక్త. ఇక్కడ విషాదాత్మక గ్రంథకర్తల కత డొక సంకేతంగా గ్రహింపబడ్డాడు); అపజయం పొందినవా రందరిలోకీ అతడే నేర్పరి, నెఱవరి. అతని రచన అమెరికాలో సమకాలికమైన పరిస్థితి కచ్చంగా తగినది. కాదంటే ఇంకెవరి రచనా కాజాలదు. ఒక హవెల్సు, ఒక డ్రెయిజర్, ఒక హెన్రీజేమ్సులాగే ఏడమ్సుకూడా ఆ కథలోని ఒక అంతర్భాగమే. ఆయన తోపలకు రానని ఎంత మారాము పెట్టినా అది పట్టించుకోనట్టే మన మతడిని లోనికి తీసుకురావాలి.

ఇక గర్ట్రూడ్ స్టీన్ విషయం-ఫ్రాన్సు హెన్రీ ఏడమ్సు కెంత ఉపకరించిందో ఆమెకూ అంతా ఉపకరించింది. అయితే బహుధా భిన్నమైన విధంగా. తా నక్కడికి హతశేషుని (Survivor)లా వచ్చా ననాడాయన. ఈమె పురోగామినిలా వచ్చింది. 1902 లో పేరిస్‌లో స్థిరపడిపోయి అక్కడా, ఆ చుట్టుపక్కలా నలభైయేళ్ళకు పైగా నివసించింది. 1902 నాటి కామె యువతి. సంపన్నురాలు. చురుకైన తెలివిగలది. మన స్తత్వశాస్త్రం చదువుకొంది. (ఆమె హెన్రీజేమ్సుకి సోదరుడైనవిలియం జేమ్సుకి శిష్యురాలు). అప్పటి కామె లబ్ధప్రతిష్ఠురాలైన రచయిత్రి కాదు. అయితే ఆమె తొలినాటి వస్తువుల్లో కొంత స్వతంత్ర వ్యక్తిత్వం వుంది. అందులో ఒకదానిలో ఒక యువకుడు తన తండ్రిని సిగపుచ్చుకుని ఒక తోటలోనుంచి ఈడుస్తాడు. "ఆగు, నేను మా నాన్నని యీ చెట్టు దాకా మాత్రమే ఈడ్చాను" అంటా డా ముసలాడు. హెన్రీ ఏడమ్సు

ఒక తరానికీ మరో తరానికీ మధ్య కాలికి లేదంటాడు. ప్రతి క్రొత్తతరమూ ప్రాత తరంతో విధిగా పోరాటానికి తలపడుతుందని గర్ట్రూడ్ అభిప్రాయం. ఏడమ్సులా కాక ఆమె భవిష్యత్తు ఆశల కోశమని భావించే వ్యక్తిగనుక ఆ జ్ఞాన మామెకు సంతృప్తి నిచ్చింది. మన స్తత్వ శాస్త్ర సాహాయ్యంతో ఆమె సత్యాన్ని అనాచ్ఛాదితం చేద్దా మనుకొన్నది. ముందునాటి అమెరికన్ రచయితలకూ అదే కోరిక వుండేది. "ఎంత వీలైతే అంత సామాన్యంగా వుండాలని ప్రయత్నిస్తున్నాను" అని హావెల్సు అన్నట్లుగానే అప్పుడప్పుడామె కూడ అంటూ వుండినా, 'స్వచ్ఛంద దర్శనవాదం' ('Impressionism') తో 'వివిధ దిగ్దర్శన వాదం' (Cubism) లా తొలుతటి వాస్తవికతావాదులతో తాదాత్మ్యం నేకీభవించలేదు.

చిత్రకళతో సరిపోల్చడంలో ఒక ప్రాముఖ్యం వుంది. ఆమె పట్ల మన స్తత్వశాస్త్రంలో ఆసక్తి అంటే అం దెక్కువపాలు భాషా విషయంలో నన్నమాట. 'Stream of thought' (i.e., భావనా స్రవంతి. అదే పిదప 'Stream of Consciousness', i.e., చైతన్య స్రవంతిగా మారింది) అనే పదబంధాన్ని తయారుచేసిన విలియం జేమ్సు కొన్ని మానసిక పరిస్థితులలో యుక్తిసహమైన అర్థంమీద శబ్దాలు స్వారిచేసే తీరు చూసి ఆశ్చర్య చకితు డయ్యాడు. నత్రజామ్ల జనిదం (Nitrous oxide) ప్రభావం క్రింద ఆయన కొన్ని అద్భుతమైన నిరర్థక సిద్ధాంతాలు కనిపెట్టేడు. మచ్చుకు చూడండి:

"There are no differences but differences of degree between different degrees of difference and no difference."

[వివిధ ప్రమాణాల భేదాభేదాల మధ్య మరి ప్రమాణభేదాలే గాని భేదము లన్నవి లేవు.]

ఇది పట్టపగ్గాలు లేని వేదాంతుల భావనలా వుంది. గర్ట్రూడ్ స్టీన్ తన మనోజవనాశ్వాన్ని గూడ అలాగే విఖలీన విశృంఖల స్వైరవిహారం చేయించాలని నిశ్చయించుకొన్నది. పేరిస్‌లో ఆమె తన సోదరుడు లియో ద్వారా కొంతమంది యువకళాకారుల స్నేహం సంపాదించింది. వాళ్ళప్పటి కజ్ఞాత వ్యక్తులుగా వుండినా తదుపరి ఈ శతాబ్ది చిత్రలేఖకులలో అగ్రేసరులుగా పరిగణింపబడవలసి వున్నవారు - పికాసో (Picasso), బ్రేక్ (Braque), మెటిస్సె (Matisse). ఆమె తన శబ్దపరికరంతో ఏమి చేదామని ప్రయత్నిస్తోందో సరిగ్గా అదే చేస్తున్నారు వాళ్ళు తమ వర్ణలేపన సామగ్రితో. అంటే - సంప్రదాయమార్గంనుండి విడిపోవడం, వస్తువు (subject) ను వాహిక (medium) మించి పోయేటట్లు చెయ్యడం, నిరాడంబరతను సాధించడం - ఇవీ వారి ధ్యేయాలు. ఆ నాటి సంగీతం విషయంలో గూడ అలాంటి ప్రయత్నాలే జరుగుతున్నాయి. పేరిస్‌లో సర్వకళలూ కలిసి కట్టుగా అభ్యుదయం పొందుతున్నాయి. ఆ పద్ధతి ఏడమ్సుగారి బోస్టనుకిగాని, మిస్ స్టీన్ స్వస్థలమైన పిట్స్‌బర్గుకు గాని కేవలం అపరిచితమైనది.

పికాసోకి లాగానే ఆమెకున్నూ విలాసకళాశయాల నుండి బయల్వెడలిన విప్లవమంటే, నిరాడంబరతతో నిమిత్తమున్నంత మట్టుకు,ద్వివిధ ప్రయోజనాత్మక మైనది. మొదటిది, కళ పొదుపు యొక్క చరమస్థితిని గురిగా ఎంచవలె. అది ప్రశాంతంగా అతి సురుచిర నగ్నంగా, డేఫో (Defoe) వచన రచన (గర్ట్రూడ్ చాలా మెచ్చుకొన్నది) వలె ఉద్రేక వ్యాకులం గాకుండ, అయితే అంతకంటె అధికంగా అతీంద్రియ గమ్యమానంగా వుండవలసి వున్నది. (బాహిరమైన వస్తుసామగ్రి యెడల వైముఖ్యం నూతనోద్యమ లక్షణం. ఆ దృష్టితోనే యిటీవల విలియం కార్లోస్ విలియమ్సు అనే అమెరికన్ కవి నవల స్వభావతః 'అంతర్మగ్నమైన నగ్నత' ను చేరలేదు గనుక, ఒక కళారూపంగా కావ్యానికి తీసిపోతుంది అని వాదించాడు). ఇక రెండవది స్నిగ్ధతలో నమ్మకంలేని ఒక

అపరిష్కార ధోరణి (అంటే ఏ సంస్కారమూ లేకుండా సహజంగా మోటుగా వున్నదే మంచిదనే మతం - a cult of crudity). నిజాని కిది ఆ కళాకారులు సాధింపదలచుకొన్న దాని నవ్యతలో స్వాభావికంగానే గతార్థమైవుంది:

"పేబ్లో (అంటే పికాసో) ఒకసారి అన్నట్లుగా ఆమె అన్నది గదా - ఒక వస్తువును తయారు చెయ్యాలనుకొన్నప్పుడు అది విధిగా వికారంగా వుండేటట్లు చెయ్యడ మన్నదే చాలా చిక్కైన పని. అలా నువ్వు చేశాక, నీ తరువాతివా రింక దాని తయారులో పడవలసిన శ్రమ వుండదు. వాళ్ళు దానిని అందంగా చేసుకోగలుగుతారు. ఇతరులు చేసిపెడితే అందరూ అభినందించేవాళ్ళే."

పాక్షికంగా చూస్తే ఈ 'అపరిష్కృతి' అన్నది స్వయంనిర్దిష్ట విధి (Self-imposed condition). ఏ వస్తువూ సిద్ధంగా వుందని గ్రహించడానికి నిరాకరించేదాని ఫలిత మిది:

"So then I said I would begin again. I would not know what I knew about everything what I knew about anything."

[అందుకే మళ్ళా ప్రారంభిస్తా నన్నాను నేను. దేనిగురించేనా నా కేమి తెలుసో, అన్నిటిగురించీ నా కేమి తెలుసో తెలుసుకోను నేను.]

ఇదీ గర్ట్రూడ్ స్టీన్ రచనల తెరవెనుక భాగోతం. 'వస్తువుల ఆంతర్యాలు' నిరూపించే ఒక సరిక్రొత్త సాహిత్యాన్ని సృష్టించడానికి సమకట్టింది. కొన్ని రచనలలో పదాలను వాటి పరిపాటి అర్థాలనుంచి వేరుచెయ్యడానికి, కేవలం వినోదంకోసం వాటిని 'క్యూబిస్టు' రచనలో వస్తువుల్లా సంతరించడానికీ ప్రయత్నించింది:

"I saw representative mistakes and glass cups, I saw a whole appearance of respectable refugees, I did not ask actors I asked pearls, I did not choose to ask trains, I was satisfied with celebrated ransoms."

మిగతా గ్రంథాల్లో ఆమె విద్యావిహీనుల వ్యావహారిక సంభాషణాలోలాగ పునరుక్తులతోను, నీరసోక్తులతోను నిండిన భాషలో వ్యక్తులనూ, సన్నివేశాలనూ చిత్రించింది. అలాంటి చిత్రణంద్వారా మన మనుగడల గూర్చి సద్యఃస్ఫురణ కలిగించాలని ఆమె ఆశయం. ఆమె వ్రాసిన 'The Making of Americans' (రచన 1906-8, ప్రచురణ 1925) అతి దీర్ఘమూ, అసుందరమూ అయిన పుస్తకం. అందులో మానవస్వభావాన్ని సర్వతోముఖంగా చూపేనని ఆమె తలంపు. మొట్టమొదటగా ఆమె మిత్రబృందం దాటి నలుగురికీ ఆసక్తి కలిగించిన నవల 'Three Lives' (1909). అది ఫ్లాబర్ట్ వ్రాసిన 'Trois Contes' కి మానసపుత్రిక. అమెరికాను రంగంచేసుకుని ఆమె వ్రాసిన మూడు కథలలో రెండిట వృద్ధులైన జర్మను సేవకులు, మూడోదానిలో Melanctha అనే నీగ్రో అమ్మాయి ప్రధానపాత్రలు. చదవాలనిపించే ఆమె పుస్తకాల్లో 'Three Lives' ఒకటి. ఆఖ్యానపద్ధతులలో ఒక ప్రయోగంగా మొత్తాని కది బాగా రాణించినదే. Melanctha జీవితంలోని చిక్కులు, అడియాసలు, ఇబ్బందులు ఎక్కువగా సంభాషణరూపంలో చిత్రించబడ్డాయి. గర్ట్రూడ్ గ్రంథాల్లో అమితవినోదావహమూ, ఆమె స్నేహానుబంధాలకొక అమూల్యపేటిక అయి వాసికెక్కిన మరో గ్రంథం—'The Autobiography of Alice B. Toklas' (1933)—తన కార్యదర్శిని, సహచారిణి అయిన మిస్ టోక్లాస్ దృష్టిలో తన ఉదంతము.

మిగతా ఆమె రచనలు చాలమట్టుకు క్లిష్టంగా వుంటాయి. అయితే పునరుక్తివల్ల భాసించినంత క్లేశం అస్పష్టతవల్ల భాసించదు. ఆమె

ఊహ లెటు పారుతున్నాయో గ్రహించడానికి మామూలుగా అవకాశం వుంటుంది. ఆమె అప్రయత్నంగా వ్రాసే పంక్తులు ఆహ్లాదజనకాలుగానే వుంటాయి. నిర్వచనాలూ, వివరణాల విషయంలో మరే రచయితా ఇంత స్వచ్ఛందత ప్రదర్శించివుండలేదు. అందులో కొన్ని సునిశితంగా వుంటాయి గాని, చాలామట్టుకు మరీ చిత్తం వచ్చినట్లు చాదస్తంగానూ వుంటాయి. ఆమె ఏకాగ్రతకూ, సునిశితమైన అంతఃపరిశీలనకూ అతిప్రాముఖ్యం ఇస్తుంది. నామవాచకాలంటే ఉత్తపేర్లనీ, అవకాశం వున్నప్పుడల్లా వాటిని విసర్జించవచ్చనీ, వాక్యంలో క్రియ ఒక్కటే ముఖ్యమనీ ఆమె వుద్దేశం. విరామచిహ్నాలు (Punctuations) అడ్డుతగుల్తూవుంటాయని ప్రశ్నార్థకాదులను తొలగిస్తుంది. ఫలితం వైశద్యం కాదు - అర్థప్రకీర్ణత, దురవబోధమున్నూ. పదజాలాన్ని పరిమితం చేసుకోవడంవల్ల అప్పుడప్పుడు చిన్నచిన్న వాక్యాల్లో చలాకీతనం సాధించగలుగుతుంది. (తరచు అవి తన సోదరుడు లియోతో సహా ఇతరుల రచనలకు టీకాప్రాయంగా వుంటాయి. అతడు చెరుపు మరుపూ గల మిస్ టోక్లాస్ గురించి ఇలా అన్నాడట: "నేనే కాని సేనాపతినైతే ఒక్క యుద్ధాన్ని గోల్పోను, ఒకచోటి కొకచోట పెట్టేస్తాను"). కాని ఎప్పుడన్నా సుదీర్ఘంగా ప్రసంగించబోయిందా గింజుకోవలసివస్తుంది. కథాఖ్యానం అంటే ఒక వస్తువు యొక్క గమనాన్ని 'ఫిల్మ్' తీసేటట్లుగా విశదంగా కనిపించని వివిధస్థితుల గుండా నడిపించడమే అనుకుంటుంది గాని ముఖ్యమైన గమనవేగాన్ని ఉపేక్షిస్తుంది. 'ఫిల్మ్'లో అనేకప్రతిబింబాలు వున్నా ఒక్కొక్కదాన్ని తీసుకుని చూస్తే ఫలితం వుండదు; అవన్నీ కలిసి ఒక సమష్టిఫలితాన్నివ్వడానికి శీఘ్రగమనంతో గ్రహింపబడాలి. నిజానికామె విషయానికి హాని కలిగించే విధానమంటే బాధపడుతుంది. కొన్ని సందర్భాల్లో ఆమెను 'కవీనాం కవిః' అన్నట్లు రచయితలకు రచయిత (రచయిత్రి) అనవచ్చు. ఆ విధంగా అమెరికన్ సాహిత్యజగత్తులో ఆమె కొక ప్రాముఖ్యం ఏర్పడుతోంది.

అమెరికను సాహిత్యానికి రచయితల్లో ఆత్మప్రత్యయలోపం, ఆ వృత్తికి సంబంధించిన సమగ్రపరిజ్ఞానంలో లోపం వుండటంవల్ల కొంత లోటు ఏర్పడింది. ఎమర్సను బోస్టనులో రచయితల సమావేశాల కనుకూలంగా మిత్రుల సంస్థగా ఒక ఉపాహారశాలలాంటి దేర్పడితే బాగుండు ననుకున్నాడు; హతాశు డయ్యాడు. అతని కేభైయేళ్ళ అనంతరం వున్న డ్రెయిజర్ తన ఆసక్తుల్లో పాలు పంచుకోగల రచయిత లున్నారని, వాళ్లు తన 'Sister Carrie' రచనలో తోడ్పడగలవారనీ గ్రహించలేక పోయాడు. ఇలాంటి పాటుకి ప్రతిగా పోటెత్తింది గర్ట్రూడ్ స్టీన్. ఆమె ఆత్మప్రత్యయం చెప్పతరంగాదు. తన 'The Making of Americans' అనే పుస్తకమే "నవ్యమైన రచనావిధానానికి సిసలైన నాందీ వాక్యం" అంటుంది. చాలామంది ఆ మాట నొక వికటంగా తీసుకున్నారు. కాని రచనాశిల్పమాత్రంగా నయితేనేం యువరచయితలు కొందరామెను విశ్వసించారు. 'సంధి' (Armistice) అనంతరం ఆమె పేరిస్ సాంస్కృతికరంగంలో తెలివిగా, కలుపుగోలుగా, హాయిగా, అమెరికన్‌గా పాల్గొంటూ వుండడం గమనించారు. వాళ్ళంటే వల్లమాలిన మక్కువ చూపించే దామె. ఫ్రెంచి వార్తాపత్రికలకంటె పేరిస్ 'హెరాల్డ్-ట్రిబ్యూన్' నంటే ఆస్థతో చదివేది. జనరల్ గ్రేంట్ ఆమె 'హీరో'లలో ఒకడు. గ్రామఫోనుమీద 'The Trail of the Lonesome Pine' అనే పాట వేసుకోవడ మంటే ఆమె కిష్టం. ఆమె దాన్ని అర్థంచేసుకుంది. ఆ కుర్రాళ్ళతో రచనావృత్తిని స్వీకరించినవాళ్ళ సమస్యల గురించి చర్చించేది. దేశీయమైన పలుకుబడి కొంత ఫామేదా తెచ్చిపెట్టింది. అమెరికాలోని ప్రాంతీయభాషావికారాలు సార్వజనీనతత్వం గల సాహిత్యంయొక్క నవీనస్థితికి సన్నిహితంగా వున్నవని విశ్వసించింది. కొన్ని సందర్భాల్లో దాని సంభావ్యత నూహించింది. యుజీన్ ఓనీల్, షెర్వుడ్ ఎండర్సన్, ఎర్నెస్ట్ హెమింగ్వే (ఈయన ఆమె 'ప్రూఫు'లు చదివేవాడు. 'ఆమె చాలా తెలివైన' దని

వ్రాశాడు 1923 లో)[1] మొదలైన అమెరికన్లు ఇంకా రచనావ్యాసంగ ప్రారంభదశలో వున్నకాలంలో వాళ్ళకు మార్క్ ట్వెయిన్ యొక్క గద్యరచనయున్నూ, కొత్త మార్పులతో అమెరికన్ వార్తాపత్రికలలోని గద్యరచనలున్నూ సహజత్వ ముట్టిపడుతూ, ఆ నవీనరీతుల కుపోద్ఘాత ప్రాయాలుగా వుంటవని నచ్చజెప్పింది. ఆధునికఅమెరికన్ గద్యవాఙ్మయానికి ప్రారంభదశలో ఒక పెద్దప్రభావకేంద్రంగా ఆమెకు ట్వెయిన్‌తో సమప్రతిపత్తి చెల్లుతుంది. తమాషాకి దాని కాయన తండ్రి అనీ, ఆమె తల్లి అనీ చెప్పవచ్చు. అమెరికన్ రచనలవిషయంలో హన్నిబాల్ (మిస్సోరి), పేరిస్ (ఫ్రాన్సు) రెండూ ముఖ్యాంగాలు కావడం, రచయితల ఆడంబరప్రదర్శన మేమీ లేని శైలీవిన్యాసాలకు స్థిరమైన ఆర్భాటాల అక్కఱ ఏర్పడటం చిత్రమైన సంగతి. కాని గర్ట్రూడ్ స్టీన్ తనవారిని స్పెయిన్ వారితో సరిపోలుస్తూ ఇలా అంది:

"అమెరికనులకు చాలామంది యూరపియనుల కున్నట్లుగా భూమితో గాఢసంబంధం లేదు. వాళ్ళ భౌతికవాదం అస్తిత్వానికీ, ఆస్తిత్వానికీ (existence, possession) సంబంధించింది కాదు. అది కార్యవాదానికీ, పార్థక్యానికీ (abstraction) సంబంధించింది."

కార్యవాదమూ, పార్థక్యమూ అంటే: 'Huckleberry Finn', 'The Making of Americans' అంటే: స్వదేశంలోనే వుండవలసిన ఆవశ్యకత, స్వదేశాన్ని అర్థంచేసుకోవడానికి దానిని విడిచిపెట్టిపోవడమూ నన్నమాట. లేక స్టీన్ తన రాజీధోరణి వెల్లడించినట్లు "అమెరికా నా దేశము, పేరిస్ మా వూరు" అనుకోవడంలాంటిది. ఈ సంఘర్షణద్వైవిధ్యం అమెరికనుల ప్రవాసపుటుద్యమం అంతటా కాన

---

1. 'The Shores of Light' (London, 1952), 115-24 లో తనమీద తొలినాళ్ళలో వచ్చిన చక్కని విమర్శలను పునర్ముద్రించిన ఎడ్మండ్ విల్సన్‌తో హెమింగ్వే అన్న మాట లివి.

వస్తుంది. ఫలితంగా చాలామంది అమెరికనురచయితలు ఏదో తప్పుచేశా మనే బాధ లేకుండా ఎక్కువకాలం ప్రవాసంలో నిలవడంగాని, యూరపియన్ ప్రభావాని కెదురుగా తమ వ్యక్తిత్వాలు నిలువరించుకోవడం గాని సాధ్యపడేది కాదు. అంతర్యుద్ధానికి ముందునాటినుంచి కూడ ఆ సమస్యనెత్తుకొన్నప్పుడు రచయితలు విలవిలలాడిపోయేవారు; తమకు తామే అక్షింతలు వేసుకునేవారు. 1854 లో ఒకసారి లివర్పూలునుండి హాథార్న్ లాంగ్ ఫెలోకి వ్రాస్తూ, "సర్వదా నాకు స్వదేశానికి వెళ్ళి పోయి అక్కడే కనుమూయాలనే అనిర్దిష్టమైన, ఎప్పటికీ అంతుపట్టని కాంక్ష మనసులో వున్నా, నేనేకాని నీస్థితిలో వుంటే గంగకిద్దరి (యూరపులో) ఇల్లుకట్టి స్థిరపడా లనుకుంటాను" అన్నాడు. అయితే ఇతరత్ర, ముఖ్యంగా మరీ బహిరంగంగా చేసే ప్రసంగాల్లో ఆయన మరో తీరుగా మాట్లాడేవాడు. అతనికైతేనేం, మరొకరికైతేనేం ఇలాంటి ఇచ్ఛాపూర్వకజనాంతికం (Wistful asides) అన్నవి అసలుకథ లోని అంశలు. అమెరికాలో నిజంగా అమెరికనుతనం పెరిగిందికనుకనే అది మరింత యూరపియనుతనాన్ని భరించగలదు అని అనడం వుండే అదొక చక్కని విరుద్ధగోచారం (apparent paradox). ఒకవిధంగా చూస్తే హెన్రీజేమ్సు, గర్ట్రూడ్ స్టీన్ లు చేసిన పరిష్కారం అమెరికన్ సమగ్రతను వంచించడంకిందికి జమ అవుతుంది. మరోవిధంగా చూస్తే అది అమెరికన్ ప్రత్యయానికి గుర్తు అనిపిస్తుంది. "గుండె గొంతుకలోన కొట్లాడుతాది" అన్నట్లున్న హాథార్న్ఆశయం (ఇర్వింగు, లాంగ్ ఫెలో లదికూడ అదే) ఈ అర్వాచీనులలో—ఉభయప్రపంచాల (అమెరికా, యూరపు) లోనూ వున్న మంచిని అమెరికనులు పొందగలరు, లేదా పొంద డానికి ప్రయత్నించాలి అనే చల్లని పూనికగా పరిణమించింది.

# 11

## నవ్యకవిత్వం

ఎడ్విన్ ఆర్లింగ్టన్ రాబిన్‌సన్ (1869-1935)
కార్ల్ సేండ్‌బర్గ్ (1878 -)
నికొలస్ వేచెల్ లిండ్సే (1879-1931)
ఎడ్గార్ లీ మాస్టర్స్ (1869-1950)
రాబర్ట్ ఫ్రాస్ట్ (1875-1963)
విలియం కార్లోస్ విలియమ్స్ (1883 -)
ఎజ్రా పౌండ్ (1885 -)
వాలెస్ స్టీవెన్స్ (1879 -)

**1910** ప్రాంతానికల్లా, అంతకు నలభైయేళ్ళక్రితం హావెల్సు ప్రారంభోత్సవం జరిపించిన 'వాస్తవిక' గద్యవాఙ్మయోద్యమం ప్రభ తగ్గిపోయింది. క్రేన్, నోరిస్ మొదలైన ఆశాభావుకులైన రచయితలు చనిపోయారు. డ్రెయిజర్ కిరాయిపత్రికలపనిలో పడిపోయాడు

కలిగించింది. 1914 లో వచ్చిన యూరపియను సంగ్రామంవల్ల దాని కేమీ భంగపాటు వాటిల్లలేదు. 1917 లో అమెరికాకూడా యుద్ధంలో దిగినప్పటికీ ఆ కవులు యుద్ధానికి పూర్వపు తమ ప్రారంభాలను కొనసాగించగలిగేరు (గద్యరచయితలకుమాత్రం యుద్ధంతరువాతకూడ మళ్ళా కొంత కొత్తవిషయం తెలుసుకోవలసి వచ్చింది). ఆ 1912 గురించి ఒక నీగ్రోపాటలోని పంక్తులతో ఇలా చెప్పవచ్చును :

"యోగకాలం వస్తోంది, ఎంతో దూరం లేదు
చాలాకాలంగా దారిలోనే వుంది..."

ఆ యేడే ఇక త్వరలో పేరుప్రమోయడానికి సిద్ధంగావున్న కవులెందరో ఆ ముహూర్తంకోసం ఎదురుచూస్తూవున్నారు. ఆనాటికి ఎడ్గార్ లీ మాస్టర్స్‌కి వయసు 43 ఏళ్ళు. రాబర్ట్ ఫ్రాస్టుకి 37, కార్ల్ సేండ్‌బర్గుకి 34, వేచెల్ లిండ్సే, వాలెస్ స్టీవెన్సులకు 33. గద్య వాఙ్మయంలోకంటె కవిత్వవిషయంలో వచ్చిన నవ్యత ఆలస్యంగా వచ్చినా చాలాకాలంగా గర్భితస్థితి (gestation) లో వుండనేవున్నది. అయితే అది నైపుణ్యం పాలిటికి బాణసంచాల ప్రదర్శనలాంటి దేమీ కాదు. ఉచితమైన పదపరికరం, రూపధేయం ఏర్పడకముందు ఆ కవులంతా ఏదో అనిశ్చితస్థితిలో దేవులాడుతూవుండేవారు.

కొందరు కవులు నవ్యకవితాంశల నన్నింటినీ చక్కగా సంపుటి చెయ్యలేకపోయారు. సిడ్నీలేనియర్ రెండు ప్రపంచాలమధ్య వ్రేలాడే కవిగా భావింపబడ్డాడు. అతని కంటె ఘనుడు ఎడ్విన్ఆర్లింగ్టన్ రాబిన్‌సన్. అతడు న్యూఇంగ్లండువాడు. ఎడ్గార్ లీ మాస్టర్స్‌కి సమకాలికుడు. అగ్రశ్రేణిలో అడుగుపెట్టబోయాడుకాని కాలుజారి పోయింది. బహుశా దానికి కారణాలు ప్రారంభదశలో అసలు రంగానికి దూరంగా, అజ్ఞాతంగా వుండడమూ, తన కాలానికి తగిన ప్రతిస్పందనం పొందడానికి జంకుగొంకులతో స్వభావంలో ఏదో లోటువుండడమూ

కావచ్చు. మొదట్లో జోలా, హార్డీలంటే మోజుపడి వచనరచన చేయడానికి యత్నించాడుకాని క్రమంగా తలపడుతూ పొరపడుతూ దానినుంచి వేర్పడి స్వీయమైన కవితాధోరణిలో పడిపోయాడు. పాపం, అది అతని పాలిటికి కష్టమైన మందకొడిపురోగమనం అయిపోయింది. అతని మొదటి కవితాసంపుటి 1896 లోనే ప్రకటితమైనా 1920 నాటికిగాని జనం గుర్తించలేదు. గుర్తించాక అది కొంతవిజయమే అయింది. మూడు పర్యాయాలు 'పులిట్జర్' (Pulitzer) బహుమానం గెల్చుకున్నాడు. ఏపాటి నైపుణ్యం అతనిలో లోపించినదీ బహుశా ఈ ఒక్క సందర్భమూ సూచిస్తుంది. నిజానికీ ఇరవై ఏళ్లలోనూ అతడు పొందిన విశేషమైన మార్పేమీ లేదు. ఏ ఇతరనవ్యకవులనూ ఆమోదించని ప్రజల అభిరుచే అతని నామోదించేటంతవరకూ మాత్రం పురోగమించింది. ఒక నిబ్బరం, ఒక అన్వేషణ, ఒక నిస్పృహ గల అతని కవిత్వం సాంప్రదాయమార్గం కంటె చాలా బాగున్నా ఆ మార్గంలో వున్నట్టే భావిస్తుంది. మొదట్లో అతని కావ్యఖండికలు ఒంటరిగా దారిప్రక్కల చిక్కులతో చివికిన నిస్సహాయజీవితాలు గడిపే మనుషుల చిత్రణలుగా వుండేవి. అవి సున్నితమైన చిత్రణలు. అందులో న్యూఇంగ్లండుయొక్క వట్టి పాడిపలుకుబడి పట్టుబడిపోయిం దతనికి. 'ఇశ్శాక్ అండ్ ఆర్చిబాల్డ్', 'మినివెర్ చీవీ', 'ఇరోస్ టు రెన్నస్', 'మిస్టర్ ఫ్లడ్స్ పార్టీ' అనే అతని నాలుగు ఖండికల కెగబడ్డారు కావ్యసంకలనకర్తలు (anthologists). నాల్గింట చమత్కారంతో పాటు ఒక అగాధమైన నైరాశ్యదర్శనం వుంది. పైకి ఎంత పటాటోపంగా కనిపించినా అసలు మానవుడి స్థితిలో ఎంత క్లిష్టత, అశాంతి వున్నవో ఎత్తిచూపే డాయన. 'మినివెర్ చీవీ' అనే హాస్య ఖండికలోగూడ ఆయన ఇది వ్యక్తంచేశాడు:

"మినివెర్ మెడిసీని ప్రేమించాడు
అయినా, తా నెప్పుడూ ఎవరినీ (తన్ను ప్రేమించినవారిని)
చూడలేదు.
చూసివుంటే, అవిరామంగా పాపం చేసివుండేవాడు."

ఇక్కడా చరమశ్రుతి అపశ్రుతే:

"మినివెర్ చీవీ చాలా ఆలస్యంగా పుట్టేడు.
తలగోక్కున్నాడు, ఆలోచిస్తూవుండేవాడు,
మినివెర్ దగ్గేడు, దాన్ని 'విధి' అన్నాడు,
ఆ యింతా త్రాగుతూవుండేవాడు."

ఎమిలీ డికిన్సన్ (గెరార్డ్ మేన్లీ హాప్‌కిన్స్) తన కాలానికి ముందు పుట్టిందా అనిపిస్తుంది. కాని రాబిన్సన్ మినివెర్ చీవీలాగే ఆలస్యంగా పుట్టేడా అనిపిస్తాడు. ఏదో వుంది లోపం. అతడు చేసే ఆరోపణలు గాని, చెప్పే విరుగుళ్ళుగాని పూర్తిగా సంతృప్తిగా వుండవు. న్యూ ఇంగ్లండు యొక్క శుష్కత్వమే అతని కోశక్తి. అతన్ని సాహిత్య పరిపాకానికి దూరంచేసే అదే అతనిలోని ఒక లోపమున్నూ. ఫ్రాస్టులోలాగే రాబిన్సన్‌లో వున్న మిత భాషిత్వాన్ని "అది ధీమా కాదు, వట్టి సంగ నాచి తన"మనీ, గోపన గుణాన్ని "అది అగాధవిషాద మేమీ కాదు, వట్టి మేకపోతు గాంభీర్య" మనీ అనుమానించవచ్చు. అతనికి సమకాలిక విషమ పరిజ్ఞానం - అంటే బజారు ప్రచారం గల నవలారచయిత కుండే తాత్కాలిక యోగ్యత కాదు, ఉత్తమకవి కుండవలసిన గాంభీర్యం లేదు. అతనికి వస్తువునీ, భావాన్నీ సమన్వయపరుచుకునే శక్తి కూడా వున్నట్టు లేదు. అతని కావ్యఖండికలు అందులో కొంత హుందా, చతురత వున్నా అందులో ఒక సమస్యాత్మక వ్యసనం కూడా వుంది. (ముఖ్యంగా ప్రచారం పొందిన 'అర్థూరియన్' విషాదకావ్యత్రికంలో) అది మరీ దీర్ఘంగా ప్రథమ రంగాంతమందు సమాధానం దొరికేదిగా వుంటుంది. ఆయన తానేం చెప్పదలచుకొన్నాడో తనకే తెలీని అవస్థలో పడిపోతూ దరిగానక, అభిప్రాయాలు చెదిరిపోతూ గొప్ప శాబ్దికమైన నేర్పు మాత్రం చూపిస్తూ చెప్పిందే చెబుతూ వుంటాడు. ఇలాంటి అవ్యవస్థ ఆ కాలంలో మరి

కొందరిలో కూడా కనిపెట్టవచ్చు - ఇంగ్లీషు జార్జియన్సులో అయితే నేమి, విలియమ్ వాన్ మూడీ, ట్రంబుల్ స్టిక్ నే మొదలైన అమెరికన్లలో నైతేనేమి. ఈ అమెరికను లిద్దరూ అప్పుడప్పుడు నవ్యపద్ధతి నవలంబిస్తూ వుంటారు కాని మళ్ళా ఒక శాబ్దికమైన అతిసారంలో పడి వగులు కుంటూ వుంటారు.

అసలా నవోద్యమాన్ని అది రాగానే నడిపించినట్టిది చికాగో. డ్రెయిజర్ వ్రాసిన 'సిస్టర్ కేరీ', నోరిస్ వ్రాసిన 'ది పిట్', అప్టన్ సింక్లెయిర్ వ్రాసిన 'ది జంగిల్' అనే పుస్తకాల్లోని చికాగో పౌరులకు గర్వకారణంగా పరిణామం పొందుతూ వుంది. అది సంయుక్తరాష్ట్రి మహానగరాల్లో రెండవ స్థానాన్ని ఆక్రమించుకుంది. జనాభా విషయంలో లాగే సాంస్కృతికంగానూ న్యూయార్కు నధిగమించాలనే చూసింది. 1892 లో అక్కడొక విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఆ మరుసటి యేడే మహత్తరమైన 'కొలంబియన్' ప్రదర్శన అక్కడ జరిగింది. 1912 లో హేరియట్ మన్రో 'పొయెట్రీ' పత్రిక నెలకొల్పిం దక్కడే. ఆ తీర ప్రాంతంలోనే రచయితలనేకులు బయలుదేరేరు. ఇల్లినాయ్ కవిత్రయం- కారల్ సేండ్ బర్గ్, వేచెల్ లిండ్సే, ఎడ్గార్ లీ మాస్టర్సులు నవ్యకవిత్వంలో 'సర్వం జగన్నాథం' ఉద్యమంనుండి ప్రత్యేకంగా గుర్తింపదగిన అమెరికన్ ఉద్యమానికి దోహదం చేశారు. 'అట్లాంటిక్' కి వేయి మైళ్ళ దూరంలోనివారు కావడంవల్ల అందరికన్నా తమలో అమెరికనుతనం ఎక్కువ అని వారి వుద్దేశం. ముగ్గురికీ ఆర్జవధ్వజమైనవాడు, తన విశ్వాసంకోసం బలియైనవాడు, కష్టజీవి, అమెరికా సంక్షేపరూపమైనవాడు అయిన అబ్రహాంలింకన్ మీదను, ఇల్లినాయ్ అంటేను గొప్ప గురియేర్పడ్డది. సేండ్ బర్గు ఆరు సంపుటాలుగా లింకన్ జీవితచరిత్రను రచించాడు. లిండ్సే లింకన్ కి సుపరిచితమైన స్ప్రింగ్ ఫీల్డులో పుట్టేడు. మాస్టర్స్ తండ్రి న్యాయవాద వృత్తిలో లోగడ లింకన్ తో భాగస్వామిగా వుండిన విలియం హెర్న్డన్ తో తాను భాగస్వామి యైనవాడు.

"నా చిన్నప్పు డెప్పుడూ న్యూ ఇంగ్లండు గురించి వినివుండలేదు నేను" అని వ్రాశాడు లిండ్సే. మాస్టర్సు, సేండ్‌బర్గ్ (ఒక స్వీడిష్ వలస దారుని కుమారుడు)ల విషయంలో కూడా అది యథార్థం. భౌగోళికం గానూ, రాజకీయంగానూ ఐతేనేమి, వారి మమకారాన్ని బట్టి అయితే నేమి మిసిసిపి లోయ వారికి నచ్చిన సీమ. చికాగోయే వారికి రాజధాని. దాని కేంద్రప్రాంతపు వాతావరణాన్ని అలవరుచుకోవడానికే వారి కవిత్వం ప్రయత్నించింది. సేండ్‌బర్గు లిండ్సేలు ప్రత్యేకంగా తమ నిర్వచ నాలతో 'పబ్లిక్ - పీపుల్' విషయంలో అమెరికాలో గల పెద్ద సమ స్యను పరిష్కరించడానికి ప్రయత్నించారు. 'పబ్లిక్' అంటే అతి సాధా రణమైన దానిని అసాధారణంగా చేసేదనీ, 'పీపుల్' అంటే సర్వ సామాన్య విషయాలనుండి ప్రాముఖ్యాన్ని త్రుంచేసేవారనీ నిర్వచించారు.

ఆ ప్రయత్నం జరిగినప్పుడు ప్రమాదా లెక్కువగా వున్నాయి. కవి యైనవాడికి సభా వేదికల వాగ్ధోరణిలో పడిపోవడానికి గాని, మగసిరి గురించి పట్టించుకోవడానికి గాని, ముందంజలు వేసే అమెరికన్ పశ్చిమ ప్రాంతపు తొందర పిలుపులకు లొంగిపోవడానికి గాని, వ్యక్తిత్వం కోల్పోయి మందిలో కలిసిపోవడానికిగాని అవకాశం వుంది. బజారు భాషలో కవిత్వం వ్రాయడ మంత సులువైన పనికాదు. యాసబాసలు, మాండలికాలూ (Slang and dialect) వున్నాయంటే అవి వేగం అంతర్ధానమైపోతాయి. అదీగాక ఒక పట్టాన బోధపడవు. అంతా వట్టి జానపదంగా కానవస్తాయి. సేండ్‌బర్గు, లిండ్సేలు అవకాశం వున్నంత మేరకు సామాన్య ప్రజలతో కలిసిపోయేవారు. అసలు సేండ్‌బర్గు వాళ్ళలోనే పెరిగేడు. రచనా వ్యాసంగానికి ముం దాయన శ్రామిక వృత్తి కూడా చేసేవాడు.

వాళ్ళకు వాళ్ళ ప్రజాకవిత్వ సృష్టిప్రయత్నంలో క్రమంగా మూడు విషయాలు తోడ్పడ్డాయి:

కవిత్వ ప్రతికూల వస్తుపద సంచయం యెడ నవోద్యమాని కేర్ప

డిన సానుభూతి; సర్వసాధారణమైన అమెరికన్ సంభాషణల్లోని నికటమైన శక్తి; వెనుకబడిన నీగ్రో తన విషాద వేదాంతంతోనూ, లయాత్మకంగా భావం వ్యక్తీకరించగల సహజ సాఫల్యంతోనూ ప్రత్యేకంగా చేసిన దోహదం. ఈ లయల పోకడలు 'జాజ్' (Jazz) సంగీతంలో చక్కగా కుదురుతుంది. లాక్షణిక శిక్ష లేని ఒక విశిష్టమైన సంగీతరూపమది. ఒక నీగ్రో అన్నట్లు అది షరబత్ ఔరత్ రుబాయతుల నుండి కాదు - పచ్చి కల్లునుండి, పడుపుగత్తెలనుండి, విచ్చుకొన్న వియత్తలము నుండి ఆవిర్భవించినట్టిది.

అలాంటి తోడ్పాటులతో కారల్ సేండ్‌బర్గ్ కవిత్వం అవతరిల్లింది. మొదటగా 1904 లో ప్రకటితమైన అతని కవిత్వం ఉపేక్షింపబడింది. పదేళ్ల తరువాత కవిత్వం చదివే అలవాటున్నవాళ్ళు అతని కవిత్వం చదవడానికి సుముఖంగా వున్నారు. 'చికాగో' అన్న అతని కావ్యఖండికకు బహుమానం వచ్చింది. దాని కది హేరియట్ మన్రో పత్రికలో ప్రచురింపబడటం, ఆ పట్టణం ప్రశంసాత్మకమైనది కావడం కొంత పనిచేసివుండవచ్చు. అయితే మరి రెండేళ్ళ కాయన చికాగో పద్యాలు (Chicago Poems) వెలువడేసరికి వచ్చిన ప్రశంస కచ్చితమైనదే. అతడు విట్మన్‌నుండి కొంత గ్రహించాడన్నది వాస్తవం. ఇద్దరికీ దృక్పథంలో సామ్యం అయితే వుంది గాని అతని కితడు ప్రతిధ్వనిలాంటివాడు కాడు. సేండ్‌బర్గు పద్యాలు కొన్ని మరీ పొడుగాటి వచనప్రసంగాల్లా వున్నా, సాధారణంగా అవి సంగ్రహంగా వ్యావహారికధోరణిలో వుంటాయి. అవి చికాగో మహానగర కోలాహలాన్నీ, సూర్యకిరణశోభాయమానాలైన శాద్వలతలాలనూ, సామాన్య మానవుడినీ ఘనంగా చిత్రించాయి :

"I speak of new cities and new people.
I tell you the past is a bucket of ashes.
I tell you yesterday is a wind gone down,
a sun dropped in the west.

I tell you there is nothing in the world, only
an ocean of to-morrows, a sky of to-morrows."

[నవ్యనగరాలగురించి నవ్యజనులగురించి చెబుతాను.
ఇటు విను, గతమంటే పట్టి బూడిదబుంగ.
నిన్న అన్నది వెనక్కుపోయిన గాలి,
పడమట వ్రాలిన ఒక సూర్యుడు.
నే చెబుతాను విను, ఈ లోకంలో ఏమీ లేదు,
ఉన్నది ఒక రేపులసముద్రం, ఆకాశం.]

ఈ పద్యాల్లో సేండ్‌బర్గు విట్మన్‌లాగే లోకంలో చాలా వికారం, అసౌఖ్యమూ వున్నాయని అంగీకరిస్తాడు. కాని అన్యాయాలూ, అక్రమాల గురించి ఆయన ఒక ప్రాచీన 'మౌలికపరిణామవాది' (Radical) లా వ్రాస్తాడు. ఆ అన్యాయాల కత డాగ్రహోదగ్రు డౌతాడు; నైరాశ్యం పొందడు. కాని అసలు కాయన కొక తృప్తి వుంది. కారణం: తన ప్రపంచాన్ని తాను ప్రేమిస్తాడు. అతిసామాన్యవిషయాల్లోగూడ, అంటే బేస్‌బాల్ ఆట, కష్టజీవుల 'హైలేస' పాట, వ్యవసాయక్షేత్రాల్లో జీవితం, పట్నవాసపు పడుపుకత్తెలు, నీగ్రోల 'జాజ్' సంగీతపు సుమాళము మున్నగు విషయాల్లోగూడ కవితాంశను కనిపెడతాడు.

నలభైయేళ్ళు గడిచాక ఆ పద్యాలన్నీ రక్తి నిలువరించుకోలేక పోయాయి. మొత్తంమీద వాటి కొక జీవకళ వుంది, ఒక సద్యఃఫలం వుంది (రాబిన్సన్ పద్యాలకు లేదది). వాటిలో హార్దమార్దవం వుంది; వెర్రిబాగుల నమ్మకం లేదు. ఆ యాసలో ఒక సిసలైన నుడికారం వుంది. అది సేండ్‌బర్గు మానవప్రేమతోపాటు కరగిపోయే గుణం గలది:

"Take any streetful of people buying clothes and groceries, cheering a hero or throwing confetti and blowing tin horns...tell me if

the lovers are losers...tell me if any get any more than the lovers...in the dust...in the cool tombs."

[ఏ వీథిలో నిండివున్న జనాన్నైనా చూడు—బట్టలు, సరుకులు కొంటూ వున్నవాళ్ళనుగాని, ఒక వీరుణ్ణి అభినందిస్తూవున్నవాళ్ళనుగాని, రంగు కాగితాలు విసురుతున్నవాళ్ళనుగాని, తగరపు బూరా లూదుతూ వున్నవాళ్ళనుగాని...అప్పుడు చెప్పు నాకు ప్రేమికులన్నవాళ్ళు నష్టజాతకు లైతే...మట్టిలోగాని, చల్లని సమాధుల్లోగాని ప్రేమికులు పొందగలిగినదానికంటె ఎక్కువ ఎవరేనా పొందితే నాకు చెప్పు.]

కేవలం కవిత్వాని కనుకూలంగాని పరిస్థితులనుండికూడ నిండైన కావ్యత్వం పిండవచ్చుననీ, గంభీరమైన విషయాలకుగూడ వికటత్వం కాకుండ మరింత గాంభీర్యం కలిగించడానికే 'యాస'నుకూడ వాడవచ్చుననీ సేండ్‌బర్గు నిరూపించదలచిన ట్లున్నది. జాన్ బ్రౌను గురించి చెప్పే అతని 'Ossawatomic' అనే ఖండికలో (సేండ్‌బర్గ్ తృతీయసంపుటి-Smoke and Steel, 1920 లో వున్నది) అలాంటి చప్పిడిధోరణి నుండి కూడా ఎలాంటి స్వారస్యం రాబట్టుకోవచ్చునో ఆ చివరి పద్యం చూస్తే తెలుస్తుంది :

"They laid hands on him
And the fool killers had a laugh
And the necktie party was a go, by God,
They laid hands on him and he was a Goner,
They hammered him to pieces and he stood up.
They buried him and he walked out of the grave by God,

Asking again : Where did that blood
come from ? ”

[ఆ మూర్ఖఘాతుకు లతనిమీద చేతులువేసి ఒక అట్టహాసం చేశారు. ఇక కంఠపాశప్రయోగక్రియ. వాళ్ళతనిమీద చేతులు వేశారు—అతడు సర్వనాశనం కావలసివుంది. వాళ్ళతనిని సుత్తితో ముక్కలుగా కొట్టేరు - లేచి నిలబడ్డా డతడు. వాళ్ళతనిని గొయ్యితీసి కప్పెట్టేశారు - దైవికంగా అతడు ‘సమాధి’ లోంచి నడిచి వచ్చేశాడు—పైగా ఆ రక్తం ఎక్కడనుంచి వచ్చింది అని అడుగుతూను.]

వేచెల్ లిండ్సే కూడ తన నీరసచపలవాచాలతాత్మకమగు పద్య సంపుటిలోని కొన్ని అనర్ఘరత్నాల ద్వారా కొంత ప్రభావం నెరిపాడు. చిన్ననాట వట్టి అపరిణతుడైన కవిగా అతడు కొన్ని కలలు కన్నాడు. యువజనక్రైస్తవసంఘానికి (Y. M. C. A.) తాను ముఖ్యగాయకుడు కావాలనీ, సంస్కృతికీ మోటతనానికీ రాజీ కుదర్చాలనీ, 1905 నాటికి చికాగోలోని మనుషు లందరికంటె గొప్పవాడి ననిపించుకోవాలనీ పట్టు బట్టేడు. కాని 1913 వరకు చికాగో కతనిగురించి ఏమీ తెలీదు. ఆ యేడు హేరియట్ మన్రో పత్రికలో ప్రచురింపబడిన అతని ‘General William Booth Enters Heaven’ అనే ఖండిక స్వాభావికాలైన అతని మొదటి రెండు కోరికలూ నెరవేరాయని ఋజువుచేసింది. 1905-1913 సం॥ మధ్య ఆయన ఒక దేశదిమ్మరిలా అమెరికా అంతా తిరిగాడు. తిండికోసం తన పాట లమ్ముకున్నాడు. మరికొందరు ద్రిమ్మరులతో తనను తాను సరిపోల్చుకున్నాడు. వాళ్లు : నడిమి పడమటిదేశంలో భవిష్యదాశాంకురాలు చల్లుతూ తిరిగిన ‘జానీ ఏపిల్ సీడ్’, అపలేచియన్ పర్వతాలమీదుగా కెంటక్కీ-రాష్ట్రానికి మార్గదర్శకుడైన డేనియల్ బూన్, ‘బర్నమ్’ వంటి సర్కస్ మనుషులు, పర్యటనల్లోకూడ నిగ్రహం చూపే సంస్కర్తలు, ‘జిప్సీ’లు, ప్రాచీనమతప్రచారకులు, ముఖ్యంగా నిప్పును

నిశ్వసించే కేంబెల్ మతానుయాయులు (Campbellites). వీళ్ళందరి తోటీ ఆయన తన అమెరికన్ పుణ్యపురుషచరిత్రాన్ని (Hagiography) తయారుచేశాడు. దానికి (లింకన్‌తోపాటు) జాన్ బ్రౌన్, ఆండ్రూ జాక్సన్, ఇల్లినాయ్ గవర్నర్ ఆల్ట్‌గెల్డ్, 'డెమోక్రటిక్' నాయకుడు విలియం జెన్నింగ్స్ బ్రయన్ మొదలైనవారినికూడా చేర్చాడు. అదో పెద్దసరదాలపుట్ట. అందులో సినీమాతారలూ చోటుచేసుకున్నారు. కీట్సు, పో, విట్మన్, ట్వెయిన్, ఓ హెన్రీలకూ చోటు దొరికింది. అందు లోంచి నాటకీయమైన ఆర్భాటంతో ఒక పద్యరచనావిధానాన్ని రూపొం దించాడతడు. దానికే పిమ్మట 'Higher Vaudeville' ('వాడ్విల్' అంటే మన వీధిభాగవతంలాంటి ధోరణిగల రచనావిశేషం) అని పేరు పెట్టేడు. శిష్యసంచారాలకి బయలుదేరేటప్పుడు మతాధిపతు లెలా ప్రసంగిస్తారో అలాగు ఒక పెద్దసమాజంముందు బిగ్గరగా పైకి చదవడాని కుద్దేశింపబడ్డాయి అవి. అలా కలగాపులగపు జనసందోహానికి చేరిన అతని మొదటి పద్యం జనరల్ విలియం బూత్ స్వర్గప్రవేశం గురించినది :

"Booth led boldly with his big bass drum—
(Are you washed in the blood of the lamb?)
The saints smiled gravely and they said:
'He's come.'
(Are you washed in the blood of the lamb?)"

[ఢంకా బజాయిస్తూ ధైర్యంగా పరిక్రమించాడు బూత్—(నువ్వు కాని జగద్రక్షకుడి రక్తంలో క్షాళితుడివైనావా?) యోగులు గంభీరదర హాసం చేసి "అతడు వచ్చా" డన్నారు. (నువ్వుకాని జగద్రక్షకుడి రక్తంలో క్షాళితుడివైనావా?)]

ఈ పద్యాల్లోగాని హాస్యం ఉద్దేశింపబడినా, అల్పత్వసూచన వున్న దనుకొన్నా అవి దుర్భరంగా భాసించివుండేవి. అయితే సమ్యగ్విషయమే

అం దుద్దిష్టం. అంచాత లిండ్సే హాస్యాని కొక గిరిగీయగలిగా డని చెప్పాలి :

"His sweetheart and his mother were
Christian and meek.
They washed and ironed for Darius
every week.
One Thursday he met them at the door :—
Paid them as usual, but acted sore.
He said :—'Your Daniel is a dead little
pigeon.
He's a good hard worker but he talks
religion...' "

[ఆయనప్రియురాలూ, తల్లీ ఇద్దరూ క్రైస్తవులు; మెత్తనివాళ్ళు. రక్షకుడికోసం ప్రతివారం స్నానం చేసి ముస్తాబయ్యేవారు. ఒక గురువారంనాడు ద్వారందగ్గర కలిశాడు. మామూలుగా ఇచ్చే దేదో యిచ్చాడు కాని అనిష్టంగా ప్రవర్తించాడు. అత నన్నాడు: "మీ డేనియల్ చచ్చిన పిచ్చుకలాంటివాడు. కష్టపడి పనిచేసేవాడే కాని మతం గురించి మాట్లాడుతాడు."]

సేండ్‌బర్గులాగే లిండ్సేకూడ నీగ్రోలనుంచి కొంత గ్రహించాడు. ఆయన తండ్రి 'అంకుల్ రెమస్'ను అతనికి చదివి వినిపించాడు. వాళ్ళ స్ప్రింగ్‌ఫీల్డు నివాసంలో నీగ్రో పనివాళ్ళున్నారు. అతడు తాను కొంత దాక్షిణాత్యుడి ననుకొంటాడు. "రంగువేసినట్లు ఘోరంగా, వికారంగా, దురవగాహంగా కనిపించే మేసను, డిక్సనుల కోవకి చెందిన మనుషులంటే మా కెంతో మమత" అంటాడు. గొప్ప దనిపించుకునే అతని కవిత్వంలో జనసామాన్యాన్ని బాగా ఆకర్షించే బహురూపులు (Costumed actors), పాటలు, మతప్రచారకులూ, రాజకీయాల రాయుళ్ళ అభి

నయాలు మొ॥ వాటిగురించిన విశేషాలు వుంటాయి. ఆ అభినయాలలోని దంభం, వంచన మొ॥ లక్షణాలు గ్రహించి అద్భుతమైన కవిత్వం చెప్పేడాయన:

"All the funny circus silks of politics
unfurled,
Bartlett pears of romance that were honey
at the cores,
And torchlights down the street, to the
end of the world.
There were truths eternal in the gab and
tittle-tattle.
There were real heads broken in the
fustian and the rattle..."

[తాత్పర్యం: రాజకీయాల్లోని యుక్తులూ మోసాలూ రసనిర్భరాలైన ప్రబంధఫలాలను, దిగంతాలకు ప్రసరించేటట్లుగా మనుషుల బ్రతుకుల క్రింది వెలుగురేకలను బయటపెట్టేయి. వట్టి పరిహాసప్రలాపాల్లో కూడా శాశ్వతసత్యాలున్నాయి. ఉచ్చైస్స్వరంతో చేయుబడిన ఉజ్జ్వల ప్రసంగాల్లో బుర్రలు పగిలిన సందర్భాలున్నాయి.]

అమెరికనుల ఆశాకల్పితగాథలో 'రేపులప్రపంచం'గా రూపొందిన పశ్చిమప్రాంతం లిండ్సే చూపులో, ఊహలోకూడ ప్రవేశించింది. అతని దర్శనం స్పష్టంగా వున్నప్పుడు చిన్నపిల్లల కులాసం కల్పించే పద్యాలతనిచేత వ్రాయించే ఒక అమాయికత్వాన్ని అలవరుచుకుంటుంది. (ఉదా: 'The Moon's the North Wind's Cooky', 'Yet Gentle will the Griffin Be'). అవి ఒక పచ్చి వాస్తవికత, ఒక స్వప్నజగత్తూ అప్రయత్నంగా కలిసిపోయినట్లనిపించే డువేనియర్ రూసో చిత్రాలను జ్ఞాపకంచేస్తాయి.

సేండ్‌బర్గు లిండ్సేలు ఒక బింకంతో, పొంకంతో నడిచారు. ఎప్పుడన్నా వాళ్ళ పద్యం పట్టు తప్పిందో వట్టి చప్పిడిధోరణిలోగాని, ఒక వెర్రిబాగుల ధోరణిలోగాని పడిపోయేవారు.

"I am the gutter dream,
I am the golden dream."

[నే నొక మలినస్వప్నాన్ని, నే నొక మేలిమిస్వప్నాన్ని.]

అని పాడుకొన్నాడు లిండ్సే. అయితే చాలా పద్యాల్లో ఆ స్వప్న వాస్తవికజగత్తుల అద్భుతమేళనం వుండే అది కుదేలయిపోయింది. కారల్ సేండ్‌బర్గ్ అంతకన్నా ఘటికుడైనా అతని పద్యాలకూ కొంత కొంతగా అదే గతి పట్టింది. సామాన్య మానవుడి వైఖరి, అతడి మాటలూ, పాటలూ సేండ్‌బర్గ్‌ని కదిలించివేశాయి. పీఠప్రతిష్ఠలాంటి అతని లింకన్ జీవితచరిత్రలో ఆ కదలికల చాకచక్యం కనిపిస్తుంది (2 సం. 1926, మరి 4 సం. 1939). అతని 'American Song bag' (1927) అనే దొక మంచి వాసికెక్కిన పదాల సంపుటి. 'The People, Yes' (1936) లో ఆయన ప్రతిమానవుడిలోనూ తన కున్న విశ్వాసాన్ని సూక్తులతో, లోకోక్తులతో చెప్పడానికి ప్రయత్నం చేసి కొంత సాఫల్యం పొందేడు. అయితే క్రమంగా అతని ధోరణి పలచబడి కవిత్వపు పలుకుకంటె వట్టి సామాన్యపు లోకవాసన యెక్కువైపోయి అతని రచన మననయోగ్యతను గోల్పోతూ వచ్చింది. ఆ తొలినాటి బిగువూ బింకమూ పోయి ఆ కవిత్వం మంత్రజపంలా పునరుక్తులకు పాల్పడి, 'Remembrance Rock' (1948) లో లాగు వచన వాసన వేస్తూ అమెరికన్ ఇతిహాసపు విశేషాల చేటభారతంలా అయిపోయింది. అయితే అతడు చాలా నిజాయితీపరుడు. పిదప కాలంలో పెద్ద కార్యభారం నెత్తినేసుకుని విఫలు డయ్యాడు.

ఇక ఎడ్గార్ లీ మాస్టర్స్ సంగతి. అతడు 'చికాగో వికాసం' విషయంలో మూడవ స్థానిక కవి. (ఇక్కడ 'వికాసం' సరియైన మాట

కాదు. అది సంస్కృతి విషయంలో చికాగో ఎత్తిన మొదటి జన్మ౦. చిన్ననాట కేవలం సాంప్రదాయిక కవితా మార్గంలో పరిక్రమిం చాడు. హఠాత్తుగా గొంతు చెరవిడింది. క్రొత్త పలుకుపలికింది. గ్రీకు కవితా సంకలనంలోని సూక్తులు, చాటూక్తులు, 'చరమ శ్లోకాలు' (epitaphs), ఇల్లినాయ్ రాష్ట్రంలో పల్లీపక్కణ సీమల్లో అలగా బ్రతుకుల మనుష్యుల గురించి తాను పడిన మథన, కారల్ సేండ్‌బర్గ ప్రభృతులు స్వచ్ఛందచ్ఛందస్సు (free verse) విషయంలో చేసిన ప్రయోగాలూ అతనికి గొప్ప ప్రేరణ కలిగించాయి. తరువాత 'Spoon River Anthology' గా రూపొందిన పద్యా లాయన 1914 లో వ్రాయడం ప్రారంభించాడు. ఒక ఇల్లినాయ్ శ్మశానంలో సమాధులమీద కథావశేషులు ఆత్మకథ చెప్పుకొన్నట్లుగా వ్రాశాడు కొన్ని పద్యాలు. అందలి తీరు ఒకప్పుడొక విషాద కావ్య కారుణిక వైఖరిగాను, ఒకప్పుడాత్మాశ్రయ ఫక్కికమైన జీవిత సమర్థనంగానూ, ఒకప్పుడు ఆశాభంగావమాన ఘూర్ణితమైన హృదయంనుండి బాహిరిల్లిన మహాఘోషగానూ వుంటుంది. భర్తలు, భార్యలు, తలిదండ్రులు, బిడ్డలు ఒక్కొక్కరే అసలు తమ బ్రతుకుల్లో జరిగిందేమిటో తమ తమ దృక్పథా లతో ఏకరువుపెడతారు. ఆ 'చరమశ్లోకాలు' తోటివారితో ఎవరూ ఏమీ చేయలేని సామూహికమైన నేరాల్లో పాలుపంచుకుంటూ వున్నా వ్యక్తిని వేరుచేసి వుంచే సంఘంయొక్క సమాహారరూపాన్ని నిరూ పించడానికి ప్రయత్నం చేశాయి :

"Oh many times did Ernest Hyde and I
Argue about the freedom of the will,
My favourite metaphor was Prickets's cow
Roped out to grass, and free you know as far
As the length of the rope."

[ఓ, చాలాసార్లు ఎర్నెస్టు హైడూ, నేనూ ఇచ్ఛాశక్తియొక్క

స్వచ్ఛందత గురించి వాదించుకొన్నాం. గడ్డిమేతకు పలుపుకట్టి విడిచిన ప్రిక్కెట్టుగారి ఆవు నాకభిమతమైన సామ్యం. దాని కెంత స్వేచ్ఛో తెలుసా, ఆ పలు పెంత పొడవో అంతమేర.]

కాని ఎప్పుడో ఒకనాడు ప్రిక్కెట్టు పసలం పలుపు ఒసులై పోతుంది. ఆ మాట లన్నవాడి డొక్క వాల్చేస్తుంది. పై పంక్తులు సూచించినట్లు ఈనా డాయన Spoon River Anthology కి కవిత్వంగా ఏమీ రాణింపు లేదు. మానవ ప్రకృతి గురించి తగిన వ్యాఖ్యానంగా దానిలో ఏమీ గాంభీర్యం లేదు. అయితే దాని కాలంలో అది 'నవ్య కవిత్వం'గా బాగా చలామణీ అయినట్టిదే. ఎందు కలా అయిందో మనం తెలుసుకోడాని కన్నట్టుగా తగిన శక్తినీ, ఆర్జవాన్నీ మాత్రం నిలుపుకునివుంది. తరువాతి రచనలో అతని దృక్పథం కళంకితమైపోయినట్టు కానవస్తుంది. (ఉదా: Lincoln, the Man, 1931.) అయితే హేమ్లిన్ గార్లెండు ప్రభృతులు వచనంలో ఏం చెయ్యబోయినారో అది చెయ్యడానికి యుక్తిపన్నేడు మాస్టర్సు తన 'Spoon River' లో. సేండ్‌బర్గు లిండ్సేలలాగ మాస్టర్సు కూడ తన పద్ధతిలో పూర్వపు తరం వారు ఊహించివుండడానికి కూడా వీల్లేదనేటంతగా కవిత్వానికి గల అవకాశాలను ప్రపంచించడానికి తోడుపడ్డాడు.

అదే రోజుల్లో పేరుమోసిన మరో కవి రాబర్ట్ ఫ్రాస్ట్. కాలిఫోర్నియాలో పుట్టినా అతడు న్యూ ఇంగ్లండును స్వస్థానంగా భావించాడు. దాన్నే తన కవిత్వ ప్రదర్శనానికి రంగపీఠం (background) చేసుకున్నాడు. 1913 నాటి కెలాగో తంటాలు పడి ఒక ప్రచురణకర్త సుముఖత సంపాదించాడు. అప్పటి కతని వయస్సు ముప్ఫయ్యొనిమిదేళ్ళు. ఆ ప్రచురణ ఇంగ్లండులో జరిగింది. ఆ ముందటే డక్కడ వున్నాడాయన. 'A Boy's Will' అనే ఆ మొదటి సంపుటితోనే ఆయన లబ్ధప్రతిష్ఠు డయ్యాడు. 'North of Boston' (1914) అనే రెండవ సంపుటి మరీ సాఫల్యాన్ని చేకూర్చింది. 1915 లో అమెరికాకు తిరిగి వచ్చి

న్యూ హేంప్‌షైర్ వ్యవసాయక్షేత్రంలో స్థిరపడి రచనాభ్యాసంగం చేస్తూ బాగా రాణిస్తూ వచ్చాడు.

ఈ శతాబ్దిలో అమెరికన్ కవిశ్రేష్ఠుడుగా చాలామంది చేత పరిగణింపబడ్డాడు ఫ్రాస్టు. కాని అతని కవిత్వం పూర్వోక్త కవుల కవిత్వంలా నూతనోద్యమ ఫలిత మనిపించదు. అతని ఛందస్సులలో వైవిధ్య మున్నా పుస్తకం విప్పగానే పాతవాసన కొడుతూ వుంటాయి. అలాగే భాష కూడా న్యూ ఇంగ్లండు వ్యవహారం నుండి గ్రహింపబడిందే కాని పాఠకుడి నుద్రూత లూగించే సజీవభాష కాదు. సమకాలిక రచయిత లందరికీ మైకం కలిగించిన వస్తువైన నగర జీవితానికి అతని కృతుల్లో చోటు దొరకలేదు. అతడు జానపదుడు. జానపదజనోచితమైన చాదస్తం వున్నవాడు. ఋతు ఋతువుల క్షయవృద్ధుల సంగీతం ఆలపించే జానపద ప్రకృతి తన యొడిలో నివసించే వారిపై ఒక అనుస్యూతమైన భావప్రభావాన్ని కలిగివుంటుంది. అయితే ఫ్రాస్టు కవితా కలకంఠ కంఠశ్రుతిలో ఒక నవ్యత వుంది. న్యూ ఇంగ్లండు గ్రామజీవితాన్ని చిత్రించే విట్టియర్ అనే మరో కవి వున్నాడు కాని అతనితో కలపకూడ దితనిని. అతడికి పెద్ద పెద్ద ఉద్దేశాలు లేవు. తన రచనలో ఆట్టే కవితాంశ వుండకూడ దన్నది తన సంకల్పమైనట్టు స్పష్టం చేశా డాయన. ఆ కవితాంశ యన్నది దానంతట అది పైనుంచి అయాచితంగా రావాలని ఆయన వుద్దేశం. సేండ్‌బర్గు లిండ్సేలు నిత్యజీవితానుభూతిలో పాలుపంచుకోవా లనుకుంటూనే కవులుగా వందిమాగధుల పాటి చెయ్యకపో మనుకునేవారు. ఫ్రాస్టు ఒక కృషీవలుడు. అతని కవిత్వం ఒక లాభంలాంటిది. అస లా వ్యవసాయమే అతనిలోని భాగం. వాస్తవికత కతని లంగరు.

అతని కవిత్వం అతని పొలంమీది పంటలాంటిది. దానికి సంబంధించిన ప్రత్యంశమూ అతనికి సుజ్ఞాతము. దానిని అలవోకగా అందంగా బంధురంగా మాటల్లో ఎలా మలచాలో అతనికి బాగా తెలుసు. మిత

భాషులు, దరిద్రులు, కాని దర్జా గలవాళ్ళు అయిన న్యూ ఇంగ్లండు ప్రజల్ని స్వగతాలతో పిలిచా డాయన. అవి ఇ. ఎ. రాబిన్సన్, రాబర్ట్ బ్రౌనింగుల పద్యాలను కొంత పోలివుంటాయి కాని, తేడా లేకపోలేదు. అతని కావ్యంలోని మనుషులు ఎడప తడప నిబిడనిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ అతి నిదానంగా మాట్లాడుతారు. వాగుడుతనం వాళ్ళకు సరిపడని సంగతి. విజాతీయమైనది. రాబిన్సన్ కవిత్వంలో లాగ వాళ్ళు ధారాపాతంగా మాట్లాడలేరు; బ్రౌనింగు కృతుల్లోలాగ ఉండుండి ఉరుమలేరు. ఏకాంత సీమల్లో వాళ్ళ ఏకాకి క్షేత్రాలు, దుర్భర హేమంత శిశిరాలు, అతిక్షిప్త వసంత గ్రీష్మాలూ, ఇరుగు పొరుగులుగా వుండే నష్టాలు, కష్టాలు, చావులూ ఇవన్నీ గమనిస్తే, పాపం, వాళ్లెంత గుండె గుప్పిట పట్టుకొని బ్రతుకుతున్నారో అనిపిస్తుంది. కవిత్వంలో ఆ బ్రతుకుల కటుత్వం మరీ దుస్సహమనిపిస్తుంది కాని మధ్యలో విరామక్షణాలు చాలా ఉల్లాసం కలిగిస్తాయి. అయితే ఆ న్యూ హేంప్‌షైరులోని జీవితం ఫ్రాస్టు తన సిద్ధహస్తంతో చిత్రించినా అతడు చిత్రించినంత ఘోరంగా మాత్రం లేదు.

అయితే ఇక్కడ ఒక తేడా వుంది. ఫ్రాస్టు రమ్యరచనాచణుడైన కవేయైనా ప్రథమశ్రేణికి చెందినవాడు మాత్రం కాడు. అతని మాటల్లోనే కావ్యమంటే - "మోదావహంగా ప్రారంభిస్తుంది. ప్రేరణకు కారణమవుతుంది. తొలిపంక్తితోటే తన గమ్యాన్ని సూచిస్తుంది. కొన్ని మంచి సన్నివేశాలను చిత్రిస్తుంది. చివరకు జీవిత స్వరూపాన్ని నిరూపిస్తుంది. ఆ నిరూపణం గొప్పగానే వుండవలసిన అగత్యం లేదు. అవ్యవస్థ నెదిరించి క్షణకాలం నిలబడితే చాలు. అది పురోగమిస్తూనే తన పేరు సార్థకం చేసుకుంటుంది. సవివేకమూ, సవిషాదమూ అయిన ఒక్క చరమశ్రుతిలో ఒక్క ముక్తాయింపులో తనకోసం నిరీక్షించేదాన్ని కనిపెట్టేస్తుంది..." ముక్తాయింపు అంటే అదేదో నీతి ప్రవచనమని కాదు, రొట్టె పైపెచ్చులాంటిది. రుచి చూడాలంటే పాఠకుడే పెచ్చూడదీసుకోవాలి. ఫ్రాస్టు తన 'Oven Bird' చివరి పంక్తులలో మరో డొంక తిరుగుడు అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

"The bird would cease and be as other birds
But that he knows in singing not to sing,
The question that he frames in all but words
Is what to make of a diminished thing."

మళ్ళా యిక్కడొక చిక్కు సమస్య వచ్చిపడింది. తనకు కవితీ్వకరణం (poeticising) యెడల ఉన్న ద్వేషంతో అంతకు ముందు నాట కవితావస్తువుగాను, కవి కర్తవ్యంగాను పరిగణింపబడిన వాటిని నిరసించాడు. అతడు చిత్రించిన సన్నివేశరీతులు సాటిలేనివి. అవి అతని ప్రభుత్వ పరిధిలోనివి. ఎవరూ వాటి నతిశయించలేరు. కాని స్పష్టీకరణం అంటే కవి చివరికి తన ఆశయం విశదం చెయ్యడమన్నది వున్నదే ఆయన యెంత నమ్రంగా చేసినా అది ఒక్కొక్కప్పుడసమగ్రంగాను, వ్యక్తావ్యక్తంగాను, తప్పించుకోనేదిగాను, అనిష్ట సూచకంగానూ వుంటుంది. ఆయన ఎంత ఉద్దేశపూర్వకంగా స్పష్టీకరణం చేయబూనినా మన సందేహాలు మాత్రం పోవు. నిలుకడ క్షణికమన్న సంగతిని మాత్రం సూచిస్తుంది. ఆంతర సత్యం కంటె పచ్చి వాస్తవికతకే ప్రాముఖ్య మిచ్చాడని సూచిస్తుంది. ఏమయినేం, రాబర్ట్ ఫ్రాస్టు ప్రముఖ కవి, కొన్ని సమగ్ర సుందరాలైన ప్రశస్తాలైన గొప్ప కావ్యఖండికలు చెప్పేడన్నది నిర్వివాదమైన అంశం.

ఫ్రాస్టనగా మధ్య పశ్చిమ ప్రాంతీయు లనగా వాళ్లు ప్రపంచ ప్రగతికే దూరంగా వున్నారని నొక్కి చెబితే అపార్థం చేసినట్టవుతుందేమో గాని, నిజానికి వాళ్ళు నాగరికమూ, సార్వజనీనమూ అయిన అభ్యుదయం సాధించిన ఈ శకపు ప్రాచ్యప్రాంతీయ కవులనుండి కొంత వేరుపడిపోయారనే చెప్పాలి. ప్రాచ్యకవులకు లండను పేరిసులతో లావాదేవీలుండేవి (ఫ్రాస్టు ఇంగ్లండులో వున్న కాలంలో నివసించింది లండను నగరంలో కాదు, ఒక గ్రామసీమలో). వాళ్ళకి చికాగోలో కంటె న్యూయార్కులోనే, 'గ్రీనిచ్ విలేజ్' భాగంలోనే ఎక్కువ దిల్‌ఖుష్‌గా

వుండేది. సాహిత్యానికి సమాంతరంగా చిత్రలేఖనం, సంగీతం, నాటకం మొ॥ కళలలో వచ్చిన పరిణామాలు తెలుసుకోవడాని కవకాశా లున్నాయి. అయితే వారికి చికాగో వారితో కొన్ని సామ్యాలు లేక పోలేదు. వారి వారి పరిష్కార మార్గాలు వేరయినా అసలు సమస్య లొకటే. హేరియట్ మన్రోయొక్క 'పొయట్రీ' అందరికీ అవకాశం కల్పించింది. విలియం కార్లోస్ విలియమ్సు కవితలో కొంతవరకు ఈ భేద సాదృశ్యాలు రెండూ కనిపిస్తాయి.

విలియమ్సు అభిజనం న్యూ జెర్సీ. వైద్య వృత్తిలో వుంటూనే కవిగా కూడా తన అస్తిత్వం నిలుపుకొంటూ వచ్చాడు. న్యూ జెర్సీ రాష్ట్రంలోని రూథర్ ఫర్డులోని జీవిత సామగ్రినుండి కవితా రసాయనం తయారు చేశాడు. తన వస్తు వెంత మోటుగా, నీరసంగా వున్నా తన కావ్యకళాదృష్టితో దాన్ని రూపాంతరితం చేసేశాడు. వాలెస్ స్టీవెన్సు అనే మరో కవి విలియమ్సు గురించి "కవిత్వ విరుద్ధమైన దాని గురించిన అతని కామన రక్తదాహం లాంటిది. కాని అతని కవిత్వంలో అయథార్థ యథార్థాల సమ్మేళనం, రసవశంవద చిత్తవృత్తికి, కవిత్వ వ్యతిరేక ప్రకృతికి, రెండు భిన్న తత్వాలకు నిరంతరాన్యోన్య ప్రవృత్తి" కనిపిస్తా యంటాడు. ఇక్కడే విలియమ్సుకీ, ఫ్రాంసుకీ తేడా వుంది. విలియమ్సు తన జీవితంలోనూ కవిత్వంలోనూ బహిరంతరనుభవాలకు (లేక అనుభవ సమన్వయాలకు) మధ్యనున్న ఎడమును గుర్తించాడు. ఫ్రాస్టు ప్రధాన విషయాలను ప్రథమ శ్రేణిలోను, వరి విషయాలను శూన్యం (nowhere) లోనూ పెట్టాలనుకుంటాడు. మళ్ళా వచ్చింది అమెరికన్ సమస్య. విలియమ్సు కెప్పుడూ సమాధానం తెలిసేది కాదు.

చాలా ప్రశస్తి కెక్కిన అతని చిట్టి కృతులలో ఒకటి:

"So much depends upon
a red wheel barrow

glazed with rain water
beside the white chickens"

[వర్షపు నీటిచే మెరుగెక్కిన ఎర్రని ఒంటిచక్రం బండీమీద తెల్లని కోడిపిల్లలతోపాటు చాలా ఆధారపడివుంది.]

ఇందులో నిగనిగలాడే శిశువు చూపులోని ఉజ్జ్వలశక్తి వున్నది. కాని బంధంలో చక్కని చేతకానితనం వుంది. ఇలాంటి భావాలతోనే అతడుగాని దేవులాడివుంటే ఆ కవిత్వం దుర్భరమైపోయివుండేది. అయితే ఫ్రాస్టులాగు కాకుండా విలియమ్స్ తన కవితను మెరుగుపెట్టడానికి ప్రయత్నించేవాడు. తన వస్తువులకు కవిగా తనతో గల అనుబంధాన్ని సమన్వయించాడు. సమన్వయావశ్యకతగురించి ఉద్ఘాటించాడు. చాలా యేళ్లుగా మరెక్కడా పరపతి పుట్టక దిక్కూ మొక్కూ లేని చిల్లరపత్రికలతోనే ('వెర్స్'ని 'ఫ్రీ' చెయ్యడానికోసం చచ్చిపోయిన పత్రికలు) కాలక్షేపం చేసినా తన పరిసరం గురించి నిత్యనూత్నదృక్పథం కలిగివుండేవాడు. తన అనుభూతిని తక్కువపరచుకోవడాని కిష్టపడలేదు. తోటివారి గురించి, సాటిమనుషుల గురించి సన్నిహితమైన సాదరమైన పరిజ్ఞానాన్ని పెంపొందించుకున్నాడే గాని వాళ్ళ నెన్నడూ అసహ్యించుకోలేదు. వాళ్ళ నెప్పుడూ 'పీపుల్' (అతిసాధారణ విషయాల్లోని ఆంతర్యాన్ని గ్రహించలేనివారు)గా పరిగణించలే దతను. అందుకే ఒక యథార్థ ప్రకటనగా అతని

"The beauty of
the terrible faces
of our non-entities"

[మన 'నిర్గుణపరబ్రహ్మల' (i.e, non-entities, i.e., ఒక వ్యక్తిత్వం లేనివాళ్ళు) ఘోరవదనాల్లోని సౌందర్యం.]

అనే పంక్తులలోని పరమార్థం సేండ్‌బర్గు రచనలో చాలావాటిని,

ఫ్రాస్టు రచనలు కొన్నిటిని మించి శ్రోతులకు దూసుకుపోతుంది. ఒక 'బేస్‌బాల్' క్రీడగురించి అతను వ్రాసిన పంక్తులూ అలాంటివే:

> "It is summer, it is the solstice the crowd is cheering, the crowd is laughing in detail permanently, seriously without thought"

[అది వేసవి, అయనకాలం. గుమిగూడిన జనం కోలాహలం, అట్టహాసం చేస్తున్నారు అదేపనిగా, అతిశ్రద్ధగా. కాని ఆలోచన లేదు.]

అసలు కీలకం ఊహల్లో కాదు వస్తువులో వుందంటాడు విలియమ్స్. కాని 1917 కి ముందే నిత్యలంకారనిగళబంధాలనుండి విడివడి నిసలైన కవిత్వంగా పరిణమించడానికి తగిన వస్తుస్వాతంత్ర్యం ఏర్పడాలనే చూపు ప్రబలినా విలియమ్స్‌మాత్రం తన 'వస్తువు' పరిణామాని కవకాశం కలిగించ లేదు. ఇటీవల తన 'పేటర్సన్' (Paterson) అనే పద్యకృతిలో అద్భుతమైన ప్రయోజనాత్మకమైన సమాధానంతో సమస్యను పరిష్కరింపబూనుకున్నాడు. 'పేటర్సన్' అన్నది న్యూజెర్సీలోని తన ఊరికి ఆయన పెట్టుకొన్న పేరు. ఆ కావ్యంలో తొలిభాగంలోనే ఆ పరిష్కారం కనిపిస్తుంది. రెండోభాగంలో మొదటిభాగమంత మజాలేదు. ఒక్కొక్కప్పుడు కవిగా విలియమ్స్ నష్టజాతకు డనిపిస్తాడు. తొందర తొందరగా ఊహలను, ఉద్దేశాలను గిలుబాడుతాడు. 'స్వచ్ఛందచ్ఛందపు' చాదస్తాల (Free-verse mannerisms) లో పడిపోతాడు. ఫ్రాస్టు నవి ప్రలోభపెట్టలేకపోయాయి. అతని తునుకల్లాంటి పద్యపంక్తులు, సణుగుడులాంటి శైలి అమెరికన్లు కానివారి కర్థం కావు. అయితేనేం, సువిశాలమైన చూపు గల సుకవి అతడు.

'పెన్సిల్వేనియా' విశ్వవిద్యాలయంలో వైద్యశాస్త్రాభ్యాసం చేస్తూ విలియమ్స్ తన కవితాభిరతిలో భాగస్వాములు కాగలిగిన మరో యిద్దరు విద్యార్థులతో చెలిమిచేశాడు. వారు ఎజ్రాపౌండు (స్వస్థలం Moscow,

Idaho), ఒక ఖగోళశాస్త్రాచార్యుని కూతురైన హీల్డా డూలిటిల్. ఆ స్నేహం స్థిరపడింది. విలియమ్సుకి లాభించింది. పౌండు అకాలప్రజ్ఞా హేవాకపరిపాకం గలవాడు. సిసింద్రీలాంటివాడు. చిరాకుగూడా కలిగిస్తాడు. అతడికి కేవలం శబ్దార్థాలతోటే నిమిత్తం. హీల్డాకూడా అలాంటిదే. పౌండు, హీల్డా ఇద్దరూ లండను వెళ్ళారు. అక్కడ సమోదయ్యములైన మరికొందరు ఒక కూటంగా ఏర్పడి T. E. Hulme అనే ఒక తత్వవేత్త నాయకత్వంక్రింద తమ కొక పేరు పెట్టుకొన్నారు—వాళ్ళనే 'ఇమేజిస్టు' లంటారు (Imagists, i.e., భావచిత్రవాదులు). వాళ్లొక నూత్నకవితారీతిని ప్రకటించారు. హుల్మె అన్నట్టు అది "ఉల్లాసంగా, అనార్ద్రంగా, వితండంగా" వుంటుంది. అది కేవలమూ అన్యూనాతిరిక్తంగా (no more nor less) శబ్దాల 'చిత్రజాలము' (Mosaic of Words). అందులో ప్రయోగింపబడే ప్రతి శబ్దానికీ సరియైన తూకం అవసరం. 'చిత్రజాలం' (Mosaic) అన్న మాట భావచిత్రవాదుల కవితాస్వభావాన్ని చక్కగా నిరూపిస్తుంది. చిత్రజాలపు పని చెయ్యాలంటే చాలా జాగరూకత, ప్రక్రియానైపుణి (Technical Skill) అవసరం. ఫలితం వర్ణప్రకర్షతో కూడిన దర్శనం. ఇంకా సరిగా చెప్పాలంటే స్యూరట్ (Seurat) చిత్రాల్లోలాగు ప్రత్యేకవర్ణబిందుస్ఫూర్తి('Pointillist' boldness). ఆ కవిత్వధోరణిని పౌండు ఇలా వివరించాడు : "అది భావచిత్రాలను అలంకారాలుగా వాడుకోదు, భావచిత్రమే ముఖ్యవస్తువు. సర్వాంగీణసౌష్ఠవం, సంక్షిప్తత, ఏకాగ్రత ఆ కవితయొక్క ముఖ్యలక్షణాలు. ఉపయుక్తఛందస్సంగతు లొక సంగీత స్ఫూర్తి కవకాశమివ్వాలి."

ఆ స్థితిలో పౌండు ప్రభృతులు (ఆ సమాజంలో పౌండు ప్రముఖస్థాన మాక్రమించాడు) 'సాంకేతికవాదం' (Symbolism) చే గాక ప్రాచ్య కవితాపద్ధతులవల్ల ప్రభావితు లయ్యారు. చైనా జపాను భాషా పద్యాల్లో (వాటి సంగతి వాళ్ళు జుడిత్ గాటియర్ అనువాదాల

ద్వారాను, ఎర్నెస్ట్ ఫెనొల్లోసా అనే బోస్టన్ ప్రాచ్య విషయజ్ఞుని (Oriantalist) ద్వారాను తెలుసుకున్నారు) వాళ్ళ కోక నిండైన క్షప్తత, శబ్దాలను వాడి వడబోసిన మితత్వం కనిపించాయి. ఆ నాటి సంకట స్థితిలో చికాగోలోలాగే లండనులో కూడ ప్రతివిషయమూ ప్రత్య గ్రంగా కనిపించసాగిన కాలంలో, ఆ భావచిత్రవాదులా ప్రాచ్య పద్యా లను చూసి ముగ్ధులై అద్భుతావేశవశంవదులై తమ కవితలో తత్సారం అంతటినీ పాదుకొల్పడానికి పూనుకొన్నారు. పౌండు ఒకసారి ఒక ముప్పై పంక్తుల పద్యం వ్రాశాడు కాని రెండోసారి, వచ్చిన భావతీవ్రతలో రూపొందిం దని చించేశాడు. ఆరునెలలు పోయిన తర్వాత పేరిస్ మెట్రోలో అందమైన ముఖాల సమావేశం చూసి హఠాత్తుగా ఆవేశం పొంది ఆ క్షణంలో మళ్ళా ఆ పద్యాన్నే అందుకొన్నాడు. కాని ఈ సారి పదిహేను పంక్తుల్లో సంగ్రహించేశా డదంతా. మరో సంవత్సరం గడిచాక (ఇక్కడ కాలమానాని కొక ప్రాముఖ్యం వున్న ట్టుంది - నుద్యం నిలవచెయ్యడం విషయంలో వున్నట్టు) అత డా పద్యాన్ని దాని చిట్టచివరి ద్విదళాకృతికి దింపేడు:

"The apparition of these faces in the crowd;
Petals on a wet, black bough."

[ఆ మందిలో ఈ ముఖాల భూతాకృతులు;
తడిసిన నల్లని కొమ్మమీద పూరేకులు.]

అంత భావ భారంతోనూ పౌండు మరికొన్ని పద్యాలు వ్రాశాడు. హీల్డా డూలిటిల్ ('హెచ్. డి.' అని సంతకం చేస్తుంది తన పేరు కూడా సంగ్రహించుకుని) కూడ కొన్ని చిక్కని చక్కని చిన్నారి పొన్నారి పద్యాలలాంటివి వ్రాసింది.

ఈ ఉద్యమం త్వరలో మరో అమెరికన్ కవయిత్రి, బోస్టను ఖామందురాలూ అయిన అమీ లోవెల్‌ను ఆకర్షించింది. ఆమె 1914

వేసవిలో తన పూతికపళ్ళరంగుకారుతోటీ, ఇద్దరు ఒకేరకం దుస్తులు ధరించే డ్రైవర్లతోటీ లండనులో దిగింది. అంతకుముందు చాలా కాలం క్రిందట ఆమె ఒక ఉద్యమానికి నాయకురాలు. కొత్త రుచులు మరిగిన పౌండు దానికి 'అమీజిజమ్' (Amygism) అని పేరు పెట్టేడు. అయితే కొద్దికాలమే దాని నంటిపెట్టుకొని వుండి, విడిచేసి బహు స్వరాలాపన కవకాశమిచ్చే గద్యను (polyphonic prose) చేపట్టింది. అలాగే ఉత్సాహపు టుబలాటానికి తట్టుకోలేని ఆమె 'భావచిత్రవాదం' వంటి సంకుచిత సిద్ధాంతానికి కూడా కట్టుబడి వుండలేకపోయింది. తుదకామె చేసిన పనేమిటంటే 1160 పుటల మహా సంపుటంగా కీట్సుకవి జీవిత చరిత్ర నిబంధనం వ్రాసేసింది.

ఆ భావచిత్రవాద మన్నది (అనంతమైన కవితాయాత్రలో) ఒక మజిలీ (Way-Stage) లాంటిది. మీద ఉదాహరింపబడిన పౌండుగారి పద్యంలోనే దాని సంకుచితత్వాన్ని చూడవచ్చు. ఒక లోపాయికారీ అంశంగా పరిణమించేటంతదాక భావతీవ్రత యొక్క సరిహద్దు నధిగమించి బట్టబయలైంది. కేవలం భావచిత్రమన్న దాంట్లో కవిత్వాంశ మోతాదుగా వుంటుంది. సిద్ధహస్తుల చేతిలో తప్ప మిగతా అందరి చేతిలోనూ అది వట్టి అలంకారప్రాయమైపోయి దిగజారిపోయింది. అయినప్పటికీ అనేక ముఖ్యమైన 'మజిలీ' అనే చెప్పాలి. ఉద్యమ ప్రారంభకు లనుకొన్న ట్లదేదో అతి నూత్నమైనదీ, విప్లవాత్మకమైనదీ అని చెప్పడానికి వీలుపడదు. కవితాజగత్తులో ఒక పరిణామ సూచనగా, పరిణామ ప్రేరణంగా ఆ ఉద్యమం కాలం యొక్క ఉల్లాసకల్లోలిత స్వభావాన్నీ, పరిణామకాంక్షనూ వ్యక్తం చేస్తుంది. ఆ కవులు నానాముఖంగా చెల్లాచెదరైపోయినా సంక్షిప్తత గురించి, స్వచ్ఛందచ్ఛందం (free verse) గురించీ వాళ్ళు తెచ్చిన వత్తిడి మాత్రం విలువైనదిగానే కొనసాగింది. ఆ ఉద్యమం మంచి ఉమ్మిరిగా కొనసాగుతున్న రోజుల్లో అది అమెరికాకు కూడా

ప్రాకింది. అక్కడి 'పొయట్రీ' పత్రిక ద్వారా పౌండు ప్రచారం చేశాడు.

తన భావచిత్రవాది స్థితి కించుక అనంతరం, పౌండు మార్గరెట్ ఎండర్సన్‌గారి 'లిటిల్ రెవ్యూ'ని కూడా నవోద్యమం మీద పెత్తనం చలాయించేటట్లు చెయ్యడానికి వినియోగించుకొన్నాడు. తాను యూరపులోనే స్థిరపడినా అక్కడినుండే ఈ గ్రంథమంతా నడిపేడు. అమెరికన్ ఒక్కడే సర్వభక్షకుడిలా (omnivorous - అంటే ఏ విషయాన్నైనా గ్రహించడానికి సిద్ధపడేవాడని తాత్పర్యం) వ్యవహరించగల డని పించాడు పౌండు: 'నవ్యకవిత్వానికి' పనికివస్తుందన్న ప్రతివిషయమూ తాను మచ్చు చూశాడు, చూపించాడు. అది పరిపక్వస్థితికి రావాలంటే మొదట ఉల్లాసంగా విగ్రహచ్ఛేదం (iconoclasm - అంటే ప్రాత పద్ధతుల వినాశం) చెయ్యాలి, నూత్నప్రయోగా లమితంగా చెయ్యాలి అనే నమ్మకం కలిగించాడు. ఫ్రెంచివారి సాంకేతిక పద్ధతి (Symbolism), సెక్స్టస్ ప్రొపెర్షియస్ వ్రాసిన విషాదగీతాలు (elegies), ప్రాంతీయ వీరగాథాపదాలు, ప్రాచ్య పద్యరచనా శిల్పాలు, మధ్యయుగపు ఇంగ్లీషుభాష - వీటి నన్నిటినీ, మరికొన్ని ధోరణులనూ పౌండు తన కవిత్వంలో ప్రవేశపెట్టేడు. అతని పాండిత్యం బొటాబొటి పాఠకుడిని (average reader) దిగ్భ్రాంతుడిని చేసింది. కాని ఒకొక్కప్పుడు కోవిదుల పృచ్ఛలకు గురి అయ్యేది. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతర కాలంలో అతని అహంభావం ఒక పౌండియన్ ఫక్కికమైన బలవత్తత్వానికి (Poundian type of fascism) దారి తీసింది. అయితే అతని వైయక్తిక వైపరీత్యాలు, అవి యెంత దారుణమైనవైనా, ఒక అన్వేషకుడుగా అతని కున్న ప్రాముఖ్యాని కపకర్ష కలిగించలేవు. ఆంగ్ల కవుల మాట అలా వుండగా, అమెరికను కవుల కత డేమనిపిస్తాడో అతని మిత్రుడు విలియం కార్లోస్ విలియమ్సు వ్రాసుకున్న స్వీయచరిత్రలాంటి పుస్తకాల్లో స్పష్టంగా నిరూపితమైవుం దా విషయం. అలాంటి సమకాలి

లకు పౌండు చాలా విలువైన ఉపకారం చేశాడు. అంటే అమెరికాను అపలపించడం ద్వారా కాదు. మరి? కవిగా బ్రతకదలచినవాడు ప్రజా మోదాన్ని వదులుకునే దమ్ములున్నవాడైతే ఇడాహోలోని మాస్కో నుంచి ఇవతలి కూడిపడగలడు, పడి ప్రపంచమంతా తన ప్రాంతమే అని చేపట్టగలడు అని, చేసి నిరూపించడం ద్వారా ఉపకారం చేసినవా డయ్యాడు.

పౌండు గమ్యంగా ప్రతిపాదించిన రచనాశిల్పరామణీయకము విలియమ్సు కవిత్వంలో కంటె కూడ వాలెస్ స్టీవెన్సు కవిత్వంలో అధికంగా కనిపిస్తుంది. స్టీవెన్సు ఒక ఇన్సూరెన్సు కంపెనీలో పనిచేసి అందులో ఒక పెద్ద అధికారి అయ్యాడు. ఆ ఉద్యోగం అతని రచనా వ్యాసంగానికి విరుద్ధమైనది. అతడు తా నొక కాల్పనికసంప్రదాయకవి (**Romantic Poet**) నన్నాడు. పాపం, తనచుట్టూ వున్న ప్రపంచంలో అమాయికంగా చిక్కుల్లో పడ్డ తన సంబంధాన్ని తెలుపుతుం దనుకున్నా డా మాటను. "మిద్దెమీద నివసించేవాడికి క్రిందనున్న చెత్త, 'అడ్వర్ టైజుమెంటు' కాగితాలూ అద్భుతంగా కనిపిస్తా యనే మాట తప్పిస్తే అందులో జీవితం దుర్భరంగా వుంటుంది...ఎవడు సూర్యచంద్రు లను చూస్తూ బ్రతుకుతాడో, ఎవడు చివికిన ప్రాత వార్తాపత్రిక పట్టుకో వాలని పట్టుబడతాడో (?) వాడూ యోగి" అని ఆయనే అన్న మాట లను ఆయనకే అన్వయించవచ్చు. ఆయనకు తనకాలం నచ్చలేదు. అయితే దానిమీద నూటిగా నేరం మోపా లనుకొన్నవాడు కాదు. ఒక సరి క్రొత్త సమాజపద్ధతిని ప్రతిపాదించా లనుకొన్నవాడు కాదు. అతని విమర్శలు విశిష్టంగా అతిమాత్రమనోజ్ఞంగా వుంటాయి. అతని కవితలు మొదట 1914 లో 'పొయట్రీ'లో ప్రచురింపబడ్డాయి. అతని దృక్పథంలో ఏ దోషమూ లేదు, అతడు నవోద్యమానికి సంబంధించినవాడే, 'మావ్' దశాబ్దికి (**'Mauve Decade'**అని 1890-9 కి థామస్ బీర్ పేరుపెట్టేడు)

వారసుడు కాడు అని నిరూపిస్తా యీ పద్యాలు. అతని **'Disillusionment of Ten O'clock'** ను చిత్తగించండి :

> **"The houses are haunted**
> **By white night-gowns,**
> **None are green,**
> **Or purple with green rings,**
> **Or green with yellow rings,**
> **None of them are strange,**
> **With socks of lace**
> **And beaded ceintures.**
> **People are not going**
> **To dream of baboons and periwinkles.**
> **Only, here and there, an old sailor,**
> **Drunk and asleep in his boots,**
> **Catches tigers**
> **In red weather."**

1920 ప్రాంతపు విమర్శకుడొకాయన 1 ఈ పద్యాన్ని ఉదాహరించి స్టీవెన్సు పదాలతో గవ్వలాట ఆడేడన్నాడు. అవును, సేండ్ బర్గు, లిండ్సే, మాస్టర్సు, ఆ మాటకు వస్తే విలియమ్సుల విపరీత ధోరణులతో కలిసిపోతోందనే విమర్శకవచనంతో ఏకీభవించవచ్చు. స్టీవెన్సుకి రంగులంటే ఇష్టమన్న సంగతి స్పష్టం. తెల్లని రాత్రిబురఖాల చచ్చుగారవంతో సాటితెచ్చినపుడు ఆ రంగులు భావనాసరళిని, వస్తుగతజీవకళను పట్టియిస్తున్నట్లు, ఆ భావచిత్రాలు కృతకంగా, దూరానీతంగా (**Far-fetched, i.e.,** డొంక తిరుగుడుగా) వున్నట్లు చిత్రింపబడిన దృశ్యం

---

**1. Louis Untermeyer: American Poetry Since 1900 (London, 1924).**

తథ్యంకాదనీ, ఆ నావికుడు నిజంగా నావికుడు కాడనీ (నృత్యరూపకంలో నయితే ఒప్పుకుంటే ఒప్పుకోవచ్చు) గ్రహించగలం.

తరువాతి కావ్యఖండికల్లో స్టీవెన్సు ఒక్కొకప్పుడు పాఠకుడిని క్రొత్త పుంతలు పట్టించి చివరి కొక వ్యర్థజగత్తులో 'డాడాయిజమ్' నీడల్లో, 'సర్రియలిజమ్' వెర్రివేషాల నేపథ్యగృహాల్లో విడుస్తాడు. (ఉదా: **'Le Monocle de Mon Oncle', 'The Paltry Nude Starts on a Spring Voyage'**—ఆ శీర్షికలకీ, ఆ ఖండికలకీ అంత సరియైన సంబంధం లేదు). మెరెట్ ఆపెన్‌హీమ్ (**Meret Oppenheim**) అనే ఒక అధివాస్తవికతావాది (**Surrealist**) బొచ్చుతో ఒక పానపాత్ర (కప్పు, సాసరు, చెమ్చాలతోసహా) తయారుచేశాడు. స్టీవెన్సు పద్యాలలో కొన్ని అలా వున్నాయి. ఆ బొచ్చు-కప్పు పద్యాలన్నీ అభూతకల్పనలతో నిండివున్నాయి. అవి పాఠకుడి కొక ఉపదేశం గాని, ఊరటగాని యిచ్చేవి కావు. ఒక నాసిరకం ఉల్లాసాన్నిమాత్రం కలిగిస్తాయి. అందుచేత అవన్నీ పనికిరాని పద్యాలని కొట్టిపారెయ్యవచ్చు. లేక, 18 వ శతాబ్ది పద్యాలు కొన్నిటి లాగు, సిట్వెల్సు పద్యాలు కొన్నిటి లాగు ఈ పద్యాలు గూడా ఒక అతినాగరమైన వివేకంయొక్క విప్రకీర్ణత ద్వారా ఒక అనుభూతిని కలిగిస్తాయి.

ఇంత చెప్పి స్టీవెన్సు పద్యాల పరమార్థం చెప్పినట్టు కాలేదు. పౌరదృశ్యం కావలసినన్ని విషయాలతనిమీద పడేస్తుంది. అది వాస్తవ స్థితి (**fact**) తో కవిత్వాని కున్న ప్రాథమికమైన, ఎప్పటికీ అంతుపట్టని పోరాటాన్ని తెలియజేస్తుంది. అయితే అందరి **'fact'** వేరు, ఇతని **'fact'** వేరు :

> **"Crow is realist, but, then,**
> **Oriole, also, may be realist."**

[కాకి వాస్తవికతావాదే. కాని అలాంటప్పుడు బంగారుపిచుక కూడా వాస్తవికతావాది కావచ్చు.]

యాథార్థ్యము, భ్రాంతి, వాటి అంతరక్రీడ—ఇవి అతనికి ముఖ్య మైన విషయాలలోనివి. అతనికి అధివాస్తవికత (Surrealism) అంటే కిట్టదు—"అది కల్పిస్తుంది (invents) కాని కనిపెట్ట (Discover) లేదు. నత్తగుల్లచేత హార్మోనియం (accordion) వాయింపిస్తే అది క్రొత్తగా కలపనచేసినట్లవుతుంది కాని ఉన్నది కనిపెట్టినట్లు కాదు." కవిత్వం అసంభావ్యమార్గాల ద్వారా నైనా సత్యాన్ని చేరుకోగలదు (చేరుకోవాలికూడాను); అంతేకాని చీకట్లో దూకి కాదని అతని తాత్పర్యం. లోకవాసనలలోని కవిత్వప్రతికూలమైన వట్టి సామాన్యతను కవి గుర్తిస్తే అన్నిరకాల పరిమళాలూ, తళతళలూ ఉపాదేయాలే. ఈ దృష్టితో చూసినప్పుడు అంటర్ మేయర్ ఆక్షేపించినట్లు అతని **'Disillusionment of Ten O'clock'** మాత్రం వట్టి రంగుల హంగామా కాదని తెలిసిపోతుంది. అందులో ఒక ఆంతరపరిశీలనం వుంది. ఒక సమగ్రత వుంది. అది భావచిత్రవాదుల కవిత్వపు కుస్తీపట్ల మాదిరిగా కాకుండా అప్రయత్నంగా బాహిరిల్లింది. అది ఒక నాటకరంగప్రసాధనంలా అవుపించినా అలంకారప్రాయత్వాన్ని బాగా అతిశయించిన ప్రయోజనం గలది. దాని కొక అర్థం వుంది. అది మాంద్యానికీ, కవిత్వసత్యానికీకూడ మంచి దృష్టాంతం. అతని చర్చ తరువాతి సంపుటాల్లో కొన్నిట (ఉదా: 'Auroras of Autumn' 1950) మరీ తేటతెల్లమైంది. అలా కావడాన్ని "'స్పినెట్' (వాద్య విశేషం) దగ్గర జి. ఇ. మూర్ నిలబడినట్లుం" దన్నాడు రాండాల్ జారెల్. 'అమెరికన్ ప్రహేళిక' (American Conundrum) ఇంకా అలా వున్నట్టే. అందులోనే 'లాటినువేదం' (Vulgate) లోని ఊకదంపుడు(gibberish)కోసం దేవులాడుతూ విలక్షణమైన గొంతుతో చెప్పడానికి ప్రయత్నం చేశాడు:

**The peculiar potency of the general**
**To compound the imagination's Latin with**
**The 'Lingua franca et jocundissima.'**

[అంటే భావనాగతమైన లాటినుతో సంకరభాషను, పరిహాస జల్పితాన్నీ కలపడానికి సామాన్యభాషయొక్క విలక్షణశక్తిని వినియోగించుకున్నాడు]

ఆ 'సమస్య' (Conundrum) ఇంత సున్నితంగా పరామర్శింపబడటం అరుదే. ఈ శతాబ్దిలో బహుముఖప్రజ్ఞాశాలులైన కవులలో స్టీవెన్సు ఒకడు. మొదటి ప్రపంచసంగ్రామంతరువాత వ్రాత మొదలెట్టిన మేరియన్నే మూర్‌లాగే 'పీపుల్'—'పబ్లిక్' అనే ముడిసామ్యాలతో తంటాలుపడడం మానుకున్నాడతడు. మెల్విల్‌ని దోషదూషితుని, నిస్పృహుని చేసిన కళాకారసహజమైన ఏకాకిత స్టీవెన్సువిషయంలోనూ వున్నదనుకోన్నా అతడొక పరిణతుని ప్రశాంతతతో తన గమ్యాన్ని చేరుకోడానికి ప్రయత్నించాడు. తనకన్నా హడావుడిరాయుళ్ళయిన మిత్రులతో కలిసి అమెరికన్‌కవిత్వం ఒక పరిపాకదశకు వచ్చిందనే శకునం చూపేడు. యూరపుతో పోల్చిచూసుకున్నా మరి అమెరికాకు సాంస్కృతికంగా వెనుకబడివుండడమనే దుర్దశ తొలగిపోయింది. అసలు పౌండు, గర్ట్రూడ్‌స్టీన్ మొదలైన అమెరికనులు యూరపియనురంగం ముందు హంగుదారులుగా నిలుచున్నారు. తక్కినవాళ్ళను చేయెత్తి పిలిచారు. అమెరికన్ ప్రజానీకం తమ్మనుసరించిరావడంలో చాలా వెనుకబడివున్నా (బ్రిటిషుఫ్రెంచివారికంటె మరీ వెనుకగా), ఈ వింత శకంలోని కవులుమాత్రం కలవరపడలేదు. వాళ్ళు పలుపత్రికలద్వారా పరస్పరం సంప్రదించుకోగలిగేవారు. వేళాకోళాలు, వెక్కిరింతలు, తందనాలు ఆడుకొనేవారు. అవి పరిపాటిగా వస్తున్నవే.

అమీలోవెల్, జె. ఆర్. లోవెల్ ఒకే కుటుంబంలో కుడియెడమలుగా వస్తున్న ఒకేకోవకు చెందినవారు. 'ఆ పెద్దాయన ఆమెకు యావజ్జీవితమూ ఒక ఆదర్శంగా ఎదుటనే వున్నాడు.' ఒకసారి ఎవరో ఆమెతో ఆయనకంటె కవిత్వంలో మీరే గొప్పవారని అంటేను ఉబ్బితబ్బిబ్బయిపోయిందామె. మిగతాకవుల్లో కొద్దిమందికి మాత్రమే అలా ముందుతరంవారితో అంత దగ్గరి అనుబంధం వుండేది. అయితేనేం, ఒక విప్లవం పురోగమిస్తోందనే ఆమెవిశ్వాసంలో అందరూ భాగస్వాములే.

# 12

## ప్రథమ ప్రపంచయుద్ధానంతర నవలా సాహిత్యం

షెర్వుడ్ ఎండర్సన్ (1876-1941)
సింక్లెయిర్ లూాయిస్ (1885-1951)
ఎర్నెస్ట్ హెమింగ్వే (1898-1961)
ఎఫ్. స్కాట్. ఫిజెరాల్డ్ (1896-1940)
జాన్ డాస్ పస్సోస్ (1896 - )
జేమ్సు టి. ఫర్రేల్ (1904- )
జాన్ స్టీన్‌బెక్ (1902- )
విలియమ్ ఫాక్నర్ (1897- )
థామస్ వుల్ఫ్ (1900-38 )

**1918**లో సంధి (Amistice), 1919 లో శాంతియొడంబడిక (అదే సం॥ రాజ్యాంగానికి 18 వ సవరణ జరిగింది—

సిద్ధాంతరీత్యా అమెరికానిర్మద్య (dry) దేశం అయినట్టు జరగడంతో అమెరికనువచనరచయిత ఒక నవవిప్లవశకంలో అడుగుపెట్టినట్టే. కొన్నిట్లో అది ముందునాటి ఉద్యమాల అనుబంధపు సాగుదలయే అనవచ్చు. అయితే ఆ రచయిత లలా అనుకొనేవారు కాదు. బహుశా ఒక్క థియోడర్ డ్రెయిజర్‌ని తప్పిస్తే మరెవరూ యుద్ధానికి ముందున్న రచయితలతో సంబంధం అంగీకరించేవారు కారు. హెన్రీ ఏడమ్స్ అమెరికన్‌చరిత్రలో తరానికీ తరానికీ మధ్య అనుబంధం లేదంటాడు: అంటే, యువకులు వృద్ధులనుండి యేమీ గ్రహించడంలేదు, వృద్ధు లెలాగూ యువకులనుండి గ్రహించలేరుగదా అని అతని తాత్పర్యం. కాని ఏడమ్స్‌సమకాలికులు మెచ్చరా మాటను. 1918 లో అతని 'Education' సర్వప్రతి (popular edition) ప్రచురింపబడగానే యువజనులకు (తమ తలిదండ్రు లెరిగిన చొప్పుకానరాని విషయాలను తమకు సమాధానాలు దొరకకపోయినా ఆధారాలు వున్నాయనుకునేవారు) చాలా ఉల్లాసం కలిగించింది. ఆయన బాగా పెద్దవాడు; వాళ్ళందరికీ తాతగారిలాంటి వాడు. వాళ్ళాయనదగ్గర నేర్చుకొన్నది వున్నది. అందుచేత ఆయన తన సిద్ధాంతానికి తానే వ్యాఘాతం కలిగించినట్లయింది. అయితే ఈ ఆరోపణకొక సమాధానం చెప్పవచ్చు—ఏడమ్స్ తన శకంతోనే తనకు పరిచయం తప్పిపోందని వాళ్ళతో ఆమాత్రం సంబంధం పెట్టుకొన్నాడని. యుద్ధానికి తరువాతితరంవారు, అంటే 'గతించిన తరం' (Lost Generation) వారు (అస లేనాడొక సమవయస్కుల సంఘం ఇంత తన గురించి పట్టించుకున్నట్లు తెలుసుకుందిగనుక) గతంనుండి కీర్తిశేషుల స్మృతులు పిండుకున్నారు. మెల్విల్‌వంటివారి ప్రతిష్ఠలను పునరుద్ధరించడంతో ఆ తరం తమ పూర్వుల తెలివితక్కువకు తాము క్షమాపణ చెప్పుకున్నట్టుంది.

ఆ తరంయొక్క వైశిష్ట్యం, దాని సమస్యలూ చూస్తే మరి ఆ వమ్మకానికి యుద్ధం ఎంతవరకూ కారణమైందో అంచనావెయ్యడం కష్టం.

నిస్సందేహంగా యుద్ధం ఒక ఘోరమైన అసాధారణవిషయం. దాని ప్రభావం తమమీద పడినంత అమెరికనులమీద పడలే దనేది యూరపియనుల వ్యసనానికి కారణమైంది. అవును యుద్ధంచేసిన కాలంగాని, పొందిన నష్టం (ప్రాణ, ధననష్టాలు, మానసికాయాసము) గాని అమెరికనుల విషయంలో స్వల్పమే. పశ్చిమరంగంలోమాత్రం అమెరికన్ సిపాయిలు నాలుగైదునెలలపాటు యుద్ధచర్య చూశారు. కాని యుద్ధం అంటే అమెరికాఅంతటా విసుగు, విరక్తి, అసహ్యము. నవలారచయిత్రిగా ఎడిత్ వార్టన్ యెడల ప్రజల కభిమానం తగ్గిపోవడానికి కారణ మేమిటో తెలుసా?—'The Marne' (1918), 'A Son at the Front' (1923) అనే రెండు నవలల్లో ఆమె యుద్ధాన్ని అర్థవంతమైన కఠినమైన మహోద్యమంగా (అంటే అది జరగడం మంచిదే అన్నట్లు) అభివర్ణించి వుండడమే. విల్సన్ వెర్సెయిల్సుసంధి కొడంబడినందు కాయనను ప్రతిఘటించినది సంపన్నులైన రిపబ్లికన్లు ఒక్కరే కారు. 'న్యూరిపబ్లిక్' లోని మేధావులకంటె ఆయనకు ప్రబలతరశత్రువులు లేరు. అది ఒక 'మత యుద్ధం' (Crusade) లాంటి దనే మాటమీద అమెరికను లసలు యుద్ధంలో దిగేరు. కాకపోతే ప్రభుత్వం మదుపుతో ప్రాతప్రపంచం (యూరపు)లోని వీరత్వా లెలా వుంటాయో ఆ చోద్యం చూతామని సంబరపడ్డా రనుకోవలసివుంది. అయితే వారు వంచితులమయ్యా మనుకొని, ఇంతాచేస్తే యిది మన యుద్ధం కాదుగదా అనుకొని త్వరలోనే రంగం నుండి తప్పుకొన్నారు. చాలమంది యూరపియనులుకూడ భ్రాంతినుండి విముక్తి పొంది దానిగురించి వ్రాతలుకూడ వ్రాశారు. అయితే అమెరికనుల జంకు మాత్రం మరీ సున్నితమైనది—సుకుమారహృదయుడైన అమెరికన్ సిపాయి హఠాత్తుగా రూపర్ట్ బ్రూక్ ఉద్రేకాలనుండి విల్‌ఫ్రెడ్ ఓవెన్ ఉద్రేకాలవేపు మడమ త్రిప్పినట్టు వుంటుంది. అయితే అందులో ఒక తేడా వుంది: ఓవెన్‌కి గల శోకాన్ని భరించే ఓర్పు చూపలేక ఆ యుద్ధం వల్ల తన కేర్పడిన అవమానం, ఆగ్రహంతోనే బాధపడ్డాడు. 1920

ప్రాంతపు అమెరికన్ రచయితకి యుద్ధంతో రెండురకాల సంబంధాల్లో ఏదో ఒకటి ఏర్పడినట్లు తోస్తుంది. అమెరికన్ సేనలు రంగంలో ప్రవే శించకముందే తాను విధిలేక యుద్ధంలో చేరనన్నా చేరేవాడు. (ఉదా: రాయల్ విమానదళంలో ఫాక్నర్; చికిత్సాలయాల్లో హెమింగ్వే, జాన్ డాస్ పసోస్, ఇ. ఇ. కమ్మింగ్స్)—ఆ పక్షంలో యుద్ధభూతం తన్నా వేశించకూడ దనుకొనేవాడు; లేకపోతే స్కాట్ ఫిట్జెరాల్డుకిమల్లే (లేక 'స్టడ్స్‌లోనిగన్' లాగు, ఫాక్నర్ వ్రాసిన 'Soldiers Pay' లోని యువశిక్షితుడిలాగు) స్వదేశానికి పోవడాని కవకాశం లభించేది కాదు. ఆ పక్షంలో తనకు తెలిసిందల్లా ఆ భ్రాంతిరహితస్థితియొక్క వెనుదీయడ (Backwash of Disillusionment) మొక్కటే కావడంవల్ల తాను ద్విగుణంగా వంచితుడైనట్లు బాధపడ్డాడు. ఆనాడు డాస్ పసోస్ వ్రాసిన 'Three Soldiers' (1921), కమ్మింగ్స్ వ్రాసిన 'The Enormous Room' (1922) అనే నవలల్లోను, హెమింగ్వే గ్రంథాలు కొన్నిటిలోనూ, పైవాళ్ళెవరో చేసుకుంటున్న యుద్ధాన్ని నిర్లిప్తంగా పరిశీలిస్తూ వాళ్ళ నినాదాలను వట్టి ప్రవాదాలుగా భావించే అమెరికన్ నాయకస్థానం వహించాడు.

సామాన్యంగా అందరూ నమ్మే విషయాలు వట్టివి, అసత్యాలు అనీ, కళాకారుడు సంఘంనుంచి వేరుపడిపోతున్నాడనీ—ఈ అభిప్రాయాలను ప్రత్యక్షసత్యాలుగా పరిగణించారు 'గతించిన తరం' (Lost Generation) కి చెందిన రచయితలు. అవు నలాంటి 'నకారాల శకం' (Era of Negations) కి తగినట్టే వున్నా యీ అసంగీకారప్రలాపాలు. అయితే ఆ నకారాలు ఉల్లాసమాత్రం కలిగిస్తాయి. నిజానికానాడు రచయిత తా నభినయించడాని కుత్సహించినంత ఏకాకిగా లేదు. అధమపక్షం నవలారచయిత పరిస్థితి అలా లేదు. చిల్లరపత్రికలతో (అవి యెప్పుడూ క్రొత్త మద్దత్తుదారులను సంపాదిస్తూవున్నట్లే కనిపించేది) హాయిగా జరిగే లావాదేవీల మాట అటుండగా, రచయితకు తాను దుయ్య

బట్టిన పౌరులనుంచే మాంచి మద్దత్తు లభించేది. నిజానికి నవలారచయితకి స్థూలములైన పెద్దవిషయాల్లో సంఘంతో విశేషవిభేదా లుండేవి కావు. యుద్ధం కేవలం వ్యర్థమైనదీ, ఘోరమైనదీ, మద్యనిషేధం అమలు పౌర పాఠైపోయింది, లైంగికవిషయాలు చాలా ప్రముఖమైనవి, పేరిస్‌లోను, రివీరావద్దనూ జీవితం తమ ఇంటివద్ద జీవితంకంటె చాలా హుషారుగా వుంటుంది అనే విషయాల్లో చాలామంది అమెరికనులు నాటి నవలా రచయితతో ఏకాభిప్రాయులు. అలాంటి విషయాలు అందము చందము ఆర్జవమూ గల వచన రచనలో వర్ణితం కావడం అభిలషిస్తారు వారు. ఆ రచయితలు గూడ వచన రచనని చక్కగా తీర్చిదిద్దడానికి కృషిచేశారు. సింక్లెయిర్ లూయిస్ శైలిలోగాని, ఎర్నెస్ట్ హెమింగ్వే రచనలోగాని తమ మాటా మంతికి తమ కిష్టమైన క్రీడారంగ వ్యాఖ్యాత వార్తాపత్రిక లలో వ్రాసే వ్రాతలకు నాతిదూరమైన స్థితినే వారు గుర్తించారు. (1920 ప్రాంతంలో చాలామంది గ్రంథకర్తలు మొదట పాత్రికేయులు గానే పనిచేశారు. రింగ్‌లార్డ్నెర్ నిజానికి మొదట్లో ఒక క్రీడారంగ వ్యాఖ్యాత).

రచయితలు తథ్యమిథ్యాస్థితులకు మధ్య, కుతర్కానికీ తెలివి తక్కువ (మెంకెన్ పరిభాషలో 'బూబోయిసీ') తనానికీ మధ్య విధిగా ఒక విభేదం వుందని ఒత్తిచెప్పేరు. యుద్ధానంతరకాలంలో స్వేచ్ఛ కోసం, వ్యక్తిస్వాతంత్ర్యంకోసం, భావస్వాతంత్ర్యంకోసం ఘోష పెట్టేరు. ఆ కాలపు టభిప్రాయాలకు మార్క్సిస్టు ప్రవచనం పోసగనిది కాదు గాని అంతకంటె ఫ్రాయిడ్ (Freud) సిద్ధాంతాలే ఎక్కువ పని చేశాయి. అసలు నవలారచయితలు, నాటకకర్తలు చెప్పదలచుకొన్న దానికే ఫ్రాయిడ్ శాస్త్రీయమైన ఆమోదముద్ర వేశాడు (అని ప్రజాభి ప్రాయం). ముఖ్యంగా జీవితచరిత్రకారులకు అధికారికవిషయాన్ని మూల మట్టంనుంచి లాగడానికి సాయపడింది. గుట్టును బట్టబయలుచేసే వ్యక్తి చరిత్రల ప్రచారం ప్రారంభమైంది. గతాగతకాలాల్లో ఘనులుగా పేరు

మోసినవారుకూడ వట్టి దౌర్భాగ్యదామోదరులుగా, అతికష్టులుగా, దుష్టులుగా నిరూపింపబడ్డారు. స్వచ్ఛందమైన ఆత్మకు స్వాతంత్ర్యం కావాలన్నది థోరోకిలాగే 1920 నాటి రచయితలకూ (కొన్ని ముఖ్యమైన తేడాలతో) అత్యంతముఖ్యాశయం. వ్యక్తులకు లైంగికమైన స్వాతంత్ర్యం వుండాలి. 'పవిత్రులు' (Puritans—ఈ మాట అభిమానస్థానములు కాని పూర్వులకు వాడుకోవడానికి బాగా ఉపకరించేమాట) శరీరావసరాల నుపేక్షించినవారు కావడంవల్ల వాళ్ళ జీవితాలు వక్రమార్గాలు పట్టేయి. 'విక్టోరియన్సు' విషయమూ అంతే అయింది. 1920 ప్రాంతపు రచయితలు హోవెల్సువంటి రచయితలను లైంగికసంబంధాలను విస్మరించినందువల్ల క్షమించలేకపోయారు (హోవెల్సుకి 'సంబంధం' అంటే సాంఘికసంబంధమనే; వాళ్ళకు లైంగికసంబంధమని). లైంగికంగా గాని, సాంఘికంగా గాని సంతృప్తికరములు కాని వివాహబంధాలకు విడాకు లుండాలి. వ్యక్తి ఆలంకారికంగాను, యథాక్షరంగా నైనా సరే (Metaphorically and even literally) అనాచ్ఛాదితపాదుడై (Barefoot) నడవాలి. అంటే - ఆనాటి రచనలతో గడ్డితో నడవాలని జోళ్ళు తీసేసుకునేవారు, నేలను హత్తుకొని పడుకోవాలని బట్టలు కూడా తీసేసుకునేవారూ అయిన జనుల చిత్రణలతో నిండి వున్నాయి. నాగరికత దౌర్జన్యం మితిమీరిపోతోందని ప్రాక్తనమైన పామరత్వాన్నే గొప్పదనేవారు కొందరు. 'నల్లని నవ్వు'వా డయిన నీగ్రో అంటే ఈర్ష్యపడేవారు కొందరు - ముఖ్యంగా శ్వేతజాతీయులు విస్మరించిన జీవిత కళాకౌశలం యొక్క కిటుకు అతనికి తెలుసునని. మేబెల్ డాడ్జిలుహాన్ అనే పరపతిగల ఖామందుల కుటుంబానికి చెందిన స్త్రీ ఒకామె యుద్ధానికి ముందు ఇటలీలో కొంతకాలం, యుద్ధం జరుగుతున్న కాలంలో న్యూయార్కులోను నివసించి తదుపరి న్యూ మెక్సికోకి వెళ్ళిపోయింది. అక్కడామె నాల్గవ భర్త ఆంటోనియో అనే టావోస్

ఇండియన్ వున్నాడు.[1] అమెరికన్ స్త్రీలు కూడా (బ్రిటిష్ వనితల వలె 'ఓటు' హక్కును క్రొత్తగా సంపాదించారు) ఆ దశాబ్దిలో స్వేచ్ఛా సముద్యమానికి తీవ్రమైన కృషి చేశారు; దోహదం చేశారు. వాళ్ళు ఎంత సంపన్నులైతే అంత గొప్పగా వాళ్ళ కృషి ఫలించేది - వారి కా డబ్బు తమ ఆవేశం ఎటు నడిపిస్తే అటు వెళ్ళడాని కవకాశ మిచ్చేది గనుక.

ఆ సంగ్రామ మహాభారతం (Armageddon) అనంతరం రచయితకు కాలం కలిసివచ్చింది. అతను చెప్పదలచుకొన్నదానికి వచనం బాగా అమరివున్నది. సంఘంనుండి వేరుపడిపోవడం అనే అతని ప్రధాన విషయం చాలా కాలంనుంచి అమెరికను రచయిత నాకట్టుకుని వస్తూ వున్నదే. అప్పటిదాకా అది అమెరికనులకు స్వదేశీయమైన విషయం కాని యిప్పు డది యూరపియను రంగ మంతటికీ కుదిరిన విషయమైపోయింది. యూరపియను రచయిత లనుకరించారు. 'జాజ్' సంగీతంలాగు, 'కాక్ టెయిల్సు' (వివిధ మద్యమేళన గోష్ఠులు)లాగు అది 'అమెరికన్ వైఖరి'ని తెలుపుతుంది.అది యౌవనోత్సాహంగలది, నిష్కపటమైనది,అకార్యకరణ విముఖమైనది, వేగవ్యగ్రమైనదీను. దాని ఉత్సాహాతిశయము, ఆశాభంగ విషాదాతిశయమూ బహుధావిక్లబ బాధావిశ్లథమైన యూరపు యొక్క ఆశావకాశాలను, విజ్ఞానపరిధులను విస్తృతం చేశాయి.

ఆ నాటి రచయితలతో అలా సంఘంనుండి బాగా వేరుపడిన వారిలో ఒకడు షెర్వుడ్ ఎండర్సన్. అత డొక ఒహాయో వ్యాపారస్థుడు. పెళ్ళి చేసుకున్నాక నరాల నిస్సారంతో బాధపడి కొన్నాళ్ళకు తన కుటుంబాన్నీ, వృత్తినీ విడిచిపెట్టేడు. చికాగోలో స్థిరపడ్డాడు. తన నల భయ్యో యేట కారల్ సేండ్‌బర్గ్, చికాగో రచయిత ఫ్లోయిడ్ డెల్ యిచ్చిన ప్రోత్సాహంతో రచనావ్యాసంగం ప్రారంభించి, 'Windy-

---

1. టావోస్ కోలనీలో డీ. హెచ్. లారెన్సు కొంతకాలం నివసించాడు. ఆయన భార్య యిప్పు డక్కడే వున్నది.

Mc Pherson's Son' (1916) అనే నవల రచించాడు. అది తన లాంటి వ్యక్తి గురించే. ఆ వ్యక్తి కూడా అతనిలాగే 'సత్యాన్వేషణ' కోసం వ్యాపారాన్ని త్యజిస్తాడు. ఏదో ఒక రూపంలో ఇదే పిదపకాలం లోనూ ఎండర్సను సంప్రదాయం అయిపోయింది. అతని నవలలూ, కథానికలూ అతని జీవితం యొక్క వివిధ స్థితులకే ప్రతీకలు, విప్లవంలో పాల్గొన్న కళాకారుడుగా తనను చిత్రించుకోవడం ఆయన కిష్టం. కొన్ని పుస్తకాల్లో అది విశదమైనది (ఉదా: A Story-Teller's Story, 1924; Tar, a Midwest Childhood, 1926). అతని రచన కారల్ సేండ్‌బర్గూ, గర్ట్రూడ్ స్టీన్‌ల పోకడలు సమావేశమైనట్లుంటుంది. తనవారైన మధ్య పశ్చిమ ప్రాంతీయుల గురించి వ్రాయాలనే దుగ్ధ సేండ్‌బర్గు తత్వంతో చెలిమి చేసినట్లయినది. ఆ జనుల పలుకుబడి అతని కర్ణపుటాల్లో కాపురం వుంది. వాళ్ళ శంకాసంకటస్థితి (dilemma) తాను బాగా అర్థంచేసుకోగలిగానని అతని భావన. ఇక, స్టీన్ వ్రాసిన 'Three Lives', 'Tender Buttons' (1914) నుంచి యథార్థకథనం పాలిటి కొక క్లిష్టమైన పద్ధతిగా పరిణమించిన రచనా శిల్పం యొక్క ఆవశ్యకత గురించి తెలుసుకున్నాడు. కాలస్వభావాని కనుగుణమైన యీ శిల్ప ప్రతిపత్తియే తన వస్తుగతమైన అవ్యవస్థనుండి ఆయనను రక్షిస్తూ వచ్చింది. ఆయన 1921 లో పేరిస్ వెళ్ళినప్పుడు స్టీన్‌తో స్నేహం చేశాడు. ఆమె నిష్టపడేవాడే అయినా ఆమె రచన లోకసందేశాన్ని, అసలామెభావాన్ని చక్కగా పఠిత కందజేయలేకపోయాయనే విషయాన్ని గ్రహించే సూక్ష్మజ్ఞత అతని కున్నది. "శబ్దసామగ్రితో పరిశ్రమించే కళాకారుడికి తప్ప ప్రజాసామాన్యాని కామె ప్రాముఖ్యం ఏమీ లే" దని వ్రాశాడు 1922 లో.

ఈ శిల్పాన్ని ఆయన ఎంత అర్థం చేసుకోగలిగిందీ బాగా పేరు చేసుకొన్న అతని పుస్తకాల్లో మొదటిదైన 'Winesburg, Ohio' (1919) ను చూస్తే తెలుస్తుంది. ఇది ఎండర్సన్‌కి ఆబాల్య సుపరిచితమైన

దానివంటి ఒక ఊరి గురించిన కథలూ, గల్పికల సంపుటి (ఎండర్సను కథలను కథలుగా పరిగణించరు చాలామంది). అందులో ముసలి పాత్రలు కొన్ని, చిఱచిఱలాడేవి కొన్ని, వికారాలోడేవి కొన్ని, భంగపాటుతో వంగిన బ్రతుకులవి కొన్ని. మిగతావి అస్తిమితాలైన యువపాత్రలు. అయితే మొత్తానికి చిన్నా పెద్దా అన్నిపాత్రలూ ఏదో వ్యసనపడుతూవున్న ట్లుండేవే. ఆ పాత్ర లపార్థానికి గురియైనవి, ఏదో అర్థంకోసం, ప్రేమకోసం, ప్రతిష్ఠకోసం తహతహపడేవి. ఏవేవో ఊహాగానాలు చేస్తూ, ఆశలు నెమరువేస్తూ ఏవేవో భావాలను గొణుగుతూ వుంటాయి కాని వినే దాత యెవడూ లేడు. ఎడ్గార్ లీమాస్టర్సు చిత్రించిన 'స్పూన్ రివర్' శ్మశానంలాగ ఇందులో వైన్సుబర్గు ఆ పాత్రలన్నిటినీ భరిస్తోంది. వైన్సుబర్గుపురవీథుల్లో అంధకార మావరించినప్పుడు ఆ పాత్రల కల లాకటాకశే చిగురులు పెడతాయి. ఒకేరంగంమీది సన్నివేశాల్లా ఆ కథలన్నిటా ఒక ఏకసూత్రత వున్నది. వైన్సుబర్గులో చాలామందికి మరొకరిగురించి ఏ కొంతో తెలిసివుంటుంది. ఆ పరిచయాల ప్రగాఢతే ఆ మనుషు లొకరొకరి మధ్య ఎంతెంత అగాధా లున్నదీ విశదం చేస్తుంది. ఈ కథల్లో జార్జ్ విల్లర్డు అనే ఒక యువకపత్రికావిలేఖరుని పాత్ర ఒకటున్నది. అతడు కొన్నిట్లో ఒక నటుడుగాను, మరికొన్నిట ఒక రహస్యరక్షకుడులాగాను కనిపిస్తాడు. ఎండర్సనుకథల్లో వున్న చెదిరిపోయేగుణాన్ని కాస్త నిలద్రొక్కేపాత్ర అతడే. గ్రంథాంతంలో అతడొక తెల్లవారుజామున రైల్లో పట్టణానికి వుడాయించడంతో ఆ గల్పికలన్నీ ఒక కొలికికి వస్తాయి.

వైన్సుబర్గుకథలన్నిటా గుణం ఒకేతీరుగా లేదు. యువకులూ, వాళ్ళ ప్రేమకలాపాలవికారాలూ చక్కగా చిత్రించబడ్డాయి. ఎందుకంటే- ఎండర్సనీయమైన (Andersonian) అభిరతి సరిగా యౌవనాభిలాషలక్షణంగలది. పెద్దల పాత్రలుగూడ సున్నితంగా చిత్రించబడ్డాయి. 'The Philosopher' (i.e., వేదాంతి) అనే కథలో

కాస్త పిచ్చికళ గల డాక్టర్ పెర్సివల్ "ప్రపంచంలోని ప్రతిమనిషీ ఒక క్రీస్తే; అందరూ సిలువవేయబడ్డారు" అని ఉద్ఘాటిస్తాడు. ఇది అప్పటి అతని స్థితిని బట్టి మిథ్య అనిపించినా అందులో ఒక సత్యం లేకపోలే దనే విషయంమీద ఆ కథయొక్క అంతచమత్కారం ఆధారపడివుంది.

వైన్సుబర్గు నమ్మకమైన ఊరే అయినా, ఎండర్సన్ గ్రామీణజీవితమంతా అందులో చిత్రించినట్లు కాలేదు. అస లాపుస్తకాన్ని ఆయన ఒక చికాగోఅద్దెకొంపలోవుండి వ్రాశాడు. "ప్రతిపాత్రకు సంబంధించిన మర్మాన్ని నాతోపా టక్కడ వుండేవారినుండే సేకరించాను...వారిలో చాలామంది గ్రామజీవితమెరగరు" అని ఆయనే అన్నాడు. అయితే అమెరికన్లు ఎక్కడ వున్నా ఒకటేనని ఆయనఅభిప్రాయం. అందరూ నిరాధారంగా ఏదో అన్వేషిస్తూ తిరిగేవాళ్ళే. కొద్దిమందిమాత్రమే కావాలనుకున్నది సంపాదించుకోగలుగుతారు. వరసగా అనేకనవలల ద్వారా, కథలద్వారా ఏండర్సన్ సత్యాన్వేషణపథకాన్ని నిరూపించాడు. అతని ఊహ లెప్పుడూ చిన్నచిన్న ఉపకథల బాటలో పయనిస్తూవుంటాయి గనుక నవలలకంటె కథలే బాగుంటాయి. నవలలలో చిన్నచిన్న ఊహలే పెద్దపెద్దప్రశ్నలుగా సాగదీస్తా డాయన. కొన్ని కథల్లో ముఖ్యంగా 'The Egg', 'I want to know why' (The Triumph of the Egg (1921) అనే సంపుటిలో) అనే కథలలో నపుంసకత్వ విషాదాలగురించి తలపుననిలిచే సన్నివేశాలు చూపిస్తూనే జీవితంలోని ఇంద్రియసుఖసంతోషాలను సూచిస్తాడు.అతడు చాలా స్వేచ్ఛాప్రియుడు. స్వేచ్ఛయే అతని పరమాశయం. అయితే దాన్ని తగినట్లు ప్రపంచించ లేకపోవడమే అతని లోపం. అతని పాత్రల అంతులేని ఆరాటం, జీవితంలోనూ వాళ్ళభావాల్లోనూ గల అవ్యవస్థగురించి పునఃపునరుద్ఘాటనం పాఠకుడికి విసువు కలిగిస్తాయి. అస లా అవ్యవస్థ తరచు ఎండర్సనుగారి బుర్రలోమాత్రమే వుంటుంది. అతని 'Windy Mc Pherson's

Son' ను సమీక్షిస్తూ ఫ్లాయిడ్ డెల్ అంటాడు: "ఆ గ్రంథమంతటా ఒకే ప్రశ్న: 'ఎందుకు?' అనే ప్రశ్న. ఇప్పటి కింకా అమెరికన్ సాహిత్యంలో పుట్టని ప్రశ్న" అని. అస లాతరంవాళ్ళకి ప్రశ్నలడగడంలోను, సమాధానాలు వాటి జాగ్రత్త అవి పడటాని కవకాశం ఇవ్వడంలోను నమ్మకం వుంది. అందుచేత ఎండర్సను వ్రాసింది ఎక్కువగా అతని వెనుక వచ్చే కుర్రతరాని కుపయోగపడుతుంది.

ఆల్ఫ్రెడ్ కజిన్ చెప్పినట్టు, ఎండర్సన్ నవలను కవిత్వానికీ, మతానికీ మారటవస్తువుగా తయారుచేస్తే, సింక్లెయిర్ లూయిస్ దాన్ని కాస్త ఘనమైనపత్రికారచనగా చేశాడు. ఎండర్సన్ జీవితంలోని వింతలు, భంగపాటుల గురించి చెబితే, లూయిస్ దాని వివరాలను ఒక ఘరానా విలేఖరుడి కుండే నిరసననిపుణత్వంతో చిత్రిస్తాడు. 1920 లో అతడు తన 'Main Street' ప్రచురణతో అవివేకంమీద ఒక చావు దెబ్బ కొట్టేడు. మరిరెండేళ్ళు పోయాక 'Babbitt' లో కొట్టిన దెబ్బ కూడా అంతకు తీసిపోదు. Main Street ఒక గ్రామజీవితాన్ని చిత్రిస్తుంది. గోఫర్ ప్రెయిరీ (మిన్నెసోటా) యొక్క దుర్భరమైన తొత్తరికానీన్ని, సంకుచితత్వానీన్ని, సంతృప్తినీ వెల్లడిచేస్తుంది. బేబిట్ అలాగే ఒక అమెరికన్ పట్టణ (జెనిత్) జీవితాన్ని తీసుకుని ఆపట్టణవాసాన్ని గర్వకారణంగా పరిగణించే వ్యాపారస్థులగురించి చెబుతుంది. అసలు మెన్కెన్ ఒక్కడే తగిన ఉత్సాహంతో అవివేకానీన్ని, అల్పత్వానీన్ని ఎదుర్కొని నెగ్గేడు. 'అమెరికన్ మెర్క్యూరీ' పత్రిక (మెన్కెన్ నాథన్లు కలిసి 1924 లో స్థాపించారు) లో 'అమెరికానో' విభాగంలో మెన్కెన్ ప్రచురించిన రచనలలాగే లూయిస్నవలలుకూడా చదవడానికి చాలా బావుంటాయి. అయోవా, నెబ్రస్కా, అలబామాలలో ఒక్కొక చోట, ఓర్చుకోవడం నేర్చుకున్న అభియుక్తులు కొందరున్న ఒకటి రెండు మహా నగరాలను తప్పిస్తే మిగతాచోట్ల ఘోరాలు జరిగిపోతున్నాయి. అవి యెంతలాంటి ఘోరా లంటే ఒక వ్యంగ్యోల్లుంఠనకళాప్రవీణుడైన

రచయిత (Satirist) కావాలని గోలపెట్టేటంత ఘోరమైనవి. అయితే మెన్‌కెన్ ఆ దారి త్రొక్కకుండా ఊరుకున్నాడు. లూయిస్ లేచాడు; ఆ ధోరణి సరఫరాచేశాడు. తన 'Arrowsmith'(1925) లో అమెరికా లోని వేడబములు, అవినీతిమార్గాల్లో ఒక నిజాయితీపరుని గమనవైఖరి ఎలా వుంటుందో చిత్రించాడు. 'Elmer Gantry' (1927) లో నకిలీమతాలమీద అమెరికనులకు గల వ్యామోహాన్ని నిరూపించాడు. 'Dodsworth' (1929) లో యూరపుకి మొదటిసారి వెళ్ళిన కార్లు తయారుచేసే ఒక అమెరికన్ వ్యాపారస్థుడు పడిన అగచాట్లు వర్ణించాడు. ఇందులో లూయిస్ యూరపుతో అమెరికాను సరిపోల్చడానికి ప్రయత్నం చేశాడు. (అమెరికన్ నవలారచయిత కిదొక సంప్రదాయంలాంటిది) ఇక అలా వరసగా నవలాసృష్టి చేసేస్తున్నాడు లూయిస్. 1930 లో అతనికి సాహిత్యానికి 'నోబెల్' బహుమానం వచ్చింది (అమెరికనుకి రావడం అదే మొదలు). కాని ఇక అక్కడనుంచి అతని పుస్తకాల్లో అతని రచనకు స్ఫూర్తి తక్కువైపోయింది. అమెరికాను విమర్శించడంలో శ్రద్ధాసక్తులు కూడ తగ్గిపోయాయి. కొసవరకూ పరిస్థితి అలాగే కొనసాగింది. చివరిలో ఆయన ఒకసారి "నేను బేబిట్‌ను అతనిమీద ద్వేషంతో గాదు, ప్రేమ తోనే వ్రాశాను" అని చెప్పి యూరపియను పాఠకులను ఆశ్చర్యచకితు లను చేశాడు.

ఈనాడు మనం నలభయ్యేళ్ళదూరంనుంచి అతని Main Street, Babbitt లను పరిశీలిస్తే లూయిస్ తన కఠినవిమర్శకశాఘాతాలకు గురి యైన మనుషుల కోవకే తానూ చెందుతాడని చెప్పవలసివుంది. జెనిత్ పురప్రముఖుడైన ఖామందు జార్జ్ ఫోల్స్‌బీ బేబిట్ గురించి వ్రాసినప్పుడు లూయిస్ అతన్ని ప్రేమించాడో, ద్వేషించాడో అతనికే తెలీదు. గోఫర్ ప్రెయిరీ, జెనిత్‌లను ఘోరంగా చిత్రించి, ఆ పౌరుల వెంగళితనాన్ని వేనోళ్ళ పాఠకుడికి పట్టేటట్లు చెప్పడానికి ప్రయత్నించి, వాళ్లు పరాయి వాడి యెడ చూపే క్రౌర్యాన్ని ఉద్ఘాటించి, ఇంత చెప్పినా తనివితీరక

అందులో సగానికి తానే భాగస్వామిరైనా, ఇంకా ఏదో చెప్పాలని
వేళ్ళాడుతున్నాడు. చూడండి : Main Street లో కేరల్ కెన్నికాట్
విసుగు పుట్టించే తన భర్తను వదిలేసి వెళ్ళిపోతుంది. షెర్వుడ్ ఎండర్సన్
అయితే నవల నక్కడితో ముగిస్తాడు. కాని లూయిస్ ఆమెను మళ్ళా
డాక్టర్ కెన్నికాట్‌తో కలుపుతాడు - ఆయన తక్కిన సంగతు లెలా
వున్నా ధీరుడు, యథార్థవాది అనీ, ఆమె అధీర, స్వార్థపరురాలు అనే
సూచన ద్వారా ఒక సమంజసమైన పరిష్కారం చూపిద్దామని. మెన్
కెన్‌తోగాని, రింగ్ లార్డ్‌నర్‌తోగాని పోల్చి చూస్తే లూయిస్‌కే అమెరికా
అంటే ఎక్కువ మమకారమని చెప్పాలి. యేల్ (Yale) లో పట్టభద్ర
పరీక్షకు ముందునాటి విద్యార్థిదశలో తూర్పుప్రాంతపు కుర్రాళ్ళ మధ్య
తానెలా అపక్వదశలో వున్నాడో అలాగే వుంది ఆ నాటి అమెరికా
కూడ. అయితే అతనికి బాగా తెలిసిందది. అతి పరిచయంవల్ల అవజ్ఞ ఎలా
యేర్పడుతుందో ఆ ష్తత కూడా అలాగే ఏర్పడుతుంది. లూయిస్‌కి డికె
న్సంటే గౌరవమనీ, గర్ట్రూడ్ స్టీన్‌తోగాని తతిమ్మా శక ప్రవర్తకులతో
గాని సంబంధం లేదనీ పెర్రీ మిల్లర్ గమనించాడు. కాని డికెన్సు నాటి
ఇంగ్లండుకంటె 1920 నాటి అమెరికాలో సామాజికాధిక్షేపానికి
(Social satire) అవకాశమిచ్చే సందర్భాలు తక్కువగా వున్నట్లు
తోస్తుంది. ఏమయితేనేం డికెన్సు కొన్ని దోషాలకు పాల్పడినా మిస్టర్
పిక్విక్‌లాగు మిస్టర్ పాడ్‌స్నేప్‌ను కూడా విధిగా అమార్గవర్తిగా చెయ్య
డానికి ప్రయత్నించలేదు. కాని లూయిస్ అలా చెయ్యా లనుకున్నాడు.
అతని సంకల్పం 'బహుళ' మైపోయింది. అందుచేత అతని గ్రంథంలో ఏ
భాగాని కా భాగం సీయర్స్, రోబక్ కేటలాగులాగు నిక్కచ్చిగా
వున్నా మొత్తంమీద చమత్కారం దెబ్బ తిన్నది. 1925 లో 'న్యూ
యార్కర్' (New Yorker) ప్రారంభమైనప్పుడు వెర్రిబాగుల వైతండి
కుల (Caviar Sophisticates) నుద్దేశించి బయల్వెడలింది కాని
డుబుక్' లో వున్న ముసలమ్మ నుద్దేశించి కాదు. లూయిస్ విషయం

అంతకన్నా అయోమయంగా వుంది. అతనికి తన పాఠకుల సంగతి గాని, అసలు తన గమ్యం గురించిగాని ఒక నిశ్చయజ్ఞానం లేదు. ఆ డుబుక్ నుంచి అసంభవ వ్యక్తి చివరికి తన బంధువుగా తేలవచ్చు. అతని బంధువు లంటే ప్రీతి.

ఎర్నెస్ట్ హెమింగ్వే ప్రాతవడిన అమెరికన్ ఆచారాల నుజ్జ గించడం ద్వారా, తన పాత్రలను, వాళ్ళు అమెరికనులైనా సరే, సంద ర్భాంతరాలలో నెలకొల్పడం ద్వారా ఈ సమస్య కొక సమాధానం చెప్పేడు. ఆ సమాధానం అతని అనుభవాలకు తగినట్లే వున్నది. మొదట అతను కొన్నాళ్ళు రక్షణశకటచోదకుడు (ambulance driver) గాను, సంధి (Armistice) జరిగిన తరువాత గ్రీకు-టర్కీ వివాదం విషయమై ఒక కెనడా వార్తా పత్రికకు విలేకరిగాను వుండేవాడు. స్టీఫెన్ క్రేన్ గురించి మనం అనుకొన్నట్లు యుద్ధవార్తావిలేఖకు డంటే తనకు డబ్బిచ్చే వార్తాసంస్థ ఎంత దూరాన వున్నా దానికి వెంటవెంటనే వార్త లందజెయ్యడ మన్న పూచీ తప్పిస్తే మరే పూచీ లేనివాడు. అతడు (హెమింగ్వే) ఒక శబ్దశిల్పియేగాని (Craftsman in words), నాగరిక ప్రవీణుడు (City-intellectual) కాడు. తన కొక ప్రత్యేక విధినిషేధాల విధానం గల ఒక లౌకిక రీతికి చెందినవా డతడు. హెమింగ్వే చిన్నప్పుడే తాను కోరుకున్న వృత్తి అంచెలంచెలుగా నవలా శిల్పంవేపు పరిణతి చెందింది. 1922 లో తాను గర్ట్రూడ్ స్టీన్ కి షెర్వుడ్ ఎండర్సను నుండి పరిచయలేఖ తీసుకుని పేరిస్‌లో దిగినప్పటికి, సాహిత్య జగత్తులో అత డింకా అరవిచ్చని మొగ్గ. వినీతుడు. తన పద్యాలు పట్టుకుని స్టీనూ, ఎజ్రా పౌండూ ఎగ్రగీతలు పెడితే కృతజ్ఞత చూపినవాడు. స్టీను చెప్పింది- ఆమెయేనట మొట్టమొదటగా అతనికి ఎద్దుల కుమ్ములాట గురించి చెప్పింది. 1926 లో ఎండర్సన్ వ్రాసిన 'Dark Laughter' ను తన ఉల్లాసం గొల్పే 'Torrents of spring' లో వికటానుకరణం (Parody) చేసినప్పటికి హెమింగ్వేకి తన పద్ధతినుండి బయటపడటాని కింకా కావలసి

నంత సాహిత్యం వుంది. ఆ పుస్తకం మెంకెన్‌కి అంకితం చేశాడు. దాని నిండా ఫీల్డింగు సూక్తుల ఉదాహరణలూ, హెన్రీ జేమ్సు, 'అమెరికన్ మెర్క్యూరీ', సింక్లెయిర్, లూయిస్ మొ॥వారిని గురించి చపల ఛలోక్తులూ వున్నాయి. అతనికి కూడా అమెరికన్ రంగం కొంత మిగిలి వుంది - మిషిగన్‌కి ఉత్తరంగా వున్న అరణ్యసీమ. అక్కడ తన చిన్నతనంలో వేటాడే డాయన. చేపలు పట్టేడు. మొదట్లో అతని కథలు కొన్నిట అదే రంగం. యుద్ధం అతనిని చాలా భయభ్రాంతుడిని చేసింది కాని బాగా సాగదీసి వ్రాయడాని కింకా అది అతనికి సాధ్యపడిన వస్తువు కాలేదు. అతని మొట్టమొదటి ప్రముఖ నవల 'ఫీస్టా' (Fiesta, 1926. ఇది అమెరికాలో 'The Sun Also Rises' అనే పేరుతో ప్రచురితమైంది). అందులో తన కథానాయకుడిని లైంగికంగా వికలుని చేసినా, తక్కిన పాత్రలను మరికొన్ని విధాలుగా పాడుచేసినా ఎవరూ పట్టించుకోని యుద్ధం గురించి అదో అద్యతన మహావిపత్తుగా చిత్రించాడు.

ఈ నవలలో కథాఖ్యాత, నాయకుడూ అయిన జేక్ బార్నెస్ పేరిస్‌లో పని చేస్తూ వున్న ఒక అమెరికన్ వార్తాపత్రికల మనిషి. అతడు లేడీ బ్రెట్ ఏష్లే అనే ఒక అందంగా, కలుపుగోలుగా వుండే అమ్మాయిని ప్రేమించాడు. ఆమె కూడా యథాశక్తి అతనిని ప్రేమించింది. మిగతా పాత్రలలో ముఖ్యమైనవి: మైక్ (స్కాచ్ మనిషి. బ్రెట్‌తో 'ప్రధానం' జరిగినవాడు, దివాలా తీసినవాడు), బిల్ (అమెరికన్ రచయిత, జేక్‌కి మిత్రుడు). ఈ నలుగురూ, రాబర్ట్ కోన్ అనే మరో అమెరికనూ కలిసి ఒక కూటంగా ఏర్పడ్డారు. కాని వాళ్లు ఏర్పాటు చేసుకున్న సాంకేతిక పద్ధతి (Code) పాటించలేకపోయినందుకుగాను కోన్ బహిష్కరింప బడ్డాడు. ప్రవర్తనకి సంబంధించిన ఈ విధమైన సాంకేతిక పద్ధతి (ఎప్పుడో గాని స్పష్టం చెయ్యబడదు) హెమింగ్వేకు చాలా ముఖ్యమైనది. "దేవుడికి బదులు మాకది వున్నది" అంటుంది లేడీ బ్రెట్. ఆ పద్ధతి పాటింప బడటం, మానడ మన్నది అతని రచనలు చాలావాటి కొక ఆకృతినిచ్చే

విశేషం. ఈ సంప్రదాయం రుడ్యార్డ్ కిప్లింగ్ సంప్రదాయంతో ఒక పోలిక కలిగివున్నది. కిప్లింగు నవలలలో పాత్రలు దోషాచరణ సందర్భాల్లో తమ లోపలి గుట్టు కొక బహిర్వాహిక (outlet) ను కనుగొంటాయి. జేక్ గాని, అతని సహచరులుగాని చేసిన నేరాలు పైచూపుకి పెద్దవిగా కనిపించవు. వాళ్ళ ప్రవర్తన వట్టి తెలివి తక్కువగాను, బాధ్యతారహితం గాను కనిపిస్తుంది. వాళ్లు తప్పత్రాగుతారు. స్తిమితంగా వున్నవా రొకరొకరిని చప్పున పోల్చేసుకుంటారు. వాళ్ళు సాధారణంగా కొన్ని కొన్ని విషయాల్లో చాలా నిపుణులుగా వుంటారు. అయితే ఎప్పుడూ కపటభావ ప్రదర్శనం చేయకూడదు. విషయం చెప్పేటప్పుడు మాత్రం గోపనం అవసరం. అది పద్ధతి. హెమింగ్వే ఇంగ్లీషువాళ్ళను కొందరి నిష్టపడతాడు—'ఫీస్టా'లోని హేరిస్‌నీ, **'The Short Happy Life of Francis Macomber'** లోని వేటల ఆటగాడినీ (అతని అస్పష్టోచ్చారణకూ, సామర్థ్యానికీ). అతని కిష్టమైన పాత్ర లొక రహస్యకూటం **(Freemasonary)** గా ఏర్పడి ఒక ప్రత్యేకమైన పరిహాసపు యాసబాస కలిగి వుంటారు. వాళ్ళ కొక 'కిటుకు మాట' **(Keyword)** వుంది—**'Aficionado'** అని. వృషభయుద్ధం **(Bull-fighting)** బాగా తెలిసినవా డనే అర్థంలో వాడబడిం దిక్కడ. వృషభయుద్ధాలు చూడడాని కని జేకూ, అతని మిత్రులూ పాంప్లోనాలో కలుస్తూ వుంటారు. జేక్ దగ్గర కిటుకు వుంది. వృషభయుద్ధమర్మజ్ఞులైన వారి కెప్పుడూ హోటళ్ళన్నీ నిండిపోయినా సరే గదులు దొరుకుతాయి.

ఈ ఖుషీరాయుళ్ళకి దూరమైపోయాడు కోన్. అత డొక వాచాలుడు. తన ఆవేశాలగురించి చర్చలు చేస్తూవుంటాడు. బ్రెట్‌తో కొద్దికాలం కాలక్షేపంచేశాడు. ఆమె తన నిప్పుడు ఖాతరుచెయ్యడం లేదనే యథార్థాన్ని దర్జాగా అంగీకరించలేడు. వృషభయుద్ధంలో వృషభాన్ని చంపిన యువకు డొక డున్నాడు. వాడిని బ్రెట్ ఆకర్షించిందని వాడి కొక్క తపిణీ తీశాడు కోన్. అయితే వాడు తనకి మానసికంగా పెద్ద

దెబ్బతీశాడని గుర్తించాడు కోన్. గెలుపుకన్న ఓటమే హెమింగ్వేకి ఆసక్తిగొలిపే పరిస్థితి. కొస్త ముందూ వెనకా గాని అందరు మనుషులూ అపజయం పొందవలసిందే, వాళ్ళ వాళ్ళ స్థితినిబట్టి ఆ గండకత్తెరలో పడ తారు అని అతని భావన. అంటే హెమింగ్వే జీవితంలోని సుఖప్రలో భాలని చూడలేనివాడు కాడు. అతనికీ, అతని పాత్రలకూ కావలసినన్ని విందులూ వినోదాలు, సారాయములు, శృంగారవిహారాలు, క్రీడలు, ఓ! కావలసినన్ని వున్నాయి. అయితే ఇవన్నీ పురుషత్వానికి నికషోపలాల వంటివి. హెమింగ్వే స్వీయచరిత్రలాంటి తన **'Green Hills of Africa'** (1935) లో తన దైనందిన క్రీడాభిరతి ఫలితంమీద తన సత్య నిష్ఠ ఎంతవరకు ఆధారపడివుందో నిరాడంబరంగా చెప్పేస్తాడు. స్టీఫెన్ క్రేన్ కిమల్లేనే ఇతని వుద్దేశంలోనూ మరణమే చరమపరీక్ష. యుద్ధంలో బలంగా గాయపడిన హెమింగ్వేకి దాని స్వరూపం ఎంత అస్థిపట్టిపోయిం దంటే ఆ తరువాత మరే వస్తువూ అతనికంటి కంత యథార్థంగా కనిపించ లేదు. దాని సామీప్యంలో ఏమి సత్యం వుందో దానికోసం మరీ ముందుకు త్రోసుకువెళ్ళాలని అతని అభినివేశం. అందుకే సమరమూ, మరణమూ కలిసి ఆచారకర్మగా రూపొందిన వృషభయుద్ధాని కతని భావనలో ఒక ప్రత్యేకమైన అర్థమూ, ప్రాముఖ్యమూ వున్నాయి. దాని అపాయాల గురించే కాదు, అందచందాలగురించికూడా చక్కగా వ్రాశాడాయన. అసలా విషయానికే ఒక పుస్తకానికి పుస్తకం వినియోగించాడు (**Death in the Afternoon,** 1933).

అయితే హెమింగ్వేమీద తరచు వినిపించే విమర్శకుల అభియోగం ఒకటి వున్నది—ఆయన గూఢచర్యకుకంటె భయంకర బహిఃప్రక్రియ కెక్కువ ప్రాముఖ్య మిచ్చి ఇబ్బందిపడతాడని, రహస్యవ్యక్తీకరణాన్ని అనార్జవంతో సమంగా జమకడతా, డది తప్పనీను. మితంగా భాషించే పాత్రలే అతనికి హాయిగొల్పుతవి. అతని సాంకేతికపద్ధతి అప్పుడప్పుడు విడ్డూరంగా వుంటుంది. అతని చప్పిడిరచనలు కొన్ని వున్నాయి. వాటిలో

(Across the River and into the Trees, 1950) 'విజ్ఞాన' మన్నది వట్టి 'తెలిసివుండడం' లోకి దిగజారుతుంది ('Knowledge de-generates into knowingness'); పురుషత్వాన్ని సమర్థించుకోవడమే ధీరత్వ మని పొరబాటుగా పరిగణింప బడింది. 'Fiesta' లోనూ, తదుపరి వచ్చిన అతని 'Farewell to Arms' (1929) లోనూ కానవచ్చే శూన్యవాదధోరణి యుద్ధంయొక్క తదనంతర కాలంయొక్క పరిస్థితికి తగినట్లే వుందనిపిస్తుంది. 1920 నాటి నరాలు బిగుసుకుపోయే పరిస్థితి మన అనుకంపను ప్రకోపింపజేస్తుంది. మరో దశాబ్ది అనంతరం, హేరీ మోర్గాన్ ('To Have and Have Not', 1937 లో) కి పట్టుకున్న తిమ్మిరిగుణం అంటే సోమరితనం మన సానుభూతిని చూరగొనలేదు. అంత వాసికెక్కిన అతని వచన రచన అంత ఉద్దేశపూర్వకమైన నిరాడంబరత, సరళత కలిగివున్నా అందులో విసువెత్తించే గుణం కూడా కొంత లేకపోలేదు. హెమింగ్వే నడిపిన సంవాదాలు శయ్యాతిశయత్వం గల చమత్కార సమాధానాల్లా వుంటాయి :

"They got a cure for that."
"No, they haven't got a cure for anything."
["వాళ్ళ దగ్గర దాని కో మంచి మందుంది."
"అబ్బే, వాళ్ళ దగ్గర దేనికీ లేదు మందు."]

సరే, వీటి మాటకేం గాని రచయితగా హెమింగ్వే వరప్రసాదుడి లాంటివాడు. **In Our Time (1924), Men Without Women (1927), Winner Take Nothing (1933)** అనే సంపుటాల ద్వారా అతడు నవలా కథానికా వాఙ్మయాలకు తొలుత చేసిన దోహదం ఇతరులపై అసాధారణమైన ప్రభావం చూపించింది. ఆ యింతా అనుకృతు లనేకం బయల్వెడలి అసలు దాని రుచికూడా గ్రహించడానికి వైముఖ్యం కలగజేశాయి. కాని మళ్ళా చదివి చూస్తే అతని మొదటి నవలలు, మంచి కథానికలూ ఇంకా జవజీవా లుట్టిపడు

తూనే వున్నాయి. హెమింగ్వే ఎప్పుడూ తన అలవికందిన విషయపరిధి లోనే ఇముడుతాడు. సాహిత్యపు జిలుగుల సహకారం ఆశించడు. తన ఆఖ్యానపు లోతుల్లోకి దిగి అందులోంచి అద్భుతమైన భావనిధులు బయటికి తీస్తాడు. ఇందుకు **'A farewell to Arms'** లోని రచయిత పూనుకొని పరిష్కరించకుండా సహజంగా, నెమ్మదిగా యుద్ధయాత్రతో ఋతు లయ శ్రుతి గలిగిన సన్నివేశం చక్కని దృష్టాంతం. వసంతంలో విజయం వచ్చింది. శిశిరంలో పరిస్థితి మారింది:

**"There was fighting for that mountain too, but it was not successful, and in the fall when the rains came the leaves all fell from the chestnut tree and the branches were bare and the trunks black with rain."**

[ఆ కొండగురించికూడా యుద్ధం జరిగింది. కాని ఫలం దక్కలేదు. ఆ పతనావస్థలో వాన రాకడతో అడవిబాదం చెట్లనుండి ఆకులు రాలిపోయినై. కొమ్మలకు నగ్నత్వం వచ్చింది. వానకు తడిసి మ్రానులు నల్లబడ్డవి.]

ఇంత స్ఫూర్తిమంతంగానూ వుంది 'ఎంబ్యులెన్సు'లో బల్లమీద ఇక కీర్తికాయుడు కాబోయే స్థితిలో వున్న సిపాయి గాయంనుండి క్రింద పడుకునివున్న కథానాయకుడిమీద రక్తం బొట్టు బొట్టుగా పడుతూవున్న విషయం గురించిన చిక్కని చిన్న వక్కణ:

**"The drops fell very slowly, as they fall from an icicle after the sun has gone."**

[సూర్యుడస్తమించాక హిమశిలాకనుండి స్రవించినట్లు బిందువులు మెల్లి మెల్లిగా జారేయి.]

హెమింగ్వే చాలా జాగరూకుడైన రచయిత. పుస్తకం వ్రాత

పూర్తికాగానే అచ్చుకావాలనే ఆతురత లేనివాడు. కొంపదీసి ఎవరేనా తనొక్క కళాకారుడిగా భ్రాంతిపడతారేమో అనే ఊహ తలపున బారినంత ఒక చిత్రమైన తత్తరపాటు పొంది, తన దొక శిల్పవృత్తి అనీ, నేరిమిగల వృత్తులన్నిటిలాగే దానికీ శోదక్షమమైన పరిశ్రమ అవసరమనీ నిరూపించుకున్నాడు. (శీర్షికలు పెట్టడంలో చేసిన ఎన్నికలో అతనికి సాహిత్యపరిజ్ఞాన మున్నదని విశదమౌతుంది—'Partisan Review'కి ఆయన చందాదారుడు కూడాను). వస్తువుకి తఖరారువచ్చేటట్లు ఆయనగాని ఆకృతి కాధిక్యం కల్పించివుంటే అది తన వృత్తియెడల వినీతి ప్రకటించినట్లే. తన వస్తుసన్నివేశభావపరిధిలో తానొక మహారాజు—నిరాక్షేపంగా నిక్షేపంగా పద్ధతి పాటించగల నిపుణుడు. ఉదాహరణకు—ఆంగ్లేతరుల సంభాషణను చిత్రించవలసివచ్చినపుడు (ముఖ్యంగా 'For Whom the Bell Tolls', 1940 లో—అప్పట్లో ఆయన స్పేనిష్ పంటకాపులతో కలిసివుండేవాడు) వాళ్ళ మాటలను అతివిదగ్ధంగా ఇంగ్లీషులోకి అవి అసలు వాళ్ళ స్పేనిషు మాటలే అనిపించేటట్లు అనువదించేవాడు. ఆ పుస్తకంలోనే గంభీరహృదయతత్వం గల విద్యావంతుల పాత్రలను చిత్రించడంలోనూ అతిమాత్రమైన నైపుణ్యాన్ని చూపించాడాయన. చక్కని రచన కొంత వున్నా ఈ పుస్తకమే అతని కృతుల్లో అగ్రస్థాన మందుకొన్నది కాదు. రచనలలో కనిపించే హెమింగ్వే ఆత్మీయతకూ, అసలు నిసర్గనిరాడంబరుడైన వ్యక్తికీ పోలిక లిసుగు పొరుసుగా వున్నాయనడం ఎన్నడూ పూర్తిగా ఒప్పుకోవడానికి వీల్లేని మాట. ఆ గ్రంథాలలోని నిరీక్షకుడు (Waiter) నిజంగా స్నేహితు డవుతాడా? రైతు నిజంగా విజాతీయుడిని గౌరవిస్తాడా? లేక ఈ అమెరికన్ విదేశస్థుని (హెమింగ్వే) లో ఏదైనా లోటుపాటు లున్నవా? తనదేశానికి దూరంగా ఇతడు చేస్తున్న పనేమిటి? అన్నది ప్రశ్న. క్రొత్తదేశంలో పాత్రికేయుడు అనుభవాన్ని ఊచముట్టుగా అందుకోలేడు. సిపాయి అయినా అంతే. అవతల యుద్ధరంగంలో జరిగే వినాశానికీ, ఇటు సెలవురోజుల్లో లభించే

ముధామోదానికీ మధ్య అతని బ్రతుకు భాగహారమైపోతుంది. అది బ్రతుకేమిటి? పారిభాషికంగా చెప్పాలంటే వట్టి ప్రత్యామ్నాయపు బ్రదుకు (Proxy living).

ఇలాంటి సమస్యల గురించి హెమింగ్వే లోతుగా ఆలోచించాడా లేదా అనేది వేరే సంగతి. కాని 'The Old Man and the Sea' (1952) అనే చిన్న నవలలో మాత్రం 'Aficionado' (వృషభ యుద్ధతంత్రజ్ఞుడు) అనే ఊహ నావరించివున్న కాపట్యాలన్నిటినీ త్యజించేశాడు. ఇందులో వట్టి సామాన్యుడే కాని అమాన్యుడైన అవివేకి ఒక క్యూబను జాలరి గురించి చెప్పేడు హెమింగ్వే. ఒక మహామీనంతో క్యూబన్ జరిపిన పోరాటం ఒక విధంగా హెమింగ్వే సాంకేతికపద్ధతి కొక దృష్టాంత మనవచ్చు కాని యిందులో ఆ పద్ధతి లేశమాత్రమూ కలుషం లేనిది. ఇందులో ఆటగాళ్ళ బడాయిగాని, లేటిను పేదల జీవితాలగురించి చెప్పేటప్పుడు చాలమంది రచయితలు ప్రదర్శించే భావకవిత్వాభినయం గాని సూచనాప్రాయంగాకూడ లేవు.

'Across the River and into the Trees' వ్రాసిన తరువాత హెమింగ్వే ఒక పృచ్ఛకునితో ఇలా అన్నాడు :

"In writing I have moved through arithmetic; through plane geometry and algebra, and now I am in calculus."

[రచనావ్యాసంగంలో నేను సామాన్యగణిత, విమానక్షేత్రగణిత, బీజగణితాల ద్వారా పయనించాను. ప్రకృతం సంఖ్యాగణితంలో వున్నాను.]

ఆనాడీ మాటలు ఏవేవో సొంత ఉద్దేశాల ప్రణాళికలతో కిందా మీదా పడుతూవుండిన మనిషియొక్క దర్పాన్ని సూచిస్తున్నట్లున్నాయి. అవునందులో గర్ట్రూడ్ స్టీన్ ధోరణి కొక వింత ప్రతిధ్వని వుంది. అదే

శిల్పరచనాప్రాగల్భ్యం, అదేదో తాము వ్యక్తంచేసిన విషయంయొక్క అల్పత్వాన్ని రూపాంతరీకరణంచేసి వుద్ధరించేస్తుం దన్నట్లు, హెమింగ్వే కూడ ప్రదర్శించాడు. 'The Old Man and the Sea' లోని వృద్ధుని పాత్ర హెమింగ్వే గర్వానికి సమర్థనీయమైన ప్రతీకగా వుంటుంది. షెర్వుడ్ ఎండర్సన్‌లాగు మానవుడు తోడిమానవులనుండి వేరు చేయబడుతున్నా డనే అభిప్రాయంతో బయల్దేరిన హెమింగ్వే ఒకవిధంగా సర్వ మానవసమైక్యభావనకు చేరుకున్నాడు (To Have and Have Not లోను, For Whom the Bell Tolls లోను). The Old Man లో ఆయన ఒక మానవుడిగురించి చెప్పిన కథ మానవజాతి కంతటికీ దృష్టాంతకథవంటిది. అయితే అది యేమంత పెద్దనవల కాదు. దాని పరిధి చిన్నది. తరుపరి మళ్ళా స్పేనిష్ వృషభయుద్ధాల గురించి వ్రాసిన వ్రాతలు పేలవంగాను, వికటానుకరణం బాపతు కల్పనలుగాను వున్నాయి. 'The Old Man and the Sea' ని పరిశీలిస్తే అది భంగ్యంతరంగా రచయిత స్వీయచరిత్ర అనిపిస్తుంది. అది క్రమంగా మిగతా పాత్రల ప్రాముఖ్యం తగ్గించే నవలారచయిత తనకు తాను చూపుకునే ప్రామాణ్యానికి పరమావధి. కాని అదే యథార్థమైతే అతని తొలకరి రచనలే పాఠకులకు రంజకంగా వుంటాయని చెప్పాలె.

స్కాట్ ఫిజెరాల్డ్ ఎండర్సన్, లూయిస్, హెమింగ్వేలలాగు మధ్యపశ్చిమప్రాంతంలో పెరిగాడు. లూయిస్‌వలెనే తూర్పుప్రాంతానికి చదువుకోడానికి వచ్చాడు. ఎటొచ్చీ యేల్‌కళాశాలను కాకుండా ప్రిన్స్‌టన్‌కళాశాల నెన్నుకున్నాడు. ఆ మధ్య పశ్చిమప్రాంత మెలాంటిదంటే అక్కడ అన్ని విషయాలూ క్రొత్తగా పురుడుపోసుకున్నవే. ఫిజెరాల్డ్ ఆశించిన గమ్యమెక్కడో ఒక మహావైభవం వెల్లివిరిసేచోట ప్రజలందరూ తనలాగ, తనభార్యలాగ యౌవనోత్సాహంతో అందంగా, సరదాగా, స్వచ్ఛందంగా వుండగలిగిన చోట వుంది. అతని రచన చాలమట్టుకు అతని అనుభవానికి జవాబుదారీగానే వుంటుంది. ఆ రెండున్నూ అసలస్తిత్వ

మబద్ధమైన ఒక పరిపూర్ణతకోసం వెర్రిగా అన్వేషించే యువకుడి చరిత్ర లాంటివి. నిరపాయంగా, భద్రంగా ప్రపంచంవేపు తేరిపారజూడటాని కాధారపీఠంగా ఒక 'భరోసా' కోసం ఆశించాడు ఫిడ్జెరాల్డ్. ఆ యింతా ప్రాచ్యప్రాంతపు దొరకొడుకులకోసం ఏర్పాటయిన విశ్వవిద్యా లయంలో ప్రవేశించి తన సహాధ్యాయులందరిలోకీ మెరుగనిపించుకొని సఫలుడు కావడానికి ప్రయత్నించాడు. యుద్ధం చేస్తూవున్న సైనికులను చూసి అసూయపడ్డాడు. ఆ ప్రమాదగర్భంలో తానూ జొరబడ్డాడు. ఒక కథానికలో ('The Offshore Pirate' లో) కథానాయకుడి కళ్ళ ముందు యుద్ధసమయంలో గోతులలోంచి లేస్తూ వున్న సైనికుల గురించి వ్రాశాడు: "వాళ్ళ ఒంటికి పట్టిన చెమట, బురద అవి వర్ణనాతీతాలైన ప్రాభవ లాంఛనాలు. అవి యెప్పుడూ అతనిని తప్పించుకుపోతూ వున్నాయి."

ఆ లాంఛనాలు తగిలించుకోవడాని కవకాశం లేకపోయింది ఫిడ్జెరాల్డ్‌కు. అందుచేత తక్కిన వానిమీద నిఘా పెట్టేడు - ముఖ్యంగా ధనాధికుల గురించి. అత డొకసారి హెమింగ్వేతోనూ, 'The Rich Boy' అనే కథలోనూ ఇలా అన్నాడు: "మహాసంపన్నులు నీ కంటె, నా కంటె వేరుగా వుంటారు. వాళ్ళకి చిన్నప్పటినుంచే చేతిలో డబ్బు కలిగివుండే, అనుభవించే యోగం వుంటుంది. అది వాళ్ళ కేమైనా చేస్తుంది." వాళ్ళ కది చేసింది మంచే అనడానికి వీల్లేదు. అసలు మిగతా జనాని కభిమానదూరులుగా చేసింది. ఫిడ్జెరాల్డు కా సంగతి తెలుసు - అమెరికనుల 'ప్రాభవ' మన్నది (aristocracy) పరిమాణ బహుళంగా చూస్తే వట్టి కృతకంగా కనిపిస్తుంది. అందుకు కారణం ఆ ప్రాభవాన్ని అనుస్యూతంగా పారంపరీణంగా కొనసాగించే సూత్రం అమెరికన్ జీవిత వైఖరిలోనే కొరవడింది. దాని కొక తీరూ తెన్నూ, సాంప్రదాయికమైన పద్ధతీ లేవు అని. అయినప్పటికీ ఎడిత్ వార్టన్‌లాగ ఒక ప్రత్యేకపు హక్కుదారుల వర్గానికి సంబంధించిన ఊహ నంటిపెట్టుకుని వుండేవాడు-

అలాంటి వర్గంవల్ల ప్రయోజనం ఏమీ వుండదని ఆమెలాగే తెలుసుకుని వుండీకూడ. తక్కిన సంఘం తాలూకు అక్రమప్రవర్తనను విమర్శించే టందుకు వీలుగా సముదాచారనిలయమైన ఆమె వర్గ మొక సిద్ధాంతరూప మైన ప్రమాణంగా పని చేస్తుంది. కాని ఫిడ్జెరాల్డ్ కొక వర్గాన్ని మరొక వర్గంతో పోల్చి భేదపరిశీలన చెయ్యాలనే వుద్దేశమే లేదు. అతడు డబ్బు యొక్క వింత వింత గుణాలకు, సామర్థ్యాలకు, స్వేచ్ఛను ఎంతమంది పరాయివాళ్ళనుంచయినా సరే కొనగల శక్తికి వ్యామోహం పొంది పోయాడు. డబ్బుంటే సరి దాని దాయాద్యములైన వయోరూపవిలాసాదు లతో ఒక డెంతవాడైనా కావచ్చు - గొప్ప 'aficionado' అయి పోతాడు. అతడికోసం అన్ని ద్వారాలూ తెరుచుకునేవుంటాయి. 'నిరీక్షక శేఖరులు' (headwaiters) కూడ తలవంచుకు నిలబడతారు. ఓడలు, కార్లు, మేడలు, పరివారం అనుకొనేసరికి హాజరవుతాయి. రవి యస్త మింపని రాజభోగం పొందవచ్చు (one could follow the Sun') ఇక దారిద్ర్యమంటే సర్వవిధహైన్యాలకూ పెద్ద సంస్థానం. డబ్బుతో మనుషులు ఉదారులుగా, స్వతంత్రవ్యక్తిత్వం కలవారుగా చలామణీ కావచ్చు. జీవితంలో సంఘటిల్లే చిన్న చిన్న ఉపద్రవాలు, పోయిన టిక్కెట్టు, వానకాలపు సెలవురోజు, ఇరకటపుటిళ్లు - ఇలాంటి వాటన్ని టినీ ఇట్టే చక్కబరుచుకోవచ్చు. 'చందా' ('Largesse') అన్న మాటకు చిన్న లంచమనీ అర్థం వుంది, అదో జీవితవైఖరి అనీ అర్థం ఏర్పడుతుంది.

అదొక యువకుని జీవితవైఖరి. ఫిడ్జెరాల్డ్ దాని కెప్పుడూ పూర్తిగా దూరమైనట్లు లేదు. అతని తొలి రచనలను, అంటే Flappers and Philosophers, 1920; Tales of the Jazz Age, 1922 అనే కథాసంపుటాలను గాని, This side of Paradise, 1920; The Beautiful and the Damned, 1922 అనే నవలలను గాని పిదప రచనలతో పోల్చిచూస్తే వాటిలో అనుభవలోపం స్పష్టంగా

కనిపిస్తుంది. అతని పాత్ర లతని వ్యక్తిత్వాన్నే వెనక వేసుకొని వస్తాయి. అతనిలాగే అతివేలంగా కలలు కంటూ అతి వేలంగా విఫలత్వం పొందుతూ వుంటాయి. This side of Paradise లోని నాయకుడు తన ఇరవై నాలుగేళ్ళ జీవితాన్నీ సవిషాదంగా వెనక్కి చూసుకుంటూ - "నన్ను నేను తెలుసుకున్నాను, అదే చాలు" అనుకొంటాడు. ఇతడూ, ఇంకా ఇందులో వచ్చే యువతీ యువకులూ అందరూ కోరి అపరిణతులుగా వున్నట్లుంటారు. అప్పుడే కళాశాలల గడపలు దాటి ప్రపంచంలోకి వచ్చారు. పరిణతులం కావాలనే కోరిక లేదు వాళ్ళకు. అభివృద్ధి పొందడమంటే వయసు పైబడటమేనట. వయసు మూడు పదులు మీరడమంటే అదేదో దురూహమన్నట్లు వాళ్ళు తమ ఎలబ్రాయానికే అంటిపెట్టుకుని వుండిపోవాలనుకుంటారు. వాళ్ళ ప్రేమకలాపాల్లో ఒక జ్వరతీవ్రత గోచరిస్తుంది కాని గాఢగాని ఉద్రేకాలకు లోనుగారు. వాళ్ళకు తండ్రితనమో, తల్లితనమో వస్తుందంటే భయం. ఏ తరంవారైనా తమ తరంవారికంటె తాము చిన్నవాళ్లలా అవుతారు?

అయితే ఫిట్జెరాల్డ్ రచన చిన్న పిల్లాడి తంతుగా వున్నప్పుడు కూడ మంచి ధారాళంగా, నిపుణనిర్మాణాత్మకంగా వుంటుంది. తొలినుంచీ రచయిత కావాలనే అతని చూపు. అతని పాత్రలు, అస లతని జీవితము గూడ ఒకే విధంగా అల్పప్రయోజకాలుగా వున్నా అతడు తాను మాత్రం ఒక వృత్తినిపుణుడ ననుకొనేవాడు. కాని వట్టి అల్పగుణము వాడు. శత్రువంచన తంత్రంలో మద్యపాత్రలముందూ, క్రీడా పరికరంముందూ కూర్చున్న హెమింగ్వే ఎంత చులకనై పోతాడో అంత తేలిక మానిసి ఫిట్జెరాల్డ్. "నన్ను నేను తెలుసుకున్నా" నన్నది మరీ కేవలం వట్టి తెలివి తక్కువ స్వోత్కర్ష కాదు. ఒక సంక్షోభంలో తాను నిమగ్నుడై వున్నప్పుడు కూడ దానిని నిశితంగా పరిశీలించగల అద్భుతమైన నేర్పు వున్న దతనికి:

"The only way I can describe young Anson Hunter is to approach him as if he were a

foreigner and cling stubbornly to my point of view. If I accept his for a moment I am lost—I have nothing to show but a preposterous movie."

[యువకుడైన ఆన్సన్ హంటర్‌ని నేను వర్ణించగలగడాని కొక్కటే మార్గం వుంది. అత డో విదేశీయు డన్నట్లుగా వెళ్ళా లతని దగ్గరకు. నా అభిప్రాయ వైఖరి కే గట్టిగా అంటిపెట్టుకుని వుండాలి నేను. క్షణకాలం అతని అభిప్రాయాన్ని ఆమోదించానో ఇక నా పని సరి - ఒక విడ్డూర మైన చిత్రాన్ని తప్ప చూపించడానికి నా దగ్గర ఏమీ వుండదు.]

ఇదీ ఇలాగు అతడు 'The Rich Boy' లో సంపద్విషయక మైన ఇతివృత్తాన్ని సమీపిస్తాడు. ఆతనికి సంపద అంటే వ్యామోహం వుంది, కాని ఒక నిర్లిప్తస్థితి పాటించాలని యాతనపడతాడు. అది అతని కళకశ్యమైపోయింది. ధనాధికుల అహంతను బనులుగా చిత్రించడానికి ఆతనిదగ్గర మరి సరుకు లేదు. ఉన్నా అది అతని మనసులో ఉన్న సంపద్వ్యామోహంతో కలుషితమై పోయింది. సంతోషం, సౌందర్యం, మార్దవం అనే విషయా లున్నాయి మనసులో. కాని అవన్నీ యౌవ నాంశలట; వయసుతోపాటు రూపుమాసిపోతాయట.

'The Great Gatsby' (1925) లో ధనయౌవనాల ప్రతి ఘటత్వాన్ని ప్రదర్శిస్తాడు ఫిట్జెరాల్డ్. జేగిట్స్‌బీకి ఒక పెద్ద భవంతి, విందులూ గోవిందులూ, అగమ్యగోచరాద్భుతంగా అతిహేయాలైన రాబడి రస్తాలూ ఎన్నివున్నా, అతడిని ప్రముఖంగా పేర్కొనాలంటే యువక లోకానికి ప్రతినిధి అనాలి. అతని జీవితం పైచూపు కెంత లాండబిష గడ బిడగా వున్నా, అది డెయిసీతో అతని చిరంతనమైన ప్రణయకలాపానికి పునర్భవం కలిగించాలనే ప్రయత్నాని కంకితమైవుంది. ఈ పవిత్రాశయ

సాధనకోసంగాను అతడా సంపత్తిని పోగుచేశాడు. కాని డెయిసీకి టామ్‌బుచ్చనన్‌తో పెళ్ళయిపోయింది. వాళ్ళు మహాసంపన్నులు. టామ్‌కి ఒక ఉంపుడుకత్తె వున్నా, డెయిసీ గేట్స్‌బీని మరవలేకున్నా వాళ్ళ సంపద చిత్రంగా వాళ్ళమధ్య అడ్డగోడ పెట్టింది. గ్రంథాంతంలో బుచ్చనన్లు (టామ్ & డెయిసీలు) బతికేవుంటారు, కలిసేవుంటారు. కాని పాపం, గేట్స్‌బీమాత్రం ఒక పిచ్చివాడి చేతిలో చచ్చిపోతాడు. వాడి కేం తెలుసు గేట్స్‌బీ దురదృష్టాలకు కారకులు బుచ్చనన్లని? వంచితుడు భ్రష్టుడి నెదుర్కొని చివరికి తానే నష్టపోతాడని తాత్పర్యం. ఈ సన్నివేశం హెన్రీ జేమ్స్ వ్రాసిన 'The American' ను కాస్త జ్ఞాపకం చేస్తుంది. అందులో క్రిస్టొఫర్ న్యూమన్ అనే ఆయన మితిమీరిపోయిన బెల్లెగర్డె కుటుంబంవారి సంపదముందు తన సంపద బలాదూరని గ్రహించడం అదీ వుంటుంది. భిన్నాశయసంఘర్షణ జేమ్స్ నవలలోనే ఎక్కువ స్ఫూర్తిమంతంగా వుంది. అందులో ఉభయపక్షాలమధ్య ఉన్న విభేదమూ సున్నితంగా ప్రతిపాదింపబడింది; అందులో ఏ ఒక పక్షంవారినీ డెయిసీ, గేట్స్‌బీల స్థాయుల నన్నట్టుగా, దురాశాపూరితు లనలేము; ఐశ్వర్య మదాంధు లనలేము. అయితేనేంగాని The Great Gatsby మటుకు చక్కని చిన్ననవల. ఫిజ్జెరాల్డ్ తన ఐశ్వర్యప్రపంచంగురించి ఎఱుకగలవాడు. తన పాత్రలకు ఐశ్వర్యం వున్నా లేకున్నా వాటి వాలకం, చేష్టలు, సంభాషణ అంతా చతురంగా, చతురస్రంగా, అవలీలగా చిత్రించాడు. నవలలోని ఆఖ్యాత (ఫిజ్జెరాల్డ్‌లాగే కథారంగానికి పూర్తిగా చెందనివాడు) కథకు అదనపు ప్రత్యేకత చేకూర్చాడు. అన్నిటినీ మించి గ్రంథంలో హృదయాన్ని కదిలించే కరుణరసస్ఫూర్తి వున్నది. సిగ్గుమాలిన వర్ణనలు సాగిన సందర్భాల్లోగూడ ఆ రసస్ఫూర్తి పూర్తిగా ఎప్పుడూ అణగారిపోలేదు. సరికదా కథాఖ్యాత స్మృతి తన మధ్యపశ్చిమప్రాంత శైశవాన్ని నెమరువేసుకొన్నప్పుడు, మళ్ళా రమ్యంగా చివర్లో గతాన్ని అందిపుచ్చుకుని భవిష్యత్తులోకి మోసుకుపోదామని గేట్స్‌బీ చేసిన కృషి

నవ్యప్రపంచంగురించిన అమెరికనుల చిరంతనస్వప్నంతో తన అనుబంధాన్ని నిరూపించుకొన్నప్పుడూ పొటమరిస్తూనే వచ్చింది. మూడు శతాబ్దులకు ముందునాటి అమెరికాస్థితి నిలా అభివర్ణించాడు ఫిజ్జెరాల్డ్ :

"For a transitory enchanted moment man must have held his breath in the presence of this continent,...facc to face for the last time in history with something commensurate to his capacity for wonder."

[ఈ మహామహీఖండం సన్నిధానంలో ఒక్క తాత్కాలికమైన మధురక్షణంకోసం చరిత్రలో చివరిసారిగా మానవుడు తన ఆశ్చర్యక్షమమైన శక్తికి అనురూపమైన దానికి దేనికో ముఖాముఖి నిల్చి ఊపిరి ఉగ్గబట్టుకుని వుంటాడు (నిశ్చేష్టుడై వుంటాడు)].

The Great Gatsby తరువాత ఫిజ్జెరాల్డ్ మంచికథలు కొన్ని వ్రాశాడు. 1934 లో 'Tender is the Night' అనే నవల వ్రాశాడు. సాంఘికచైతన్యం వెల్లివిరిసిన ఆ రోజుల్లో సమీక్షకులు (Reviewers) దానిని గతించిన శకంయొక్క పాసిన వాసనగా కొట్టిపారేశారు. దేశాంతరగతులైన (Expatriates) అమెరికనులు చాలామంది మళ్ళా మాతృభూమికి చేరుకున్నారు. చేతిలోని తడి ఆరిపోయింది. యూరపు వెగటుగా కనిపించింది. ఫిజ్జెరాల్డొక అమెరికన్ దేశాంతరగతునిగురించి వ్రాశాడు. అతడి పేరు డిక్ డైవర్. బోలెడంత డబ్బు తగలేసుకుని, గృహచ్ఛిద్రాలతో సతమతమై చివరికి మళ్ళా ఇంటిమొహం పట్టేడు—అయితే పశ్చాత్తాపంతో కాదు, దారుణవైఫల్యం నుండి మొహం చాటుచేసుకోవడానికి. ఆ సమీక్షకులు చాలా నిర్దాక్షిణ్యంగా వ్యవహరించారు. అయితే ఇటీవలి విమర్శకులు దానికి మించిన పరిహారం చూపించారు. కొన్ని కోణాల్లోంచి చూస్తే అది (Tender

is the Night) గేట్స్‌బీకంటె మంచి పుస్తకం. దానికన్న విశాలతరమైన ఆశయం, సునిశితబుద్ధివైభవం, నవలానిర్మాణమర్మజ్ఞత, పాత్రవైవిధ్యం, వచనరచనా రామణీయకమూ కనిపిస్తాయి దీనిలో. అయితే ముందునాటి కొఱతలుగూడా మిగిలివున్నాయి. గేట్స్‌బీ నవలను కళకట్టించిన విషాదశ్రుతి యిందులో అపశ్రుతి పలికింది. గేట్స్‌బీ చేసిన తప్పిదంలో ఒక ఉదాత్తత వుంది. డైవర్ తప్పిదాల విషయంలో తన మట్టుకు తనకే యింత జాలి వున్న జాడ కనిపిస్తుంది కాని అది గ్రంథకర్త గమనించినట్టు లేదు. అయితేనేం, Tender is the Night మాత్రం మంచి నేర్పు పురివిప్పిన నవల. ఆ రోజుల్లో విమర్శకు లన్నట్లు గ్రంథకర్త ఎక్కడా నీరసించిపోయినట్లు కానరాదు. అతని శిల్పకుశలత కొనసాగిన దనడానికి నిదర్శనాలు: హాలీవుడ్ గురించి అసమగ్రంగా వున్న నవల 'The Last Tycoon' (1941), ఆయన కీర్తిశేషుడైన తరువాత ప్రచురింపబడిన 'The Crack-Up' (1945) అనే సంపుటిలోని రచనలు. చాలామంది అమెరికన్ రచయితలు సత్తువచాలని వస్తువులు గ్రహించడంవల్లను, తమ రచనాశిల్పంపట్ల తగినంత శ్రద్ధ చూపకపోవడంవల్లనూ తమగురించే ఎక్కువ చెప్పుకోవడం జరిగింది. హెమింగ్వే ఫిజెరాల్డ్‌లా విషయంలో గొప్ప శ్రద్ధాళువులు. ఫిజెరాల్డేకాని మరి కాస్త బ్రతికివుంటే వృత్తిపరిజ్ఞానం రచయితను విజ్ఞానపు లోతులలోకి తీసుకుపోగలదని నిరూపించడానికి హెమింగ్వేతో చేరివుండేవాడు.

ఫిజెరాల్డ్, తప్పో ఒప్పో, 1920 ప్రాంతపు 'జాజ్' యుగానికి చెందినవాడైతే, ఆ పైదశాబ్దికి చెందినవాడు జాన్ డస్ పస్సోస్. ఆ దశాబ్దిలో ప్రముఖులైన అమెరికన్ నవలారచయితలలో అతడొకడు. అప్పటికే పేరుచేసుకున్నాడాయన. ఫిజెరాల్డ్ పుట్టినయేడే పుట్టేడు. అతనిలాగే ఈడుకు మించిన బుద్ధి గలవాడు. అతని This side of Paradise ప్రకటింపబడినయేడే, అంటే 1920 లో ఇతని One Man's Initiation (రచన 1917) ప్రకటింపబడింది. అది ఇతని

మొదటి నవల. రెండవదైన Three Soldiers (1921) తో డస్‌పస్సోస్ సమకాలికస్వభావాన్ని నిర్వచిస్తూవున్న యువరచయితల మధ్య (నడివయసువాడైన షెర్వుడ్ ఎండర్సన్‌తో సహా) తా నొక స్థానం సంపాదించుకున్నాడు. Three Soldiersలో నాయకుడు జాన్ ఆండ్రూస్. ఒక గేయకవి. స్వేచ్ఛతో విసుగెత్తిపోయాడట, 'ఈ సారి యథార్థ వస్తువులతో, పరిశ్రమతో, రాగద్వేషాలతో జీవితపునర్నిర్మాణం చేసుకోవాలనే ఆశతో యుద్ధంలో చేరుతాడు. అయితే సైనికజీవితం (అమెరికాలోను, తదుపరి ఫ్రాన్సులోను) మొహం మొత్తింది. అతనిలో చాలా ఏహ్యభావాన్ని రేకెత్తించింది. గ్రంథం చివరికివచ్చేసరికి, యుద్ధరంగం వదిలేసిపారివస్తాడు. ఫ్లాబర్ట్ వ్రాసిన 'Tentation de St Antonie' చదివి ఏదో ఆవేశం పొంది ఒక గేయరచన చేస్తూవుంటాడు. సైనికరక్షకభటులు (మిలిటరీ పోలీసులు) వచ్చి అతన్ని కరదండాలు తగిలించి తీసుకుపోతారు. అతని అసమాప్తగేయం గాలికీ ధూళికీ వదిలివేయబడుతుంది. (తెలివైనవాడైతే వెంటతీసుకునిపోయివుండును. ఇక్కడ పస్సోస్ వుద్దేశించిం దేమైవుంటుంది? ఎంతెంత తెలివైనవాళ్ళూ యంత్రంచేతిలో పడి నలగవలసిందే అని. గ్రంథంలో చరమప్రకరణం శీర్షిక 'Under the Wheels' (i.e., చక్రాలక్రింద). ఇక కళాకారుడికి మిగిలిం దేమిటంటే సంఘంతో వేరుపడిపోవడం (Secession)—అసలు లోకం అతడి కాఅవకాశం యిస్తే. ఇది 1920 ప్రాంతాని కనురూపమైన సన్నివేశంగా గుర్తించవచ్చు. ఆ కాలంలో 'Secession' అనే పేరుతో ఒక చిన్న పత్రికకూడా వుండడం విశేషం. కళాకారుడిదే ఒప్పు (పస్సోసుని కలుపుకొని. ఆయన హార్వర్డుసజ్జు), లోకానిదే తప్పు. సైనికాధికారాల మధ్య ఆండ్రూస్ ఎలాంటివాడంటే—ఒక ప్రాతికాలపు ఛలోక్తిగా చెప్పాలంటే—అడుగువేసిం దతడొక్కడే (the only one in step).

అయితే మరి డస్‌పస్సోసు 'సాముదాయికసిద్ధాంతానికి'

('Collectivist'; Collectivism అన్నది సామ్యవాదానికీ, అంటే సోషలిజమ్‌కి చెందిన ఆర్థికవిధానం. పరిశ్రమలు సాముదాయిక మైన పెట్టుబడులతో కొనసాగాలని దాని ముఖ్యసూత్రం) చెందిన నవలగా పరిగణింపబడిన 'యు. ఎస్. ఏ.' (U.S.A) అనే 'విషాదత్రికం' (trilogy) ఎలా వ్రాయగలిగా డన్నది ప్రశ్న. అందుకు సమాధానం చెప్పడ మంటే 'యుద్ధాల మధ్య తాను చేసిన యాత్రలలో' ('journey between wars'—తన ప్రయాణపువ్రాతల సంపుటికి పసోస్ పెట్టిన పేరు) అమెరికన్ ప్రబుద్ధుడు సాధించిన పరిణతిని వ్యాఖ్యానించడమే అవు తుంది. అంటే సాంఘికవాదం రసజ్ఞతావాదాన్ని ఆక్రమించుకున్న దన్నమాట. అమెరికన్ జీవితంలోని అధిభౌతికత్వంయెడల కళాకారుడి కేర్పడిన క్రోధం సాంఘికదురంతాలయెడల 'మౌలికపరిణామవాది' (Radical) కేర్పడిన క్రోధపువాలకం వేసుకుంది. డస్‌పసోస్ దరిద్ర జనుల నవలారచయిత (proletarian novelist) కాలేదు. అతని రచనలలో ఎప్పుడూ ఏకాంతో 'మౌలికపరిణామవాదధోరణే' (Radicalism) వుంటూవచ్చింది. ఆదినుంచీ అతడు ఒంటరిబ్రతుకు బ్రతికే వ్యక్తినీ, మందిబ్రతుకుగందరగోళాన్నీ కూడా చిత్రించడానికి ప్రయత్నంచేశాడు. Three Soldiers లో అమెరికన్ సంఘమంతటికీ ప్రాతినిధ్యం వహించడానికా అన్నట్లు ముగ్గురు భిన్నప్రకృతులు గల వ్యక్తులను ప్రవేశ పెట్టేడు. కాని మధ్యలో కథారంగాన్ని ఆండ్రూస్‌కి విడిచిపెట్టి ఇద్దరు జారుకుంటారు. ఆండ్రూస్‌కూడ రసజ్ఞతావాదాన్ని ఉద్ఘాటించడానికి గాను తన స్నేహాసక్తిని (interest in comradeship) వదులు కుంటాడు.

'Manhattan Transfer' (1925) లో మాత్రం 'సాము దాయిక సిద్ధాంతం' మరీ నిబ్బరంగా సమీక్షింపబడింది. ఇందులో పసోస్ న్యూయార్కు సర్వస్వాన్నీ రాశీభూతం చెయ్యడానికి ప్రయత్నించాడు. అందుకు తన 'U.S.A.' రచనకి ప్రాతిపదికలైన పద్ధతు లవలంబించాడు.

ఇందులో పాత్ర లిన్నీ అన్నీ కావు. సాంఘికంగా వివిధాలైన అంతస్తుల్లో ఆ పాత్రల జీవితాలు పెనవైచుకునివుంటాయి. సుమారు రెండుదశాబ్దుల కాలంలో ఆ పాత్రల పతనమూ, పరిణామమూ చిత్రింప బడ్డాయి. ఆఖ్యానధోరణి అంతా చప్పగా, నీరసంగా వుంటుంది. సంభాషణలుమాత్రం మిక్కిలి నిక్కచ్చిగా వుంటాయి. వర్ణనలు 'స్వచ్ఛందదర్శనాత్మకం' (impressionistic) గా వుంటాయి. ఇందులోనూ జిమ్మీహెర్ఫ్ అనే కేంద్రభూతమైన పాత్ర వున్నది. హెర్ఫ్ జాన్ ఆండ్రూస్‌కి వారసుడే. కొన్ని సందర్భాల్లో ఆండ్రూస్‌కి తీసిపోతాడు. అతడు సిద్ధంగా కళాకారుడు కాడు. ఇక కాబోయే లక్షణం గలవాడు మాత్రమే. తెలివైనవాడేకాని వ్యర్థుడు. చివర్లో, సంఘంనుండి వేరుపడిపోతాడు. అయితే ఇతని విషయంలో అదేమంత సమంజసంగా లేదు. అది ఒక అభియోగవిచారణ, శిక్షాప్రదానాలతో కూడిన కథతో ముడిపడిన తాత్కాలికశిక్షాస్తంభనశుభాంతసన్నివేశం. మిగతాపాత్రలను ఆ మహానగరభూతం మింగేసింది. ఉన్న చచ్చు ఉద్యోగం కాస్తా ఊడగొట్టుకుని, షెల్ఫ్ పెడాకులు కాగా, జేబులో చేతి కందని పైసాలతో ఆ నగరంనుండి బహిర్గమించిన హెర్ఫ్, షెర్వుడ్ ఎండర్సన్ రచనలోంచి లేచివచ్చి డ్రెయిజర్ రచనలోని రాజధానిలో కలిసి పోయిన పాత్రలా గనిపిస్తాడు.

'U.S.A.' (42nd Parallel, 1919, and The Big Money, Published in 1930, 1932 and 1936) రచనతో ఇక డస్‌పసోస్‌లో 'వేర్పాటు' (Secession) గురించిన విశ్వాసం మిగిలివుండలేదు. అతని రంగం అదేకాని పరిష్కారం విశాలతర మైనది. ఈసారి అమెరికాదేశం దేశమంతటినీ ఆపోశనంపట్టేడు. ఉన్న దున్నట్లు కథాసన్నివేశం పాత్రనుండి పాత్రకు చంక్రమణంచేస్తూవుంటుంది. అంపగాళ్ళు, మోసగాళ్ళు అయిన పురప్రముఖులు, సఫలలు విఫలలు అయిన స్త్రీలు, కోరి చెడిపోవడానికి త్రాగేవాళ్ళు, రాగద్వేషాలతో

మౌలికపరిణామవాదులు, కార్మికులను వంచించేవాళ్లు, రసికులలా వేషాలు వేసేవాళ్ళు—ఇలా ఎన్నెన్నోపాత్రలను డస్‌పసోస్ పరిస్థితిని బట్టి ఆదర భావంలేని సామర్థ్యంతో చిత్రించాడు. ఆఖ్యానానికి త్రివిధసాధన సహకారం గ్రహించాడు. అందులో రెండు: 'వార్తాచిత్రణలు' (News-reels), 'జీవితచిత్రణలు' (Biographies). ఇవి అతని రచనయొక్క యథావద్విషయవివరణాత్మకస్వభావాన్ని (documentary nature) తెలియజేస్తాయి. అసలైన తోటలగురించి ఆ తోటల్లోని నిసలైన కప్ప లతోసహా వ్రాయుడ మన్నది 1930 ప్రాంతపు టాచారం. ఆ వార్తా చిత్రణ లన్నవి వార్తాపత్రికలలోని మేల్బంతుల (headlines), జన రంజకాలైన పాటలముక్కల కలగూరగంపలు. జీవితచిత్రణ లంటే గ్రంథప్రతిపాద్యాలైన ఆయాకాలవిభాగాల స్వభావాని కచ్చంగా అను రూపంగా వుండే స్త్రీపురుషులగురించిన సంగ్రహమైన, స్పష్టమైన వ్యక్తి చిత్రణలు. ఇక మూడోది 'కెమేరాకన్ను'—రసజ్ఞుడైన డస్‌పసోస్‌తో మిగిలింది. కాలక్రమానుసారంగా మిగతాభాగాలతో సమంగా పురోగ మిస్తూ, ఇ. ఇ. కమ్మింగ్సు, గర్ట్రూడ్ స్టీన్‌ల మెలకువలతో గద్యకవితా ఘటితాలైన 'కెమేరాకన్ను' భంగిమలు ఒకవ్యక్తి (రచయిత) యొక్క దృక్కోణంనుంచి చిక్కని దృశ్యాలవేపు చూపు సారిస్తూవుంటాయి.

'Manhattan Transfer' లాగున, దాన్ని మించిన క్రోధం తోను, నైరాశ్యంతోను సర్వరంగాల్లోనూ వ్యక్తిపొందిన వైఫల్యాన్ని చిత్రించింది 'U.S.A.' ధనికు లన్నవారంతా వట్టి దగుల్బాజీలు. అందుకో కొందరు(అప్టన్ సింక్లెయిర్ నాయకపాత్రలుకొన్నిటిలాగున) తమసర్వస్వమూ వదిలేసి, పేదప్రజల్లో చేరిపోయినా వాళ్ళకు మోక్షం వుండదు. పేదవాళ్ళు ఎంతపవిత్రంగా బ్రతికినా వాళ్ళు సాధించేదేమీలేదు. సక్కో,వంజెట్టి అనే వారు ఏళ్ళ తరబడి మూలముట్టుగ పరిశ్రమించినా చావక తప్పదు. అక్రమ విజయం వచ్చిన అది అసలు వారు సాధించినదాన్ని పాడుచెయ్యడానికే వచ్చినట్టు. గ్రంథంలో కొద్దిమంది అదృష్టవంతులు లేకపోలేదు. అయితే

కులిమించిపోయింది వాళ్ళ ధోరణి. మొత్తానికి ఈ గ్రంథం అమెరికా పాలిటి కొక అభియోగం - ఆరోపణ, ఆక్షేపణ. డస్ పసోస్సేగాని తన ఆరోపణ నొక సమస్యలా పాఠకులపై విసిరేసి, అమెరికన్ పెట్టుబడిదారులను గర్హించి, కార్మికుల స్వర్గం గురించి ఒక కలగని దానితో గ్రంథాన్ని ముగించి వూరుకునివుంటే ఇవాళ దాన్ని మనం ముట్టుకోము, మూచూడం. అది చదవడాని కంత ఉల్లాసం గొల్పదు. అయితే ఏదో వట్టి ఆశను కులాసాగా వ్యక్తంచేసి ఊరుకునే రకంగా రాయడు. ఒక పేరు లేని ద్రిమ్మరి, ఆంద్రూస్ హెర్కులకంటె విలక్షణమైనవాడు, గమ్యంలేని ఘంటాపథంలో అందని ద్రాక్షపండ్లకోసం అఱ్ఱులు చాచే సామాన్య పౌరుడూ అయిన వాడి గురించిన చిత్రణంతో గ్రంథ పరిసమాప్తి చేశాడు.

ఇది ఆ నాటి మార్క్సిస్టు నవలలంతటి పైపై చూపులది కాదు కాని అంతమాత్రాన సరిపోదు. 'U. S. A.' నిజానికి అవకాశ వైశాల్యంలోను, వట్టి అప్రముఖవార్తలు మొదలు అతి గోప్యమైన కవిత్వ తత్వందాక సర్వ విషయ పరిష్వంగ ప్రయత్నంలోనూ విశిష్టంగా రచయిత సాధించిన ఘనవిజయ మని చెప్పాలి. అయితే అది అప్పుడే కాస్త ప్రాత గిల్లిపోయింది. మరో శతాబ్ది గడిచాక ఫలాని 1930 నాటి మచ్చు రచనగా కొంత మెచ్చుగొల్పవచ్చు. చదవడానికి బాగానే వుంటుంది. అందులోని అనంతమైన, మితిమీరిన సంక్షోభమూ, నిర్మాణశిల్పంలో వైవిధ్యంకోసం జరిగిన ప్రయత్నమూ శ్లాఘాపాత్రాలు. అయితే నడుమ నేర్పడిన లోటుపాట్లు చూస్తే 'మన్‌హట్టన్ ట్రాన్స్‌ఫర్' లోని చిటిపొటి ప్రయోగాలే నయమనిపిస్తాయి. ఉదాహరణకు 'కెమేరా కన్ను' విషయం తీసుకుందాము. అని విడివిడి భాగాల్లో బాగానే వుంది. అర్థసారంతో వస్తుశరీరానికి పుష్టి చేకూర్చాలనే దాని వుద్దేశమూ ప్రశంసనీయమైనదే. కాని మరి అది అలాంటి ఆంతరంగికమైన సంకేతమైనప్పుడు దానిది వట్టి బాహ్యవార్తార్థ స్ఫూర్తి గల పేరుతో వ్యవహరించడ మేమిటి? అది ఆంతరంగిక సంకేతమైతే అప్పుడప్పు డూరికే చెప్పేస్తే చాలు సరిపోయే సన్నివేశాన్ని

చిత్రించడానికీ శిల్పాన్ని వినియోగించి పాఠకుడిని సంభ్రమచకితుని చెయ్యడ మెందుకు? ఇక, పాత్రచిత్రణ పద్ధతి కూడ విమర్శనీయంగానే వుంది. కొన్ని పాత్ర లిక పాఠకుడి కౌత్సుక్యం కలగడం ప్రారంభించిం దనగానే మటుమాయమైపోతాయి. మరికొన్ని విందు అయిపోయాక గృహస్థు వదుల్చుకోలేక వ్యసనపడుతూ వుంటే ఇంకా అక్కడ తచ్చాడుతూ వుండే అతిథుల్లాగు బైరాయిస్తాయి. ఇక rumbottle, fruitsteamer, icegrey లాంటి 'జోయ్‌సియన్' (Joycean) పదబంధాలున్నవి - ఒకసారి వాటి నవ్యత్వం ఉచ్ఛిష్టమైపోయాక మరి నిష్ప్రయోజనాలు. మరెందుకు, ఒక్క మాటలో చెప్పాలంటే 'U. S. A.' లో నిజాయతీ, ప్రయోగవైచిత్రీ ఎంత వున్నా దాన్ని గొప్ప గ్రంథ మనడానికి అవి చాలవు. మంచి పుస్తకం మాత్రం అవును. అంతేకాదు. గాఢద్రావక గంధిలమైన అమెరికన్ ధూమపత్రాల వలె దేశభక్తి వాసనలు వెదజల్లే పస్సోస్‌గారి అర్వాచీన నవలలు కొన్నిటికంటె మేలురకమైనవి.

జేమ్సు టి. ఫ్రరేల్, జాన్ స్టీన్‌బెక్ రచనలలోనూ ఇలాంటి లోటుపాట్లే వున్నాయి. ఇద్దరూ సమర్థులైన రచయితలే. మందకొడి కాలం (Depression decade) లో మంచి రచనలు చేశారు. డస్ పస్సోస్‌లాగే ఇద్దరూ ఆనాటి మౌలిక రాజకీయాలకు ప్రతిస్పందనం పొందినవారే కాని ఇద్దరిలో ఎవరూ 'మార్క్సిస్టు' కారు. ఫ్రరేల్ చికాగో గురించి, తన చుట్టూ వున్న కేథలిక్ ఐరిష్ సమాజం గురించి వ్రాశాడు. ఆ సమాజంవారు నిరుపేదలేగాని గూడెం మనుషులు (Slum-dwellers) కారు. వాళ్ళ పతనానికి ఆర్థిక నిమిత్తంకంటె నైతిక నిమిత్తం బలీయమైనది. డస్ పస్సోస్ యు. ఎస్. ఎ. వలె ఫ్రరేల్ చికాగో మూలంలోనే విషకలుషితమైన జీవిత కేంద్రం. అతడు చికాగో పేరిట వ్రాసిన 'విషాదత్రికం' (trilogy) లో ప్రధాన పాత్ర అయిన స్టడ్స్‌లోనిగన్ సఫలుడు కాలేదు. స్నేహితులకు కూడా దౌర్జన్యంగా

అయితేనే తన సంగతి తెలియజేయగలుగుతా డతడు. ఎప్పుడేనా తాత్కా-లికంగా అనురాగం, కాకపోతే కృతక సౌజన్యం వేపు కొస్త మొగ్గు చూపిస్తాడు. డేనీ ఓనీల్ అని ఫర్రేల్ పాత్ర మరొక టున్నది. ఈ అర్థ రహిత నాశంకర పరిసరంనుండి ఒక 'చతుర్నాటిక' (tetralogy) ద్వారా అతగాడి అభ్యుదయం. (హెన్రీ జేమ్సు చాటభారతాల గురించి గోలెత్తినకాలం Anthony Adverse, Gone with the Wind మొ॥ జనరంజక నవలల కోవకు, మరీ గిరాకీగా ఉన్న డస్ పసోస్, ఫర్రేల్ నవలల కోవకు చెందిన పెద్ద పుస్తకాలనే పరి గ్రహించడానికి సిద్ధంగా వుంది. వాటి స్థాయిలో అవి అన్ని సంగతులూ చెప్పెయ్యాలి - ఉత్తనే వివరాలు పెంచడంతో సత్యాన్ని చేరుకోవచ్చు నన్నట్లుగా, ఆత్మీయమైన ఉపబలక సామగ్రి మధ్యనే ఎలాగో అంతర్ధాన మైపోయిన ఒక అభిప్రాయాన్ని బలపరచడానికి నాగరిక పరిసర ప్రభావ వాదులు (Urban ecologists) సామగ్రిని పోగు చేసినట్లుగా అవి సర్వ విషయ నివేదకాలు కావాలి). ఓనీల్ లోనిగన్‌ని లొంగదీసుకున్న ప్రమాదాల నెట్టకేలకు అధిగమించినవాడు కావడంవల్ల కొస్త ముందు తరంలోనైతే సాఫల్యానికి తగిన తార్కాణగా వుండేవాడు. కాని ఫర్రేల్‌కీ, డస్ పసోసుకీ భ్రష్టమైన అమెరికానుండి మంచి యన్నది ఆవిర్భవించదనే తమ వుద్దేశానికీ, సాఫల్యం పొందిన వ్యక్తికీ (స్వవిష యంలో స్పష్టదృష్టాంత మైనట్లుగా) రాజీ కుదర్చడం కష్టమైపోయింది. రాజీకన్నా విభేద ప్రతిపాదనంలోనే వాళ్ళకు సౌకర్యం కనిపించింది. డస్ పసోస్ ఉద్ఘాటించే 'తిరస్కార' మన్నది (Scorn) బహుశా ఈ శతాబ్ది అమెరికన్ నవలారచయితలు చాలామందికి స్వభావగతమైన ముఖ్యాంశగా భాసిస్తుంది. ఫర్రేల్ విషయంలో ఈ తిరస్కార పుర స్కారం గురించి ప్రశ్నే లేదు. అలాగే అతని నవలా బహిస్స్వరూప నిర్మాణ నైపుణి విషయంలోనున్నూ. అయితే లోపల గ్రంథం విలువ దిగ దీసే భ్రాంతులు మటుకు వున్నాయి. స్టీన్‌బెక్ విషయంలోనూ ఈ మాట

వర్తిస్తుంది. అతడు (Of Mice and Men, 1937 లోను, The Grapes of Wrath, 1939 లోను) అతి శ్రద్ధగా ఆ మందకొడికాలం యొక్క బాహ్యాకృతి విశేషాలను తన రచనలో పొదిగేడు. కాని పర మార్థాన్ని గ్రహించడానికాయన చేసే ప్రయత్నా లొకపరి జాతీయ రహస్యమైన అకేంద్రీకృతమైన మౌలిక పరిణామవాదం వేపున్నూ, మరొక పరి మానవజాతి అంటేనే జీవశాస్త్రరీత్యా ఒకవిధమైన ఏవగింపు వేపున్నూ వికారంగా మొగ్గు చూపుతూ వుంటాయి.

తన కాలిఫోర్నియాగురించి అద్భుతరచన చేసిన స్టీన్ బెక్ ల్ ప్రాంతీయాభినివేశం కనిపిస్తుంది. అది ఆ మందకొడికాలపు లక్షణాల్లో వొకటి. మార్పన్నది లేక మందకొడిగా, నీరసంగా, నిస్తేజంగా వున్న అమెరికా దేశంతో కొన్నికొన్ని ప్రాంతాలూ, చలనరహితంగా నిలబడివ్యక్తిత్వం నిలుపుకొన్న మనుషులూ పోలికలకు దిగేరు. వైశాల్యమూ, వైవిధ్యమూ కలిగివున్నా ప్రత్యేకమైన ధ్రువత్వంగల చారిత్రకానుబంధాల ద్వారా సమైక్యం సాధించిన దక్షిణప్రాంతంకన్నా అమెరికాలో అచ్చమయిన ప్రాంతం మరి లేదు. అప్పట్లో అక్కడ చాలా ప్రాంతీయధోరణులు బయలుదేరాయి: నార్త్ కెరోలినాలో చాపెల్ హిల్ వద్ద సాంఘికవిజ్ఞాన వేత్తల వర్గ మొకటి నెలకొన్నది. టెన్నెస్సీ, సెవానీలో ఒక సాహితీ సమితి, మిసిసిప్పీలో విలియమ్ ఫాక్నర్ గారి యోక్నాపటాన్ ఫాకౌంటీ (దాని అసలుస్థానం జెఫిర్సన్ లో వుంది) వున్నవి. ఫాక్నర్ మిసిసిప్పీలో నివసిస్తూవుంటాడు. 'Sartoris (1929) మొదలు అతని అనేకకృతుల్లో ముఖ్యరంగం యోక్నాపటావ్ ఫా. అది దేశపటంలో మాత్రం కనిపించదు. దాక్షిణాత్యులు కొందరు ఫాక్నర్ చేసిన దక్షిణప్రాంతచిత్రణానికీ యథార్థ స్థితికీ పోలిక లేదంటారు. అయితేనేం సాహిత్యసృష్టికి ఫాక్నర్ దక్షిణ ప్రాంతాన్ని పీఠంగా వినియోగించుకోగలిగా డన్నదే చాలు గొప్ప విషయం. కాని అతని దక్షిణదర్శనం పూనకంపట్టినవాడి చూపులా వుండటం చూస్తే పైమాటే తిరగేసి దక్షిణప్రాంతమే అతడి నుపయోగించుకుందని

అనాలనిపిస్తుంది. ఒక సమయంలో ఆయన ఒక 'నడుమంత్రపు సిరిగాడి' (Upstart) దురాశకు వశమైపోయే తన తోటా దొడ్డీ పరిశీలిస్తూవున్న దర్జాగల దక్షిణప్రాంతపు జాగీర్దారులా కనిపిస్తాడు. మరో సమయంలో దురాక్రమణ దారుడి(interloper)కంటె ఈ జాగీర్దారేమీ నయంకాడు, దాక్షిణాత్యసంప్రదాయం వట్టి మిథ్య అని నిరూపిస్తున్నట్లుంటాడు. ఇంకో సమయంలో చదువురాని శ్వేతజాతి, నీగ్రో, లేక ఆ యిరువురూ అడుగు పెట్టకముందునుంచి ఆ భూమికి అసలుహక్కుదారులైన ఇండియన్ పేద ప్రజల ప్రతినిధిగా కనిపిస్తాడు.

నిజానికి ఫాక్నర్ దక్షిణదర్శనం క్లిష్టమైనదీ, అస్పష్టమైనదీ మాత్రమే గాదు. అసంగతమైనదీ ఆత్మవ్యాఘాతకమైనదీను. ఏ ఒక్క కథలోగాని, నవలలోగాని సాధారణంగా ఒకేఒక దృక్కోణంలో నిమగ్నుడై పోతాడాయన. అతని వుద్దేశాన్ని స్థూలంగా వివరించవచ్చు. ఈ క్రింది మాటల్లో ఒక ఆధారం కనిపిస్తుంది.

"శోకమే కావాలనుకునే మనుషులున్నారు. వాళ్ళకి సంతోషం పనిచెయ్యదు, బాధ కోరుకుంటారు. విషానికి విరుగుడు చూపే కడుపులున్నాయి. వాటికి విషభోజనంవల్లనే పుష్టి. అలాంటి భ్రష్టప్రకృతుల చింపిరి పింపిరి దిక్కుమాలిన స్థితి నెలాంటి యోగాలూ బాగుచెయ్యలేవు."

ఈ ఉదాహరణం ఫాక్నర్ దే అయివుంటే బాగుండు ననిపిస్తుంది కాని నిజాని కిది 'The Tragic' (1844) అనే ఎమర్సన్ వ్యాసంలోనివి. ఇందులోని 'కీటుకుమాట'ల్లో (Keywords) 'ఓటమి' (defeat) అన్న దొకటి. హెమింగ్వే, ఫిజెరాల్డ్, డస్‌పసోస్, ఫర్రేల్-ఈ అందరిప్రజలూ ఓటమిపొందినవారే. 'వేర్పాటు' (Secession) అన్నది మరో 'కీటుకుమాట'. ఫాక్నర్ ప్రజలుకూడా ఓటమిపొందేరుకాని వేరుపాటెరగరు. వాళ్ళ పూర్వీకులు వుత్తరప్రాంతంనుండి వేరుపడిపోవడానికి ప్రయత్నించారుకాని ఏం లాభం, దెబ్బతిన్నారు. అంతఃకలహం (Civil

war), చెదిరిపోయినఆర్థికస్థితి, కుటుంబజీవనావశ్యకత, నీగ్రోనిమిత్తంగా కలిగిన రాగద్వేషాలూ ఇవన్నీ కలిసి దక్షిణప్రాంతాన్ని విఫలత్వంపాలు చేశాయి. వ్యక్తులు తప్పించుకుపోవడాని కవకాశం లేకుండా చేశాయి. ఫాక్నర్‌గారి కిటుకుమాట 'సర్వనాశం' (doom). ఈ మాట సమర్థించుకోవడానికిముందు అతని రచనలు మరీవిడ్డూరంగా వుంటాయని ఒప్పుకోవాలి. ఉదా: 'A Courtship' అనే కథానికనుగాని, 'The Hamlet' (1940) లోని గుర్రాలవ్యాపారంముచ్చటగాని చూడండి. ఆ 'సర్వనాశం'అన్నమాటకు బదులు ఏ 'ఘటనో', 'గ్రహచారమో' (fatality) అనే మాట వాడుకుంటే మీదచెప్పిన మాటలు అర్థవంతంగా వుంటాయి. ఫాక్నర్ రెండుమాటలూ తరుచుగానే వాడుతాడు.)

అతని పాత్రలన్నీ అలవోకగా ఒకదానితో ఒకటి కలిసిపోతూ వుంటాయి, కాని ఫాక్నర్ నిమిత్తం స్పష్టంచెయ్యడు పాఠకుడికి. హెమింగ్వేకి లాగు ఫాక్నర్‌కీ ఒక సాంకేతిక పద్ధతి (Code) వుంది. దానికీ ధైర్యమూ,గౌరవమూ, కర్తవ్యాలతో సంబంధం వున్నది. ఆ పద్ధ తేమిటో వివరించకుండా హెమింగ్వే మూతిబిగించుకు కూచుంటే ముఖమే చాటు చేసుకుంటాడు ఫాక్నర్. ఇతని The Sound and the Fury (1929), As I Lay Dying (1930), Sanctuary (1931), Light in August (1932) అనే ఇన్ని నవలలగుండా ప్రయాణం చెయ్యగాచెయ్యగా ఎట్టకేల కాపద్ధతి బలవంతంగా పనిచేస్తోందని గ్రహించగలుగుతాము. ఆ పద్ధతికి భృత్యులాపాత్ర లాగీటు దాటి మరోలా వ్యవహరించలేవు. కొన్నిటి చర్యలకు తీవ్రమైన ప్రతిఘటనం ఏర్పడినా, ఆ సంఘర్షణలో పాల్గొన్న పాత్ర లన్నిటికీ దాని సామాన్యసూత్రాలు తెలుస్తాయని ఫాక్నర్ ఉద్దేశం. అతని పాత్రలనేకం తెలివితక్కువగా, అస్పష్టంగా, చెడుగా ప్రవర్తిస్తాయి. వాటి కో జంకూ గొంకూ లేవు. వాటి చేష్టలన్నీ బుద్ధిపూర్వకాలు, ప్రయోజనాత్మకాలు. వెంట తరుమబడిన మనుషులు పరిగెత్తలేక కాళ్ళు జాపేసినప్పటిలాగు ('Red Leaves'

అనే కథలోను, 'Light in August' చివరను వున్నట్లు) ఒకొక్కప్పుడవి నిష్ప్రయోజనాలైనా నిలుకడగలవిగా వుంటాయి. అసలు ఫాక్నర్ రచనలో సంక్షోభ స్తబ్ధతల చిత్రమైన మేళనం కనిపిస్తుంది. ఉద్విగ్న పరిస్థితుల్లోకూడా ఉత్త యాంత్రికంగా నాటకంలో నటుల్లా కాకుండా వట్టి వెట్టినియోగాలవారిలా ప్రవర్తిస్తాయి అతని పాత్రలు. ఈ గడ్డకట్టిన ఉద్రేకస్థితి Light in August లో అతని వైలక్షణ్యాన్ని పట్టియిచ్చే చక్కని వచనంలో ఇలా అభివర్ణిత మైంది:

"He turned into the road at that slow and ponderous gallop, the two of them, man and beast, leaning a little stiffly forward as though in some juggernautish simulation of terrific speed though the actual speed itself was absent, as if in that cold and implacable and undeviating conviction of both omnipotence and clairvoyance of which they both partook known destination and speed were not necessary."

[తాత్పర్యం: అతడు (అశ్వికుడు) తాను జంతువుతోపాటు సర్వజ్ఞత్వము, యోగదృష్టులగురించి తమకు గల ఉపేక్షామాత్రమైన, పట్టుసడలని విశ్వాసంతో ఒక నిర్ణీతమైన గమ్యంయొక్కగాని, వేగంయొక్కగాని అక్కరలేనట్లు నిజానికి వేగరహితస్థితిలో వున్నా ఏదో మహావేగాన్ని అభినయిస్తూ వున్నట్లు మాత్రం కత్తిలా కాస్త ముందుకు వంగి, మెల్లని బరువైన దౌడుతో రహదారివేపు తిరిగాడు.]

ఇక్కడ పాఠకుడు—వచ్చిన అభియోగం ఒక ఆటవికజాతివారి కులతప్పుకి సంబంధించిన చిక్కుసమస్యయై, సాక్ష్యం ఆకస్మికమై, సాక్షులు కొందరు మాటలాడడానికి నిరాకరించగా, వ్యాజ్యపు కక్షిదారుల నైతికవిధానం తనదానికి విలక్షణం కావడంవల్ల ఏ తీర్పూ సాధ్యంకాక

కొట్టుమిట్టాడుతూవుండే ఒక అనుభవశూన్యుడైన న్యాయాధిపతి పడే అవస్థలో పడతాడు. వ్యాజ్యం బనాయించిం దెవరో పైవాళ్ళు. కక్షిదారులకు తమ గోడు వెళ్ళబోసుకోడానికి న్యాయస్థాన మెక్కడా లేచోటు. ఒక న్యాయవిధానం, లేక శిక్షాస్మృతి అన్న దేమన్నా వుంటే ఫాక్నర్ గారి ఊహాకల్పితమైన 'యోక్నాపటావ్‌ఫా' కౌంటీలోని అనుభవపు మాలోకంలో వుండాలి. దాని కడపటి ఆధారభూమి ఒక అడివి. అది అతని 'The Bear' అనే పెద్దకథలో చక్కగా చిత్రింపబడింది. ఆ భూమి కతిసమీపంలో వున్నవారు తెల్లవాడు వచ్చి పారద్రోలనినాటి ఇండియనులు. కాని వాళ్ళప్పటికే తమ బానిసలతోపాటు, రూడిరుత్తలు లేని తోటాదొడ్డితోపాటు దిగనార్చుకుపోయివున్నారు. మనిషి అడవిని ఛేదించడం మొదలుపెట్టేడు కాని ఆ చోట దాస్యవృత్తి దారుణపాపాన్ని నాటేడు. ఇక దానితోపాటే వరసగా అహంకార వికారాలు, వక్రగతి పరాక్రమాలు, సమరప్రకోపాలు, వ్యాపారనైచ్యాలు, అగతిక నీగ్రో నివాసాలు, నవయువతుల విప్లవాత్మక శృంగారధోరణులు, అందుమీదట వాళ్ళ అన్నదమ్ముల కోపతాపాలు—అన్నీ ఒకటొకటే అందిక పొందిక లేకుండా బయల్దేరతాయి.

ఇలాగ ఫాక్నర్ కృతులలో ఆ దక్షిణప్రాంతపు విషాదచరిత్ర అంతా వెల్లివిరిసింది. ఆ రచన ఒక్కొక్కప్పు డత్యంతప్రసన్నంగాను, తర చౌక పెద్ద నగిషీపనిలాగు వుంటుంది. ఆ నగిషీశైలికే 'హండాడంబరం' (Dixie Gongorism) అని పేరుపెట్టేడు క్లిఫ్టన్ ఫేడిమన్. The Sound and the Fury లో బెంజీ అనే ఒక బడుద్ధాయి ద్వారా మనకు కాంప్సన్ కుటుంబం పరిచయం అవుతుంది. ఫాక్నర్ రచనలో ఇంతకంటె క్లిష్టతరమైన సన్నివేశం వుండబోదు. ఇలా పాఠకుడిని రంగంలోకి దింపి అక్కడ అందరూ అనుకునే దేమిటో అతని మానాన అతడు గ్రహించాల్సిందే అని వదిలెయ్యడం ఫాక్నర్ పద్ధతి. అంతేకాదు, తన పాత్రలను కృతకనామాలతోను, పూర్వీకుల పేర్లతోనూ

వ్యవహరిస్తాడు. ఆ పాత్రల కథల మూలాన్ని తీసుకువెళ్ళి భూతకాలంలో ఎక్కడో పాతేస్తాడు. అలాంటప్పుడు పాఠకుడు అందరూ ఎవడిగురించి ఏమనుకుంటున్నారో, వా డే తరానికి చెందినవాడో తెలియక తికమకపడ తాడు. ప్రధానకథాతంతువు లివీ అని పోల్చుకున్నప్పుడుకూడా దాని ముఖ్యవివరా లన్నీ ఐతిహ్యాలతో, సందేహాలతో నిండివుంటాయి. అదంతా పోల్చుకుని సమన్వయం చేసుకోవాలంటే పాఠకుడి తాడు తెగుతుంది. పాఠకుడి నంత శ్రమపెట్టడం ఉచితంకాదు.

మరి ఆ 'యోక్నాపటావ్ఫా' గందరగోళంలో మనం కోరి తల దూర్చడ మెందుకూ అంటే ఫాక్నర్ The Sound and the Fury, Light in August అనే తన ఉత్తమ గ్రంథాలు రెండిట 'సర్వనాశం'కి బదులు బాధానుభవం, అవస్థానం (Survival) అనే ఉభయార్థాలూ కలిసివచ్చిన 'సహనం' అనే భావసంస్థను ప్రకటించాడు కాబట్టి. ఈ గ్రంథాల్లో అహంభావస్వయంభువులైన సార్టొరైజులు, సట్పెన్లు, కాంప్సన్లూ మాత్రమే నశిస్తారు. నీగ్రోవినీతులూ, శ్వేతజాతి దరిద్రులూ 'సహనం'తో నిలుస్తారు. గ్రంథకర్త ఏదో కొందరిని క్షమించి నట్లుగా చేసిన ఈ పరిష్కారం అంత ఆమోదయోగ్యంగా కనిపించదు. ఒక్కొక్కప్పుడు ఫాక్నర్ కేవలం అనాలోచితమైన, పాశవికమైన ఉపేక్ష వలననే మానవుడు తన మనుగడను సురక్షితం చేసుకోగలుగుతా డని వాదిం చడానికి పూనుకున్న ట్లనిపిస్తుంది. కాని యీ స్థాయిని మించిపోతాడు ఫాక్నర్ లెనాగ్రోవ్ యాత్రగురించి ఉల్లాససల్లలితమైన తన రచనలో. లెనా ఒక నిరుపేద తెల్లజాతిపిల్ల. అక్రమసంతానంగా ఆమె కొక బిడ్డ. అయితేనేం, ఎంతెంత మాయావులైన మగరాయుళ్ళనూ ఇట్టే ఆకర్షించే అందమైన బోను ఆమె. ఇక డిల్సే అనే నీగ్రో స్త్రీ వుంది—సర్వనాశ నమైపోయిన కాంప్సన్ల వంశాన్ని కాపాడిం దామె. దక్షిణప్రాంతానికి అభిశాపం తెచ్చిపెట్టిన నీగ్రోలు తాము మాత్రం శప్తులు కారంటాడు

ఫాక్నర్. తన పిదప రచనలలో (Intruder in the Dust, 1948; Requiem for a Nun, 1952; 1917 లో ఫ్రెంచి స్కంధావారంలో వచ్చిన తిరుగుబాటు గురించి వ్రాసిన A Fable, 1954; The Town, 1957; The Mansion, 1959) ఫాక్నర్—రచయిత అన్నవాడు మానవుని భవిష్యత్తుగురించి విశ్వాసం కలిగివుండాలి అనే తన నోబెల్ బహుమానగ్రహణావసరోపన్యాసం (1950) లోని వుద్దేశాన్ని నిలువరించుకున్నట్లు తోస్తుంది. అప్పటిదాకా దక్షిణప్రాంతంలోని సమకాలికస్థితి అలాంటి ఉద్దేశాని కనుకూలంగా వుండేది కాదు. కాని యీనాడాయన వేషభాషల్లో నాగరికత నాజూకులు గల న్యాయవాది గవిన్ స్టీవెన్సులాంటి పాత్రలను చిత్రించడాని కితఃపూర్వంకంటె ఎక్కువ సుముఖంగా వున్నట్లు తోస్తుంది.

ఫాక్నర్ పిదప రచనలలో గాఢత్వం, నైశిత్యం లోపించాయి. అధర్ములు, నీచులు, అన్నిట్లోనూ కలగజేసుకొన్నవారు, భాగ్యవంతులూ అయిన స్నోప్ సే కుటుంబంవారి గురించి ఫాక్నర్ చిత్రించిన ఇతిహాసం విస్తృతమైనదే కాని ఇతిహాసాని కుండవలసిన గొప్ప లక్షణాలేమీ పట్టలేదు దానికి. కాని ఇక్కడా అంతులేని, ఏకాంతమైన, భ్రాంతిజనకమైన, గ్రామ్యమైన ఫాక్నర్ ధోరణి వున్నది. అయితే మరీ పరిస్ఫుటంగా వుంది. ఆయన అహంకారనిరంకుశుడైన రచయిత. అతడు చెప్పిన విషయాలెంత చిత్తవికర్షణాన్ని కలిగించేవయినా, చిత్రిత్రించేవయినా సమగ్రభావతీవ్రంగా వాటి నతడు చెప్పే పద్ధతి చూస్తే అతని మిసిసిప్పీయే భూమ్యాకాశాలనావరించుకుందా అనిపించేటంత పనవుతుంది. ఈనాటి రచయితలలో కొద్దిమందికే అలాంటి నిబ్బరం, ఆడంబరవిడంబనాన్ని ఆకర్షణప్రకర్షగా గ్రహింపజేసే లాఘవమూ వున్నాయి.

థామస్ వుల్ఫ్ అనే మరో దాక్షిణాత్యరచయిత వున్నాడు. అతనికీ మరోరకమైన రచనాసంబంధాలైన ఊహలూ, ఉద్దేశాలూ

వున్నాయి. ఆయన ఒకవిధమైన దాక్షిణాత్యకాల్పనికతత్వాన్నీ, 1920 నాటి కళాకారుని ఏకాంతతత్వాన్నీ, ముందునాటి బైరానిక్ లేక షెల్లీయన్‌వ్యక్తిత్వాన్నీ (వుల్ఫ్‌కూడా ఒక గొప్ప 'రొమాంటిక్' రచయితలాగే పిన్నవయసులోనే అంటే తన 38వ ఏటనే చనిపోయాడు), 1930 నాటి పరిపూర్ణయాథాతథ్యధోరణినీ తన రచనలో మేళవించాడు. ఇంకా యీ పట్టికకు మరికొన్ని విషయాలు చేర్చవచ్చు—విట్మన్, రేబెలెయ్, స్విన్‌బర్న్ మొ॥ వారి ధోరణులు. స్విన్‌బర్న్ తనకు తానే చేసుకున్న 'వికటానుకరణం' (Nephelidia) వుల్ఫ్‌గారి 'సందేశానికి కూడ అన్వయిస్తుంది.

Life is the lust of the lamp for the light that is dark till the dawn of the day when we die."

[జీవిత మంటే—మన చరమదివసప్రభాతసమయందాకా చీకటిగా వుండే కాంతికోసం దీపం ప్రకటించే కామన.]

కాని పట్టిక అంతా తయారయాక, వుల్ఫు వుల్ఫే, అత డెవరినీ అనుకరించలేదనడానికీ అవకాశం వుంది. అతని నవలలను పరిశీలించి చూస్తే అన్నీ వరసగా—ఉత్తరకెరోలినాలో ఒక బాలుడుగా, కళాశాల విద్యార్థిగా, ఇబ్బందిపడుతున్న రచయితగా (మొదట్లో అతడు నాటకకర్త), యూరపులో ద్రిమ్మరిగా, తదుపరి న్యూయార్కు-నివాసిగా, బ్రూక్లిన్‌వాస్తవ్యుడుగా అతని స్వానుభవవాహినులే. ఆయాకథల నాయకుడి పేరు యూజీన్ గేంట్ కానివ్వండి, జార్జ్ వెబ్బర్ కానివ్వండి పరమార్థంలో ఒక అంతులేని మహాగాథను తన రచనలో నిబంధిస్తూవున్న వుల్ఫే ఆ నాయకుడు. సర్వగ్రంథాలయాల్లోని సర్వపుస్తకాలనూ చదివేద్దామనీ, జీవితసర్వస్వాన్నీ రచనలో ఆకళించేసుకోవాలనీ అతని కోర్కెం తెమ్మకోరిక వుండేది. అది చివరిరోజుల్లో కాస్త తగ్గుముఖం పట్టింది.

అయితే అతని తక్కువ ఏ ఒక్కరిదానికంటేనూ ఎక్కువ అని చెప్పాలి. ఈ క్రిందివిషయాన్ని పరిశీలిస్తే ఈయనతప్ప ఇంకెవరూ ఇంత మరీ అమాయికంగా చెప్పలేరనిపిస్తుంది:

"It is a great deal more important to have known one hundred living men and women in New York, to have understood their lives, to have got, somehow, at the root and source from which their natures came than to have seen or passed or talked with 7,000,000 people upon the city streets."

—'The Story of a Novel', 1936.

[న్యూయార్కు పురవీధుల్లో డెబ్భై లక్షలమంది మనుషులను చూడడంకన్న, దాటిపోవడంకన్న, పలకరించడంకన్నా అక్కడ నివసించే ఒక్క వందమంది స్త్రీపురుషులతో పరిచయం చేసుకుని, వాళ్ళ జీవితాల నర్థంచేసుకుని వాళ్ళ స్వభావాల మూలకందాన్ని పోల్చుకోవడమన్నది ఎంతో గొప్ప ప్రముఖవిషయం.]

ఒక్క వందట ఒక్క వంద! ఆ రచనలోనే పదిలక్షలపదజాలంగల ఒక నవల వ్రాతప్రతిని పట్టుకుని దాన్ని వట్టి 'అస్థిపంజరం'గా పేర్కొనగల దమ్ము ఒక్కవుల్ఫ్‌కితప్ప మరెవడి కుంటుంది? అతనికి తెలుసు అది మహాబృహద్గ్రంథ మని—'War and Peace' (టాల్‌స్టాయ్ నవల)కి రెండింత లుంటుందని. మేక్స్‌వెల్ పెర్కిన్స్ అనే సంపాదకమిత్రుడు దానిని బాగా తగ్గించాలని నొక్కిచెప్పేవు కాని అందులో అవసరమైనదానికంటె అక్షరంముక్క అధికంగా లేదంటాడు వుల్ఫ్. ఉన్నదంతా పరమార్థసారభూతమైనది, అదంతా అలాగే వుండాలనీ అంటాడు. అతడు వ్రాసిన నాలుగు నవలలలో (అందులో రెండు ఆయన పోయాక ప్రచురింపబడ్డాయి) వున్న విషయం అతని అసలు వ్రాత

ప్రతి 'చేటభారతం'లోని కొన్ని ఘట్టాలుమాత్రమే. అంత వ్రాసినా ఆయన సరుకు హరించిపోలేదు. అది జీవితంలా ఎప్పుడూ సశేషంగానే వుంటుంది. అతడొకసారి స్కాట్ ఫిడ్జెరాల్డ్‌తో "గొప్పరచయిత (లోపల వున్న దాన్ని) బహిరంగపరిచేవాడుమాత్రమే కాదు, (బయట వున్నదాన్ని) లోపలపెట్టేవాడున్నూ" అని అన్నాడు. అతని కభీష్టమైన విషయం జీవిత పరమార్థం, బ్రతకడాని కొక హామీ. మానవుడిగా తానూ అలాంటి హామీలకోసం—ఒక రాయో రప్పో కనిపించని తలుపో అని దేవులాడేడు. కాని ఏనాడో స్వకీయమైన చిరంతనపరంధామంనుండి దూరమై దాని స్థానే అంతో యింతో తదనురూపమైన స్థిరవసతి యేర్పడని అమెరికన్లందరి లాగే అతడూ హతాశుడయ్యాడు.

"The deepest search in life...was man's search to find a father,...the image of a strength and wisdom external to his need and superior to his hunger..."

[మానవుడు తన అవసరాన్నీ అపేక్షనూ అతిశయించిన శక్తి జ్ఞానాలు మూర్తీభవించిన రక్షకుడికొరకు సాగించే అన్వేషణే జీవితంలోని అన్వేషణలన్నిటా అతిగభీరమైనది]

ఈ అన్వేషణను వుల్ఫ మరీ విస్తారంగానూ, మరీ విసుగ్గానూ కొన సాగించాడు. జీవితాన్ని కావిలించుకుంటాడు. ఎందుకు? తప్పించుకు పోవడానికే. ఏమి? అది భయపెడుతుంది. తనకు స్వేచ్ఛ కావాలి. రచయితగా తనపాలిటి కదొక అమూల్యమైన ఆస్తి. అమెరికాలో, అంతకంటె ఎక్కువగా యూరపులోనూ ఒంటరిగా, ఇంటిదిగులుతో, కొంతవరకు హెన్రీమిల్లరులా తన సుఖశూన్యప్రవాసంమీదే మమకారాన్ని పెంచుకుంటాడాయన. అది అతని కొక గొప్ప ఆత్మజ్ఞతనూ, చేవగల రచన చేయగలశక్తినీ, అవకాశాలనూ యిస్తుంది. అక్కడ స్నేహాలకే ప్రసక్తి

గాని అమెరికాయొక్క సాంప్రదాయికమైన వైదేశికవిధానంలోవలె చిక్కులు తెచ్చే పొత్తు లుండవు. చిత్రమేమిటంటే అతని ఏకాచ్ఛితనమే (isolation) అతడిని మాతృదేశాని కతిసన్నిహితుణ్ణి చేసింది. "పర దేశంలో వున్న కాలంలోనే ఎంతో తపనపడి అమెరికా అంటే ఏమిటో తెలుసుకున్నా"నంటా డాయన.

ఇక వుల్ఫ్‌లో వున్న దోషా లెలాంటివీ అంటే అవి హెమింగ్వే దోషాలు విపర్యస్తాలైనట్లుగా వుంటాయి. హెమింగ్వే లేమితో బాధపడుతున్నట్లు పదజలాన్ని మిక్కిలి పొదుపుగా వాడుతాడు. వుల్ఫ్ చెడదూబరాగా, విసుగెత్తించేటట్లు వాడుతాడు. forever, nevermore - అని ఏవేవో ఇలాంటి పెద్ద పెద్ద మాటలు వాడాలని తాపత్రయపడతాడు. హెమింగ్వే ఉద్రేకాన్ని ఉగ్గబట్టిన చోట, వుల్ఫ్ పాఠకుడిని అనుభవపు సొరంగాల్లోకి లాగేస్తాడు. అప్పు డప్పు డాయన స్వవిషయాన్నే సరిగా పాకానికి తీసుకురాలేకపోతాడు. అతడి పాత్రలు గేంట్ కాని వెబ్బర్ కాని తమ కాయకష్టంమీదా, తమ నేర్పు మీదను ఆధారపడి సఫలులైనట్లు గ్రహిస్తాము కాని అతడు వారిని చిత్రించిన తీరు చూస్తే విమర్శకులు వ్యక్తం చేసిన ద్వేషం సమంజసమైనదే ననిపిస్తుంది. ఇలా అంటే నరాల్లో వొణుకు పుట్టి రాబర్ట్‌కోన్‌లాగు సణు గుతూ గ్రుడ్లురిమి చూస్తాడు మనవేపు వుల్ఫ్. హెమింగ్వే చెయ్యని దోషా లెన్నో చేశా డీయన. నూత్నకల్పనలు చెయ్యడంలో, ఇతరులపై తన ప్రభావముద్ర వెయ్యడంలో హెమింగ్వేకీ, ఇతనికీ పోలికేమిటి! అయితే వుల్ఫ్ సామాన్యమాత్రుడు కాడు. తానేదో పీడిత కళాకారుడి నన్న ధ్యాస వదిలేసి తన శక్తినీ, సానుభూతినీ మిగతా ప్రపంచంలో నిక్షేపించిన సమయంలో అత డెంత సంతుష్టి అయినా కలిగిస్తాడు. సింక్లెయిర్ లూయిస్ కూడా ఈ విషయం గ్రహించినట్లున్నాడు - తన నోబెల్ బహుమాన గ్రహణ సమయోపన్యాసంలో వుల్ఫ్ మొదట వ్రాసిన Look Homeward Angel (అప్పటి కొక్క సంవత్సరం

క్రితం - 1929 లో అచ్చయింది) ని ఉదారంగా ప్రశంసించాడు. వుల్ఫ సుఖపరాయణుడు, సూక్ష్మబుద్ధి. సహజమైన అనుకరణ హాస్యధోరణి గలవాడు. వివిధ స్థలాలను, వివిధ జనులను అత్యాసక్తితో గ్రహించడానికుబలాట పడతాడు. పేరుమోసిన అతని భోజనప్రీతి (రంగులు, రుచులు, వాసనలు, పాకపద్ధతులు అన్ని వివరాలతో సహా) అతని అనుభవ తృష్ణకు తగినట్లే వుంది. అసహ్యకరాలైన అనుభవాలను గురించి చెప్పినప్పుడు కూడా అది మరీ భీతి, బీభత్సమూ గొల్పుతూవుండవు. అతడే అభినయమూ చెయ్యకుండా వున్నప్పుడు రచయిత యొక్క ముఖ్య నైజం ప్రకటిస్తాడు అంటే తన మాటల కొక విలువ వుంటుందని విశ్వసించగలడు. అతని చేతిలోని వస్తువు, అతఃపూర్వము వేయి పర్యాయాలు వాడుకోబడినదైనా సరే మరునాటి వేకువలాగున ఒక సరిక్రొత్త అవకాశం సంతరించుకుంటుంది.

ఎండర్సన్, లెవిస్, హెమింగ్వే, ఫిజెరాల్డ్, డస్ పసోస్, ఫర్రేల్, స్టీన్ బెక్, ఫాక్నర్, వుల్ఫ—'సంధి' (Armistice) అనంతరం అమెరికాలో ప్రభవించిన నవలాకర్తలలో, కథానికా రచయితలలో వీళ్ళు కొద్దిమంది మాత్రమే. ఇందులో కొందరు కీర్తిశేషులయారు. వారి స్థానే మరికొందరి పేర్లు వినిపిస్తున్నాయి. ఈ సరిక్రొత్త సమాచారం ఈ గ్రంథచరమాధ్యాయంలో ఉట్టంకింపబడింది. ప్రాతదంతా అప్పుడే చరిత్ర అయిపోయింది, ఆమోదముద్ర వేయించుకొంది; కాని కాలదోషం పట్టి రుచి గోల్పోతోంది. సాహిత్య చరిత్రలో అంచెలంచెలుగా ఈ తరాలెంత వేగం మారిపోతాయి! అయితే ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే మనకంటె ఘనంగా ఆ రచయితలే అచ్చపు తెలివిబాటలో బావుటా లెత్తుకు తిరిగారనిపిస్తుంది. ఆ వాతావరణంలోనే ఏదో మహోల్లాస మహస్సు వెల్లివిరిసింది. 1920 ప్రాంతంలో అధికారుల దిష్టి తగలకుండా స్వేచ్ఛగా, విప్లవోచితంగా ఆ రచయిత లొక దశాబ్దికాలం మంచి అనుభవపు సంచికట్టు సంపాదించుకొన్నారు. వాళ్ళ సంఘం క్షీణదశలో వున్నా సాహిత్యం జీవంతో కలకలలాడుతూ వుంది. ఎటొచ్చీ మంట వేయాలెగాని ఏ మంటలోనైనా ఒక 'ఫోయినిక్సు' (Phoenix) వుండవచ్చు. 1930 ప్రాంతంలో కొంత వైపరీత్యం కనిపించినా దానికి తగిన

పరిహారాలు లేకపోలేదు. దేశాంతరవాసంనుండి తిరిగి వచ్చినవారికీ, అసలు స్వస్థానస్వస్థులుగా ఉన్నవారికీ అమెరికా పునర్నవ్యాకృతి ఒక యెత్తు, యూరపు ప్రతిపత్తి మరో యెత్తు. 1930-1938 సం॥ల మధ్య ముగ్గురు అమెరికన్లు (సింక్లెయిర్ లెవిస్, యూజీన్ ఓనీల్, పెరల్‌బక్) సాహిత్యానికి నోబెల్ బహుమానం పుచ్చుకున్నారు. 1950 తరువాత మరో ఇద్దరు పుచ్చుకున్నారు (ఫాక్నర్, హెమింగ్వే). * ఫాక్నర్ స్టీన్‌బెక్‌ల యెడలను, ఎర్‌స్కిన్ కాల్డ్వెల్, డేషియల్ హేమ్మెట్ ప్రభృతుల యెడలను గూడ యూరపుఖండంలోని విమర్శకులు విశేషాదర ప్రతిపత్తులు చూపేరు. వాళ్ళ కరకైన చరిత్రలనుండి గంభీరార్థాలు గ్రహించారు. (ఒకొక్కప్పుడా విమర్శకులు అమెరికన్ దృష్టత్వాన్ని అనుకరించిన జేమ్స్ హేడ్లీఛేజ్, పీటర్ చెయ్నే మొదలైన యూరపియను రచయితలనే అమెరికను లనుకోవడం కద్దు). చాలమంది ఆంగ్లరచయితలు తమ పేలవమైన గద్య రచనను చూసుకుని దిగాలుపడి, అమెరికను రచయితల ప్రవచనాన్ని ఆమోదించలేకపోయినా వాళ్ళ వచనాన్ని అందలి అప్రతిబంధ సుందరమైన క్రొత్త పలుకుబడిని, నుడికారాన్ని చూసి అసూయపడ్డారు. ఏనాడో తోకవిల్లీ చెప్పినట్లుగా అది 'సామాన్య మానవుడి శకం' అందామా అంటే అవును, సామాన్య మానవుడి స్ఫురణ తనలో ఎలా తీసుకురావాలో అమెరికన్ రచయితకి తెలుసు. అది 'ప్రవాసయుగ' మందామా అంటే ప్రవాసమన్నా అమెరికన్ రచయితకి పరిపాటి అయినదే; తన యూరపు నివాసపు చోట్లను తానెప్పటినుంచో అక్కడ వున్నట్టుగా యూరపియన్ మిత్రులను త్రిప్పి తీసుకురాగలడు. మరి ఆ శకంలోని లోటేమిటీ అంటే రచయితలలో ఒక చక్కని తాత్త్వికదృక్పథం లేకపోవడం, (నాటికంటె నేడది మరీ పలచబడిపోతోంది, అసంబద్ధంగా కనిపిస్తోంది). అయితే ఒక విషయం - ఆ కాలంలో అమెరికన్ రచయిత అంత స్వస్థానస్వస్థుడు కాడు. ఎప్పుడేనా నియతంగా ఒక మొక్కుబడి తీర్థయాత్రలా తిరిగిరావడానికి మాత్రమే అవకాశం కలిగివుండేవాడనే సంగతి గుర్తించాలి మనం.

---

* ఇటీవల స్టీన్‌బెక్ పుచ్చుకున్నారు (1963).

# 13

## అమెరికన్ నాటకరంగం

యూజీన్ ఓనీల్ (1888-1953 )
సిడ్నీ హోవర్డు (1891-1939 )
ఎస్. ఎన్. బెర్మన్ (1893- )
ఫిలిప్ బేరీ (1896-1949 )
మోస్ హార్ట్ (1904- )
జార్జ్ ఎస్. కాఫమన్ (1889- )
రాబర్ట్ షెర్వుడ్ (1896- )
ఎల్మర్ రైస్ (1892- )
జాన్ హవర్డు లాసన్ (1895- )
థార్న్టన్ వైల్డర్ (1897- )
మార్క్ కొన్నెల్లీ (1890- )
క్లిఫ్ఫర్డు ఓడెట్స్ (1906- )
టెన్నెసీ విలియమ్సు (1914- )
ఆర్థర్ మిల్లర్ (1915- )

**19** వ శతాబ్దిలో అమెరికన్ నాటకం ఆంగ్లనాటకంకంటెకూడ మరీ పడుచుకొన్న కళారూపమై పోయింది. అయితే ఇంగ్లండులోలాగు జనరంజకాలైన దాని వాలకాల్లో మాత్రం కావలసినంత జవమూ జీవమూ వున్నాయి. 1850 నాటికి నీగ్రోల పాటకచ్చేరీలు ఒక త్రిభాగాత్మకమైన వినోదకాలక్షేపంగా పరిణమించింది. ఒకతరంపైగా దాని ప్రభ వెలిగింది. కాస్త పిదపగా బయల్దేరిన 'వికటనాట్యరాసక' (burlesque) ప్రదర్శనలుకూడ అలాగే నిబిడబంధం లేక త్రిభాగములై, ప్రతిభాగమూ తత్సహజమైన గ్రామ్యధోరణులలో కొనసాగుతూవుండేవి. 'వోడ్విల్' (Vaudeville—విక్టోరియన్ 'music-hall', అంటే 'సంగీతరంగమందిర్'కు సమానార్థకమైన అమెరికన్ పదం) ప్రదర్శనాలుమాత్రం వికటధోరణులు లేకుండా పకడ్‌బంద్‌గా సాగేవి. ఏమయితేనేమి, సిసలైన నాటకరంగం మీద రక్తి నిలువరించుకోగల రూపకాలు మరీ కొద్దిమాత్రమే వెలిశాయి. అసలది నాటకకర్తకంటె నటుడికీ, ప్రయోక్తకీ ఎక్కువ విలువ నిచ్చిన కాలం. ఆనాడు పేరుమోసినవారు: ఎడ్విన్ ఫారెస్ట్, ఆంగ్లో-అమెరికన్ బూత్స్, జెఫర్సన్స్, బౌసికాల్ట్స్, సాదర్న్స్, బేరీమోర్స్, డేవిడ్ బెలస్కో (actor-manager 'Play-doctor'). అసలు నాటకగ్రంథంగురించి పట్టింపు తక్కువైపోయింది. అది తరచు యూరపునుండి దిగుమతి అయ్యేది. 'Our American Cousin' అనే నాటకం (ఈ నాటకప్రదర్శన చూస్తూనే 1865 లో అబ్రహాంలింకన్ హత్యగావింపబడ్డారు) టామ్‌టెయ్లర్ అనే ఆంగ్లేయునిచే రచింపబడివుండటం విశేషం. చక్కగా నిర్వహింపబడిననాటకమల్లా తరచు ఏదో నవలాపరివర్తనం అయివుండేది. Uncle Tom's Cabin, The Gilded Age అనే నవల లలా పరివర్తింపబడ్డాయి. నిజానికవి రంగప్రయోగదృష్టితో వ్రాయబడినవి కావు. ఎప్పుడేనా డబ్ల్యు. డి. హోవెల్సువంటి రచయిత లొకడూ అరా కేవలం రంగంకోసమే రచనచేసినా అందులో క్రొత్తఏమీ వుండేది

కాదు. అసలు పౌరజనం-లండన్‌లో హెన్రీ జేమ్సు విచారంతో గుర్తించి నట్లు-అద్భుత, శోభాత్మక నాటక(i.e., melodrama)ప్రదర్శన అంటే విరగబడేవారు. వాళ్ళకు కావలసిందల్లా పాత్రబాహుళ్యం, కల్పితకథలు, రమణీయ దృశ్యాలు. వాళ్ళకు దేశభక్తిభావా లంటే మోజు వుంది కాని నాటకాల విషయంలో మాత్రం తమ అమెరికన్ నాటకాలే కావాలని పట్టింపులేదు. 1891 కి ముందాక సరియైన అంతర్జాతీయమైన గ్రంథస్వామ్య వ్యవస్థ లేకపోవడంవల్ల దేశీయరచయితల యిబ్బంది ఎక్కువైంది. దానికి తోడు రచనలమీద పెత్తనదారీసంస్థల పలుకుబడి హెచ్చుడంతో యువ రచయితలను వినిపించుకునేవారు లేకపోయారు. 1881 (ఇబ్సెను 'Ghosts' వచ్చిన యేడు)లో బెలస్కో ఇతరరచయితల నాటకాలు రెండింటి నుండి విషయం సంగ్రహించి తాటాతూటం చేసి 'La Belle Russe' అనే నాటకం తయారుచేసి అమెరికన్ నాటకరంగంమీద ప్రయోగించాడు. అదొక 'మెలోడ్రామా'. మొదట ఇంగ్లండులో తయారై గొప్పకోసం 'ఫ్రెంచినుండి' అని ప్రకటింపబడింది. 1888 (స్ట్రిండ్‌బెర్గ్ 'Miss Julie' వచ్చినయేడు) బెలస్కో 'Lord Chumley' అనే నాటకం వ్రాసి ప్రయోగించడానికి డేనియల్ ఫ్రోమన్‌తో కలిసి పనిచేశాడు. బెలస్కోకి నిజంగా నాటకరంగసంబంధమైన నైపుణ్యం వుంది. మరికొద్దికాలంలో సోఫోకిల్స్ వ్రాసిన 'Electra'కు దర్శకుడుగా ఒక అద్భుత ప్రదర్శనం నిర్వహించా డతడు. అయితే అతడు సాధించిన సుదీర్ఘవిజయాలకూ, ఇబ్సెన్, స్ట్రిండ్‌బెర్గ్, హాప్ట్‌మన్, సుడెర్మన్, బెర్నార్డుషా (ఇతని మొదటినాటకం 'Widowers' Houses' 1882 లో ప్రయోగింపబడింది) సాధించిన విజయాలకూ చాలా అంతరం వుంది.

ఆ పిమ్మట కొన్నాళ్ళపాటు అమెరికన్ నాటకరంగం యూరపు, ఇంగ్లండుల రంగంకంటె కూడ వెనుకబడిపోయింది. 1900 ప్రాంతంలో అమెరికా ప్రపంచనాటకరంగానికి ప్రముఖమైన సాహాయ్యం చెయ్యగల దనడాని కించించుక సూచనలు కనిపించాయి. నిజంగానే ఈ శతాబ్ది

ప్రారంభంలో చైతన్యరేఖలు ప్రసరించాయి. 1906 లో చికాగోలో న్యూ థియేటర్, 1909 లో న్యూయార్కులోనూ అలాంటిదే ఒక నాటకశాల నెలకొల్పబడ్డాయి. ప్రయోగాత్మక నాటకాల కవి అంత అనువుగా లేకపోయినా మొత్తానికి శుభసూచనలే అని చెప్పాలి. 1905 లో జార్జ్ పియర్స్ బేకర్ నాటకరచన నొక పాఠ్యవిషయంగా రూపొందించాడు. అదే పిమ్మట హార్వర్డులో సుప్రసిద్ధమైన 47 Workshop గా పరిణతి పొందింది. కవి, నాటకకర్త అయిన విలియంవాన్ మూడీ డిక్ ఉన్నతనాటకరంగస్థితికి ఉన్ముఖంగా పురోగమిస్తున్నాడు. The Great Divide (1906), The Faith Healer (1909) అనే రెండు నాటకాలు వ్రాశాడప్పట్లో. ఆయన 1910 లో చనిపోయినా నాటకశిల్పంలో ఆయన ప్రదర్శించిన మెలకువలు ఆయేడే మరిరెండు నాటకాలలో కనిపించాయి. అందులో ఒకటి ఆయనదగ్గర చదువుకొన్న జోసఫిన్ పీబాడీ వ్రాసిన 'The Piper'. అది హేమ్లిన్ 'Pied Piper' కి పద్యరూపక పరివర్తనం. స్ట్రేట్ ఫర్డు మెమోరియల్ థియేటరు దాన్ని ప్రదర్శనకోసం ఎన్నో రూపకాలమధ్యనుంచి ఎన్నుకొన్నది. రెండోది మూడీమిత్రుడు పెర్సీ మేక్కయే వ్రాసిన 'The Scare-crow'. ఇది హాథార్న్ 'Feathertop' కి నాటకీకరణం.

అయితే పద్యరూపకాలుగాని, పరివర్తనరూపాలుగాని అమెరికన్ నాటకరంగపు టభ్యున్నతికి దోహదకారులు కాలేదు. నాటకకర్త కొక ప్రాముఖ్యం వచ్చినంతమాత్రాన సరిపోదు. వ్యాపార నాటకరంగ సంప్రదాయాలనుండి మోక్షం లభించాలి. మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే అలాంటి మోక్షానికి తగిన పరిస్థితు లేర్పడ్డాయి. 'లిటిల్ థియేటర్' ఉద్యమం ప్రారంభమైంది. అమెరికా అంతటా చిన్నచిన్న ఔత్సాహిక (amateur) నటసమాజాలు బయల్దేరి క్రొత్తవి, చిన్నవి, సుగమంగా వుండేవీ అయిన నాటకాలు ప్రదర్శించడాని కుత్సహిస్తున్నవి. 1915 లో చాల మంది నటులు, రచయితలు కలిసి మెసచుసెట్స్ రాష్ట్రంలో ప్రోవిన్స్

టౌన్‌వద్ద ఒక వేసవి విడిది ఏర్పాటుచేసుకుని 'ప్రావిన్స్‌టౌన్ ప్లేయర్స్' అనే పేరుతో కలిసికట్టుగా తమకు తామేవో వినోదప్రదర్శనలు చేసుకునే వారు. ఒక మేడక్రింది తలవాకిలి వాళ్ళ మొట్టమొదటి నాటకరంగం. ఆ తరువాతి వేసవిలో యువకుడైన నాటకకర్త యూజీన్ ఓనీల్ ప్రావిన్స్ టౌన్‌కి వచ్చాడు. త్వరలోనే ఆ సమాజంలో ఒకమొనగాడయ్యాడు. అతడొక పాతబాణీ నటశిఖామణికొడుకు కావడంవల్ల చిన్నప్పటినుంచీ నాటకరంగంతో పరిచయం వుంది. అయితే బయటి ప్రపంచానుభవం ఒంటబట్టేదాకా ఆయన నాటకరంగాన్ని తన జీవనోపాధిగా చేసుకో లేదు. ప్రిన్స్‌టన్‌ని వదిలి కొంతకాలం హాండురస్‌లో ఒక గనిత్రవ్వకపు సాహసకార్యక్రమంలో పాల్గొన్నాడు. తదుపరి కొన్రేడ్, జాక్‌లండ న్లంటే ఏర్పడిన మోజు అతడిని సాగర సాహస యాత్రల వైపు ఆకర్షించింది. నావికుడుగా బ్యూనోస్ ఐరెస్, దక్షిణాఫ్రికా, ఆర్జెంటైన్, న్యూయార్కులకూ, అక్కడినుండి పలుతడవలు ఇంగ్లండుకీ నౌకా ప్రయాణాలు చేశాడు. మధ్యలో జబ్బులు పడ్డాడు. కొన్నాళ్ళు రేవులలో వట్టి సోంబేరి (beachcomber) లా తిరిగాడు. వార్తా పత్రికలకు వార్తానివేదకుడుగా అనుభవం సంపాదించాడు. 1913-14 శీతకాలంలో కొన్ని నాటకాలు వ్రాశాడు. 'Bound East for Cardiff' అనే ఏకాంకిక అందులో ఒకటి. తరువాత జి. పి. బేకర్‌గారి '47 వర్కుషాపు'లో చేరాడు. ఆ తరువాత గ్రీనిచ్ విలేజ్ గుండా ప్రావిన్స్‌టవున్ చేరుకున్నాడు. అక్కడ 1916 లో 'Bound East' ప్రదర్శింపబడింది. 'ప్లేయర్స్' ప్రదర్శనాలలో చాలా రోజులు రక్తికట్టిన నాటకాల్లో అదే మొదటిది.

ఇక అమెరికన్ నాటకరంగ చరిత్రలో నూత్నశకారంభం జరిగిం దని చెప్పవచ్చు. న్యూయార్కు ప్రధాన కేంద్రమైనది. అయితే మిగతా చోట్లగూడ ఉత్సాహానికి కొదువలేదు. ప్రావిన్స్‌టవున్ ప్రదర్శకులు గ్రీనిచ్ విలేజ్‌లో ఒక చిన్న నాటకశాల నెలకొల్పేరు.1917-18 సం॥లలో

అమెరికా యుద్ధంలోకి దిగిన కాలంలో గూడ దాని మనుగడకు తఖరారు రాకుండా చూసుకున్నారు. 1920 నాటికి వెనకటి చిటిపొటి ఏకాంకికలతో పాటు పెద్ద పెద్ద పూర్ణరూపకాలను గూడా ప్రదర్శించే స్తోమత కలిగింది వాళ్ళకు. వ్యాపార నాటక శాలలకు వచ్చేటంతమంది సామాజికులు తమ నాటకాలకు రాకపోయినా, వచ్చిన కొద్దిమందీ మంచి ఉత్సాహం గల వారు. ప్రదర్శకులు కేవలం 'డబ్బుయావ' (ధనాశ) లో పడిపోకుండా తమ కిష్టం వచ్చిన ప్రయోగాలు (experiments) చేసుకునేవారు. వాళ్ళ వలన నాటక కర్తకు గూడ ఒక స్థితి యేర్పడింది. 1925 నాటికి 47 గురు వ్రాసిన 93 నాటకా లాడేరు వాళ్ళు. ఆ రచయిత లించుమిం చందరూ అమెరికన్లే. ఎడ్నా ఫెర్బర్, ఎడ్నా సెంట్ విన్సెంట్ మిల్లే అనేవారు ఆ కోవలో వున్నారు.

న్యూయార్కులో కూడ కొన్ని నాటకమేళా లున్నాయి. అలాంటి ప్రయోగాత్మకాశయాలతోనే 1914 లో 'ది వాషింగ్టన్ స్క్వేర్ ప్లేయర్స్' అనే సంస్థ ప్రారంభమైనది. వరసగా ఏకాంకిక లాడుతున్నారు. యుద్ధం వచ్చింది. ఆటవిడుపన్నారు. మళ్ళా 1919 లో 'థియేటర్ గిల్డ్' అనే పేరుతో తలయెత్తేరు. 1925 నాటికి మంచి అభ్యుదయం సాధించారు. తమ సొంత నాటకశాల నిర్మించుకున్నారు. ఈ సమాజం వారిలో సంప్రదాయ ప్రవణత్వం మరీ ముదిరిపోకముందు గొప్ప గొప్ప అమెరికన్ యూరపియన్ నాటక ప్రదర్శన లనేకం చేశారు. ఓనీల్ వ్రాసిన Marco Millions (1928), Mourning Becomes Electra (1931), Ah, Wilderness! (1933) అనే నాటకాలు ప్రదర్శించింది వాళ్ళే. ఓనీల్ ఆ సంస్థ వ్యవస్థాపక సభ్యులలో ఒకడు. 'నెయిబర్ హుడ్ ప్లే హౌస్' కూడ అతని నాటకాలను కొన్నిటిని ప్రదర్శించింది. అది 1915 లో ఒక ప్రొత్సాహిక సమాజంకోసం పుట్టింది. కాని యుద్ధానంతరం అభియుక్తులకు (i.e., professionals) కైవసమైపోయింది.

తక్కిన పెద్దపట్టణాలలోగూడ అలాంటి సమాజాలు నెలకొన్నవి. అయితే ఇందులో ఏదీకూడా వ్యాపార నాటకరంగాన్ని మాత్రం కదిలించ లేకపోయింది. ఈ శతాబ్ది మూడోదశకంలో అమెరికన్ నాటకా లన్నిటా అతివేలమైన జనామోదాన్ని చుబ్బనచూరలుగొన్న నాటకం 'Abie's Irish Rose' (1924). న్యూయార్కులో అది రెండువేలా అయిదు వందల పర్యాయాలు ప్రదర్శింపబడింది. ఓనీల్ తాలూకు ఏ నాటకానికీ ఎక్కడా అంత వ్యాపారసాఫల్యం (Commercial Success) ఏర్పడలేదు. చిన్న చిన్న ప్రయోగాత్మక నాటకశాలలు నూటిగా కాకున్నా ఏదోవిధంగా 'బ్రాడ్వే'ని కూడ ప్రభావితంచేశాయి. వాటి నాటకకర్తలు ప్రజల్లో మంచిపేరు చేసుకున్నారు. అయితే ఆ 'Abie's Irish Rose' అనే నాటకం ఆనీ నికోల్స్ రచన అని జ్ఞాపకం వుంచు కోడాని కెవరూ పట్టించుకోరు; కాని ఓనీల్ పేరు మాత్రం అందరి విను కలికీ ఎక్కినదే.

అగ్రగణ్యుడైన అమెరికన్ నాటకకర్తగా అతడు తన దేశంలో ఆధునిక నాటకరంగసంస్థితికి చాలా కృషిచేశాడు. అతని రచనలలో ఆధునికమైన అమెరికన్ నాటక ప్రముఖరీతులు ప్రతిఫలిస్తాయి. అందులో ఒక ప్రముఖరీతి ఏమంటే—ఉద్దేశపూర్వకమైన వట్టి చప్పిడి వాస్తవికతతో ప్రౌఢమైన, సృజనాత్మకమైన 'అభివ్యక్తి' శిల్పాన్ని (Expressionist Technique) మేళవించడం. ఆ మేళనం ఎలా వుంటుందంటే హెన్రిక్ ఇబ్సెన్, బెర్టోల్డ్ బ్రెక్టు లిద్దరూ ఓనీల్ రచనలో కలిసి కాపురం పెట్టిన ట్లుంటుంది. ఓనీల్ రచనారంభం చేసేసరికి అప్పటికి పూర్తిగా ఒకతరానికి తరం ముందుగా ఇబ్సెను సూచించిన నూత్నప్రయోగాలను అమెరికను రూపక ప్రక్రియ ఇంకా సాధించుకోవలసివున్నది. అయితే యుద్ధం అయిపోయే కాలానికి యూరపియన్ నాటకశిల్పం 'అభివ్యక్తి చోద్యాల' (Expressionist Fantasies) లోకి చిలవలు పలవ లుగా విస్తరిస్తోంది. జార్జ్ కెయిజర్ వ్రాసిన 'Gas', కరేల్ కపెక్

వ్రాసిన 'R. U. R.' ఆ కోవకు చెందినవి. ఆ విధాన మంతటినీ ఓనీలూ, అతని మిత్రులూ కొద్దిసంవత్సరాలతో ఆకళింపుకు తెచ్చుకున్నారు. ఉన్నట్టుండి అమెరికన్ రూపకం యూరపు రూపకంతో సమానస్థాయికి వచ్చేసింది.

అమెరికన్ నాటకరంగంమీద ఏలుబడి సాగిస్తూ వున్న చాదస్తపు సంప్రదాయాల స్థానే ఇబ్సెన్ రీతికి చెందిన వాస్తవికతను నెలకొల్పడమన్నది ప్రధానకర్తవ్యం. పెద్ద పెద్ద కొలువుకూటాల రమణీయదృశ్యాల రంగప్రసాధనాలకు బదులు ఓనీల్ ఏ 'లాంచి' పైకప్పునో రంగముఖంగా అమరిస్తే తీరిపోతుం దన్నాడు (చూ. అతని Bound East for Cardiff, The Moon of the Caribbees). నానావస్థాత్మకాలైన ఇతివృత్తాలకు బదులు ఒక నావికుడు తన ఓడగదిలో బల్లమీద ఒక్కడూ సామాన్యంగా చచ్చిన చావునుగాని, కల్లుముంత పట్టుకుని తన పొత్తుల తొత్తులతో కులికే విటాధముడి వాలకాన్నిగాని గ్రహించవచ్చునని నిరూపించాడు ఓనీల్. కృతకసంవాదాలకు, 'మెలోడ్రామా' జనాంతికాలకూ బదులు ఓనీల్ ముష్కరపాత్రలు తమ స్థితికి తగిన అచ్చపు నుడికారంతో మాట్లాడతాయి. ఆ మోటమాటల ధోరణి నాటకరంగానికి వాటంగా రూపొందింపబడింది. Bound East తరువాత ఓనీలు బాగా పరిణతు డైనాడు గాని, మరీ పిమ్మటి 'The Iceman Cometh' (1946) వంటి అతని నాటకం (ఇందలి ప్రధానరంగం ఒక పుప్పనికుంజం) కూడ సామాన్యజన వ్యావహారిక భాషాపరిజ్ఞాన మతని సొమ్మనీ, అది చాలా నిలుకడగలదనీ విశదం చేస్తుంది. సున్నితమైన భాష కోసం ఆశించలే దాయన. చూడండి తన Mourning Becomes Electra గురించి ఒక ఉత్తరంలో[1] ఆయన ఏమన్నాడో:

---

1. Quoted in Arthur H. Quinn, 'A History of the American Drama from the Civil War to the present day' (2 V. in I, New York, Revised Edn., 1936), ii, 258.

"దానికి గొప్ప భాష వుండవలసిన అవసరం వున్నది. ... అది నా దగ్గర లేదు. ఈనాడు వ్రాయబడుతూవున్నదాన్నిబట్టి నామట్టుకు నేను ఊరట పొందుతూ, ఒక అందిక పొందిక లేని విశ్లథమైన ఒక గురకుదరని ఈ మనకాలంలో నివసించే ఎవడికైనా గొప్పభాష చేతనవుతుం దనుకోను. ఎవడైనా చెయ్యగలిగిన ఉత్తమమైన పని యేమిటంటే తన గమనం, తన అస్పష్టవాగ్ధోరణిద్వారానే దయనీయమైన ధాటిని ప్రదర్శించడమే."

అందుకు తగినట్లుగానే ఆయననాటకాలు చదవడానికి చాలా నిరుత్సాహజనకంగానే వుంటాయి. ఇలా ఓసారి త్రిప్పిచూచేసరికి, వాస్తవికదృశ్యాల సమర్చడంగురించి వివరంగా చేయబడిన రంగప్రయోగ సూచనలు, ఓనీలు తండ్రి నటించిన నాటకంయొక్క సూచనల కేమంత భిన్నంగా కనిపించకపోవచ్చు.

అయితే సర్వథా భేదం వున్నది. తా నొక నైష్ఠికనాటకకర్త నని ఓనీల్ భావన. అతని వాస్తవికతాదృక్పథం అప్పుడప్పుడు చప్పిడి ధోరణిలో పడిన ట్లవుపించినా, నిజానికి నాటకకళకు గల అవకాశాలను పరిశీలించాలనే ఒక తాజా ఆశయంతో ప్రారంభమైంది. అతని 'అభివ్యక్తి' సిద్ధాంతోద్దేశాలూ అలా ప్రారంభమైనవే. అవి అతని రచనలో చాలాముందునుంచే కనిపిస్తూవచ్చాయి. ఉదాహరణకు అతని 'The Moon of the Caribbees' (1918) గడ్డువాస్తవికధోరణి గలది. కాని ఆ నేపథ్యదేశీయసంగీతపు హంగు వున్నదే అది అభివ్యక్తిశిల్పం విషయంలో ఆయన చేయబోయే మహత్తరకృషికి ముందు సూచనలా వున్నది. 'Beyond the Horizon' (1920) వాస్తవికతావాద, స్వాభావికవాద సంప్రదాయానికి చెందిన రూపకం. కాని అదేయేడు ప్రదర్శింపబడిన అతని 'The Emperor Jones' లో బ్రెక్టు, ఇబ్సెనులిద్దరి పద్ధతులూ సంగమించాయి. అయితే అప్పటికి తాను 'అభివ్యక్తి'

శిల్పంగురించి వినవేలే దన్నాడు ఓనీల్. నాటకం అవుతున్నంతసేపూ నేపథ్యంలో 'టముకు' వాయించడం వుంటుంది. కొన్ని రంగరూపణలు (Settings) అసలక్కడి వస్తుసన్నివేశానికి తగినట్లు కాక ఒక మానసిక స్థితుత్పాదకాలుగా వుంటాయి. ఒక రంగం చివర---"అడవిగోడలు లోపలికి ముడుచుకుపోతాయి" (రం. ప్ర. సూచన). పాత్రలు:—"చిన్న ఆకృతిలేని భయాలు" (Little Formless Fears—ఒక్కొక్కటి నల్లగా, ప్రాకుతున్న పసిపిల్లలంతేసి ఉరిడిపురుగుల్లా కనిపించేవి), అనేక నీగ్రోఛాయామూర్తులు, వారి మధ్య భయసన్నిపాతవిహ్వాలుడై గతకాల భావనలో తన ఆదిమమైన కాంగోవంశమూలంకడకు వెళ్ళిపోయిన బ్రూటస్ జోన్సు. ఓనీల్ ఆ తరువాతి నాటకాల్లోగూడ కొన్నిట ఈ 'అభివ్యక్తి' శిల్పాన్ని పాటించాడు. 'All God's Chillun Got Wings' (1924) లో ఒక నడివీథిరంగస్థల ప్రతియోగసంఘటనద్వారా నీగ్రో-శ్వేతజాతి అనుబంధాన్ని ప్రతిపాదిస్తాడు :

"మనుషులునల్లవాళ్ళూ తెల్లవాళ్ళూ వెళుతున్నారు-నీగ్రోలునిష్కపటంగా వసంతోత్సాహదోహలంగా, శ్వేతముఖులు స్వాభావికావేశ వికృతంగా తెచ్చికోలు నవ్వు నవ్వుతూ. శ్వేతముఖుల వీధినుండి తారస్థాయిలో అనునాసికస్వరప్రక్రియగా"Only a Bird in a Gilded Cage" (i.e., బంగరు పంజరంలో పక్షిమాత్రమే) అనే పాట బృందగానంగా వినిపిస్తోంది. నీగ్రోల వీధినుండి "I Guess I'll Have to Telegraph My Baby" (i.e., నా బిడ్డకు నేను 'తంతి' పంపవలసివస్తుం దనుకుంటాను) అనే బృందగానం వినవస్తోంది. పాట పూర్తి అయ్యేసరికి రెండు వీధులనుండి పకాలుమని నవ్వులు వినిపించాయి."

ఒక గది గోడ కొక కాంగో 'కరాళం' (mask) వ్రేలాడుతోంది. పో గారి 'Pit and the Pendulum'లో లాగ గోడలు లోపలికి మూసుకుంటాయి. ఇదంతా అక్కడ నివసించే దంపతుల భావాలే శభారాన్ని తీవ్రతరం చెయ్యడానికి సందర్భోచితమైన ఏర్పాటు.

'The Great God Brown (1926) లో ముఖ్యపాత్రలు ముఖాచ్ఛాదకాలను (masks) ధరిస్తాయి. అవి అప్పుడప్పుడు తీసి వెయ్యడం, ఒక వ్యక్తి (డయన్ ఏంథోనీ: డయోనిసస్ అండ్ సెయింట్ ఏంథోనీ ఇద్దరూ ఒక్కమనిషిలోనే సంఘర్షిస్తూ) నుండి మరొక వ్యక్తికి (బ్రౌన్: మన క్రొత్త భౌతికగాథా ప్రపంచంలోని ముందుచూపు లేని దేవయోని)1 బదిలీకావడం కద్దు. 'Lazarus Laughed' (1927) లో జీవితంయొక్క సప్తావస్థలను నిరూపించడానికి గాను కరాళధారణంచేసిన గాయకబృందం వున్నది (సప్తస్వరాలు). ఏడు రకాల మనుషులున్నారు ఏడుగురూ ఏడురంగుల్లో. మొత్తానికి కాలభాగ-రీతుల కలయికల్లో (Combinations of period and type) నలభైతొమ్మిది మాదిరు లేర్పడతాయి. ఈ నాటకప్రదర్శన 'లిటిల్ థియేటర్ల' తాహతుకు మించినట్టిది. అతని 'Strange Interlude' (1928) అలాంటిదే. ఇది రిచర్డ్ వాగ్నెర్ (జర్మనుసంగీతరూపకశిల్పి, 1813-83) స్థాయి కెక్కదగిన రూపకం. ఇందులో మరి 'అభివ్యక్తి' శిల్పరీతులు పాటింపబడలేదుకాని అపవారితములు, లేక జనాంతికముల (asides) ద్వారా భిన్నప్రకృతులుగల పాత్రల ఆంతరమైన భావాలు వ్యక్తం చేయబడతాయి. అతని 'Mourning Becomes Electra' (trilogy) మరీ పెద్ద యెత్తులో నడచిన నాటకం. ఆ గ్రీకుగాథను అమెరికన్ పరిస్థితి కన్వయించి దాని పరమార్థాన్ని అతిశయింపజేశాడు. 'అంతఃకలహ' (Civil War) సమాప్తిని ట్రోయ్‌పతనంతోను, బ్రిగేడియర్ ఎజ్రామనోన్ను ఎగామెమ్నన్‌తోను, మనోన్ భార్య క్రిస్టైన్‌ను క్లిటెమ్‌నెస్ట్రాతోను, వాళ్ళ అబ్బాయి ఓరిన్‌ను ఒరెస్టెస్‌తోను, వాళ్ళ అమ్మాయి లవినియాను ఎలక్ట్రాతోను ప్రతిచేసి నిరూపించాడు. ఒక న్యూఇంగ్లండు గృహద్వార మండపమే కథారంగం. ఆ పౌరజనమే గాయకబృందం.

---

1. Quoted in Quirn, ii, 193.

ఈ పేర్కొనబడిన నాటకాలు ఓనీల్ చేసిన సృష్టిలో ఒకభాగం మాత్రమే. వరసగా ఇరవైయేళ్ళపాటు మొక్కవోని ఓపికతో రచనావ్యాసంగం సాగించాడు. అందులో ఇంకా Anna Christie (1921) Desire under the Elms (1924) అనే స్వాభావికతాసిద్ధాంతాత్మకాలైన రూపకాలు, The Hairy Ape (1922), Marco Millions (1928), Dynamo (1929) అనే ప్రయోగాత్మకాలైన రూపకాలూ వున్నవి. కొన్ని జనరంజకాలు కాలేకపోయాయి. కొన్నిటి సాఫల్యం విపులమైన రంగప్రసాధనంమీద ఆధారపడివుండేది. 1920 ప్రాంతపు 'అభివ్యక్తి' రూపకప్రదర్శనల కది పరిపాటి. 1934 నుంచి ఓనీల్ మళ్ళా పఠనవ్యాసంగంలో నిమగ్నుడయ్యాడు. అప్పుడూ ఒకవంక వ్రాస్తూవుండేవాడు కాని ఆ క్రొత్తనాటకాలేవీ ప్రదర్శనల కెక్కడం లేదు. మరి పన్నెండేళ్ళకు The Iceman Cometh మాత్రం ప్రదర్శింపబడింది.మరుచటి యేడాయన A Moon for the Misbegotten రచించాడు. అప్పట్లో చాలా పెద్దసుస్తీ చేసింది. అది 1953 లో ఆయునిర్యాణంలో పర్యవసించింది. అతని చరమకృతు లేవీ జీవితకాలంలో ప్రదర్శింపబడలేదు. అతని నాటకాలను మొత్తంగా పరిశీలిస్తే అవి "అందికపొందిక లేని అతివిశ్లథమైన ఒక గురిపుదరని మనకాలం" యొక్క స్వభావంమట్టున వున్న అంతరార్థాలను సూచించడానికి నిరంతరంగా చేసిన ప్రయత్నాలుగా భాసిస్తాయి. మనిషికీ మనిషికీ మధ్యనున్న అనుబంధంవిషయంలో (అతని నాటకాలు చాలావాటిలో పైకి కనిపించేదిదే) తన కాసక్తి లేదన్నాడు ఓనీల్.మనిషికీ దైవానికీగల అనుబంధంలో వుందన్నాడు. 'దైవం' అనడంలో అతడనుకొన్న అర్థాలు చాలా వున్నట్టున్నాయి. సాధారణంగా సాఫల్యంకోసం మానవుడు పొందే తపనతోనే (షెర్వుడ్ ఎండర్సన్ గారి 'ఎందుకోసం?' అనే ప్రశ్నలాగు), మానవుడు పొందే వైఫల్యవేదనతోనే అతనికి నిమిత్తం. అతడు శైల్పికమైన ప్రయోగవిన్యాసాలు చెయ్యడమల్లా నీరసమైన భావములగల నిర్బంధాలను,

తన దృక్పథావధులనూ మించడానికే, అధిగమించడానికే. అందుచేత నే అతని నాటకాల్లో ఒక్కొక్కప్పుడు గాంభీర్యంకంటె ఎక్కువ ఆర్జవమూ, నైశిత్యాన్ని అతిశయించిన క్లిష్టతా కనిపిస్తాయి. తొలి రచనలలో ఒక కఠినమైన, గంభీరమైన, స్మరణీయమైన ఉదాత్తత కనిపిస్తుంది. ఇది పిదప రచనలలోనూ అతడు స్వానుభవసంవాదిగా రచన చేసినప్పుడు కనిపిస్తుంది. 1940 లో రచింపబడి, 1956 లో ప్రదర్శింపబడిన Long Day's Journey into Night చాలా శక్తిమంతమైన రచన. కాని పిదప రచనలలో చాలా వాటిలో ప్రదర్శనశిల్పదృష్ట్యా అవి చాలా గొప్పవే గాని, దృక్పథంలో ఒక ఔదార్యలోపం కనిపిస్తుంది. Lazarus Laughed లో మనుషులను 'దయ్యం వెనుదగిలినవీరులు' (haunted heroes) అన్నాడు. అయితే అతనిపాత్రల్లో చాలామట్టుకు వీరత్వ స్ఫూర్తి వుండదు. ఆ పాత్రలనువెంబడించిన దయ్యాలు ఫ్రాయిడియన్, పాశవికాశయాల దయ్యాలు. అందుపై ఆ పాత్రలు పొందిన పతనావస్థ అంత రక్తికట్టలేదు. The Great God Brown లో, Strange Interlude లోను పాత్రలలో రక్తి లోపించింది. The Mourning Becomes Electra మాత్రం అతని ప్రశస్తరూపకాల్లో వొకటి. ఆ గ్రీకు ఉపశ్రుతులవలన దాని కొక హుందా వచ్చింది. కాని అక్కడా ఆయన అనుకున్నట్టే ఒక లోటు వున్నది. అది 'మెలోడ్రామా' గా బాగానే వున్నది కాని 'విషాదాంతం' కాలేకపోయింది. ఆ పాత్రల కంత స్థాయి లేదు. లాజరస్ నవ్వులోను, All God's Chillun లోని నీగ్రోల నవ్వులోను అపశ్రుతు లున్నాయి. ప్రణయము (Love), జీవితము (Life)—ఇంకా ఇలాగు ఓనీల్ దైవానికి సమానార్థకంగా పెట్టుకున్న సంకేతా లన్నిటికీ సార్వత్రికవ్యాప్తిలేదు. అతడు ప్రతిపాదించిన తత్సంబంధాలైన ఆశ లందరికీ పొందడాని కందుబాటులో వుండవు. అడి యాసలుగా వాటిపై తెర దించవలసిందే.

అయితేనేమి, ఓనీల్ లో గొప్పలక్షణా లనేకం వున్నాయి. అమె

రికన్ నాటకరంగ పరిపాకమున కందరికన్న మిన్నగా కృషిచేశాడు. యూరపు అంతటా అతని ప్రభావం వ్యాపించింది. అమెరికన్ నాటకకర్త లలో వేలుమడచి నిశ్శంకంగా మొదట చెప్పదగినవాడు. మిగిలిన రచయి తలు సాధించినదానితో సరిపోల్చిచూస్తే విశదమవుతుం దీవిషయం. సిడ్నీ హొవర్డు, ఎస్. ఎన్. బెర్మన్, ఫిలిప్ బేరీ-ఈముగ్గురూ 47 workshop లో తయారైనవారే. ముగ్గురూ నిపుణులే కాని కాస్త పాతబాణీగా వ్రాస్తారు. వీళ్ళను, రాబర్ట్ షెర్వుడ్, మోస్ హార్ట్, జార్జ్ ఎస్. కాఫ్‌మన్ లను మించిపోయిన విలువ ఓనీలుది.

హొవర్డు వ్రాసిన They knew what they wanted (1924), The Silver cord (1926) లలో ఒక యుక్తినిమిత్తంగా వృద్ధుడిని వివాహమాడిన ఒకయువతి పడిన చిక్కులు, మరీ విపరీతమై పోయిన మాతృత్వము మృదువుగా, చిక్కగా చిత్రింపబడ్డాయి. బెర్మన్ Biography (1932) పరిహాసభాసురమైన 'కామెడీ'. అందులో అంద రికీ నచ్చిన ఆచారాల పట్టింపులు లేని ఒక స్త్రీకి ఆమెస్మృతులను సంగ్ర థితం చెయ్యవలసిందిగా ప్రోత్సాహం వచ్చిన మీదట దాని పరిణామం ఎలా వుంటుందో చమత్కారంగా చిత్రించబడింది. ఫిలిప్ బేరీ కిరాయి నాటకశాలలకు చక్కని సున్నితమైన రచనలు చేస్తూ క్లిష్టవస్తువులలోగూడ కొన్ని ప్రయత్నాలు చేశాడు. అతని Hotel Universe (1930) దేశాంతరగతు లైన అమెరికన్ల గురించి, వాళ్ళ వ్యవహారాల గురించి వ్రాసిన నాటకం. అందులో ఒక వృద్ధవేదాంతి వుంటాడు. మిగతా పాత్రల కత డెంత విలువైనవా డంటే టి. యస్. ఇలియట్ The Cocktail Partyలో మనస్తత్వ మర్మజ్ఞుడైన హార్కోర్ట్ ఓ రెయిల్లీ అంత విలువైనవాడు. బేరీ వ్రాసిన మరో నాటకం Here Come the Clowns (1938) మంచి చెడుల గురించి చమత్కారమైన అంతరార్థ ప్రక్రియ(allegory) గలరచన. రాబర్ట్ షెర్వుడ్ వ్రాసిన The Road to Rome (1927)

హన్నిబాల్ దండయాత్ర గురించిన 'కామెడీ'; Petrified Forest (1935) చక్కని నిర్మాణ నిబద్ధత, సన్నివేశము, సందేశములు గల నాటకము; Idiot's Delight(1936) ఒక యుద్ధకాలపు యూరపుహోటలు కథారంగంగా ఒక శాంతికాముకుడు, ఒక దుష్టుడైన మారణాయుధాల ఉత్పత్తిదారుడూ పాత్రలుగా గలది. హార్ట్, కాఫ్‌మన్ కలిసి అడుగడుగున రక్తిగొలిపే కామెడీలు వ్రాశారు: You Can't Take It with you (1936), The Man who came to Dinner (1939).

ఈ నాటకా లన్నిటా యోగ్యలక్షణా లున్నాయి. కొన్ని ఓనీల్ నాటకాల కంటె మంచి రచనలు కూడాను—ముఖ్యంగా చతురసంవాద రచనలో మేల్తరములు. అయితే అందులో వేటిలోనూ ఓనీల్ రచనలో వున్న ప్రగాఢత్వం లేదు. 1920 ప్రాంతపు మిగతా అమెరికన్ 'అభివ్యక్తి' రూపక ప్రదర్శనల గురించికూడ (ఆనాడవి ఎంత ఉద్రేక ఉల్లాసం కలిగించినవైనా) ఆ మాటే చెప్పవచ్చు.

1914లో ఎల్మర్ రైస్, అప్పటికింకా కుర్రాడు, On Trial అనే నాటకంతో నలుగురినీ ఆకర్షించాడు. అది హత్యాకాండ గల నాటకం. కథావగతికి 'లిడ్లట్' (భావికవిత్వం అంటే భూతకాలాన్ని వర్తమానంగా రూపింపజేసే 'flashback' technique) సినిమా శిల్పాన్ని ప్రయోగించాడు. అతని తరువాతి నాటకాలు కొన్ని Morningside Players అనే ఒక న్యూయార్కు సమాజం వారిచేత ప్రదర్శింపబడ్డాయి. అవేమంత అసాధారణ శిల్పసహకృతములు కావు. అయితే అతని The Adding Machine (1923)లో మాత్రం అద్భుతమైన ప్రయోగం (experiment) వుంది. అందలి ముఖ్యపాత్ర ఒక చిన్న గుమాస్తా. పేరు మిస్టర్ జీరో. మరికొన్ని పాత్రలుగూడ కేవలం అంకెలతోనే వ్యవహరింపబడ్డాయి. తన అధికారి (employer)ని హత్యచేసినందుకుగాను ఉరితీయబడి మిస్టర్ జీరో ఎక్కడో స్వర్గంలో ఒకచోట

తానొక గణాంకయంత్ర (adding machine) కార్యంలో నిమగ్నుడై వున్నట్లు గుర్తిస్తాడు. కాని నాటకం చివర మళ్ళా భూలోకానికి వచ్చి దుర్భర జీవితచక్రగతులలో పరిభ్రమిస్తూ చివరికి తన యంత్రానికి బానిసయై పోయి మనసుచచ్చిన మనుగడలో పేరుకుపోతాడు.

ఆ యేడే జాన్ హొవార్డ్ లాసన్ వ్రాసిన Roger Bloomer కూడ సాంకేతికమైన నృత్యంతో ప్రత్యేకమైన రంగాలంకరణతో ప్రదర్శన కెక్కింది. 1925లో తన Processionalలో "అమెరికన్ జీవితంలోని జాజ్ స్వరమేళనం"(Jazz Symphony of American Life) ప్రవేశపెట్టేడు. గిల్బర్ట్ సెల్డెస్ వ్రాసిన The Seven Lively Arts (1924)లో సినీమాల గురించిన చతుర చిత్రణ, సరస పరిహాసము, గీత నృత్యాలు, తతిమ్మా జనరంజక కళాసామగ్రి వున్నవి. ఈ దేశీయ వినోదాల యెడ సెల్డెస్‌కి వున్న ఉత్సాహంలో పాలుపంచుకున్న రచయితలలో ఇ. ఇ. కమ్మింగ్స్, ఎడ్మండ్ విల్సన్ ప్రభృతు లున్నారు. లాసన్ కూడ అదే చేశాడు. అతని Processional 'వోడ్విల్' (Vaudeville) శిల్పరీతులపై తీర్చబడిన 'అభివ్యక్తి' సంప్రదాయ (experssionism) రచన. రాబర్ట్ ఎడ్మండ్ జోన్సు, నార్మన్ బెల్ గెడ్డెస్ మొదలైన రంగస్థల నిర్మాణ శిల్పనిష్ణాతులు ఆధునిక నాటకాభివృద్ధికి చాలా దోహదం చేశారు.

1920-30లో 'అభివ్యక్తి' రీతులు పూర్తిగా మాసిపోలేదు. ఆ పిమ్మటి మందకొడి కాలంలో (Depression years)తక్కిన నాటక రంగ విషయాలలాగే కొంత మార్పు పొందేయి. అమెరికన్ నవలకంటె నాటకం ఎక్కువగా కాలానుగుణమైన మార్పు పొందింది. అందులోనూ నవలలోలాగే ఫ్రాయిడ్‌కంటె మార్క్సుకే పరపతి యెక్కువైనది. వ్యక్తి యొక్క భావస్వాతంత్ర్యం అనే విషయానికి బదులు రచయితలు ఆర్థిక-అక్రమాలనే విషయం చేపట్టేరు. ఈ నాల్గవ దశకంనాటి అమెరికన్ నాటకం ముందటి దశకం నాటి స్థితికి తీసికట్టయిపోయింది. కమ్యూనిస్టు

వ్యతిరేకమైన మనస్తత్వం గల అమెరికన్ విమర్శకులు కొందరు తామిది వరకు మెచ్చుకున్న నాటకాలనే పక్షపాత ప్రహితాలైనవనీ (tendentious, ప్రచారోద్దేశం గలవనీ (propagandist) నిరసించారు. అలా అవి యిచ్చిన రక్తిని ఉపేక్షించడం గాని, ఆరూజ్ వెల్టు శకంలోని అమెరికన్ రూపక కళావైభవాన్ని కించపరచడం గాని శోచనీయమైన విషయం. ఈ నాటకాలవల్ల పాతబాణీ నాటకశాలల కెవ్విధమైన హానీ కలగలేదు. అవి పొదుపుగా యథార్థ దృశ్యాలు ప్రదర్శించుకుంటూ డబ్బు చేసుకుంటూనే వున్నాయి. 1935లో సిడ్నీ కింగ్స్లీయొక్క Dead End బాగా సొమ్ము చేసుకుందంటే దానికి కారణం చక్కని రంగ ప్రసాధనం. న్యూయార్కులోని ఈస్ట్ రివర్ కి బదులు రంగంమీద ఒక చెరువు ప్రదర్శించారు. కుర్రగాళ్లు అందులో దూకి తడిసి నీలాలు కారుతూ బయటికి వచ్చారు. ఆ దృశ్యం రక్తికట్టింది. ఈ వ్యర్థవ్యయాని కొక అర్థం కల్పించాడు కింగ్స్లీ. "ఐశ్వర్యానికీ, దౌర్భాగ్యానికీ గల తేడా ఎలాంటిదంటే శవాన్నీ జీవాన్నీ కలిపి కట్టి పడెయ్యడం లాంటిది." అంటాడు Tom Paineలో. (అధిక్షేపానికి బాగుంటాయి ఇలాంటి మాటలు.)

1931లో జార్జ్, ఇరాగెర్ష్విన్ లు వ్రాసిన Of Thee I Sing అనే సంగీతరూపకం రంగంమీద బాగా రాణించింది. 1937లో Pins and Needles అనే 'రాగరాగిణి' (Revue) International Ladies Garment Workers Union వారిచే ప్రదర్శింపబడి, దేశంలో అందరికీ అందులోని "Sing Me a Song of Social Significance" వంటి అతిమాత్ర మధురగీతాలు విని ఆనందించే అవకాశం ఏర్పడాలని దేశమంతా తిరిగి వచ్చింది.

ఆమందకొడి కాలం ఫలితంగా వచ్చిన మరో మార్పేమంటే అమెరికన్ రూపక వస్తువు విషయంలో ఆసక్తి హెచ్చు కావడం. ఇది బహుభంగులుగా విశదమైనది. స్వవిషయం వేపు ధోరణి మళ్ళింది. థార్న్టన్ వైల్డర్ అనే నవలా, నాటక రచయిత మూడవ దశకంలో పరదేశాల

గురించి, శకాంతరాల గురించి వ్రాసినవాడు. 1927 లో The Bridge of San Luis Rey వ్రాసినవాడు 1938 లో Our Town వ్రాశాడు. Our Town ప్రయోగాత్మక రూపకమైనా మంచి ఉల్లాస కరంగా వుంటుంది. ఈ శతాబ్ది మొదట్లో న్యూహేంప్‌షైరులోని గ్రోవర్స్ కార్నర్స్ స్థితి అభివర్ణితమయిన దంపుతో. అది తెర మరే దృశ్యపు హంగుగాని లేకుండా ప్రారంభం అవుతుంది. సామాజికు లందరూ ఆసీను లయాక 'ప్రయోక్త' (Manager) ప్రవేశిస్తాడు. తానే రంగంలో కుర్చీలూ బల్లలూ అమర్చి, నాటక పరిచయం చేస్తాడు. ప్రేక్షకాగారంలో కూచోపెట్టబడిన నటులు ఆహాలు, ఓహోలు పలుకుతూ వుంటారు. అందులో ఒకడు లేచి "సాంఘికమైన అన్యాయం, పారిశ్రామికమైన అసమత్వం ఎరిగినవా రొక్కరూ లేరా ఈ ఊళ్ళో?" అని ప్రశ్న వేస్తాడు. కాని ఒక సంగతి: నిజానికి వైల్డరు కలాంటి ప్రశ్నలు వేసుకోవలసిన అక్కఱ, ఇబ్బంది లేవు. న్యూవన్ రివరు, వైన్స్‌బర్గుల్లా కాక, ఆయనది ఒక చిన్న కలిసికట్టు మనుషుల కాపురాలు నాలుగున్న వూరు - ప్రశాంతంగా గతాన్ని నెమరువేసుకుంటూ వున్న వూరు. (The Skin of Our Teeth, 1942 కూడ అలాంటి యోగ్యతలు గలదే కాని అందులో మిగతా లోకపు గొడవ కూడా కొంత వుంది).

ఈ మారుమూల ప్రాంతీయాభిమానం క్రొత్త సంగతేమీ కాదు. 1920 ప్రాంతంలో జానపదరూపకం (Folk drama) అభ్యుదయం పొందింది. దానికి పురోగాములు కొన్ని లేకపోలేదు. ఫ్రాంక్ మర్డోక్ వ్రాసిన Davy Crockett (1872) అందులో ఒకటి. కాలేజీ నాటక శాలల్లోనూ, లిటిల్ థియేటర్సులోనూ అమలులో వున్న జానపదరూపకం అల్పమైనది, కృతకమైనది. యీట్సుగాని జె. ఎమ్. సింజ్ గాని అయితే దాని కొక ప్రాచీనమైన వారసత్వపు ప్రతిష్ఠ తెచ్చిపెట్టగలరు. కాని అమెరికన్ ప్రాచీన సంప్రదాయస్థితి ఎలాంటిదంటే నిన్నటి దానికి మాసిక వేసుకుని మొన్నటిదని చెప్పుకోవాలి. ఎఱ్ఱ ఇండియన్లనే అమె

రికన్ జానపదు లనుకోవచ్చు. కాని వాళ్ళను కూడగట్టుకుని రావడం ఆలస్యమైపోయింది. వాళ్ళందులో సరిగా నప్పరు కూడ. 1910 లో నార్తు డకోటా విశ్వవిద్యాలయంలో ఫ్రెడరిక్ హెచ్. కోచ్ 'డకోటా ప్లేమేకర్స్' అనే సంస్థ స్థాపించి ఆ పొరంబోకు ప్రాంతంనుండి ఫలసాయం పొందడానికి కొంత వ్యవసాయం చేశాడు. 1918 లో ఆయన నార్తు కెరోలినా విశ్వవిద్యాలయానికి బదిలీ అయినప్పు డక్కడ మన్యంలో అతని కృషి కొంత సులభతరంగా సఫలం అయింది. ఆతడు తయారు చేసిన 'కెరోలినా ప్లేమేకర్లు' అంతా విద్యార్థులే. ప్రొఫెసర్ కోచ్ తానే నాటకాలు వ్రాసి దర్శకత్వం వహించి వాళ్ళచే ఆడించేవాడు. అక్కడ చదువుకుంటూ వున్న రోజుల్లోనే థామస్ వుల్ఫ మొదటగా నాటకాల్లో ఆసక్తి కనబరిచాడు. ఆ నాటకప్రదర్శకులకోసం నాటకాలు వ్రాసిన వారిలో పేరు చేసుకున్నవాడు పాల్ గ్రీన్, కోచ్‌కి సహోద్యోగి. అతడు నీగ్రోల గురించి, తెల్లజాతి పేదల గురించి, కూలి బ్రతుకులవారి గురించి అనేక నాటకాలు వ్రాశాడు. అందులో In Abraham's Bosom (1926) అనేది మిక్కిలి వాసి కెక్కింది. అది వధాంతము. ఈ ప్రాంతీయోద్యమమే టెన్నెస్సీ క్షేత్రం దానికంటె చాలా ఉదారంగా కొనసాగింది.

మిగతా ప్రాంతా లన్నిటికంటె దక్షిణ ప్రాంతంలోనే జానపద సంప్రదాయం ఎక్కువ వున్నప్పటికీ జానపదరూపకాలకు ప్రత్యేకం పెద్ద పరపతి లే దక్కడ. కార్నెల్ విశ్వవిద్యాలయంలో అలెగ్జాండర్ డ్రమ్మండ్ న్యూయార్కు రాష్ట్ర చరిత్రపై ఆధారపడిన అనేక నాటకాలను పోగు చేశాడు. లిన్ రిగ్సు స్వస్థలమైన ఓక్లహామాలోని ఇండియన్, శ్వేతజాతి జానపద పద్ధతులను తన రచనలో గ్రహించాడు. అతని Green Grow the Lilacs (1931) అనే గ్రంథం 'Oklahoma' (1943) అనే రసికజన మనోభిరామమైన సంగీత మోదాంత రూపకానికి ఆధారభూతమైనది. రిగ్సు స్వదేశాభిమానంతో ప్రాచీన జానపద పదకథా

గేయ ప్రబంధాల వాతావరణాన్ని దేశంలో పునఃప్రతిష్ఠితం చెయ్యాలని ఆశించాడు. కాని ఆ వాతావరణం సిద్ధంగానే వున్నది. అయితే నీగ్రో వారిలో వున్నది. వాళ్ళు దక్షిణదేశంలో వున్నా, న్యూయార్కు-హార్లెమ్‌లో వున్నా అది సజీవంగా సమృద్ధిగా వుంటుంది. 1920-29 లలో న్యూయార్కులో వరసగా ఎన్నో నీగ్రో రూపకాలు (1923 లో బయల్దేరిన ఇథియోపియన్ ఆర్ట్ ప్లేయర్సు కొన్ని ప్రదర్శించారు), ఆ వేగోత్సాహాలతో సాగిపోయే నీగ్రో 'సంగీతకాలు' (musicals. ఉదా: 'Chocolate Dandies', 'From Dixie to Broadway - రెండూ 1924 లో) ప్రదర్శింపబడ్డాయి. 1930 నాటికి నీగ్రో వినోదప్రదర్శనా లోక పరాకాష్ఠకు వచ్చినట్లే. మార్కు కొన్నెల్లీ వ్రాసిన The Green Pastures (1930)-అదీ నీగ్రోమతాశయాన్ని గ్రహించి తెల్లవాడు చేసిన కలపన అనే విమర్శకు గురి అయింది. నిజమే మరి-అందులో పాత్రలన్నీ నీగ్రోలే. భాష నీగ్రో వ్యావహారికమే. అంతా నీగ్రోతత్వమే. సింజికాని గెర్షియాలోర్కాగాని పద్యాత్మక జానపదరూపకంగా భావించే దాని కతిసన్నిహితంగా వున్న దది. డ్యూ బోస్, డరోతీ హేవర్డులు వ్రాసిన Porgy (1925) అనే నవలకూడ నీగ్రో జీవితంగురించి శ్వేతజాతీయుని దృష్టితో చిత్రించినదే. అయితే అదీ హేవర్డులచే నాటకీకరింపబడి రంగం మీద రాణించింది. గెర్ష్విన్ సోదరులు దానినే Porgy and Bess (1935) అను పేర జానపదగేయరూపకంగా రూపొందించారు. అదీ మంచి పేరు చేసుకుంది.

ఆనాడు 'ఫెడరల్ థియేటర్' ప్రదర్శనాలలో ఎక్కువ ప్రశస్తికెక్కినవి నీగ్రోలవే. ఆ 'థియేటర్' అల్పాయువైనా మంచిపని చేసింది; పేరుచేసుకుంది. అదీ 'ఫెడరల్ రైటర్స్ ప్రాజెక్టు' లాగే 1935లో నిరుద్యోగ సమస్యనెదుర్కొనడానికి బయల్వెడలిన New Deal W. P. A. అనే సంస్థయొక్క శాఖయే. అక్కడ ఒకవంక రచయితలు కొందరు మార్గదర్శకాలైన పుస్తకాలూ, జానపదాఖ్యాయికలనూ అధిక సంఖ్యలో తయారుచేస్తూవుండగా

'ఫెడరల్ థియేటర్' నటులను, నాటక ప్రయోక్తలను, రంగస్థలకార్మికులను, నాటకకర్తలను రక్షించింది. ఆ 'థియేటర్' ఆధ్వర్యంలోనే ఆర్సన్ వెల్లెస్ అనే నిపుణుడైన యువకప్రయోక్త తన నీగ్రో 'మేక్ బెత్' (1936) ను ఖండాంతరహైషియన్‌రంగప్రకల్పం (Tropical Haitian Setting) తో ప్రదర్శించాడు. తదుపరి ఆ సంస్థను వదిలేసి సొంతంగా 'మెర్క్యురీథియేటర్' నెలకొల్పేడు. 1939 లో చికాగోథియేటర్ ప్రాజెక్టు నీగ్రో 'Swing Mikado' ను ప్రదర్శించింది. అది 'ధుమ్‌ధుమా' గా జరిగింది. అది చూచి కిరాయిసమాజాల వాళ్ళు 'Hot Mikado' లో దానిననుకరించారు. ఫెడరల్ థియేటర్ కృషి మిక్కిలి ప్రశంసనీయమైనది. దాని అనుబంధ సమాజాలు సంయుక్తరాష్ట్రమంతటా అన్ని ప్రాంతాల్లోనూ ప్రదర్శనలిచ్చాయి. అందులో తోలుబొమ్మలాటలు, 'వోడ్విల్' మొదలు షేక్స్పియర్ యూరిపిడీస్ నాటకాలదాక నానారీతులూ వున్నాయి. అప్పుడప్పుడు వాళ్ళ సామాజికులలో అంతవరకూ ఎన్నడూ నాటకశాలకు వచ్చి ప్రదర్శన చూచినపాపాన బోనివా రుండేవారు.

ఆ సమాజాలవారు 'మిరకిల్సు', 'మొరాలిటీస్' (క్రైస్తవగాథలకు, బోధలకు సంబంధించిన రూపకాలు) కూడ ప్రదర్శించారు. వాళ్ళు రేడియో, డాక్యుమెంటరీ సినీమాపద్ధతులను మేళవించి ఒక క్రొత్త రూపకశిల్పాన్ని రూపొందించారు. దానికి 'లివింగ్ న్యూస్‌పేపర్ టెక్నిక్' ('Living Newspaper' technique) అని పేరు. దానిని 'మోడరన్ మొరాలిటీ' గా పరిగణించవచ్చు. అందులో Triple-A Plowed Under అనే నాటకం తమ పంటకు చలామణీఅయ్యే అవకాశం కనిపించని రైతుల గోడు వర్ణింపబడింది. One-Third of a Nation అనే రూపకం అమెరికాలో నివాససౌకర్యదారిద్ర్యాన్ని దుయ్యబట్టింది. అలాగే మిగతా 'లివింగ్‌న్యూస్‌పేపరు' బాపతు లన్నీకూడ రక్తికట్టినవి. అన్నీ అమెరికన్ పెట్టుబడిదారీవిధానానికి బాహాటంగావ్యతిరేకతను ప్రదర్శించాయి. దానితో ఫెడరల్ థియేటర్ థియేటరంతా సాముదాయికోద్యమానికి (Collecti-

vist enterprise) చెందిన దనే అనుమానం ప్రబలింది. 1939 లో సుదీర్ఘచర్చానంతరం జరిగిన కాంగ్రెసుతీర్మానంప్రకారం అంత పనిచేసిన యీ మహాసంస్థ నాలుగేళ్లు తిరగకుండానే హఠాత్తుగా అంతరించి పోయింది.

ఆధునికమైన 'మొరాలిటీ' నాటకంలో దేవుడికీ దయ్యానికీ బదులు వర్గకలహం వస్తువైనది. న్యూయార్కులోని థియేటరు యూనియన్, గ్రూప్ థియేటరు ప్రదర్శించిన సిసలైన మార్క్సిస్టురూపకాలతో కలిసి రాణించింది. గ్రూప్ థియేటరు తృతీయదశకంచివర థియేటర్ గిల్డునుండి పెరిగి పెద్దదయింది. దానిద్వారానే ఓనీల్ తరువాత అంతశక్తిమంతుడైన క్లిఫర్డుఓడెట్సు పేరు మారుమ్రోగింది. అతని Waiting for Lefty, Awake and Sing (రెండూ 1935 లో ప్రదర్శితాలు. రెండోది పూర్వరచన) అనే నాటకాలురెండూ అతడిని ఆర్జవం గల రచయితగా నిరూపించాయి. గ్రూప్ థియేటరు స్టానిస్లవిస్కీనుండి, మాస్కోఆర్ట్ థియేటరునుండి గ్రహించిన సంఘటితనటన (ensemble acting) సంప్రదాయాన్ని ఓడెట్సుకూడా ఆదరించాడు. Waiting for Lefty కొంత పెద్దదైన ఏకాంకికమాత్రమే అయినా పేదప్రజలకోసం వ్రాయబడిన 'మొరాలిటీ' రూపకాల కోక చక్కని తార్కాణ అది. సంఘం (Union) యొక్క సభావేదికయే నాటకరంగస్థలం. గావుకేకల ఉపన్యాసాలూ, గందరగోళపు అరపులూ ఈలలూ సాగేవి. సభ్యుల జీవితాలే ప్రదర్శన వస్తువులు. అందుకుగాను మధ్యమధ్య నాలుగైదు చిన్న సన్నివేశాలు తగిలించేవారు. ఈ విధమైన ప్రచారం మోటుగా వుండేది. ప్రయోగ సూచనలూ 'డిటో'! "అవకాశమున్నచోటల్లా సంగీతాన్ని తగిలించడానికి జంకకు. సామాజికుల ఉద్రేకంకలిగించడాని కది చాలా అవసరం." కాని యీ నాటకమూ ఓడెట్స్ వ్రాసిన మరో ఉత్తమనాటకం లాగే చిత్రంగా నడిచిపోతోంది. నీతిప్రబోధాన్ని నవలకంటె నాటకరంగమే బాగా తట్టుకోగలదు. అయితే దానికి విపరీతమైన రంగస్థలపు హంగు చెయ్యకూడదు.

ఓ డెట్సు అలా చెయ్యడు. అతని ప్రధానాయుధానికి ప్రచారంతో సంబంధం లేనేలేదు. అమెరికన్ వ్యావహారిక భాషపై తన కున్న పరిపూర్ణమైన అధికారమే అతని ఆయుధం. అతని సంవాదాల్లో పిలిస్తే పలుకుతుంది జీవం. అతడు చిత్రించిన పెట్టుబడిదారిరాక్షసులు నేడు కొంత విడ్డూరంగా కనిపిస్తారుగాని అతని కార్మికులు మాత్రం—వాళ్ళపూర్వీకుల గురించి ఎమర్సన్ అన్నట్లు—జీవం చిందే మాటలతో కనిపిస్తారు. ఈ సామాన్యులభాషలోని సజీవమైన నుడికారంపై అధికారంఅమెరికన్ నాటకరంగపు ప్రముఖ ప్రాభవాల్లో ఒకటి.

ఈ నాటకాలతో సరిపోలిస్తే ఆనాడు పద్యనాటకాలకేమీ పరపతి లేదు. వేలస్ స్టీవెన్సు వ్రాసిన 'Carlos among the Candles'-1917లోను, Three Travellers Watch a Sunrise-1920 లోను ప్రదర్శింపబడ్డాయి. కాని అవి ఎప్పుడూ సామాజికుల నధిక సంఖ్యలో ఆకర్షించలేదు. అవి కవిత్వంకాని రూపకం కావు. మేక్స్వెల్ ఎండర్సన్ రచనలుమాత్రం సిసలైన పద్యరూపకాలు. అయితే అతని Winterset (1935) వంటి జవగల రూపకంగూడ పద్యఘటితమైనందు వలన ఎక్కువగాసాధించిన దేమీ లేదు. ఆర్చిబాల్డ్ మేక్లీష్ వ్రాసినపద్య రూపకాల (అందులో కొన్ని 'ఆకాశవాణి' ఆలాపనలు) లో నిర్మాణంలో నిపుణత్వం వుంది, ఉద్దేశంలో ఉదాత్తత వుంది. కాని ఆయన వెనుకటి రూపకాలు కొంచెం డబ్బాగా వుంటాయి. ఇటీవల బైబిలులోని 'జాబ్' కథ ఆధారంగాఆయనవ్రాసిన 'JB' (1958) బ్రాడ్వేలో ప్రదర్శింపబడి ఘన శ్లాఘ లందుకొందికాని ఆయన ఎంత ప్రక్రియాకౌశలం (technical mastery) ప్రదర్శించినా ఏమిటో బోలు (hollow) గా వుంది. అందులో గొప్ప లక్షణా లున్నాయి. కాని అవన్నీ తెచ్చికోలుగా వుంటాయిగాని సహజత్వం కొఱవడింది.

1920 ప్రాంతంలో అమెరికన్ నాటకం 'నాటకరంగ కవిత్వం'-అంటే నాటక కవిత్వంకంటె రంగస్థల కవిత్వంయొక్క స్ఫూర్తి ఎలా

వుంటుందో చూడాలని అన్వేషణసాగించింది. 1930 ప్రాంతంలో ఆవరించిన మాంద్యము, తదనుబంధి భావసంస్థలూ (ideologies) నాటకరంగమంతటా నిండి నిబిడీకృతం చేశాయి. అమెరికన్ భావను కావ్యభావకంటె గూడ స్ఫూర్తిమంతంగా చేశాయి. తదుపరి స్వదేశాభిమానంతో గొడవలు జరిగిన కాలంలోను, ఆ తదుపరి అవ్యవస్థలోను ప్రత్యేకంగా ఏ రంగంలోనూ గట్టి అభినివేశ మేర్పడలేదు. వ్యాపార నాటకరంగం మాత్రం వరసగా అనేక సరస 'సంగీతకాలను' (musical plays) ప్రదర్శించి బ్రిటిషు సంగీతకాలను దిగదుడిచేసింది. కాని మొత్తంమీద వ్యాపారధోరణి నూత్నప్రయోగ దక్షతను మట్టుపెట్టింది. అమిత వ్యయ ప్రయాసలతో కూడిన బ్రాడ్వే ప్రదర్శనలు కూడ అదే చేశాయి. 1930 ప్రాంతంలో 'లిటిల్ థియేటర్లు' 'కమ్యూనిటీ థియేటర్లు' అని క్రొత్త పేరు పెట్టుకుని కొంత పని సాగించాయి. కాస్త ఆదరువు కలిగి వున్నాయి. పసడేనా థియేటర్ (Pasadena Theatre) మొదలైన సంస్థలు లేవడం పగడగా లేచాయి కాని పోటీలు పెట్టి అయినా 'ప్రోవిన్సుటవున్ ప్లేయర్సు' ఉత్సాహము నుద్దీపింపజేయలేకపోయాయి. అయితే ఒక్క ఆశాజనకమైన సూచన కనిపించింది. బ్రాడ్వేతో నిమిత్తం లేకుండా తాటాతూటపు నాటకశాలలలో కూడ ప్రదర్శనలు సాగేవి. వాళ్ళు సాధించిన విజయాల్లో చెప్పుకోదగినవి: డస్ పస్సోస్ **U. S. A.** కు నాటక పరివర్తనము, జాక్ గెల్బర్ వ్రాసిన The Connection అనే నాటకము (ఇది మందుల త్రాగుబోతుల, i.e., drug-addicts మీద పెద్ద దెబ్బ). టెలివిజన్ (Television) నాటక రచనలో సర్వోన్మేషం కలిగించలేకపోయింది. రెండు నాటకాలకు మాత్రం: గోర్ వైడల్ వ్రాసిన Marty అనే హాస్యరూపకం, పేడీ చయేవ్స్కీ వ్రాసిన The Bachelor Party అనే వికారమైన వినోదరూపకం ఎలాగో అవకాశం ఇచ్చింది.

ఆ పిమ్మటి పరిస్థితి. ఓనీల్ కీర్తిశేషుడైపోయాడు. క్లిఫర్డు ఓడెట్సు

కొంతకాలం హాలీవుడ్డుకి జరిగాడు. ఆ మధ్య, అంటే 1955 లో అతని 'Flowering Peach' ఇంకా ఆయన చెప్పవలసింది చాలా వున్న దనిపించినా తన యుద్ధపూర్వపు స్థితి నందుకోలేకపోతున్నాడు. జాన్ స్టీన్ బెక్ నాటకరంగంలో తన నైపుణ్యం ప్రదర్శించాలనుకున్నాడు. కాని ఇంతవరకు సాఫల్యం పొందలేదు. 1929 ప్రాంతంలో Airways, Inc. మొ॥ మంచి మంచి నాటకాలు వ్రాసిన డస్ పసోస్ మళ్ళా నాటకరంగం వైపు మొహం చూపించలేదు. అతని U. S. A. నాటకీకరణం అతడు చేసింది కాదు. అన్యోపజ్ఞము. విలియం సారోయన్ తన My Heart's in the Highlands, The Time of Your Life (1939) అనే రూపకాలతో ఇక రంగ మేలుతా డనిపించాడు కాని తరువాతి రచనలలో ప్రదర్శన విషయకమైన వేగిరపాటు కనిపిస్తుంది. కాని వాటిలో వాస్తవికత గాని, కాల్పనికత గాని ఏదీ పరిపూర్ణంగా వుండదు. మహా మేధావియైన థార్న్టన్ వైల్డర్ పేరు మళ్ళా బహుశా క్రొత్తగా ఆయన మానవ జీవిత సప్తావస్థల (The Seven Ages of Man) గురించి వ్రాస్తున్న ఏకాంకికామాలికతో మారుమ్రోగవచ్చు.

యుద్ధకాలానంతరం ఎక్కువ చర్చలలో ప్రసక్తులైన అమెరికన్ నాటకకర్తల పేర్లు: టెన్నెసీ విలియమ్సు, ఆర్థర్ మిల్లర్. The Glass Managerie (1944), A Streetcar Named Desire (1947) తో యశశ్శిఖరము నందుకొన్నాడు విలియమ్సు. ఇంకా A Cat on a Hot Tin Roof (1954) మొ॥ రూపకాలతో కూడ ఘన విజయం సాధించా డాయన. ఆర్థర్ మిల్లర్ Death of a Salesman (1949) తో లబ్ధప్రతిష్ఠుడయ్యాడు. ఇంకా The Crucible (1953), A View from the Bridge మొ॥ రూపకాలతో ఆయనకీర్తి ఇనుమడించింది. అమెరికన్ సామాజికుల హృదయాలను రసార్ద్రం చేశాయి ఈ రూపకాలు. అందుకు బహుశా ఆ పాత్రలు కొన్ని మరీ సర్వసాధారణ ధోరణికి సన్నిహితంగా చిత్రింపబడడము, సమకాలికాలైన అమెరికన్ సమస్యలు, అవలక్షణాలు వ్యాకులస్థితిలో వ్యక్తం కావడమూ కారణాలు కావచ్చు. వాటితో తాదాత్మ్యం పొందడం ఎంత కష్టమో వాటిని ఎదిరించడమూ అంత కష్టమే. విలియమ్సు పట్టి చచ్చు

రకం నాగరికతగా దిగజారిపోయిన దాక్షిణాత్య కాల్పనికతను నిరూపించాడు - ఒకనాడు దక్షిణ ప్రాంత సుందరి పరమ పవిత్రతకు పెట్టింది పేరు. అలాంటి దామె యిప్పుడు సాంకర్యం స్వీకరిస్తుంది. ప్రేమింపబడి యెరుగని తన కూతురికి నడివయస్సులో ఎలాంటివాడైనా సరే ఒక ప్రేమికుడిని చూసిపెట్టడానికి తాపత్రయపడుతుంది - ఇలాంటి పరిస్థితిని చిత్రించాడు. ఆ నాటకాలు విషాదాత్మకాలే గాని విషాదాంతాలు (Tragedies) కావు. తరువాతి రచనలలో ఆ విషాదం ప్రాతక్రొత్తల మిశ్రమం (modern - Gothic melange) లా వుంటుంది. అందులో ఆయన చేసిన ఊహాలు అకృత్రిమమైనవే కాని బీజోత్పాటనం (Castration) వలె, అక్రమ వ్యభిచారం (incest) వలె, సజాతీయనిధువనం (homosexuality) వలె భయజుగుప్సావహాలు. మిల్లర్ అంతకంటె నిండైన చూపు గలవాడు.అయితే అతడూ ఇబ్బందులలో పడ్డాడు. ఇద్దరివీ ఇటీవలి నాటకాలు ఉపేక్షింపదగినవి కావుగాని అప్రదర్శితాలైన సారోయన్ నాటకాలలా వుంటాయి. అంతకంటె ప్రదర్శన యోగ్యతగలవే అయినా సారోయన్ కృతులవలె అటు గద్యమూ కాక ఇటుపద్యమూ కాక, సాధారణధోరణీకాక సాంకేతికధోరణీకాక ఆ నడుమ ఒక ఘోరదుస్థితిలో దేవిరిస్తూ వుంటాయి. ఈ యిద్దరి గురించి వాళ్ళ చాలమంది తమ సమకాలికులవలె తమ శ్రేయస్సును మించిపోయిన పరిజ్ఞానం గలవారని అనవచ్చు. టి. యస్. ఇలియట్ తన The Confidential Clerk (1954), The Elder Statesman (1958) అనే రూపకాలలో సామాన్య ధోరణికోసం ప్రయత్నిస్తూ వున్నట్టు అది సాధించడంలో తన ప్రాముఖ్యం గోల్పోయినట్లూ కనిపిస్తుంది. విలియమ్స్, మిల్లరు ఇద్దరూ వ్యుత్క్రమంగా గద్యధోరణినుంచి కవితాధోరణివేపు పయనించడానికి ప్రయత్నం చేస్తున్నట్టు కనిపిస్తుంది. అదెలా వుండంటే ఇద్దరూ తమ పెద్ద ప్రయోగాత్మకమైన హంగుతో మధ్యమధ్య మనోజ్ఞ సూక్తులతో పాటు, తమ పాత్రలు ఆడిన మాటను మించిన అర్థగాంభీర్యం గలవని భావించినట్లు తోస్తుంది. యూరపులో వున్న బెకెట్, అయనెస్కో ప్రభృతుల కడ అమెరికాకు పాఠం చెప్పడానికి అవసరమైన సరుకైతే వుందిగాని యీనాటి నాటకరంగం ఇంకా తన ద్వైధీభావం (dilemma) నుండి తేలుకోలేకుండా వుంది.

# 14

## కవిత-విమర్శ

(మొదటి ప్రపంచయుద్ధకాలం నుండి)

ఇ. ఇ. కమ్మింగ్స్ (1894- )
మేరియన్ మూర్ (1887- )
హార్ట్ క్రేన్ (1899-1932 )
స్టీఫెన్ విన్సెంట్ బెనె (1898-1943)
ఆర్చిబాల్డ్ మేక్‌లీష్ (1892- )
రాబిన్సన్ జెఫ్ఫర్స్ (1887- )
ఎజ్రా పౌండ్ (1885- )
టి. యస్. ఇలియట్ (1888- )
ఇర్వింగ్ బేబ్బిట్ (1865-1933 )
పాల్ ఎల్మర్ మోర్ (1864-1937 )
జాన్ క్రోవే రేన్‌సమ్ (1888- )
ఏలెన్ టేట్ (1899- )

రాబర్ట్ పెన్ వారెన్ (1905- )
క్లీంత్ బ్రూక్స్ (1906- )
వేన్ విక్ బ్రూక్స్ (1886- )

సంయుక్తరాష్ట్రాల్లో నవ్యకవిత్వ ప్రారంభదశగురించి చెప్పిన పద కొండో అధ్యాయంలో అది కొంత స్వదేశీయంగాను, కొంత విశ్వ జనీనంగాను ఉన్నట్లు సూచింపబడింది. అమెరికన్ కవికి తన గొంతు (American Voice-box)[1] విప్పి వినిపించాలని ఔత్సుక్యం. అతడు ముందునాటి వాస్తవికతావాదులైన రచయితలవలె ఒక క్రొత్తపదజాలంతో భావవ్యక్తీకరణం చెయ్యడంలోను, క్రొత్త శిల్పవిన్యాసాలతో క్రీడించడ మంటేను ఒక ప్రేరణ పొందినట్లు భావించాడు. కొందరు కవులు, ముఖ్యంగా కార్ల్ సేండ్‌బర్గ్ ప్రభృతులు యుద్ధానంతరకాలంలో కూడ తమ కృతులలో 'అమెరికనుతనం' గురించి ఒత్తి చెప్పేవారు. మిగతాకవు లది తమ రచనలలో ఉన్నట్టే భావించేవారు.

ఈనాడు మరి యీ విషయం పూర్తిగా కాకపోయినా చాలా వరకు అమెరికన్‌కవుల కాసక్తి గొల్పడం మానేసింది. అయితే, 1920 లో విలియమ్ కార్లోస్ విలియమ్స్ ఎజ్రాపౌండును పట్టుకుని "అమెరికన్ కవిత్వానికి పరమశత్రువు" అని ఆక్షేపించాడు. టి. యస్. ఇలియట్‌ను గూడ పౌండుతో జమకట్టేశాడు. ఇలియట్ అప్పటి కారు సంవత్సరా లుగా ఇంగ్లండులో నివసిస్తున్నాడు. ఇక 1927 లో బ్రిటిషు పౌరుడుగా పరిగణింపబడనున్నాడు. విలియమ్స్ ఆక్షేపణ దేనికంటే ఆ యిద్దరూ విజా తీయమైన (ముఖ్యంగా ఫ్రెంచి) ప్రేరణ పొందడానికీ, ఆ వస్తుతత్త్వాన్ని అందులో ప్రవీణులైన వారుద్దేశించిన అర్థాలతో సహా ఆకళించుకోవడా నికీ యూరపుకి జరిగిపోయి అమెరికన్ కవిత్వానికి అపచారం చేశారని.

1. John Ciardi (ed.), Mid-century American Poets (New York, 1950), xii.

అలా కాక విలియమ్సు, సేండ్‌బర్గు ప్రభృతులు స్వదేశంలోనే వుండి దేశీయమైన (విలియమ్సు పేరు పెట్టినట్లు పాశ్చాత్యమాండలికంతో) కవిత్వసృష్టి సాగించారు. 1951 దాక కూడ విలియమ్సు ఇంకా ఆ 'ధర్మత్యాగం' (defection) గురించి పట్టించుకొంటూనే వున్నాడు. తన స్వీయచరిత్రలో—ఇలియట్ వ్రాసిన 'ది వేస్ట్ లేండ్' (The Waste Land-1922) వల్ల జాతీయమైన కవితావ్యవసాయాని కాటంకం కలిగిందనీ, అది మళ్ళా పరిషత్తులపాల బడవలసిన కావ్యమనీ అన్నాడు.

విలియమ్సులో తార్కికతను మించిన కవిత్వసౌభాగ్యం వున్నది. 1920 నాటికే చాలమంది కవులు అతని అమెరికా-యూరపు భేదపరిగణనాన్ని పట్టించుకొనేవారు కారు, 1951 నాటికి అది మరీ పాసినధోరణి అయిపోయింది. సత్యదూరమైపోయింది. కేవలం దేశీయవిషయాలగురించి మాత్రమే పట్టించుకునే దేశీయకవులుగూడ ప్రగతిని ఆపలేకపోయారు. 1917 లో పౌండు విలియమ్సుతో పటుకటుజటిలచటుల పదపటాటోపాన్ని అమెరికన్ కవిత్వలక్షణంగా ఉద్ఘాటించడంలో కొంత సత్యం వున్నది. అంటే వట్టి రచనావైచిత్రిమీది మోజు, సందేహాస్పదమైన ఉపజ్ఞ దాని లక్షణాలని తాత్పర్యం. ఇవే సేండ్‌బర్గు రచనని నీరసింపజేశాయి. ప్రజ్ఞకి సంబంధించినంతమేరకు ఒక్కొక్కప్పుడు విలియమ్సు రచనకుగూడ చెఱుపు చేస్తూ వచ్చాయి. 'మనశ్శిల్పోద్యమం' (Imagist movement) వచ్చినప్పటినుండి అమెరికన్ కవిత్వం చెప్పుకోదగినట్లుగా అంతర్జాతీయతను (లేక దేశీయంకానిదానిని) ప్రతిబింబించుకొంటూ వచ్చింది. తత్సారథులు యూరపియన్ కవిత్వసారథు లనికూడా అనిపించుకొన్నారు. వాళ్ళ రచనలో అమెరికన్‌తనాన్ని పృథక్కరించడ మంటే వాళ్ళు సాధించినదాన్ని అపార్థంచేసుకున్నట్టే. అయితే విలియమ్సు చేసిన విమర్శల్లో విశేషం బొత్తిగా లేకపోలేదు. అవి అందిక పొందిక లేని రేపుమాపుల అక్కఱల గురించి అమెరికనులు చూపే ఆసక్తిని మనకు జ్ఞాపకం చేస్తాయి. ఆధునికమైన అమెరికన్‌కవిత ఆ రెండింటిని చాలామట్టుకు సన్నిహితం చేసిందనే

చెప్పాలి. అందుకే ఆధునికయుగ సాహిత్యానికి అమెరికా చేసిన ఉప కారాల్లో ఇదే గొప్పదని చెప్పాలి. నవలాసాహిత్యానికి చేసినదానికంటే ఇదే గొప్ప దనాలి. ఆ నవలలకు కొన్నిటి కీనాడు చారిత్రకమైన విలువ మాత్రమే మిగుల్తుంది. ఈ యుగంలో భిన్నములైన సాంప్రదాయిక, విప్లవ మార్గాలు రెండింటిగురించి ఆలోచన చెయ్యడం యూరపుకీ తప్పలేదు. అందుచేతనే అమెరికన్ కవిత చెప్పిన సమాధానానికి ఒక ప్రత్యేకమైన శక్తి, సందర్భశుద్ధి వున్నవి. కవితలోను, విమర్శలోను అమెరికనులు ప్రద ర్శించిన నిష్ఠ ఆంగ్లేయుల పాండిత్యమమకారానికి ప్రతిస్పర్ధి అయింది. పద జాలంతో, పద్యరీతులతో ప్రయోగం చెయ్యడానికి అమెరికనులు చూపిన సుముఖత్వం ఒకబలమైన పునాదికోసం తపనపడే అమెరికనుల కెంత ముఖ్య మైనదో మిగతా నవ్యకవితోద్యమానికి అంత ముఖ్యమైనది.

ఆధునిక-అమెరికన్ కవితలో వైరుధ్య మన్నది నిజానికి అమెరికా యూరపులమధ్య కాదు,నవ్యతకీ ప్రాచీనతకీ, పరిణామానికీ స్తబ్ధతకూ మధ్య వున్నది.ఆ రెండూ భిన్నధ్రువాలైనా వాటి కొక అనుబంధంవున్నది.'అమెరి కన్ కంఠం, లేక విశిష్టవ్యవహారధోరణి' (Voice-box) అన్నది చాలా ముందుగానే సాధింపబడింది. అది అమెరికనుల కొక ప్రముఖవిజయమే. అమెరికన్ వ్యవస్థలో చక్కగా కుదురుకొన్నది. పద్యరీతు లన్నిటిలోను దాని ఫలితాలు కనిపిస్తాయి. అమెరికనుల కొక ప్రత్యేకమైన, జాతీయ మైన పలుకుబడి (Idiom) వున్నట్లు గుర్తింపబడి ఆమోదింపబడి కొస్త ముందునాటి ఆత్మజ్ఞతతో అనుసరింపబడింది. ఉదాహరణ కీ లఘుకృతి - లూయిస్ బోగన్ వ్రాసిన 'Several voices out of a cloud' చూడండి :

"Come, drunks and drug-takers; come,
perverts unnerved!
Receive the laurel, given though late, on
merit; to whom and wherever deserved.

Parochial punks, trimmers, nice people,
joiners true-blue,
Get the hell out of the way of the laurel.
It is deathless. And it isn't for you."

కోరి పాఠకుడిని చకితుణ్ణి చెయ్యాలనే వుద్దేశంతో ఈ పద్యంలో వ్యావహారికత అతిరిక్తంగా ప్రపంచింపబడింది. కాని మిగతా పద్యాల్లో ఆ ధోరణి మోతాదుగా ప్రయోజనాత్మకంగా వున్న సందర్భాలనేకం వున్నాయి. మిస్ బోగన్ పద్యం 1938 లో ప్రచురింపబడింది. అప్పటికి డబ్ల్యు. హెచ్. ఆడెన్ చేసిన సంవాదరూపమైన పద్యరచన చూస్తే ఒక్కడైనా ఆంగ్లకవికూడ ఒక స్వీయమైన, విశిష్టమైన వ్యవహారధోరణి ప్రదర్శించాడని తెలుస్తుంది. అయితే పిమ్మట ఆయన అమెరికాకు వెళ్ళి, అమెరికన్ పౌరుడుగా స్థిరపడ్డాక అమెరికన్ నాగరికభాష యాసబాసల అనుబంధానికి సులువుగా అలవడిపోయాడు.

అమెరికన్ కవులు పెద్దపెట్టున మరికొన్ని నూత్నకల్పనలు చేశారు. అందులో ఇ. ఇ. కమ్మింగ్స్ చేసినవి చాలా పసందుగా వుంటాయి. అతడిక చేయదలచుకొన్న ప్రయోగాలు, అతని దృక్పథమూ ముందుగా ఆత్మోదంతరూపమైన అతని మొదటి కృతి The Enormous Room (గద్యము, 1922) లో సూచింపబడ్డాయి. అందులో ప్రామాణ్యం యెడల తనకున్న అవజ్ఞను, వ్యక్తియెడల తనకున్న భక్తిని అతడు అసాధారణ విశేషణాలతో, గట్టి క్రియాపదాలతో, లాక్షణికమైన స్థానవ్యత్యయాలతో నిండిన ఒక ప్రత్యేకమైన శైలిలో వ్యక్తంచేశాడు:

"To the left and right through lean and
oblongs of stained glass burst dirty
burglars of moonlight.
I will get upon the soonness of the train
and ride into the now of Paris."

'Tulips and Chimneys' (1923) అనే అతని మొట్ట మొదటి పద్యకావ్యంలో కాల్పనికతయొక్క అవ్యవస్థ సద్యస్ఫురసంగా, శక్తిమంతంగా చిత్రింపబడింది.

అతడు కొందరి హీనదశ నెంత ఘనంగా నిశితవిమర్శకు గురిచేశాడో అంత ఘనంగాను వ్యక్తియొక్క ప్రణయాదికానందస్థితులను శ్లాఘించాడు. ఆ కొందరిని ఒక 'మంద' అన్నట్లుగా 'most people' అని వ్యవహరించాడు:

"Most people have less in common with ourselves than the square root of minus one. You and I are human beings; most people are snobs."

[చాలామందికీ మనకీ సామ్యం 'మైనస్' ఒకటియొక్క వర్గమూలం కంటె తక్కువగా వుంటుంది. నువ్వూ, నేనూ మానవులం. మందిలోని మనుష్యులు పట్టి అనాగరకులు.]

ఆయన కాలమానకములుగా కొన్ని లేఖనశిల్పవిన్యాసాలనుగూడా కనిపెట్టేడు:

pho
nographisrunn
ingd o w, n phonograph
stopS.

ఒక ఊహాకల్పిత సంవాదకునిచే (imaginary interlocutor) "Mr. Lowercase Highbrow" అని సంబోధింపబడిన ఆయన 'e. e. cummings' అయిపోయినాడు. తరువాతి పద్య సంపుటాలలోగూడ (XLI Poems, 1925; Vi Va, 1931; No Thanks, 1935; I X I, 1944) వాక్య, లేఖన విన్యాసాలతో గారడీ కొనసాగించేడు. ప్రణయతత్వాన్ని గొప్పగా ఆదరిస్తూ వచ్చాడు. అతని దృష్టిలో జీవితమంటే వివృతదర్శనపరంపర. ఎంత

అందమైన సందేహాన్ని ప్రకటిస్తే అంత చక్కని సమాధానా న్నిస్తుంది. ఆ పరంపరనే ఆయన 'అభివృద్ధి' అంటాడు. ఇటీవలి విమర్శకులు కమ్మింగ్స్ కవిత్వంలో శిల్పచాతుర్యం ఎంత వున్నా అస లభివృద్ధి అన్న దేపాటి వున్న దని ప్రశ్నిస్తున్నారు. అప్పుడే పాతికేండ్లు గడచిపోయినా ఇప్పటికీ అది స్వచ్ఛందమైన వ్యక్తిత్వంగురించి సరళమైన సందేశాన్ని అందజేస్తూవుంది. ఆ మాటలు కాస్త చిక్కగా వున్నట్టు కనిపిస్తాయి గాని ఆ క్లేశం బాహిరమైనదిమాత్రమే. ఆ కవిత్వంలో గాంభీర్యంకంటె అతనిలో లాగే వినోదజనకత్వలక్షణం ఎక్కువగా వుంటుంది. ఈ ప్రపంచంలోని 'మజా' గురించి అతనికన్న 'రఖ్ము'గా చెప్పినవారు లేరు:

"Anyone lived in a pretty how town
(With up so floating many bells down)
Spring summer autumn winter
He sang his didn't he danced his did."

ఇది ఒక చాదస్తమే అయినా మనోజ్ఞంగా, ఆమోదయోగ్యంగా వుంది. కమ్మింగ్స్ వుద్దేశాలు 1920 ప్రాంతంలో పాతుకుపోయేవే అయినా ఆ దశాబ్దినాటి హార్దమార్దవంనుండి ఉట్టిపడే నిబ్బరాన్ని, పూచీలేని మనస్తత్వాన్ని పురోగమింపజేయగలిగా డాయన. ఆధునికశిల్పకళకు అమెరికన్ శిల్పి అలెగ్జాండర్ కేల్డర్ ఎలాంటివాడో ఆధునికకవిత్వానికి కమ్మింగ్స్ అలాంటివాడు. ఇద్దరూ విపరీతంగా కనిపించా లని ప్రయత్నం చేసినవారు కారు. ఇద్దరూ హాస్యభాజనులుగా, అనుభవశూన్యులుగా ఆక్షేపణకు గురి అయ్యారు. అయితే ఇద్దరూ తమ పరికరాలతో తమతమ కళలను వినోదపు రంకుల రాట్నాలుగా రాణింపజేశారు.

మేరియన్ మూర్ మరో మహత్తరమైన ఉపజ్ఞ గల కవయిత్రి. ఆమెకవిత స్వతంత్రంగా, స్త్రీత్వగర్భితంగా, నిదానంగా వుంటుంది. 'స్వతంత్రత' ననుసరించి వచ్చే తొందరపాటు, ఉద్రేకాలు, దోషాలు, తక్కిన అవలక్షణా లేవీ లేకుండా ఆమె తన దారిని తాను పోతుంది.

ఆమె లఘుకృతులు సుమారు డెబ్బై కలిసి ఒక సంపుటంగా (Collected Poems) 1951 లో ప్రచురింపబడ్డాయి. మరికొన్ని వ్రాసింది కాని వాటి నిందులో చేర్చలేదు. ఇందులో పద్యాలన్నిటా ఒక తూకము, ఒక సమత, పాదాల్లో మాత్రాగణనియతి వున్నాయి. ప్రాసలు (Rhymes) తొలగింపబడ్డాయి. అంత్యప్రాసలు మాత్రం పాటింపబడ్డాయి. ఒక్కొక్కప్పుడు పదమధ్యంలో కూడ విరిచి పాటించడం కద్దు :

> "Priorities were cradled in this region not
> noted for humility; spot
> That has high-singing frogs, cotton-mouth
> snakes and cotton-fields..."

భావానికి వ్యాప్తి, బోధ వరసగా పెంకులమీద చిత్రించిన జిలుగులా వుంటుంది. అరుదైనవీ, అందరూ అనుకోనివీ అయిన విషయాలనే ఆమె గ్రహిస్తుంది. "Illustrated London News" మొదలైన వాటినుండి గ్రహింపబడిన వాచీలు, నగలు, జంతువులు మొ॥ విషయాలతో నిండిన కవుల చిత్తుపుస్తకంలా వుంటుంది ఆమెసరంజామా. తనకు వివిధవిషయభావదర్శనాసక్తి ఎక్కువని ఆమెయే చెప్పింది. యథార్థంగా 18వ శతాబ్ది జీవశాస్త్రసంబంధమైన చెక్కడాలవలె ఆమెపరిశీలనం చక్కగా నిక్కచ్చిగా వుంటుంది. ఆమె వ్రాసిన 'The Jerboa'నుండి ఈ పద్యాన్ని చూడండి:

> By fifths and sevenths,
> in leaps of two lengths,
> like the un-even notes
> of the Bedouin flute, it stops its gleaning on
> little wheel castors, and makes fern seed
> foot-prints with kangaroo speed.

ఒక ఉష్ట్రపక్షి (Ostrich)ని గాని ఏనుగునిగాని, ఇంత చతురంగానూ చిత్రించగలదు. ఆమె అర్థాన్ని సంకుచితపరచి తన ఆకరాల (Sources) నుండి సూటిగా ఉదాహరణ లివ్వడంలో ఒక సంకరమైన రచనాపద్ధతి నవలంబిస్తుంది కాబట్టి ఆమెపద్యాల నర్థంచేసుకోవాలంటే ఆమె 'నోట్సు' ఉపకరిస్తుంది. ఆమెరచనా పద్ధతిని పరిశీలిస్తే సేకరించిన విషయం ఆమెకు బాగా వంటబట్టలేదనిపిస్తుందని వాదించడాని కవకాశం వుంది. కాని ఇది యథార్థంకాదు. సామయికమైన (Conventional) భావగీతం (**Lyric**) అంతమయ్యేచోట ఆరంభిస్తుం దామె కవిత్వం. నిక్కచ్చిగా వుండే నిర్వచనాలతోలాగ అర్థసౌలభ్యం అంటే ఆమెకు పడదు. ఆమె వస్తువులన్నీ సున్నితములైనవి, విజాతీయమైనవి. వాటియెడ ఆమె పడే మమకారం చీమ, ఇసుకరేణువు, కలవింకగ్రుడ్డులంటే విట్మన్ పొందిన సంతోషంలాంటిది. అయితే అది ఆమె తాను చేసుకున్న వ్యాఖ్యానంలోనుంచి వ్యక్తమైనదే. ఈమె కవితను సాధారణంగా వేలెస్ స్టీవెన్సుకవితతో సరిపోలుస్తారు. రెండిటా సుగమత్వం అనే వ్రతం చెడ్డా ఫలం దక్కుతుంది. ఈమె అసాధారణవిషయాలను, వివరాలను ఏరి కోరి ఎన్నుకుంటుంది కాని సామర్థ్యంతో ఎన్నుకుంటుంది. వాటిని వట్టి పైపై జిలుగుపనికికాక అంతర్భావసారమ్యమైన వస్తువుగా పరిణతి పొందడానికి తగినట్లు వాడుకుంటుంది. **'Those Various Scalpets'** అనే కృతిలో ఆమె వివరాల పట్టికలు తయారుచేసి చివరికి వాటి విలువేమిటని పృచ్ఛిస్తుంది ('ప్యూరిటన్' కవి ఎడ్వర్డు టెయ్లర్‌లాగ). విదగ్ధుడైన పాఠకు డామె కృతులనుండి చాలా గ్రహించగలడు. టి. యస్. ఇలియట్, విలియం కార్లోస్ విలియమ్సు, కమ్మింగ్సు, స్టీవెన్సు మొదలైన అమెరికన్ కవులకే గాక, ఆంగ్లకవులకుగూడ ఆమె కవిత ఒక నిధినిక్షేపంవంటిది (**'A treasure which all future English Poets will be able to plunder.'—W. H. Auden.**)

హార్ట్ క్రేన్ (పాపం, ఈయనజీవితం ముప్ఫయిమూడేళ్ళకే ఆత్మ

హత్యతో ముగిసిపోయింది) మేరియన్ మూర్ కంటె గూడ కొన్ని విష యాల్లో పెద్దపెద్ద కలలు గన్నాడు. ఆమె మొట్టమొదటి లఘుకృతి ఆమె 34 వ ఏట 1921 లో లండనులో ప్రచురితమైనది. అందులో సగం వయస్సులోనే, అంటే 1916 లో క్రేన్ వ్రాసిన కావ్యఖండికను మార్గరెట్ ఎండర్సన్ తన 'లిటిల్ రెవ్యూ'కి స్వీకరించింది. 1921 నాటికే అత డనుభవశాలియైన కవి అయ్యాడు. 1922 లో ఇలియట్ గారి **'The Waste Land'** వచ్చింది. అప్పటికే క్రేన్ కి ఇలియట్, ఎజ్రాపౌండుల కృతులతో పరిచయం ఏర్పడింది. **The Waste Land** ఆనాటి యితరకవులనువలెనే అతన్నిగూడ కదిలించింది. అయితే డబ్ల్యు. సి. విలియమ్స్ కనిపించినట్లే ఆ కావ్య మతనికిగూడ కొంత అసంతృప్తిని కలిగించింది. అది గొప్ప గ్రంథమనీ, ఒక విదగ్ధకవిప్రకాండునికిమాత్రమే సాధ్యపడే ప్రామాణికదృక్పథం గలదనీ అతనికి తెలుసు. కాని యీ యిరవయ్యోశతాబ్దికిగాని, అమెరికాదేశానికిగాని మంచి పరిస్థితు లేర్పడతా యనే ఆశ లేదనే ఆ గ్రంథకర్త దృక్పథానికి చాలా విచారించాడు క్రేన్. క్రేను తా నంతకంటె రూఢియైన సంతోషాత్మకమైన గమ్యాన్ని చేరుకోగలడు. అతని **White Buildings** (1926) లోని ఖండకావ్యా లత డెంత నిదానంతో, ఆశతో ఆ గమ్యా న్నన్వేషిస్తూవుండినదీ వ్యక్తం చేస్తాయి. తన విశ్వాసమహాప్రబంధమైన **The Bridge** (1930) లో సునిశ్చితంగా గమ్యాన్ని చేరుకోవడానికి ప్రయత్నించాడు. న్యూయార్కు లోని 'ఈస్టురివర్' మీద రోబ్‌లింగ్సు అతిసుందరంగా నిర్మించిన బ్రూక్లిన్ బ్రిడ్జి ఆ కావ్యంలోని ప్రధానసంకేతం. క్రేనుకిముందు,ఆ వంతెన పూర్తికాక ముందు విట్మన్ 'Crossing Brooklyn Ferry'గురించి అద్భుతంగా వ్రాసిపోయాడు. అది ఏ వందసంవత్సరాల తరువాతనోవున్న మనుషులతో ఆనందం పంచుకుని అనుభవించడంలాంటి దన్నాడు. 1929 లో క్రేన్ దానిగురించి వ్రాస్తూ అమెరికాలోని అసాధ్యశక్తులను సంఘటితపరిచి ఒక విశ్వదృశ్యంలోనికి సమన్వయంచేసినదానిగా అభివర్ణించాడు. ఆ కావ్యంలో

ప్రధానకథానాయకుడు విట్మన్. ఆ వంతెన క్రేన్ దృష్టిలో 'Cape Hatteras' వంటిది, (ఆ కావ్యంలో ఆపేరుతో ఒక సర్గ వుంది). ఆ నవ్యభూఖండానికి యాత్రికులను రవాణాచేసిన ఆ మహాసాగరమన్నా క్రేన్ కి విట్మన్ లాగే అపరిమితమైన ఆకర్షణ. అయితే అతని నాటి అమెరికా విట్మన్ నాటి అమెరికావలె లేదు. 'యంత్రయుగం' వచ్చేసింది. చెట్లూ చేమలూ గుళ్ళూ గోపురాలూ మొదలైన చిరంతనమానవపరిచితవస్తువుల లాగే కవిత్వం యంత్రాన్నికూడా తనలో ఇముడ్చుకోలేకపోతే కవిత్వం తన సమకాలికమైన విధిని సమగ్రంగా నిర్వహించినట్టు కాదు. అందుకే అమెరికాయొక్క ప్రాతక్రొత్తల మేళవింపులో ఆనందాన్ని అన్వేషించాడు క్రేన్. (ఆ ప్రాతకాలంసాయంకాలపు టాకాశంలో జలయంత్రపు స్తంభాలు బాటలేర్పరచిన కాలం; దూరంగా పెద్దపెద్ద విద్యుదగారాల క్రింద కనులు పొడుచుకుంటే కాని మినుకుమినుకుల తారకలు కానరాని కాలం. ఇక నవీనయుగమంటేనో రైటుసోదరులు ఆకాశాన్నాక్రమించిన కాలం.) అమెరికాలోని యితరవస్తువులతోపాటు విద్యుద్యంత్రవిమానాదులుకూడా కలిసిపోవాలి. అప్పుడూ క్రేనుకి సంతృప్తి. విలియమ్ కార్లోస్ విలియమ్సు వచనంలో చేసిన ఒక ప్రయోగాత్మకరచనయైన **In the American Grain** (1925) ద్వారా క్రేన్ కొన్ని వస్తువులను గ్రహించి వుంటాడు. 1 క్రేన్ వేసుకున్న పథకంలో కొలంబస్, కోర్టేస్ (**Cortes**),

---

1. 21-11-1926 తేదీన వ్రాసిన ఒక ఉత్తరంలో క్రేన్ విలియమ్సు పుస్తకాన్ని ఒకవంక ప్రశంసిస్తూనే మాటవరస కిలా అన్నాడు: "నా అభిమానేతివృత్తాని కతి సన్నిహితమైన పుస్తకం చదవడంవల్ల కొన్ని భ్రాంతులు కలగడాని కవకాశం వుంది నాకు. అలాంటి భ్రాంతులు నా మార్గాని కడ్డురావనే ధీమాకలిగేదాకా ఆ పుస్తకాన్ని చదవకుండా అట్టే పెడతాను" (**The letters of Hart Crane, 1916-1932: New York, 1952, 277-8**)

పొకహాంటాస్ (**Pocahontas**), రిప్ వాన్ వింకిల్, పో, మెల్విల్ వున్నారు. వాళ్ళను నవీనయుగాన్ని ఏకసక్కెం చెయ్యడంకోసం కాదు, అమెరికన్ వారసత్వాన్ని, గతంయొక్క ప్రయోజనాన్ని నిరూపించడం కోసం గ్రహించాడు క్రేన్.

**'The Bridge'** నిజంగా గొప్ప కావ్యం. అయితే అందులో ఏకరూపత కొంత కొరవడింది. పలుతావుల రచన అందంగానే వుంటుందికాని తృప్తి కలిగించదు. అమెరికన్ మూలపదార్థాల (**American elements**) సంఘటన అసదృశమైనది. అన్నీ సుదృఢములైన లాంఛనాలు. స్థలాంతర పరిణామానికి లొంగనివి. అయితే అవి వివిధవర్గాలకు చెందినవి. క్రేన్ యొక్క విజయోత్సాహదోహలమైన వివేకం, అతని నిస్పృహనూ, ఓదార్పు కలవిగాని ఒంటరితనాన్నీ క్రమ్మివేస్తుంది. **'Cutty Sark'** అనే సర్గలో క్రేన్ ధ్వజాల (**Pennants**) గురించి, పరవలయాల (**Parabolas**) గురించి, చెరిగిపోని చిన్నచిన్న కలల పరంపరగురించి, జమీందారుల ప్రణయ కలాపయశశ్చంద్రికలగురించి పగడగా వ్రాశాడు. కాని **'The Tunnel'** అనేసర్గలో నగరంక్రింది సొరంగపు మార్గంలో ఒక ఘోరమైన గోతిపాటుగురించి చెబుతూ పో (**Poe**) ని ఉద్దేశించి ఇలా అంటాడు:

> **"Why do I often meet your visage here,**
> **Your eyes like agate lanterns-on and on**
> **Below the toothpaste and the dandruff ads?"**

[క్రేన్ విట్మన్‌నిగూడా ఆవాహనచేసినా, అతని రచనలో నిర్వాసుడై దయ్యాలు వెంటబడినట్లు తిరిగే పోస్వరూపమే ఎక్కువగా గోచరిస్తుంది. అందులో విద్యుద్యంత్రాలుచేసే శబ్దం భూతాల జీవనాడిలా వినిపిస్తుంది. హేరీక్రాస్బీ అనే దేశాంతరగతుడిలా వైమానికుడు తన విమానపతనాన్ని తానే కోరడం కూడా కనిపిస్తుంది. క్రేన్ **"To the Cloud Juggler"** అనే తన చివరిరోజుల కృతులలో ఒకదానిలో హేరీక్రాస్బీనుద్దేశించి "గతకాలపు పరిహాసాలను ప్రదర్శించే డంబాచారాలను బహి

రంగ పరచం" అంటాడు. ఆ చివరికృతులు, **'Caribbean'** మొదలైనవి **'The Bridge'** లోని కొన్ని సర్గలలాగ చాలా బాగుంటాయి. కాని పాపం) తద్రచనానంతరం క్రేన్ న్యూయార్కుకి పోతూవున్న ఒక ఓడ నుంచి దుమికి చనిపోయాడు. 'ఇకారస్' (**Icarus**) లా ఇతడు చేసిన పనికూడ ముందుగానే విధినిర్ణీతమైనట్లు తోస్తుంది.

మొత్తానికి అమెరికనుకవులు ఆధునికజీవితగమనంతో రాజీపడే దృక్పథంకంటె అందలి అవ్యవస్థను చిత్రించే వైఖరినే ఎక్కువగా ప్రదర్శించడాని కిష్టగించారని చెప్పవలసివుంది. క్రేన్ వలె అమెరికా గతాన్ని వినియోగించుకున్నవారిలో ముఖ్యుడు స్టీఫెన్ విన్సెంట్ బెనె. 'అంతః కలహం' (**Civil War**) గురించి ఆయన వ్రాసిన సుదీర్ఘకథనాత్మక కావ్యం **'John Brown's Body'** (1928) అనేది ప్రజల్లో మంచిపేరు చేసుకుంది. సులభగమ్యలైన వ్యక్తులతో, సన్నివేశాలతో కలిసిన అమెరికన్ వారసత్వాని కొక ప్రామాణికత, సార్థకత ఎలా ఏర్పడగలవో నిరూపించిందా కావ్యం. 'మందకొడికాలం' (**Depression years**) లో 'సాంఘిక నిరసన' (**Social Protest**) మన్నది అమెరికాకొక నవీనదృక్పథంగా వచ్చిచేరింది. ఈ శతాబ్ది మూడవదశకంలో ఎక్కువకాలం యూరపులో గడిపిన ఆర్చిబాల్డ్ మేక్‌లీష్ 1932 లో తన **'Conquistador'** అనే పద్యకథాకావ్యంతో అమెరికాకు తిరిగివచ్చాడు. అది అజ్టెక్లమీద కోర్టేలు జరిపిన యుద్ధం (**'Cortes' war against the Aztecs'**) గురించినది. అత డాదశాబ్దిజీవనసౌరభాన్ని గుబాళింపజేస్తూ కొన్ని పద్య రూపకాలు రచించాడు. కాని 1939 లో వచ్చిన అతని **'America was Promises'** రచనలో ఆ ముందునాటి పస లేదు. ప్రజాప్రబోధాత్మకమైన వట్టి ఊకదంపుడుఉపన్యాసధోరణిలోకి దిగజారిందా పద్యరచన. దానికి తగినట్లే మరో అడుగు ముందుకువేసి 1940 లో **'The Irresponsibles'** ద్వారా తన సాహితీబంధువుల నాక్షేపిస్తూ వారి నందరినీ 'ప్రజాస్వామికం' కోసం దన్నుగా నిలబడాలని ప్రబోధించాడు.

ఆ ప్రబోధంతో సరిపోలిస్తే రాబిన్సన్ జెఫర్స్ యొక్క కాలిఫోర్నియన్ శూన్యవాదమే మెరుగనిపిస్తుంది. ఆయన మానవుల నెంత ద్వేషిస్తాడో జంతువులనూ, సముద్రాన్నీ అంత ప్రేమిస్తాడు. తన పడమటికోనలో కూచుని ఒకవిధమైన భవిష్యత్తుకోసం చూస్తూ భయానకభావస్మరణీయంగా ఇలా వ్రాస్తాడు:

"The cities gone down, the people fewer and
the hawks more numerous,
The rivers mouth to source pure; when the
two-footed
Mammal, being someways one of the nobler
animals, regains
The dignity of room, the value of rareness."

[పట్టణాలు మట్టికొట్టుకుపోతాయి; జనాభా తరిగిపోతుంది; ఎక్కడ చూసినా గద్దలూ డేగలే; నదులు పొడమిన చోటికి మళ్ళిపోతాయి; అప్పుడు కొంత కొంత ఉదారజంతువులలో ఒకడైన ద్విపాదపశువు అవకాశపు ఔన్నత్యాన్ని, సకృత్త్వపు విలువనూ తిరిగి పొందుతాడు.]

జెఫర్సు కవిత తఱచు ప్రాచీనవస్తువులమీద నే ఆధారపడుతుంది. తమ జాతిలో పౌరాణికమైన స్వామగ్రి కెప్పుడూ పరిణామం లేదు సరికదా ఉన్నంతమట్టు కది తమనుండి ఊడ్చిపెట్టుకుపోయిం దని అంతకంటె ఆదర్శమూ, సహజమూ అయిన సౌందర్యాన్ని మరీ పురాతనవస్తు సంచయంనుండి రాబట్టుకొన్నాడు జెఫర్సు.

ఇలా సనాతనమైన విజాతీయమైన ప్రమాణాలమీద అమెరికన్ కవుల కాసక్తి యేర్పడడానికి కారణభూతులు ఎజ్రాపౌండు, టి. యస్. ఇలియట్. వాళ్ళు దేశద్రిమ్మరి నవకవితాప్రవక్తలు. నాగరికతపరిధిలో వుండి ఉత్తమకవితామార్గాల నన్వేషించే నవయువకులు. యూరపు యొక్క ఆవరణలకు లోబడనివారు. సారస్వత సామ్రాజ్యంలో పౌర

సత్వం సంపాదించినవారు. యూరపియను రంగంమీద ఇలియట్‌కంటె కొన్ని సంవత్సరాలకు ముందే అవతరించాడు పౌండు. అలా ముందువాడు కావడంవల్ల నైతేనేమి స్వభావవైలక్షణ్యం కారణంగా నైతేనేమి అతని వ్యాసంగపుధోరణి వేరు. అతడు పాల్గొన్న 'యథావద్భావచిత్రణవాదం' **(Imagism)**, దానికంటె ఏమంత విలక్షణంగాని 'ఆవర్తవాదం' **(Vorticism)** అనే ఉద్యమాలలో కొంత 'విగ్రహవిధ్వంసకధోరణి' అంటే సంప్రదాయాలమీద తిరుగుబాటుధోరణి కనిపిస్తుంది. అత డా ధోరణిని పూర్తిగా ఎప్పుడూ అతిశయించిపోలేదు. అతడు మొదట్లో బ్రౌనింగ్, విల్లన్‌ల రచనలనుండి, యీట్సు తొలిరచనలనుండి కొంత కొంత గ్రహించాడు. రచనాస్వభావాన్నిబట్టి వీరు ఇలియట్ తరానికి కాస్త పూర్వపుతరంవా రనిపించుకుంటారు. పౌండు వక్కాణించినట్లు ఇలియట్ ప్రాచీన సాహిత్యాన్ని బాగా ఆకళించుకున్నవాడైనా, పరమాధునికుడిక్రింద లెక్క. ప్రథమ ప్రపంచసంగ్రామ ప్రారంభదశలో పౌండుకీ ఇలియట్‌కీ పరస్పర పరిచయం ఏర్పడింది. అప్పటి కింకా ఇలియట్ విద్యావ్యాసంగం పూర్తికాలేదు. అతడు స్వదేశస్థుడైన పౌండు నుండి చాలా గ్రహించవలసివుంది. అతడు తన **'The Waste Land'** ను పౌండు కంకితమివ్వడం వట్టి ఉపచారప్రాయమైన మర్యాద కాదు. అతడు పౌండు మొదట్లో చేసిన అన్వేషణకు చాలా ఋణపడివున్నాడు. **'The Waste Land'** రచన సాగుతూ వుండగానే దాన్ని చక్కగా పరిశీలించాడు పౌండు.

యుద్ధం ముగిసేవేళ కా యిద్దరూ 'అనిబద్ధపద్యరచన' **(Verse Libre), Amygism, Lee Masterism,** సర్వసాధారణమైపోయిన స్వైరప్రవృత్తి నుతిమించి రాగాన పడ్డాయని గ్రహించారు, ఆ ధోరణి నరికట్టాలని సంకల్పించారు. ఫలితంగా 1920లో ఇలియట్ రెండవ పద్యసంపుటి, పౌండు **'H. S. Mauberley'** వచ్చాయి. తరువాత వారి మార్గాలు వేరుపడిపోయాయి.

1917 లో 'అనిబద్ధపద్యరచన' గురించి వ్రాస్తూ "స్వేచ్ఛ అన్నది ఒక కృతకమైన నిర్బంధం తనవెనుక నున్నట్లు కనబడితేనే అది నిజమైన స్వేచ్ఛ అవుతుంది" అన్నాడు ఇలియట్.

1920 నాటి మీద ఉదాహరింపబడిన వారి రచనలు రెండింటికీ, 'The Waste Land' కీ ఒక ప్రాముఖ్యం వుంది. అవి ఎడ్గార్ లీ మాస్టర్స్ ధోరణికీ, సాధారణ స్వైరప్రవృత్తికీ దూరంగా వుంటాయి. వాటిలో తేలిక పరిహాసమే కాదు అగాధభావగాంభీర్యంకూడా వున్నది. తమ సమకాలిక స్వదేశరచయితలు చాలామంది యుద్ధాన్ని ఒక అవమానంగా మాత్రమే పరిగణిస్తే యీ కవు లిద్దరూ దాని విషాదబీభత్సస్ఫూర్తిని బాగా గ్రహించి యీ కావ్యాల్లో వ్యక్తంచేశారు. పౌండూ, ఇలియట్టూ యూరపు గతకాలంయొక్క విలక్షణమైన అంతశ్శృతులకు 1920 ప్రాంతపు త్వరాన్వితాలూ విప్రకీర్ణాలూ అయిన ఊర్ధ్వశ్రుతులకూ గల భేదాన్ని వ్యంగ్యంగా 'అల్పాక్షరముల ననల్పార్థరచన' చేసి చూపించారు. వాళ్ళు ఇందుకుగాను ఇతర గ్రంథాలనుండి ఉదాహరణ లివ్వడం, ఒక్కొ కప్పు డితర భాషల నాశ్రయించడంకూడా చేశారు. తత్ఫలితంగా వాళ్ళ రచనలో వార్తాంతరాపేక్ష, అస్పష్టత, గూఢత వున్నాయనే ఆక్షేపణ వచ్చింది. అందులో చాలామంది చదువరుల కందుబాటులో లేనంతగా యూరపు సాహిత్య పరిజ్ఞానం విస్తారంగా వున్నది. అయితే అది వట్టి ఆడంబరప్రదర్శన మనుకోరాదు. మరి యేమంటే ఆ కవుల దృష్టిలో సమన్వత అంటే వర్తమానంతో గతవిషయభావనను సమగ్రంగా సమ శ్రుతిలో లగించడమే.. అందుకే అలా ఇతర కవులనుండి, యుగాలనుండి, భాషలనుండి విషయాన్ని గ్రహించడం ఇలియట్ విషయంలో ఎక్కువ, పౌండు విషయంలో తక్కువ సమంజస మనిపించుకుంటుంది.

అయితే పౌండు అన్నట్టుగానే, తదుపరి ఇద్దరి రస్తాలూ వేరయ్యాయి. 1920 లో ఇలియట్ 'The Sacred Wood' అనే

వ్యాససంపుటి ప్రకటించాడు. 'సంప్రదాయము - వైయక్తికకౌశలము' (**Tradition and Individual Talent** అనే పేరుమోసిన అతని వ్యాసం అందులో వున్నది. ఆ యేడే పౌండుకూడ **'Instigations'** అనే వ్యాససంపుటి ప్రకటించాడు. పుస్తకాల పేరులలోవున్న భేదం స్వభావోచితంగావున్నది. అసలు పరమపావనమైన దంటూ ఏమీలేదని పౌండు దృష్టి. ఆదిన తనతోలిరచనలలో స్మశానానికి సన్మానం చేస్తాడు. సాహిత్యవస్తు సంపదకోసం, సత్ప్రవర్తన సూత్రాలకోసం గతకాలాన్ని గాలించడంలో ఆయన ఇలియట్‌తో పాలుపంచుకొన్నా, అతని అన్వేషణ వేళాకోళంగాను, శీఘ్రకోపశీలంగానూ వుంటుంది. అతడు ఆరాధన అంటే పడని దేవాలయప్రియుడిగను, పూర్వపువిగ్రహవర్ణన చేసే విగ్రహవిధ్వంసకుడుగను కనిపిస్తాడు. ఇలియట్ వేసుకున్న చారిత్రకమైన పథకంలో కాలమానాని కతీతమైనదీ, కాలసంబంధమైనదీ కూడ కలిసి పయనిస్తాయి; యూరపు మన స్తత్వం తరతరానికీ మారుతూవుంటుంది కాని మార్గమధ్యంలో దేనినీ కోల్పోదు. పౌండు వేసుకున్న ప్రణాళికలో (ఆసియాకూడా వుంది) కొన్ని శకాల చరిత్ర అతని రచనలో మళ్ళా జీవంపోసుకున్నట్లు స్ఫూర్తిమంతంగా గోచరిస్తుంది. బ్రౌనింగులా ఇతడూ 'ఏకపాత్ర్య' (monologue) ప్రియుడైన కవి. అతని కవితలో తా నొక్కడేగాని, ఒకేఒక పాత్రగాని ప్రసంగించడంమామూలు. తరచు ఏదోఒక గతించిన శకాన్నిగురించి అది ప్రస్తుతకాలమే అన్నట్లుగా మాట్లాడాలని ఆయనవూనిక. 'Provincia Deserta' అనే అతని మంచికృతి యొకటి—

"I have walked over these roads;
I have thought of them living"

[ఈ దారులంట నడిచాను నేను.అవి బ్రతికి వున్నాయనే అనుకొన్నాను]

అనే పంక్తులతో పరిసమాప్త మవుతుంది. గతవిషయభావనలో

ఇలియటు కున్న ఏకాగ్రత లే దితనికి. అందుకే ఇతనికి మిల్టనువలె సంప్రదాయపరిపాకాన్ని ప్రదర్శించే కవులకంటె ఛాసరువలె క్రొత్తపుంతలు తీసినవా రంటేనే ఎక్కువ మోజు. ఆతనికీ ఇలియటుకీ ఇద్దరికీ డాంటే అంటే విశేషప్రతిపత్తి. కాని డాంటేయొక్క క్రైస్తవప్రపంచంలో గల ఏకీభావానికి ఇలియట్ శిరఃకంపం చేస్తే, డాంటేయొక్క భావోన్మేషభాసురత్వానికి బుజా లెగురవేస్తాడు పౌండు. డాంటే వ్రాసిన ఆ 'Divine Comedy' కి 'Instigations' అని నామాంతరం వున్నట్లుగా, అది 'మనుషుల ఆలోచన ప్రేరేపించడానికని' వ్రాయబడిం దంటాడు పౌండు. 'Cantos' పేరుతో పౌండు తన కావ్యంలో చేసిన ఆశ్వాసవిభాగానికి మూలం 'డివైన్ కామెడీ' లో వుంది. పౌండురచన పూర్తిఅయితే అందులో సరిగా 'డివైన్ కామెడీ' లో లాగే వంద 'కేంటోస్' వుంటాయి. ఆర్నాట్ డేనియల్, బ్రునెట్టోలేటిని, బెర్ట్రండ్ డిబార్న్, యులిసిస్ మొదలైన డాంటేపాత్రలు కొన్ని యిందులో కనిపిస్తాయి. అయితే అవేవీ ఆధ్యాత్మికమైన ప్రగతికి ప్రతీకల్లా లేవు పౌండుకృతిలో. పౌండు ప్రదర్శించినదల్లా ఒకవిధమైన ఆర్థికవిమోచనం—మిండవడ్డీ (usury) నుండి విమోచనం. అది మధ్యయుగపు పాతకం (medieval sin). మానవజాతిచరిత్ర నిర్మించిన శక్తులలో అదొక టని పౌండునమ్మకం. అతనికి నమ్రత ప్రదర్శించవలసిన చోట కోపం వస్తుంది. ఇలియట్ అభిభాషించినట్లు పౌండు భావించిన నరకం అది యితరులకోసం ఉద్దేశింపబడింది. పౌండుకి క్రైస్తవసంప్రదాయం అంత అర్థవంతంగా కనిపించదు. కన్ఫూషియస్ లేక జెఫర్సన్, జాన్ ఏడమ్సు మొ॥ తొలినాటి తమ దేశనాయకుల ప్రజ్ఞానపథంలోనే ఆయనకు విశ్వాసం. అతని గద్యరచనలలోను, పద్యరచనలలోను అతని వైదుష్యం ఎన్నెన్నోరాసులుగా కనిపిస్తుంది. అన్నీ కలిసి 'పౌండీయసంహిత', లేక ఒక మానవానుభవమహాప్రబంధం అవుతాయి. అతని 'Summa' లో పైచూపు కొంత తేలికదనం కనిపిస్తుందికాని ఆ వెనుక గంభీరమైన ఆర్జవం వున్నది. అలాగే అల్పంగా విప్ర

కీర్ణంగా కనిపించే ఆయన సూక్తులు అతిక్లిష్టంగా టుప్రీకల్లా వుంటాయి
గాని చిరకాలపఠనభావనాఫలితా లవి. ఈ రహస్యం గుర్తిస్తేకాని పుస్త
కాలకేసి వట్టి ఓరచూపులు చూసే చదువరుల కందలి పరమార్థం అందదు;
దుసికిలిపోతుంది. పౌండురచనలను శ్రద్ధగా చదివినవారి కతని పద్ధతిలో
ఒక అర్థం, ఒక గొప్పవిలువ తప్పక గోచరిస్తాయికాని చివరి కందులో
అసంబద్ధతవుందని చెప్పకతప్పదు. పౌండు కవితాశక్తి అద్వితీయమైనది,
అతని 'Cantos' లో అద్భుతమైన అనుభూతివిశేషం చూరగొనగలం
కాని చివరి కంతా ఏదో అసందర్భంగా కనిపించకమానదు. అయితే ఇదంతా
పౌండేదో లోపాయికారీచూపు కలిగివుండడంవల్ల వచ్చిన చిక్కు కాదు.
డబ్ల్యు. బి. యీట్సు మొదలైన మరికొందరూ ఇలాగే చేశారు రచనలు.
అవి బాగా అర్థంచేసుకోవాలంటే వాళ్ళ ఉద్దేశాల వైనం కొంత తెలి
యాలి. అందుకు వాళ్ళ రచనలు వేలంపాటకు వస్తువులైనట్లుగా మనం
వాళ్ళ నేమీ వాటికి సంబంధించిన కేటలాగొకటి యిప్పించవలసిందని
అడగలేముగదా. అసలు మన కాలపు భావుకరచయితల తీరే అంత. ఏదో
తమ స్వభావగతమైన వైలక్షణ్యాన్ని ప్రదర్శించడమే వారి రచనల ముఖ్య
లక్షణంగా కనిపిస్తుంది. ఏమయితేనేం ఆ కృతుల బహిఃస్ఫూర్తిగల దృక్ప
థంలోమాత్రం గాంభీర్యం లేదు. అయితే పౌండుని చపలస్వభావు డన
డానికి వీలులేదు. అతని విశ్వాసాలుఅర్ధశతాబ్దిపాటుగా అతడు చేసిన అవి
రళకృషిమీద ఆధారపడి నిదానంగా పరిణతి పొందినట్టివి. ఇతరరచయిత
లందరి దృష్టిలోను అతడతివిశిష్టుడైన మహారచయితగా భాసిస్తాడు. నిస్సం
దేహంగా అతడొక కవిమేరువు. ఒక రచయిత ఎంత గుప్తంగావుండవచ్చు
ననేదాని కొక నిర్దిష్టలక్షణ మేమీ లేదు. అయితే పౌండు పాటించే గుప్త
తలో మాత్రం కొంతమేరకు ప్రతికూలత, ధర్మచ్యుతి వున్నాయి. ఒక్కొ
కప్పు డాలోగిట్లోకి ఎవరేనా సరే ప్రవేశించవచ్చు. ఒకోసారి అక్రమంగా
ప్రవేశించినవారికి శిక్ష పడుతుంది.

ఇలియట్ కవితగాని, విమర్శగాని (విప్లవాత్మకప్రభావం గలవైనా)

ఎల్లప్పుడూ, పౌండురచనలలోవలెగాక, ఒక సమగ్రపరిపాకహేవాకం కలిగివుంటాయి. అతని విద్యావ్యాసంగపు ప్రారంభదశ హార్వర్డులోను, సార్బొన్నె (జర్మనీ) లోను, ఆక్స్‌ఫర్డులోను గడిచింది. అతని కవితాశిక్ష ఫ్రెంచి ప్రతీకవాదుల (Symbolists- ముఖ్యంగా Jules Laforgue) యొక్క ఆంగ్లదార్శనికగ్రంథకర్తల (metaphysical authors) యొక్క రచనలను నిశితంగా పరిశీలించడంతో సాగింది. అతడు డాంటే, బ్లేక్, బెంజాన్సన్, బాడిలెయిర్‌ల రచనలు చదివి తెలుసుకున్నాడు. నిశితమైన మేధ, దానికితోడు సునిశితమైన కవితాకౌశలమూ కలిసి అత డేమి వ్రాస్తే అది - అతని తొలిరచనయైన 'The Love Song of J. Alfred Prufrock' (1915) సహా వెంటనే నవ్యసాహిత్యజగత్తులో ఒక స్థానాన్ని సంపాదించుకున్నాయి. అవి యింకా నవకంతో కనిపిస్తున్నా వాటి కొక ప్రాచీనకృతికివలె ప్రతిష్ఠ వచ్చింది. ఒక తరానికి తరం ఇలియట్ ఆంగ్ల భాషాకవులలో (జీవత్కవులలో) ప్రప్రథమగణ్యుడని అందరిచేతను పరిగణింపబడ్డాడు. అందుకే సంప్రదాయావశ్యకత గురించి అత డుద్ఘోషించిన మాటలు సమకాలికులను బాగానే ప్రభావితం చేశాయి. అతని తొలినాటి రచనలలో గూడ, మామూలు పరిహాసపు ధోరణులలో గూడ అతని విమర్శ కొక సంయమనం వుండేది. అందులో ఒక అపస్మారపు ధోరణికాని, 'సొంత డబ్బా' ధోరణిగాని మచ్చుకైనా వుండవు. తా నింకా చిన్నవాడుగా వుండగానే 'The Waste Land' లోని జెరోన్షన్ (Gerontion) లేక టైర్సియాస్ (Tiresias) పాత్రల్లా ఒక వృద్ధుడు మాట్లాడినట్లు మాట్లాడుతాడు. 1927 లో అతడు 'For Lancelot Andrews' అనే వ్యాస సంపుటికి తన తొలి పలుకులో తన గురించి తాను "సాహిత్యంలో ప్రాచీన మార్గానుయాయుడిని, రాజకీయాల్లో ప్రభుత్వ పక్షీయుడిని, మతం విషయంలో ఆంగ్లో కాథలిక్ వర్గీయుడిని" అంటాడు. మరి రెండేళ్ళ కొక వ్యాసంలో ఎడ్మండ్ విల్సన్ అనే ఆయన ఇలియట్ కోరి తన కొక పురాణప్రాభవం

కలిపించుకోడానికి ప్రయత్నించాడనీ, ఇజ్రా పౌండు ప్రభృతుల గుప్త పద్ధతులకంటె అదేమంత యుక్తిసహమైనది కాదనీ ఆక్షేపించాడు.

అయితే ఇలియట్ పిదప రచనల్లో స్పష్టపడినట్లు ఉన్న తేడా అల్లా యేమంటే అతని పద్ధతి పకడ్బంద్ గా నిర్వచింపబడింది, అతనిలాగే క్రైస్తవమత విశ్వాసం గలవా రందరికీ చాలా సమంజసంగా వుందనిపించింది. క్రైస్తవమతా న్ననుసరించనివారుగాని, అతని గాంభీర్యం శ్రుతి మించిపోయిం దనుకునేవారుగాని వున్నారంటే వారుకూడ అతని కవితా ప్రతిభ నిత్యం పరిణతి పొందుతోం దన్న సత్యాన్నయినా గుర్తింపక తప్ప లేదు. అతనిలో కొంత అనార్ద్రిత వున్నదంటే అది వట్టి శుష్కత కాదు, కొన్ని రకాల 'షాంపేన్' సారాయాలకున్న గుణం లాంటిది. అతడు మొదట్లో తన అమెరికన్ వారసత్వాన్ని నిరసించేటట్లు కనిపించి, అందు వల్ల విలియమ్ కార్లోస్ విలియమ్సు మొ॥ అమెరికన్లకు చిరాకు కలిగించినా, ఇటీవల తన ఉద్దేశాలను కొంత మార్చుకొన్నట్లు కనిపిస్తుంది. మార్క ట్వెయిన్ Huckleberry Finn గురించి వ్రాస్తూ ఒక ఉదారపు లోచూపు వ్యక్తం చేశాడు తాను. సెయింట్ లూయీలో పుట్టిన తాను ట్వెయిన్ గారి హన్నిబాల్ కి సన్నిహితుడనని గుర్తించాడు. మిసిసిపీ స్మృతిని చెరిగిపోకుండా దాచుకున్నాడు. అదిగాక పద్యరూపకాలకు గల అవకాశాల నన్వేషించడంలో చాలాకాలంగా ఆయన చూపుతున్న ఆసక్తికి అత డొక లక్ష్యం లేని కాబోయే ప్రభువనే ఆక్షేపణతో నిమిత్తం లేదు. అత డీ ప్రక్రియలో Sweeney Agonistes, an Anstophanic Melodrama ('The Criterion' లో ముద్రితము, 1926-27) తో ప్రారంభించిన ప్రయోగాలు The Rock (1934), Murder in the Cathedral (1935), The Family Reunion (1939), The Cocktail Party (1950) అనే రూపకాల ద్వారా కొనసాగేయి. "ఏ కళలోనైనా సరే, అందులోను నాటక కళ విషయంలో స్పష్టంగా కళాకారుడికి సామాజికుల తోడ్పాటు

అవసరం" అనే ఆదర్శంవేపు స్తిమితంగా పురోగమించాయి. ఈ మాట లతడు 1923లో 'మేరీ లాయిడ్' గురించి వ్రాసిన వ్యాసంలో అన్న మాటలు. తా నింకా ఆ ఆదర్శాన్ని సాధించలేకపోయానని, తన రచనలు కొన్నిట ఒకానొక గడ్డు పిడివాదము ప్రవేశించి వాటిని తన కిష్టమైనంత కంటె ఎక్కువ పవిత్ర రచనలుగా చేసేస్తున్నదనీ స్పష్టంగా గ్రహించాడు. కాని అతని Four Quartets అనే కృతిరాజము మరోసారి ప్రక టించినట్లు అతని ఉద్యమ హృదయస్థానంలో ఒక ముఖ్యమైన నమ్రతా గుణం వున్నది. అతని రచనలో ఎక్కడైనా ఆర్ద్రిత లోపించివున్నట్లు కనిపిస్తే అది సౌహార్దలోపం మటుకు కాదు. విమర్శకు సంబంధించిన అతని నిర్ణయా లెప్పుడూ సృజనాత్మకమైన కృషి స్వభావం యెడల అతనికి గల ఉత్సాహోదారమైన, ఆదర మేదురమైన గుణగ్రహణ దక్షతకు తగిన తూకంలో వుంటాయి.

ఇక ఇర్వింగ్ బేబ్బిట్, పాల్ ఎల్మర్ మోర్ వున్నారు - ఇద్దరూ చాలా సమర్థులైన అమెరికన్ విమర్శకులే. అందు బేబ్బిట్ ఇలియట్‌కి హార్వర్డులో ఆచార్యుడు కూడాను. కాని, వీరి గురించి ఇలియట్ గురించి చెప్పినంత చెప్పడానికి లేదు. మొదటి ప్రపంచయుద్ధకాలంనాటికి ఇద్దరూ నడివయసువారు. అప్పటికి తమ సిద్ధాంతాలను, నియమాలను విశదం చేసు కుని వున్నారు. కాని 1920 ప్రాంతంనాటి అక్రమాలు వారికి క్రొత్త ఆవేశాలను, ప్రేరణలను కలిగించాయి. మానవతావాదపు (Humanism) విలువలను సమర్థించుకుంటూ, వారూ వారి అనుయాయులూ ఒక్కొ క్కప్పుడు 'నవ్య' శబ్దపూర్వకంగా ఆ మాటను తమ ఉద్యమ ప్రమాణంగా గ్రహిస్తూ వచ్చారు. ఈ మానవతావాదులు అభిరుచి, వినయము (disci- pline), ప్రమాణములు, గ్రీకు సంస్కృతి (Hellenism) ఘన తలు, కళకు కావలసిన నైతిక విషయ ప్రతిపత్తి మున్నగు విష యాల గురించి చెప్పేవారు. తమ ప్రశంసకు పాత్రములైన సాహిత్యాల గురించి బ్రహ్మాండంగా వ్రాశారు. తమ నియమాలకు, ఆదర్శాలకు

విరుద్ధము లనిపించుకునే ఆధునిక విజ్ఞానశాస్త్రం, కాల్పనిక స్వాభావిక వాదాల అభిప్రాయ వైవిధ్యాన్ని గర్హించారు. ఈ విషయం గురించి బేబ్బిట్ తన Rousseau and Romanticism (1919), Democracy and Leadership (1924) లలో దక్షతతో చర్చించాడు. ఆధునికయుగం ప్రమాణాలమీద తిరుగుబాటు చేసిందనీ, అది మొయ్య అవ్యవస్థ పొలిమేరకు వచ్చిందనీ, ఈ విప్లవం తన ప్రబల శత్రువైన రూసో చేసిన దుర్బోధల ఫలితమనీ అతని విశ్వాసం. కాల్పని కోద్యమం వ్యక్తియొక్క ఆత్మీయతకిచ్చిన మద్దతువల్ల అసలైన ప్రయోజ నాత్మకములైన విలువలు దెబ్బతిన్నాయనీ, ఎవడి సొంతసొద వాడు వెళ్ళ బోసుకోవడ మదో ఘరానాపద్ధతి అయిపోయిందనీ, సాహిత్యంలోకంటె ముందుగా జీవితంలో ధర్మపథంవేపు మళ్ళవలసిన ఆవశ్యకత ఎంతేనా వుందనీ, అందుకు తోడుగా సవిమర్శంగా సాహిత్యసృష్టి జరగాలనీ ఆయన వుద్దేశం.

మానవతావాదులు (Humanists) చెప్పిన దానిలో ముఖ్యంగా నవసమాజంయొక్క నానావిధరోగనిదానంగా చెప్పిన మాటలలో చాలా ప్రాజ్ఞత వ్యక్తం అవుతుంది. బహుదూషణకు గురియైన 'ప్యూరిటను'ల గురించి చెబుతూ బేబ్బిట్ అన్నట్లు క్రైస్తవోచితాలైన భయభక్తినయ వినయము లంతరించిపోయి వ్యక్తిజీవితంలోనూ, సంఘజీవితంలోనూ ఏదో గొప్ప వెలితి ఏర్పడింది. 'అసలు అంతరాత్మయే దానికి గల నిగ్రహ శక్తితో సహా అంతర్ధానమైపోయేటట్లుంది', దానికి బదులు 'బహిశ్శక్తులకు లొంగిపోయే ధోరణి కనిపిస్తోంది' అంటాడు. 1 ఆ మానవతావాదుల ఆక్షేపణలతో కొన్నిట ఏకీభవించాడు టి. యస్. ఇలియట్. వాళ్ళను

---

1. ఈ విధమైన నిదానవిధానం ఇటీవల డేవిడ్ రీస్‌మన్‌చే అతని The Lonely Crowd (1950) అనే సమాజదర్శనగ్రంథంలో మరీ సమగ్రంగా ప్రపంచింపబడింది.

ఎకసక్కెంచేసిన విమర్శకులు తామూ అలాంటి వేళాకోళానికి గురి కావలసివచ్చింది. హెచ్. ఎల్. మెన్ కెన్ వాళ్ళతో వాదించలేక ఊరు కున్నాడు. అతడూ అతని మిత్రులూ సమకాలికస్థితి కత్యంతసన్నిహితు లుగా వుంటే, మానవతావాదు లత్యంతదూరంగా వుంటూ వచ్చారు; సమ కాలికపు టూహలనూ,సాహిత్యాన్నీ గర్హించారు. శాపనార్థాలు పెట్టేరు. (కాని శిథిలాలయం గదా అని శివప్రతిష్ఠ చేసి నలుగురూ పూజింపబోతే నాగులు చుట్టుకున్నాయట-అలా మరీ విషమించింది పరిస్థితి). ఈ నవ్య మానవతావాదుల ధర్మఘోషకాని, బేబ్బిట్ గారి పేరుపడిన 'అంతర్ని రోధ' సూత్రం (Inner Check) గాని పట్టి ఆచరణయోగ్యం కాని సిద్ధాంతాల్లా కనిపించాయి. 1920 ప్రాంతపు కాలస్వభావానికి ఆధునికత యొక్క హోయి గొల్పే అవ్యవస్థే ఉపాదేయ మైనది. ఆ న.మా. వాదులు కొందరు కలిసి 1930లో తమ అభిప్రాయ వేదికగా 'Humanism and America అనే గ్రంథాన్ని రూపొందించారు. దానికి వెంటనే సమా ధాన నిబంధనాలుగా 'Critique of Humanism', జార్జ్ శాంతా యనుని 'The Genteel Tradition at Bay' (1931) అనేవి వచ్చాయి. శాంతాయను లొకప్పుడు హార్వర్డులో బేబ్బిట్ గారితో కలిసి పనిచేశారు. న.మా. వాదులు ప్రవచించిన ప్లెటోనిక్, క్రైస్తవ సిద్ధాంతాలే న్యూఇంగ్లండు సంస్కృతియొక్క క్షీణదశకు తార్కాణలని శాంతా యనుని విశ్వాసం. ఆయన 'The Last Puritan' (1936) అనే నవ లలో భావించినట్లు, ఇలియట్ చెప్పినట్లు ప్యూరిటన్, ట్రాన్సెండెంటల్ వారసత్వాలు నాగరికతను తలదన్నిపోయిన సంస్కారంగల మేధావుల నుత్పాదించాయి.

అయితే న్యూఇంగ్లండుతో అననుకూలంగా న.మా. వాదాన్ని ముడి పెట్టింది శాంతాయను లొక్కరే కాదు. 1930లో ప్రకటితమైన 'I'll Take My Stand' అనే మరొక చర్చానిబంధం (Symposium) ఉపోద్ఘాతంలో మానవతావాదంగురించి ఒక వివరణ ఇలా వుంది:

"మానవతావాదుల ధోరణి మరీ దుర్గ్రిహంగా వుంది. సరిగా చెప్పాలంటే మానవతావాద మన్న దొక నిక్కచ్చి సిద్ధాంతం గాదు. అది మన బ్రతుకులు, చేతలు, ఆలోచనలు, అనుభూతులు అన్నిటి సార భూతమైన ఒక సంస్కృతి సంస్థ. ఒక నియతమైన సాంఘిక సంప్రదాయంలో ఉపజ్ఞతో, సామరస్యంతో బ్రతికే బ్రతుకులాంటి దది. ఇలాంటి సిసలైన మానవతావాదం వెనుకటిరోజుల దక్షిణంలోను, అలాంటి సంప్రదాయాన్ని భజించిన యితర ప్రాంతాలలోను కృషీవల జీవితంలో వేరుతన్నివుండేది. అది కేవలంగా ప్రాచీనగ్రంథాలనుండి గ్రహింపబడిన నీతినిబంధన మేమీ కాదు ... సమకాలికకళాస్వరూపాలను విమర్శింప సమర్థములై, వాటి పునాదులైన సాంఘికార్థికవ్యవస్థను మటుకు విమర్శించ డానికి సాధ్యంకానట్టి ప్రమాణాలు పట్టుకుని మనం మన దేశీయమైన మానవతావాదానికి పునర్భవం కలిగించలేము."

ఏలెన్ టేట్ (Allen Tate), ఆ గ్రంథ భాగస్వాములలో ఒకడు. తన వ్యాసంలో ఇలా వ్రాశాడు:

"న్యూఇంగ్లండు సమాజం చాలా బుద్ధికుశలతగల వ్యాపారధోరణి గల సమాజాల్లో ఒకటి. ఆ సమాజాలన్నీ రెండురకాలుగా పరోపజీవన పరాయణత్వం గలవి. ఇవి ఆర్థికంగాను, ఆధ్యాత్మికంగాను పంటలు పండించే మరోతరగతి మనుషులమీదగాని, మరోదేశంమీదగాని ఆధార పడి జీవించాలి. న్యూఇంగ్లండు ఆర్థికంగా దక్షిణప్రాంతం మీదను, సాంస్కృతికంగా ఇంగ్లండుమీదను ఆధారపడింది."

'I'll Take My Stand' అనే పుస్తకానికి The South and the Agrarian Tradition' అని ఉపనామం కద్దు. 'దాక్షిణాత్య ద్వాదశకం'గా తమ దా మభివర్ణించుకొన్న మిగతా గ్రంథభాగ స్వాములలో జాన్ క్రోవేరేన్‌సమ్, రాబర్ట్ పెన్ వారెన్, జాన్ గౌల్ ఫ్లెచర్, డొనాల్డ డేవిడ్సన్ అనేవా రున్నారు. వాళ్ళు అమెరికన్

మార్గము, లేక సాధారణమార్గము అని అనిపించుకునేదానికి ప్రతిగా తమ దాక్షిణాత్య జీవనమార్గం గురించి పట్టుగా ప్రవచనం చేశారు. ఆ స్వపర మార్గవ్యత్యాసస్ఫోరకంగా 'క్షేత్రస్వామికము - ప్రతిగా-పారిశ్రామికము' ('Agrarian Versus Industrial') అనే పరిభాషను గ్రహించారు. ఈ 'క్షేత్రస్వాముల' (Agrarian) మూలస్థానం టెన్నెసీ రాష్ట్రంలోని నేష్విల్లీలో వున్న వేండర్‌బిల్ట్ యూనివర్సిటీవద్ద వుండేది. వీళ్ళ కిదివరకు 'Fugitives' (i.e., పలాయితులు) అని ఒక పేరుండేది. అసలా పేరుతో 1922-25 మధ్య వాళ్ళొక పత్రిక నడిపేరు. ఒకవిధంగా ఆదినుంచీ ఔత్తరాహులయెడ దాక్షిణాత్యుల కున్న దుఃఖాన్నే వీళ్ళు పునశ్చరణ చేస్తూవుండేవారు. దక్షిణప్రాంతీయులలో న్యూఇంగ్లండంటే పరమశత్రు వనే భావన చాలాకాలంగా వస్తోంది. ఉత్తరదేశపు పట్నవాసపు భౌతికవాదోన్మాదంకంటె ఒకస్థిరత్వంగల తమ వ్యావసాయికమైన ఆర్థికవ్యవస్థ చాలా గొప్పదని వాదిస్తూవచ్చారు వాళ్లు. అయితే యిప్పుడు వారి ఆక్షేపణల కొక క్రొత్త ఉపపత్తి దొరికింది. ఔత్తరాహులు కూడా యంత్రయుగంయొక్క విపరీత పరిణామాలగురించి విచారించ నారంభించారు. ఏలెన్ టేట్ తన మిత్రుడైన హార్ట్ కేన్ ఆత్మహత్యకూ, ఆధునిక నగరజీవితపు ఒత్తిడికీ సంబంధం వుందనుకోవడంతో ఇతరులుకూడా ఏకీభవిస్తారు. ఔత్తరాహులుకూడ న్యూఇంగ్లండును నిరసించడానికి సిద్ధపడ్డారు. టి.యస్. ఇలియట్ గాని, సుప్రసిద్ధుడైన న్యూయార్కు విమర్శకుడు లూయిస్‌మమ్‌ఫర్డ్ గాని వ్రాసినదానిలో చాలాభాగం ఆ 'క్షేత్రస్వాము'లకు కొట్టినపిండే. ప్రాంతీయతత్వం అన్నది ఇంకా ప్రాతకాలపు పాక్షికవాదాలు పట్టుకుని ప్రాకులాడుతూవున్నా క్షేత్రస్వాముల చూపులో అది నిర్బంధా లధిగమించినట్లే. న్యూఇంగ్లండు సాంస్కృతికంగా ఇంగ్లండుమీద ఆధారపడింది. కాని దక్షిణప్రాంతం ఆధారపడలేదంటారు ఏలెన్ టేట్, అతని సహచరులున్నూ. అది తన సొంతపుంతలో తాను పయనిస్తున్నది, అంటే అది సోమరిగా వెనుకబడివుందని కాదు, అది

సాధించిన పరిణతియే అందుకు కారణం; "ఈ దక్షిణ ప్రాంతం యూరపును ఉపేక్షించివుండగలదు. ఎందుచేతనంటే అదే యూరపుగనుక; అంటే అది తన మట్టిపై తాను వేరుతన్ని నిలబడిందని అర్థం" అంటా డాయన. ఇతర క్షేత్రస్వాములుగూడ ఈవిషయంగురించి పట్టించుకున్నారు. జాన్ క్రో రేన్సమ్ తన వ్యాసంలో "యూరపియన్ సూత్రాలప్రకారం సంస్కృతి అనిపించుకునేదాని ప్రాదుర్భావానికీ, పరిరక్షణకూ ఉనికిపట్టయినది కనుక అమెరికాఖండ మంతటికీ అతివిశిష్టమైనది దక్షిణదేశం" అన్నాడు. "స్వతంత్రమైన దేశం తన ప్రాభవానికి తగినట్టు స్వతంత్రమైన కళ నుత్పాదించి తీరాలనే ఒక సిద్ధాంత మున్నది; అది బయటికి యుక్తంగానే కనిపిస్తుంది; కాని ఆ సిద్ధాంతం దక్షిణదేశంలో పుట్టిందికాదు" అన్నాడు డొనాల్డు డేవిడ్సన్. 1939లో 'పార్టిజాన్ రెవ్యూ' నిర్వహించిన ఒక చర్చావేదికలో పాల్గొంటూ ఏలెన్ టేట్ వెనుకటి యూరపు-అమెరికాల సాహిత్యచరిత్ర నంతటినీ (తనవంటి) ప్రాంతీయ రచయిత అయితేనే ఆకళించుకోగలుగుతాడనీ, అదే జాతీయోద్యమవాదియైన రచయిత అయితే (సేండ్ బర్గులాగు) వట్టి పరిశీలనైకభాజనమైన జాతీయాభినివేశంలోనైనా పడిపోతాడు, లేక (క్రేన్ వలె) తన ఊహాలనుండి అభూతకల్పనలు అమెరికా దేశంలోకి దిగుమతి చేస్తాడు" అని అన్నాడు.

ఆ చర్చలో పాల్గొంటూ, 'అమెరికన్ తన'మన్నది వట్టి కల్పన అని కొట్టి పారెయ్యడంలో వేలెస్ స్టీవెన్సు టేట్‌తో ఏకీభవించా డనే చెప్పాలి. మొత్తానికి దాక్షిణాత్యులు, అప్పుడప్పు డస్పష్టమైన మతలబుల ద్వారా నైతేనేం గాని, చివరి కొక పరిణతమైన అనమెరికన్ (non-American) స్థితికి చేరుకున్నారు. అయితే వారు న్యూ ఇంగ్లండు గురించి అన్న మాటల్లో ఔదార్యం లేదు. నిజానికి న్యూ ఇంగ్లండు యొక్క ఐరోపీయ లక్షణంలో ఎప్పుడూ కొన్ని సుగుణా లుంటూనే వచ్చాయి. వారు తమ దక్షిణ ప్రాంతమంతటా ధనికుల ప్రభుత్వాన్ని మించిన ఒక చక్కని క్షేత్రస్వామిక వ్యవస్థ నెలకొన్నదనీ, అక్కడ పారి

శ్రామిక వ్యవస్థయే కనుక పాడనూపితే ఆ తమ పెద్దలేర్పరచిన విలువ లన్నీ దెబ్బతిని పోతాయనీ (అప్పుడే కొన్నిచోట్ల అలా అయిందనీ) చెబుతూ ఆ ప్రాంతాని కొక క్రొత్త ఘనతను కల్పింపజూచారు. ఆ దక్షిణ ప్రాంతం డబ్ల్యు. బి. యీట్సుగారి ఐర్లండు లాగానే, ఏమిటో కొంత అయథార్థం గానే కనిపిస్తుంది. అయితే సాహిత్యపరంగా అనుకోవాలంటే మాత్రం అనేక అమూల్యభావ సంస్థానం. దానికి సంప్రదాయబలం వుంది. ఆత్మ ప్రత్యయం గల రచయిత లున్నా రక్కడ. తమ ప్రాంతీయమైన అహం కారాన్ని విశాలసారస్వత విశ్వరంగంలో విలీనం చేయగల కవు లున్నారు.

ఉద్యమం గురించి చెబితే అదే తద్భాగస్వాముల స్వభావం వ్యక్తీక రించగల దన్నట్లుగా ప్రస్తుతం వ్యక్తుల గురించి చెప్పేముందు 'క్షేత్ర స్వామికం'(Agrarianism)గురించి చెప్పడం బహుశా తప్పుదారి పట్టించి నట్లవుతుందేమో. మరేం లేదు, ఆ క్షేత్రస్వాము లన్నవారు నానావిధ వ్యక్తులు ఏకముఖంగా ఏర్పడిన ఒక వర్గం. అందరూ కావలిస్తే ఒక్క చోటే ఉరిపెట్టుకుంటూ మనేవారే కాని ప్రకృతం అంతా ఒక్కచోట లేరు. మన కిక్కడ ముగ్గురితోనే పని: రేన్‌సమ్, టేట్, వారెన్. ఇందులో టేట్ ఎప్పుడూ పూర్తిగా 'క్షేత్రస్వామి'కానికి చెందినవాడు కాదు. ఇటీవల కాథలిక్ కూడా అయినాడు. అయితే ఆ దాక్షిణాత్య పూర్వ రంగం (Southern background) వాళ్ళ కృతులను పరిశీలించ డంలో ఉపకరిస్తుంది. అంతేకాదు, ఆ పూర్వరంగానికి సంబంధించిన భావన తమ రచనల రూపురేకలు స్పష్టంగా తీర్చిదిద్దుకోవడంలో వారికి ఉపకరించిందికూడాను. వారిలో పెద్దవాడు రేన్‌సమ్ 1919లో 'Poems About God' అనే ఒక చిన్న సంపుటితో ప్రారంభించాడు రచన. అందులో పద్యా లేమిటో వికృతంగా వున్నాయి. అందుకే కాబోలు తన తరువాతి సంకలనాల్లో అందులో వేటినీ చేర్చుకోలే దాయన. ఈ పద్యా లన్నీ ప్రత్యేకం దక్షిణప్రాంతానికి సంబంధించినవే కాని ఆ నిరూపణంలో ఒక నిక్కచ్చితనం లేదు, కాస్త రచనాతిశయంతో సాధారణ ధోరణే

కనిపిస్తుంది గాని. అయితే రేన్‌సమ్ తరువాతి సంపుటాలు—Chills and Fever(1924),Two Gentlemen in Bonds (1927) అతడు జాగరూకతతో చేసిన రచనలలో ప్రధానమైనవి.వాటిలో‘అంగస్థితి’ (Texture)కీ ‘అంగీణాకృతి’ (Structure)కీ నడుమ చక్కని సమన్వయాన్ని ప్రదర్శించాడు రేన్‌సమ్. “పద్యమంటే ప్రాదేశికమైన అంగస్థితి (local texture) గల యుక్తినిబద్ధమైన నిర్మాణం” అని నిర్వచించాడాయన 1941 లో. ఈ నిర్వచనం ప్రసక్తమైన వ్యాసంలోనే దక్షిణ ప్రాంతీయతత్వ మాయనకు తద్రూపకంగా ఎలా ఉపకరించినదీ చూడగలము. సత్వవిచారాత్మకమయిన లోచూపు (Ontological Insight) గల విమర్శకులైతే ప్రత్యేకాంశా లన్నవి ‘అంగస్థితి’కి సంబంధించిన వనీ, విశ్వజనీన విషయాంశలన్నవి ‘అంగీణాకృతికి’ సంబంధించినవనీ, ఛందోఘటితమైన కావ్యంలో రెండూ వుండాలనీ గ్రహించగలరంటాడు.అలాంటికావ్యం రంగులూ జలతారు జాలరులూ(tapestry) మొదలైన హంగులను ‘అంగస్థితి’గా గల సర్వాంగీణసుందరమైన సౌధంలా వుంటుం దంటాడు. రేన్‌సమ్ ఆడంబరం గల కవి కాడు. అయితే ఆ tapestry (i.e., జలతారు జాలరు) అనే మాట మాత్రం స్వభావ ద్యోతకంగా వుంది. అతని మనోగతమైన వ్యవస్థీకరణ దృష్టి గతయుగ పరిశేషంలా భాసిస్తుంది. ప్రాచీనకాలపు వంశాలు, మనుషులు, కట్టడాలు మొ॥ ప్రాచీన విషయాలే తరచు అతని కవిత్వంలో గోచరిస్తాయి. అతని పదజాలం ఆలంకారిక రచనోచితంగా వుంటుంది. (అతనికి ‘Roger Prim’ అని మొదట్లో ఒక మారుపేరు వుండేది). దాని ఆకర్షణ ప్రతిపత్తి అంతా తరచుగా, ఉద్దేశపూర్వకంగాను ప్రాత వాసనలు వేస్తూ వుంటుంది. అయితే అది ఒక స్థితప్రజ్ఞత్వస్ఫూర్తి. అది అతని విమర్శలలో కూడ కనిపిస్తుంది. దక్షిణ దేశం పతనోన్ముఖంగా, రాబర్ట్ ఫ్రాస్ట్‌గారి న్యూ ఇంగ్లండులా వుందని ఆయనకు తెలుసు. ‘Antique Harvesters’అనే ఒక ఉత్తమ కావ్యఖండికలో

క్షీదమోదాలు పొందుతూ దాని గురించి "మా దేశానికి క్షీణదశ పట్టింది, అది పెద్దదై పోయింది" అంటూ డాయన. అయినా అలసమైన అనుప పన్నమైన దాక్షిణాత్యపు దృష్టి వెనుకతట్టునుండి అభీష్టాలైన ప్రణయ విశ్వాసతత్వాలను దర్శించగలడు. ఆ కావ్యఖండిక నెలా ముగిస్తాడో చూడండి:

"True, it is said of our Lady, she ageth,
But see, if you peep shrewdly, she hath not stooped;
Take no thought of her servitors that have drooped,
For we are nothing; and if one talk of death—
Why, the ribs of the earth subsist frail as a breath
If but God wearieth."

[మా స్వామిని పెద్దదై పోయిం దంటున్నారు, నిజమే. కాని నిదానించి చూడు, ఆమె వెన్ను వంచలేదు; వయసు క్రుంకిన ఆమె లెంకల మాట తలపెట్టకు, ఏపాటి వారము మనం; మృత్యుప్రసక్తి వస్తే దేవుడు విడిచిన నిట్టూర్పువలె ధరాపర్శువు లెందుకు నీరసంగా ఊపిరి నిలుపు కుంటాయి?]

ఏలెన్ టేట్ కూడ అభియుక్తుడైన కవి. అతడుకూడ రేన్‌సమ్ వలెనే తన దక్షిణ దేశం గురించి, తత్రాపి ప్రపంచం గురించి వివేక చతుర మైన అసంసక్తితో ఆలోచనలు చేశాడు. స్టోన్‌వాల్ జాక్‌సన్, జెఫర్సన్ డేవిస్‌ల జీవిత చరిత్రకారుడుగా అతడు తన ప్రాంతం, తన దేశం పాడై పోతోందని ఎంతో విచారించాడు. 1927లో రోముతో స్థిరపడిన సిరా

టుజ్ దేశీయుడైన ఎడ్మండ్ విల్సన్‌కి వ్రాసిన Epistle (i.e., జాబు)లో ఇలా వ్రాశాడు :

"Once we had marvelled country-wise,
My friend. You know that light was brief.
Mile after mile the cities rise
Where brisk Adonis tied the sheaf."

[మిత్రమా, ఒకప్పుడు మనకు అద్భుతమైన గ్రామసీమ లుండేవి. కాని కాంతి యన్నది (i.e., జ్ఞానం, శుభము!) ఎంతోకాలం వుండదని నీకు తెలుసు. మైలు మైలుకీ మహానగరాలు లేస్తున్నాయి. అక్కడ ఎడోనిస్ (వీనస్ ప్రియుడు) తొందరగా తనమోపు కట్టేసుకున్నాడు.]

అయితే టేట్ పొందిన విషాదం చాలమట్టుకు ప్రగాఢత్వం లేని ప్రాతపాటే. జరగవలసిన నష్టం జరిగిపోయింది; అపస్వరాలు మితిమీరి పోయినయ్. అతడు చచ్చిన తన సహచరుని అందంగా ఒక 'Ode'లో ఆవాహన చేసినా, ఆ దిక్కుమాలిన హేమంత దృశ్యం దగ్గరికి వచ్చేసరికి మాటలు చాలకుండా వున్నాయి.

"We shall say only the leaves
Flying, plunge and expire."

[ఎగిరే ఆకులే మునిగిపోతాయి, బ్రతుకు ముగిసిపోతాయి అనాలి]

అప్పుడప్పు డతని కవితలో కొంత రోషపారుష్యంగాని, నిస్పృహ గాని కనిపిస్తాయి. ఉదా: 'Aeneas at Washington' (1936 లో 'The Mediterranean and Other Poems'అనే సంపుటిలో ప్రకటితము) చూడండి:

Stuck in the wet mire
Four thousand leagues from the ninth
buried city

I thought of Troy, what we had built
her for.

[భూస్థాపిత మైపోయిన తొమ్మిదో నగరానికి నాలుగువేల మైళ్ళ దూరాన రోంపిలో దిగబడిన 'ట్రాయ్'గురించి (అసలు) మనం దాని నెందు కోసం నిర్మించుకున్నట్లు? అని ఆలోచించాను.]

ఏమయితేనేం, వెనుకటి క్షేత్రస్వామ్యముల కొక నాగరికత, నాజూకు ఉన్నాయని మనం అంగీకరించగలిగేటట్లయితే, ఏలెన్ టేట్ పాలిటికి కూడ అదొక ఆసరాగా వచ్చిందని చెప్పవచ్చు. 'Reactionary Essays' (1936) మొదలు 'The Forlorn Demon' (1953) వరకూ వున్న అతని విమర్శనగ్రంథాలను చూస్తే రేన్సమ్‌లాగ అత డెంత విశిష్టభావుకుడైన సాహిత్యసత్యవ్రతుడైనదీ తెలుస్తుంది. అతడు తన 'Reactionary Essays'లో అంటాడు: "వివేకవ్యాపృతమైన మన జీవితగమనంపై పెత్తనం చలాయించే విమర్శనపద్ధతి-రేసిన్ (Racine) వ్రాసిన ఒక విషాదాంతాన్ని చదివి 'ఇది నిరూపించదలుచుకున్న దేమిటి?' అని ప్రశ్నించిన ఫ్రెంచి గణితశాస్త్రజ్ఞుని విమర్శనపద్ధతి వంటిదే. అవును, అదేమిటి నిరూపిస్తుంది? ఏమీ నిరూపించదు. తన యోగ్యతకు సంబంధించిన ఒక అనుభవసమగ్రత నిస్తుంది. సాధారణకార్యరూపాలతో దానికి ప్రయోజనాత్మకమైన సంబంధ మేమీ లేదు." ఇతడూ, రేన్సమ్ విమర్శనలో తాము అరిస్టాటిల్ పద్ధతికి చెందినవార మంటారు. ప్లేటోనిక్ సాహిత్యప్రక్రియలను నిరసిస్తారు. ఆప్రక్రియల్లో డన్ (Donne)లోగాని ఎమిలీ డికిన్సన్‌లోగాని టేట్ గుర్తించి ప్రశంసించిన సమస్వరత లేదు. టేట్, రేన్సము లిద్దరూ ఎంత ప్రాంతీయమైన అభిమానమూ, అహంకారమూ గలవారైనా అది వారిని పామరత్వంలోకి దిగజార్చలేదు. సరికదా వారి భావన దానికి చాలాదూరంగా వుంటుంది. వారిప్రమాణాలు రసజగత్తుకీ, తత్వానికీ సంబంధించినవి. ఆర్థిక, సామాజిక, చారిత్రక, మానసిక, నైతికప్రమాణాల నతిశయించినట్టివి.

ఇలాంటి మనస్తత్వమే కెంటకీరాష్ట్రీయకవి, విమర్శకుడు, నవలా రచయిత అయిన రాబర్ట్ పెన్ వారెన్ లోను కానవస్తుంది. అయితే ఒక వ్యావహారికమైన పాటవం, మంచిచెడ్డల గురించిన ఒక సందేహ వ్యామోహమూ అతని ప్రత్యేకతను కొంత నిరూపిస్తాయి. All the King's men (1946) అనే అతని నవల ఒక దాక్షిణాత్య రాజకీయవేత్త అభ్యుచ్ఛ్రియపతనావస్థల గాథ. అందులో ఒక ధర్మసంకట మేర్పడింది. సౌజన్య దౌర్జన్యాలు పృథక్కరించడానికి వీలులేనంతగా కలిసిపోయాయి. అతని సుప్రసిద్ధమైన 'Ballad of Billie Potts'లోనూ వాటి స్థితి అంతే. అందులోని కథావస్తువు ఆల్బర్ట కేమస్ వ్రాసిన Le Malentendu అనే నాటకంలోని వస్తువును పోలివున్నది. విమర్శకుడుగా చాలానిదానం గలవాడు వారెన్. అంతకంటె నిక్కచ్చితనంగల విమర్శకు డతని మిత్రుడైన క్లింత్ బ్రూక్స్. ఇతడూ దాక్షిణాత్యుడే. తాను కవి కాకపోయినా తన జీవితంలో చాలభాగం కవితావిమర్శకు వినియోగించాడు. Modern Poetry and the Tradition (1939), The well wrought Urn (1947) అనే తన గ్రంథాలు రెండిటా ఒక మహాకావ్యం ఎలా విజయం సాధించగలుగుతున్నదనే విషయంగురించి విపులంగా సమాలోచన జరిపాడు. (కోల్ రిడ్జి నుదాహరిస్తూ) ఇలా గంటాడు:

"ఏకరూపత-వైవిధ్యము, ప్రాయికత-ప్రబలత, భావము - రూపము, ఏకైకము-ప్రాతినిధికము, ప్రత్యగ్రత-ప్రాచీనత, అసాధారణ చిత్తక్షోభము-అసాధారణ స్తిమితస్థితి మొ॥ పరస్పర విరుద్ధలక్షణాల మధ్య సామరస్యం సాధించడంలోనే వుంది మహాకావ్య రహస్యం."

బ్రూక్స్ అన్నట్లుగా ఇదొక విరోధాభాసపరంపర. అలాంటి వాటినే రూపకాలంకారాన్నో ఆశ్రయించి సంఘటితపరచడమే సత్కవిత్వం చేసే పని (అంతర్ద్రిష్టలు, ఆత్మవిదులూ అయిన కవుల రచనలలో కనిపించేదిదే. బ్రూక్సు, రేన్ సమ్, ఇలియటు కూడ ఆధ్యాత్మిక రచనలను చాల

మెచ్చుకుంటారు). ఈ దృష్టితో నైతే అమెరికన్ మనీషి కవిత్వాన్ని తన దేశానికి సంబంధించిన రూపకంగా గ్రహించవచ్చు. అతని సాంఘికవిశ్లేషం యొక్క పరాకోటిస్థితియే అతడిని కళ అంటే లోకోత్తరమైన అమూల్య పదార్థంగా పరిగణించేటట్లు చేసింది.

బ్రూక్స్ వ్రాసిన 'Well wrought Urn' వేలెస్ స్టీవెన్స్ వ్రాసిన 'Anecdote of the Jar' అనే ఖండకావ్యాన్ని జ్ఞప్తి కెలయిస్తుంది. ఆ పద్య ప్రారంభం ఇలా వుంటుంది:

"I placed a jar in Tennessee, 1
And round it was, upon a hill.
It made the slovenly wilderness
Surround that hill."

[టెన్నెసీలో ఒక కూజాను ముంచాను నేను. కొండ మీద (నైతే) అది గుండ్రంగా కనిపించింది; ఘోరాకృతి ప్రకృతిని గిరి బరివేష్టించేటట్లు చేసిం దది.]

బ్రూక్సు ప్రభృతి 'నవవిమర్శ' 'New Criticism' మార్గ ప్రవర్తకులందరూ కళాఖండ మన్నది దైనందినత్వానికి పృథగ్భూతంగానే వుంటుంది (The work of art exists apart from every-dayness) అని వాదిస్తారు. అప్పుడే ఆధునికమానవు డన్వేషించే పరిపూర్ణత్వాలకు కాలప్రసక్తి లేని సారవద్భావాలకు అవకాశం వుంటుం దని పిస్తుంది.

కావ్యాన్ని మనం స్వప్రయోజనాలు సాధించుకోడానికిగాను బరితెగించి గుత్తకు పుచ్చుకున్నట్లయితే, ఫలితంగా ఒకేసారి మరీ పర్యాప్తమూ, మరీ సంకుచితమూ అయిన పరిశోధన చేసుకోవలసివస్తుంది. 'నవ్యవిమర్శ'కు మరికొందరు విమర్శకులు చెప్పిన అభ్యంతర మిది. యివార్ వింటర్స్ (Yuor winters) ఆర్. పి. బ్లేక్‌మర్ (Blackmur), కెన్నెత్ బర్క్, స్టేన్లీ

1. బహుశా వెండర్బిల్ట్ యూనివర్సిటీదగ్గర నేమో !

ఎడ్గార్ హైమన్ మొదలైన ప్రాజ్ఞరచయిత లవలంబించిన విమర్శన పద్ధతి బహుశా మరీ లాంఛనప్రాయంగా వున్నట్టూ, లేక సాహిత్యాన్ని ప్రభావితంచేసిన సాహిత్యేతరవిషయాలయెడ ఏమీ సానుభూతిలేనట్టూ కనిపిస్తుందనిపిస్తుంది. అయితే వీరంతా వివేకవైభవమూ,విషయ విభాగసామర్థ్యమూ గల రచయితలు. లఘుసారులూ అల్పసంస్కారులూ అయిన సామాన్యులు చేతిలోపడి ఆ 'నవ్యవిమర్శ' అన్నది శుష్కధోరణిలో దిగబడిపోయింది. అయితే ఆ రంగంలో అమెరికా చేసిన పని అదొక్కటే కాదు. ఎఫ్ .ఓ. మేథీస్సెన్ (Matthiessen), పెర్రీమిల్లర్,ఎడ్మండ్విల్సన్,లయొనెల్ ట్రిల్లింగ్ అనే రచయితలు వారివారి వేరువేరు ధోరణులతో గొప్పగొప్పరచనలుచేశారు. రానురాను, అమెరికాలో విమర్శాత్మకరచనల సంఖ్య ఎంత పెచ్చుపెరిగిపోయిందంటే, వాటిని చూసి కొందరమెరికన్లు అదంతా ఒక గొప్పసాహిత్యసృష్టికాండ అనుకొనేటంతవరకూ వచ్చింది. అదో ఉత్పాతంలా వుంది. అయితే దానంతట అది సాహిత్యస్రష్టకు చేసిన అపకార మేమీ లేదు. కవిత్వంవిషయం తీసుకుంటే వృద్ధమనీషు లంతా గొప్పరచనలు కొనసాగిస్తూనే వున్నారు. రిచర్డ్ఎబర్హార్ట్ప్రభృతులే (మరో అరడజనుమంది వున్నారు) యిందుకు సాక్ష్యం. కొందరు మొదట్లో మెరుపుల్లా మెరిశారు. చివరికి కొడిగట్టిపోయారు. కాని నావలికుల (Novelists) కంటె కవులకే స్థితప్రజ్ఞత్వం ఎక్కువగా వున్నట్లు తోస్తుంది. ఈనాటి అమెరికన్ కవిత్వంలో "నిక్కంపు మంచినీలము" లెన్నో వున్నవి (ముందరి అధ్యాయం చూడండి).

ఈ తొందరతొందరవ్రాతలో అమెరికాయొక్క తథ్యస్థితికి తార్కాణగా నిలిచిన యెన్నో విమర్శననిబంధము లింకా అప్రసక్తంగా మిగిలిపోయాయి. ప్రముఖంగా పేర్కొనదగినది వేన్విక్ బ్రూక్స్ విమర్శనకృషి. 'మానవతావాదుల' (Humanists) వలె, క్షేత్రస్వాముల' ( Agrarians) వలె అతడుకూడ సర్వదా సంప్రదాయం యొక్క ఆవశ్యకతను గుర్తించాడు.అయితే Wine of thePuritans (1908), America's Coming-of-Age (1915), Letters and Leadership (1918) అనే తొలిరచనలలో ఒకవంక అమెరికనులను సాహిత్యంగురించి పట్టించుకోవలసిం దని హెచ్చరిస్తూ, ఒకవంక

అమెరికన్ వాణియొక్క వంధ్యత్వాన్ని నిరూపించడానికి తాపత్రయ పడ్డాడు. The Ordeal of Mark Twain (1920), The Pilgrimage of Henry James (1925) అనే గ్రంథాల్లో 'చేతోవ్యాకృతి' (psycho - analysis) విధానా లవలంబించి ఆ రచయితలు తమ దేశంలో వున్న అవకాశాలను కోరి జారవిడుచుకుని దారి తప్పే రని తీర్మానించాడు. అయితే మరీ ఇటీవలనే తన అభిప్రాయాలను పునఃపరిశీలన చేసుకున్నాడు. Makers and Finders: A History of the writer in America, 1800-1915 (1936-52) అనే అయిదు సంపుటాల తన బృహద్గ్రంథంలో సంయుక్త రాష్ట్రాలను సాంస్కృతికమరుభూమిగా కాదు, కౌశలానికీ, ఒక విశిష్ట నైజానికీ, ఆశలకూ ఆలవాలమైన సుక్షేత్రంగా నిరూపించాడు. నిర్మాత లయూ, అన్వేషకులయూ కలకలం పుట్టినినాటి అమెరికన్ రంగాన్ని అభి వర్ణించిన మొదటిసంపుటాల్లో బ్రూక్స్ చాలా కృతకృత్యు డయ్యాడు. అయిదుసంపుటాల్లోనూ ఇస్సాక్ డిజ్రేలీ వ్రాసిన 'Curiosities of Literature' లోవలె ఒకవిధమైన కథాకమనీయత వుంది. చివరి సంపుటం 1915 తో ఆగిపోతుంది. అందలి కటుత్వధోరణి జేమ్సు టి. ఫర్రేల్ బ్రూక్స్‌ని ఆర్చిబాల్డ్ మేక్‌లీష్‌తో కలిపి 'The League of Frightened Philistines (i.e., భయభ్రాంతులైన ఫిలిస్టైనుల కూటం) అని ఎందు కన్నాడో గ్రహించడానికి సహకరిస్తుంది.

మొత్తంగా చూస్తే కవిత్వంలో, విమర్శలో, చరిత్రాదికబహు వైదుష్యరంగాల్లోను అమెరికాచేసిన కృషి, సాధించిన విజయం చాలా ఘనమైనవి. లూయిస్ మమ్‌ఫర్డ్, హేరీ లెవిన్, ఆల్‌ఫ్రెడ్ కజిన్, రిఛర్డ్ హాఫ్‌స్టేటర్ (Hofstadter) ఇలా ఎన్నో పేర్లు స్మృతిపథంలో పడతాయి. ఆధునికమైన అమెరికన్ సాహిత్యం అనేసరికి ఎక్కువగా నవల, తప్పితే కథానిక మీదికి చూపు పోతుంది. కాని ఎందరో విదగ్ధులైన రచయితలు ఇతరరంగాలలోను, ప్రక్రియలలోను చేసిన కృషి నొకపరి పరికిస్తే చాలు విశాలమైన అమెరికన్ సాహిత్యంలో ఎంత వైవిధ్యమూ, వైశిష్ట్యమూ, పరిణామమూ వున్నాయో తేటతెల్ల మవుతుంది.

# 15

## సమకాలిక సారస్వతరంగం

ఈమధ్య కొంతకాలంగా సంయుక్తరాష్ట్రాలలో అశాంతి అలముకొని వున్నది. మాటవరుసకు 1945 లో (ద్వితీయప్రపంచయుద్ధానంతరం శాంతి వచ్చిందని పేరేగాని నిజానికది శాంతే కాదు. ఆత్మీయవిజయోపపన్నమైన ఫలానుభవం లేకపోగా అమెరికాచరిత్రలో ఇదివర కెప్పుడూ కనీ వినీ యెరుగని గడ్డుసమస్య లెదుర్కొనవలసివచ్చింది. ఈకాలంలోనే ఇదివరకటికంటె అమెరికా సంపత్సమృద్ధమూ, సమధికశక్తిమంతమూ అయిన మాట వాస్తవమేకాని అభివృద్ధితోపాటు అనేకబాధలు, విభేదాలూ వచ్చిపడ్డాయి. ఎట్టకేలకు సర్వదేశనాయకత్వంకూడా వచ్చింది దానికి; కాని అంతకాలం పగనైనా వగనైనా ప్రాతప్రపంచంతో సంబంధం లేకుండా "నన్నుముట్టకు నామాలకాకి" అన్నట్లు కూచున్న దానికా నాయకత్వం రావడమంటే మజాకాలా? సరే,ఎలాగో వచ్చింది. ఆ క్రొత్త బాధ్యతల కాదుకొనవలసిందిగా అమెరికన్ ప్రాజ్ఞులు స్వదేశస్థులను హెచ్చరించారు. బుద్ధికి లఘువులు, బూమెకు గురువులు, స్వపక్ష దురభిమానులు అయిన అమెరికనులు కొందరు సెనేటర్ మెకార్థీ నాయ

కత్వం అంగీకరిస్తే తమ సమస్యలు తెమిలిపోతా యనుకున్నారు. అతనితో పాటు తామూ ఏదో గూడుపుఠాణీకి గురిఅయిపోయామని విశ్వసించారు, నిశ్వసించారు. అమెరికన్ జీవితపుటాంతరస్నాయువులలో, అంటే ఫెడరల్ ప్రభుత్వంలో, పాఠశాలల్లో, హాలీవుడ్‌లో ఆఖరికి 'చెర్చి'లోగిళ్ళలో కూడ 'కమ్యూనిజం' కాౘ్రేని కుట్ర కొనసాగుతోందని బాధపడ్డారు. అవధానం (Caution), అనువృత్తి (Comformity) శంకాతంకాలు జాడ్యాల్లా ప్రబలినవి. అలాంటి స్థితిలో రచయితలకుగాని, తక్కిన ధీమంతులకుగాని ధీమాగా తమ గౌరవాన్నినిలుపుకోవడమే కష్టసాధ్యమై పోయింది. కొందరు తామేదో హింసకు, పీడకు గురియైనట్లు అత్యుక్తులాల పించేవారు. మరికొందరికి తమ టెలిఫోనుల నెవరెవరో రహస్యంగా ప్రయోగించేవా రని చెప్పుకోవడ మొక గొప్ప అయిపోయింది. మరికొందరు వెనుక తామేదో తప్పుడుఊహలు చేసినట్లు వీథిబడి క్షమాపణలు చెప్పుకోవ డానికి సిద్ధమయ్యారు. మరికొందరు రాజకీయాల్లో ఆసక్తి విడిచి, తెలివి తక్కువగా ప్రగతిప్రతీపమైన రాజ్యాంగవిధానరహితమైన స్థితిని కోరు కున్నారు. దేశం దేశమంతటా ప్రజల మనసులు భయకాతరాలు, రక్షా తురాలు అయిపోయాయి. ఒక్కసారి స్వదేశమమతాభినివేశంతో వెనక్కి చూపు సారించారు—తొలినాటి 'రిపబ్లిక్' ఇచ్చిం దనుకునే హామీల వేపు, సంకులసమరపు (Civil war) రంకులరాట్నం (బహుగ్రంథ పరంపరకు వస్తువైనదాని) వేపు, 1920 ప్రాంతపు విధివిరోధాలవేపు, 1930 ప్రాంతపు సంస్కారాలవేపు చూపు సారించారు. చూడగా చూడగా ఆ సమయాలే అత్యంతస్వస్థంగా వున్నట్లు, అవి తమకి దూర మైపోయినట్లూ అనిపించింది వారికి. 'గతం'తో తమ అనుబంధం తెగి పోయినట్లు భావించి బాధపడ్డారు.

అయితే మరి తమ సమకాలికస్వభావాన్ని ఎలా నిర్వచించుకోవడం? అన్న దొక సమస్య వారికి. 'సమాజదర్శనం' (Sociology) సమాధాన సామగ్రిని సరఫరా చేసింది. ముఖ్యంగా రెండుగ్రంథాల పలుకుబడి ప్రబ

లంగా వుంది—డేవిడ్ రీస్‌మన్, నాథన్ గ్లేజర్, ర్యూయల్ డెన్నేలు కలిసి రచించిన The Lonely Crowd (1951), విలియమ్ హెచ్. వైట్. జూనియర్ వ్రాసిన The Organisation Man (1956). రీస్‌మన్ గ్రంథానికి 'A Study of the Changing American Character'(.i.e.,అమెరికన్ స్వభావపరిణామానుశీలనం)అనే ఉపశీర్షిక (Sub title) వున్నది అది చూసుకుని అమెరికనులు ఒక నియతమైన విశ్వాసంగాని, ప్రమాణాలుగాని లేక ఇరుగుపొరుగువారిని అనుకరించడానికి ప్రయత్నించే తమ పూర్వీకులవలెగాక తామొక నియమానువృత్తి నిదానంగల జాతిగా (Nation of Conformists) రూపొందుతున్నామనే నిశ్చయానికి వచ్చారు. వైట్ జూనియర్ గ్రంథంవల్ల మనం గ్రహించగలిగే దేమంటే—సామాన్యుడైన అమెరికన్ వ్యక్తి లోగడ సరిహద్దుప్రాంతపు మనిషిగురించి అతడొక మార్గదర్శకుడనీ, ముష్కరుడైన స్వతంత్రవ్యక్తి అనీ వల్లమాలి యేమేమో అనుకొనివున్నా, ఈనాడు తన నడవడిపై,తన కుటుంబపు నడవడిపై కృత్రిమప్రభావం నెరపే పైతృక వ్యాపార సంస్థలను పెద్దపెట్టున నడపడానికి సిద్ధపడుతున్నాడు.

అయితే 'సమాజదార్శనికులు' (Sociologists) అందరూ రీస్‌మన్, వైటులంత సమదర్శనులు కారు. సి. రైట్ మిల్స్ తన The Power Elite (1956) లో సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం వివిధ సంస్థలతో కార్యవ్యవహర్తలుగా లావాదేవీలు గల కొద్దిమంది యజమానుల, సైనికాధికారుల చేతిలోపడిపోయిందని పశ్చాత్తాపపడుతాడు. పాల్ గుడ్‌మన్ తన Growing Up Absurd (1960) లో సంయుక్తరాష్ట్రాలలో 'బాలదోషం' (juvenile delinqueny) ఎక్కువైపోతోం దనీ, దానికి కారణం నడుమంత్రపు సిరివల్ల వచ్చే ఆశావేశాలకు అమెరికన్ సమాజపు పరమాశయాలు పదవులు ఎరలైపోతున్నాయనీ, అందువల్ల అనుభవశూన్యులైన యువకులకుకూడ పూర్ణాధికారాలు కైవసమయ్యే అవకాశం వచ్చేసిందనీ వాదిస్తాడు. ఆ గ్రంథాల దృక్పథం

ఎలాంటిదైనా, అది సమకాలికులైన అమెరికనుల ఆత్మజ్ఞతకు, వ్యాకులతకు, తమ 'గతం' తో వేరుపడిపోయామనే ఊహను ఆమోదించడానికి వారు చూపే సంసిద్ధతకూ తార్కాణాలుగా నిలుస్తాయి.

అమెరికన్ సాహిత్యంలో ఈ ఆత్మాశ్రయభావప్రకృతు లన్నీ ప్రతిధ్వనించాయి. అసలు దేశమంతా ఎలా దెసమాలివుందో అలాగే ఇటీవలి రచయితలుకూడ తమ స్వరూపా లెలా నిరూపించుకోవాలో తెలియక కర్తవ్యం తోచక అల్లాడుతున్నారు. ఎలావుండాలి తమ వైఖరి? అన్నది వారిని వేధించే ప్రశ్న. సిద్ధంగా వున్న ఆదర్శా లసందర్భంగా కనిపిస్తున్నాయి కాని పునర్వ్యవస్థీకరించాలంటే గత్యంతరం కన్పడదు. 1920-40 నడిమికాలపు ఘన రచనలే ప్రముఖంగా కన్పిస్తున్నాయి. కొన్ని మంచి నవలలు స్వతంత్రమైనవి, యుద్ధగాథలకు సంబంధించినవి నార్మన్ మెయిలర్ వ్రాసినThe Naked and the Dead (1948) మొదలైనవి వున్నాయంటే వాటికి హెమింగ్వే వ్రాసిన Farewell to Arms శైలిని అనుసరించకుండా వుండడం కష్టమైపోయింది. ఫ్లేనరీ ఓ కన్నోర్ (Flannery O' Connor), పీటర్ టేలర్ మొదలైన దాక్షిణాత్యులద్భుతమైన నవల లనేకం వ్రాశారు. అయితే ఫాక్నర్ ప్రభృతి వృద్ధరచయితలే కొందరింకా ఆ రంగంలో ఏలుబడి సాగిస్తున్నారు. 1960 నాటి దక్షిణదేశనవలలో బహుశా ఏలెన్ టేట్ వ్రాసిన The Fathers అన్నదే ఉత్తమమైనది కావచ్చు. అయితే అది మొదట 1938 లో ప్రచురింపబడిన పుస్తకానికి పునారూపమే. ఇంకా ఘోరమైన సంగతేమిటంటే—దాక్షిణాత్యరచనల విస్తృతి, విదగ్ధత అనే లక్షణాలే అందులో కొన్నిటి ఏకరూపతకు రొడ్డగొట్టుధోరణి (Cliche) కి కారణభూతాలయ్యాయి: ఆ ఏకరూపత అన్నది ఒకానొక స్వభావవైపరత్యం (Idiocyncracy) గూడుకట్టిన, అసలు జీవసారంలేని వట్టి చమత్కారప్రాయమైన 'స్థానికచిత్రణ' (local colour) గానైనా భాసిస్తుంది, లేదా

రాబర్ట్ పెన్ వారెన్ వ్రాసిన The Cave (1960) లో లాగ శుష్కంగా, అశుభావహంగానైనా కనిపిస్తుంది.

దేశమంతటా అలాంటి వాతావరణం నెలకొనివుండగా నవలారచయితలు చాలామంది ఆశతో, ఆసక్తితో సంసిద్ధులుగా వున్నారు. నవలకు సంయుక్తరాష్ట్రాలలో చలామణీ బొత్తిగా తక్కువైనప్పటికీ, అక్రమమైన యితరుల ఆసక్తినుండికంటె ఉపేక్షవల్ల నవలారచయిత పొందే బాధే తక్కువని చెప్పాలి. (వాడుకలో వున్న ఒక పరిహాసచమత్కార మేమంటే, సంయుక్తరాష్ట్రాలలో సంవత్సరానికి వెయ్యిమంది మనుషుల కొక్కడు మాత్రమే నవల చదువుతాడుగాని వెయ్యి కిద్దరుచొప్పున నవలలు వ్రాస్తూ వుంటారు). అనువృత్తి (Conformity), ఉత్పాదకత (Creativity) అనే మాటలు వివాదాస్పదాలై పోయాయి. ఫలితంగా కళలన్నిటా ఆత్మభావ వ్యక్తీకరణపద్ధతికి ప్రాముఖ్యం వచ్చింది. విశ్వవిద్యాలయాల్లోని (సారస్వత) కర్మక్షేత్రాలలో (University Workshops) "నవలారచనస్థితిగతుల" గురించి గోష్ఠులలో పాల్గొనడానికి, తద్రచనావిధానాన్ని యితరులకు బోధించడానికీ రచయితల కాహ్వానాలు వస్తున్నాయి. దీనివల్ల పైరాబడి కొంత వుంటుంది. రచయిత కుపకరిస్తుంది. ఆ కార్యకలాపాదులవల్ల అటు నవలారచనకూ, ఇటు పఠనవ్యాసంగానికీ మంచి దోహదం జరుగుతుంది. అయితే విపరీతఫలితాలుకూడా వుండవచ్చు. ఇక రచయిత లా వ్యామోహంలో పడి 'బయలాటగాళ్ళు' (public performers) అయ్యే ప్రమాదం వున్నది. అంత విదగ్ధుడైన నార్మన్ మెయిలర్ గురించి మరో నవలారచయిత చేసిన ఆక్షేపణ అదే. మెయిలర్ వ్రాసిన Advertisements for Myself (1959)ను చూస్తే అతడు రచయిత అని అనిపించుకు నేకంటె నటుడనిపించుకునే ప్రమాదంలో పడి, ఆ ఆక్షేపకుడికి మాటదక్కించేట ట్లున్నాడు. లేక విమర్శకుల అభిమానం చూరగొనేమాదిరి గ్రంథమే వ్రాద్దా మనుకునే నవలారచయితల

ధోరణులు తెలుసుకోవలసిన ప్రమాదంలోనైనా పడకతప్పదు—అన్నట్లున్నది పరిస్థితి.

ఇక అమెరికన్ వ్యాపార సంస్థలలోని జీవితవైఖరులను చిత్రిస్తూ పరశ్శతంగా వచ్చిపడిన 'సంస్థానుబంధి' (institutional) నవలల తత్వం విశదీకరించడానికి బహుశా పూర్వోక్త సందర్భాల అవసరంవుండదు. అలాగే హెర్మన్ వూక్ (Herman Wouk) వ్రాసిన The Caine Mutiny (1951), Marjorie Morningstar (1955) అనే బాగా అమ్ముడుపోయిన రెండు నవలలలోను అతడు ప్రతిపాదించిన ప్రగతి ప్రతీప ధోరణులను వివరించడానికి అధికప్రసంగం చెయ్యవలసిన అవసరం లేదు. ఆ నవలలు 1950 ప్రాంతపు 'మధ్యరకపు' అమెరికా మనఃస్థితిని 'సమాజదార్శనికమైన' నిష్కర్ష (Sociological exactness) తో ప్రదర్శిస్తాయి. కాని అవి అసలమెరికన్ నవల లనిపించుకునేవాటిలోని ప్రామాణికసన్నివేశాలను తారుమారుచేసి అమెరికన్ ప్రాజ్ఞులను కించపరిచాయి. The Caine Mutiny లో ఒక ఉద్యోగంలోవున్న నౌకాదళాధికారిని సాడీరోగిగను, అసమర్థుడిగను చిత్రించినట్లే చిత్రించి వూక్ చివరికి సేవకత్వానికి (Service) దాని యోగ్యత దాని కున్నదనే నీతిని, పై అధికారులయెడ ప్రగాఢమైన విధేయత వుండాలనే సూత్రాన్ని పురస్కరించుకొని నిరూపించాడు. ఇదే ముందటితరాల్లో నయితే ఎంత సామాన్యమైన నవలకూడా ఈ నిర్ణయానికి వచ్చివుండేది కాదు. Marjorie Morningstar లో వూక్ రెండురకాలైన ప్రవచనం చేశాడు: కథానాయిక తన మతవిషయకమైన (జ్యూ) వారసత్వాన్ని పరిత్యజించడం తప్పు అనీ, ఒక వ్యాపారితో సుఖోచితంగా వివాహంచేసుకోవడాని కని ఆవిడ ఒక ప్రాజ్ఞప్రపంచాన్ని పరిత్యజించడం ఒప్పేననీ. ఈ వస్తువు సింక్లెయిర్ లూయిస్ వ్రాసిన Main Street కథతో సరిపోల్చదగిందిగా కనిపిస్తుంది. అయితే ఒక ముఖ్యమైన భేదం వున్నది: మధ్యతరగతివారి ప్రమా

కాలను సమర్థించడంలో లూయిస్‌కన్న ఫూక్ ఎక్కువ అభినివేశం ప్రదర్శిస్తాడు.

జేమ్సుగౌల్డ్‌కొజ్జెన్స్ (James Gould Cozzens) యొక్క స్థితి మరీ దురవగాహంగా భాసిస్తుంది. అతడు సమర్థుడైన రచయిత. అతని మొదటి నవల 1924 నాటికే ప్రకటితమైనది. 1948 లో అమెరికన్ విమాన దళస్థావరంలోని జీవితంగురించి అతడు వ్రాసిన 'Guard of Honour' తో అతని పేరు మ్రోగింది. 1957లో 'By Love Possessed' అనే ప్రస్ఫుటపాత్రబహుళమైన గాఢమైన గూఢమైన వ్యంగ్యధోరణి గల పెద్ద నవలతో అతని పేరు మరీ మ్రోతమ్రోగిపోయింది. స్తిమితచిత్తులైన విమర్శకులు దానిని 'ఉత్కృష్టకృతి' (masterpiece) అని శ్లాఘించారు. ఒకరిద్దరు అంతవరకూ వట్టి భ్రమగా భావింపబడుతూవున్న పరకోటిముట్టిన 'Great American Novel' అదే అన్నారు. ప్రతిపక్షవిమర్శకులు అహంకార మలీమసమైనదనీ, శబ్దాడంబరం గలదనీ, మానవ ప్రవృత్తిని సమీక్షించడంలో ఆయాసంతప్ప మనఃపరిపాకం చూపలేకపోయిందనీ ఆ ప్రశంసలను నిలువునా కూల్చేశారు. ఆ ప్రతిపక్షీయుల మాటల్లో కటుత్వం, పారుష్యమూ వున్నా సత్యంకూడా వున్నది. అయితే మరెందుకయ్యా మొదట్లో అంత పేరు వచ్చింది? అంటే అమెరికను లింకా 'Great American Novel' అనేదానికోసం దేవులాడుతున్నారు. కొందరు కొజ్జెన్సు చేతిమీదుగానే అది ప్రాదుర్భవిస్తుం దని జోస్యం చెబుతున్నారు. అతని నవల అచ్చంగా సమకాలిక(1950s) యుగలక్షణ విస్ఫూర్తికి, విశేష నిర్దేశానికి (Specification) తగినట్లున్నదికనుక అది గొప్ప నవల అనే నమ్మకం కోరి కలిగించుకున్నారు వారు. దాని కేవ రేం చేస్తారు?అది సుదీర్ఘబృహత్సంహిత. ఉరవడించి పరవళ్ళు త్రొక్కే రచనాధోరణి గలది. నాగరికులు, విద్యావంతులూ అయినవారి సంఘానికి సంబంధించినది (అందులో కొందరి ప్రవర్తన అధమాభిరుచికి తగ్గట్టు దారుణంగా వున్నప్పటికీ). అయితే మరి కొజ్జెన్సును థామస్‌మేన్ (Thomas

Mann)తో గాని, మార్సెల్ ప్రౌస్ట్‌తో గాని సమానుడైన అమెరికన్‌గా పరిగణించవచ్చునా? హెమింగ్వేయొక్క పటిష్ఠవిన్యాసాలనూ, ఫాక్నర్ దుర్వృత్తులనూ (depravities)అమెరికన్ నవలారచయిత అతిశయించి పోగల డనడాని కిదేనా చరమసాక్ష్యం? అస లమెరికన్ విమర్శకులు తమ నవలయొక్క పరిణామరహితమైన గడ్డుస్థితి చూసుకుని కొ్త్త తత్తరపాటయినా పొందేరా? వాళ్ళ ఉపపత్తు లేమయితేనేం, కొందరు విమర్శకులు మాత్రం సమకాలికమైన ఔన్నత్యమంతా ప్రతిఫలించాలని కోరుతున్నారు. కొందరు నవలాకర్తలా వాంఛితప్రమాణా లందుకోవాలని తదేకదృష్టితో ప్రయత్నిస్తున్నారు.అలాంటివారిలో విలియం స్టైయిరాన్ ఒకడు. అతనిLie Down in Darkness(1951) నిర్మాణసౌష్ఠవమూ,రచనాసౌందర్యమూ, పటిష్ఠప్రయోజనమూ గల నవల. అతని Set This House on Fire (1960) అనే నవలా అలాంటిదే. మిగతా నవలలు కొన్ని గొప్పగా వున్నాయి; కొన్ని జేమ్సు,వోల్ఫ్‌ల రచనల కనుకృతులు; కొన్ని వాటి పరిమళం గోల్పోయినవి.

వాటన్నిటిని 'రికార్డు' చెయ్యడ మంటే ఈమధ్య అమెరికన్‌నవల స్వరూపం ఏమీ బాగులేదుసుమండీ అని హెచ్చరించిన ట్లవుతుంది. అది యుక్తము కాదు కూడాను. అలా చేస్తే 'సమాజదర్శన సంగ్రహం' (Sociological Summary)లో ఇముడలేని గొప్పగొప్ప వైయక్తిక కౌశలవిశేషాల నుపేక్షించినట్లవుతుంది కూడాను. మాటవరుసకు పాల్ గుడ్‌మన్ వున్నాడు. అతని 'GrowingUp Absurd' ప్రసక్తి మీద వచ్చింది. అత డప్పటప్పటికి కొంతకొంత వ్రాస్తూ ఇరవైయేళ్ళకు పూర్తి చేసిన 'Empire city' 1959లో వచ్చింది. అనేక వ్యవస్థలేని అద్భుతమైన కల్పనాజగత్తు. ఒక నియతమైన కథావస్తు వంటూ లేనిది. విశృంఖల విహారులైన రాక్షసప్రకృతులైన పాత్రలు గలది. ఒక అసాధారణమైన మిశ్రశైలి పాటింపబడింది. అందులో ఎడిత్ వార్టన్‌యొక్క నిష్కర్ష, హొరేషియోఏల్గర్ నవలల్లోని మామూలు పడికట్టురాళ్ళు, అమెరికన్

నాగరికుల శషభిషలూ కనిపిస్తాయి. అందులో న్యూయార్కు మహానగరం, న్యూయార్కే అన్నమాటేమిటి - అన్నినగరాలూ, ఆధునికయుగజీవిత గమనంలోని దారుణబీభత్సాలు, ధీమంతులు - వారి అనుబంధాలు, ఆశయాలు, ఊహాలు, మనోవ్యసనాలు మొదలైన అనేకవిషయాలు చోటు చేసుకున్నాయి. అది ఓపట్టాన చదవడానికి సుకరమైనది కాదు, కాని చాలా అపురూపమైన గ్రంథ మది.

ఇక వ్లాడిమిర్ నబొకొవ్ (Vladimir Nabokov) అని ఒక నావలికుడున్నాడు. రష్యనుజాతివాడు. 'లొలీటా' (Lolita) అనే పుస్తకం వ్రాశాడు (1955). పాల్ గుడ్‌మన్‌లాగే స్వచ్ఛందప్రకృతి గలవాడు. రచనలో రీతిచాతుర్యము, శైలీలాలిత్యమూ గలవాడు. పండితుడు, ప్రాజ్ఞుడు. కాని 'అమెరికన్' రచయిత అనిపించుకోవడంలో కొంత వెటకారానికి గురి అయ్యాడు. అయితే అత డిరవైయేళ్ళు అమెరికా (U.S.)లో వున్నాడు, తన కథారంగాలను అమెరికాలోనే కుదుర్చుకున్నాడు, ఇంగ్లీషుభాషలో రచన సాగిస్తాడన్నదే చాలు మనకు. అతని 'లొలీటా' అక్రమంగా అప్రతిష్ఠపాలైనది. అది లైంగికవైపరీత్యానికి లొంగిన ఒక బాలిక నడివయసువానిపై మోజుపడిన విషయం వివరించే చెత్తపుస్తక మని సాధారణమైన భావన. అది కొత్త మనస్సును పట్టి పీడించే పుస్తకమే. కథాగమనంలో అంతర్లీనంగా ఒక కృత్రిమత్వం వుంది. కొంతదూరం వెళ్ళేసరికి పాఠకుడు విసుక్కుంటాడు. అయితే లయొనెల్ ట్రిల్లింగ్ అన్నట్లుగా అదొక ప్రేమకథ, ఆ రసభావంగురించి తలపున నిలిచే ఒక రమణీయచరమశ్రుతి, భవ్యమైన భరతవాక్యం వినిపిస్తుంది. తప్పిపోయిన లొలీటాను తారసిల్లిన నాయకుడామె యెంత చవకబారు మనిషి అయినప్పటికీ తన లొలీటా ఇంకా తనకు ప్రియంగానే వుందని గుర్తిస్తాడు. ఇక గ్రంథంలోని చమత్కారచారుత్వం, కళాకౌశలాల గురించి చెప్పనే అక్కరలేదు. కావలసినంత వున్నాయి. అమెరికనుల వివిధ అసభ్యధోరణులగురించి నబొకొవ్‌కంటె గొప్పగా వ్రాసినవారు

మరి లేరు. ఆ నిర్దాక్షిణ్యమైన ఉత్సాహం, ఆ పరాయివాడి కుండే కుతూహలంతో కూడిన పరిశీలనదృష్టి నబొకొవ్ వ్రాసిన మరో నవలలో కూడ వ్యక్తమయ్యాయి. దాని పేరు 'Pnin' (1957). ఒక అమెరికన్ కళాశాలలో అధ్యాపకుడుగా వున్న ఒక రష్యన్‌వలసదారుడి కథ అందలి వస్తువు.

ఇక ఈ కోవలో మూడవవాడు సాల్ బెల్లో. మేధావి. కల్పనా దక్షత గలవాడు. అతడు 1944లో వ్రాసిన Dangling Man లోను, 1947లో వ్రాసిన The Victim లోను ఆయనశ్రద్ధ, బుద్ధివైభవమూ సువ్యక్తా లయ్యాయి. శక్తిసామర్థ్యాలలో మరీ పరిణతుడై పెద్దపెట్టున 1953లో The Adventures of Augie March, 1959 లో Henderson the Rain King అనే మరో రెండు నవలలు వ్రాశాడు. Augie March ధూర్తనాయకమైన (picaresque) నవల అనిపించుకుంటుంది. ఒక నీతినియమాలు లేని చికాగోయువకు డందలి ప్రధానపాత్ర. వాడికి మానవస్వభావంగురించి గొప్ప కుతూహల దోహలమైన జిజ్ఞాసమాత్రం వుంది. అయితే వట్టి 'అప్రవర్తక పాత్ర' (passive character). వాడికి సంబంధించిన సంఘటనలు వాటం తట అవే తటస్థపడుతూవుంటాయి, జరుగుతూవుంటాయి. బెర్లిన్‌లో నివసించడంగురించి చెబుతూ క్రిస్టొఫర్ ఇషర్వుడ్ "నేనొక కెమేరాని" అంటాడు. అలాగ ఆగీమార్చ్‌కూడా ఒక ఛాయాగ్రహణయంత్రకల్పుడు. ఒకొక్కప్పుడు బెల్లో చేసే కల్పన మరీ బరువెక్కిపోతుంది. అలాం టప్పుడు మనం ఊరికే వివరా లేరుకోవడమే. ఆగీ జీవితం నిదానంగా, ఉదారంగానే సాగిపోతుంది. బెల్లో తన నాయకుడి సాహసయాత్రలకు తగిన ట్లొక ప్రత్యేకమైన గద్యశైలి నుత్పాదించుకున్నాడు. ఆశైలి విసుగు దల పొడసూపడానికి విరామం ఇవ్వకుండా ధణధణమని ఢమరుకం వాయించినట్లు మహాడంబరంగా వుంటుంది. అందులో కటుకర్కశ, పటుకఠోర గ్రామ్యప్రసంగాలు, స్వభావోక్తి చిత్రణలు, క్రమకా

వ్యాలాపాలుగూడ అశ్రమంగా నిర్వహిస్తాడు బెల్లో. ఆ లక్షణాలే ఆ గ్రంథానికొక తీవ్రత్వమూ, డాంబికత్వమూ తెచ్చిపెట్టినవి. ఆ లక్షణాలే, ఆ శైలియే, ఆ దృక్పథమే అమెరికన్ నవలా ప్రపంచంలో పడగెత్తిన అతని 'Henderson the Rain King'కి గూడా జీవం పోశాయి. ఆగీ, గ్రంథకర్తలాగే ఒక యూదు (Jew), నిరుపేద వలసదారుల కుటుంబంలో పుట్టేడు. హెండర్సన్ యూదుజాతీయుడు కాడు (Gentile). అమెరికన్ భూస్వాముల కుటుంబంలో జన్మించాడు. మస్తుగా వున్నవాడు. అతడూ దేశద్రిమ్మరే. ఆగీలాగే జీవితం యెడల ఆసక్తి తప్పిస్తే సామాన్యంగా తటస్థాలయిన అభిప్రాయాలు గలవాడు. హెండర్సన్ ఆఫ్రికాకు వెళ్తాడు. అక్కడ వింత వింత అనాగరక జాతుల వారి మధ్య తిరుగులాడి గృహోన్ముఖుడయ్యేలోగా కొంత మనశ్శాంతి వారినుండి గ్రహిస్తాడు. ఈ నవలలో రచయిత తన గద్యశైలిని మించిపోయిన కల్పన చేశాడు. ఒక పెద్ద భూఖండాన్నే సృష్టించాడు. అది అయథార్థమైనదిగా తోచినా అద్భుతంగా వుంది. ఆఫ్రికా మానసపుత్రిక అనిపిస్తుంది. తా నాశించిన ప్రయోజనాలకు అమెరికా చాలనట్టు ఈ భూరిభావనా జగత్ఖండాన్ని కలుపుకున్నాడు. అసలు హెండర్సన్ పాత్రలోగూడ కృతకత్వం వుంది. అయితే చేసిన కల్పన అంతా పకడ్బంద్‌గా వుంది. మన విశ్వాసాన్ని బలాత్కరించేటట్లున్నది. కాని యిదంతా 'the Great American Novel'ని మన చేతిమీదుగా ఆవిర్భవింపజెయ్యాలనే అభినివేశంతో నానా యాతనలూ పడుతున్న వారిలా కాకుండా, బెల్లో ఒక వృత్తిక్రియానిపుణుడైన రచయితకవసరమైన ఆత్మజ్ఞతతో మాత్రమే చేశాడని చెప్పాలి.

ఈ రచయితలు 'అమెరికన్ పద్ధతి', 'అమెరికన్ ఆశయం' అనే వాటికి సంబంధించిన తాత్కాలిక విచికిత్సలతో బెడద పడకుండా తమ దారిన తాము పయనిస్తున్నారు. ఇలాంటి ధీరత్వము, గభీరత, ఆత్మప్రత్యయము, చాతుర్యము ఇంకా కొందరి నవలలలోను, కథలలోను కనిపిస్తాయి. బెర్నార్డ్ మలామడ్ (The Assistant, 1957), హార్వే స్వేడోస్ (False Coin, 1960), జాన్ అప్‌డైక్ (Rabbit,

Run, 1960), బార్బారా ప్రాబ్‌స్ట్ సోలమన్ (The Beat of Life, 1960-అందమైన సరళమైన చిన్న నవల, హెచ్చుతగ్గులు లేని ఒక భగ్నప్రణయోదంతము). ఈ అన్నిటా—రెండవ ప్రపంచయుద్ధం గడిచి చాలా కాలమైనది, సెనేటర్ మెకార్థీ విస్మృతు డౌతున్నాడు, ప్రపంచ చరిత్రలో ఒక సరిక్రొత్త శకం ఆలోచితమైన భాషాభావ ధోరణులతో బాహిరిల్లింది అనే ఊహలు పొడగట్టినట్లు గ్రహించగలం.

నవలావాఙ్మయ చరిత్రలో ఈ శకానికి—ఇంకా నిష్కర్షగా చెప్పాలంటే యుద్ధానంతరపు తరాల్లో ఒకదానికి (ఇలాంటి తరాల్లో పరిణామం ప్రచండవేగంతో వస్తుంది)—ప్రవక్తవంటివాడు జెరోమ్ డి. సేలింజర్ (Jerome D. Salinger), 'The Catcher in the Rye' (1951) గ్రంథకర్త. అతడు చాలా కథలు కూడా వ్రాశాడు. కొన్ని 'న్యూయార్కర్'లో ప్రచురింపబడ్డాయి. సేలింజర్ మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన అమెరికన్ నాగరక యువకుడికి ప్రతినిధివలె వ్యవహరిస్తాడు. అతడు సృజించిన జగత్తులో ఆకలితో అలమటించేవారుగాని, పౌరజనవ్యవహారాల గురించి పట్టించుకునేవారుగాని లేరు. హెమింగ్వే పాత్రలకు మల్లే అతడి పాత్రల సాంకేతికప్రవర్తనలో నైశిత్యమున్నా దానికి వీరత్వంతో సంబంధం లేదు. హెమింగ్వేలాగ ఇతడూ నిష్కపట నిర్మలాత్ములను మాత్రమే హర్షిస్తాడు. ఏ రూపంలో వున్నా 'దగా'ను (మోసాన్ని) గర్హించడానికి తన కోపం అంతటినీ మీదుకట్టి వుంచాడు. అతని దృష్టిలో ఆదర్శవ్యక్తు లెవరంటే పిల్లలు; ఆ మీద యువకులు. పెరుగుతున్నకొద్దీ అవినీతినుండి బయటపడగల పెద్దలు బొత్తిగా కరువై పోతున్నారు. వారి పెరుగుదలతోపాటు ఆర్జవం పెరగడం లేదు, తరుగుతోంది. The Catcher in the Rye లో హోల్డెన్ కాల్‌ఫీల్డ్ అనే ఒక యువకుడి దృక్పథంలో అమెరికన్ రంగం ఎలా వుందో నిరూపిస్తాడు. ఆ కుర్రాడిలో ఏదో అవ్యవస్థ, అసంబద్ధత వున్నాయి కాని స్నేహపాత్రుడు, సుజనవిధేయుడు. 'గ్లేస్' (Glass) కుటుంబం గురించిన తన కథాగుచ్ఛంలో సేలింజర్ పాఠకుడిని మరీ సున్నితమైన సన్నివేశంలోకి నడిపిస్తాడు. ఆ కుటుంబంలోని సోదరులు, ఒక సోదరి—వారి వికల్పాలు హోల్డెన్ కాల్‌ఫీల్డు వికల్పాలవంటివే అయినప్పటికీ వారంతా చాలా

వివేకవంతులు. అందరూ అనునిత్యం జీవితంలో కనిపించే అసంఖ్యాకమైన అఘాయిత్యాలు, అక్రమాలు చూసి, ఒక విశ్వాసవైఖరిని వినిర్మించే వట్టి బుజ్జగింపు ముడిముక్కలు చూసి విసువెత్తిపోయారు. అందరికీ కవితాదృష్టి వున్నది; ఒకవిధమైన మత ప్రతిపత్తి వున్నది. ఆ మత ప్రతిపత్తిలో క్రైస్తవ మర్మతత్వం (Christian mysticism), జెన్ బౌద్ధం (Zen Buddhism) కలిసి వున్నవి. వారితో సానుభూతి వహించడమంటే వాళ్ళ లోకంలో మైకం క్రమ్మినట్లు దిగబడిపోవడమే—అంత అద్భుతంగా సేలింజర్ సమకాలికమైన అమెరికన్ సమాజపు ఒక అంతస్తు స్వరూపాన్ని, దాని ఆశలు, అమర్యాదలు, స్వైరప్రవృత్తి, పరిపూర్ణత కోసం అది పడే తపన అనే లక్షణాలతో ఆకళించుకున్నాడు. ఆ 'గ్లేస్' కుటుంబం వా రందరికీ ఒక సమానదుర్గుణం వుంది—సోమరితనం. వాళ్ళ స్వాత్మవివేచన ఆడంబరంగాను, నిజమైన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని నిరూపించకపోగా ఇంకా గహనమైన స్వార్థైక దృక్పథం వేపు తీసుకుపోయేదిగాను కనిపిస్తుంది. అయితే వారి వికల్పాలు మాత్రం వారి తరానికి తగినట్లు కాలస్వభావ వ్యాఖ్యానాల్లా వున్నాయి. సేలింజర్ వాటిని అతి నిష్కర్షతో, నిజాయితీతో చతురంగా, చమత్కారంగా ప్రపంచించాడు.

ఇలాంటి విశేషణాలు 'బెట్‌నిక్' (Beatnik) ఉద్యమం పట్ల సామాన్యంగా సమన్వయించడానికి వీల్లేదు. అయితే 'బెట్' రచయితలు కొందరి పట్ల బార్బరా సోలమన్‌తో, మరీ ముఖ్యంగా సేలింజర్‌తోను సమానంగా కొన్ని లక్షణాలున్నాయి. చాదస్తపు నడవడియెడ వైముఖ్యం, మనస్సును మథించే అశాంతి, గతకాలపు (బహుశా ప్రత్యేకంగా మరీ యిటీవలి గతకాలపు) విషయాలయెడ నిర్లిప్తత, సంయుక్త రాష్ట్రాల మొత్తంమీద ఏది చాదస్తంగా కనిపిస్తే దానినల్లా గర్హించడం, సత్యము, జీవితము, ప్రేమ, అనుభవం మున్నగువాని గురించి అన్వేషణ, మాట వరుసకు సిద్ధాంత రాహిత్యమే సిద్ధాంతమైన 'జెన్' (Zen) తత్వంనుండి గ్రహించవలసిం దేదో వుందనుకునే విశ్వాససుముఖత్వం. 'బెట్‌నిక్' ఉద్యమానికి ఎంత ప్రచారం వచ్చిందంటే—ఈనాడు మనం దాని తథ్యమిథ్యా లక్షణాలనుగాని, దాని అంతర్జాతీయ శాఖోపశాఖలనుండి అమెరికన్

శాఖనుగాని పృథక్కరించలేము. దాని జన్మస్థానం పశ్చిమ తీరం—ముఖ్యంగా శాన్‌ఫ్రాన్సిస్‌కో ప్రాంతం. వేషభాషల్లో కూడ 'బెట్' రీతి అని ఒకటున్నది. అది న్యూయార్క్ ప్రభృతి మహానగరాలన్నిటా వ్యాపించింది. సాహిత్యంలోనూ 'బెట్' రీతి (Beat Style) విశేషవ్యాప్తి పొందింది.

నవలాసాహిత్యం విషయంలో 'బెట్రీతి' ప్రవర్తకులలో ప్రముఖుడు జాక్ కెరాక్ (Jack Kerouac). 'On the Road'(1957) అనేది అతని నవలలలో విపులప్రచారం పొందినవాటిలో మొదటిది. ఆ లక్షణాలతోనే దానిని వరుసగా కొంద రనుసరించారు. ఆ నవలలన్నీ కర్త్రుజీవితసాపేక్షములైన (autobiographical) రచనలే. అన్నీ శిథిలబంధంలో మంత్రాలు చదివేమాదిరిగా భాసించే గద్యశైలిలో వున్నాయి. ఈ గ్రంథాలు స్థిరమైన ఉద్యోగాలకు కట్టుబడివుండడాని కంగీకరించక వివాహాదిబంధాలు వదులుకోవడానికి చెయ్యగలిగిన ప్రయత్నాలన్నీ చేసే టటువంటి ఒక యువకసమాజం చేసే సాహసకృత్యాలను వివరిస్తాయి. కెరాక్ పాత్రలు వీలైనంత నిరాడంబరంగా, తక్షణప్రాప్తమైన ప్రోత్సాహంతోను జీవిస్తాయి. దూరదూరాలకు పయనిస్తాయి. వాటికి ప్రయాణమంటే ఒక స్వేచ్ఛ, మత్తుమందు లాంటిది. ఒకప్పుడా పాత్రలు స్తిమితంగా కూచుని దీర్ఘంగా ప్రసగించడం కద్దు. ఆ ప్రసంగంలో 'జెన్' ముడిముక్క లుదాహరించడం, అసలీ ప్రపంచంలో ఏది మంచిదని ఉత్సాహంగా పృచ్ఛించుకోవడం కూడ వాటికి పరిపాటి.

'బెట్‌నిక్' రీతిలో ఆకర్షించే గుణం కొంత వున్నది. సమకాలికమైన అమెరికా, ఆల్‌ఫ్రెడ్‌కజిన్ అన్నట్లుగా 'Prig's paradise', అంటే 'పొగరుబోతుల స్వర్గం' అనిపించుకునేటంత మేరకు, వర్ధమానమైనా సారంలేని నాగరికతతో మిట్టిపడుతోం దన్నంత మేరకు కెరాక్, అతని సహచరులూ చేస్తున్న ఆక్షేపణ సరియైనదే అనాలి. వాళ్లు థరో (Thoreau), వాల్ట్ విట్మన్లనాటి చిరంతనమైన అమెరికాయొక్క ఉత్తమ సాంప్రదాయిక మార్గంలో సరిక్రొత్తగా బయల్వెడలిన ఆక్షేపణ బాటసారులు. బెట్ ఉద్యమంతో సంబంధ మున్న వృద్ధరచయితలు కొందరు—కవిశేఖరుడు కెన్నెత్ రెక్స్‌రాత్ ప్రభృతులు సమర్థులైన

రచనాశిల్పాలు. బీట్ రచనారీతిని సంప్రదాయంగూడ సమర్థించగలదు. విట్మన్‌లాగే కెరౌక్ ప్రభృతులు ఉత్తమ పురుషైకవచనంతోనే—అంటే 'స్వత్వమే' ('myself') సాహిత్యానికి సరియైన వస్తువనీ, అప్రయత్న సిద్ధాలైన స్వతంత్రభావనలే అమూల్యాలైనవనీ—ఆ ఉద్దేశ్యంతో రచనలు సాగించారు. కెరౌక్ అప్పుడప్పుడు విట్మన్‌లా 'సద్యఃపరనిర్వృతి' (Whitmanesque ecstasy) స్ఫూర్తిని కలిగించగలిగాడు.

అయితే అతడు పలుతావుల చేసినది ప్రతిపాదనమే కాని ప్రవచనం కాదు; ప్రలాపమేగాని రచన కాదు, అది ధోరణి కాని శైలి కాదు. అతడు ప్రకటించింది చాలా వుంది; పునఃపరిశీలనం చేసింది బొత్తిగా తక్కువ. కెరౌక్ వర్గంవారి సమాహారపు సోమరితనం (Collective Narcissism) చివరికి మొహం మొత్తింది, ఉప్పూ పత్రీ లేకుండా పోయింది. 'బొహీమియన్' ధోరణిలో అహమహమికతో పోటీపడిన ముందునాటి కొందరు పండితమ్మన్యులవలెనే నిర్మాణక్రియను అభినయించే ప్రయత్నంలో అసలు వీరి నిర్మాణప్రయత్నం 'కంచికి పోయింది'. వంటకం భుక్తమై గిన్నెల్లో వాసన మిగిలినట్లున్నది వరస. ఇక సద్య స్స్వంభూతి (Spontaneity) మీద మమకారం వున్నదే అది సాహిత్యంయొక్క గాంభీర్యస్వభావానికే గొడ్డలిపెట్టు. విట్మన్ కవిత చాలామట్టుకు దాని వల్ల దెబ్బ తినిపోయే స్థితికి వచ్చింది. బీట్ రీతి అమెరికన్ సారస్వతానికి కంటె గ్రామ్యత్వానికి, సరసత్వానికి కంటె విరసత్వానికే ఎక్కువ దోహదం చేసేటట్లు కనిపిస్తోంది. వట్టి వాగుడుగా, అస్పష్టంగా, లోపాయికారీగా, అసందర్భంగా, ద్వేషభావ గర్భితంగా వున్నది దాని ధోరణి. కెరౌక్‌యొక్క పునరుక్తులు, నిష్కర్ష లేకపోవడం అనే దోషాలు తమ 'బీట్' కవిత్వంలో ప్రదర్శించడంలో ఏలెన్ గిన్స్‌బెర్గ్ గాని, గ్రిగరీకార్సో గాని తక్కువ తిన్నవారు కారు. పైగా అందులో మరీ భీకరత్వం వచ్చి పడింది. అధివాస్తవికపు (Surrealistic) చమత్కారాలు చెయ్యడానికి కూడా ప్రయత్నించారు. ఆగ్రహస్థితి నతిశయించిపోయిన అక్రమ స్వభావాన్ని ప్రదర్శించారు. అది 'తగులు-తప్పు' (hit-and-miss) బాపతు కవిత్వం (అంటే ఒకప్పుడు బోధపడుతుంది, ఒకప్పుడు కాదు). వ్యక్తియొక్క ఉత్కర్ష భాగోతం. అందుచేతనే, యౌవనస్థితి (అస్థిరమైనది,

పాపం!) తప్ప మరే అర్హతా లేక, గొప్ప రచయితల మైపోదామనే ఆశ మాత్రం వున్న అమెరికన్ కుర్రదండుపాలిటికీ కవిత్వం ప్రమాదకరమైన ఆకర్షణ అయిపోయింది.

'బెట్' రచనారీతిని పట్టుకుని విస్తారంగా దూషించడం కూడ దానికెంతో ప్రాముఖ్యం వున్నట్లు చెప్పడమే అవుతుంది. తప్పక దాని ప్రాముఖ్యం గురించి అతిశయోక్తి రాగాలాపన జరుగుతుంది. అది సాహిత్య చరిత్రలకు కూడా ఎక్కుతుంది. అవును మరి, అది ఒక 'ఉద్యమం'లా భాసిస్తుందాయె, దానిని వివరించడం సుకరమాయె; అన్నిటినీ మించి అది 1950-59 నాటి అమెరికన్ దశ కొకదానికి ప్రాతినిధ్యం వహిస్తుందాయె. అందుచేత తరువాతి తరాలవారి కిది 'బెట్ దశ' (Beat Decade) అనే పేర గుర్తు కెక్కవచ్చు. అలాగే అయితే 1920-29 ప్రాంతాన్ని 'జాజ్ శకం (Jazz Age) అనడం ఎంత పొరపాటో ఇదీ అంతే అవుతుంది. 1950 ప్రాంతంలో రచయితలచే ఉదాహరింపబడేది 'జెన్'(Zen) సిద్ధాంత మొక్కటే కాదు—ముప్పైఏళ్ళ క్రితం యువజనులకు ఏకైక కాలక్షేపమైన చార్ల్సటన్ (Charleston) నాట్యం తప్పించి ఏదైనా సరే.

ఈనాడు అమెరికాలో ఒక ప్రబలమైన కవితోద్యమం గాని, కావ్యశైలిగాని లేవు. అప్పుడప్పుడు సమావేశాలు జరిపే సాహిత్యవేత్తలు కొందరున్నారు. వాళ్ళ చిన్నచిన్న పత్రికలూ, పిడివాదాలూ, భిన్న మతావలంబనలూ కనిపిస్తున్నాయి. వాస్తవస్థితిలో సమృద్ధి, వైవిధ్యమూ వున్నాయి. కవిత్వం తామరతంపరగా వచ్చింది. అందులో చాలామట్టుకు వట్టి చెత్త. ఉన్నతస్థాయికి చెందిందిగా చెప్పుకోదగింది కూడా ఎక్కువగానే వున్నది. యుద్ధానంతరకాలం ప్రాతస్సంధ్యా ప్రాంగణంలోనే కనులు మిరుమిట్లుగొల్పిన కవీశ్వరుడు రాబర్ట్ లోవెల్. అతని 'Life Studies' (1959) చూస్తే అత డింకా అద్వితీయమైన కౌశలాన్ని ప్రదర్శిస్తున్నాడనే చెప్పాలి. అతడు సుప్రసిద్ధమైన ఒక బోస్టను కుటుంబానికి చెందినవాడు. కాని తన వారసత్వాన్ని చాలామట్టుకు వదులుకున్నాడు. హార్వర్డును విడిచి పెట్టేడు. కేథలిక్కు అయినాడు. యుద్ధకాలంలో శాంతిప్రచారకుడుగా కారాగారానికి వెళ్ళేడు. వెనుకటి 'ప్యూరిటన్'

చరిత్ర, ఇటీవల తమ కుటుంబంలో ఏర్పడిన విషాదసంఘటనలూ అతడిని కదిలించాయి. ఆ యింతా బహుధా కల్లోలితమైన న్యూ ఇంగ్లండు గురించి, ఆశలు మోసులువారే దాని పశ్చాద్దేశం (hinterland) గురించి భవిష్యద్దర్శనభాజనాలైన భవ్యకావ్యకళాఖండాలను వెలయించాడు. మరీ యిటీవల, కేథలిక్ చెర్చిని విడిచిపెట్టినట్లూ తన మనస్సుతోను, బోస్టను పరిసరంతోను సమాధానం కుదుర్చుకొన్నట్లూ ఉన్నాడు. Life Studies లోని స్వల్పమైన స్వీయోదంతము (వచనము), కావ్యఖండికలూ చాలా ఆత్మాశ్రయ ఫక్కీకంగా వున్నా (అంతా ఏదో సొంత గొడవగా కనిపించినా) అందులో ఒక నిర్లిప్తత, యోజనశీలత కనిపిస్తాయి. బోస్టను, తత్పరిసరాల పరిస్థితిలో వున్నా దారుణ, దయనీయ, విషాద విహ్వల దశాస్ఫూర్తి అంతా ఈ గ్రంథంలో కనిపిస్తుంది. ఇందులోనే పిరికిగుండెల శైశవంనుండి వికటించిన పరిణతి పొందినదాకా కవియొక్క ఏకాంత చరిత్రే కాక, విశాల విశ్వచరిత్రంతా ఇమిడి వున్నది. ఆధునికమయిన అమెరికా యొక్క విచారా లిందులో సానుభూతితో సమీక్షింపబడ్డాయి. అప్రతిష్ఠపాలైన 'బెట్' కవిత్వ ధోరణులలోని ఉచ్ఛృంఖల భావాభినయాలకు దూరంగా వుండే ఒక కవితాజగత్తు అది.

ఇలాంటి కౌశలం గల అమెరికన్ కవు లింకా కొందరున్నారు: థియోడర్ రోత్కె, ఎలిజబెత్ బిషప్, జాన్ ఫ్రెడరిక్ నిమ్స్, జాన్ బెర్రిమన్, రిచర్డ్ విల్బర్. డబ్ల్యు. డి. స్నోడ్‌గ్రేస్ (Snod-grass) ఒకడు లోవెల్‌తో సదృశమైన ప్రజ్ఞగలవాడు. అతని ప్రథమకృతి Heart's Needle (1959). ఒక మనఃస్థితిని, ఒక స్మృతిపీఠికను, వీరోచితం కాని ఒక సామాన్య సంఘటనను, అవి బయటి కెంత అప్రముఖంగా కనిపించినా వాటిని సమగ్రంగా అర్థం చేసుకున్నట్టు, సమగ్రంగా పాఠకుడి కందేటట్టు, సమగ్రంగా సార్వజనీనం అయ్యేటట్టు తన మాటగా చెప్పడంలో ఆ ప్రజ్ఞ అనన్యాదృశంగా వ్యక్తం అవుతుంది.

ఈనాటి అమెరికన్ కవివరేణ్యులలో కనిపించినట్లే ఉత్తమ సాహిత్య విమర్శనిబంధాలలోగూడ 'స్వస్థచిత్తత' (Self-possession)

కొంత కనిపిస్తుంది. చార్లెస్ ఎస్. ఫీడెల్సన్ Symbolism and American Literature (1953), R. W. B. లూయిస్ The American Adam (1955), రిఛర్డ్ చేజ్ The American Novel and Its Tradition (1957), హేరీ లెవిన్ The Power of Blackness (1958), లెస్లీ ఎ. ఫీడ్లర్ Love and Death in the AmericanNovel (1960) మొ॥ గ్రంథాలలోని వస్తు, రచనా విధానాలను చూస్తే ఆ సంగతి విశదమౌతుంది. ఈ గ్రంథాలన్నీ అమెరికన్ సాహిత్యానికొక గొప్ప యోగ్యత వున్నట్లు నిరూపిస్తాయి. యూరపియను సాహిత్యంనుండి దాని ప్రత్యేకతను నిరూపించే లక్షణాల నుద్ఘాటిస్తాయి. ఇది అమెరికన్ సాహిత్య విమర్శన చరిత్రలో జరిగే నిరంతర ప్రయత్నం. నిజానికిది అమెరికన్ దేశీయతలో అంతర్భాగమే. ఈ విషయాన్ని ఇటీవల వ్యాఖ్యానించేవా రంతా సామాన్యంగా ఇతరులు పొందినదానికంటె అమెరికనులు పొందగలిగిం దెక్కువగా వుందని అంటున్నారు. ఆ పరిస్థితిని బట్టి అలా అనడం విధాయకం. అయితే వా ళ్లామాట తమ ముందువారికంటె ఎక్కువ కలగాపులగం చేసేశారు. అమెరికన్ సాహిత్యం చాలా బాగుందనడంతో సంతృప్తులు కారు వారు.అది నానార్థ గంభీరంగా వుంటుం దంటారు. అది చాలా సాంకేతికంగా వుంటుం దంటాడు ఛార్లెస్‌ఫీడెల్సన్. అదొక ఉదారమైన (అయితేకదా చిద్గంభీరమైన), అనపరాధతకీ ఆపదకీ మధ్య జరిగిన తార్కికచర్చతో కూడిన దని లూయిస్ అభిప్రాయము. అంతే కాదు, అమెరికాదేశమే మానవజాతి అభ్యుదయాని కధిష్ఠానప్రాయమైన దనే ఆశావాదానికీ, 'ఆదాము' (Adam, i.e., ఆదిమ మానవుడు) ఇతరత్ర పతనం పొందినట్లే అమెరికాలోనూ పొందేడు, మానవుడి బాధామహాప్రస్థానంలో మరి క్రొత్తములుపులు లేవు అనే నైరాశ్యవాదానికీ మధ్య మరో క్రొత్తశక్తి (a third-force)ని గుర్తించాడు లూయిస్. అది 'సోత్ప్రాసం' (irony) యొక్క భాగంవంటిది. అది కఠినాలైన పై అతివాద ధోరణులను లక్ష్యపెట్టదు. ఉన్నదున్నట్లుగా మానవుని స్థితిని (అమెరికనుస్థితినిగూడ) అద్భుతమైన పరిపాకంతో చిత్రించింది.

హేరీలెవిన్ దృష్టిలో అమెరికన్ సాహిత్యంయొక్క విశిష్టమైన స్వభావమూత్మ్మం ఏమంటే-కరుణరసప్రాధాన్యం (dwelling upon darkness). ఆయన తన గ్రంథానికి 'The Power of Blackness' అనే శీర్షికను హాథార్న్‌గురించి మెల్విల్ చేసిన ఒక వ్యాఖ్యనుండి గ్రహించాడు. 'పో' ప్రభృతుల కృతులను పరిశీలించి తన వాదాన్ని బలపరుచుకున్నాడు. అమెరికన్ నవల కొక వైశిష్ట్య మున్నదని రిఛర్డ్ చేజ్ కూడ అభిప్రాయపడ్డాడు. అతడు దానిని మితిమీరి పొగడలేదుగాని అది సాధించిన ఘనవిజయాలు 'వాస్తవికతావాద' (Realism) సంబంధులు కావనీ, అవి నవల అంటే 'కల్పనాకథ' (Romance) అనే భావనకు సంబంధించినవనీ భావించాడు. హావెల్స్‌గాని, డ్రెయిజర్‌గాని, సింక్లెయిర్ లూయిస్‌గాని రచించిన 'వాస్తవికనవలలలోని కల్పనాశక్తి అతనికి మెచ్చుగోల్పలేదు. ఛార్లెస్ బ్రోక్‌డెన్ బ్రౌన్, జేమ్సుఫెనిమోర్ కూపరుల నాటినుండి హెమింగ్వే, ఫాక్నరుల దాకా సాగివచ్చిన అమెరికన్‌నవలాసంప్రదాయంలో ప్రబలంగా వున్న వైలక్షణ్యం (oddity), సాంకేతిక స్వభావం (Symbolic nature) అంటేనే అతనికి మోజు.

ఇక, లెస్లీ ఫీడ్లర్ కూడ అమెరికన్‌నవల నొక అపరూపవ్యవహారంగా భావిస్తాడు. అవిరతము, వికృతము, అసంగతమూ (యూరపులో మటుకు స్వల్పకాలికము) అయిన గోథిక్ (Gothic) నవల యందలి కాల్పనిక ధోరణి (Romanticism) నంతా అది పుణికిపుచ్చుకొన్న దని, దానిని సజీవంగా వుంచుతున్నదనీ అతని విశ్వాసం. అది భూతప్రేతసంబంధసదృశమైన అభూతకల్పనలతో నిండిపోయింది. అది సమలింగ (homosexual) రహస్యగర్భితమైనది కూడ. అమెరికన్‌నవలలలో ప్రసిద్ధానుబంధాలను చూడండి—కూపర్‌నవలలో డీర్ స్లేయర్, చింగచ్‌గూకుల మధ్య, మెల్విల్‌లో ఇష్మేయిల్, క్వీక్వెగ్‌లమధ్య, మార్క్‌ట్వెయిన్‌లో హాక్‌ఫిన్, నిగ్గర్ జిమ్‌ల మధ్యను గల అనుబంధాలను పరిశీలించండి. అన్నీ పురుషసంబంధాలై నవే (మీదుమిక్కిలి భిన్నజాతులకు చెందినవారు వాళ్లు).

అమెరికన్ నవలలో సక్రమమైన వయఃపరిణతులైన స్త్రీపురుషానుబంధాలు లేవనీ, హఠసంభోగం (Rape), అగమ్యాగమనం (incest), విజాతీయ సమాగమం (miscegenation) మొదలైన అక్రమానుబంధగాథలైతే వున్నాయనీ అన్నాడాయన. ఫ్లాబర్ట్ వ్రాసిన Madame Bovary అనే ఫ్రెంచినవలతో 'సమానవియ్యం' పొందగల అమెరికన్ నవల సింక్లెయిర్ లూయిస్ వ్రాసిన Main Street. అయితే యిది కొంత నాగరిక తావకుంఠనం వేసుకున్నట్టిది. అయితే అమెరికన్‌నవలలకు వాటి ఘనతలు వాటి కున్నా యంటాడు ఫీడ్లర్. కాని ఉత్కంఠంటె ఉద్దిష్టం ఎక్కువగా ప్రదర్శించే ద్వైవిధ్యాత్మకమైన సాహిత్యంయొక్క అద్భుతమైన ఘనతలవి.

అయితే కొన్ని అభ్యంతరాలు చెప్పడానికవకాశం వుంది. కల్పన, సంకేతము, మూలరూపం-వీటిని పట్టుకొని నిదానంగా పరిశోధిస్తే అసలు సంగతి తేలిపోవడాని కెప్పుడూ వుంది అవకాశం. ఎంత లొంగని వస్తువు నుండి కూడ ఎంతెంత అంతరార్థాలనూ జాడించి లాగవచ్చు. ఏ విషయానైనా సరే 'ఋజువుచేయ'వచ్చు. అయితే ఆపద్ధతిలో సామాన్యపాఠకుడి కళ్ళకు కళాయివేసిన ఆయా కృతుల సాహిత్యసత్త ప్రమాదంలో పడుతుంది—అంతా వట్టి ఆసందర్భంగా తగులడిందని కొట్టిపారవేయబడే ప్రమాదంలో పడుతుంది. ఆపక్షంలో మనం క్రొత్తగా సాధించుకున్న దానికన్న పోగొట్టుకున్న దెక్కువవుతుంది. ఒకవంక, ఒక నియమితమైన సూత్రానికి కట్టుపడని రచయితలమీద రాతుల్లా స్వారిచెయ్యడమే కాకుండా, తమ క్లిష్టులైనవారి చచ్చురచనలనుకూడా మెచ్చుకొనే ఫీడ్లర్ ప్రభృతి విమర్శకుల ధోరణి అప్పుడే గమనింపబడుతోంది. ఇక విపరీతమైన జాతీయదురభిమానంవలని ప్రమాదంకూడా ఒకటి కనిపిస్తోంది - నిజానికి సార్వదేశికంగా వున్న భయాందోళనలను, లోటుపాట్లను అమెరికాదేశీయు లవి తమ ప్రత్యేకత లనుకోవడం. ఇలాంటి విపరీతమన స్తత్వంవల్లనే యూరపులోని 'ప్రొటస్టెంటు'దేశాలు భిన్నలింగ (heterosexual) శృంగారంగురించిన ఉత్తమసాహిత్యాని కంత దోహదం చెయ్యలేక

పోయాయి. ఆంగ్లసాహిత్యంమటుకు అమెరికనుల ఆధ్యాత్మికమైన వారసత్వపు గురుతులుగా ఫీడ్లర్ ఉదాహరించగల లక్షణాలను కొన్నిటిని ప్రత్యేకంగా విశదం చేస్తుంది.

ఇక చివరగా ప్రతివాదాంశాలుగా రెండు మాటలు చెప్పడాని కున్నవి. ఒక టేమిటంటే—అమెరికన్ సాహిత్యం (ముఖ్యంగా నవలా సాహిత్యం: అమెరికన్ నవకవిత్వం అంత సులువుగా నిర్వచింపబడదు గనుక) విచిత్ర ధోరణులు ప్రదర్శించింది. ఇవి మొదటిసారిగా డి. హెచ్. లారెన్స్‌గారి Studies in Classical American Literature (1923)లో వ్యాకరింపబడ్డాయి. అయితే యీ వ్యాకృతికి ముందుగానే వాటిగురించి కొందరు సూచన చెయ్యడం జరిగింది. అవి అసలైన అమెరికన్ సమాజంలో పరిశీలింపదగిన అంశాల మీదను, శైల్పిక సిద్ధాంతీకరణం (modish theorizing) మీదను ఆధారపడి వున్నాయి. సమకాలికమైన అమెరికన్ సాహిత్య స్వరూపాన్ని తీర్చిదిద్దుతూనే వుంటాయి. అయితే ప్రతి వర్ధమానరచయితయు రచనా కళామర్మాల గురించి కళాశాలల్లో వ్యాసంగం చేస్తూవున్న నేటి స్థితిలో ఏవి ఉద్దేశపూర్వకాలైన కల్పనలో, ఏవి అజ్ఞాత ప్రభావకృతాలో తెలుసుకోవడం చాలా కష్టమైపోతోంది. నిజానికి అమెరికన్ సాహిత్యంలో లోలోపలనుండి గ్రహించవలసినది తప్పక వున్నది. అమెరికన్ సాహిత్యమంతా వట్టి పైపై మెరుగులదని కొట్టిపారెయ్యకుండా అందులోని అంతరార్థాలను గ్రహించాలనే సానుభూతిని పెంచుకుంటున్నందుకు యూరపియనులు నిజంగా అభినందనీయులు. అది వివేకం. తలుపు కివతల తచ్చాడేకంటె లోపల ప్రవేశించడం మంచిది.

ఇక రెండవ అంశ మున్నది: మనం ఎన్నివేషాలు వేసినా అదో పరమప్రామాణిక మైన కొలమానం అయినట్టుగా కాలరహితమైన కేవల స్థితి (timeless absolute)లో సాహిత్యాని కీ స్థితి వుండదు. గత

కాలపుకృతులు నేటి ప్రయోజనాన్ని నెరవేర్చగలవు. అసలు 'అమెరికన్ అనుభూతి' అని అనిపించుకునేదాని ప్రాథమికమైన యోగ్యతను నిరూపించడం కోసం గతకాలపు అమెరికన్ సాహిత్యం యొక్క అవసరం ఏర్పడిం దీనాడు. అయితే ఆ ప్రయత్నంలో ఒక ప్రమాదం లేకపోలేదు. తత్ఫలితాలొకప్పుడు వికృతంగా వుండవచ్చు. అయినప్పటికి, మానవజాతి పడే అవస్థలకు సూటిగా జవాబుదారీ కాగల సుష్ఠు, ప్రకృష్ట పరిష్కార మార్గాలు లేవని తాను గ్రహించినట్లు సమధికమైన ఆర్జవంతో, ప్రజ్ఞాపాటవంతో, అభినివేశంతో, గాంభీర్యంతో సముద్ఘోషిస్తోంది అమెరికాఖండ మీనాడు. ఐతే తానుపడే అవస్థలు అసాధారణమైనవనీ,అవి తనకే ప్రత్యేకమైనవనీ అమెరికా ఇంకా భావిస్తూనే వుండవచ్చుగాక. కాని యింత మహా మానవసమాజం అంతటికీ సర్వసాధారణమైన విధినియోగంనుండి ఆ ఒక్క దేశానికే ఏదో విముక్తి లభిస్తుందనుకోవడం మాత్రం వట్టి భ్రాంతి. ఆ భ్రాంతికి కూడ ఇకపై అవకాశం లేదు.

———

అలనాటి మొదలు అద్యావధి అమెరికన్ సాహిత్య ప్రగతి

అందులో అహమహమికతో సాధనలపై సాధనలు సాగించిన సారథులు

పోయిన పోకడలు : చేపట్టిన చిత్రచిత్ర వస్తువులు : కూర్చితీర్చిన అందచందాలు

# AMERICAN SAHITYAM

BY

MARCUS CUNLIFFE

TRANSLATED BY

**S. V. JOGA RAO,** M.A., Ph. D.



**Rs. 6-50**

M. SESHACHALAM & CO.,

**MADRAS - 1**

**MACHILIPATNAM - SECUNDERABAD**